నీకు తెలుసు, కాని నీ మనస్సులో ఉన్నది నాకు తెలియదు. నిశ్చయంగా, నీవే సర్వఅగోచర విషయాలు తెలిసినవాడవు!

مَا قُلْتُ لَهُمْ إِلَّا مَا أَمَرْتَنِي بِهِ أَنِ اعْبُدُوا اللَّهَ رَبِّي
وَرَبَّكُمْ وَكُنتُ عَلَيْهِمْ شَهِيدًا مَّا دُمْتُ فِيهِمْ فَلَمَّا
تَوَفَّيْتَنِي كُنتَ أَنتَ الرَّقِيبَ عَلَيْهِمْ وَأَنتَ عَلَىٰ كُلِّ
شَيْءٍ شَهِيدٌ ﴿١١٧﴾

**117.** "నీవు ఆదేశించింది తప్ప, నేను మరేమీ వారికి చెప్పలేదు, అంటే: 'నా ప్రభువు మరియు మీ ప్రభువు అయిన అల్లాహ్‌నే ఆరాధించండి.' అని నేను వారిమధ్య ఉన్నంత వరకు వారికి సాక్షిగా ఉన్నాను నీవు నన్ను పైకి లేపుకున్న తరువాత నీవే వారిని కనిపెట్టుకుని ఉన్నావు.[1] మరియు నీవే ప్రతి దానికి సాక్షివి![2]

إِن تُعَذِّبْهُمْ فَإِنَّهُمْ عِبَادُكَ وَإِن تَغْفِرْ لَهُمْ فَإِنَّكَ
أَنتَ الْعَزِيزُ الْحَكِيمُ ﴿١١٨﴾

**118.** "ఒకవేళ నీవు వారిని శిక్షించదలిస్తే వారు నీ దాసులే! మరియు నీవు వారిని క్షమించదలిస్తే! నీవు సర్వశక్తిమంతుడవు మహా వివేచనాపరుడవు!"

قَالَ اللَّهُ هَٰذَا يَوْمُ يَنفَعُ الصَّادِقِينَ صِدْقُهُمْ لَهُمْ
جَنَّاتٌ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ خَالِدِينَ فِيهَا أَبَدًا رَّضِيَ
اللَّهُ عَنْهُمْ وَرَضُوا عَنْهُ ذَٰلِكَ الْفَوْزُ الْعَظِيمُ ﴿١١٩﴾

**119.** అప్పుడు అల్లాహ్ ఇలా సెలవిస్తాడు: "ఈ రోజు సత్యవంతులకు వారి సత్యం లాభదాయకమవుతుంది. వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలు లభిస్తాయి. అక్కడ వారు శాశ్వతంగా కలకాలం ఉంటారు. అల్లాహ్ వారిపట్ల ప్రసన్నుడవుతాడు మరియు వారు ఆయనతో ప్రసన్నులవుతారు. ఇదే గొప్ప విజయం (సాఫల్యం)!"

لِلَّهِ مُلْكُ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَمَا فِيهِنَّ وَهُوَ عَلَىٰ كُلِّ
شَيْءٍ قَدِيرٌ ﴿١٢٠﴾

**120.** ఆకాశాలపైననూ, భూమిపైననూ మరియు వాటిలో నున్న సమస్తం పైననూ, సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్‌దే! మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు (అన్నింటిపై అధికారం గలవాడు).

---

1. చూడండి, 3:55

2. షహీదున్ (అష్ షహీదు): All Witness, The Omniscient. సర్వసాక్షి, తన జ్ఞానంతో ప్రతిచోట ఉండేవాడు. చూడండి, 3:98, 58:6.

# 6. సూరహ్ అల్-అన్'ఆమ్

سُورَةُ الأَنْعَام

ఈ సూరహ్ చివరి మక్కా కాలంలో అవతరింపజేయబడింది ఇందులో **165** ఆయతులున్నాయి. దీని పేరు **136** ఆయతునుండి తీసుకోబడింది అన్'ఆమున్: పశువులు. 162-163వ ఆయతులలో ఉన్న ప్రార్థన ఎంతో మహత్త్వమైనది 50వ ఆయత్ ఎంతో ముఖ్యమైనది: "(ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: 'నా వద్ద అల్లాహ్ కోశాగారాలు ఉన్నాయని గానీ, లేదా నాకు అగోచరజ్ఞానమున్నదని గానీ, నేను మీతో అనటంలేదు లేదా నేను దేవదూతనని కూడా అనటం లేదు కాని నేను కేవలం నాపై అవతరించబడిన దివ్యజ్ఞానాన్ని (వహీని) మాత్రమే అనుసరిస్తున్నాను.'"

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الْحَمْدُ لِلَّهِ الَّذِي خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ
وَجَعَلَ الظُّلُمَاتِ وَالنُّورَ ۖ ثُمَّ الَّذِينَ كَفَرُوا
بِرَبِّهِمْ يَعْدِلُونَ ۝

**1.** ఆకాశాలను మరియు భూమిని సృష్టించి, చీకట్లను మరియు వెలుగును నెలకొలిపిన అల్లాహ్ మాత్రమే సర్వస్తోత్రాలకు అర్హుడు అయినా సత్యతిరస్కారులు (ఇతరులను) తమ ప్రభువుకు సమానులుగా పరిగణిస్తున్నారు.

هُوَ الَّذِي خَلَقَكُم مِّن طِينٍ ثُمَّ قَضَىٰ أَجَلًا ۖ وَأَجَلٌ
مُّسَمًّى عِندَهُ ۖ ثُمَّ أَنتُمْ تَمْتَرُونَ ۝

**2.** ఆయనే మిమ్మల్ని మట్టితో సృష్టించి, ఆ తరువాత మీకు ఒక గడువు నియమించాడు.[1] ఆయన దగ్గర మరొక నిర్ణీత గడువు కూడా ఉంది[2] అయినా మీరు సంశయంలో పడిఉన్నారు.

وَهُوَ اللَّهُ فِي السَّمَاوَاتِ وَفِي الْأَرْضِ ۖ يَعْلَمُ سِرَّكُمْ
وَجَهْرَكُمْ وَيَعْلَمُ مَا تَكْسِبُونَ ۝

**3.** మరియు ఆయనే అల్లాహ్, ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ (ఆరాధ్యుడు). మీరు దాచేది మరియు వెలిబుచ్చేది, అంతా ఆయనకు తెలుసు మరియు మీరు అర్జించేది (మంచి చెడు) అంతా ఆయనకు బాగా తెలుసు.[3]

---

1. అంటే మరణసమయం.
2. అంటే పునరుత్థానదినం.
3. అల్లాహ్ (సు.తా.) 'అర్ష్ పై ఉంటాడు, ఆయన ఔన్నత్యానికి తగినట్లుగా. కానీ అల్లాహుతా'ఆలా తన జ్ఞానంతో ప్రతిచోట ఉంటాడు. అంటే ఏ విషయం కూడా అల్లాహ్ (సు.తా.) జ్ఞానపరిధి

وَمَا تَأْتِيهِم مِّنْ آيَةٍ مِّنْ آيَاتِ رَبِّهِمْ إِلَّا كَانُوا عَنْهَا مُعْرِضِينَ ۝

4. అయినా వారి ప్రభువు సూచనల నుండి వారి వద్దకు ఏ సూచన వచ్చినా దానికి వారు విముఖతే చూపేవారు!

فَقَدْ كَذَّبُوا بِالْحَقِّ لَمَّا جَاءَهُمْ ۖ فَسَوْفَ يَأْتِيهِمْ أَنبَاءُ مَا كَانُوا بِهِ يَسْتَهْزِئُونَ ۝

5. వాస్తవానికి, ఇప్పుడు వారు తమ వద్దకు వచ్చిన సత్యాన్ని (ఈ దివ్య గ్రంథాన్ని) కూడా అసత్యమని తిరస్కరించారు.[1] కాబట్టి వారు పరిహసించేదాని (ప్రతిఫలాన్ని) గురించిన వార్త వారికి త్వరలోనే రానున్నది.

أَلَمْ يَرَوْا كَمْ أَهْلَكْنَا مِن قَبْلِهِم مِّن قَرْنٍ مَّكَّنَّاهُمْ فِي الْأَرْضِ مَا لَمْ نُمَكِّن لَّكُمْ وَأَرْسَلْنَا السَّمَاءَ عَلَيْهِم مِّدْرَارًا وَجَعَلْنَا الْأَنْهَارَ تَجْرِي مِن تَحْتِهِمْ فَأَهْلَكْنَاهُم بِذُنُوبِهِمْ وَأَنشَأْنَا مِن بَعْدِهِمْ قَرْنًا آخَرِينَ ۝

6. ఏమీ? వారు చూడలేదా (వారికి తెలియదా)? వారికి పూర్వం ఎన్నోతరాలను మేము నాశనం చేశాము. మేము మీకు ఇవ్వని ఎన్నో బలసంపదలనిచ్చి వారిని భువిలో స్థిరపరిచాము; మరియు వారిపై మేము ఆకాశం నుండి ధారాపాతంగా వర్షాలు కురిపించాము; మరియు క్రింద నదులను ప్రవహింపజేశాము: చివరకు వారు చేసిన పాపాలకు ఫలితంగా వారిని నాశనంచేశాము; మరియు వారి స్థానంలో ఇతర తరాలవారిని లేపాము.

وَلَوْ نَزَّلْنَا عَلَيْكَ كِتَابًا فِي قِرْطَاسٍ فَلَمَسُوهُ بِأَيْدِيهِمْ لَقَالَ الَّذِينَ كَفَرُوا إِنْ هَٰذَا إِلَّا سِحْرٌ مُّبِينٌ ۝

7. మరియు (ఓ ప్రవక్తా!) ఒకవేళ మేము చర్మపత్రం[2] పైన వ్రాయబడిన గ్రంథాన్ని నీపై అవతరింపజేసినా, అప్పుడు వారు దానిని తమ చేతులతో తాకి చూసినా! సత్యతిరస్కారులు: "ఇది స్పష్టమైన మాయా జాలం మాత్రమే!" అని అనే వారు.[3]

وَقَالُوا لَوْلَا أُنزِلَ عَلَيْهِ مَلَكٌ ۖ وَلَوْ أَنزَلْنَا مَلَكًا

8. మరియు వారు: "ఇతని (ప్రవక్త) వద్దకు

---

నుండి అగోచరంగాలేదు. ఇది అహ్లుస్సున్నతి, సలఫ్ల విశ్వాసం (అఖీదహ్) వివరాలకు చూడండి, 'తబరీ, ఇబ్నె-కసీ'ర్.

1. చూడండి, 'స. ముస్లిం, పుస్తకము-1, అధ్యాయం 240.

2. ఖిర్'తాసున్ (ఖరా'తీసు బహు) Parchment, అంటే వ్రాయడానికి అనువయేటట్లు పదునుచేసిన తోలు, చర్మపత్రం, చర్మపత్ర రాతప్రతి.

3. చూడండి, 15:14-15 మరియు 52:44.

لَقُضِيَ الْأَمْرُ ثُمَّ لَا يُنظَرُونَ ⑧

ఒక దైవదూత ఎందుకు దింపబడలేదు?" అని అడుగుతారు. మరియు ఒకవేళ మేము దైవదూతనే పంపిఉంటే! వారి తీర్పు వెంటనే జరిగి ఉండేది. ఆ తరువాత వారికి ఎలాంటి వ్యవధి కూడా ఇవ్వబడి ఉండేది కాదు.[1]

وَلَوْ جَعَلْنَٰهُ مَلَكًا لَّجَعَلْنَٰهُ رَجُلًا وَلَلَبَسْنَا عَلَيْهِم مَّا يَلْبِسُونَ ⑨

**9.** మరియు ఒకవేళ మేము దైవదూతను అవతరింపజేసినా, అతనిని మేము మానవ రూపంలోనే అవతరింపజేసి ఉండేవారం. మరియు వారు ఇపుడు ఏ సంశయంలో పడిఉన్నారో! వారిని ఆ సంశయానికే గురిచేసి ఉండేవారం.

وَلَقَدِ ٱسْتُهْزِئَ بِرُسُلٍ مِّن قَبْلِكَ فَحَاقَ بِٱلَّذِينَ سَخِرُوا۟ مِنْهُم مَّا كَانُوا۟ بِهِۦ يَسْتَهْزِءُونَ ⑩

**10.** మరియు వాస్తవానికి నీకు పూర్వం కూడా చాలామంది ప్రవక్తలను ఎగతాళి చేయటం జరిగింది, కావున పరిహసించే వారు దేనిని గురించి ఎగతాళి చేసేవారో అదే వారిని చుట్టుకున్నది.

قُلْ سِيرُوا۟ فِى ٱلْأَرْضِ ثُمَّ ٱنظُرُوا۟ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلْمُكَذِّبِينَ ⑪

**11.** ఇలా అను: "మీరు భూమిలో సంచారం చేసి, సత్యతిరస్కారుల ముగింపు ఎలా జరిగిందో చూడండి!"

قُل لِّمَن مَّا فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ قُل لِّلَّهِ ۚ كَتَبَ عَلَىٰ نَفْسِهِ ٱلرَّحْمَةَ ۚ لَيَجْمَعَنَّكُمْ إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ لَا رَيْبَ فِيهِ ۚ ٱلَّذِينَ خَسِرُوٓا۟ أَنفُسَهُمْ فَهُمْ لَا يُؤْمِنُونَ ⑫

**12.** వారిని అడుగు: "ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఎవరికి చెందినది?" అని. (నీవే) జవాబివ్వు: "(అంతా) అల్లాహ్‌దే!" ఆయన కరుణించటాన్ని, తనపై తాను (కర్తవ్యంగా) విధించుకున్నాడు.[2] నిశ్చయంగా, ఆయన పునరుత్థాన దినమున మీ అందరినీ సమావేశపరుస్తాడు. అందులో ఎలాంటి సందేహంలేదు. ఎవరైతే తమను తాము నష్టానికి గురిచేసుకున్నారో, అలాంటి వారే

1. చూడండి, 3:164.

2. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అల్లాహ్ (సు.తా.) సందేశం: 'నిశ్చయంగా, నా కారుణ్యం నా ఆగ్రహానికంటే మించింది.' " ('స.బు'ఖారీ, మరియు 'స.ముస్లిం). చూడండి, 6:54, 7:156.

విశ్వసించరు! (3/8)

13. * మరియు రేయింబవళ్ళలో ఉన్నదంతా ఆయనకు చెందినదే. మరియు ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

وَلَهُۥ مَا سَكَنَ فِي ٱلَّيۡلِ وَٱلنَّهَارِۚ وَهُوَ ٱلسَّمِيعُ ٱلۡعَلِيمُ ۝١٣

14. (ఓ ము'హమ్మద్!) ఇలా అను: "ఏమీ? ఆకాశాల మరియు భూమి సృష్టికి మూలాధారుడు[1] అయిన అల్లాహ్‌ను కాదని నేను మరెవరినైనా ఆరాధ్యునిగా[2] చేసుకోవాలా? మరియు ఆయనే అందరికీ ఆహారమిస్తున్నాడు మరియు ఆయనకెవ్వరూ ఆహారమివ్వరు." (ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా, అందరికంటే ముందు నేను ఆయన (అల్లాహ్)కు విధేయుడను (ముస్లిం) కావాలని మరియు ఆయన (అల్లాహ్)కు సాటి కల్పించేవారిలో చేరకూడదనీ ఆదేశించబడ్డాను!"

قُلۡ أَغَيۡرَ ٱللَّهِ أَتَّخِذُ وَلِيّٗا فَاطِرِ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَهُوَ يُطۡعِمُ وَلَا يُطۡعَمُۗ قُلۡ إِنِّيٓ أُمِرۡتُ أَنۡ أَكُونَ أَوَّلَ مَنۡ أَسۡلَمَۖ وَلَا تَكُونَنَّ مِنَ ٱلۡمُشۡرِكِينَ ۝١٤

15. (ఇంకా) ఇలా అను: "నిశ్చయంగా, నేను నా ప్రభువుకు అవిధేయుడనైతే నిశ్చయంగా, రాబోయే ఆ గొప్పదినపు శిక్షనుండి భయపడుతున్నాను!"

قُلۡ إِنِّيٓ أَخَافُ إِنۡ عَصَيۡتُ رَبِّي عَذَابَ يَوۡمٍ عَظِيمٖ ۝١٥

16. ఆ రోజు దాని (ఆ శిక్ష నుండి) తప్పించుకున్న వాడిని, వాస్తవంగా! ఆయన (అల్లాహ్) కరుణించినట్లే మరియు అదే స్పష్టమైన విజయం.[3]

مَّن يُصۡرَفۡ عَنۡهُ يَوۡمَئِذٖ فَقَدۡ رَحِمَهُۥۚ وَذَٰلِكَ ٱلۡفَوۡزُ ٱلۡمُبِينُ ۝١٦

17. మరియు అల్లాహ్ నీకు ఏదైనా హాని కలిగిస్తే! ఆయన తప్ప మరెవ్వరూ దానిని తొలగించలేరు. మరియు ఆయన నీకు మేలు

وَإِن يَمۡسَسۡكَ ٱللَّهُ بِضُرّٖ فَلَا كَاشِفَ لَهُۥٓ إِلَّا هُوَۖ وَإِن يَمۡسَسۡكَ بِخَيۡرٖ فَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ۝١٧

1. ఫాతిరు: Originator సృష్టికి మూలాధారుడు, ఉత్పత్తికి కారకుడు సృష్టించేవాడు

2. వలియ్యున్: అంటే ఇక్కడ ఆరాధ్యుడు అని అర్థం. సాధారణంగా దీని అర్థం: స్నేహితుడు, సహాయకుడు, రక్షించువాడు. Friend, Patron, Protector, Owner, Defender. అల్ వలియ్యు: సంరక్షకుడు, స్వామి. చూడండి, 2:107

3. చూడండి, 3:185

చేస్తే! ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

18. మరియు ఆయన తన దాసులపై సంపూర్ణ అధికారం (ప్రాబల్యం)[1] గలవాడు. మరియు ఆయన మహా వివేచనాపరుడు, సర్వం తెలిసినవాడు.[2]

وَهُوَ الْقَاهِرُ فَوْقَ عِبَادِهِ ۚ وَهُوَ الْحَكِيمُ الْخَبِيرُ ﴿١٨﴾

19. (ఓ ము'హమ్మద్! వారిని) అడుగు: "అన్నిటికంటే గొప్పసాక్ష్యం ఏది?" ఇలా అను: "నాకూ మరియు మీకూ మధ్య అల్లాహ్ సాక్షిగా ఉన్నాడు మరియు మిమ్మల్ని మరియు ఇది (ఈ సందేశం) అందిన వారిని అందరినీ హెచ్చరించటానికి, ఈ ఖుర్ఆన్ నాపై అవతరింపజేయబడింది." ఏమీ? వాస్తవానికి అల్లాహ్‌తో పాటు ఇంకా ఇతర ఆరాధ్యదైవాలు ఉన్నారని మీరు నిశ్చయంగా సాక్ష్యమివ్వగలరా? ఇలా అను: "నేనైతే అలాంటి సాక్ష్యమివ్వను!" ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, ఆయన (అల్లాహ్) ఒక్కడే ఆరాధ్యదేవుడు మరియు నిశ్చయంగా, మీరు ఆయనకు సాటి కల్పిస్తున్న దాని నుండి నాకు ఎలాంటి సంబంధం లేదు!"

قُلْ أَيُّ شَيْءٍ أَكْبَرُ شَهَادَةً ۖ قُلِ اللَّهُ ۖ شَهِيدٌ بَيْنِي
وَبَيْنَكُمْ ۚ وَأُوحِيَ إِلَيَّ هَٰذَا الْقُرْآنُ لِأُنذِرَكُم بِهِ
وَمَن بَلَغَ ۚ أَئِنَّكُمْ لَتَشْهَدُونَ أَنَّ مَعَ اللَّهِ آلِهَةً
أُخْرَىٰ ۚ قُل لَّا أَشْهَدُ ۚ قُلْ إِنَّمَا هُوَ إِلَٰهٌ وَاحِدٌ وَإِنَّنِي
بَرِيءٌ مِّمَّا تُشْرِكُونَ ﴿١٩﴾

20. ఎవరికైతే మేము గ్రంథాన్ని ప్రసాదించామో! వారు తమ పుత్రులను గుర్తించినట్లు, ఇతనిని (ము'హమ్మదును) కూడా గుర్తిస్తారు. ఎవరైతే, తమను తాము నష్టానికి గురిచేసుకుంటారో అలాంటి వారే విశ్వసించరు

الَّذِينَ آتَيْنَاهُمُ الْكِتَابَ يَعْرِفُونَهُ كَمَا يَعْرِفُونَ
أَبْنَاءَهُمُ ۘ الَّذِينَ خَسِرُوا أَنفُسَهُمْ فَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٢٠﴾

21. మరియు అల్లాహ్‌పై అసత్యం కల్పించే

وَمَنْ أَظْلَمُ مِمَّنِ افْتَرَىٰ عَلَى اللَّهِ كَذِبًا أَوْ كَذَّبَ

1 అల్-ఖాహిరు: Subduer, Irresistible. Overcomer, Overpowerer. తన సృష్టిపై సంపూర్ణ అధికారం, ఆధిపత్యం, ఆధిక్యత, లోబరచుకో గలవాడు, స్వాధీనంలోకి తెచ్చుకోగల, వశంచేసుకోగల, జయించగల వాడు, ప్రబలుడు. చూడండి, 6:61.
అల్-వాహిద్ అల్-ఖహ్హార్‌లకు చూడండి.12:39 ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు

2 అల్-ఖబీరు: All Aware, Well Acquainted with all things. సర్వపరిచితుడు, అంతా ఎరిగినవాడు, అంతా తెలిసినవాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి. చూడండి, 6:103, 34:1, 67:14.

بِاٰيٰتِهٖ ۗ اِنَّهٗ لَا يُفْلِحُ الظّٰلِمُوْنَ ﴿٢١﴾

వానికంటే! లేదా, అల్లాహ్ సూచనలను తిరస్కరించే వానికంటే, ఎక్కువ దుర్మార్గుడు ఎవడు? నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందరు.

وَيَوْمَ نَحْشُرُهُمْ جَمِيْعًا ثُمَّ نَقُوْلُ لِلَّذِيْنَ اَشْرَكُوْٓا اَيْنَ شُرَكَاۗؤُكُمُ الَّذِيْنَ كُنْتُمْ تَزْعُمُوْنَ ﴿٢٢﴾

22. మరియు ఆ రోజు మేము వారందరినీ సమావేశ పరుస్తాము. ఆ తరువాత (అల్లాహ్‌కు) సాటికల్పించే (షిర్కుచేసే) వారితో: ''మీరు (దైవాలుగా) భావించి (అల్లాహ్‌కు సాటి కల్పించి)న ఆ భాగస్వాములు ఇప్పుడు ఎక్కడున్నారు?'' అని అడుగుతాము.

ثُمَّ لَمْ تَكُنْ فِتْنَتُهُمْ اِلَّآ اَنْ قَالُوْا وَاللّٰهِ رَبِّنَا مَا كُنَّا مُشْرِكِيْنَ ﴿٢٣﴾

23. అప్పుడు వారికి: ''మా ప్రభువైన అల్లాహ్ సాక్షిగా! మేము ఆయన (అల్లాహ్)కు సాటి కల్పించేవారము (ముష్రికీన్) కాదు!'' అని చెప్పడం తప్ప మరొక సాకు దొరకదు.

اُنْظُرْ كَيْفَ كَذَبُوْا عَلٰٓى اَنْفُسِهِمْ وَضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا يَفْتَرُوْنَ ﴿٢٤﴾

24. చూడండి! వారు తమను గురించి తామే ఏవిధంగా అబద్ధాలు కల్పించుకున్నారో! మరియు ఏ విధంగా వారు కల్పించుకున్నవి (బూటక దైవాలు) మాయమైపోయాయో!

وَمِنْهُمْ مَّنْ يَّسْتَمِعُ اِلَيْكَ ۚ وَجَعَلْنَا عَلٰى قُلُوْبِهِمْ اَكِنَّةً اَنْ يَّفْقَهُوْهُ وَفِيْٓ اٰذَانِهِمْ وَقْرًا ۗ وَاِنْ يَّرَوْا كُلَّ اٰيَةٍ لَّا يُؤْمِنُوْا بِهَا ۗ حَتّٰٓى اِذَا جَاۗءُوْكَ يُجَادِلُوْنَكَ يَقُوْلُ الَّذِيْنَ كَفَرُوْٓا اِنْ هٰذَآ اِلَّآ اَسَاطِيْرُ الْاَوَّلِيْنَ ﴿٢٥﴾

25. మరియు (ఓ ప్రవక్తా!) వారిలో కొందరు నీ (మాటలు) వింటున్నట్లు (నటించే) వారున్నారు. మరియు వారు దానిని అర్థం చేసుకోకుండా మేము వారి హృదయాలపై తెరలు వేసివున్నాము మరియు వారి చెవులకు చెవుడు పట్టించివున్నాము.[1] మరియు వారు ఏ అద్భుత సంకేతాన్ని చూసినా దానిని విశ్వసించరు. చివరకు వారు నీ వద్దకు వచ్చి నీతో వాదులాడేటప్పుడు, వారిలో సత్యాన్ని తిరస్కరించే వారు: ''ఇవి కేవలం పూర్వీకుల కట్టుకథలు మాత్రమే!'' అని అంటారు.

---

1. చూడండి, 2:7

**26.** మరియు వారు ఇతరులను అతని (ప్రవక్త) నుండి ఆపుతారు. మరియు స్వయంగా తాము కూడా అతనికి దూరంగా ఉంటారు. మరియు ఈ విధంగా వారు తమకు తామే నాశనం చేసుకుంటున్నారు. కాని వారది గ్రహించటం లేదు!

وَهُمْ يَنْهَوْنَ عَنْهُ وَيَنْـَٔوْنَ عَنْهُ ۖ وَإِن يُهْلِكُونَ إِلَّآ أَنفُسَهُمْ وَمَا يَشْعُرُونَ ﴿٢٦﴾

**27.** మరియు వారిని నరకం ముందు నిలబెట్టబడినపుడు, నీవు చూడగలిగితే (ఎంత బాగుండేది)! వారు ఇలా అంటారు: "అయ్యో మా పాడుగాను! మేము తిరిగి (పూర్వ జీవితంలోకి) పంపబడితే, మా ప్రభువు సూచనలను, అసత్యాలని తిరస్కరించకుండా విశ్వాసులలో చేరిపోయే వారం కదా!"[1]

وَلَوْ تَرَىٰٓ إِذْ وُقِفُوا۟ عَلَى ٱلنَّارِ فَقَالُوا۟ يَٰلَيْتَنَا نُرَدُّ وَلَا نُكَذِّبَ بِـَٔايَٰتِ رَبِّنَا وَنَكُونَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴿٢٧﴾

**28.** (వారు ఇలా అనటానికి కారణం), వాస్తవానికి వారు ఇంతవరకు దాచినదంతా వారికి బహిర్గతం కావటమే! మరియు ఒకవేళ వారిని (గత జీవితంలోకి) తిరిగి పంపినా, వారికి నిషేధించబడిన వాటినే వారు తిరిగి చేస్తారు. నిశ్చయంగా, వారు అసత్యవాదులు!

بَلْ بَدَا لَهُم مَّا كَانُوا۟ يُخْفُونَ مِن قَبْلُ ۖ وَلَوْ رُدُّوا۟ لَعَادُوا۟ لِمَا نُهُوا۟ عَنْهُ وَإِنَّهُمْ لَكَٰذِبُونَ ﴿٢٨﴾

**29.** మరియు వారు: "మాకు ఇహలోక జీవితం తప్ప మరొక (జీవితం) లేదు మరియు మేము తిరిగి లేపబడము (మాకు పునరుత్థానం లేదు)!" అని అంటారు.

وَقَالُوٓا۟ إِنْ هِىَ إِلَّا حَيَاتُنَا ٱلدُّنْيَا وَمَا نَحْنُ بِمَبْعُوثِينَ ﴿٢٩﴾

**30.** మరియు ఒకవేళ వారిని, తమ ప్రభువుముందు నిలబెట్టబడినప్పుడు, నీవు చూడగలిగితే (ఎంతబాగుండేది)! ఆయన (అల్లాహ్) అంటాడు "ఏమీ? ఇది (పునరుత్థానం) నిజంకాదా?" వారు జవాబిస్తారు: "అవును (నిజమే) మా ప్రభువు సాక్షిగా!" అప్పుడు ఆయన: "అయితే మీరు మీ సత్యతిరస్కారానికి

وَلَوْ تَرَىٰٓ إِذْ وُقِفُوا۟ عَلَىٰ رَبِّهِمْ ۚ قَالَ أَلَيْسَ هَٰذَا بِٱلْحَقِّ ۚ قَالُوا۟ بَلَىٰ وَرَبِّنَا ۚ قَالَ فَذُوقُوا۟ ٱلْعَذَابَ بِمَا كُنتُمْ تَكْفُرُونَ ﴿٣٠﴾

1. చూడండి, 23:107-108 మరియు 32:12.

ఫలితంగా శిక్షను అనుభవించండి!" అని అంటాడు.

قَدْ خَسِرَ الَّذِينَ كَذَّبُوا بِلِقَاءِ اللَّهِ ۖ حَتَّىٰ إِذَا جَاءَتْهُمُ السَّاعَةُ بَغْتَةً قَالُوا يَا حَسْرَتَنَا عَلَىٰ مَا فَرَّطْنَا فِيهَا وَهُمْ يَحْمِلُونَ أَوْزَارَهُمْ عَلَىٰ ظُهُورِهِمْ ۚ أَلَا سَاءَ مَا يَزِرُونَ ﴿٣١﴾

**31.** వాస్తవంగా, అల్లాహ్‌ను కలుసుకోవటాన్ని అబద్ధంగా పరిగణించేవారే నష్టానికి గురిఅయినవారు![1] చివరకు అకస్మాత్తుగా అంతిమఘడియ వారిపైకి వచ్చినపుడు వారు: "అయ్యో మా దౌర్భాగ్యం! దీని విషయంలో మేమెంత అశ్రద్ధవహించాము కదా! అని వాపోతారు. (ఎందుకంటే) వారు తమ (పాపాల) బరువును తమ వీపులపై మోసుకొని ఉంటారు. అయ్యో! వారు మోసే భారం ఎంత దుర్భరమైనది కదా!

وَمَا الْحَيَاةُ الدُّنْيَا إِلَّا لَعِبٌ وَلَهْوٌ ۖ وَلَلدَّارُ الْآخِرَةُ خَيْرٌ لِلَّذِينَ يَتَّقُونَ ۗ أَفَلَا تَعْقِلُونَ ﴿٣٢﴾

**32.** మరియు ఇహలోకజీవితం ఒక ఆట మరియు ఒక కాలక్షేపము మాత్రమే! మరియు దైవభీతి గలవారికి పరలోకవాసమే అత్యంత శ్రేష్ఠమైనది ఏమీ? మీరు అర్థం చేసుకోలేరా?

قَدْ نَعْلَمُ إِنَّهُ لَيَحْزُنُكَ الَّذِي يَقُولُونَ ۖ فَإِنَّهُمْ لَا يُكَذِّبُونَكَ وَلَٰكِنَّ الظَّالِمِينَ بِآيَاتِ اللَّهِ يَجْحَدُونَ ﴿٣٣﴾

**33.** (ఓ ప్రవక్తా!) వాస్తవానికి వారు పలుకుతున్న మాటలవలన నీకు దుఃఖము కలుగుతున్నదని మాకు బాగాతెలుసు. కానీ నిశ్చయంగా, వారు అసత్యుడవని తిరస్కరించేది నిన్నుకాదు. వాస్తవానికి ఆ దుర్మార్గులు అల్లాహ్ సూచన(ఆయాత్)లను తిరస్కరిస్తున్నారు.[2]

وَلَقَدْ كُذِّبَتْ رُسُلٌ مِنْ قَبْلِكَ فَصَبَرُوا عَلَىٰ مَا كُذِّبُوا وَأُوذُوا حَتَّىٰ أَتَاهُمْ نَصْرُنَا ۚ وَلَا مُبَدِّلَ لِكَلِمَاتِ اللَّهِ ۚ وَلَقَدْ جَاءَكَ مِنْ نَبَإِ الْمُرْسَلِينَ ﴿٣٤﴾

**34.** మరియు వాస్తవంగా, నీకు పూర్వం చాలామంది ప్రవక్తలు, అసత్యవాదులని తిరస్కరించబడ్డారు. కాని వారు ఆ తిరస్కారాన్ని మరియు తమకు కలిగిన హింసలను, వారికి మా సహాయం అందేవరకూ సహనం

1. చూడండి, 'స.బు'ఖారీ, పుస్తకము-8, 'హదీస్' నం. 515

2 'అలీ (ర'ది అ) కథనం "ఒకసారి అబూ జహల్ (దైవప్రవక్త 'స'అస యొక్క శత్రువు) ఇలా అన్నాడు. 'ఓ ము'హమ్మద్! ('స'అస) నేను, నిన్ను అసత్యుడవని అనటం లేదు కాని నీవు వినిపించే వాటిని మటుకు సత్యాలని నమ్మలేను.' " (తిర్మిజీ').

వహించారు.[1] మరియు అల్లాహ్ మాటలను ఎవ్వరూ మార్చలేరు. మరియు వాస్తవానికి, పూర్వపు ప్రవక్తల కొన్ని సమాచారాలు ఇదివరకే నీకు అందాయి.

وَإِن كَانَ كَبُرَ عَلَيْكَ إِعْرَاضُهُمْ فَإِنِ ٱسْتَطَعْتَ
أَن تَبْتَغِىَ نَفَقًا فِى ٱلْأَرْضِ أَوْ سُلَّمًا فِى ٱلسَّمَآءِ
فَتَأْتِيَهُم بِـَٔايَةٍ وَلَوْ شَآءَ ٱللَّهُ لَجَمَعَهُمْ عَلَى ٱلْهُدَىٰ
فَلَا تَكُونَنَّ مِنَ ٱلْجَٰهِلِينَ ﴿٣٥﴾

**35.** మరియు (ఓ ము'హమ్మద్!) వారి విముఖత నీకు భరించనిదైతే నీలో శక్తిఉంటే, భూమిలో ఒక సొరంగం వెదకి, లేదా ఆకాశంలో ఒక నిచ్చెన వేసి, వారి కొరకు ఏదైనా అద్భుత సూచన తీసుకురా. మరియు అల్లాహ్ కోరితే వారందరినీ సన్మార్గం వైపునకు తెచ్చి ఉండేవాడు! కావున నీవు అజ్ఞానులలో చేరకు. (1/2)

إِنَّمَا يَسْتَجِيبُ ٱلَّذِينَ يَسْمَعُونَ وَٱلْمَوْتَىٰ يَبْعَثُهُمُ ٱللَّهُ
ثُمَّ إِلَيْهِ يُرْجَعُونَ ﴿٣٦﴾

**36.** * నిశ్చయంగా, ఎవరైతే (శ్రద్ధతో) వింటారో, వారే (సత్యసందేశాన్ని) స్వీకరిస్తారు. ఇక మృతులు (సత్యతిరస్కారులు) - అల్లాహ్ వారిని పునరుత్థరింపజేసినప్పుడు - (ప్రతిఫలం కొరకు) ఆయనవద్దకే రప్పింపబడతారు.

وَقَالُوا۟ لَوْلَا نُزِّلَ عَلَيْهِ ءَايَةٌ مِّن رَّبِّهِۦ قُلْ إِنَّ ٱللَّهَ
قَادِرٌ عَلَىٰٓ أَن يُنَزِّلَ ءَايَةً وَلَٰكِنَّ أَكْثَرَهُمْ
لَا يَعْلَمُونَ ﴿٣٧﴾

**37.** మరియు వారు: "ఇతని(ప్రవక్త)పై ఇతని ప్రభువు తరఫునుండి ఏదైనా అద్భుత సూచన ఎందుకు అవతరింపజేయబడలేదు?" అని అంటారు. ఇలా అను: "నిశ్చయంగా, అల్లాహ్! ఎలాంటి అద్భుత సూచననైనా అవతరింపజేయగల శక్తి కలిగి ఉన్నాడు, కాని వారిలో అనేకులకు ఇది తెలియదు."

وَمَا مِن دَآبَّةٍ فِى ٱلْأَرْضِ وَلَا طَٰٓئِرٍ يَطِيرُ
بِجَنَاحَيْهِ إِلَّآ أُمَمٌ أَمْثَالُكُم مَّا فَرَّطْنَا فِى ٱلْكِتَٰبِ مِن
شَىْءٍ ثُمَّ إِلَىٰ رَبِّهِمْ يُحْشَرُونَ ﴿٣٨﴾

**38.** మరియు భూమిపై సంచరించే ఏ జంతువు గానీ, లేక తన రెండు రెక్కలతో ఎగిరే ఏ పక్షి గానీ, మీలాంటి సంఘ జీవులుగా లేకుండా లేవు! మేము గ్రంథంలో ఏ కొరతా చేయలేదు.[2] తరువాత వారందరూ

---

**1.** చూడండి, 40:51, 58:21 మరియు 37:171-172
**2.** చూడండి, 16:89

తమ ప్రభువు వద్దకు మరలింపబడతారు.

وَالَّذِينَ كَذَّبُوا بِآيَاتِنَا صُمٌّ وَبُكْمٌ فِي الظُّلُمَاتِ ۗ مَن يَشَإِ اللَّهُ يُضْلِلْهُ وَمَن يَشَأْ يَجْعَلْهُ عَلَىٰ صِرَاطٍ مُّسْتَقِيمٍ ﴿٣٩﴾

**39.** మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారు, చెవిటి వారు మరియు మూగవారు, అంధకారంలో పడిపోయిన వారు! అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టులుగా చేస్తాడు మరియు తాను కోరిన వారిని ఋజుమార్గంలో ఉంచుతాడు.[1]

قُلْ أَرَأَيْتَكُمْ إِنْ أَتَاكُمْ عَذَابُ اللَّهِ أَوْ أَتَتْكُمُ السَّاعَةُ أَغَيْرَ اللَّهِ تَدْعُونَ إِن كُنتُمْ صَادِقِينَ ﴿٤٠﴾

**40.** వారితో అను: "ఏమీ? మీరు సత్యవంతులే అయితే ఆలోచించి (చెప్పండి!) ఒకవేళ మీపై అల్లాహ్ శిక్ష వచ్చిపడినా, లేదా అంతిమఘడియ వచ్చినా! మీరు అల్లాహ్‌ను తప్ప ఇతరులను ఎవరినైనా పిలుస్తారా?

بَلْ إِيَّاهُ تَدْعُونَ فَيَكْشِفُ مَا تَدْعُونَ إِلَيْهِ إِن شَاءَ وَتَنسَوْنَ مَا تُشْرِكُونَ ﴿٤١﴾

**41.** "అలా కానేరదు! మీరు ఆయన (అల్లాహ్)నే పిలుస్తారు. ఆయన కోరితే ఆ ఆపదను మీ పైనుండి తొలగిస్తాడు అప్పుడు మీరు ఆయనకు సాటి కల్పించే వారిని మరచిపోతారు!"

وَلَقَدْ أَرْسَلْنَا إِلَىٰ أُمَمٍ مِّن قَبْلِكَ فَأَخَذْنَاهُم بِالْبَأْسَاءِ وَالضَّرَّاءِ لَعَلَّهُمْ يَتَضَرَّعُونَ ﴿٤٢﴾

**42.** మరియు వాస్తవానికి మేము, నీకు పూర్వం (ఓ ము'హమ్మద్!) అనేక జాతుల వారి వద్దకు ప్రవక్తలను పంపాము. ఆ పిదప వారు వినమ్రులవటానికి, మేము వారిపై ఇబ్బందులను మరియు కష్టాలను కలుగజేశాము.

فَلَوْلَا إِذْ جَاءَهُم بَأْسُنَا تَضَرَّعُوا وَلَٰكِن قَسَتْ قُلُوبُهُمْ وَزَيَّنَ لَهُمُ الشَّيْطَانُ مَا كَانُوا يَعْمَلُونَ ﴿٤٣﴾

**43.** పిదప మా తరఫునుండి వారిపై ఆపద వచ్చినపుడు కూడా వారెందుకు వినమ్రులు కాలేదు? కాని వారి హృదయాలు మరింత కఠినమయ్యాయి మరియు షై'తాన్

---

**1.** చూడండి, 2:26, 4:88, 143. అల్లాహుతా'ఆలా వారినే మార్గభ్రష్టులు చేస్తాడు, ఎవరైతే విచక్షణా శక్తి మరియు తెలివి ఉండి కూడా సత్యాన్ని తెలుసుకుని దానిపై అమలు పరచటానికి ప్రయత్నం చేయరో! సత్యం తెలిసినా దానిని నమ్మరో! అల్లాహ్ (సు.తా.) ఎవ్వరినీ కూడా బలవంతంగా మార్గభ్రష్టత్వంలో పడవేయడు. కాని షై'తాన్ ఎల్లప్పుడూ మానవుణ్ణి మార్గభ్రష్టత్వం వైపుకు ఆహ్వానిస్తుంటాడు.

వారు చేసే కర్మలన్నింటినీ వారికి మంచివిగా కనబడేటట్లు చేశాడు.

**44.** ఆ పిదప వారికి చేయబడిన బోధనను వారు మరచిపోగా, మేము వారికొరకు సకల (భోగభాగ్యాల) ద్వారాలను తెరిచాము, చివరకు వారు తమకు ప్రసాదించబడిన ఆనందాలలో నిమగ్నులైఉండగా, మేము వారిని ఆకస్మాత్తుగా (శిక్షించటానికి) పట్టుకున్నాము. అప్పుడు వారు నిరాశులయ్యారు.

فَلَمَّا نَسُوا مَا ذُكِّرُوا بِهِ فَتَحْنَا عَلَيْهِمْ أَبْوَابَ
كُلِّ شَيْءٍ حَتَّىٰ إِذَا فَرِحُوا بِمَا أُوتُوا
أَخَذْنَاهُم بَغْتَةً فَإِذَا هُم مُّبْلِسُونَ ﴿٤٤﴾

**45.** ఈ విధంగా దుర్మార్గానికి పాల్పడిన వారు సమూలంగా నిర్మూలించబడ్డారు. మరియు సర్వలోకాలకు పోషకుడైన అల్లాహ్ మాత్రమే సర్వస్తోత్రాలకు అర్హుడు.

فَقُطِعَ دَابِرُ الْقَوْمِ الَّذِينَ ظَلَمُوا وَالْحَمْدُ لِلَّهِ
رَبِّ الْعَالَمِينَ ﴿٤٥﴾

**46.** ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా (చెప్పండి)? అల్లాహ్ మీ వినికిడినీ మరియు మీ చూపునూ పోగొట్టి, మీ హృదయాలపై ముద్రవేస్తే! అల్లాహ్ తప్ప ఏ దేవుడైనా వాటిని మీకు తిరిగి ఇవ్వగలడా?" చూడు! మేము ఏ విధంగా మా సూచనలను వారికి తెలుపుతున్నామో! అయినా వారు (వాటి నుండి) తప్పించుకొని పోతున్నారు.

قُلْ أَرَأَيْتُمْ إِنْ أَخَذَ اللَّهُ سَمْعَكُمْ وَأَبْصَارَكُمْ
وَخَتَمَ عَلَىٰ قُلُوبِكُم مَّنْ إِلَٰهٌ غَيْرُ اللَّهِ يَأْتِيكُم بِهِ انظُرْ
كَيْفَ نُصَرِّفُ الْآيَاتِ ثُمَّ هُمْ يَصْدِفُونَ ﴿٤٦﴾

**47.** ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా (చెప్పండి)? అల్లాహ్ శిక్ష మీపై (రాత్రివేళ) ఆకస్మాత్తుగా గానీ, లేక (పగటివేళ) బహిరంగంగా గానీ వచ్చిపడితే, దుర్మార్గులు తప్ప ఇతరులు నాశనం చేయబడతారా?"[1]

قُلْ أَرَأَيْتَكُمْ إِنْ أَتَاكُمْ عَذَابُ اللَّهِ بَغْتَةً
أَوْ جَهْرَةً هَلْ يُهْلَكُ إِلَّا الْقَوْمُ الظَّالِمُونَ ﴿٤٧﴾

**48.** మరియు మేము ప్రవక్తలను కేవలం శుభవార్తలు ఇచ్చేవారుగా మరియు హెచ్చరికలు చేసేవారుగా మాత్రమే పంపుతాము. కావున

وَمَا نُرْسِلُ الْمُرْسَلِينَ إِلَّا مُبَشِّرِينَ وَمُنذِرِينَ
فَمَنْ آمَنَ وَأَصْلَحَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ

1. చూడండి, 10:50

ఎవరైతే విశ్వసించి (తమ నడవడికను) సరిదిద్దుకుంటారో, అట్టి వారికి ఎలాంటి భయమూ ఉండదు మరియు వారు దుఃఖపడరు కూడా.

يحزنون ﴿٤٨﴾

**49** కాని మా సూచనలను అబద్ధాలని తిరస్కరించే వారికి, తమ అవిధేయతకు ఫలితంగా తప్పకుండా శిక్ష పడుతుంది.[1]

والذين كذبوا بآياتنا يمسهم العذاب
بما كانوا يفسقون ﴿٤٩﴾

**50.** (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను "నా వద్ద అల్లాహ్ కోశాగారాలు ఉన్నాయని గానీ, లేదా నాకు అగోచర జ్ఞానమున్నదని గానీ, నేను మీతో అనడంలేదు. లేదా నేను దేవదూతనని కూడా అనడం లేదు కాని నేను కేవలం నాపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానాన్ని (వ'హీని) మాత్రమే అనుసరిస్తున్నాను."[2] వారిని ఇలా అడుగు: "ఏమీ? అంధుడూ మరియు దృష్టిగల వాడు సమానులా? అయితే మీరెందుకు ఆలోచించరు?"

قل لا أقول لكم عندي خزائن الله ولا أعلم
الغيب ولا أقول لكم إني ملك إن أتبع إلا ما
يوحى إلي قل هل يستوي الأعمى والبصير
أفلا تتفكرون ﴿٥٠﴾

**51.** మరియు తమ ప్రభువు సన్నిధిలో సమావేశపరచబడతారని భయపడేవారికి ఆయన తప్ప వేరే రక్షించేవాడు గానీ, సిఫారసు చేసేవాడు గానీ ఉండడని, దీని (ఈ ఖుర్ఆన్) ద్వారా హెచ్చరించు, బహుశా వారు దైవభీతి గలవారు అవుతారేమో!

وأنذر به الذين يخافون أن يحشروا إلى
ربهم ليس لهم من دونه ولي ولا
شفيع لعلهم يتقون ﴿٥١﴾

**52.** మరియు ఎవరైతే తమ ప్రభువును ఉదయం మరియు సాయంత్రం ప్రార్థిస్తూ, ఆయన ముఖాన్ని[3] (చూడ)గోరుతున్నారో,

ولا تطرد الذين يدعون ربهم بالغداة
والعشي يريدون وجهه ما عليك من

---

1 చూడండి 'స'హీ'హ్ ముస్లిం, పు 1. అధ్యాయం 240 అబూ హురైరా (ర'ది'అ) కథనం: "దైవప్రవక్త (స'అస) అన్నారు. 'ఎవరి చేతిలోనైతే నా ప్రాణముందో ఆ అల్లాహ్ (సు'తా) సాక్షిగా! ఈ కాలపు యూదులు మరియు క్రైస్తవులలో ఎవరేగానీ నా గురించి విని నా సందేశాన్ని విశ్వసించకుండా మరణిస్తారో వారు నరకవాసులవుతారు.' "

2 చూడండి, 7:188

3 ప్రళయదినాన విశ్వాసులకు లభించే అతి గొప్ప వరం అల్లాహ్ (సు'తా) దర్శనం అందుకే

حِسَابِهِم مِّن شَيْءٍ وَمَا مِنْ حِسَابِكَ عَلَيْهِم مِّن شَيْءٍ فَتَطْرُدَهُمْ فَتَكُونَ مِنَ الظَّالِمِينَ ﴿٥٢﴾

వారిని నీవు దూరంచేయకు. వారిలెక్క కొరకు నీవు ఎంత మాత్రమూ జవాబుదారుడవు కావు. మరియు నీ లెక్కకొరకు వారూ జవాబుదారులు కారు. కావున నీవు వారిని దూరంచేస్తే నీవు దుర్మార్గులలో చేరినవాడవవుతావు.

وَكَذَٰلِكَ فَتَنَّا بَعْضَهُم بِبَعْضٍ لِّيَقُولُوا أَهَٰؤُلَاءِ مَنَّ اللَّهُ عَلَيْهِم مِّن بَيْنِنَا ۗ أَلَيْسَ اللَّهُ بِأَعْلَمَ بِالشَّاكِرِينَ ﴿٥٣﴾

**53.** మరియు ఈ విధంగా, మేము వారిలోని కొందరిని మరికొందరి ద్వారా పరీక్షకు గురిచేశాము. వారు (విశ్వాసులను చూసి): "ఏమీ? మా అందరిలో, వీరినేనా అల్లాహ్ అనుగ్రహించింది?"[1] అని అంటారు. ఏమీ? ఎవరు కృతజ్ఞులో అల్లాహ్‌కు తెలియదా?[2]

وَإِذَا جَاءَكَ الَّذِينَ يُؤْمِنُونَ بِآيَاتِنَا فَقُلْ سَلَامٌ عَلَيْكُمْ ۖ كَتَبَ رَبُّكُمْ عَلَىٰ نَفْسِهِ الرَّحْمَةَ ۖ أَنَّهُ مَنْ عَمِلَ مِنكُمْ سُوءًا بِجَهَالَةٍ ثُمَّ تَابَ مِن بَعْدِهِ وَأَصْلَحَ فَأَنَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٥٤﴾

**54.** మరియు మా సూచనలను విశ్వసించిన వారు నీ వద్దకు వచ్చినపుడు నీవు వారితో ఇలా అను: "మీకు శాంతి కలుగు గాక (సలాం)! మీ ప్రభువు కరుణించటమే తనపై విధిగా నిర్ణయించుకున్నాడు. నిశ్చయంగా, మీలో ఎవరైనా అజ్ఞానం వల్ల తప్పుచేసి, ఆ తరువాత పశ్చాత్తాపపడి పరిదిద్దుకుంటే! నిశ్చయంగా, ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

وَكَذَٰلِكَ نُفَصِّلُ الْآيَاتِ وَلِتَسْتَبِينَ سَبِيلُ الْمُجْرِمِينَ ﴿٥٥﴾

**55.** మరియు పాపుల మార్గం స్పష్టపడటానికి, మేము ఈ విధంగా మా సూచనలను వివరంగా తెలుపుతున్నాము.

---

ఖుర్ఆన్‌లో అనేకచోట్లలో, "అల్లాహ్ ముఖాన్ని చూడగోరేవారు" అని చెప్పబడింది. "ఓ ప్రవక్తా! 'ధనవంతులు, పేరు ప్రఖ్యాతులు గల అవిశ్వాసులైన ముష్రిక్‌ల మాటలలో పడి ఇస్లాం స్వీకరించి తమ ప్రభువైన అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించే పేదవారిని, బానిసలను దూరంచేయకు.' "

1 చూడండి, 46:11. ఈ మాటలు ధనవంతులు మరియు పేరు ప్రఖ్యాతులు గల అవిశ్వాసులైన ముష్రికులు మొట్టమొదటి కాలంలో ఇస్లాం స్వీకరించిన పేదవారిని, బానిసలనూ చూసి అన్నారు.

2 "అల్లాహ్ (సు.తా.) మీ రూపురేఖలు చూడడు. ఆయన కేవలం మీ హృదయాలు మరియు మీ కర్మలు మాత్రమే చూస్తాడు." (సహీహ్ ముస్లిం, కితాబ్ అల్-బిర్ర్, బాబ్ అత్-తహ్రీమ్)

**56.** ఇలా అను: "నిశ్చయంగా అల్లాహ్‌ను వదిలి, మీరు ప్రార్థించే ఈ ఇతరులను (కల్పితదైవాలను) ఆరాధించటం నుండి నేను వారించబడ్డాను." మరియు ఇలా అను: "నేను మీ కోరికలను అనుసరించను. (అలా చేస్తే!) వాస్తవానికి నేనూ మార్గభ్రష్టుడను అవుతాను మరియు నేను సన్మార్గం చూపబడిన వారిలో ఉండను."

قُلْ إِنِّي نُهِيتُ أَنْ أَعْبُدَ الَّذِينَ تَدْعُونَ مِن دُونِ اللَّهِ ۚ قُل لَّا أَتَّبِعُ أَهْوَاءَكُمْ ۙ قَدْ ضَلَلْتُ إِذًا وَمَا أَنَا مِنَ الْمُهْتَدِينَ ﴿٥٦﴾

**57.** ఇలా అను: "నిశ్చయంగా, నేను నా ప్రభువు తరఫునుండి లభించిన స్పష్టమైన ప్రమాణంపై ఉన్నాను. మీరు దానిని అబద్ధమని నిరాకరించారు. మీరు తొందర పెట్టే విషయం నా దగ్గరలేదు. నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌కే ఉంది. ఆయన సత్యాన్ని తెలుపుతున్నాడు. మరియు ఆయనే సర్వోత్తమమైన న్యాయాధికారి!"[1]

قُلْ إِنِّي عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّي وَكَذَّبْتُم بِهِ ۚ مَا عِندِي مَا تَسْتَعْجِلُونَ بِهِ ۚ إِنِ الْحُكْمُ إِلَّا لِلَّهِ ۖ يَقُصُّ الْحَقَّ ۖ وَهُوَ خَيْرُ الْفَاصِلِينَ ﴿٥٧﴾

**58.** ఇలా అను: "ఒకవేళ వాస్తవానికి మీరు తొందరపెట్టే విషయం (శిక్ష) నా అధీనంలో ఉండినట్లయితే, నాకూ మీకూ మధ్య తీర్పు ఎప్పుడో జరిగిపోయిఉండేది మరియు అల్లాహ్‌కు దుర్మార్గులను గురించి బాగా తెలుసు." (5/8)

قُل لَّوْ أَنَّ عِندِي مَا تَسْتَعْجِلُونَ بِهِ لَقُضِيَ الْأَمْرُ بَيْنِي وَبَيْنَكُمْ ۗ وَاللَّهُ أَعْلَمُ بِالظَّالِمِينَ ﴿٥٨﴾

**59.** * మరియు అగోచర విషయాల తాళపు చెవులు ఆయన (అల్లాహ్) వద్దనే ఉన్నాయి. వాటిని, ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. మరియు భూమిలోనూ, సముద్రంలోనూ ఉన్నదంతా ఆయనకు తెలుసు. మరియు ఆయనకు తెలియకుండా ఏ చెట్టు ఆకు కూడా రాలదు. మరియు భూమిలోని చీకటి పొరలలో ఉన్న ప్రతి గింజ, అది పచ్చిది కానీ, ఎండినది

وَعِندَهُ مَفَاتِحُ الْغَيْبِ لَا يَعْلَمُهَا إِلَّا هُوَ ۚ وَيَعْلَمُ مَا فِي الْبَرِّ وَالْبَحْرِ ۚ وَمَا تَسْقُطُ مِن وَرَقَةٍ إِلَّا يَعْلَمُهَا وَلَا حَبَّةٍ فِي ظُلُمَاتِ الْأَرْضِ وَلَا رَطْبٍ وَلَا يَابِسٍ إِلَّا فِي كِتَابٍ مُّبِينٍ ﴿٥٩﴾

1. చూడండి, 8:32-33

కానీ, అంతా స్పష్టంగా ఒక గ్రంథంలో (వ్రాయబడి) ఉంది.[1]

60. మరియు ఆయనే రాత్రివేళ (మీరు నిద్రపోయినపుడు) మీ ఆత్మలను తీసు (స్వాధీనపరచు)కుంటాడు[2] మరియు పగటివేళ మీరు చేసేదంతా ఆయనకు తెలుసు. ఆ పిదప నిర్ణీతగడువు, పూర్తి అయ్యేవరకు దాని (పగటివేళ)లో మిమ్మల్ని తిరిగి లేపుతాడు. ఆ తరువాత ఆయన వైపునకే మీ మరలింపు ఉంది, అప్పుడు (పునరుత్థానదినమున) ఆయన మీరు చేస్తూ ఉన్న కర్మలన్నీ మీకు తెలుపుతాడు.[3]

وَهُوَ الَّذِي يَتَوَفَّاكُم بِاللَّيْلِ وَيَعْلَمُ مَا جَرَحْتُم
بِالنَّهَارِ ثُمَّ يَبْعَثُكُمْ فِيهِ لِيُقْضَىٰ أَجَلٌ مُّسَمًّى ثُمَّ
إِلَيْهِ مَرْجِعُكُمْ ثُمَّ يُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ٦٠

61. ఆయన తన దాసులపై సంపూర్ణ అధికారం (ప్రాబల్యం)[4] కలిగి ఉన్నాడు మరియు ఆయన మీపై కనిపెట్టుకొని ఉండేవారిని పంపుతాడు చివరకు మీలో ఒకరికి చావు సమయం వచ్చినపుడు, మేము పంపిన దూతలు అతనిని మరణింపజేస్తారు మరియు వారెప్పుడూ అశ్రద్ధ చూపరు.[5]

وَهُوَ الْقَاهِرُ فَوْقَ عِبَادِهِ وَيُرْسِلُ عَلَيْكُمْ حَفَظَةً
حَتَّىٰ إِذَا جَاءَ أَحَدَكُمُ الْمَوْتُ تَوَفَّتْهُ رُسُلُنَا وَهُمْ
لَا يُفَرِّطُونَ ٦١

62 తరువాత వారు, వారి నిజమైన[6] సంరక్షకుడు, అల్లాహ్ సన్నిధిలోకి చేర్చ

ثُمَّ رُدُّوا إِلَى اللَّهِ مَوْلَاهُمُ الْحَقِّ أَلَا لَهُ الْحُكْمُ وَهُوَ

1 అగోచర విషయాల తాళపుచెవులు ఐదు ఉన్నాయి. 1) పునరుత్థాన దినపు జ్ఞానం, 2) వర్షం వచ్చే సమయం 3) తల్లి గర్భాశయంలో ఉన్న బిడ్డ విషయం, 4) రేపు సంభవించబోయే విషయం. 5) మరణం సంభవించే చోటు. (స'హీ'హ్ బు'ఖారీ, తఫ్సీర్ సూరహ్ అల్-అన్'ఆమ్)

2 చూడండి. 39:42 చావును గురించి అవతరింపజేయబడిన మొదటి ఆయత్

3. చూడండి, 78:9-11.

4. చూడండి అల్-ఖాహిరు, 6:18

5. చూడండి, 32:11లో ఒక మరణదైవదూత పేర్కొనబడ్డాడు. కానీ, ఈ ఆయత్‌లో దైవదూతలు, అనిఉంది ఇదేవిధంగా 4:97మరియు6:93లలో కూడా దైవదూతలు, అని ఉంది దీనివల్ల స్పష్టమయ్యేదేమిటంటే మరణింపజేసేదైవదూత ఒక్కడే, కాని ఇతరులు అతని సహాయకులు ఆ మరణింపజేసే దైవదూత పేరు 'ఇ'జ్రాయీ'ల్ (ఇబ్నె కసీ'ర్)

6. అల్-హఖ్ఖు: The Truth, The Really Existing, whose existence and divinity are proved to be True పరమ సత్యం, నిజం, యథార్థం. చూడండి, 2:119

أَسْرَعُ الْحَاسِبِينَ ﴿٦٢﴾

బడతారు. తెలుసుకోండి! సర్వ న్యాయాధికారం ఆయనదే! మరియు లెక్కతీసుకోవటంలో ఆయన అతి శీఘ్రుడు!

قُلْ مَن يُنَجِّيكُم مِّن ظُلُمَاتِ الْبَرِّ وَالْبَحْرِ تَدْعُونَهُ
تَضَرُّعًا وَخُفْيَةً لَّئِنْ أَنجَانَا مِنْ هَٰذِهِ لَنَكُونَنَّ مِنَ
الشَّاكِرِينَ ﴿٦٣﴾

**63.** " 'మిమ్మల్ని ఈ ఆపదనుండి కాపాడితే మేమెంతో కృతజ్ఞులమవుతాము.' అని మీరు వినమ్రులై రహస్యంగా వేడుకున్నప్పుడు, భూమి మరియు సముద్రాల చీకట్లనుండి మిమ్మల్ని కాపాడేది ఎవరు?" అని వారిని అడుగు.

قُلِ اللَّهُ يُنَجِّيكُم مِّنْهَا وَمِن كُلِّ كَرْبٍ ثُمَّ أَنتُمْ
تُشْرِكُونَ ﴿٦٤﴾

**64.** "అల్లాహ్ మాత్రమే మిమ్మల్ని దాని నుండి మరియు ప్రతి విపత్తునుండి కాపాడు తున్నాడు. అయినా మీరు ఆయనకు సాటి (భాగస్వాములు) కల్పిస్తున్నారు!" అని వారికి చెప్పు.

قُلْ هُوَ الْقَادِرُ عَلَىٰ أَن يَبْعَثَ عَلَيْكُمْ عَذَابًا مِّن
فَوْقِكُمْ أَوْ مِن تَحْتِ أَرْجُلِكُمْ أَوْ يَلْبِسَكُمْ شِيَعًا
وَيُذِيقَ بَعْضَكُم بَأْسَ بَعْضٍ انظُرْ كَيْفَ نُصَرِّفُ
الْآيَاتِ لَعَلَّهُمْ يَفْقَهُونَ ﴿٦٥﴾

**65.** ఇలా అను: "ఆయన మీ పైనుండి గానీ, లేదా మీ పాదాల క్రిందినుండి గానీ, మీపై ఆపద అవతరింపజేయగల సామర్థ్యం కలిగి ఉన్నాడు; మరియు మిమ్మల్ని తెగలుతెగలుగా చేసి, పరస్పర కలహాల రుచిచూపగలిగే (శక్తి కూడా) కలిగిఉన్నాడు."[1] చూడు! బహుశా వారు (సత్యాన్ని) గ్రహిస్తారేమోనని, మేము ఏ విధంగా మా సూచనలను వివిధ రూపాలలో వివరిస్తున్నామో!

وَكَذَّبَ بِهِ قَوْمُكَ وَهُوَ الْحَقُّ قُل لَّسْتُ عَلَيْكُم
بِوَكِيلٍ ﴿٦٦﴾

**66.** మరియు ఇది (ఈ ఖుర్ఆన్) సత్యమైనది అయినా నీ జాతివారు దీనిని అబద్ధమని నిరాకరించారు. వారితో ఇలా అను: "నేను మీ కొరకు బాధ్యుడను

---

**1.** దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'నేను మూడు దువాలు చేశాను: 1) నా ఉమ్మత్ నీటిలో ముంచబడి నాశనంచేయబడగూడదని. 2) కరువుకు గురిఅయి నాశనం చేయబడగూడదని, 3) వారు పరస్పరం యుద్ధాలు చేసుకోనగూడదని. అల్లాహ్ (సు.తా.) మొదటి రెండు దువాలు అంగీకరించాడు. కాని మూడవ దువానుండి నన్ను ఆపాడు. ('స'హీ'హ్ ముస్లిం, 2216) ఇంకా చూడండి, 35:43

(కార్యసాధకుడను) కాను![1]

67. ప్రతి వార్తకు (విషయానికి) ఒక గడువు నియమింపబడి ఉంది. మరియు త్వరలోనే మీరిది తెలుసుకోగలరు.

لِكُلِّ نَبَإٍ مُّسْتَقَرٌّ وَسَوْفَ تَعْلَمُونَ ﴿٦٧﴾

68. మరియు మా సూచన (ఆయాత్)లను గురించి వారు వృథామాటలు (దూషణలు) చేస్తూ ఉండటం నీవు చూస్తే, వారు తమ ప్రసంగం మార్చేవరకు నీవు వారినుండి దూరంగానే ఉండు. మరియు ఒకవేళ షై'తాన్ నిన్ను మరపింపజేస్తే! జ్ఞప్తికివచ్చిన తరువాత అలాంటి దుర్మార్గులైన వారితో కలసి కూర్చోకు.[2]

وَإِذَا رَأَيْتَ الَّذِينَ يَخُوضُونَ فِي آيَاتِنَا فَأَعْرِضْ عَنْهُمْ حَتَّىٰ يَخُوضُوا فِي حَدِيثٍ غَيْرِهِ ۚ وَإِمَّا يُنسِيَنَّكَ الشَّيْطَانُ فَلَا تَقْعُدْ بَعْدَ الذِّكْرَىٰ مَعَ الْقَوْمِ الظَّالِمِينَ ﴿٦٨﴾

69. మరియు దైవభీతి గలవారు, వారి (అవిశ్వాసుల) లెక్కకు ఏ మాత్రం బాధ్యులు కారు. కాని వారికి హితోపదేశం చేయటం, విశ్వాసుల (ధర్మం). బహుశా, వారు కూడా దైవభీతి గలవారు కావచ్చు!

وَمَا عَلَى الَّذِينَ يَتَّقُونَ مِنْ حِسَابِهِم مِّن شَيْءٍ وَلَٰكِن ذِكْرَىٰ لَعَلَّهُمْ يَتَّقُونَ ﴿٦٩﴾

70. మరియు తమ ధర్మాన్ని ఒక ఆటగా మరియు కాలక్షేపంగా భావించేవారిని నీవు వదలిపెట్టు. మరియు ఇహలోక జీవితం వారిని మోసపుచ్చింది. ఏ వ్యక్తి గానీ తన కర్మల ఫలితంగా నాశనం చేయబడకుండా ఉండటానికి దీని (ఈ ఖుర్ఆన్) ద్వారా హితోపదేశం చెయ్యి. అల్లాహ్ తప్ప, అతనికి రక్షించేవాడు గానీ, సిఫారసు చేసేవాడు గానీ, ఎవ్వడూ ఉండడు. మరియు అతడు ఎలాంటి పరిహారం ఇవ్వదలచుకున్నా అది అంగీకరించబడదు. ఇలాంటి వారే తమ కర్మల ఫలితంగా నాశనం చేయబడే వారు. వారికి తమ సత్యతిరస్కారానికి

وَذَرِ الَّذِينَ اتَّخَذُوا دِينَهُمْ لَعِبًا وَلَهْوًا وَغَرَّتْهُمُ الْحَيَاةُ الدُّنْيَا ۚ وَذَكِّرْ بِهِ أَن تُبْسَلَ نَفْسٌ بِمَا كَسَبَتْ لَيْسَ لَهَا مِن دُونِ اللَّهِ وَلِيٌّ وَلَا شَفِيعٌ وَإِن تَعْدِلْ كُلَّ عَدْلٍ لَّا يُؤْخَذْ مِنْهَا ۗ أُولَٰئِكَ الَّذِينَ أُبْسِلُوا بِمَا كَسَبُوا ۖ لَهُمْ شَرَابٌ مِّنْ حَمِيمٍ وَعَذَابٌ أَلِيمٌ بِمَا كَانُوا يَكْفُرُونَ ﴿٧٠﴾

1. అంటే అల్లాహ్ (సు.తా.) సందేశాన్ని మీకు యావత్తు అందజేయుటమే నా పని. కాని మిమ్మల్ని దాన్నిపై అమలుచేసేటట్లు చేయడం నా(స'అస) పని కాదు. చూడండి 18:29
2. చూడండి, 4:140

ఫలితంగా, త్రాగటానికి సలసలకాగే నీరు మరియు బాధాకరమైన శిక్ష గలవు.

**71.** (ఓ ము'హమ్మద్!) వారితో అను: "ఏమీ? అల్లాహ్‌ను వదలి మాకు లాభం గానీ, నష్టం గానీ కలిగించలేని వారిని మేము ప్రార్థించాలా? మరియు అల్లాహ్ మార్గ దర్శకత్వం దొరికిన తరువాత కూడా మా మడమలపై వెనుదిరిగి పోవాలా? అతనివలే ఎవడైతే తన సహచరులు సన్మార్గం వైపుకు పిలుస్తూ, 'మా వైపుకురా!' అంటున్నా - షై'తాన్ మోసపుచ్చటం వలన - భూమిలో ఏమీ తోచకుండా, తిరుగుతాడో?"[1] వారితో అను: "నిశ్చయంగా, అల్లాహ్ మార్గ దర్శకత్వమే నిజమైన మార్గదర్శకత్వము.[2] మరియు మేము సర్వలోకాల ప్రభువునకు విధేయులం (ముస్లింల)గా ఉండాలని ఆజ్ఞాపించబడ్డాము:

قُلْ أَنَدْعُوا مِن دُونِ اللَّهِ مَا لَا يَنفَعُنَا وَلَا يَضُرُّنَا وَنُرَدُّ عَلَىٰ أَعْقَابِنَا بَعْدَ إِذْ هَدَانَا اللَّهُ كَالَّذِي اسْتَهْوَتْهُ الشَّيَاطِينُ فِي الْأَرْضِ حَيْرَانَ لَهُ أَصْحَابٌ يَدْعُونَهُ إِلَى الْهُدَى ائْتِنَا ۗ قُلْ إِنَّ هُدَى اللَّهِ هُوَ الْهُدَىٰ ۖ وَأُمِرْنَا لِنُسْلِمَ لِرَبِّ الْعَالَمِينَ ﴿٧١﴾

**72.** "మరియు నమా'జ్‌ను స్థాపించమని మరియు ఆయన యందు భయభక్తులు కలిగి ఉండమని కూడా.[3] మరియు మీరంతా ఆయన (అల్లాహ్) సమక్షంలో జమచేయబడతారు."

وَأَنْ أَقِيمُوا الصَّلَاةَ وَاتَّقُوهُ ۚ وَهُوَ الَّذِي إِلَيْهِ تُحْشَرُونَ ﴿٧٢﴾

**73.** మరియు ఆకాశాలను మరియు భూమిని నిజానికి[4] సృష్టించింది ఆయనే! మరియు ఆ రోజు ఆయన: "అయిపో." అని అనగానే, అది అయిపోతుంది. ఆయన మాటే సత్యం! మరియు బాకా ('సూర్) ఊదబడే రోజు,[5]

وَهُوَ الَّذِي خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ بِالْحَقِّ ۖ وَيَوْمَ يَقُولُ كُن فَيَكُونُ ۚ قَوْلُهُ الْحَقُّ ۚ وَلَهُ الْمُلْكُ يَوْمَ يُنفَخُ فِي الصُّورِ ۚ عَالِمُ الْغَيْبِ وَالشَّهَادَةِ ۚ وَهُوَ الْحَكِيمُ الْخَبِيرُ ﴿٧٣﴾

---

1. చూడండి, 2:14, 14:22 మరియు 15:17.
2. చూడండి, 16:37.
3. చూడండి, 2: 45
4. అంటే ఒక ఉద్దేశంతో
5. 'హదీస్'లో ఇలా ఉంది: ఇస్రాఫీల్ ('అ.స.) కొమ్ము (బాకా)ను తన నోటిలో పెట్టుకొని, తలవంచి, దానిని ఊదటానికి అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ కొరకు వేచి ఉంటారు. (ఇబ్నె కసీ'ర్, అబూ-దావూద్, తిర్మిజీ', 'హదీస్' నం. 4742, 4030, 3244). 'సూరున్: Trumpet. బాకా, కొమ్ము, తుత్తార, శంఖం

సార్వభౌమాధికారం ఆయనదే. ఆయనే అగోచర మరియు గోచర విషయాలన్నీ తెలిసినవాడు. మరియు ఆయన మహా వివేచనాపరుడు, సర్వం తెలిసినవాడు. (3/4)

وَإِذْ قَالَ إِبْرَٰهِيمُ لِأَبِيهِ ءَازَرَ أَتَتَّخِذُ أَصْنَامًا ءَالِهَةً ۖ إِنِّىٓ أَرَىٰكَ وَقَوْمَكَ فِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٧٤﴾

**74.** * (జ్ఞాపకం చేసుకోండి!) ఇబ్రాహీమ్ తన తండ్రి ఆ'జర్‌తో ఇలా అన్న విషయం: "ఏమీ? నీవు విగ్రహాలను ఆరాధ్య దైవాలుగా చేసుకుంటున్నావా? నిశ్చయంగా నేను, నిన్ను మరియు నీ జాతి వారిని స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో ఉన్నవారిగా చూస్తున్నాను!"[1]

وَكَذَٰلِكَ نُرِىٓ إِبْرَٰهِيمَ مَلَكُوتَ ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ وَلِيَكُونَ مِنَ ٱلْمُوقِنِينَ ﴿٧٥﴾

**75.** మరియు ఈ విధంగా దృఢనమ్మకం ఉన్నవారిలో చేరాలని, మేము ఇబ్రాహీమ్‌కు భూమ్యాకాశాలపై ఉన్న మా సామ్రాజ్య వ్యవస్థను చూపించాము.

فَلَمَّا جَنَّ عَلَيْهِ ٱلَّيْلُ رَءَا كَوْكَبًا ۖ قَالَ هَـٰذَا رَبِّى ۖ فَلَمَّآ أَفَلَ قَالَ لَآ أُحِبُّ ٱلْـَٔافِلِينَ ﴿٧٦﴾

**76.** ఆ పిదప రాత్రి చీకటి అతనిపై క్రమ్ముకున్నప్పుడు, అతను ఒక నక్షత్రాన్ని చూసి: "ఇది నా ప్రభువు!" అని అన్నాడు. కాని, అది అస్తమించగానే: "అస్తమించే వాటిని నేను ప్రేమించను!" అని అన్నాడు.

فَلَمَّا رَءَا ٱلْقَمَرَ بَازِغًا قَالَ هَـٰذَا رَبِّى ۖ فَلَمَّآ أَفَلَ قَالَ لَئِن لَّمْ يَهْدِنِى رَبِّى لَأَكُونَنَّ مِنَ ٱلْقَوْمِ ٱلضَّآلِّينَ ﴿٧٧﴾

**77.** ఆ తరువాత ఉదయించే చంద్రుణ్ణి చూసి: "ఇది నా ప్రభువు!" అని అన్నాడు. కాని అది అస్తమించగానే, ఒకవేళ నా ప్రభువు నాకు సన్మార్గం చూపకపోతే నేను నిశ్చయంగా, మార్గభ్రష్టులైన వారిలో చేరిపోయేవాడను!" అని అన్నాడు

فَلَمَّا رَءَا ٱلشَّمْسَ بَازِغَةً قَالَ هَـٰذَا رَبِّى هَـٰذَآ أَكْبَرُ ۖ فَلَمَّآ أَفَلَتْ قَالَ يَـٰقَوْمِ إِنِّى بَرِىٓءٌ مِّمَّا تُشْرِكُونَ ﴿٧٨﴾

**78.** ఆ తరువాత ఉదయించే సూర్యుణ్ణి చూసి: "ఇది నా ప్రభువు, ఇది అన్నిటికంటే పెద్దగా ఉంది!" అని అన్నాడు. కాని అది కూడా అస్తమించగానే: "ఓ నాజాతి ప్రజలారా

---

1. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం-4, 'హదీస్' నం. 569.

మీరు అల్లాహ్‌కు సాటి (భాగస్వామ్యము) కల్పించే దానితో వాస్తవంగా నాకెలాంటి సంబంధం లేదు!" అని అన్నాడు.

**79.** (ఇంకా ఇలా అన్నాడు): "నిశ్చయంగా నేను ఏక దైవసిద్ధాంతం (సత్యధర్మం) పాటించేవాడనై, నాముఖాన్ని భూమ్యాకాశాల సృష్టికి మూలాధారి అయిన ఆయన (అల్లాహ్) వైపునకే త్రిప్పుకుంటున్నాను మరియు నేను అల్లాహ్‌కు సాటి (భాగస్వాములు) కల్పించేవారిలో చేరినవాడను కాను."

إِنِّي وَجَّهْتُ وَجْهِيَ لِلَّذِي فَطَرَ السَّمَاوَاتِ وَالْأَرْضَ
حَنِيفًا ۖ وَمَا أَنَا مِنَ الْمُشْرِكِينَ ﴿٧٩﴾

**80.** మరియు అతని జాతివారు అతనితో వాదులాటకు దిగగా! అతను వారితో అన్నాడు: "ఏమీ? మీరు నాతో అల్లాహ్ విషయంలో వాదిస్తున్నారా? వాస్తవానికి ఆయనే నాకు సన్మార్గం చూపించాడు. మరియు మీరు ఆయనకు సాటి (భాగస్వాములుగా) కల్పించిన వాటికి నేను భయపడను. నా ప్రభువు ఇచ్ఛలేనిది, ఏదీ సంభవించదు). నా ప్రభువు సకల వస్తువులను (తన) జ్ఞానంతో ఆవరించి వున్నాడు. ఏమీ? మీరిది గ్రహించలేరా?

وَحَاجَّهُ قَوْمُهُ ۚ قَالَ أَتُحَاجُّونِّي فِي اللَّهِ وَقَدْ
هَدَانِ ۚ وَلَا أَخَافُ مَا تُشْرِكُونَ بِهِ إِلَّا أَن يَشَاءَ رَبِّي
شَيْئًا ۗ وَسِعَ رَبِّي كُلَّ شَيْءٍ عِلْمًا ۗ أَفَلَا تَتَذَكَّرُونَ ﴿٨٠﴾

**81.** "మరియు మీరు అల్లాహ్‌కు సాటిగా (భాగస్వాములుగా) కల్పించిన వాటికి నేనెలా భయపడాలి? వాస్తవానికి, ఆయన మీకు ఏ విధమైన ప్రమాణం ఇవ్వనిదే, మీరు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పించి కూడా భయపడటం లేదే? కావున ఈ రెండు పక్షాల వారిలో ఎవరు శాంతి పొందటానికి అర్హులో! మీకు తెలిస్తే చెప్పండి?"

وَكَيْفَ أَخَافُ مَا أَشْرَكْتُمْ وَلَا تَخَافُونَ أَنَّكُمْ
أَشْرَكْتُم بِاللَّهِ مَا لَمْ يُنَزِّلْ بِهِ عَلَيْكُمْ سُلْطَانًا ۚ فَأَيُّ
الْفَرِيقَيْنِ أَحَقُّ بِالْأَمْنِ ۖ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿٨١﴾

**82** ఎవరైతే విశ్వసించి, తమ విశ్వాసాన్ని షిర్క్‌తో[1] కలుషితంచేయరో! అలాంటి వారికే

الَّذِينَ آمَنُوا وَلَمْ يَلْبِسُوا إِيمَانَهُم بِظُلْمٍ أُولَٰئِكَ
لَهُمُ الْأَمْنُ وَهُم مُّهْتَدُونَ ﴿٨٢﴾

---

1 ఇక్కడ "జుల్మ్ అంటే షిర్క్ అని అర్థం చూడండి. 31:13 'నిశ్చయంగా, షిర్క్

శాంతి ఉంది. మరియు వారే సన్మార్గంలో ఉన్నవారు.

**83.** మరియు ఇదే మా వాదన, దానిని మేము ఇబ్రాహీమ్‌కు, తన జాతివారికి వ్యతిరేకంగా ఇచ్చాము. మేము కోరినవారికి ఉన్నతస్థానాలను ప్రసాదిస్తాము.[1] నిశ్చయంగా నీ ప్రభువు మహా వివేచనాపరుడు, సర్వజ్ఞుడు (జ్ఞానసంపన్నుడు).

وَتِلْكَ حُجَّتُنَآ ءَاتَيْنَٰهَآ إِبْرَٰهِيمَ عَلَىٰ قَوْمِهِۦ ۚ نَرْفَعُ دَرَجَٰتٍ مَّن نَّشَآءُ ۗ إِنَّ رَبَّكَ حَكِيمٌ عَلِيمٌ ﴿٨٣﴾

**84.** మరియు మేము అతనికి (ఇబ్రాహీమ్‌కు) ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌లను ప్రసాదించాము.[2] ప్రతి ఒక్కరికీ సన్మార్గం చూపాము. అంతకు పూర్వం నూ'హ్‌కు సన్మార్గం చూపాము. మరియు అతని సంతతిలోనివారైన దావూద్, సులైమాన్, అయ్యూబ్, యూసుఫ్, మూసా మరియు హారూన్‌లకు మేము (సన్మార్గం చూపాము). మరియు ఈ విధంగా మేము సజ్జనులకు తగిన ప్రతిఫలం ఇస్తాము.

وَوَهَبْنَا لَهُۥٓ إِسْحَٰقَ وَيَعْقُوبَ ۚ كُلًّا هَدَيْنَا ۚ وَنُوحًا هَدَيْنَا مِن قَبْلُ ۖ وَمِن ذُرِّيَّتِهِۦ دَاوُۥدَ وَسُلَيْمَٰنَ وَأَيُّوبَ وَيُوسُفَ وَمُوسَىٰ وَهَٰرُونَ ۚ وَكَذَٰلِكَ نَجْزِى ٱلْمُحْسِنِينَ ﴿٨٤﴾

**85.** మరియు 'జకరియ్యా, య'హ్యా, 'ఈసా మరియు ఇల్యాస్‌లకు[3] కూడా (సన్మార్గం చూపాము). వారిలో ప్రతి ఒక్కరూ సద్వర్తనులే!

وَزَكَرِيَّا وَيَحْيَىٰ وَعِيسَىٰ وَإِلْيَاسَ ۖ كُلٌّ مِّنَ ٱلصَّٰلِحِينَ ﴿٨٥﴾

**86.** మరియు ఇస్మా'యీల్, అల్-యస'అ యూనుస్ మరియు లూ'త్‌లకు[4] కూడా (సన్మార్గం

وَإِسْمَٰعِيلَ وَٱلْيَسَعَ وَيُونُسَ وَلُوطًا ۚ وَكُلًّا فَضَّلْنَا عَلَى ٱلْعَٰلَمِينَ ﴿٨٦﴾

---

(బహుదైవారాధన) గొప్ప దుర్మార్గం.' ('స'హీ'హ్ బు'ఖారీ, తఫ్సీర్ సూరతుల్ అన్'ఆమ్)

1. చూడండి, 4:125

2. చూడండి, 11:71

3 చూడండి, 37:123 ఇల్యాస్ (Elijah) ('అ.స.), హారూన్ ('అ.స.) సంతతికి చెందిన వారు. అతని నివాసం బఅల్‌బక్ నగరం. ఇల్యాస్ (ఏలియా) హెబ్రూ (యూదుల) ప్రవక్త. ఇతను ఫలస్తీన్ ఉత్తర భాగంలో అహాబ్ మరియు అహాజియా రాజుల కాలంలో ఉన్నారు, (దాదాపు 9వ క్రీ. శకానికి ముందు). ఇతనితరువాత అల్-యస'అ (Elisha, 'అ.స.) ప్రవక్తగా వచ్చారు.

4 లూ'త్ ('అ.స.) ఇబ్రాహీమ్ ('అ.స.) సోదరుడైన హారాన బిన్ ఆజర్ కుమారుడు. ఇబ్రాహీం ('అ.స.), లూ'త్ ('అ.స.) యొక్క చిన్నాన్న. కాని అతను కూడా ఇబ్రాహీం ('అ.స.) యొక్క సంతతిలోని వారిగా పరిగణించబడ్డారు. ఖుర్ఆన్‌లో ఇటువంటి ఉదాహరణ మరొకటి ఉంది.

చూపాము). ప్రతి ఒక్కరికీ (వారి కాలంవు) సర్వలోకాల వాసులపై ఘనతను ప్రసాదించాము

**87.** మరియు వారిలోనుండి కొందరి తండ్రి తాతలకు, వారి సంతానానికి మరియు వారి సోదరులకు కూడా మేము (సన్మార్గం చూపాము). మేము వారిని (మా సేవకొరకు) ఎన్నుకొని, వారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేశాము.

وَمِنْ آبَائِهِمْ وَذُرِّيَّاتِهِمْ وَإِخْوَانِهِمْ وَاجْتَبَيْنَاهُمْ وَهَدَيْنَاهُمْ إِلَىٰ صِرَاطٍ مُّسْتَقِيمٍ ۝

**88.** ఇదే అల్లాహ్ మార్గదర్శకత్వం. దీని ద్వారా ఆయన తన దాసులలో తానుకోరిన వారికి సన్మార్గం చూపుతాడు. ఒకవేళ వారు అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పిస్తే, వారు చేసిన సత్కార్యాలన్నీ వృథాఅయిపోయేవి![1]

ذَٰلِكَ هُدَى اللَّهِ يَهْدِي بِهِ مَن يَشَاءُ مِنْ عِبَادِهِ وَلَوْ أَشْرَكُوا لَحَبِطَ عَنْهُم مَّا كَانُوا يَعْمَلُونَ ۝

**89.** వీరే, మేము గ్రంథాన్ని, వివేకాన్ని మరియు ప్రవక్త పదవిని ప్రసాదించిన వారు. కాని వారు దీనిని (ఈ గ్రంథాన్ని / ప్రవక్తపదవిని) తిరస్కరించినందుకు! వాస్తవానికి మేము, దీనిని ఎన్నడూ తిరస్కరించని ఇతర ప్రజలను దీనికి కార్యకర్తలుగా నియమించాము.[2]

أُولَٰئِكَ الَّذِينَ آتَيْنَاهُمُ الْكِتَابَ وَالْحُكْمَ وَالنُّبُوَّةَ فَإِن يَكْفُرْ بِهَا هَٰؤُلَاءِ فَقَدْ وَكَّلْنَا بِهَا قَوْمًا لَّيْسُوا بِهَا بِكَافِرِينَ ۝

**90.** ఇలాంటి వారే అల్లాహ్ మార్గదర్శకత్వం పొందినవారు. కావున నీవు వారి మార్గాన్నే అనుసరించు. వారితో ఇలా అను: "నేను దీనికి బదులుగా మీనుంచి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగను. ఇది కేవలం సర్వ లోకాల

أُولَٰئِكَ الَّذِينَ هَدَى اللَّهُ فَبِهُدَاهُمُ اقْتَدِهْ قُل لَّا أَسْأَلُكُمْ عَلَيْهِ أَجْرًا إِنْ هُوَ إِلَّا ذِكْرَىٰ لِلْعَالَمِينَ ۝

---

ఇస్మా'యీల్ ('అ.స.) య'అఖూబ్ ('అ.స.) యొక్క తండ్రిగా పరిగణించబడ్డారు. వాస్తవానికి అతను, య'అఖూబ్ ('అ.స.) యొక్క పెద్దనాన్న (Uncle). ఇంకా చూడండి, 2:133

1 ఇక్కడ అల్లాహ్ (సు.తా.), 18 మంది ప్రవక్తలను పేర్కొని: "వారు షిర్క్‌చేసి ఉంటే వారి సత్కార్యాలు వృథాఅయిపోయేవి." అని అన్నాడు. ఇదేవిధంగా అల్లాహుతా'ఆలా ము'హమ్మద్('స'అస)ను సంబోధించి అన్నదానికి చూడండి, 39:65

2. ఈ కార్యకర్తలు అంటే దైవప్రవక్త ('స'అస) యొక్క అనుచరు(రా'ది'అన్హుమ్)లు మరియు తరువాత వచ్చే విశ్వాసులు అని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.

(వారి) కొరకు ఒక హితోపదేశం మాత్రమే."

وَمَا قَدَرُوا اللَّهَ حَقَّ قَدْرِهِۦٓ إِذْ قَالُوا مَآ أَنزَلَ اللَّهُ عَلَىٰ بَشَرٍ مِّن شَىْءٍ ۗ قُلْ مَنْ أَنزَلَ الْكِتَٰبَ الَّذِى جَآءَ بِهِۦ مُوسَىٰ نُورًا وَهُدًى لِّلنَّاسِ ۖ تَجْعَلُونَهُۥ قَرَاطِيسَ تُبْدُونَهَا وَتُخْفُونَ كَثِيرًا ۖ وَعُلِّمْتُم مَّا لَمْ تَعْلَمُوٓا أَنتُمْ وَلَآ ءَابَآؤُكُمْ ۖ قُلِ اللَّهُ ۖ ثُمَّ ذَرْهُمْ فِى خَوْضِهِمْ يَلْعَبُونَ ﴿٩١﴾

**91.** మరియు వారు: "అల్లాహ్, ఏ మానవుని పైననూ ఏమీ అవతరింపజేయలేదు."[1] అని పలికినప్పుడు, వారు (అవిశ్వాసులు) అల్లాహ్‌ను గురించి తగురీతిలో అంచనావేయలేదు. వారితో ఇలా అను: "అయితే! మానవులకు జ్యోతి మరియు మార్గదర్శిని అయిన గ్రంథాన్ని, మూసాపై ఎవరు అవతరింపజేశారు? దానిని మీరు (యూదులు) విడిపత్రాలుగా చేసి (దానిలోని కొంతభాగాన్ని) చూపుతున్నారు మరియు చాలా భాగాన్ని దాస్తున్నారు. మరియు దానినుండి మీకూ మరియు మీ తండ్రితాతలకూ తెలియని విషయాల జ్ఞానం ఇవ్వబడింది కదా?" ఇంకా ఇలా అను: "అల్లాహ్‌యే (దానిని అవతరింపజేశాడు)." ఆ పిదప వారిని, వారి పనికిమాలిన వివాదంలో పడి ఆడుకోనివ్వు!

وَهَٰذَا كِتَٰبٌ أَنزَلْنَٰهُ مُبَارَكٌ مُّصَدِّقُ الَّذِى بَيْنَ يَدَيْهِ وَلِتُنذِرَ أُمَّ الْقُرَىٰ وَمَنْ حَوْلَهَا ۚ وَالَّذِينَ يُؤْمِنُونَ بِالْءَاخِرَةِ يُؤْمِنُونَ بِهِۦ ۖ وَهُمْ عَلَىٰ صَلَاتِهِمْ يُحَافِظُونَ ﴿٩٢﴾

**92.** మరియు మేము అవతరింపజేసిన ఈ గ్రంథం (ఖుర్ఆన్) ఎన్నో శుభాలు గలది. ఇది ఇంతకు పూర్వం వచ్చిన గ్రంథాలలో మిగిలి ఉన్న సత్యాలను ధృవపరుస్తోంది. మరియు ఇది ఉమ్ముల్ ఖురా (మక్కా)[2] మరియు దాని చుట్టుప్రక్కలలో ఉన్నవారిని హెచ్చరించటానికి అవతరింపజేయబడింది. మరియు పరలోకము నందు విశ్వాసమున్న వారు దీనిని (ఈ గ్రంథాన్ని) విశ్వసిస్తారు. మరియు వారు తమ నమా'జ్‌లను క్రమబద్ధంగా పాటిస్తారు.

وَمَنْ أَظْلَمُ مِمَّنِ افْتَرَىٰ عَلَى اللَّهِ كَذِبًا أَوْ قَالَ

**93.** మరియు అల్లాహ్‌పై అబద్ధపు నింద మోపేవానికంటే, లేదా తనపై ఏ దివ్య

1. చూడండి, 10:2 మరియు 17:94
2. అదే అల్లాహ్ (సు.తా.) ఆరాధన కొరకు మొట్టమొదట నిర్మించబడిన ఆలయం క'అబహ్. అదే ఖిబ్లా. అదే మక్కా ('తబరీ, ఇబ్నె 'అబ్బాస్ ర'ది.'అ. కథనం ఆధారంగా) చూడండి, 3:96

జ్ఞానం (వ'హీ) అవతరించక పోయినప్పటికీ: "నాపై దివ్యజ్ఞానం అవతరింపజేయబడింది." అని చెప్పే వానికంటే, లేదా: "అల్లాహ్ అవతరింపజేసినటువంటి విషయాలను నేను కూడా అవతరింపజేయగలను." అని పలికే వానికంటే, మించిన దుర్మార్గుడు ఎవడు? దుర్మార్గులు మరణవేదనలో ఉన్నప్పుడు దేవదూతలు తమ చేతులుచాచి: "మీ ప్రాణాలను వదలండి! అల్లాహ్‌పై అసత్యాలు పలుకుతూ ఉన్నందు వలన మరియు ఆయన సూచనల పట్ల అనాదరణ చూపటం వలన, ఈ రోజు మీకు అవమానకరమైన శిక్ష విధించబడుతుంది!"[1] అని అంటూ ఉండే దృశ్యాన్ని నీవు చూడ గలిగితే ఎంత బాగుండేది![2]

أُوحِيَ إِلَيَّ وَلَمْ يُوحَ إِلَيْهِ شَيْءٌ وَمَن قَالَ سَأُنزِلُ مِثْلَ مَا أَنزَلَ اللَّهُ ۗ وَلَوْ تَرَىٰ إِذِ الظَّالِمُونَ فِي غَمَرَاتِ الْمَوْتِ وَالْمَلَائِكَةُ بَاسِطُو أَيْدِيهِمْ أَخْرِجُوا أَنفُسَكُمُ ۖ الْيَوْمَ تُجْزَوْنَ عَذَابَ الْهُونِ بِمَا كُنتُمْ تَقُولُونَ عَلَى اللَّهِ غَيْرَ الْحَقِّ وَكُنتُمْ عَنْ آيَاتِهِ تَسْتَكْبِرُونَ ﴿٩٣﴾

**94.** మరియు వాస్తవంగా, మేము మొదటి సారి మిమ్మల్ని పుట్టించినట్లే, మీరిప్పుడు మా వద్దకు ఒంటరిగా వచ్చారు. మరియు మేము ఇచ్చినదంతా, మీరు మీ వీపులవెనుక వదలివచ్చారు. మరియు మీరు అల్లాహ్‌కు సాటిగా (భాగస్వాములుగా) కల్పించిన మీ సిఫారసుదారులను, మేము మీతో పాటు చూడటంలేదే! వాస్తవంగా ఇప్పుడు మీ మధ్య ఉన్న సంబంధాలన్నీ తెగిపోయాయి మరియు మీ భ్రమలన్నీ మిమ్మల్ని త్యజించాయి (7/8)

وَلَقَدْ جِئْتُمُونَا فُرَادَىٰ كَمَا خَلَقْنَاكُمْ أَوَّلَ مَرَّةٍ وَتَرَكْتُم مَّا خَوَّلْنَاكُمْ وَرَاءَ ظُهُورِكُمْ ۖ وَمَا نَرَىٰ مَعَكُمْ شُفَعَاءَكُمُ الَّذِينَ زَعَمْتُمْ أَنَّهُمْ فِيكُمْ شُرَكَاءُ ۚ لَقَد تَّقَطَّعَ بَيْنَكُمْ وَضَلَّ عَنكُم مَّا كُنتُمْ تَزْعُمُونَ ﴿٩٤﴾

**95.** * నిశ్చయంగా, ధాన్యమును మరియు ఖర్జూరపు బీజాన్ని చీల్చి (మొలకెత్తజేసేవాడు) అల్లాహ్ మాత్రమే. ఆయనే సజీవమైన దానిని, నిర్జీవమైనదాని నుండి తీస్తాడు, మరియు

إِنَّ اللَّهَ فَالِقُ الْحَبِّ وَالنَّوَىٰ ۖ يُخْرِجُ الْحَيَّ مِنَ الْمَيِّتِ وَمُخْرِجُ الْمَيِّتِ مِنَ الْحَيِّ ۚ ذَٰلِكُمُ اللَّهُ ۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٩٥﴾

1 ఇక్కడ పేర్కొన్న శిక్ష చనిపోయిన తరువాత మరియు పునరుత్థాన దినానికి ముందు ఉండే బ'ర్జ'ఖ్ కాలంలో ఇవ్వబడే శిక్ష.

2. చూడండి, 'స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం 2, 'హదీస్' నం. 450 మరియు 422

నిర్జీవమైన దానిని సజీవమైనదాని నుండి తీస్తాడు. ఆయనే, అల్లాహ్! అయితే మీరు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?

فَالِقُ الْإِصْبَاحِ وَجَعَلَ اللَّيْلَ سَكَنًا وَالشَّمْسَ وَالْقَمَرَ حُسْبَانًا ۚ ذَٰلِكَ تَقْدِيرُ الْعَزِيزِ الْعَلِيمِ ﴿٩٦﴾

**96.** ఆయనే (రాత్రి చీకటిని) చీల్చి ఉదయాన్ని తెచ్చేవాడు మరియు రాత్రిని విశ్రాంతి కొరకు చేసినవాడు మరియు సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి (కాల) గణన కొరకు నియమించిన వాడు.[1] ఇవన్నీ ఆ సర్వశక్తిమంతుని, సర్వజ్ఞుని, నియామకాలే!

وَهُوَ الَّذِي جَعَلَ لَكُمُ النُّجُومَ لِتَهْتَدُوا بِهَا فِي ظُلُمَاتِ الْبَرِّ وَالْبَحْرِ ۗ قَدْ فَصَّلْنَا الْآيَاتِ لِقَوْمٍ يَعْلَمُونَ ﴿٩٧﴾

**97.** మరియు ఆయనే మీ కొరకు చీకట్లలో - భూమి మీద మరియు సముద్రంలో - మార్గాలను తెలుసుకోవటానికి, నక్షత్రాలను పుట్టించాడు.[2] వాస్తవానికి, ఈ విధంగా మేము జ్ఞానవంతులకొరకు మా సూచనలను వివరించి తెలిపాము.

وَهُوَ الَّذِي أَنشَأَكُم مِّن نَّفْسٍ وَاحِدَةٍ فَمُسْتَقَرٌّ وَمُسْتَوْدَعٌ ۗ قَدْ فَصَّلْنَا الْآيَاتِ لِقَوْمٍ يَفْقَهُونَ ﴿٩٨﴾

**98.** మరియు ఆయనే మిమ్మల్ని ఒకే వ్యక్తి (ప్రాణి) నుండి పుట్టించి, తరువాత నివాసం మరియు సేకరించబడే స్థలం[3] నియమించాడు. వాస్తవంగా, అర్థంచేసుకునే వారికి ఈ విధంగా మేము మా సూచనలను వివరించాము.

---

1. చూడండి, 7:54, 10:5, 36:40.

2 నక్షత్రాలను గురించి అల్లాహ్ (సు.తా.) యొక్క మూడు ఆదేశాలను అబూ ఖతాదా (ర'ది.'అ.) ఇలా వివరించారు: 1) దగ్గరి ఆకాశాన్ని మేము నక్షత్రాలతో అలంకరించాము (67:5), 2) షై'తానులను తరిమే కొరవిగా మరియు 3) ఈ ఆయత్‌లో చెప్పింది - చీకట్లలో మార్గాలు తెలుసుకోవటానికి. కావున నక్షత్రాలలో ఎవరైనా ఈ మూడు తప్ప ఇతర ఉపయోగాలను వెతికితే! వారు తప్పుదారిలో పడ్డవారే (స'హీ'హ్ బు'ఖారీ, పుస్తకం 4) ఇంకా చూడండి, అబూ దావూద్ 'హదీస్' నం. 3905 కాబట్టి నక్షత్రాల ద్వారా భవిష్యత్తు చెప్పడం మొదలైనవి ఊహాగానాలే. అవి షరీ'అత్‌కు విరుద్ధమైనవి. కావున వీటిని మంత్రజాలపు ఒక భాగంగా పేర్కొనబడింది.

3 ముస్తఖ్రున్: నివాసం. ముస్తౌద'ఉన్: కూడబెట్టబడే స్థలం,కొట్టు,గిడ్డంగి లేక సేకరించబడే స్థలం. వ్యాఖ్యాతలు ముస్తఖ్రున్ అంటే తల్లి గర్భకోశం, లేక భూమి, అని మరియు ముస్తౌద'ఉన్ అంటే తండ్రి నడుము/రొండి, లేక గోరి సమాధి అని అభిప్రాయపడ్డారు.

**99.** మరియు ఆయనే ఆకాశం నుండి వర్షాన్ని కురిపించాడు. తరువాత దాని ద్వారా మేము సర్వరకాల వృక్షకోటిని ఉద్భవింప జేశాము.[1] మరియు దానినుండి మేము పచ్చని పైరును పండించాము. వాటిలో దట్టమైన గింజలను పుట్టించాము. మరియు ఖర్జూరపుచెట్ల గెలలనుండి క్రిందికి వ్రేలాడుతున్న పండ్లగుత్తులను, ద్రాక్ష, జైతూన్ మరియు దానిమ్మ తోటలను (పుట్టించాము) వాటిలో కొన్ని ఒకదానినొకటి పోలిఉంటాయి, మరికొన్ని ఒకదానినొకటి పోలిఉండవు.[2] ఫలించినప్పుడు వాటి ఫలాలను మరియు వాటి పరిపక్వాన్ని గమనించండి. నిశ్చయంగా, వీటిలో విశ్వసించే వారికి సూచనలున్నాయి.

وَهُوَ الَّذِيٓ أَنزَلَ مِنَ السَّمَآءِ مَآءً فَأَخْرَجْنَا بِهِۦ
نَبَاتَ كُلِّ شَيْءٍ فَأَخْرَجْنَا مِنْهُ خَضِرًا نُّخْرِجُ مِنْهُ حَبًّا
مُّتَرَاكِبًا وَمِنَ النَّخْلِ مِن طَلْعِهَا قِنْوَانٌ دَانِيَةٌ
وَجَنَّٰتٍ مِّنْ أَعْنَابٍ وَالزَّيْتُونَ وَالرُّمَّانَ مُشْتَبِهًا
وَغَيْرَ مُتَشَٰبِهٍ ۗ انظُرُوٓا۟ إِلَىٰ ثَمَرِهِۦٓ إِذَآ أَثْمَرَ
وَيَنْعِهِۦٓ ۚ إِنَّ فِي ذَٰلِكُمْ لَأٓيَٰتٍ لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿٩٩﴾

**100.** మరియు వారు, ఆయన (అల్లాహ్) సృష్టించిన జిన్నాతులను, అల్లాహ్‌కే సాటిగా (భాగస్వాములుగా) కల్పిస్తున్నారు మూర్ఖత్వంతో ఆయనకు కుమారులు, కుమార్తెలు ఉన్నారని ఆరోపిస్తున్నారు.[3] ఆయన సర్వలోపాలకు అతీతుడు. వారి ఈ కల్పనలకు మహోన్నతుడు.[4]

وَجَعَلُوا۟ لِلَّهِ شُرَكَآءَ الْجِنَّ وَخَلَقَهُمْ ۖ وَخَرَقُوا۟ لَهُۥ
بَنِينَ وَبَنَٰتٍۭ بِغَيْرِ عِلْمٍ ۚ سُبْحَٰنَهُۥ وَتَعَٰلَىٰ عَمَّا يَصِفُونَ ﴿١٠٠﴾

**101.** ఆయనే ఆకాశాలను మరియు భూమిని ఏ నమూనా లేకుండా ఆరంభించిన వాడు.[5] నిశ్చయంగా, ఆయనకు జీవన సహవాసి (భార్య)యే లేనప్పుడు ఆయనకు కొడుకు

بَدِيعُ السَّمَٰوَٰتِ وَالْأَرْضِ ۖ أَنَّىٰ يَكُونُ لَهُۥ وَلَدٌ
وَلَمْ تَكُن لَّهُۥ صَٰحِبَةٌ ۖ وَخَلَقَ كُلَّ شَيْءٍ ۖ وَهُوَ
بِكُلِّ شَيْءٍ عَلِيمٌ ﴿١٠١﴾

1 ప్రతి జీవిని అల్లాహ్ (సు.తా.) నీటినుండి పుట్టించాడు చూడండి, 21:30

2 అంటే కొన్ని విషయాలలో అవి ఒకదానినొకటి పోలి ఉన్నా, ఇతర విషయాలలో వాటి మధ్య పోలికలు ఉండవు. అంటే వాటి ఆకులు పోలి ఉండవచ్చు, కాని వాటి ఫలాల, రుచి, రంగు మరియు వాసన పరిమాణాల విషయంలో వేరుగా ఉండవచ్చు ఉదా: వేర్వేరు రకాల మామిడి పండ్లు.

3 చూడండి, 19:92

4. సుబ్‌హాన సర్వలోపాలకు అతీతుడు, చూడండి, 2:32, 42:11 మరియు 112:4

5. బదీ'ఉ (అల్-బదీ'ఉ): ఆరంభకుడు, చూడండి, 2:117

రెట్టింపు చేయబడుతుంది. (ఇహలోకంలో వారు సత్యాన్ని) వినలేక పోయే వారు మరియు చూడలేక పోయేవారు.[1]

لَهُمُ الْعَذَابُ مَا كَانُوا يَسْتَطِيعُونَ السَّمْعَ وَمَا كَانُوا يُبْصِرُونَ ۝

**21.** అలాంటి వారే తమను తాము నష్టానికి గురిచేసుకున్న వారు మరియు వారు కల్పించుకున్న (దైవాలన్నీ) వారిని వీడిపోతాయి.[2]

أُولَٰئِكَ الَّذِينَ خَسِرُوا أَنفُسَهُمْ وَضَلَّ عَنْهُم مَّا كَانُوا يَفْتَرُونَ ۝

**22.** నిస్సందేహంగా పరలోక జీవితంలో వీరే అత్యధికంగా నష్టపోయేవారు.

لَا جَرَمَ أَنَّهُمْ فِي الْآخِرَةِ هُمُ الْأَخْسَرُونَ ۝

**23.** నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసి తమ ప్రభువుకే అంకితమై పోయే టటువంటి వారే స్వర్గవాసులవుతారు. వారు దానిలోనే శాశ్వతంగా ఉంటారు. (1/8)

إِنَّ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ وَأَخْبَتُوا إِلَىٰ رَبِّهِمْ أُولَٰئِكَ أَصْحَابُ الْجَنَّةِ ۖ هُمْ فِيهَا خَالِدُونَ ۝

**24.** * ఈ ఉభయపక్షాల వారిని, ఒక గ్రుడ్డి మరియు చెవిటి, మరొక చూడగల మరియు వినగల వారితో పోల్చవచ్చు! ఏమీ? పోలికలో వీరిరువురూ సమానులా? మీరు ఇకనైనా గుణపాఠం నేర్చుకోరా?[3]

مَثَلُ الْفَرِيقَيْنِ كَالْأَعْمَىٰ وَالْأَصَمِّ وَالْبَصِيرِ وَالسَّمِيعِ ۚ هَلْ يَسْتَوِيَانِ مَثَلًا ۚ أَفَلَا تَذَكَّرُونَ ۝

**25.** మరియు వాస్తవానికి మేము నూ'హ్‌ను అతని జాతివారి వద్దకు పంపాము. (అతను వారితో అన్నాడు): "నిశ్చయంగా, నేను మీకు స్పష్టమైన హెచ్చరిక చేసేవాడిని మాత్రమే

وَلَقَدْ أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِ إِنِّي لَكُمْ نَذِيرٌ مُّبِينٌ ۝

**26.** "మీరు అల్లాహ్‌ను తప్ప మరెవ్వరినీ ఆరాధించకూడదని[4] అలా చేస్తే నిశ్చయంగా ఆ బాధాకరమైన దినమున మీకు పడబోయే శిక్షకు నేను భయపడుతున్నాను."

أَن لَّا تَعْبُدُوا إِلَّا اللَّهَ ۖ إِنِّي أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ أَلِيمٍ ۝

---

1. చూడండి, 2:7, 7:179, 46:26, 67:10
2. చూడండి, 6:112, అంటే వారు కల్పించుకున్న బూటక దైవాలు, వారు ఆరాధించే పీర్లు, సన్యాసులు మొదలైనవారు.
3. చూడండి, 59:20, 35:19-20.
4. చూడండి, 21:25

**27.** అప్పుడు అతని జాతివారిలో సత్య తిరస్కారులైన నాయకులు: "నీవు కూడా మా మాదిరిగా ఒక సాధారణ మానవుడవే తప్ప, (నీలో మరే ప్రత్యేకతను మేము చూడటం లేదు).[1] మరియు వివేకంలేని నీచమైన వారు తప్ప ఇతరులు నిన్ను అనుసరిస్తున్నట్లు కూడా మేము చూడటం లేదు.[2] మరియు మీలో మా కంటే ఎక్కువ ఘనత కూడా మాకు కనపడటం లేదు అంతేగాక మీరు అసత్యవాదులని మేము భావిస్తున్నాము." అని అన్నారు.

فَقَالَ الْمَلَأُ الَّذِينَ كَفَرُوا مِن قَوْمِهِ مَا نَرَاكَ
إِلَّا بَشَرًا مِّثْلَنَا وَمَا نَرَاكَ اتَّبَعَكَ إِلَّا الَّذِينَ
هُمْ أَرَاذِلُنَا بَادِيَ الرَّأْيِ وَمَا نَرَىٰ لَكُمْ عَلَيْنَا
مِن فَضْلٍ بَلْ نَظُنُّكُمْ كَاذِبِينَ ﴿٢٧﴾

**28.** అతను (నూ'హ్) అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు చూస్తున్నారు కదా? నేను నా ప్రభువు తరఫునుండి వచ్చిన స్పష్టమైన సూచనను అనుసరిస్తున్నాను. ఆయన తన కారుణ్యాన్ని నాపై ప్రసాదించాడు, కాని అది మీకు కనబడటంలేదు. అలాంటప్పుడు మీరు దానిని అసహ్యించుకుంటున్నా, దానిని స్వీకరించమని మేము మిమ్మల్ని బలవంతం చేయగలమా?[3]

قَالَ يَا قَوْمِ أَرَأَيْتُمْ إِن كُنتُ عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّي
وَآتَانِي رَحْمَةً مِّنْ عِندِهِ فَعُمِّيَتْ عَلَيْكُمْ
أَنُلْزِمُكُمُوهَا وَأَنتُمْ لَهَا كَارِهُونَ ﴿٢٨﴾

**29.** "మరియు ఓ నాజాతి ప్రజలారా! నేను దాని కోసం మీ నుండి ధనాన్ని అడగటం లేదు నా ప్రతిఫలం కేవలం అల్లాహ్ దగ్గరనే ఉంది. మరియు నేను విశ్వసించిన వారిని త్రోసి వేయలేను.[4] నిశ్చయంగా, వారైతే తమ ప్రభువును కలుసుకుంటారు, కాని నిశ్చయంగా నేను మిమ్మల్ని మూఢజనులుగా చూస్తున్నాను

وَيَا قَوْمِ لَا أَسْأَلُكُمْ عَلَيْهِ مَالًا إِنْ أَجْرِيَ إِلَّا عَلَى
اللَّهِ وَمَا أَنَا بِطَارِدِ الَّذِينَ آمَنُوا إِنَّهُم مُّلَاقُو رَبِّهِمْ
وَلَٰكِنِّي أَرَاكُمْ قَوْمًا تَجْهَلُونَ ﴿٢٩﴾

---

1 ఈ విషయం ఇంతకు ముందు కూడా విశదీకరించబడింది సత్యతిరస్కారులకు మానవుడు దైవప్రవక్తగా పంపబడటం ఆశ్చర్యకరంగా ఉంది ఈ రోజులలో కొందరు బిద్'అత్ చేసేవారికి కూడా ఈ విషయం ఆశ్చర్యకరంగా ఉంది కావున వారు ము'హమ్మద్ ('స'అస)ను మానవునిగా అంగీకరించరు.

2 చూడండి. 43 23.

3. చూడండి. 2:256

4 చూడండి. 26:111 మరియు 6:52.

**30.** "మరియు ఓ నాజాతి ప్రజలారా! ఒకవేళ నేను వారిని (విశ్వాసులను) గెంటివేస్తే నన్ను అల్లాహ్ (శిక్ష) నుండి, ఎవడు కాపాడ గలడు? ఏమీ? మీరిది గ్రహించలేరా?

وَيٰقَوْمِ مَنْ يَّنْصُرُنِيْ مِنَ اللّٰهِ اِنْ طَرَدْتُّهُمْ ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ﴿۳۰﴾

**31.** "మరియు నా వద్ద అల్లాహ్ నిధులు ఉన్నాయని గానీ మరియు నాకు అగోచర జ్ఞానమున్నదని గానీ నేను మీతో అనటంలేదు; మరియు నేను దైవదూతనని కూడా అనటం లేదు[1] మరియు మీరు హీనంగా చూసే వారికి అల్లాహ్ మేలుచేయలేదని కూడా అనటం లేదు. వారి మనస్సులలో ఉన్నది అల్లాహ్‌కు బాగా తెలుసు. అలా అయితే! నిశ్చయంగా, నేను దుర్మార్గులలో చేరినవాడనే!"

وَلَاۤ اَقُوْلُ لَكُمْ عِنْدِيْ خَزَآئِنُ اللّٰهِ وَلَاۤ اَعْلَمُ الْغَيْبَ وَلَاۤ اَقُوْلُ اِنِّيْ مَلَكٌ وَّلَاۤ اَقُوْلُ لِلَّذِيْنَ تَزْدَرِيْۤ اَعْيُنُكُمْ لَنْ يُّؤْتِيَهُمُ اللّٰهُ خَيْرًا ؕ اَللّٰهُ اَعْلَمُ بِمَا فِيْۤ اَنْفُسِهِمْ ۖۚ اِنِّيْۤ اِذًا لَّمِنَ الظّٰلِمِيْنَ ﴿۳۱﴾

**32.** వారు అన్నారు: "ఓ నూహ్! నీవు మాతో వాదించావు, చాలా వాదించావు,[2] ఇక నీవు సత్యవంతుడవే అయితే, నీవు భయపెట్టే దానిని (ఆ శిక్షను) మాపై దింపు!"

قَالُوْا يٰنُوْحُ قَدْ جٰدَلْتَنَا فَاَكْثَرْتَ جِدَالَنَا فَاْتِنَا بِمَا تَعِدُنَاۤ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿۳۲﴾

**33.** అతను (నూహ్) అన్నాడు: "అల్లాహ్ కోరితే నిశ్చయంగా, దానిని (ఆ శిక్షను) మీపైకి తెస్తాడు మరియు మీరు దాని నుండి తప్పించుకోలేరు!

قَالَ اِنَّمَا يَاْتِيْكُمْ بِهِ اللّٰهُ اِنْ شَآءَ وَمَاۤ اَنْتُمْ بِمُعْجِزِيْنَ ﴿۳۳﴾

**34.** "ఒకవేళ అల్లాహ్ మిమ్మల్నితప్పు దారిలో విడిచిపెట్టాలని కోరితే, నేను మీకు మంచి సలహా ఇవ్వాలని ఎంత కోరినా, నా సలహా మీకు లాభదాయకం కాజాలదు. ఆయనే మీ ప్రభువు మరియు ఆయన వైపునకే మీరంతా మరలి పోవలసి ఉన్నది."

وَلَا يَنْفَعُكُمْ نُصْحِيْۤ اِنْ اَرَدْتُّ اَنْ اَنْصَحَ لَكُمْ اِنْ كَانَ اللّٰهُ يُرِيْدُ اَنْ يُّغْوِيَكُمْ ؕ هُوَ رَبُّكُمْ ۫ وَاِلَيْهِ تُرْجَعُوْنَ ﴿۳۴﴾

**35.** ఏమీ? వారు: "అతనే (ముహమ్మదే) దీనిని కల్పించాడు." అని అంటున్నారా?

اَمْ يَقُوْلُوْنَ افْتَرٰىهُ ؕ قُلْ اِنِ افْتَرَيْتُهٗ فَعَلَيَّ

---

1 చూడండి, 6:50 మరియు 7:188

2. చూడండి, 71:5-6 మరియు 10:71

إِجْرَامِي وَأَنَا بَرِيءٌ مِّمَّا تُجْرِمُونَ ۝

వారితో ఇలా అను: "నేను దీనిని కల్పిస్తే దాని పాపం నాపై ఉంటుంది మరియు మీరు చేసే పాపాలతో నాకు ఎలాంటి సంబంధం లేదు."

وَأُوحِيَ إِلَىٰ نُوحٍ أَنَّهُ لَن يُؤْمِنَ مِن قَوْمِكَ إِلَّا مَن قَدْ آمَنَ فَلَا تَبْتَئِسْ بِمَا كَانُوا يَفْعَلُونَ ۝

**36.** మరియు నూ'హ్‌కు ఇలా సందేశం (వ'హీ) పంపబడింది: "నిశ్చయంగా, నీ జాతి వారిలో ఇంతవరకు విశ్వసించిన వారు తప్ప ఇతరులెవ్వరూ విశ్వసించరు, కావున వారు చేసే కార్యాలకు నీవు చింతించకు।

وَاصْنَعِ الْفُلْكَ بِأَعْيُنِنَا وَوَحْيِنَا وَلَا تُخَاطِبْنِي فِي الَّذِينَ ظَلَمُوا ۚ إِنَّهُم مُّغْرَقُونَ ۝

**37.** "మరియు నీవు మా సమక్షంలో,మా సందేశానుసారంగా, ఒక ఓడను నిర్మించు మరియు దుర్మార్గులను గురించి నన్ను అడుగకు నిశ్చయంగా, వారు ముంచివేయబడతారు."

وَيَصْنَعُ الْفُلْكَ وَكُلَّمَا مَرَّ عَلَيْهِ مَلَأٌ مِّن قَوْمِهِ سَخِرُوا مِنْهُ ۚ قَالَ إِن تَسْخَرُوا مِنَّا فَإِنَّا نَسْخَرُ مِنكُمْ كَمَا تَسْخَرُونَ ۝

**38.** మరియు నూ'హ్ ఓడ నిర్మిస్తూ ఉన్నప్పుడు, ప్రతిసారి అతనిజాతి నాయకులు అతని ఎదుట నుండి పోయేటప్పుడు అతనితో పరిహాసాలాడే వారు. అతను (నూ'హ్) వారితో అనేవాడు: "ఇప్పుడు మీరు మాతో పరిహాసాలాడుతున్నారు, నిశ్చయంగా మీరు పరిహాసాలాడినట్లే, మేము కూడా మీతో పరిహాసాలాడుతాము.

فَسَوْفَ تَعْلَمُونَ مَن يَأْتِيهِ عَذَابٌ يُخْزِيهِ وَيَحِلُّ عَلَيْهِ عَذَابٌ مُّقِيمٌ ۝

**39.** "అవమానకరమైన శిక్ష ఎవరిపైకి వస్తుందో మరియు శాశ్వతమైన శిక్ష ఎవరిపై పడుతుందో త్వరలోనే మీరు తెలుసుకుంటారు "

حَتَّىٰ إِذَا جَاءَ أَمْرُنَا وَفَارَ التَّنُّورُ قُلْنَا احْمِلْ فِيهَا مِن كُلٍّ زَوْجَيْنِ اثْنَيْنِ وَأَهْلَكَ إِلَّا مَن سَبَقَ

**40.** చివరకు మా ఆజ్ఞ వచ్చింది మరియు పొయ్యి పొంగింది (జల ప్రవాహాలు భూమిని చీల్చుకొని రాసాగాయి).[1] అప్పుడు మేము

1. ఇది ఇబ్నె-కసీ'ర్ తాత్పర్యం. చూడండి, 54.11-12. నూ'హ్ తుఫాన్ వచ్చినప్పుడే ఆఫ్రికా మరియు యూరోప్‌ల మధ్య ఉన్న కొండలోయలో నీరు వచ్చి మెడిటరేనియన్ సముద్రం ఏర్పడి ఉండవచ్చని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. నూ'హ్ కుటుంబంవారిలో అతని ముగ్గురు కుమారులు సామ్, హామ్, మరియు యాఫస్ మరియు వారి భార్యలుండిరి (ఇబ్నె కసీ'ర్) వారి ప్రార్థనల కొరకు చూడండి, 23:28-29.

عَلَيْهِ الْقَوْلُ وَمَنْ آمَنَ ۚ وَمَا آمَنَ مَعَهُ إِلَّا
قَلِيلٌ ﴿٤٠﴾

(నూ'హ్‌తో) అన్నాము "ప్రతిజాతి (పశువుల) నుండి రెండు (ఆడ-మగ) జంటలను మరియు నీ కుటుంబం వారిని - ఇది వరకే సూచించ బడిన వాడు తప్ప - మరియు విశ్వసించిన వారిని. అందరినీ దాని (నావ) లోకి ఎక్కించుకో!" అతనిని విశ్వసించినవారు కొందరు మాత్రమే. (1/4)

وَقَالَ ارْكَبُوا فِيهَا بِسْمِ اللَّهِ مَجْرَاهَا وَمُرْسَاهَا ۚ
إِنَّ رَبِّي لَغَفُورٌ رَحِيمٌ ﴿٤١﴾

41. * మరియు (నూ'హ్) అన్నాడు: "ఇందు లోకి ఎక్కండి. అల్లాహ్ పేరుతో దీని పయనం మరియు దీని ఆగటం. నిశ్చయంగా నా ప్రభువు క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

وَهِيَ تَجْرِي بِهِمْ فِي مَوْجٍ كَالْجِبَالِ وَنَادَىٰ
نُوحٌ ابْنَهُ وَكَانَ فِي مَعْزِلٍ يَا بُنَيَّ ارْكَبْ
مَعَنَا وَلَا تَكُنْ مَعَ الْكَافِرِينَ ﴿٤٢﴾

42. మరియు అది వారిని పర్వతాల వలే ఎత్తైన అలలలోనికి తీసుకొని పోసాగింది. అప్పుడు నూ'హ్ (పడవనుండి) దూరంగా ఉన్న తన కుమారుణ్ణి పిలుస్తూ (అన్నాడు): "ఓ నా కుమారా! మాతోపాటు (ఓడలోకి) ఎక్కు అవిశ్వాసులలో కలిసిపోకు!"[1]

قَالَ سَآوِي إِلَىٰ جَبَلٍ يَعْصِمُنِي مِنَ الْمَاءِ ۚ قَالَ
لَا عَاصِمَ الْيَوْمَ مِنْ أَمْرِ اللَّهِ إِلَّا مَنْ رَحِمَ ۚ وَحَالَ
بَيْنَهُمَا الْمَوْجُ فَكَانَ مِنَ الْمُغْرَقِينَ ﴿٤٣﴾

43. మరియు (అతని కుమారుడు) అన్నాడు: "నేను ఒక కొండపైకి ఎక్కి శరణు పొందుతాను, అది నన్ను నీళ్ళనుండి కాపాడుతుంది." (నూ'హ్) అన్నాడు: "ఈ రోజు అల్లాహ్ తీర్పుకు విరుద్ధంగా కాపాడే వాడు ఎవ్వడూ లేడు. ఆయన (అల్లాహ్)యే కరుణిస్తే తప్ప!" అప్పుడే వారి మధ్య ఒకకెరటం రాగా అతడు కూడా మునిగిపోయే వారిలో కలిసిపోయాడు.

وَقِيلَ يَا أَرْضُ ابْلَعِي مَاءَكِ وَيَا سَمَاءُ أَقْلِعِي
وَغِيضَ الْمَاءُ وَقُضِيَ الْأَمْرُ وَاسْتَوَتْ عَلَى
الْجُودِيِّ ۖ وَقِيلَ بُعْدًا لِلْقَوْمِ الظَّالِمِينَ ﴿٤٤﴾

44. ఆ తరువాత ఆజ్ఞ వచ్చింది: "ఓ భూమీ! నీ నీళ్ళను మింగివేయి ఓ ఆకాశమా! (కురవటం) ఆపివేయి!" అప్పుడు నీరు (భూమిలోకి) ఇంకిపోయింది. (అల్లాహ్) తీర్పు నెరవేరింది.

1 అతడు నూ'హ్ యొక్క నాలుగవ కుమారుడు. అతని పేరు యామ్ మరియు అతని ఇంటి (వంశం) పేరు కనాన్‌గా పేర్కొనబడింది. అతడు సత్యతిరస్కారి కాబట్టి ఓడలో ఎక్కలేదు కాని ముస్లిమైన అతని భార్య తన పిల్లలతో ఎక్కింది.

ఓడ జూదీ కొండ మీద ఆగింది.[1] మరియు అప్పుడు: "దుర్మార్గుల జాతివారు దూర (నాశన)మై పోయారు!" అని అనబడింది.

45. మరియు నూ'హ్ తన ప్రభువును వేడుకుంటూ అన్నాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నా కుమారుడు నా కుటుంబంలోని వాడు. నీ వాగ్దానం సత్యమైనది, మరియు నీవే సర్వోత్తమ న్యాయాధికారివి."

وَنَادَىٰ نُوحٌ رَّبَّهُۥ فَقَالَ رَبِّ إِنَّ ٱبْنِى مِنْ أَهْلِى وَإِنَّ وَعْدَكَ ٱلْحَقُّ وَأَنتَ أَحْكَمُ ٱلْحَٰكِمِينَ ﴿٤٥﴾

46. ఆయన (అల్లాహ్) జవాబిచ్చాడు: "ఓ నూ'హ్! అతడు నిశ్చయంగా, నీ కుటుంబంలోనివాడు కాడు.[2] నిశ్చయంగా, అతని పనులు మంచివి కావు.[3] కావున నీకు తెలియని విషయం గురించి నన్ను అడగకు. నీవు కూడా మూఢులలో చేరినవాడవు కావద్దు.[4] అని నేను నిన్ను ఉపదేశిస్తున్నాను."

قَالَ يَٰنُوحُ إِنَّهُۥ لَيْسَ مِنْ أَهْلِكَ إِنَّهُۥ عَمَلٌ غَيْرُ صَٰلِحٍ فَلَا تَسْـَٔلْنِ مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ إِنِّىٓ أَعِظُكَ أَن تَكُونَ مِنَ ٱلْجَٰهِلِينَ ﴿٤٦﴾

47. (నూ'హ్) ఇలా విన్నవించుకున్నాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నాకు తెలియని విషయాన్ని గురించి నిన్ను అడిగినందుకు, నేను నీ శరణు వేడుకుంటున్నాను. మరియు నీవు నన్ను క్షమించకపోతే, నన్ను కరుణించక పోతే, నేను నష్టపోయిన వారిలో చేరుతాను."

قَالَ رَبِّ إِنِّىٓ أَعُوذُ بِكَ أَنْ أَسْـَٔلَكَ مَا لَيْسَ لِى بِهِۦ عِلْمٌ وَإِلَّا تَغْفِرْ لِى وَتَرْحَمْنِىٓ أَكُن مِّنَ ٱلْخَٰسِرِينَ ﴿٤٧﴾

48. ఇలా ఆజ్ఞ ఇవ్వబడింది: "ఓ నూ'హ్!

قِيلَ يَٰنُوحُ ٱهْبِطْ بِسَلَٰمٍ مِّنَّا وَبَرَكَٰتٍ عَلَيْكَ

---

1 జూదీ కొండ కుర్దిస్తాన్‌లో, ఇబ్నె 'ఉమర్ ద్వీపానికి ఈశాన్య భాగంలో దాదాపు 25 మైళ్ళ దూరంలో ఉంది.

2 ఎవరైతే విశ్వసించరో వారు ఒక ప్రవక్త ('అ.స.) యొక్క తండ్రి గానీ, కుమారుడు గానీ, లేక భార్య గానీ, అతని కుటుంబానికి చెందిన వారు కాజాలరు.

3 ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేయరో వారిని అల్లాహ్ (సు.తా.) శిక్షనుండి, దైవప్రవక్త ('అ.స.) కూడా రక్షించలేడు. అలాంటప్పుడు ఈ కాలంలో కొందరు ఏవిధంగానైతే అపోహలలో పడి ఉన్నారో వారిని, వారి పీర్లు, సజ్జాదాలు, వలీలు రక్షిస్తారని అనేది ఎలా సంభవం కాగలదు?

4 దీనితో స్పష్టమయ్యేది ఏమిటంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. అగోచరజ్ఞానం కేవలం అల్లాహుతా'ఆలాకు మాత్రమే ఉంది. ప్రవక్తలకు కేవలం అల్లాహుతా'ఆలా వ'హీ ద్వారా తెలిపిన జ్ఞానం మాత్రమే ఉంటుంది.

وَعَلَىٰٓ أُمَمٍ مِّمَّن مَّعَكَ ۚ وَأُمَمٌ سَنُمَتِّعُهُمْ ثُمَّ يَمَسُّهُم مِّنَّا عَذَابٌ أَلِيمٌ ﴿٤٨﴾

నీవు మరియు నీతో ఉన్న నీజాతి వారు శాంతి మరియు మా ఆశీర్వాదాలతో (ఓడ / జూదీ పర్వతం నుండి) దిగండి. వారిలోని కొన్ని సంఘాలకు మేము కొంతకాలం వరకు సుఖసంతోషాలను ప్రసాదించగలము. ఆ తరువాత మా వద్దనుండి బాధాకరమైన శిక్ష వారిపై పడుతుంది."

تِلْكَ مِنْ أَنۢبَآءِ ٱلْغَيْبِ نُوحِيهَآ إِلَيْكَ ۖ مَا كُنتَ تَعْلَمُهَآ أَنتَ وَلَا قَوْمُكَ مِن قَبْلِ هَٰذَا ۖ فَٱصْبِرْ ۖ إِنَّ ٱلْعَٰقِبَةَ لِلْمُتَّقِينَ ﴿٤٩﴾

**49.** (ఓ ప్రవక్తా!) ఇవి అగోచర విషయాలు. వాటిని మేము నీకు మా సందేశం (వ'హీ) ద్వారా తెలుపుతున్నాము. వాటిని నీవు గానీ, నీ జాతివారు గానీ ఇంతకుపూర్వం ఎరుగరు. కనుక సహనంవహించు! నిశ్చయంగా, మంచి ఫలితం దైవభీతి గలవారికే లభిస్తుంది.[1]

وَإِلَىٰ عَادٍ أَخَاهُمْ هُودًا ۚ قَالَ يَٰقَوْمِ ٱعْبُدُوا۟ ٱللَّهَ مَا لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرُهُۥٓ ۖ إِنْ أَنتُمْ إِلَّا مُفْتَرُونَ ﴿٥٠﴾

**50.** మరియు 'ఆద్ జాతివారి దగ్గరికి వారి సహోదరుడు హూద్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! మీరు అల్లాహ్‌నే ఆరాధించండి ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్యుడు లేడు. మీరు కేవలం అబద్ధాలు కల్పిస్తున్నారు!

يَٰقَوْمِ لَآ أَسْـَٔلُكُمْ عَلَيْهِ أَجْرًا ۖ إِنْ أَجْرِىَ إِلَّا عَلَى ٱلَّذِى فَطَرَنِىٓ ۚ أَفَلَا تَعْقِلُونَ ﴿٥١﴾

**51.** "ఓ నాజాతి ప్రజలారా! (ఈ పనికి) నేను మీ నుంచి ఎలాంటి ప్రతిఫలం అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం నన్ను సృజించిన ఆయన వద్దనే ఉంది. ఏమీ? మీరు బుద్ధిని ఉపయోగించరా (అర్థంచేసుకోలేరా)?

وَيَٰقَوْمِ ٱسْتَغْفِرُوا۟ رَبَّكُمْ ثُمَّ تُوبُوٓا۟ إِلَيْهِ يُرْسِلِ ٱلسَّمَآءَ عَلَيْكُم مِّدْرَارًا وَيَزِدْكُمْ قُوَّةً إِلَىٰ قُوَّتِكُمْ وَلَا تَتَوَلَّوْا۟ مُجْرِمِينَ ﴿٥٢﴾

**52.** "మరియు ఓ నాజాతి ప్రజలారా! మీ ప్రభువు క్షమాభిక్షను వేడుకోండి, తరువాత ఆయన వైపుకు పశ్చాత్తాపంతో మరలండి, ఆయన మీ కొరకు ఆకాశం నుండి భారీవర్షాలు కురిపిస్తాడు మరియు మీకు, మీ శక్తిపై మరింత శక్తిని ఇస్తాడు.[2] కావున మీరు నేరస్థులై

---

1 చూడండి, 40:51 మరియు 37:171-173

2 దైవప్రవక్త (స'అస) ప్రవచనం: "ఎవడైతే విధేయతతో క్షమాభిక్ష వేడుకుంటాడో, అల్లాహుతా'ఆలా అతని

వెనుదిరగకండి!"

53. వారు అన్నారు: "ఓ హూద్! నీవు మా వద్దకు స్పష్టమైన సూచనను తీసుకొనిరాలేదు మరియు మేము కేవలం నీ మాటలు విని మా దేవతలను వదలిపెట్టలేము మరియు మేము నిన్ను విశ్వసించలేము.

قَالُوا يَٰهُودُ مَا جِئْتَنَا بِبَيِّنَةٍ وَمَا نَحْنُ بِتَارِكِيٓ ءَالِهَتِنَا عَن قَوْلِكَ وَمَا نَحْنُ لَكَ بِمُؤْمِنِينَ ۝

54. "మా దైవాలలో నుండి కొందరు నీకు కీడు కలిగించారు (నిన్ను పిచ్చికి గురిచేశారు) అని మాత్రమే మేము అనగలము!" అతను (హూద్) జవాబిచ్చాడు: "ఆయన (అల్లాహ్) తప్ప![1] మీరు ఆయనకు సాటి కల్పించే వాటితో నిశ్చయంగా, నాకు ఎలాంటి సంబంధం లేదని, నేను అల్లాహ్‌ను సాక్షిగా పెడుతున్నాను మరియు మీరు కూడా సాక్షులుగా ఉండండి;

إِن نَّقُولُ إِلَّا ٱعْتَرَىٰكَ بَعْضُ ءَالِهَتِنَا بِسُوٓءٍ ۗ قَالَ إِنِّيٓ أُشْهِدُ ٱللَّهَ وَٱشْهَدُوٓا أَنِّي بَرِيٓءٌ مِّمَّا تُشْرِكُونَ ۝

55. "ఇక మీరంతా కలసి నాకు వ్యతిరేకంగా కుట్రలు పన్నండి నాకెలాంటి వ్యవధి ఇవ్వకండి.[2]

مِن دُونِهِۦ ۖ فَكِيدُونِي جَمِيعًا ثُمَّ لَا تُنظِرُونِ ۝

56. "నిశ్చయంగా, నాకూ మరియు మీకూ ప్రభువైన అల్లాహ్‌నే నేను నమ్ముకున్నాను! ఏ ప్రాణి జుట్టు కూడా ఆయన చేతిలో లేకుండా లేదు.[3] నిశ్చయంగా, నా ప్రభువే ఋజుమార్గం (సత్యం)పై ఉన్నాడు.

إِنِّي تَوَكَّلْتُ عَلَى ٱللَّهِ رَبِّي وَرَبِّكُم ۚ مَّا مِن دَآبَّةٍ إِلَّا هُوَ ءَاخِذٌۢ بِنَاصِيَتِهَآ ۚ إِنَّ رَبِّي عَلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ۝

57 "ఒకవేళ మీరు వెనుదిరిగితే (మీ ఇష్టం), వాస్తవానికి నేనైతే, నాకివ్వబడిన సందేశాన్ని మీకు అందజేశాను. మరియు నా ప్రభువు మీ స్థానంలో మరొక జాతిని మీకు వారసులుగా

فَإِن تَوَلَّوْا فَقَدْ أَبْلَغْتُكُم مَّآ أُرْسِلْتُ بِهِۦٓ إِلَيْكُمْ ۚ وَيَسْتَخْلِفُ رَبِّي قَوْمًا غَيْرَكُمْ وَلَا تَضُرُّونَهُۥ شَيْـًٔا ۚ إِنَّ رَبِّي عَلَىٰ كُلِّ شَيْءٍ حَفِيظٌ ۝

ప్రతి కష్టాన్ని దూరంచేసి, అతనికి, అతడు ఊహించని వైపునుండి జీవనోపాధిని సమకూర్చుతాడు." (అబూ-దావూద్ కితాబ్ అల్-విత్ర్, బాబ్ ఫిల్-ఇస్తిగ్ఫార్ నం. 1518; ఇబ్నె మాజా నం. 3819)

1. ఈ ఆయతులో వంకర అక్షరా (ఇటాలిక్స్)లలో ఉన్న ఈ భాగం, 55వ ఆయతు మొదటి వాక్యం ఈ వాక్యాన్ని పూర్తిచేయటానికి ఇక్కడ కలువబడింది.
2. చూడండి, 7:195
3. చూడండి, 96:15-16

చేయగలడు మరియు మీరు ఆయనకు ఏ మాత్రం హాని చేయలేరు. నిశ్చయంగా నా ప్రభువే ప్రతిదానికీ రక్షకుడు."[1]

وَلَمَّا جَاءَ أَمْرُنَا نَجَّيْنَا هُودًا وَالَّذِينَ آمَنُوا مَعَهُ بِرَحْمَةٍ مِّنَّا وَنَجَّيْنَاهُم مِّنْ عَذَابٍ غَلِيظٍ ۝٥٨

**58.** మరియు మా ఆదేశం జారీ అయినప్పుడు, మా కారుణ్యంతో హూద్‌ను మరియు అతనితో పాటు విశ్వసించిన వారిని రక్షించాము మరియు వారిని ఘోర శిక్షనుండి కాపాడాము![2]

وَتِلْكَ عَادٌ ۖ جَحَدُوا بِآيَاتِ رَبِّهِمْ وَعَصَوْا رُسُلَهُ وَاتَّبَعُوا أَمْرَ كُلِّ جَبَّارٍ عَنِيدٍ ۝٥٩

**59.** మరియు వీరే 'ఆద్ జాతి వారు! వారు తమ ప్రభువు సూచన(అయాత్)లను తిరస్కరించారు మరియు ఆయన ప్రవక్తలకు అవిధేయులయ్యారు మరియు క్రూరుడైన ప్రతి (సత్య) విరోధి ఆజ్ఞలను అనుసరించారు![3]

وَأُتْبِعُوا فِي هَٰذِهِ الدُّنْيَا لَعْنَةً وَيَوْمَ الْقِيَامَةِ ۗ أَلَا إِنَّ عَادًا كَفَرُوا رَبَّهُمْ ۗ أَلَا بُعْدًا لِّعَادٍ قَوْمِ هُودٍ ۝٦٠

**60.** మరియు ఇహలోకంలో (అల్లాహ్) శాపం (బహిష్కారం) వారిని వెంబడింపజేయబడింది మరియు పునరుత్థానదినమున కూడా (అల్లాహ్ శాపం వారిని వెంబడించగలదు).[4] వినండి! నిస్సందేహంగా, 'ఆద్ జాతివారు తమ ప్రభువును తిరస్కరించారు. కావున చూశారా, హూద్ జాతి వారైన 'ఆద్‌లు ఎలా (అల్లాహ్ కారుణ్యానికి) దూరమైపోయారో![5] (3/8)

وَإِلَىٰ ثَمُودَ أَخَاهُمْ صَالِحًا ۚ قَالَ يَا قَوْمِ اعْبُدُوا اللَّهَ مَا لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرُهُ ۖ هُوَ أَنشَأَكُم مِّنَ الْأَرْضِ

**61.** * ఇక స'మూద్ వారి వద్దకు వారి సహోదరుడు 'సాలి'హ్‌ను పంపాము. అతను అన్నాడు: "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌నే

1. అల్-'హఫీ'జు: Protector, Keeper, Defender, Preserver, రక్షకుడు, పర్యవేక్షకుడు, కనిపెట్టుకొని, కాచుకొని, కావలి ఉండేవాడు కాపాడే వాడు చూడండి, 25:45 ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
2. అదొక తీవ్రమైన తుఫాను గాలి. వివరాలకు చూడండి, 54:19-21, 69:6-8, 7:71-72
3. చూడండి, 7:66
4. ల'అనతున్: Wrath, Curse, Banishment, అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం నుండి దూరం చేయబడటం, ప్రజల నుండి శపించబడటం, బహిష్కారం, దూషించ, గర్హించ, విసర్జించ బడటం పునరుత్థాన దినమున అవమానానికి మరియు అల్లాహ్ (సు.తా.) శిక్షకు గురిఅవటం
5. బు'ఉదః అల్లాహ్ అనుగ్రహాన్ని కోల్పోవటం.

وَاسْتَعْمَرَكُمْ فِيهَا فَاسْتَغْفِرُوهُ ثُمَّ تُوبُوا إِلَيْهِ
إِنَّ رَبِّي قَرِيبٌ مُّجِيبٌ ﴿٦١﴾

ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్యుడు లేడు ఆయనే మిమ్మల్ని భూమినుండి పుట్టించి,[1] దానిలో మిమ్మల్ని నివసింపజేశాడు[2] కనుక మీరు ఆయన క్షమాభిక్ష వేడుకోండి, తరువాత ఆయన వైపునకే పశ్చాత్తాపంతో మరలండి. నిశ్చయంగా నా ప్రభువు దగ్గరలోనే ఉన్నాడు. (మీ ప్రార్థనలకు) జవాబిస్తాడు."[3]

قَالُوا يَا صَالِحُ قَدْ كُنتَ فِينَا مَرْجُوًّا قَبْلَ هَٰذَا ۖ أَتَنْهَانَا
أَن نَّعْبُدَ مَا يَعْبُدُ آبَاؤُنَا وَإِنَّنَا لَفِي شَكٍّ مِّمَّا
تَدْعُونَا إِلَيْهِ مُرِيبٍ ﴿٦٢﴾

62 వారన్నారు: "ఓ 'సాలి'హ్! ఇంతకు ముందు మేము నీపై ఆశలు పెట్టుకొని ఉన్నాము. ఏమీ? మా తండ్రితాతలు ఆరాధిస్తూ వచ్చిన వాటిని (దైవాలను) ఆరాధించకుండా, మమ్మల్ని ఆపదలచుకున్నావా? నీవు మాకు బోధించే (ధర్మం) విషయం గురించి వాస్తవంగా మాకు చాలా సందేహం ఉంది."

قَالَ يَا قَوْمِ أَرَأَيْتُمْ إِن كُنتُ عَلَىٰ بَيِّنَةٍ مِّن رَّبِّي
وَآتَانِي مِنْهُ رَحْمَةً فَمَن يَنصُرُنِي مِنَ اللَّهِ إِنْ
عَصَيْتُهُ ۖ فَمَا تَزِيدُونَنِي غَيْرَ تَخْسِيرٍ ﴿٦٣﴾

63. ('సాలి'హ్) అన్నాడు: "ఓ నా జాతి సోదరులారా! ఏమీ? మీరు చూడరా (ఆలోచించరా?) నేను నా ప్రభువు యొక్క స్పష్టమైన (నిదర్శనంపై) ఉన్నాను మరియు ఆయన నాకు తన కారుణ్యాన్ని ప్రసాదించాడు ఇక నేను ఆయన (అల్లాహ్) ఆజ్ఞను ఉల్లంఘిస్తే,[4] అల్లాహ్‌కు విరుద్ధంగా నాకు ఎవడు సహాయపడ గలడు? మీరు నాకు నష్టం తప్ప మరేమి అధికం చేయటం లేదు.

وَيَا قَوْمِ هَٰذِهِ نَاقَةُ اللَّهِ لَكُمْ آيَةً فَذَرُوهَا تَأْكُلْ فِي

64. "మరియు నాజాతి ప్రజలారా! అల్లాహ్

---

1 మానవుడిని భూమినుండి - మట్టినుండి అంటే ఈ భూమిలో దొరికే మూలపదార్థా (Flements)లతో సృష్టించాడు ఇంకా చూడండి. 3:59, 18:37, 22 5 మరియు 30.20

2. చూడండి, 7:74.

3. అల్ ముజీబు The Answerer of prayers, Responding, Replying తన దాసుల ప్రార్థనలకు ప్రత్యుత్తరమిచ్చు, జవాబిచ్చు, సమాధానమిచ్చు, అంగీకరించు వాడు చూడండి. 2 186.

4. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను ఉల్లంఘించటం, అంటే ఇక్కడ: "సత్యం వైపునకు మరియు ఏకైక ఆరాధ్యుడు, అల్లాహుతా'ఆలా వైపునకు పిలవటాన్ని మానుకోవటం" ఇదే కదా సత్యతిరస్కారులు కోరుతున్నది. ఇంకా చూడండి, 4:48.

أَرْضِ اللَّهِ وَلَا تَمَسُّوهَا بِسُوءٍ فَيَأْخُذَكُمْ عَذَابٌ
قَرِيبٌ ﴿٦٤﴾

యొక్క ఈ ఆడ ఒంటె మీ కొరకు ఒక అద్భుత సూచన! కావున దీనిని అల్లాహ్ భూమిలో స్వేచ్ఛగా మేయటానికి వదలి పెట్టండి దానికి ఎలాంటి కీడు కలిగించకండి, లేదా త్వరలోనే మిమ్మల్ని శిక్ష పట్టుకోగలదు."[1]

فَعَقَرُوهَا فَقَالَ تَمَتَّعُوا فِي دَارِكُمْ ثَلَاثَةَ أَيَّامٍ ذَٰلِكَ
وَعْدٌ غَيْرُ مَكْذُوبٍ ﴿٦٥﴾

**65.** అయినా వారు దానిని, వెనుక కాలి మోకాలినరం కోసి చంపారు. అప్పుడు అతను ('సాలి'హ్) వారితో అన్నాడు: "మీరు మీ ఇండ్లలో మూడు రోజులు మాత్రమే హాయిగా గడపండి ఇదొక వాగ్దానం, ఇది అబద్ధం కాబోదు."

فَلَمَّا جَاءَ أَمْرُنَا نَجَّيْنَا صَالِحًا وَالَّذِينَ آمَنُوا مَعَهُ
بِرَحْمَةٍ مِّنَّا وَمِنْ خِزْيِ يَوْمِئِذٍ ۗ إِنَّ رَبَّكَ هُوَ الْقَوِيُّ
الْعَزِيزُ ﴿٦٦﴾

**66.** ఆ తరువాత మా ఆదేశం జారీ అయినప్పుడు, మేము 'సాలి'హ్‌ను మరియు అతనితోపాటు విశ్వసించిన వారిని మా కారుణ్యంతో రక్షించాము. వారిని ఆ దినపు అవమానం నుండి కాపాడాము. నిశ్చయంగా, నీ ప్రభువు! ఆయన మాత్రమే, మహా బలవంతుడు, సర్వశక్తి సంపన్నుడు.

وَأَخَذَ الَّذِينَ ظَلَمُوا الصَّيْحَةُ فَأَصْبَحُوا فِي دِيَارِهِمْ
جَاثِمِينَ ﴿٦٧﴾

**67.** మరియు దుర్మార్గానికి పాల్పడిన వారిపై ఒక పెద్ద అరుపు (ప్రేలుడు) పడి, వారు తమ ఇండ్లలోనే చలనంలేకుండా (చచ్చి) పడిపోయారు;[2]

كَأَن لَّمْ يَغْنَوْا فِيهَا ۗ أَلَا إِنَّ ثَمُودَ كَفَرُوا رَبَّهُمْ ۗ
أَلَا بُعْدًا لِّثَمُودَ ﴿٦٨﴾

**68.** వారెన్నడూ అక్కడ నివసించనే లేదు అన్నట్లుగా. చూడండి! వాస్తవానికి, స'మూద్ జాతివారు తమ ప్రభువును తిరస్కరించారు. కాబట్టి చూశారా! స'మూద్ వారెలా దూరమై (నశించి) పోయారో!

---

1 స'మూద్ జాతి ప్రజలు తమ ప్రవక్త 'సాలి'హ్ ('అ స)తో: "నీవు దైవప్రవక్తవే అయితే మాకొక అద్భుత సూచనగా ఈ బండరాయినుండి ఒక ఆడఒంటెను తీసుకురా?" అని గట్టిగా పట్టుపట్టి అడగ్గా వచ్చిన ఆడఒంటె అది.

2 ఇక్కడ అరుపు (సై'హతున్) అని ఉంది మరియు 7:78 లో భూకంపం (రజ్ఫతున్) అని ఉంది రెండూ వచ్చాయన్నమాట.

**69.** మరియు వాస్తవానికి మా దూతలు శుభవార్త తీసుకొని ఇబ్రాహీమ్ వద్దకువచ్చారు వారు అన్నారు: "నీకు శాంతి కలుగు గాక (సలాం)!" అతను: "మీకూ శాంతి కలుగు గాక (సలాం)!" అని జవాబిచ్చాడు తరువాత అతను అతి త్వరగా, వేపిన దూడను (వారి ఆతిథ్యానికి) తీసుకొనివచ్చాడు.

وَلَقَدْ جَاءَتْ رُسُلُنَا إِبْرَاهِيمَ بِالْبُشْرَىٰ قَالُوا سَلَامًا ۖ قَالَ سَلَامٌ ۖ فَمَا لَبِثَ أَنْ جَاءَ بِعِجْلٍ حَنِيذٍ ٦٩

**70.** కానీ వారి చేతులు దానివైపు పోక పోవటం చూసి[1] వారిని గురించి అనుమానంలో పడ్డాడు మరియు వారినుండి అపాయం కలుగుతుందేమోనని భయపడ్డాడు! వారన్నారు: "భయపడకు. వాస్తవానికి మేము లూత్ జాతి వైపునకు పంపబడినవారము (దూతలము)."[2]

فَلَمَّا رَأَىٰ أَيْدِيَهُمْ لَا تَصِلُ إِلَيْهِ نَكِرَهُمْ وَأَوْجَسَ مِنْهُمْ خِيفَةً ۚ قَالُوا لَا تَخَفْ إِنَّا أُرْسِلْنَا إِلَىٰ قَوْمِ لُوطٍ ٧٠

**71.** అతని (ఇబ్రాహీమ్) భార్య (అక్కడే) నిలబడి ఉండెను; అప్పుడామె నవ్వింది; పిదప మేము ఆమెకు ఇస్‌హాఖ్ యొక్క మరియు ఇస్‌హాఖ్ తరువాత య'అఖూబ్ యొక్క శుభవార్తను ఇచ్చాము.[3]

وَامْرَأَتُهُ قَائِمَةٌ فَضَحِكَتْ فَبَشَّرْنَاهَا بِإِسْحَاقَ وَمِنْ وَرَاءِ إِسْحَاقَ يَعْقُوبَ ٧١

**72** ఆమె (ఆశ్చర్యంతో) అన్నది: "నా దౌర్భాగ్యం. నాకిప్పుడు బిడ్డ పుడుతాడా? నేను

قَالَتْ يَا وَيْلَتَىٰ أَأَلِدُ وَأَنَا عَجُوزٌ وَهَٰذَا بَعْلِي

---

1 ఇబ్రాహీం (అ.స.) అతిథులు అతను తెచ్చిన, వేచిన ఆవుదూడ మాంసం తిననందుకు, అతను వారు తనతో శత్రుత్వం వహిస్తారేమోనని భయపడ్డారు. దీనితో విషదమయ్యే మరొక విషయమేమిటంటే ప్రవక్తలకు అగోచరజ్ఞానముండదు. అతనికి అగోచరజ్ఞానముంటే వారు దేవదూతలని అతనికి తెలిసేడందేది. అతను వారికొరకు వేపిన ఆవుదూడ తెచ్చేవారు కాదు.

2 లూత్ (అ.స.) ఇబ్రహీమ్ (అ.స.) సోదరుని కుమారులు. అతను జోర్డాన్‌కు తూర్పుదిక్కు ఈనాటి లూత్ సముద్రం (Dead sea) అనే ప్రాంతంలో నివసించే వారు. ఇబ్రాహీం (అ.స.) వలే, లూత్ (అ.స.) కూడా, దక్షిణ బాబిలోనియా (Babylonia) లోని 'ఊర్' అనే ప్రాంతవాసులు. తన పిన్నాన్నతో సహా ఇక్కడికి వలసవచ్చారు. కావున లూత్ (అ.స.) ప్రజలు అంటే అతని జాతివారు కాదు, కాని పైన పేర్కొన్న ప్రాంతంలోని సోదోమ్ మరియు గొమొర్రాహ్ అనే నగరాల వాసులు.

3 ఇబ్రాహీం (అ.స.) భార్య సారహ్ (అలైహా స.) నవ్వటానికి వ్యాఖ్యాతలు విభిన్న కారణాలు పేర్కొన్నారు: 1) ఆమెకు లూత్ (అ.స.) జాతివారి దుష్చేష్టలు తెలుసు కావున వారి నాశనాన్ని గురించి విని, సంతోషంతో నవ్విందని. 2) వృద్ధాప్యంలో తనకు ఇవ్వబడిన సంతానపు వార్తవిని ఆశ్చర్యంతో నవ్విందని.

شَيْخًا ۖ إِنَّ هَٰذَا لَشَيْءٌ عَجِيبٌ ﴿٧٢﴾

ముసలిదానిని మరియు నా ఈ భర్త కూడా వృద్ధుడు. (అలా అయితే) నిశ్చయంగా, ఇది చాలా విచిత్రమైన విషయమే!"

قَالُوا أَتَعْجَبِينَ مِنْ أَمْرِ اللَّهِ ۖ رَحْمَتُ اللَّهِ وَبَرَكَاتُهُ
عَلَيْكُمْ أَهْلَ الْبَيْتِ ۚ إِنَّهُ حَمِيدٌ مَجِيدٌ ﴿٧٣﴾

**73.** వారన్నారు: "అల్లాహ్ ఉత్తరువు విషయంలో మీరు ఆశ్చర్యపడుతున్నారా? ఓ (ఇబ్రాహీమ్) గృహస్థులారా![1] మీపై అల్లాహ్ కారుణ్యం మరియు ఆయన శుభాశీస్సులు ఉన్నాయి. నిశ్చయంగా, ఆయనే సర్వ స్తోత్రాలకు అర్హుడు, మహత్త్వపూర్ణుడు.[2]

فَلَمَّا ذَهَبَ عَنْ إِبْرَاهِيمَ الرَّوْعُ وَجَاءَتْهُ الْبُشْرَىٰ
يُجَادِلُنَا فِي قَوْمِ لُوطٍ ﴿٧٤﴾

**74.** అప్పుడు ఇబ్రాహీమ్ భయం దూరమై, అతనికి (సంతానపు) శుభవార్త అందిన తరువాత, అతను లూ'త్ జాతివారి కొరకు మాతో వాదించసాగాడు.[3]

إِنَّ إِبْرَاهِيمَ لَحَلِيمٌ أَوَّاهٌ مُنِيبٌ ﴿٧٥﴾

**75.** (ఎందుకంటే) వాస్తవానికి, ఇబ్రాహీమ్ సహనశీలుడు, మృదుహృదయుడు (నమ్రతతో అల్లాహ్‌ను అర్థించేవాడు) మరియు పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపుకు) మరలేవాడు!

يَا إِبْرَاهِيمُ أَعْرِضْ عَنْ هَٰذَا ۖ إِنَّهُ قَدْ جَاءَ أَمْرُ
رَبِّكَ ۖ وَإِنَّهُمْ آتِيهِمْ عَذَابٌ غَيْرُ مَرْدُودٍ ﴿٧٦﴾

**76.** (వారన్నారు): "ఓ ఇబ్రాహీమ్! దీనిని (నీ మధ్యవర్తిత్వాన్ని) మానుకో! నిశ్చయంగా, నీ ప్రభువు ఆజ్ఞ వచ్చివున్నది మరియు నిశ్చయంగా, వారిపై ఆ శిక్ష పడటం తప్పదు; అది

---

1 అహ్లున్: Family ఒక కుటుంబం, సంసారం / తెగ, వంశం వారు, ఒక (House) గృహ వాసులు, ఒక నగర వాసులు లేక ఒక దేశ వాసులు.

2 అల్-మజీదు: The Glorious, Great in Dignity, who gives liberally or bountifully. The Bountiful, Beneficent, Exalted, Noble, Sublime మహత్త్వపూర్ణుడు. అల్-మాజిదు (సేకరించబడిన పదం): దీటికి వైభవం గలవాడు, ప్రభావం, ప్రతాపం విశిష్టత, ఘనత గలవాడు, దివ్యుడు, మహిమాన్వితుడు, ఉత్కృష్టుడు, శ్రేష్ఠుడు, ఔదార్యుడు, ప్రశంసనీయుడు అనే అర్థాలున్నాయి. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు చూడండి. 85:15 ఈ పదం దివ్యఖుర్ఆన్ కొరకు కూడా వాడబడింది, Glorious, Noble, దివ్యమైన, ఉత్కృష్టమైన అనే అర్థాలలో, అల్-కరీము మాదిరిగా చూడండి, 50:1, 85:21

3 ఇబ్రాహీం ('అ.స.) అన్నారు: "మీరు నాశనం చేయబోయే నగరంలో లూ'త్ ('అ.స.) కూడా ఉన్నాడు." దానికి దేవదూతలు జవాబిచ్చారు: "మాకు తెలుసు, మేము అతనిని మరియు అతనితోబాటు విశ్వసించినవారిని కాపాడుతాము. అతని భార్య తప్ప." చూడండి, 29:32

నివారించబడదు."

**77.** మరియు మా దూతలు లూ'త్ వద్దకు వచ్చినప్పుడు, వారి రాకకు అతను, (వారిని కాపాడలేనని) దుఃఖితుడయ్యాడు. అతని హృదయం కృంగిపోయింది. అతను: "ఈ దినం చాలా ఆందోళనకరమైనది." అని వాపోయాడు

وَلَمَّا جَآءَتْ رُسُلُنَا لُوطًا سِيٓءَ بِهِمْ وَضَاقَ بِهِمْ
ذَرْعًا وَقَالَ هَٰذَا يَوْمٌ عَصِيبٌ ﴿٧٧﴾

**78.** మరియు అతని జాతి ప్రజలు అతని వైపు పరిగెత్తుకుంటూవచ్చారు వారు మొదటి నుండి నీచపు పనులు చేస్తూ ఉండేవారు అతను (లూ'త్) అన్నాడు: "నాజాతి ప్రజలారా! ఇదిగో నా ఈ కుమార్తెలు (నా జాతి స్త్రీలు) ఉన్నారు.[1] వీరు మీ కొరకు చాలా శ్రేష్ఠమైన వారు అల్లాహ్ యందు భయభక్తులు కలిగిఉండండి. నా అతిథుల విషయంలో నన్ను అవమానంపాలు చేయకండి ఏమీ? మీలో ఒక్కడైనా నీతిపరుడు లేడా?"[2]

وَجَآءَهُۥ قَوْمُهُۥ يُهْرَعُونَ إِلَيْهِ وَمِن قَبْلُ كَانُوا۟
يَعْمَلُونَ ٱلسَّيِّـَٔاتِ ۚ قَالَ يَٰقَوْمِ هَٰٓؤُلَآءِ بَنَاتِى هُنَّ
أَطْهَرُ لَكُمْ ۖ فَٱتَّقُوا۟ ٱللَّهَ وَلَا تُخْزُونِ فِى ضَيْفِىٓ ۖ
أَلَيْسَ مِنكُمْ رَجُلٌ رَّشِيدٌ ﴿٧٨﴾

**79.** వారన్నారు: "నీ కూతుళ్ళు మాకు అవసరం లేదని నీకు బాగా తెలుసు కదా! మరియు నిశ్చయంగా, మేము కోరేది ఏమిటో కూడా నీకు బాగా తెలుసు!"

قَالُوا۟ لَقَدْ عَلِمْتَ مَا لَنَا فِى بَنَاتِكَ مِنْ حَقٍّ
وَإِنَّكَ لَتَعْلَمُ مَا نُرِيدُ ﴿٧٩﴾

**80.** అతను (లూ'త్) అన్నాడు: "మిమ్మల్ని ఎదుర్కొనే బలం నాకుంటే, లేక శరణు పొందటానికి పటిష్ఠమైన ఆధారమైనా ఉండి ఉంటే ఎంత బాగుండేది?"[3]

قَالَ لَوْ أَنَّ لِى بِكُمْ قُوَّةً أَوْ ءَاوِىٓ إِلَىٰ رُكْنٍ
شَدِيدٍ ﴿٨٠﴾

---

1 నా కుమార్తెలు, అంటే నా జాతి కుమార్తెలు (ఇబ్నె కసీ'ర్)

2 లూ'త్ ('అ.స.) ఒక దైవప్రవక్త అయినప్పటికీ వచ్చిన అతిథులు దైవదూతలని గుర్తించలేక పోయారు. అంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదని విశదమౌతోంది

3 దీనితో అర్థమయ్యేదేమిటంటే దైవప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. వారికి ప్రతిదీ చేయగల సామర్థ్యం కూడా ఉండదు. మరొక విషయం ఏమిటంటే దైవప్రవక్తలు కూడా, అల్లాహ్ (సు.తా.) కోరితే అంతా చేస్తాడని కూర్చొక తమకు సాధ్యమైనంతవరకు సమస్యలను తామే పరిష్కరించుకోడానికి ప్రయత్నిస్తారు.

**81.** వారు (దేవదూతలు) అన్నారు: "ఓ లూ'త్! నిశ్చయంగా, మేము నీ ప్రభువు తరఫునుండి వచ్చిన దూతలము! వారు ఏ మాత్రం నీ వద్దకు చేరలేరు కావున కొంత రాత్రి మిగిలి ఉండగానే నీవు నీ ఇంటి వారిని తీసుకొని బయలుదేరు - నీ భార్య తప్ప - మీలో ఎవ్వరూ వెనుకకు తిరిగి చూడగూడదు. నిశ్చయంగా, వారికి ఏ ఆపద సంభవించనున్నదో అదే ఆమె (నీ భార్య)కూ సంభవిస్తుంది.[1] నిశ్చయంగా, వారి నిర్ణీతకాలం ఉదయపు సమయం. ఏమీ? ఉదయం సమీపంలోనే లేదా?"

قَالُوا يَا لُوطُ إِنَّا رُسُلُ رَبِّكَ لَن يَصِلُوا إِلَيْكَ
فَأَسْرِ بِأَهْلِكَ بِقِطْعٍ مِّنَ اللَّيْلِ وَلَا يَلْتَفِتْ
مِنكُمْ أَحَدٌ إِلَّا امْرَأَتَكَ إِنَّهُ مُصِيبُهَا مَا
أَصَابَهُمْ إِنَّ مَوْعِدَهُمُ الصُّبْحُ أَلَيْسَ
الصُّبْحُ بِقَرِيبٍ ۝

**82.** మా తీర్పుసమయం వచ్చినపుడు మేము దానిని (సొదోంను) తలక్రిందులుగా చేసి, దాని మీద మట్టితోచేసి కాల్చిన గులక రాళ్ళను ఎడతెగకుండా కురిపించాము.[2]

فَلَمَّا جَاءَ أَمْرُنَا جَعَلْنَا عَالِيَهَا سَافِلَهَا وَأَمْطَرْنَا
عَلَيْهَا حِجَارَةً مِّن سِجِّيلٍ مَّنضُودٍ ۝

**83.** అవి నీ ప్రభువు తరఫునుండి గుర్తువేయబడినవి. అది (ఆ శిక్ష) ఈ దుర్మార్గులకు ఎంతో దూరంలో లేదు. (1/2)

مُّسَوَّمَةً عِندَ رَبِّكَ وَمَا هِيَ مِنَ الظَّالِمِينَ
بِبَعِيدٍ ۝

**84.** * ఇక మద్‌యన్ వారి వద్దకు వారి సహోదరుడైన షు'ఐబ్‌ను పంపాము.[3] అతను అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు అల్లాహ్‌నే ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక ఆరాధ్య దైవం లేడు. కొలతల్లో మరియు తూనికల్లో తగ్గించి ఇవ్వకండి. నేను నిశ్చయంగా, మిమ్మల్ని (ఇప్పుడు) మంచి స్థితిలో చూస్తున్నాను; కాని వాస్తవానికి మీ పై శిక్ష చుట్టుముట్టబోయే ఆ రోజును గురించి నేను భయపడుతున్నాను.

وَإِلَىٰ مَدْيَنَ أَخَاهُمْ شُعَيْبًا قَالَ يَا قَوْمِ اعْبُدُوا
اللَّهَ مَا لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرُهُ وَلَا تَنقُصُوا
الْمِكْيَالَ وَالْمِيزَانَ إِنِّي أَرَاكُم بِخَيْرٍ وَإِنِّي
أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ مُّحِيطٍ ۝

---

1 చూడండి, 7:83 మరియు 66:10 లూ'త్ భార్య అవిశ్వాసి. ఆమె సొదోమ్ వాసి.
2 ఇటువంటి గులకరాళ్ళు 7:84 మరియు 105:4లలో కూడా పేర్కొనబడ్డాయి.
3. మద్‌యన్ వారి గాథ కొరకు చూడండి, 7:85.

85. "మరియు ఓ నా జాతి ప్రజలారా! మీరు న్యాయంగా మరియు సరిగ్గా కొలవండి మరియు తూకంచేయండి. మరియు ప్రజలకు వారి వస్తువులను తక్కువజేసి ఇవ్వకండి.[1] మరియు భూమిలో అసత్యాన్ని, కల్లోలాన్ని వ్యాపింపజేయకండి.

وَيٰقَوْمِ اَوْفُوا الْمِكْيَالَ وَالْمِيْزَانَ بِالْقِسْطِ وَلَا تَبْخَسُوا النَّاسَ اَشْيَآءَهُمْ وَلَا تَعْثَوْا فِى الْاَرْضِ مُفْسِدِيْنَ ۝

86. "మీరు విశ్వాసులే అయితే, (ప్రజలకు వారి హక్కు ఇచ్చిన తరువాత) అల్లాహ్ మీ కొరకు మిగిల్చినదే మీకు మేలైనది.[2] మరియు నేను మీ రక్షకుడను కాను."[3]

بَقِيَّتُ اللّٰهِ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ۚ وَمَآ اَنَا عَلَيْكُمْ بِحَفِيْظٍ ۝

87. వారు (వ్యంగంగా) అన్నారు: "ఓ షు'ఐబ్! ఏమీ? మా తండ్రితాతలు ఆరాధించే దేవతలను మేము వదలిపెట్టాలని, లేదా మా ధనాన్ని నీ ఇష్టప్రకారం ఖర్చు చేయాలని, నీకు నీ సలా'త్ నేర్పుతుందా?[4] (అయితే) నిశ్చయంగా, ఇక నీవే చాలా సహనశీలుడవు, ఉదాత్తుడవు!"[5]

قَالُوْا يٰشُعَيْبُ اَصَلٰوتُكَ تَاْمُرُكَ اَنْ نَّتْرُكَ مَا يَعْبُدُ اٰبَآؤُنَآ اَوْ اَنْ نَّفْعَلَ فِيْٓ اَمْوَالِنَا مَا نَشٰٓؤُا ؕ اِنَّكَ لَاَنْتَ الْحَلِيْمُ الرَّشِيْدُ ۝

88. అప్పుడు అతను (షు'ఐబ్) అన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! ఏమీ? మీరు చూశారా (ఆలోచించారా)? ఒకవేళ నేను నా ప్రభువు తరఫునుండి స్పష్టమైన నిదర్శనాన్ని కలిగిఉండి మరియు ఆయన నాకు తన తరఫునుండి మంచి జీవనోపాధిని కూడా ప్రసాదించినపుడు (నేను ఇలా కాకుండా మరేమి అనగలను)? నేను మిమ్మల్ని నిషేధించిన దానికి వ్యతిరేకంగా

قَالَ يٰقَوْمِ اَرَءَيْتُمْ اِنْ كُنْتُ عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّىْ وَرَزَقَنِىْ مِنْهُ رِزْقًا حَسَنًا ؕ وَمَآ اُرِيْدُ اَنْ اُخَالِفَكُمْ اِلٰى مَآ اَنْهٰىكُمْ عَنْهُ ؕ اِنْ اُرِيْدُ اِلَّا الْاِصْلَاحَ مَا اسْتَطَعْتُ ؕ وَمَا تَوْفِيْقِىْٓ اِلَّا بِاللّٰهِ ؕ عَلَيْهِ تَوَكَّلْتُ وَاِلَيْهِ اُنِيْبُ ۝

---

1 చూడండి, 83:1-3

2 చూడండి, 18:46 మరియు 19:76 'అల్లాహ్ (సు.తా.) మీ కొరకు మిగిల్చేది.' అంటే మీరు న్యాయంగా నడుచుకొని మీ వ్యాపారాలలో సరిగ్గా కొలిచి, తూచి ఇచ్చిన తరువాత మీకు మిగిలే లాభం, అని అర్థం.

3 నేను మీకు చేసే ఉపదేశం కేవలం అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞప్రకారం చేస్తున్నాను. మిమ్మల్ని దుష్టకార్యాలనుండి ఆపటంగానీ లేక శిక్షించటంగానీ నాపని కాదు. అది కేవలం అల్లాహ్ (సు.తా.) పని మాత్రమే.

4. సలాతున్: అంటే ఇక్కడ ధర్మం, ఆరాధన అని అర్థం.

5. అర్-రషీద్: The Director to the Right Path, Leader. సన్మార్గం చూపువాడు, నీతిపరుడు, సన్మార్గగామిని, ఋజువర్తనుడు.

చేయదలచు కోలేదు. నేను మాత్రం మిమ్మల్ని నాశక్తి మేరకు సంస్కరించదలచుకున్నాను. నా కార్యసిద్ధి కేవలం అల్లాహ్ పైననే ఆధారపడివుంది. నేను ఆయననే నమ్ముకున్నాను మరియు నేను ఆయన వైపునకే పశ్చాత్తాపంతో మరలుతాను

وَيَٰقَوْمِ لَا يَجْرِمَنَّكُمْ شِقَاقِىٓ أَن يُصِيبَكُم مِّثْلُ مَآ أَصَابَ قَوْمَ نُوحٍ أَوْ قَوْمَ هُودٍ أَوْ قَوْمَ صَٰلِحٍ ۚ وَمَا قَوْمُ لُوطٍ مِّنكُم بِبَعِيدٍ ﴿٨٩﴾

**89.** "మరియు ఓ నాజాతి ప్రజలారా! నాతో ఉన్న భేదాభిప్రాయం మిమ్మల్ని నూ'హ్ జాతి వారిపై, హూద్ జాతి వారిపై లేక 'సాలి'హ్ జాతి వారిపై పడినటువంటి శిక్షకు గురిచేయకూడదు సుమా! మరియు లూ'త్ జాతివారు మీకు ఎంతో దూరంవారు కారుకదా![1]

وَٱسْتَغْفِرُوا۟ رَبَّكُمْ ثُمَّ تُوبُوٓا۟ إِلَيْهِ ۚ إِنَّ رَبِّى رَحِيمٌ وَدُودٌ ﴿٩٠﴾

**90.** "మరియు మీరు మీ ప్రభువు క్షమాభిక్షను కోరుకోండి మరియు ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలండి. నిశ్చయంగా, నా ప్రభువు అపార కరుణాప్రదాత, వాత్సల్యుడు."[2]

قَالُوا۟ يَٰشُعَيْبُ مَا نَفْقَهُ كَثِيرًا مِّمَّا تَقُولُ وَإِنَّا لَنَرَىٰكَ فِينَا ضَعِيفًا ۖ وَلَوْلَا رَهْطُكَ لَرَجَمْنَٰكَ ۖ وَمَآ أَنتَ عَلَيْنَا بِعَزِيزٍ ﴿٩١﴾

**91.** వారన్నారు: "ఓ షు'ఐబ్! నీవు చెప్పే మాటలు చాలావరకు మేము గ్రహించలేక పోతున్నాము.[3] మరియు నిశ్చయంగా, నీవు మాలో బలహీనుడివిగా పరిగణించబడు తున్నావు మరియు నీ కుటుంబంవారే గనక లేకుంటే! మేము నిశ్చయంగా, నిన్ను రాళ్ళు రువ్వి చంపేవారం మరియు నీవు మా కంటే శక్తిశాలివి కావు."

1 చూడండి, 7:85 షు'ఐబ్ ('అ.స.) మూసా ('అ.స.) యొక్క భార్య తండ్రి అని కొందరు వ్యాఖ్యాతలు అంటారు. మరికొందరు, ఇతను ఆ షు'ఐబ్ కారు అంటారు. అతడు ఉన్న ప్రాంతం ఈ నాటి అఖబా అఖాతం (Gulf of Aqabah) నుండి పడమటి వైపునకు సినాయి ద్వీపకల్పంలో మోబ్ (Moab) పర్వతం వరకు మరియు తూర్పు దిశలో మృత సముద్రం (Dead sea) వరకు ఉంది. దాని వాసులు అమోరైట్ తెగకు చెందిన అరబ్బులు. మృత సముద్రం (Dead sea) దగ్గరలోనే సోదోమ్ మరియు గొమొర్రాహ్ నగరాలు కూడా ఉండేవి.

2 అల్-వదూదు: Affectionate, The Loving towards His servants. Or towards those who obey. తన దాసుల పట్ల వాత్సల్యం, ప్రేమ, ప్రీతి గలవాడు. చూడండి, 85:14 ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి

3 చూడండి, 6:25

92. అతడు అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! ఏమీ? నా కుటుంబం మీకు అల్లాహ్ కంటే, ఎక్కువ గౌరవనీయమైనదా? మరియు మీరు ఆయన (అల్లాహ్)ను మీ వీపుల వెనుకకు నెట్టుతారా? నిశ్చయంగా, నా ప్రభువు మీరు చేసే పనులను ఆవరించిఉన్నాడు.

قَالَ يٰقَوْمِ اَرَهْطِيْۤ اَعَزُّ عَلَيْكُمْ مِّنَ اللّٰهِ ؕ وَاتَّخَذْتُمُوْهُ وَرَآءَكُمْ ظِهْرِيًّا ؕ اِنَّ رَبِّيْ بِمَا تَعْمَلُوْنَ مُحِيْطٌ ۝

93. "మరియు ఓ నాజాతి ప్రజలారా! మీ శక్తి మేరకు మీరు చేసేది చేయండి, నిశ్చయంగా, (నాశక్తి మేరకు) నేను కూడా చేస్తాను. అవమానకరమైన శిక్ష ఎవరికి పడుతుందో, అసత్యవాది ఎవడో, మీరు ముందు తెలుసుకోగలరు మరియు మీరు నిరీక్షించండి, నిశ్చయంగా, మీతోబాటు నేనుకూడా నిరీక్షిస్తాను."

وَيٰقَوْمِ اعْمَلُوْا عَلٰى مَكَانَتِكُمْ اِنِّيْ عَامِلٌ ؕ سَوْفَ تَعْلَمُوْنَ ۙ مَنْ يَّاْتِيْهِ عَذَابٌ يُّخْزِيْهِ وَمَنْ هُوَ كَاذِبٌ ؕ وَارْتَقِبُوْۤا اِنِّيْ مَعَكُمْ رَقِيْبٌ ۝

94. చివరకు మా ఆదేశం వచ్చినప్పుడు, మేము షు'ఐబ్‌ను మరియు అతనితో పాటు విశ్వసించినవారిని మా కారుణ్యంతో రక్షించాము మరియు దుర్మార్గులైన వారిపై ఒక తీవ్రమైన అరుపు (ధ్వని) విరుచుకుపడింది కాబట్టి వారు తమ ఇండ్లలోనే చలనం లేకుండా (చచ్చి) పడిపోయారు -

وَلَمَّا جَآءَ اَمْرُنَا نَجَّيْنَا شُعَيْبًا وَّالَّذِيْنَ اٰمَنُوْا مَعَهٗ بِرَحْمَةٍ مِّنَّا وَاَخَذَتِ الَّذِيْنَ ظَلَمُوا الصَّيْحَةُ فَاَصْبَحُوْا فِيْ دِيَارِهِمْ جٰثِمِيْنَ ۝

95. వారక్కడ ఎన్నడూ నివసించనే లేదు అన్నట్లుగా! ఈ విధంగా స'మూద్ జాతివారు లేకుండా పోయినట్లు, మద్‌యన్ జాతివారు కూడా లేకుండా (నశించి) పోయారు![1]

كَاَنْ لَّمْ يَغْنَوْا فِيْهَا ؕ اَلَا بُعْدًا لِّمَدْيَنَ كَمَا بَعِدَتْ ثَمُوْدُ ۝

96. మరియు నిశ్చయంగా, మేము మూసాను కూడా మా సూచనలతో మరియు స్పష్టమైన ప్రమాణంతో పంపాము;

وَلَقَدْ اَرْسَلْنَا مُوْسٰى بِاٰيٰتِنَا وَسُلْطٰنٍ مُّبِيْنٍ ۝

97. ఫిర్'ఔన్ మరియు అతని నాయకుల వద్దకు; కానీ వారు ఫిర్'ఔన్ ఆజ్ఞలనే అనుస

اِلٰى فِرْعَوْنَ وَمَلَا۟ئِهٖ فَاتَّبَعُوْۤا اَمْرَ

1. అల్లాహ్‌ంతా'ఆలా అనుగ్రహానికి దూరమై పోయారు.

فِرْعَوْنَ وَمَآ أَمْرُ فِرْعَوْنَ بِرَشِيدٍ ﴿٩٧﴾

రించారు. మరియు ఫిర్'ఔన్ ఆజ్ఞ సరైనది కాదు.

يَقْدُمُ قَوْمَهُۥ يَوْمَ ٱلْقِيَٰمَةِ فَأَوْرَدَهُمُ ٱلنَّارَ ۖ وَبِئْسَ ٱلْوِرْدُ ٱلْمَوْرُودُ ﴿٩٨﴾

**98.** పునరుత్థానదినమున అతడు (ఫిర్'ఔన్) తన జాతివారికి మున్ముందుగా ఉండి, వారిని నరకాగ్నిలోకి తీసుకొనిపోతాడు మరియు అది ప్రవేశించే వారికి ఎంతచెడ్డ గమ్యస్థానం.

وَأُتْبِعُوا۟ فِى هَٰذِهِۦ لَعْنَةً وَيَوْمَ ٱلْقِيَٰمَةِ ۚ بِئْسَ ٱلرِّفْدُ ٱلْمَرْفُودُ ﴿٩٩﴾

**99.** మరియు వారు ఈ లోకంలో శాపంతో వెంబడించబడ్డారు మరియు పునరుత్థాన దినమున కూడా (బహిష్కరించబడతారు). ఎంత చెడ్డ బహుమానం (వారికి) బహూకరించ బడుతుంది

ذَٰلِكَ مِنْ أَنۢبَآءِ ٱلْقُرَىٰ نَقُصُّهُۥ عَلَيْكَ ۖ مِنْهَا قَآئِمٌ وَحَصِيدٌ ﴿١٠٠﴾

**100.** ఇవి కొన్ని (ప్రాచీన) పట్టణాల గాథలు వీటిని మేము నీకు వినిపిస్తున్నాము. వాటిలో కొన్ని నిలిచి (మిగిలి) ఉన్నాయి మరి కొన్ని పంటపొలాల మాదిరిగా కోయబడ్డాయి (నిర్మూలించబడ్డాయి).

وَمَا ظَلَمْنَٰهُمْ وَلَٰكِن ظَلَمُوٓا۟ أَنفُسَهُمْ ۖ فَمَآ أَغْنَتْ عَنْهُمْ ءَالِهَتُهُمُ ٱلَّتِى يَدْعُونَ مِن دُونِ ٱللَّهِ مِن شَىْءٍ لَّمَّا جَآءَ أَمْرُ رَبِّكَ ۖ وَمَا زَادُوهُمْ غَيْرَ تَتْبِيبٍ ﴿١٠١﴾

**101.** మరియు మేము వారికెలాంటి అన్యాయం చేయలేదు. కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు. నీ ప్రభువు ఆజ్ఞ వచ్చినప్పుడు - అల్లాహ్‌ను వదలి - వారు ఏ దేవతలనైతే ప్రార్థించేవారో! వారు, వారికి ఏ విధంగానూ సహాయపడలేక పోయారు మరియు వారు, వారి వినాశం తప్ప మరేమీ అధికం చేయలేదు.

وَكَذَٰلِكَ أَخْذُ رَبِّكَ إِذَآ أَخَذَ ٱلْقُرَىٰ وَهِىَ ظَٰلِمَةٌ ۚ إِنَّ أَخْذَهُۥٓ أَلِيمٌ شَدِيدٌ ﴿١٠٢﴾

**102.** మరియు ఈ విధంగా నీ ప్రభువు దుర్మార్గులైన నగర (వాసులను), పట్టుకొని (శిక్షించ) దలచితే, ఇలాగే పట్టుకొని (శిక్షిస్తాడు) నిశ్చయంగా ఆయన పట్టు చాలా బాధాకర మైనది, ఎంతో తీవ్రమైనది.

إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً لِّمَنْ خَافَ عَذَابَ ٱلْءَاخِرَةِ ۚ ذَٰلِكَ يَوْمٌ مَّجْمُوعٌ لَّهُ ٱلنَّاسُ وَذَٰلِكَ يَوْمٌ

**103.** నిశ్చయంగా, ఇందులో పరలోక శిక్షకు భయపడే వారికి ఒక సూచనఉంది. అది సర్వమానవులను సమావేశపరిచే రోజు! ఆ

مَّشْهُودٌ ۝

దినమున అందరూ హాజరవుతారు.

وَمَا نُؤَخِّرُهُۥٓ إِلَّا لِأَجَلٍ مَّعْدُودٍ ۝

**104.** మరియు మేము దానిని కేవలం ఒక నియమితకాలం వరకు మాత్రమే ఆపిఉన్నాము

يَوْمَ يَأْتِ لَا تَكَلَّمُ نَفْسٌ إِلَّا بِإِذْنِهِۦ ۚ فَمِنْهُمْ
شَقِيٌّ وَسَعِيدٌ ۝

**105.** ఆ దినం వచ్చినప్పుడు, ఆయన (అల్లాహ్) సెలవు లేనిదే, ఏ ప్రాణి కూడా మాట్లాడజాలదు వారిలో కొందరు దౌర్భాగ్యులుంటారు మరికొందరు భాగ్యవంతులుంటారు.

فَأَمَّا ٱلَّذِينَ شَقُوا۟ فَفِى ٱلنَّارِ لَهُمْ فِيهَا زَفِيرٌ
وَشَهِيقٌ ۝

**106.** దౌర్భాగ్యులైన వారు నరకాగ్నిలో చేరుతారు, అక్కడ వారు దుఃఖం వల్ల మూలుగుతూ ఉంటారు మరియు వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంటారు;

خَٰلِدِينَ فِيهَا مَا دَامَتِ ٱلسَّمَٰوَٰتُ وَٱلْأَرْضُ
إِلَّا مَا شَآءَ رَبُّكَ ۚ إِنَّ رَبَّكَ فَعَّالٌ لِّمَا يُرِيدُ ۝

**107.** వారందులో శాశ్వతంగా, భూమ్యాకాశాలు ఉన్నంతవరకు ఉంటారు.[1] నీ ప్రభువు (మరొకటి) కోరితే తప్ప! నిశ్చయంగా, నీ ప్రభువు తానుకోరిందే చేసే వాడు. (5/8)

۞ وَأَمَّا ٱلَّذِينَ سُعِدُوا۟ فَفِى ٱلْجَنَّةِ خَٰلِدِينَ فِيهَا
مَا دَامَتِ ٱلسَّمَٰوَٰتُ وَٱلْأَرْضُ إِلَّا مَا شَآءَ رَبُّكَ ۖ
عَطَآءً غَيْرَ مَجْذُوذٍ ۝

**108.** * ఇక భాగ్యవంతులైన వారు, భూమ్యాకాశాలు ఉన్నంతవరకు స్వర్గంలో శాశ్వతంగా ఉంటారు. నీ ప్రభువు (మరొకటి) కోరితే తప్ప. ఇదొక ఎడతెగని బహుమానం.[2]

فَلَا تَكُ فِى مِرْيَةٍ مِّمَّا يَعْبُدُ هَٰٓؤُلَآءِ ۚ
مَا يَعْبُدُونَ إِلَّا كَمَا يَعْبُدُ ءَابَآؤُهُم مِّن قَبْلُ ۚ
وَإِنَّا لَمُوَفُّوهُمْ نَصِيبَهُمْ غَيْرَ مَنقُوصٍ ۝

**109.** కావున (ఓ ప్రవక్తా!) వారు ఆరాధించే వాటిని గురించి నీవు సందేహంలో పడకు. పూర్వంనుండి వారి తాతముత్తాతలు ఆరాధించి నట్లుగానే వారు కూడా (అంధులై) ఆరాధిస్తున్నారు మరియు మేము నిశ్చయంగా, వారి భాగపు (శిక్షను) ఏ మాత్రం తగ్గించకుండా వారికి పూర్తిగా నొసంగుతాము.

---

1. చూడండి, 6:128, 14:48. 'ఈ భూమి మరొక భూమిగా మరియు ఆకాశాలు (మరొక ఆకాశాలుగా) మారే రోజు' ఇక్కడ దీని అర్థం వారు శాశ్వతంగా ఎల్లప్పుడు నరకంలో ఉంటారని అర్థం (ఇబ్నె కసీ'ర్).
2. చూడండి, పై ఆయత్ 11:107 వ్యాఖ్యానం 1.

**110.** మరియు వాస్తవంగా, మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము. పిదప అందులో అభిప్రాయభేదాలు వచ్చాయి. నీ ప్రభువు మాట (ఆజ్ఞ) ముందుగానే నిర్ణయించబడి ఉండకుంటే, వారి తీర్పు ఎప్పుడో జరిగిఉండేది. మరియు నిశ్చయంగా, వారు దీనిని గురించి సంశయంలో, సందేహంలో పడివున్నారు.

وَلَقَدْ آتَيْنَا مُوسَى الْكِتَابَ فَاخْتُلِفَ فِيهِ ۚ وَلَوْلَا
كَلِمَةٌ سَبَقَتْ مِن رَّبِّكَ لَقُضِيَ بَيْنَهُمْ ۚ وَإِنَّهُمْ
لَفِي شَكٍّ مِّنْهُ مُرِيبٍ ۝

**111.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు ప్రతి ఒక్కరి కర్మల ప్రతిఫలాన్ని వారికి తప్పకుండా పూర్తిగా ఇచ్చివేస్తాడు. నిశ్చయంగా, ఆయన వారి కర్మలను బాగా ఎరుగును.

وَإِنَّ كُلًّا لَّمَّا لَيُوَفِّيَنَّهُمْ رَبُّكَ أَعْمَالَهُمْ ۚ إِنَّهُ بِمَا
يَعْمَلُونَ خَبِيرٌ ۝

**112.** కనుక (ఓ ప్రవక్తా!) నీవూ మరియు పశ్చాత్తాపపడి (ఆయన వైపుకు మరలిన) నీ సహచరులూ, నీకు ఆజ్ఞ ఇవ్వబడిన విధంగా ఋజుమార్గంపై స్థిరంగా ఉండండి. హద్దులు మీరకండి. నిశ్చయంగా, ఆయన మీ కర్మలన్నీ చూస్తున్నాడు.

فَاسْتَقِمْ كَمَا أُمِرْتَ وَمَن تَابَ مَعَكَ
وَلَا تَطْغَوْا ۚ إِنَّهُ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ۝

**113.** దుర్మార్గుల వైపునకు మీరు మొగ్గకండి, నరకాగ్నిలో చిక్కుకుంటారు. ఆ తరువాత అల్లాహ్ తప్ప మరెవ్వరూ మీకు సంరక్షకులూ ఉండరు. అప్పుడు మీకెవ్వరి సహాయమూ లభించదు.

وَلَا تَرْكَنُوا إِلَى الَّذِينَ ظَلَمُوا فَتَمَسَّكُمُ النَّارُ وَمَا
لَكُم مِّن دُونِ اللَّهِ مِنْ أَوْلِيَاءَ ثُمَّ لَا تُنصَرُونَ ۝

**114.** మరియు దినపు చివరి రెండు భాగాల్లోనూ మరియు రాత్రిపూట కొంత భాగంలో కూడా నమా'జ్ సలపండి.[1] నిశ్చయంగా సత్కార్యాలు దుష్కార్యాలను దూరంచేస్తాయి.

وَأَقِمِ الصَّلَاةَ طَرَفَيِ النَّهَارِ وَزُلَفًا مِّنَ اللَّيْلِ ۚ
إِنَّ الْحَسَنَاتِ يُذْهِبْنَ السَّيِّئَاتِ ۚ ذَٰلِكَ ذِكْرَىٰ
لِلذَّاكِرِينَ ۝

---

1 దైవప్రవక్త ('స'అస) తమ అనుచరు(ర'ది. 'అన్హుమ్)లతో ప్రశ్నిస్తారు "మీలో ఒకరి ఇంటి ముందు ఒక పెద్దనది ప్రవహిస్తూ ఉండి, అతడు అందులో ప్రతిరోజు ఐదుసార్లు స్నానం చేస్తూ ఉంటే, అతని శరీరం మీద ఏమైన మలినం ఉండగలదా?" అనుచరులు అంటారు. "ఉండదు!" దైవప్రవక్త ('స అస) అంటారు "ఇదే విధంగా ఐదుసార్లు నమా'జ్ చేసేవారి, తప్పులు, పాపాలు కూడా అల్లాహ్ (సు.తా.) తుడిచివేస్తాడు." ('స'హీ'హ్ బు'ఖారీ, కితాబ్ మౌ'ఖీయత్, బాబ్ 'సలాత్ అల్ 'ఖమ్స్)

జ్ఞాపకంఉంచుకునే వారికి ఇది ఒక ఉపదేశం (జ్ఞాపిక)

وَاصْبِرْ فَإِنَّ اللّٰهَ لَا يُضِيعُ أَجْرَ الْمُحْسِنِينَ ﴿١١٥﴾

**115**. మరియు సహనంవహించు; నిశ్చయంగా అల్లాహ్ సజ్జనుల ప్రతిఫలాన్ని వ్యర్థం చేయడు

فَلَوْلَا كَانَ مِنَ الْقُرُونِ مِن قَبْلِكُمْ أُولُو بَقِيَّةٍ
يَنْهَوْنَ عَنِ الْفَسَادِ فِي الْأَرْضِ إِلَّا قَلِيلًا مِّمَّنْ
أَنجَيْنَا مِنْهُمْ وَاتَّبَعَ الَّذِينَ ظَلَمُوا مَا أُتْرِفُوا
فِيهِ وَكَانُوا مُجْرِمِينَ ﴿١١٦﴾

**116**. మీకు పూర్వం గతించిన తరాలవారిలో, భూమిలో కల్లోలం రేకెత్తించకుండా నిషేధించే సజ్జనులు ఎందుకు లేరు? కాని అలాంటి వారు కొందరు మాత్రమే ఉండే వారు! వారిని మేము అలాంటి (దుర్మార్గుల) నుండి కాపాడాము మరియు దుర్మార్గులైన వారు ఐహిక సుఖాలకులోనయ్యారు మరియు వారు అపరాధులు.

وَمَا كَانَ رَبُّكَ لِيُهْلِكَ الْقُرَىٰ بِظُلْمٍ وَأَهْلُهَا
مُصْلِحُونَ ﴿١١٧﴾

**117**. మరియు వాటిలో నివసించే ప్రజలు సద్వర్తనులై ఉన్నంతవరకు, అలాంటి నగరాలను నీ ప్రభువు అన్యాయంగా నాశనం చేసేవాడు కాడు.

وَلَوْ شَاءَ رَبُّكَ لَجَعَلَ النَّاسَ أُمَّةً وَاحِدَةً
وَلَا يَزَالُونَ مُخْتَلِفِينَ ﴿١١٨﴾

**118**. మరియు నీ ప్రభువు సంకల్పిస్తే, సర్వమానవులను (ఒకే ధర్మాన్ని అవలంబించే) ఒకే ఒక్క సంఘంగా చేసేవాడు. అయినా వారు అభిప్రాయబేధాలు లేకుండా ఉండలేక పోయేవారు[1] -

إِلَّا مَن رَّحِمَ رَبُّكَ وَلِذَٰلِكَ خَلَقَهُمْ وَتَمَّتْ كَلِمَةُ
رَبِّكَ لَأَمْلَأَنَّ جَهَنَّمَ مِنَ الْجِنَّةِ وَالنَّاسِ
أَجْمَعِينَ ﴿١١٩﴾

**119**. నీ ప్రభువు కరుణించినవాడు తప్ప![2] మరియు దానికొరకే ఆయన వారిని సృష్టించాడు.[3] మరియు నీ ప్రభువు: "నేను జిన్నాతులు మరియు మానవులు అందరితో నరకాన్ని నింపుతాను!" అని అన్నమాట నెరవేరుతుంది.[4]

وَكُلًّا نَّقُصُّ عَلَيْكَ مِنْ أَنبَاءِ الرُّسُلِ مَا نُثَبِّتُ بِهِ

**120**. మరియు (ఓ ప్రవక్తా!) నీ హృదయాన్ని స్థిరపరచటానికి, మేము ప్రవక్తల గాథలను నీకు

---

1. చూడండి, 2:253 మరియు 5:48.
2. చూడండి, 7:172.
3. చూడండి, 2:30-34
4. చూడండి, 7:18, 32:13

فُؤَادَكَ وَجَاءَكَ فِي هَٰذِهِ الْحَقُّ وَمَوْعِظَةٌ وَذِكْرَىٰ لِلْمُؤْمِنِينَ ﴿١٢٠﴾

వినిపిస్తున్నాము మరియు ఇందు (ఈ సూరహ్)లో నీకు సత్యం వచ్చింది మరియు విశ్వాసులకు హితబోధ మరియు జ్ఞాపిక.

وَقُل لِّلَّذِينَ لَا يُؤْمِنُونَ اعْمَلُوا عَلَىٰ مَكَانَتِكُمْ إِنَّا عَامِلُونَ ﴿١٢١﴾

**121.** మరియు విశ్వసించని వారితో ఇలా అను: "మీరు మీ శక్తిమేరకు మీ పనులు చేయండి. నిశ్చయంగా, మేము కూడా మా శక్తిమేరకు మా పనులు చేస్తాము.

وَانتَظِرُوا إِنَّا مُنتَظِرُونَ ﴿١٢٢﴾

**122.** "మరియు మీరు వేచి ఉండండి: మేము కూడా వేచి ఉంటాము."

وَلِلَّهِ غَيْبُ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَإِلَيْهِ يُرْجَعُ الْأَمْرُ كُلُّهُ فَاعْبُدْهُ وَتَوَكَّلْ عَلَيْهِ ۚ وَمَا رَبُّكَ بِغَافِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿١٢٣﴾

**123.** మరియు ఆకాశాల యొక్క మరియు భూమియొక్క సర్వ అగోచర విషయాలు కేవలం అల్లాహ్ కే తెలుసు.[1] మరియు సర్వ విషయాలు ఆయన వద్దకే మరలింపబడతాయి కావున మీరు ఆయననే ఆరాధించండి మరియు ఆయననే నమ్ముకోండి. మరియు మీరు చేసే కర్మలు నీ ప్రభువు ఎరుగకుండా లేడు.

---

1. చూడండి, 2:3

## 12. సూరహ్ యూసుఫ్

سُورَةُ يُوسُف

ఈ సూరహ్, 10 నుండి 15వ సూరాహ్‌ల సమూహంలో మూడవది. ఇది చివరి మక్కా కాలపు సూరహ్. ఇందులో 111 ఆయతులున్నాయి. ఇది ఒక ప్రవక్త యొక్క పూర్తి గాథను ఒకే చోట వివరించిన ఒకే ఒక్క సూరహ్. దీని ద్వారా కష్టాలలో సహనంవహించాలి, అల్లాహ్ (సు.తా.) కోరినదే జరుగుతుంది. సత్యానిదే అంతిమ విజయం మరియు ప్రవక్తల కలలు నిజమవుతాయి అనే విషయాలు తెలుస్తున్నాయి. ఇబ్రాహీం, ఇస్'హాఖ్, య'అఖూబ్ (ఇస్రాయీ'ల్) 'అలైహిమ్ అస్సలామ్‌ల తరువాత వచ్చిన ప్రవక్త యూసుఫ్ ('అ.స.). ఇతని తరువాత కూడా ఇస్రాయీ'ల్ సంతతిలో చాలా మంది ప్రవక్తలు వచ్చారు. ఇది సూరహ్ హూద్ (11) తరువాత అవతరింపజేయబడింది. ఈ పేరు 4వ ఆయత్‌లో మొదటిసారి వచ్చింది.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

الٓرۚ تِلۡكَ ءَايَٰتُ ٱلۡكِتَٰبِ ٱلۡمُبِينِ ١

1. అలిఫ్-లామ్-రా. ఇవి స్పష్టమైన గ్రంథ ఆయతులు.

إِنَّآ أَنزَلۡنَٰهُ قُرۡءَٰنًا عَرَبِيّٗا لَّعَلَّكُمۡ تَعۡقِلُونَ ٢

2. వాస్తవంగా, మీరు బాగా అర్థం చేసుకోవాలని, మేము ఈ ఖుర్ఆన్‌ను అరబ్బీ భాషలో అవతరింపజేశాము.[1]

نَحۡنُ نَقُصُّ عَلَيۡكَ أَحۡسَنَ ٱلۡقَصَصِ بِمَآ أَوۡحَيۡنَآ إِلَيۡكَ هَٰذَا ٱلۡقُرۡءَانَ وَإِن كُنتَ مِن قَبۡلِهِۦ لَمِنَ ٱلۡغَٰفِلِينَ ٣

3. (ఓ ప్రవక్తా!) మేము ఈ ఖుర్ఆన్ ద్వారా అవతరింపజేసిన కథలలో ఉత్తమమైన గాథను నీకు వినిపించబోతున్నాము మరియు ఇంతకు ముందు నీవు దీనిని ఎరుగవు.[2]

إِذۡ قَالَ يُوسُفُ لِأَبِيهِ يَٰٓأَبَتِ إِنِّي رَأَيۡتُ أَحَدَ

4. (జ్ఞాపకం చేసుకోండి) యూసుఫ్ తన తండ్రితో: "ఓ నాన్నా! నేను వాస్తవంగా (కలలో)

---

1 ప్రతి దివ్యగ్రంథం ఆ ప్రాంతపు ప్రజల భాషలోనే అవతరింపజేయబడింది. దివ్యగ్రంథాలు ప్రజల మార్గదర్శకత్వం కొరకే అవతరింపజేయబడతాయి. కావున అల్లాహ్ (సు.తా.) ఈ ఉత్తమ దివ్యగ్రంథం (ఖుర్ఆన్), ఉత్తమ భాష 'అరబ్బీలో, ఉత్తమ ప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై, ఉత్తమమైన దైవదూత జిబ్రీల్ ('అ.స.) ద్వారా, ఉత్తమమైన నగరం మక్కాలో, ఉత్తమమైన నెల రమ'దాన్‌లో అవతరింపజేశాడు. చూడండి, 13:37, 14:4.

2 ప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదని ఇక్కడ మరొకసారి విశదీకరించబడింది. చూడండి, 4:113 మరియు 43:52.

عَشَرَ كَوْكَبًا وَّالشَّمْسَ وَالْقَمَرَ رَاَيْتُهُمْ لِيْ سٰجِدِيْنَ ۝

పదకొండు నక్షత్రాలను, సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి చూశాను; వాటిని నా ముందు సాష్టాంగపడుతున్నట్లు చూశాను." అని అన్నప్పుడు!

قَالَ يٰبُنَيَّ لَا تَقْصُصْ رُءْيَاكَ عَلٰٓى اِخْوَتِكَ فَيَكِيْدُوْا لَكَ كَيْدًا ۭ اِنَّ الشَّيْطٰنَ لِلْاِنْسَانِ عَدُوٌّ مُّبِيْنٌ ۝

**5.** (అతని తండ్రి) అన్నాడు: "ఓ నా చిన్న ప్రియ కుమారుడా! నీ స్వప్నాన్ని నీ సోదరులకు తెలుపకు. ఎందుకంటే వారు నీకు విరుద్ధంగా కుట్ర పన్నవచ్చు![1] నిశ్చయంగా, షైతాన్ మానవునికి బహిరంగ శత్రువు.

وَكَذٰلِكَ يَجْتَبِيْكَ رَبُّكَ وَيُعَلِّمُكَ مِنْ تَاْوِيْلِ الْاَحَادِيْثِ وَيُتِمُّ نِعْمَتَهٗ عَلَيْكَ وَعَلٰٓى اٰلِ يَعْقُوْبَ كَمَآ اَتَمَّهَا عَلٰٓى اَبَوَيْكَ مِنْ قَبْلُ اِبْرٰهِيْمَ وَاِسْحٰقَ ۭ اِنَّ رَبَّكَ عَلِيْمٌ حَكِيْمٌ ۝

**6.** "మరియు ఆ విధంగానే జరుగుతుంది! నీ ప్రభువు నిన్ను ఎన్నుకుంటాడు మరియు నీకు సంఘటనల (స్వప్నాల) గూఢార్థ వివరణ కూడా నేర్పుతాడు మరియు నీ పూర్వీకులైన (తాత ముత్తాతలైన), ఇబ్రాహీమ్ మరియు ఇస్'హాఖ్‌లకు ప్రసాదించినట్లు నీకూ మరియు య'అఖూబ్ సంతతి వారికి సంపూర్ణంగా తన అనుగ్రహాన్ని ప్రసాదిస్తాడు. నిశ్చయంగా, నీ ప్రభువు సర్వజ్ఞుడు, మహావివేకవంతుడు." (3/4)

لَقَدْ كَانَ فِيْ يُوْسُفَ وَاِخْوَتِهٖٓ اٰيٰتٌ لِّلسَّاۗىِٕلِيْنَ ۝

**7.** * వాస్తవానికి, యూసుఫ్ మరియు అతని సోదరుల (గాథలో) అడిగే వారికి ఎన్నో సూచనలు ఉన్నాయి.

اِذْ قَالُوْا لَيُوْسُفُ وَاَخُوْهُ اَحَبُّ اِلٰٓى اَبِيْنَا مِنَّا وَنَحْنُ عُصْبَةٌ ۭ اِنَّ اَبَانَا لَفِيْ ضَلٰلٍ مُّبِيْنِ ۝

**8.** అప్పుడు వారు (యూసుఫ్ సోదరులు పరస్పరం) ఇలా అనుకున్నారు: "మనది ఒక బలమైన వర్గం, అయినప్పటికీ యూసుఫ్ మరియు అతని సోదరుడు (బిన్యామీన్) అంటే మన తండ్రికి మనకంటే ఎక్కువ ప్రేమ.[2] నిశ్చయంగా మనతండ్రి స్పష్టమైన తప్పుడు అభిప్రాయంలో ఉన్నాడు."

---

1. య'అఖూబ్ ('అ.స.) ఒక ప్రవక్త, కావున్నే తన కుమారుని స్వప్నాన్ని వెంటనే అర్థంచేసుకున్నారు
2. బెన్యామీన్ మరియు యూసుఫ్ ('అలైహిమ్ స.లు); య'అఖూబ్ ('అ.స.) మరియు రాచెల్ (Rachel) కుమారులు. మిగతా 10 మంది సోదరుల తండ్రి య'అఖూబ్ ('అ.స.)కాని తల్లులు వేరు

**9.** (వారిలో ఒకడు ఇలా అన్నాడు): "యూసుఫ్‌ను చంపండి, లేదా అతణ్ణి ఎక్కడైనా ఒంటరిగా వదలిపెట్టండి. ఇలా చేసినట్లయితే మీ తండ్రి ధ్యాస (ప్రేమ) కేవలం మీ వైపునకే మరలుతుంది. ఆ తరువాత మీరు (ప్రాయశ్చిత్తం చేసి) సద్వర్తనులుగా ప్రవర్తించండి."

اقْتُلُوا يُوسُفَ أَوِ اطْرَحُوهُ أَرْضًا يَخْلُ لَكُمْ وَجْهُ
أَبِيكُمْ وَتَكُونُوا مِنْ بَعْدِهِ قَوْمًا صَالِحِينَ ⑨

**10.** వారిలో మరొకడు అన్నాడు: "యూసుఫ్‌ను చంపకండి. మీరు (ఏదైనా) చేయాలనే అనుకుంటే! అతనిని ఒకలోతైన బావిలో పడవేయండి.[1] ఎవరైనా బాటసారులు అతనిని తీసుకొని పోవచ్చు!"

قَالَ قَائِلٌ مِنْهُمْ لَا تَقْتُلُوا يُوسُفَ وَأَلْقُوهُ فِي
غَيَابَتِ الْجُبِّ يَلْتَقِطْهُ بَعْضُ السَّيَّارَةِ إِنْ كُنْتُمْ
فَاعِلِينَ ⑩

**11.** వారు అన్నారు: "నాన్నా నీవు యూసుఫ్ విషయంలో మమ్మల్ని ఎందుకు నమ్మవు? వాస్తవానికి మేము అతని శ్రేయోభిలాషులము!

قَالُوا يَا أَبَانَا مَا لَكَ لَا تَأْمَنَّا عَلَىٰ يُوسُفَ وَإِنَّا لَهُ
لَنَاصِحُونَ ⑪

**12.** "రేపు అతనిని మావెంట పంపండి, అతడు అక్కడ ఆడుకొని సంతోషపడతాడు. మరియు మేము తప్పక అతనికి రక్షకులముగా ఉంటాము."

أَرْسِلْهُ مَعَنَا غَدًا يَرْتَعْ وَيَلْعَبْ وَإِنَّا لَهُ
لَحَافِظُونَ ⑫

**13.** (వారి తండ్రి య'అఖూబ్) అన్నాడు: 'మీరు అతనిని తీసుకొనిపోవటం నిశ్చయంగా, నన్ను చింతాక్రాంతునిగా చేస్తోంది. మీరు అతని విషయంలో ఏమరుపాటులో ఉన్నప్పుడు, అతనిని ఏదైనా తోడేలు తిని వేస్తుందేమోనని నేను భయపడుతున్నాను."

قَالَ إِنِّي لَيَحْزُنُنِي أَنْ تَذْهَبُوا بِهِ وَأَخَافُ أَنْ
يَأْكُلَهُ الذِّئْبُ وَأَنْتُمْ عَنْهُ غَافِلُونَ ⑬

**14.** వారన్నారు: "మేము ఇంత పెద్దబలగం ఉన్నప్పటికీ అతనిని తోడేలు తినివేస్తే! నిశ్చయంగా, మేము పనికిరాని (చేతగాని) వారమే కదా!"

قَالُوا لَئِنْ أَكَلَهُ الذِّئْبُ وَنَحْنُ عُصْبَةٌ
إِنَّا إِذًا لَخَاسِرُونَ ⑭

---

1 అల్-జుబ్బు అంటే ఒక లోతైన బావి దాని చుట్టు గోడ ఉండదు మరియు నీళ్ళు కూడా చాలా లోతుగా ఉండవు.

فَلَمَّا ذَهَبُوا بِهٖ وَاَجْمَعُوْٓا اَنْ يَّجْعَلُوْهُ فِيْ غَيٰبَتِ الْجُبِّ ۚ وَاَوْحَيْنَآ اِلَيْهِ لَتُنَبِّئَنَّهُمْ بِاَمْرِهِمْ هٰذَا وَهُمْ لَا يَشْعُرُوْنَ ۝

**15.** ఆ పిదప వారు అతనిని తీసుకొనిపోయి ఒక లోతుబావిలో పడవేద్దామని నిర్ణయించు కున్నారు. అప్పుడు మేము అతనికి దివ్య జ్ఞానం (వ'హీ) ద్వారా ఇలా తెలిపాము: "నీవు (ఒక రోజు) వారికి ఈ కార్యాన్ని జ్ఞప్తికితెచ్చే సమయం వస్తుంది, మరియు వారు నిన్ను గుర్తుపట్టలేరు."[1]

وَجَآءُوْٓ اَبَاهُمْ عِشَآءً يَّبْكُوْنَ ۝

**16.** మరియు 'ఇషా సమయంలో (చీకటి పడ్డ తరువాత) వారు తమ తండ్రి వద్దకు ఏడ్చుకుంటూ వచ్చారు.

قَالُوْا يٰٓاَبَانَآ اِنَّا ذَهَبْنَا نَسْتَبِقُ وَتَرَكْنَا يُوْسُفَ عِنْدَ مَتَاعِنَا فَاَكَلَهُ الذِّئْبُ ۚ وَمَآ اَنْتَ بِمُؤْمِنٍ لَّنَا وَلَوْ كُنَّا صٰدِقِيْنَ ۝

**17.** వారన్నారు: "ఓ నాన్నా! మేము పరుగు పందాలలో మునిగిపోయాము. మరియు యూసుఫ్‌ను మేము మా సామాగ్రి వద్ద విడిచివెళ్ళాము; అపుడు ఒకతోడేలు అతనిని తినిపోయింది. మరియు మేము సత్యం పలికినా నీవు మా మాట నమ్మకపోవచ్చు!"

وَجَآءُوْ عَلٰى قَمِيْصِهٖ بِدَمٍ كَذِبٍ ۚ قَالَ بَلْ سَوَّلَتْ لَكُمْ اَنْفُسُكُمْ اَمْرًا ۚ فَصَبْرٌ جَمِيْلٌ ۚ وَاللّٰهُ الْمُسْتَعَانُ عَلٰى مَا تَصِفُوْنَ ۝

**18.** వారు అతని అంగికి బూటకపు రక్తాన్ని పూసి తెచ్చారు. (వారి తండ్రి) అన్నాడు: "మీ ఆత్మ మిమ్మల్ని (ఒక ఘోర) కార్యాన్ని (విషయాన్ని), తేలికైనదిగా అనిపించేటట్లు చేసింది ఇక (నా కొరకు) సహనమే మేలైనది మరియు మీరు చెప్పే విషయంలో అల్లాహ్ సహాయమే నేను కోరేది!"

وَجَآءَتْ سَيَّارَةٌ فَاَرْسَلُوْا وَارِدَهُمْ فَاَدْلٰى دَلْوَهٗ ۗ قَالَ يٰبُشْرٰى هٰذَا غُلٰمٌ ۗ وَاَسَرُّوْهُ بِضَاعَةً ۗ وَاللّٰهُ عَلِيْمٌۢ بِمَا يَعْمَلُوْنَ ۝

**19.** మరియు అటువైపునకు ఒక బాట సారుల బృందం వచ్చింది. వారు తమ నీరు తెచ్చే మనిషిని పంపారు, అతడు (బావిలో) బొక్కెనను దింపాడు. (అతనికి బావిలో ఒక బాలుడు కనిపించగా) అన్నాడు: "ఇదిగో శుభ వార్త! ఇక్కడ ఒక బాలుడున్నాడు." వారు అతనిని ఒక వ్యాపార సరుకుగా (బానిసగా)

---

1. చూడండి, ఈ సూరహ్ యొక్క ఆయత్‌లు 89-90.

أَفَمَن يَعْلَمُ أَنَّمَآ أُنزِلَ إِلَيْكَ مِن رَّبِّكَ الْحَقُّ كَمَنْ هُوَ أَعْمَىٰٓ ۚ إِنَّمَا يَتَذَكَّرُ أُولُوا الْأَلْبَٰبِ ﴿١٩﴾

**19.** * ఏమీ? నీ ప్రభువు నుండి నీపై అవతరింపజేయబడిన (సందేశం) సత్యమని తెలుసుకున్నవాడు, గ్రుడ్డివానితో సమానుడా? నిశ్చయంగా, బుద్ధిమంతులే ఈ విషయం గ్రహించగలరు.

الَّذِينَ يُوفُونَ بِعَهْدِ اللَّهِ وَلَا يَنقُضُونَ الْمِيثَٰقَ ﴿٢٠﴾

**20.** వారే, ఎవరైతే అల్లాహ్‌తో చేసిన వాగ్దానం పూర్తిచేస్తారో మరియు తమ వాగ్దానాన్ని భంగపరచరో![1]

وَالَّذِينَ يَصِلُونَ مَآ أَمَرَ اللَّهُ بِهِۦٓ أَن يُوصَلَ وَيَخْشَوْنَ رَبَّهُمْ وَيَخَافُونَ سُوٓءَ الْحِسَابِ ﴿٢١﴾

**21.** మరియు ఎవరైతే అల్లాహ్ కలువమని ఆజ్ఞాపించిన వాటిని కలుపుతారో![2] మరియు తమ ప్రభువుకు భయపడుతారో మరియు దారుణంగా తీసుకోబడే లెక్కకు భయపడుతారో!

وَالَّذِينَ صَبَرُوا ابْتِغَآءَ وَجْهِ رَبِّهِمْ وَأَقَامُوا الصَّلَوٰةَ وَأَنفَقُوا مِمَّا رَزَقْنَٰهُمْ سِرًّا وَعَلَانِيَةً وَيَدْرَءُونَ بِالْحَسَنَةِ السَّيِّئَةَ أُولَٰٓئِكَ لَهُمْ عُقْبَى الدَّارِ ﴿٢٢﴾

**22.** మరియు ఎవరైతే తమ ప్రభువు ప్రీతికొరకు సహనంవహించి[3] మరియు నమా'జ్ స్థాపించి[4] మరియు మేము ప్రసాదించిన ఉపాధినుండి రహస్యంగా మరియు బహిరంగంగా (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేస్తూ, చెడును మంచి ద్వారా పారద్రోలుతూ ఉంటారో;[5] అలాంటి వారికే ఉత్తమ పరలోక గృహం ప్రతిఫలంగా ఉంటుంది

جَنَّٰتُ عَدْنٍ يَدْخُلُونَهَا وَمَن صَلَحَ مِنْ ءَابَآئِهِمْ وَأَزْوَٰجِهِمْ وَذُرِّيَّٰتِهِمْ ۖ وَالْمَلَٰٓئِكَةُ يَدْخُلُونَ عَلَيْهِم مِّن

**23.** శాశ్వతంగా ఉండే ఉద్యానవనాలలో[6] వారు మరియు వారితో పాటు సద్వర్తనులైన వారి తండ్రితాతలు, వారి సహవాసులు (అ'జ్వాజ్)

---

1 చూడండి, 5:1

2 చూడండి, 8:75.

3 అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను పాటించటం మరియు పాపాలనుండి తప్పించుకోవటం ఒక సహనం మరియు బాధలలో, ఆపదలలో సహనం వహించటం రెండవది. సత్పురుషులు ఈ రెండు రకాల సహనాన్ని వహిస్తారు.

4. నమా'జ్ స్థాపించటం అంటే నమా'జ్‌ను దాని సమయంలో, భయభక్తులతో సరిగ్గా సలపటం

5 వారు, ఎవరికైతే చెడు సంభవిస్తే దానికి బదులుగా మంచి చేస్తారో లేక మన్నించి సహనం వహిస్తారో చూడండి, 41:34

6. 'అద్నున్: అంటే శాశ్వతమైన స్వర్గవనాలు.

كُلِّ بَابٍ ﴿٢٣﴾

మరియు వారి సంతానం కూడా ప్రవేశిస్తారు.[1] మరియు ప్రతి ద్వారం నుండి దేవదూతలు వారి (స్వాగతం) కొరకు వస్తారు.

سَلَامٌ عَلَيْكُم بِمَا صَبَرْتُمْ ۚ فَنِعْمَ عُقْبَى الدَّارِ ﴿٢٤﴾

**24.** (దేవదూతలు అంటారు): "మీ సహనానికి, ఫలితంగా ఇప్పుడు మీకు శాంతి కలుగు గాక (సలాం)! ఇక ఈ అంతిమ (పరలోక) గృహం ఎంతో సౌఖ్యదాయకమైనది!"

وَالَّذِينَ يَنقُضُونَ عَهْدَ اللَّهِ مِن بَعْدِ مِيثَاقِهِ وَيَقْطَعُونَ مَا أَمَرَ اللَّهُ بِهِ أَن يُوصَلَ وَيُفْسِدُونَ فِي الْأَرْضِ ۙ أُولَٰئِكَ لَهُمُ اللَّعْنَةُ وَلَهُمْ سُوءُ الدَّارِ ﴿٢٥﴾

**25.** మరియు అల్లాహ్‌తో ఒడంబడిక చేసుకున్న తరువాత తమ వాగ్దానాన్ని భంగం చేసేవారు మరియు అల్లాహ్ కలపండి అని ఆదేశించిన వాటిని త్రెంచేవారు మరియు భూమిలో కల్లోలం రేకెత్తించేవారు! ఇలాంటి వారందరికీ ఆయన శాపం (బహిష్కారం) ఉంటుంది మరియు వారికి (పరలోకంలో) బహుచెడ్డ నివాసముంటుంది.

اللَّهُ يَبْسُطُ الرِّزْقَ لِمَن يَشَاءُ وَيَقْدِرُ ۚ وَفَرِحُوا بِالْحَيَاةِ الدُّنْيَا وَمَا الْحَيَاةُ الدُّنْيَا فِي الْآخِرَةِ إِلَّا مَتَاعٌ ﴿٢٦﴾

**26.** అల్లాహ్ తాను కోరిన వారికి జీవనోపాధి పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు (తాను కోరిన వారికి) పరిమితం చేస్తాడు.[2] మరియు వారు ఇహలోక జీవితంలో సంతోషంగా ఉన్నారు. కాని పరలోక జీవితం ముందు ఇహలోక జీవిత సుఖసంతోషాలు తాత్కాలిక (తుచ్ఛ) మైనవే!

وَيَقُولُ الَّذِينَ كَفَرُوا لَوْلَا أُنزِلَ عَلَيْهِ آيَةٌ مِّن رَّبِّهِ ۗ قُلْ إِنَّ اللَّهَ يُضِلُّ مَن يَشَاءُ وَيَهْدِي إِلَيْهِ مَنْ أَنَابَ ﴿٢٧﴾

**27.** మరియు సత్యతిరస్కారులు: "అతని (ము'హమ్మద్)పై, అతని ప్రభువు తరఫునుండి ఏదైనా ఒక అద్భుత సంకేతం ఎందుకు అవతరింపజేయబడలేదు?"[3] అని అంటున్నారు.

---

1. చూడండి, 52:21.

2 అల్లాహ్ (సు.తా.) తాను కోరింది చేస్తాడు. ఇహలోకంలో పుష్కలంగా జీవనోపాధి ఉన్నవాడితో అల్లాహ్ (సు.తా.) సంతోషపడ్డాడని మరియు ఇహలోక జీవితంలో కష్టాలలో ఉన్న వాడితో అల్లాహ్ (సు.తా.) సంతోషపడలేదని, దీని అర్థం కాదు. ఎవరికైనా అత్యధికంగా ధనసంపత్తులు ఇవ్వటం కేవలం అతనిని పరీక్షించటానికే. సత్యధర్మం మీద ఉండి సత్కార్యాలు చేసేవారే సాఫల్యం పొందుతారు

3. చూడండి, 6:109

వారితో అను: "నిశ్చయంగా, అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టులుగా వదలుతాడు మరియు పశ్చాత్తాపపడి ఆయన వైపునకు తిరిగే వారికి సన్మార్గం చూపుతాడు."

**28** ఎవరైతే విశ్వసించారో, వారి హృదయాలు అల్లాహ్ ధ్యానం వలన తృప్తిపొందుతాయి. జాగ్రత్తగా వినండి! కేవలం అల్లాహ్ ధ్యానమే హృదయాలకు తృప్తినిస్తుంది.

الَّذِينَ آمَنُوا وَتَطْمَئِنُّ قُلُوبُهُم بِذِكْرِ اللَّهِ ۗ أَلَا بِذِكْرِ اللَّهِ
تَطْمَئِنُّ الْقُلُوبُ ﴿٢٨﴾

**29.** విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి (ఇహలోకంలో) ఆనందం, సర్వసుఖాలు[1] మరియు (పరలోకంలో) మంచి గమ్యస్థానం ఉంటాయి

الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ طُوبَىٰ لَهُمْ وَحُسْنُ
مَآبٍ ﴿٢٩﴾

**30.** అందుకే (ఓ ము'హమ్మద్!) మేము నిన్ను ఒక సమాజం వారి వద్దకు పంపాము వాస్తవానికి వారికి పూర్వం ఎన్నో సమాజాలు గతించాయి నీవు నీపై మేము అవతరింప జేసిన దివ్యజ్ఞానం వారికి వినిపించటానికి. ఎందుకంటే వారు తమ కరుణామయుణ్ణి తిరస్కరిస్తున్నారు[2] వారితో అను: "ఆయనే నా ప్రభువు! ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు. నేను ఆయననే నమ్ముకున్నాను మరియు ఆయన వైపునకే నేను పశ్చాత్తాపంతో మరలి పోవలసి ఉన్నది."

كَذَٰلِكَ أَرْسَلْنَاكَ فِي أُمَّةٍ قَدْ خَلَتْ مِن قَبْلِهَا أُمَمٌ
لِّتَتْلُوَ عَلَيْهِمُ الَّذِي أَوْحَيْنَا إِلَيْكَ وَهُمْ يَكْفُرُونَ بِالرَّحْمَٰنِ ۚ
قُلْ هُوَ رَبِّي لَا إِلَٰهَ إِلَّا هُوَ عَلَيْهِ تَوَكَّلْتُ وَإِلَيْهِ مَتَابِ ﴿٣٠﴾

**31.** మరియు నిశ్చయంగా, (ఖుర్ఆన్ను) పఠించటం వలన కొండలు కదలింపబడినా,

وَلَوْ أَنَّ قُرْآنًا سُيِّرَتْ بِهِ الْجِبَالُ أَوْ قُطِّعَتْ بِهِ الْأَرْضُ

---

1 'తూబా అంటే స్వర్గంలో మంచి స్థానం మరియు దాని భోగభాగ్యాలు

2 మక్కాముష్రిక్ లు రహ్మాన్ శబ్దాన్ని తిరస్కరించే వారు కావున హుదైబియా ఒప్పందం రోజు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస): "బిస్మిల్లా హిర్ రహ్మా నిర్ రహీమ్" అని ఒప్పందం వ్రాయించడం ప్రారంభించినప్పుడు, ఒప్పందం చేసుకోవడానికి వచ్చిన రాయబారి, "అర్ రహ్మాన్ అర్ రహీమ్ను మేము ఎరుగము "బిస్మిక అల్లాహుమ్మ" అని వ్రాయాలి" అని పట్టుపట్టాడు ఖతదా (ర'ది'అ) కథనం, 'స. బు'ఖారీ).

أَوْ كُلِّمَ بِهِ الْمَوْتَىٰ ۗ بَل لِّلَّهِ الْأَمْرُ جَمِيعًا ۗ أَفَلَمْ يَيْأَسِ
الَّذِينَ آمَنُوا أَن لَّوْ يَشَاءُ اللَّهُ لَهَدَى النَّاسَ جَمِيعًا ۗ
وَلَا يَزَالُ الَّذِينَ كَفَرُوا تُصِيبُهُم بِمَا صَنَعُوا قَارِعَةٌ
أَوْ تَحُلُّ قَرِيبًا مِّن دَارِهِمْ حَتَّىٰ يَأْتِيَ وَعْدُ اللَّهِ ۚ إِنَّ اللَّهَ
لَا يُخْلِفُ الْمِيعَادَ ﴿٣١﴾

లేదా దానివల్ల భూమి చీల్చబడినా, లేదా దానివల్ల మృతులు మాట్లాడేటట్లు చేయబడినా! (అవిశ్వాసులు దానిని విశ్వసించరు). వాస్తవానికి సర్వనిర్ణయాల అధికారం కేవలం అల్లాహ్ కే చెందుతుంది.[1] ఏమీ? ఒకవేళ అల్లాహ్ కోరితే సర్వ మానవులకు సన్మార్గం చూపేవాడని తెలిసి కూడా విశ్వాసులు ఎందుకు ఆశ వదులుకుంటున్నారు?[2] మరియు అల్లాహ్ వాగ్దానం పూర్తిఅయ్యే వరకు సత్యతిరస్కారంలో మునిగిఉన్న వారిపై, వారికర్మల ఫలితంగా, ఏదో ఒక ఆపద కలుగుతూనే ఉంటుంది. లేదా అది వారి ఇండ్ల సమీపంలో పడుతూ ఉంటుంది.[3] నిశ్చయంగా అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు.

وَلَقَدِ اسْتُهْزِئَ بِرُسُلٍ مِّن قَبْلِكَ فَأَمْلَيْتُ لِلَّذِينَ
كَفَرُوا ثُمَّ أَخَذْتُهُمْ ۖ فَكَيْفَ كَانَ عِقَابِ ﴿٣٢﴾

**32.** మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి నీకు పూర్వం కూడా చాలా మంది ప్రవక్తలు పరిహసించబడ్డారు, కాని సత్యతిరస్కారులకు నేను వ్యవధినిచ్చిన పిదప నేను వారిని పట్టుకుంటాను. (చూశారా!) నా ప్రతీకారం (శిక్ష) ఎలా ఉండిందో![4]

---

1 ఇబ్నె-కసీ'ర్ (ర'హ్మ) అంటారు: 'ప్రతి దివ్యగ్రంథం ఖుర్ఆన్ అనబడుతోంది.' ఒక 'హదీస్'లో ఉంది. 'దావూద్ (అ.స.) పశువులను సిద్ధపరచమని ఆజ్ఞాపించి ఆ సమయంలో ఖుర్ఆన్ పఠనం పూర్తి చేసుకునేవారు.' ('స.బు'ఖారీ, కితాబ్ అల్-అంబియా, బాబె ఖౌల్ అల్లాహుత'ఆలా 'వ ఆతైనా దావూద జబూరా') ఇక్కడ ఖుర్ఆన్ అంటే జబూర్ అని అర్థం. ఈ వాక్యపు అర్థం ఏమిటంటే ఒకవేళ ఇంతకు పూర్వం దివ్యగ్రంథం చదువటం వలన కొండలు కదిలింపబడితే (పొడిపొడిగా మారిపోతే), లేక మృతులు మాట్లాడ గలిగితే, ఈ ఖుర్ఆన్‌లో కూడా అటువంటి లక్షణాలు ఉండేవి. మరికొందరి అభిప్రాయం ఏమిటంటే: ఈ ఖుర్ఆన్‌లో ఇటువంటి విశేషలక్షణాలు ఉండినా, ఈ సత్యతిరస్కారులు దీనిని ఏ మాత్రమూ విశ్వసించేవారు కారు. ఎందుకంటే వారిని విశ్వాసులుగా చేయటం అల్లాహ్ (సు.తా.) పనే. అల్లాహ్ (సు.తా.) ఎవ్వరినీ కూడా మార్చడు ఎంతవరకైతే వారు తమను తాము మార్చు కోవటానికి ప్రయత్నించరో!

2. చూడండి, 2:26-27 మరియు 6:149

3. చూడండి, 5:33

4 'హదీస్'లో కూడా ఉంది: "అల్లాహ్ (సు.తా.) దుర్మార్గులకు వ్యవధినిస్తూ పోతాడు, చివరకు వారిని శిక్షించటానికి పట్టుకున్నప్పుడు ఏ మాత్రమూ వదలడు." దైవప్రవక్త ('స'అస), ఇది వినిపించిన తరువాత, ఆయత్ 11:102ను చదివి వినిపించారు. ('స'హీ'హ్ బు'ఖారీ, 'స. ముస్లిం)

أَفَمَنْ هُوَ قَائِمٌ عَلَىٰ كُلِّ نَفْسٍ بِمَا كَسَبَتْ ۗ وَجَعَلُوا لِلَّهِ
شُرَكَاءَ قُلْ سَمُّوهُمْ ۚ أَمْ تُنَبِّئُونَهُ بِمَا لَا يَعْلَمُ فِي الْأَرْضِ أَم
بِظَاهِرٍ مِّنَ الْقَوْلِ ۗ بَلْ زُيِّنَ لِلَّذِينَ كَفَرُوا مَكْرُهُمْ
وَصُدُّوا عَنِ السَّبِيلِ ۗ وَمَن يُضْلِلِ اللَّهُ فَمَا لَهُ مِنْ
هَادٍ ﴿٣٣﴾

**33.** ఏమీ? ఆయన (అల్లాహ్), ప్రతి వ్యక్తి అర్జించే దానిని కనిపెట్టుకుని ఉండేవాడు (మరియు లాభనష్టాలు కలుగజేయలేని మీ బూటకపు దైవాలు సరిసమానులా)? అయినా వారు అల్లాహ్‌కు భాగస్వాములు (సాటి) కల్పిస్తారు. వారితో ఇలా అను: "(నిజంగానే వారు అల్లాహ్ స్వయంగా నియమించుకున్న భాగస్వాములే అయితే) వారి పేర్లను తెలుపండి. లేక భూమిలో ఉన్నట్లు ఆయనకు తెలియని విషయాన్ని మీరు ఆయనకు తెలుపుతున్నారా? లేక మీరు ఇట్లే నోటికి వచ్చినట్లు వాగుతున్నారా?"[1] వాస్తవానికి సత్యాన్ని తిరస్కరించిన వారికి, వారి కుట్ర ఆకర్షణీయంగా చేయబడుతోంది మరియు వారు ఋజుమార్గం నుండి నిరోధించబడ్డారు. మరియు అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదలిన వానికి సన్మార్గం చూపేవాడు ఎవ్వడూ ఉండడు.[2]

لَّهُمْ عَذَابٌ فِي الْحَيَاةِ الدُّنْيَا ۖ وَلَعَذَابُ الْآخِرَةِ
أَشَقُّ ۖ وَمَا لَهُم مِّنَ اللَّهِ مِن وَاقٍ ﴿٣٤﴾

**34.** వారికి ఇహలోక జీవితంలో శిక్ష వుంది. మరియు వారి పరలోక జీవిత శిక్ష ఎంతో కఠినమైనది మరియు వారిని అల్లాహ్ (శిక్ష) నుండి రక్షించేవాడు ఎవ్వడూ ఉండడు.[3] (5/8)

مَّثَلُ الْجَنَّةِ الَّتِي وُعِدَ الْمُتَّقُونَ ۖ تَجْرِي مِن تَحْتِهَا
الْأَنْهَارُ ۖ أُكُلُهَا دَائِمٌ وَظِلُّهَا ۚ تِلْكَ عُقْبَى الَّذِينَ
اتَّقَوا ۖ وَّعُقْبَى الْكَافِرِينَ النَّارُ ﴿٣٥﴾

**35** * దైవభీతి గలవారికి వాగ్దానం చేయబడిన స్వర్గపు ఉదాహరణ ఇదే! దాని క్రింద సెలయేళ్ళు పారుతూ ఉంటాయి.[4] దాని ఫలాలు మరియు నీడ సదా ఉంటాయి.[5] దైవభీతి గలవారి అంతిమ

---

1 మీరు కేవలం ఊహాగానాలే చేస్తున్నారు. మీరు ఏ దేవతలనైతే ఆరాధిస్తున్నారో అవి మీకు కీడు గానీ, మేలు గానీ చేయలేవు. మీరు పిలిచేవి - వాటి పేర్లే. అవి మీరో లేక మీ తండ్రితాతలో ఇచ్చినవే. అవి మీ కల్పిత దైవాలే. చూడండి, 53:23, 7:71 మరియు 12:40

2. చూడండి, 5:41 మరియు 16:37.

3 ఈ ప్రపంచ శిక్ష (అ'జాబ్) పరలోక శిక్ష కంటే చాలా తేలికైనది. ఈ ప్రపంచ శిక్ష తాత్కాలికమైనది. పరలోక శిక్ష శాశ్వతమైనది. నరకాగ్ని భూలోక అగ్నికంటే 69 రెట్లు అధిక తీవ్రత గలది. ('స'హీ'హ్ ముస్లిం)

4 స్వర్గనరకాలు మానవుల జ్ఞానపరిధికి అగోచర విషయాలు. కావున వాటిని మానవులకు తెలిసిన ఉద్యానవనాలు మరియు అగ్నితో పోల్చి చెప్పబడుతోంది. చూడండి, 47:15

5. "జిల్లున్: అర్థం కొరకు చూడండి, 4:57 చివరి భాగం.

ఫలితం ఇదే మరియు సత్యతిరస్కారుల అంతిమ ఫలితం నరకాగ్నియే!

وَالَّذِينَ آتَيْنَاهُمُ الْكِتَابَ يَفْرَحُونَ بِمَا أُنْزِلَ إِلَيْكَ وَمِنَ الْأَحْزَابِ مَنْ يُنْكِرُ بَعْضَهُ قُلْ إِنَّمَا أُمِرْتُ أَنْ أَعْبُدَ اللَّهَ وَلَا أُشْرِكَ بِهِ إِلَيْهِ أَدْعُو وَإِلَيْهِ مَآبِ ﴿٣٦﴾

**36.** మరియు (ఓ ప్రవక్తా!) ఎవరికైతే మేము (ముందు) గ్రంథాన్ని ఇచ్చామో! వారు నీపై అవతరింపజేయబడినదాని (ఈ గ్రంథం) వలన సంతోషపడుతున్నారు.[1] మరియు వారిలోని కొన్ని వర్గాలవారు దానిలోని కొన్ని విషయాలను తిరస్కరించే వారు కూడా ఉన్నారు.[2] వారితో ఇలా అను: "నిశ్చయంగా, నేను అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించాలని మరియు ఆయనకు సాటి (భాగస్వాములను) కల్పించరాదని ఆజ్ఞాపించబడ్డాను. నేను మిమ్మల్ని ఆయన వైపునకే ఆహ్వానిస్తున్నాను మరియు గమ్యస్థానంకూడా ఆయన వద్దనే ఉంది!"

وَكَذَٰلِكَ أَنْزَلْنَاهُ حُكْمًا عَرَبِيًّا وَلَئِنِ اتَّبَعْتَ أَهْوَاءَهُمْ بَعْدَمَا جَاءَكَ مِنَ الْعِلْمِ مَا لَكَ مِنَ اللَّهِ مِنْ وَلِيٍّ وَلَا وَاقٍ ﴿٣٧﴾

**37.** మరియు ఈ విధంగా మేము అరబ్బీ భాషలో మా శాసనాన్ని అవతరింపజేశాము. ఇక నీవు ఈ జ్ఞానం వచ్చిన తరువాత కూడా వారి కోరికలను అనుసరిస్తే, అల్లాహ్ నుండి నిన్ను రక్షించేవాడు గానీ, కాపాడేవాడు గానీ ఎవ్వడూ ఉండడు.

وَلَقَدْ أَرْسَلْنَا رُسُلًا مِنْ قَبْلِكَ وَجَعَلْنَا لَهُمْ أَزْوَاجًا وَذُرِّيَّةً وَمَا كَانَ لِرَسُولٍ أَنْ يَأْتِيَ

**38.** మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి మేము నీకు పూర్వం అనేక ప్రవక్తలను పంపాము మరియు వారికి భార్యా పిల్లలను ప్రసాదించాము.[4]

---

1. వీరు ముస్లింలు.
2. వీరు క్రైస్తవులు, యూదులు మరియు ముష్రిక్‌లు.
3. చూడండి, 14:4 మరియు 12:2 ప్రతి ప్రవక్తపై అతని ప్రజల కొరకు ఆ ప్రాంతపు భాషలోనే దివ్యగ్రంథం అవతరింపజేయబడింది. వారు దానిని సులభంగా అర్థం చేసుకోవాలని. ఈ ఖుర్ఆన్ దైవప్రవక్త ము'హమ్మద్ (స'అస) పై సర్వలోకాల వారి కొరకు, అవతరింపజేయబడిన అంతిమ దివ్యగ్రంథం. చూడండి, 7:158
4. చూడండి, 25:7 దైవ ప్రవక్తలు అందరూ మానవులే. వారికి కుటుంబం ఉండేది. వారికి భార్యాబిడ్డలుండిరి. వారు సాధారణ మానవులవలే తినేవారు, త్రాగేవారు, ప్రజలతో కలిసిమెలిసి తిరిగే వారు. కాని వారిపై దివ్యజ్ఞానం (వ'హీ) వస్తూ ఉండేది. దానిని వారు ఉన్నది ఉన్నట్టుగా పూర్తిగా ప్రజలకు వినిపించి సత్యధర్మం వైపునకు ఆహ్వానించేవారు. ఒకవేళ వారు

بِاٰيَةٍ اِلَّا بِاِذۡنِ اللّٰهِ ؕ لِكُلِّ اَجَلٍ كِتَابٌ ۝

అల్లాహ్ అనుమతి లేకుండా, ఏ అద్భుత సంకేతాన్ని (స్వయంగా) తెచ్చి చూపే శక్తి ఏ ప్రవక్తకూ లేదు.[1] ప్రతి వాగ్దానా (విషయా)నికి వ్రాయబడిన ఒక ఆదేశం (శాసనం) ఉంది.[2]

يَمۡحُوا اللّٰهُ مَا يَشَآءُ وَيُثۡبِتُ ۖۚ وَعِنۡدَهٗۤ اُمُّ الۡكِتٰبِ ۝

39 అల్లాహ్ తాను కోరిన దానిని రద్దు చేస్తాడు మరియు (తాను కోరిన దానిని) స్థిరపరుస్తాడు.[3] మరియు మాతృగ్రంథం (ఉమ్ముల్ కితాబ్)[4] ఆయన దగ్గరే ఉంది.

وَاِنۡ مَّا نُرِيَنَّكَ بَعۡضَ الَّذِىۡ نَعِدُهُمۡ اَوۡ نَتَوَفَّيَنَّكَ فَاِنَّمَا عَلَيۡكَ الۡبَلٰغُ وَعَلَيۡنَا الۡحِسَابُ ۝

40. మరియు (ఓ ప్రవక్తా!) మేము వారికి చేసిన వాగ్దానాలలో కొన్నింటిని నీకు చూపినా, లేదా (వాటిని చూపకముందు) నిన్ను మరణింపజేసినా, నీ బాధ్యత కేవలం (మా సందేశాన్ని) అందజేయటమే! మరియు లెక్క తీసుకోవటం కేవలం మాపని

اَوَلَمۡ يَرَوۡا اَنَّا نَاۡتِى الۡاَرۡضَ نَـنۡقُصُهَا مِنۡ اَطۡرَافِهَا ؕ وَاللّٰهُ يَحۡكُمُ لَا مُعَقِّبَ لِحُكۡمِهٖ ؕ وَهُوَ سَرِيۡعُ الۡحِسَابِ ۝

41. ఏమీ? వాస్తవానికి మేము భూమిని అన్ని వైపులనుండి తగ్గిస్తూ వస్తున్నామనేది వారు చూడటం లేదా?[5] మరియు అల్లాహ్‌యే ఆజ్ఞ ఇస్తాడు; ఆయన ఆజ్ఞను మార్చేవాడు ఎవ్వడూ లేడు మరియు ఆయన లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు.

---

దైవదూతలైతే వారికెలా సంతానం మరియు కుటుంబం ఉంటాయి?

1. అద్భుత సంకేతాల శక్తి కేవలం అల్లాహ్ (సు.తా.)కే ఉంది. ఆయన అనుమతి లేనిదే ఏ ప్రవక్త కూడా వాటిని చూపలేడు. అల్లాహ్ (సు.తా.) తన ఇష్ట ప్రకారం తాను అవసరం అనుకున్నప్పుడు వాటిని చూపుతాడు. చూడండి, 6:109

2 అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రతి వాగ్దానానికి ఒక సమయం నియమింపబడి ఉంది. అల్లాహ్ అలా ఆ సమయం వచ్చేవరకు ప్రజలకు వ్యవధినిస్తాడు. అది వచ్చిన తరువాత దానిని ఎవ్వరూ ఆపలేరు. అల్లాహ్ (సు.తా.) తన వాగ్దానం పూర్తిచేసి తీరుతాడు.
దీని మరొక తాత్పర్యం, 'ప్రతి యుగానికి ఒక గ్రంథం ఉంది.'

3 చూడండి, 2:106.

4 చూడండి, 43:4 మరియు 85:22. ఉమ్ముల్ కితాబ్, అంటే లౌ'హె మ'హ్ఫూ''జ్ సురక్షితమైన ఫలకం, మూల గ్రంథం. అంటే యథాస్థితిలో, భద్రంగా ఉంచబడిన గ్రంథం.

5 అంటే, 'అరేబియా భూభాగం, రోజు రోజుకు ముష్రికుల కొరకు తగ్గుతూ పోవడం మరియు ముస్లింలు దానిని ఆక్రమించుకోవడం వారు (ముష్రికులు) చూడటం లేదా?

وَقَدْ مَكَرَ الَّذِينَ مِن قَبْلِهِمْ فَلِلَّهِ الْمَكْرُ جَمِيعًا يَعْلَمُ مَا تَكْسِبُ كُلُّ نَفْسٍ وَسَيَعْلَمُ الْكُفَّارُ لِمَنْ عُقْبَى الدَّارِ ﴿٤٢﴾

**42.** మరియు వాస్తవానికి వారికి పూర్వం ఉన్నవారు కూడా కుట్రలుపన్నారు. కాని, కుట్రలన్నీ అల్లాహ్‌కే చెందినవి. ప్రతిప్రాణి సంపాదించేది ఆయనకు తెలుసు. మరియు (మేలైన) అంతిమ (పరలోక) నివాసం ఎవరిదో సత్యతిరస్కారులు తెలుసుకుంటారు.

وَيَقُولُ الَّذِينَ كَفَرُوا لَسْتَ مُرْسَلًا قُلْ كَفَىٰ بِاللَّهِ شَهِيدًا بَيْنِي وَبَيْنَكُمْ وَمَنْ عِندَهُ عِلْمُ الْكِتَابِ ﴿٤٣﴾

**43.** మరియు (ఓ ప్రవక్తా!) సత్య తిరస్కారులు నీతో అంటున్నారు: "నీవు సందేశహరుడవు కావు!" వారితో అను: "నాకూ-మీకూ మధ్య అల్లాహ్ సాక్ష్యమే చాలు! మరియు వారి (సాక్ష్యం), ఎవరికైతే గ్రంథ జ్ఞానం ఉందో!"[1]

1 అంటే, ఇస్లాం స్వీకరించిన 'అబ్దుల్లాహ్ బిన్ సల్లాం మరియు సల్మాన్ ఫారసీ (ర'ది'అన్హుమ్)ల వంటి యూదుల మరియు క్రైస్తవుల సాక్ష్యం అన్నమాట!

## 14. సూరహ్ ఇబ్రాహీమ్

## سُورَةُ إِبْرَاهِيمَ

ఇబ్రాహీమ్ ('అ.స.) మక్కా ముకర్రమా కొరకు చేసిన ప్రార్థన (ఆయత్ లు 35-41), ఈ సూరహ్ యొక్క మూలభాగం. ఇది చివరి మక్కా కాలపు సూరాహ్ లలో (10-15) ఐదవది. ఇందులో **52** ఆయతులున్నాయి. ఇత్ఖాన్ ప్రకారం ఇది సూరహ్ నూ'హ్ (71) తరువాత అవతరింపజేయబడింది. దివ్యసందేశాలు ప్రజలను అంధకారాలనుండి వెలుగులోకి తీసుకురావటానికి అవతరింప జేయబడ్డాయి. ఇతర దివ్యగ్రంథాలు తమ ప్రవక్తలపై తమకాలపు ప్రజలకొరకు వచ్చాయి. కాని దివ్యఖుర్ఆన్ సర్వలోకాల వారికొరకు అవతరింపజేయబడిందని, అల్లాహ్ (సు.తా.) మొదటి మరియు 52వ ఆయత్ లలో వ్యక్తంచేశాడు.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ○

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓرۚ كِتَٰبٌ أَنزَلۡنَٰهُ إِلَيۡكَ لِتُخۡرِجَ ٱلنَّاسَ مِنَ ٱلظُّلُمَٰتِ إِلَى ٱلنُّورِ بِإِذۡنِ رَبِّهِمۡ إِلَىٰ صِرَٰطِ ٱلۡعَزِيزِ ٱلۡحَمِيدِ ۝١

**1.** అలిఫ్-లామ్-రా. (ఇది) ఒక దివ్యగ్రంథం. దీనిని మేము, ప్రజలను - వారి ప్రభువు అనుమతితో - అంధకారాలనుండి వెలుతురులోకి,[1] సర్వశక్తిమంతుడు, సర్వస్తోత్రాలకు అర్హుడైన (అల్లాహ్) మార్గం వైపునకు తీసుకురావటానికి, (ఓ ము'హమ్మద్!) నీపై అవతరింపజేశాము.

ٱللَّهِ ٱلَّذِي لَهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۗ وَوَيۡلٞ لِّلۡكَٰفِرِينَ مِنۡ عَذَابٖ شَدِيدٍ ۝٢

**2.** ఆయనే అల్లాహ్! ఆకాశాలలో ఉన్నదీ మరియు భూమిలో ఉన్నదీ సర్వమూ ఆయనకే చెందుతుంది! మరియు సత్యతిరస్కారులకు కఠినశిక్ష వల్ల తీవ్రమైన దుఃఖం (వ్యథ) కలుగుతుంది.

ٱلَّذِينَ يَسۡتَحِبُّونَ ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا عَلَى ٱلۡأٓخِرَةِ وَيَصُدُّونَ عَن سَبِيلِ ٱللَّهِ وَيَبۡغُونَهَا عِوَجًاۚ أُوْلَٰٓئِكَ فِي ضَلَٰلِۭ بَعِيدٖ ۝٣

**3.** ఎవరైతే పరలోక జీవితంకంటే, ఇహలోక జీవితానికి అధిక ప్రాధాన్యతనిచ్చి, (ప్రజలను) అల్లాహ్ మార్గం నుండి ఆటంకపరుస్తూ, దానిని వక్రమైనదిగా చూపగోరుతారో! అలాంటి వారే మార్గభ్రష్టత్వంలో చాలాదూరం వెళ్ళిపోయిన వారు.

وَمَآ أَرۡسَلۡنَا مِن رَّسُولٍ إِلَّا بِلِسَانِ قَوۡمِهِۦ لِيُبَيِّنَ

**4.** మరియు మేము ప్రతి ప్రవక్తను, అతని జాతివారి భాషతోనే పంపాము; అతను వారికి

1. చూడండి, 57:9 మరియు 2:257

فَيُضِلُّ اللَّهُ مَنْ يَشَاءُ وَيَهْدِي مَنْ يَشَاءُ ۚ وَهُوَ الْعَزِيزُ الْحَكِيمُ ④

స్పష్టంగా బోధించటానికి. మరియు అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టత్వంలో వదలుతాడు. మరియు తాను కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు.[1] మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

وَلَقَدْ أَرْسَلْنَا مُوسَىٰ بِآيَاتِنَا أَنْ أَخْرِجْ قَوْمَكَ مِنَ الظُّلُمَاتِ إِلَى النُّورِ وَذَكِّرْهُمْ بِأَيَّامِ اللَّهِ ۚ إِنَّ فِي ذَٰلِكَ لَآيَاتٍ لِكُلِّ صَبَّارٍ شَكُورٍ ⑤

5. మరియు వాస్తవానికి మేము మూసాను, మా సూచన(ఆయాత్)లతో పంపి: "నీ జాతి వారిని అంధకారాల నుండి వెలుతురు వైపునకు తెచ్చి, వారికి అల్లాహ్ దినాలను[2] జ్ఞాపకం చేయించు." అని అన్నాము. నిశ్చయంగా, ఇందులో సహనశీలురకు, కృతజ్ఞులకు ఎన్నో సూచనలున్నాయి.[3]

وَإِذْ قَالَ مُوسَىٰ لِقَوْمِهِ اذْكُرُوا نِعْمَةَ اللَّهِ عَلَيْكُمْ إِذْ أَنْجَاكُمْ مِنْ آلِ فِرْعَوْنَ يَسُومُونَكُمْ سُوءَ الْعَذَابِ وَيُذَبِّحُونَ أَبْنَاءَكُمْ وَيَسْتَحْيُونَ نِسَاءَكُمْ ۚ وَفِي ذَٰلِكُمْ بَلَاءٌ مِنْ رَبِّكُمْ عَظِيمٌ ⑥

6. మూసా తన జాతి వారితో ఇలా అన్నాడు: "అల్లాహ్ మీకు చేసిన అనుగ్రహాలను జ్ఞాపకం చేసుకోండి. ఆయన మీకు ఫిర్'ఔన్ జాతి వారి నుండి విముక్తి కలిగించాడు. వారు మిమ్మల్ని తీవ్రమైన శిక్షలకు గురిచేస్తూ ఉండేవారు, మీ కుమారులను వధించి, మీ కుమార్తె (స్త్రీ)లను బ్రతుకనిచ్చే వారు.[4] మరియు అందులో మీకు, మీ ప్రభువు తరఫునుండి ఒక గొప్ప పరీక్ష ఉండింది."

وَإِذْ تَأَذَّنَ رَبُّكُمْ لَئِنْ شَكَرْتُمْ لَأَزِيدَنَّكُمْ

7. మరియు మీ ప్రభువు ప్రకటించింది

1 ఎవడు మార్గభ్రష్టుడవుతాడో మరియు ఎవడు సన్మార్గంపై ఉంటాడో అల్లాహ్ (సు.తా.)కు తెలుసు కాబట్టి ఆయన వారిని వారి పరిస్థితులలో వదలుతాడు. అల్లాహ్ (సు.తా.) బలవంతంగా ఎవరినీ కూడా మార్గభ్రష్టులుగా గానీ, సన్మార్గులుగా గానీ చేయడు. ఇంకా చూడండి, 16:93

2 అయ్యామిల్లాహ్: అంటే ఇస్రాయీ'ల్ సంతతివారిపై అల్లాహ్ (సు.తా.) ఆలా చేసిన అనుగ్రహాలు మరియు వారిపై పడ్డ శిక్షలు.

3 సహనం వహించి కృతజ్ఞతలు తెలిపే వారికి చాలా లాభాలుంటాయి. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహ్ (సు.తా.) తన దాసుని కొరకు ఎట్టి పరిస్థితిని ఏర్పరచినా అది అతని మేలుకే! అతనికి కష్టాలు కలిగిస్తే, వాటిని అతడు సహించితే అతని మేలుకే! లేక అతనికి సుఖసంతోషాలు ప్రసాదిస్తే అతడు దానికి తన ప్రభువుకు కృతజ్ఞతలు చూపాలి.' ('స'హీ'హ్ ముస్లిం)

4 చూడండి, 2:49

وَلَئِن كَفَرْتُمْ إِنَّ عَذَابِي لَشَدِيدٌ ۝

(జ్ఞాపకం చేసుకోండి): "మీరు కృతజ్ఞులైతే! నేను మిమ్మల్ని ఎంతో అధికంగా అనుగ్రహిస్తాను.[1] కాని ఒకవేళ మీరు కృతఘ్నులైతే! నిశ్చయంగా, నా శిక్ష ఎంతో కఠినమైనది."[2]

وَقَالَ مُوسَىٰ إِن تَكْفُرُوا أَنتُمْ وَمَن فِي الْأَرْضِ جَمِيعًا فَإِنَّ اللَّهَ لَغَنِيٌّ حَمِيدٌ ۝

**8.** మరియు మూసా ఇలా అన్నారు: "ఒకవేళ మీరు మరియు భూమిలోనున్న వారందరూ సత్యతిరస్కారానికి పాల్పడితే! తెలుసుకోండి నిశ్చయంగా, అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు."

أَلَمْ يَأْتِكُمْ نَبَأُ الَّذِينَ مِن قَبْلِكُمْ قَوْمِ نُوحٍ وَعَادٍ وَثَمُودَ ۛ وَالَّذِينَ مِن بَعْدِهِمْ ۛ لَا يَعْلَمُهُمْ إِلَّا اللَّهُ ۚ جَاءَتْهُمْ رُسُلُهُم بِالْبَيِّنَاتِ فَرَدُّوا أَيْدِيَهُمْ فِي أَفْوَاهِهِمْ وَقَالُوا إِنَّا كَفَرْنَا بِمَا أُرْسِلْتُم بِهِ وَإِنَّا لَفِي شَكٍّ مِّمَّا تَدْعُونَنَا إِلَيْهِ مُرِيبٍ ۝

**9.** ఏమీ? పూర్వం గతించిన, ప్రజల గాథలు మీకు చేరలేదా? నూ'హ్, 'ఆద్ మరియు స'మూద్ జాతివారి మరియు వారి తరువాత వచ్చిన వారి (గాథలు)? వారిని గురించి అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఎరుగరు. వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చినపుడు, వారు తమ నోళ్ళలో తమ చేతులు పెట్టుకొని[3] ఇలా అన్నారు: "నిశ్చయంగా, మేము మీతో పంపబడిన సందేశాన్ని తిరస్కరిస్తున్నాము. మరియు నిశ్చయంగా, మీరు దేని వైపునకైతే మమ్మల్ని ఆహ్వానిస్తున్నారో, దానిని గురించి మేము ఆందోళన కలిగించేటంత సందేహంలో పడి వున్నాము."[4] (3/4)

قَالَتْ رُسُلُهُمْ أَفِي اللَّهِ شَكٌّ فَاطِرِ السَّمَاوَاتِ وَالْأَرْضِ ۖ يَدْعُوكُمْ لِيَغْفِرَ لَكُم مِّن ذُنُوبِكُمْ وَيُؤَخِّرَكُمْ إِلَىٰ أَجَلٍ مُّسَمًّى ۚ قَالُوا

**10.** * వారి ప్రవక్తలు (వారితో) ఇలా అన్నారు: "ఏమీ? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించిన, అల్లాహ్‌ను గురించి (మీకు) సందేహం ఉందా? ఆయన మీ పాపాలను క్షమించటానికి మరియు

---

1 అల్లాహుతా'ఆలా మీకు ప్రసాదించిన దానికి మీరు కృతజ్ఞులైతే ఆయన మరింత ప్రసాదిస్తాడు

2 కృతఘ్నులను అల్లాహుతా'ఆలా కఠినంగా శిక్షిస్తాడు.

3 చూడండి, 3:119, కోపంతో తమ చేతులను కొరుక్కుంటూ అన్నారు (షౌకాని, 'తబరీ, ర.'అలైహిమ్)

4 చూడండి, 11:62 ఇదే విధమైన ఆశ్చర్యం. 'సాలి'హ్ ('అ.స.) యొక్క ప్రజలు సూచించారు. ప్రతి కాలపు ప్రజలు అల్లాహ్ (సు.తా.)ను నిరాకరించారు లేదా ఆయనకు సిఫారసుదారులను లేక భాగస్వాములను కల్పించారు.

إِنْ أَنتُمْ إِلَّا بَشَرٌ مِّثْلُنَا تُرِيدُونَ أَن تَصُدُّونَا عَمَّا كَانَ يَعْبُدُ آبَاؤُنَا فَأْتُونَا بِسُلْطَانٍ مُّبِينٍ ﴿١٠﴾

మీకు ఒక నిర్ణీతకాలం వరకు వ్యవధి నివ్వటానికి మిమ్మల్ని పిలుస్తున్నాడు!"[1] వారన్నారు: "మీరు కూడా మా వంటి మానవులే, మీరు మా తండ్రితాతలు ఆరాధిస్తూ వచ్చిన (దైవాల ఆరాధన నుండి) మమ్మల్ని ఆపాలనుకుంటున్నారా? అయితే స్పష్టమైన ప్రమాణం ఏదైనా తీసుకురండి."[2]

قَالَتْ لَهُمْ رُسُلُهُمْ إِن نَّحْنُ إِلَّا بَشَرٌ مِّثْلُكُمْ وَلَٰكِنَّ اللَّهَ يَمُنُّ عَلَىٰ مَن يَشَاءُ مِنْ عِبَادِهِ ۖ وَمَا كَانَ لَنَا أَن نَّأْتِيَكُم بِسُلْطَانٍ إِلَّا بِإِذْنِ اللَّهِ ۚ وَعَلَى اللَّهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُونَ ﴿١١﴾

**11.** వారి ప్రవక్తలు వారితో (ఇంకా) ఇలా అన్నారు: "నిశ్చయంగా, మేము మీ వంటి మానవులం మాత్రమే! కాని అల్లాహ్ తన దాసులలో తాను కోరిన వారిని అనుగ్రహిస్తాడు మరియు - అల్లాహ్ అనుమతిస్తేనే తప్ప - మీ కొరకు ప్రమాణం తీసుకురావటమనేది మా వశంలో లేదు. మరియు విశ్వాసులు కేవలం అల్లాహ్ మీదనే దృఢనమ్మకం ఉంచుకోవాలి![3]

وَمَا لَنَا أَلَّا نَتَوَكَّلَ عَلَى اللَّهِ وَقَدْ هَدَانَا سُبُلَنَا ۚ وَلَنَصْبِرَنَّ عَلَىٰ مَا آذَيْتُمُونَا ۚ وَعَلَى اللَّهِ فَلْيَتَوَكَّلِ الْمُتَوَكِّلُونَ ﴿١٢﴾

**12.** "మరియు మేము అల్లాహ్ మీద నమ్మకం ఎందుకు ఉంచుకోరాదు? వాస్తవానికి ఆయనే మాకు సన్మార్గపు దారులను చూపాడు. మరియు మేము నిశ్చయంగా, మీరు పెట్టే బాధలను సహనంతో భరిస్తాము. మరియు నమ్మకం గలవారు, కేవలం అల్లాహ్ మీదే దృఢనమ్మకం ఉంచుకోవాలి!"

وَقَالَ الَّذِينَ كَفَرُوا لِرُسُلِهِمْ لَنُخْرِجَنَّكُم مِّنْ أَرْضِنَا أَوْ لَتَعُودُنَّ فِي مِلَّتِنَا ۖ فَأَوْحَىٰ إِلَيْهِمْ رَبُّهُمْ لَنُهْلِكَنَّ الظَّالِمِينَ ﴿١٣﴾

**13.** మరియు సత్యతిరస్కారులు తమ ప్రవక్తలతో అన్నారు: "మీరు మా మతంలోకి తిరిగిరాకపోతే మేము తప్పకుండా మిమ్మల్ని మా దేశంనుండి వెళ్ళగొడ్తాము."[4] అప్పుడు వారి ప్రభువు వారికి ఇలా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాడు: "మేము ఈ దుర్మార్గులను తప్పక

---

1 అద్భుత సూచనలైతే ప్రవక్తలద్వారా చూపబడతాయి కాని వారు, తాము కోరిన అద్భుత సూచనలు చూపమని కోరారు.

2. చూడండి, 13:31 చివరి భాగం.

3. చూడండి, 7:75 మరియు 13:43

4 చూడండి, 7:88-89 అక్కడ ఇదే ప్రశ్న షు'ఐబ్ ('అ.స.) ముందు పెట్టబడింది

నాశనం చేస్తాము.[1]

14. "మరియు వారి తరువాత ఆ భూమి మీద మిమ్మల్ని నివసింపజేస్తాము.[2] ఇది నా సాన్నిధ్యంలో నిలువటానికి (లెక్క చెప్పటానికి) భయపడేవానికి మరియు నా హెచ్చరికకు (శిక్షకు) భయపడేవానికి (నా వాగ్దానం)."[3]

وَلَنُسْكِنَنَّكُمُ الْأَرْضَ مِن بَعْدِهِمْ ذَٰلِكَ لِمَنْ خَافَ
مَقَامِي وَخَافَ وَعِيدِ ﴿١٤﴾

15. మరియు వారు తీర్పుకోరారు[4] మరియు నిర్దయుడూ,[5] (సత్య) విరోధి అయిన ప్రతివాడూ నాశనమయ్యాడు.

وَاسْتَفْتَحُوا وَخَابَ كُلُّ جَبَّارٍ عَنِيدٍ ﴿١٥﴾

16. అతని ముందు నరకం అతనికై వేచిఉంటుంది మరియు అక్కడ సలసలకాగే చిక్కని చీములాంటి నీరు త్రాగటానికి ఇవ్వబడుతుంది.[6]

مِّن وَرَائِهِ جَهَنَّمُ وَيُسْقَىٰ مِن مَّاءٍ صَدِيدٍ ﴿١٦﴾

17. దానిని అతడు గుటకలు గుటకలుగా బలవంతంగా గొంతులోకి దింపటానికి ప్రయత్నిస్తాడు, కాని దానిని మ్రింగలేడు అతనికి ప్రతివైపు నుండి మరణం ఆసన్నమవుతుంది. కాని అతడు మరణించలేడు. మరియు అతని ముందు భయంకరమైన శిక్ష వేచిఉంటుంది.

يَتَجَرَّعُهُ وَلَا يَكَادُ يُسِيغُهُ وَيَأْتِيهِ الْمَوْتُ مِن كُلِّ
مَكَانٍ وَمَا هُوَ بِمَيِّتٍ وَمِن وَرَائِهِ عَذَابٌ غَلِيظٌ ﴿١٧﴾

18. తమ ప్రభువును తిరస్కరించిన వారి కర్మలను, తుఫాను దినమున పెనుగాలి ఎగురవేసే బూడిదతో పోల్చవచ్చు.[7] వారు

مَّثَلُ الَّذِينَ كَفَرُوا بِرَبِّهِمْ أَعْمَالُهُمْ كَرَمَادٍ اشْتَدَّتْ بِهِ
الرِّيحُ فِي يَوْمٍ عَاصِفٍ لَّا يَقْدِرُونَ مِمَّا كَسَبُوا عَلَىٰ

---

1 చూడండి, 37:171-173.

2 చూడండి, 21:105

3 చూడండి, 79.40-41; మరియు 55.46

4 ఈ కోరిక సత్యతిరస్కారులది కూడా కావచ్చు. చూడండి 8:19,32. లేదా ప్రవక్తలది కూడా కావచ్చు ఒకవేళ ఈ కోరిక ప్రవక్తలది అయితే 'మరియు వారు (ప్రవక్తలు తమ ప్రభువు) సహాయాన్ని (జయాన్ని) కోరారు మరియు నిర్దయుడు నాశనమయ్యాడు ' అని చదవబడుతుంది

5 జబ్బారున్ Insolent Compeller, Ferocious, Irresistible, బలవంతం, లేక నిర్బంధం చేసేవాడు, నిరంకుశుడు, నిర్దయుడు, క్రూరుడు.

6. చూడండి, 6:70.

7. సత్యతిరస్కారుల కర్మలు పునరుత్థానదినమున ఈ విధంగానే ఎగిరిపోతాయి వారికేలాంటి

తమ కర్మలకు ఎలాంటి ప్రతిఫలం పొందలేరు ఇదే మార్గభ్రష్టత్వంలో చాలా దూరం పోవటం.[1]

شَيْءٍ ۚ ذَٰلِكَ هُوَ الضَّلَالُ الْبَعِيدُ ﴿١٨﴾

**19.** ఏమీ? నిశ్చయంగా, అల్లాహ్ భూమ్యాకాశాలను సత్యంతో సృష్టించాడని నీకు తెలియదా?[2] ఆయన కోరితే మిమ్మల్ని నశింపజేసి, మరొక క్రొత్త సృష్టిని తేగలడు![3]

أَلَمْ تَرَ أَنَّ اللَّهَ خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ بِالْحَقِّ ۚ
إِن يَشَأْ يُذْهِبْكُمْ وَيَأْتِ بِخَلْقٍ جَدِيدٍ ﴿١٩﴾

**20.** మరియు అలాచేయటం అల్లాహ్‌కు కష్టమైనపని కాదు.

وَمَا ذَٰلِكَ عَلَى اللَّهِ بِعَزِيزٍ ﴿٢٠﴾

**21.** మరియు వారందరూ అల్లాహ్ ముందు హాజరుపరచబడినప్పుడు, (ఇహలోకంలో) బలహీనులుగా ఉన్నవారు గొప్పవారిగా ఉన్నవారితో అంటారు: "వాస్తవానికి ప్రపంచంలో మేము మిమ్మల్ని అనుసరించాము, ఇపుడు మీరు మమ్మల్ని అల్లాహ్ శిక్షనుండి కాపాడటానికి ఏమైనా చేయగలరా?" వారంటారు: "అల్లాహ్ మాకు సన్మార్గం చూపిఉంటే మేము మీకు కూడా (సన్మార్గం) చూపి ఉండేవారం. ఇపుడు మనం దుఃఖపడినా లేదా సహనం వహించినా అంతా ఒక్కటే. మనకిప్పుడు తప్పించుకునే మార్గం ఏదీ లేదు."[4]

وَبَرَزُوا لِلَّهِ جَمِيعًا فَقَالَ الضُّعَفَاءُ لِلَّذِينَ
اسْتَكْبَرُوا إِنَّا كُنَّا لَكُمْ تَبَعًا فَهَلْ أَنتُم مُّغْنُونَ
عَنَّا مِنْ عَذَابِ اللَّهِ مِن شَيْءٍ ۚ قَالُوا لَوْ هَدَانَا
اللَّهُ لَهَدَيْنَاكُمْ ۖ سَوَاءٌ عَلَيْنَا أَجَزِعْنَا أَمْ صَبَرْنَا
مَا لَنَا مِن مَّحِيصٍ ﴿٢١﴾

**22.** మరియు తీర్పు జరిగిన తరువాత షైతాను (వారితో) అంటాడు: "నిశ్చయంగా, అల్లాహ్ మీకు చేసిన వాగ్దానమే సత్యమైన వాగ్దానం. మరియు నేను మీకు వాగ్దానం చేసి దానిని భంగంచేశాను. మరియు నాకు మీపై

وَقَالَ الشَّيْطَانُ لَمَّا قُضِيَ الْأَمْرُ إِنَّ اللَّهَ وَعَدَكُمْ
وَعْدَ الْحَقِّ وَوَعَدتُّكُمْ فَأَخْلَفْتُكُمْ ۖ وَمَا كَانَ لِيَ
عَلَيْكُم مِّن سُلْطَانٍ إِلَّا أَن دَعَوْتُكُمْ فَاسْتَجَبْتُمْ
لِي ۖ فَلَا تَلُومُونِي وَلُومُوا أَنفُسَكُم ۖ مَّا أَنَا

పుణ్యఫలితం దొరకదు.

1 చూడండి, 22:12 చివరి భాగంలో కూడా ఈ పలుకులే ఉన్నాయి

2. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 10:5.

3 ఈ విషయమే ఎన్నోసార్లు విశదీకరించబడింది చూడండి, 35:16-17, 47:38, 5:54, 4:133

4. ఈ విధమైన ఆయతులకు చూడండి, 40:47-48, 7:38-39, 33:66, 68. నరకవాసులు ఒకరితోనొకరు వాదులాడుకునేదానికి, చూడండి, 34:31-33

بِمُصْرِخِكُمْ وَمَا أَنْتُمْ بِمُصْرِخِيَّ ۖ إِنِّي كَفَرْتُ بِمَا
أَشْرَكْتُمُونِ مِنْ قَبْلُ ۗ إِنَّ الظَّالِمِينَ لَهُمْ
عَذَابٌ أَلِيمٌ ﴿٢٢﴾

ఎలాంటి అధికారం ఉండేది కాదు; నేను కేవలం మిమ్మల్ని ఆహ్వానించాను, మీరు స్వీకరించారు.[1] కావున మీరు నన్ను నిందించకండి, మిమ్మల్ని మీరే నిందించుకోండి. నేను మీకు సహాయం చేయలేను మరియు మీరూ నాకు సహాయం చేయలేరు. ఇంతకు ముందు మీరు నన్ను (అల్లాహ్‌కు) సాటిగా కల్పించినదాన్ని నిశ్చయంగా, నేను తిరస్కరిస్తున్నాను."[2] నిశ్చయంగా, దుర్మార్గులకు బాధాకరమైన శిక్ష ఉంది.

وَأُدْخِلَ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ جَنَّاتٍ
تَجْرِي مِنْ تَحْتِهَا الْأَنْهَارُ خَالِدِينَ فِيهَا بِإِذْنِ
رَبِّهِمْ ۖ تَحِيَّتُهُمْ فِيهَا سَلَامٌ ﴿٢٣﴾

**23.** మరియు విశ్వసించి, సత్కార్యాలు చేసేవారిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గ వనాలలో ప్రవేశింపజేయబడుతుంది వారి ప్రభువు అనుమతితో వారక్కడ శాశ్వతంగా ఉంటారు. వారితో అక్కడ: "మీకు శాంతి కలుగు గాక (సలాం)!" అని అనబడుతుంది.[3]

أَلَمْ تَرَ كَيْفَ ضَرَبَ اللَّهُ مَثَلًا كَلِمَةً طَيِّبَةً
كَشَجَرَةٍ طَيِّبَةٍ أَصْلُهَا ثَابِتٌ وَفَرْعُهَا فِي السَّمَاءِ ﴿٢٤﴾

**24.** మంచి మాట (కలిమయె 'తయ్యిబ్)ను, అల్లాహ్ దేనితో పోల్చాడో మీకు తెలియదా? ఒక మేలుజాతి చెట్టుతో! దాని వ్రేళ్ళు (భూమిలో) స్థిరంగా నాటుకొని ఉంటాయి మరియు దాని శాఖలు ఆకాశాన్ని (అంటుకొంటున్నట్లు) ఉంటాయి

تُؤْتِي أُكُلَهَا كُلَّ حِينٍ بِإِذْنِ رَبِّهَا ۗ وَيَضْرِبُ اللَّهُ
الْأَمْثَالَ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَذَكَّرُونَ ﴿٢٥﴾

**25.** తన ప్రభువు ఆజ్ఞతో, అది ఎల్లప్పుడూ ఫలాలను ఇస్తూ ఉంటుంది. మరియు ప్రజలు జ్ఞాపకముంచుకోవాలని అల్లాహ్ ఈ విధమైన

---

**1.** చూడండి, 4:120 షై'తాన్ అంటాడు నేను మిమ్మల్ని బలవంతం చేయలేదు కేవలం వాగ్దానం చేశాను

**2** షై'తాను ఎన్నడూ తాను అల్లాహ్ (సు.తా.)కు సాటి అని అనలేదు. చూడండి, 7:20 మరియు 15:36, 39లలో షైతాన్ అన్నాడు: 'ఓ నా ప్రభూ! ...' అని మరియు 8:48, 59:16లలో: 'నేను అల్లాహ్‌కు భయపడతాను ...' అని కాని ప్రజలకు వారి పాపకార్యాలను మంచివిగా కనిపించేటట్లు చేస్తాడు చూడండి, 6:43, 8:48, 16:63, 27:24, 29:38 షైతాన్ ఎన్నడూ తనను తాను అల్లాహ్ (సు.తా.)కు సమానుడిగా చెప్పుకోలేదు.

**3** చూడండి, 10:10.

ఉపమానాలు ఇస్తూ ఉంటాడు.[1]

**26.** మరియు చెడ్డ మాటను, భూమి నుండి పెల్లగింపబడిన, స్థిరత్వంలేని, ఒక చెడ్డజాతి చెట్టుతో పోల్చవచ్చు!

وَمَثَلُ كَلِمَةٍ خَبِيثَةٍ كَشَجَرَةٍ خَبِيثَةٍ اجْتُثَّتْ
مِنْ فَوْقِ الْأَرْضِ مَا لَهَا مِنْ قَرَارٍ ﴿٢٦﴾

**27.** విశ్వసించి తమ మాటపై స్థిరంగా ఉన్న వారిని అల్లాహ్ ఇహలోకంలోనూ మరియు పరలోకంలోనూ స్థిరపరుస్తాడు మరియు అల్లాహ్ దుర్మార్గులను మార్గభ్రష్టులుగా చేస్తాడు. మరియు అల్లాహ్ తానుకోరినది చేస్తాడు (7/8)

يُثَبِّتُ اللَّهُ الَّذِينَ آمَنُوا بِالْقَوْلِ الثَّابِتِ فِي
الْحَيَاةِ الدُّنْيَا وَفِي الْآخِرَةِ ۖ وَيُضِلُّ اللَّهُ الظَّالِمِينَ ۚ
وَيَفْعَلُ اللَّهُ مَا يَشَاءُ ﴿٢٧﴾

**28.** * ఏమీ? నీవు చూడలేదా (ఎరుగవా)? అల్లాహ్ అనుగ్రహాలను సత్యతిరస్కారంగా మార్చిన వారిని మరియు తమ జాతి వారిని వినాశ గృహంలోకి త్రోసినవారిని -

أَلَمْ تَرَ إِلَى الَّذِينَ بَدَّلُوا نِعْمَتَ اللَّهِ كُفْرًا وَأَحَلُّوا
قَوْمَهُمْ دَارَ الْبَوَارِ ﴿٢٨﴾

**29.** (అంటే) నరకం! వారంతా అందులో ప్రవేశిస్తారు. మరియు అది ఎంత దుర్భరమైన నివాసము

جَهَنَّمَ يَصْلَوْنَهَا ۖ وَبِئْسَ الْقَرَارُ ﴿٢٩﴾

**30.** మరియు (ప్రజలను) ఆయన మార్గం నుండి తప్పించటానికి వారు అల్లాహ్‌కు సమాను(అందాదు)లను కల్పించారు. వారితో అను: "మీరు (తాత్కాలికంగా) సుఖ సంతోషాలను అనుభవించండి. ఎందుకంటే! నిశ్చయంగా, మీ గమ్యస్థానం నరకాగ్నియే!"

وَجَعَلُوا لِلَّهِ أَندَادًا لِّيُضِلُّوا عَن سَبِيلِهِ ۗ قُلْ
تَمَتَّعُوا فَإِنَّ مَصِيرَكُمْ إِلَى النَّارِ ﴿٣٠﴾

**31.** నా దాసులలో విశ్వసించిన వారితో నమా'జ్ స్థాపించమని మరియు మేము వారికిచ్చిన ఉపాధి నుండి రహస్యంగానో, బహిరంగంగానో - బేరం జరుగటం గానీ, మిత్రుల సహాయం పొందటం గానీ సాధ్యం కాని దినం రాకపూర్వమే - ఖర్చు పెట్టమని చెప్పు.[2]

قُل لِّعِبَادِيَ الَّذِينَ آمَنُوا يُقِيمُوا الصَّلَاةَ
وَيُنفِقُوا مِمَّا رَزَقْنَاهُمْ سِرًّا وَعَلَانِيَةً مِّن
قَبْلِ أَن يَأْتِيَ يَوْمٌ لَّا بَيْعٌ فِيهِ وَلَا خِلَالٌ ﴿٣١﴾

---

1 చూడండి, 39:29

2 ఈ విధమైన ఆయత్‌లకొరకు చూడండి, 3:91,5:36,10:54,13:18, 39:47, 70:11-15

**32.** అల్లాహ్‌యే! ఆయనే, భూమ్యాకాశాలను సృష్టించాడు. మరియు ఆకాశంనుండి నీటిని కురిపించి, దానినుండి మీకొరకు ఆహారంగా ఫలాలను పుట్టించాడు. మరియు తన ఆజ్ఞతో, ఓడలను మీకు ఉపయుక్తంగా చేసి సముద్రంలో నడిపించాడు. మరియు నదులను కూడా మీకు ఉపయుక్తంగా చేశాడు.

اللَّهُ الَّذِي خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ
وَأَنْزَلَ مِنَ السَّمَاءِ مَاءً فَأَخْرَجَ بِهِ مِنَ
الثَّمَرَاتِ رِزْقًا لَكُمْ ۖ وَسَخَّرَ لَكُمُ الْفُلْكَ لِتَجْرِيَ فِي
الْبَحْرِ بِأَمْرِهِ ۖ وَسَخَّرَ لَكُمُ الْأَنْهَارَ ﴿٣٢﴾

**33.** మరియు ఎడతెగకుండా, నిరంతరం పయనించే సూర్యచంద్రులను మీకు ఉపయుక్తంగా చేశాడు మరియు రాత్రింబవళ్ళను కూడా మీకు ఉపయుక్తంగా ఉండేటట్లు చేశాడు.[1]

وَسَخَّرَ لَكُمُ الشَّمْسَ وَالْقَمَرَ دَائِبَيْنِ ۖ وَسَخَّرَ
لَكُمُ اللَّيْلَ وَالنَّهَارَ ﴿٣٣﴾

**34.** మరియు మీరు అడిగినదంతా మీకు ఇచ్చాడు. మీరు అల్లాహ్ అనుగ్రహాలను లెక్కించదలచినా లెక్కించజాలరు. నిశ్చయంగా మానవుడు దుర్మార్గుడు, కృతఘ్నుడు.

وَآتَاكُمْ مِنْ كُلِّ مَا سَأَلْتُمُوهُ ۚ وَإِنْ تَعُدُّوا نِعْمَتَ
اللَّهِ لَا تُحْصُوهَا ۗ إِنَّ الْإِنْسَانَ لَظَلُومٌ كَفَّارٌ ﴿٣٤﴾

**35.** మరియు ఇబ్రాహీమ్ ఇలా ప్రార్థించిన విషయం (జ్ఞాపకం చేసుకోండి)[2]: "ఓ నా ప్రభూ! ఈ నగరాన్ని (మక్కాను) శాంతి నిలయంగా ఉంచు! మరియు నన్నూ నా సంతానాన్నీ విగ్రహారాధన నుండి తప్పించు!

وَإِذْ قَالَ إِبْرَاهِيمُ رَبِّ اجْعَلْ هَٰذَا الْبَلَدَ
آمِنًا وَاجْنُبْنِي وَبَنِيَّ أَنْ نَعْبُدَ الْأَصْنَامَ ﴿٣٥﴾

**36.** "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, అవి అనేక మానవులను మార్గభ్రష్టులుగా చేశాయి. ఇక నా విధానాన్ని అనుసరించేవాడు, నిశ్చయంగా, నా వాడు. మరియు ఎవడైనా నా విధానాన్ని ఉల్లంఘిస్తే, నిశ్చయంగా, నీవు క్షమాశీలుడవు, అపార కరుణాప్రదాతవు.

رَبِّ إِنَّهُنَّ أَضْلَلْنَ كَثِيرًا مِنَ النَّاسِ ۖ
فَمَنْ تَبِعَنِي فَإِنَّهُ مِنِّي ۖ وَمَنْ عَصَانِي
فَإِنَّكَ غَفُورٌ رَحِيمٌ ﴿٣٦﴾

**37.** "ఓ మా ప్రభూ! వాస్తవానికి నేను నా

رَبَّنَا إِنِّي أَسْكَنْتُ مِنْ ذُرِّيَّتِي بِوَادٍ غَيْرِ

---

1 రాత్రింబవళ్ళను గురించి చూడండి, 10:67, 27:86 మరియు 40:61

2 ఆయత్‌లు 35-41 ఈ సూరహ్ పేరును సూచిస్తున్నాయి. మరియు ఇబ్రాహీం (అ.స.) ప్రార్థనను జ్ఞాపకం చేయిస్తున్నాయి.

సంతానంలో కొందరిని నీ పవిత్రగృహం (క'అబహ్) దగ్గర పైరుపండని, ఎండిపోయిన కొండలోయలో నివసింపజేశాను.[1] ఓ మా ప్రభూ. వారిని ఇక్కడ నమా'జ్ స్థాపించటానికి ఉంచాను. కనుక నీవు ప్రజల హృదయాలను, వారివైపుకు ఆకర్షింపజేయి మరియు వారు కృతజ్ఞులై ఉండటానికి వారికి జీవనోపాధిగా ఫలాలను సమకూర్చు.

ذِي زَرْعٍ عِنْدَ بَيْتِكَ الْمُحَرَّمِ رَبَّنَا لِيُقِيمُوا الصَّلَاةَ فَاجْعَلْ أَفْئِدَةً مِنَ النَّاسِ تَهْوِي إِلَيْهِمْ وَارْزُقْهُمْ مِنَ الثَّمَرَاتِ لَعَلَّهُمْ يَشْكُرُونَ ﴿٣٧﴾

**38.** "ఓ మా ప్రభూ! నిశ్చయంగా, మేము దాచేదంతా మరియు వ్యక్తపరచేదంతా నీకు తెలుసు. మరియు భూమిలోగానీ, ఆకాశంలో గానీ అల్లాహ్‌నుండి దాగిఉన్నది ఏదీలేదు.

رَبَّنَا إِنَّكَ تَعْلَمُ مَا نُخْفِي وَمَا نُعْلِنُ وَمَا يَخْفَىٰ عَلَى اللَّهِ مِنْ شَيْءٍ فِي الْأَرْضِ وَلَا فِي السَّمَاءِ ﴿٣٨﴾

**39.** "సర్వస్తోత్రాలకు అర్హుడైన అల్లాహ్ నాకు వృద్ధాప్యంలో కూడా ఇస్మా'యీల్ మరియు ఇస్'హాఖ్‌లను ప్రసాదించాడు. నిశ్చయంగా, నా ప్రభువు ప్రార్థనలను వినేవాడు.

الْحَمْدُ لِلَّهِ الَّذِي وَهَبَ لِي عَلَى الْكِبَرِ إِسْمَاعِيلَ وَإِسْحَاقَ إِنَّ رَبِّي لَسَمِيعُ الدُّعَاءِ ﴿٣٩﴾

**40.** "ఓ నా ప్రభూ! నన్ను మరియు నా సంతతి వారిని నమా'జ్ స్థాపించే వారిగా చేయి.[2] ఓ మా ప్రభూ! నా ప్రార్థనను స్వీకరించు.

رَبِّ اجْعَلْنِي مُقِيمَ الصَّلَاةِ وَمِنْ ذُرِّيَّتِي رَبَّنَا وَتَقَبَّلْ دُعَاءِ ﴿٤٠﴾

**41.** "ఓ మా ప్రభూ! నన్నూ నా తల్లి దండ్రులను మరియు సమస్త విశ్వాసులను లెక్కల పరిష్కారంరోజు క్షమించు."

رَبَّنَا اغْفِرْ لِي وَلِوَالِدَيَّ وَلِلْمُؤْمِنِينَ يَوْمَ يَقُومُ الْحِسَابُ ﴿٤١﴾

**42.** మరియు ఈ దుర్మార్గుల చేష్టల నుండి అల్లాహ్ నిర్లక్ష్యంగా ఉన్నాడని నీవు భావించకు.[3] నిశ్చయంగా, ఆయన వారిని - వారి కళ్ళు, రెప్పవేయకుండా ఉండిపోయే ఆ

وَلَا تَحْسَبَنَّ اللَّهَ غَافِلًا عَمَّا يَعْمَلُ الظَّالِمُونَ إِنَّمَا يُؤَخِّرُهُمْ لِيَوْمٍ تَشْخَصُ فِيهِ الْأَبْصَارُ ﴿٤٢﴾

1. ఇస్మాయీల్ ('అ స ) అతని తల్లి హాజర్ ('అ.స.)లు మరియు వారి సంతతివారు.
2. ఇస్'హాఖ్ ('అ స ) సంతతి వారిలో నుండి ఇస్రాయీ'ల్ సంతతి (బనీ-ఇస్రాయీ'ల్) వారు వచ్చారు మరియు ఇస్మా'యీల్ ('అ స ) సంతతి వారిలో నుండి ఖురైషులు వచ్చారు వారందరిలో కూడా అల్లాహ్ (సు.తా.)కు అవిధేయులైన వారుండిరి.
3 దుర్మార్గులంటే ఇక్కడ అల్లాహుతా'ఆలాకు సాటి కల్పించిన వారు.

రోజువరకు వ్యవధినిస్తున్నాడు.

مُهْطِعِينَ مُقْنِعِي رُءُوسِهِمْ لَا يَرْتَدُّ إِلَيْهِمْ طَرْفُهُمْ وَأَفْـِٔدَتُهُمْ هَوَآءٌ ﴿٤٣﴾

**43.** (ఆ రోజు) వారు తలలు పైకెత్తి, పరిగెత్తుతూ ఉంటారు, పైచూపులు పైనే నిలిచి ఉంటాయి. మరియు వారు శూన్యహృదయులై ఉంటారు.

وَأَنذِرِ ٱلنَّاسَ يَوْمَ يَأْتِيهِمُ ٱلْعَذَابُ فَيَقُولُ ٱلَّذِينَ ظَلَمُوا۟ رَبَّنَآ أَخِّرْنَآ إِلَىٰٓ أَجَلٍ قَرِيبٍ نُّجِبْ دَعْوَتَكَ وَنَتَّبِعِ ٱلرُّسُلَ أَوَلَمْ تَكُونُوٓا۟ أَقْسَمْتُم مِّن قَبْلُ مَا لَكُم مِّن زَوَالٍ ﴿٤٤﴾

**44.** మరియు (ఓ ము'హమ్మద్!) శిక్షపడే ఆ రోజు గురించి ప్రజలను నీవు హెచ్చరించు. ఆ రోజు దుర్మార్గం చేసిన వారు అంటారు: "ఓ మా ప్రభూ! నీ సందేశాన్ని స్వీకరించటానికి, ప్రవక్తలను అనుసరించటానికి, మాకు మరి కొంత వ్యవధి నివ్వు!"[1] (వారికి ఇలాంటి సమాధాన మివ్వబడుతుంది): "ఏమీ? ఇంతకు ముందు 'మాకు వినాశం లేదు.' అని ప్రమాణం చేసి చెప్పినవారు మీరే కాదా?

وَسَكَنتُمْ فِى مَسَٰكِنِ ٱلَّذِينَ ظَلَمُوٓا۟ أَنفُسَهُمْ وَتَبَيَّنَ لَكُمْ كَيْفَ فَعَلْنَا بِهِمْ وَضَرَبْنَا لَكُمُ ٱلْأَمْثَالَ ﴿٤٥﴾

**45.** "మరియు తమకు తాము అన్యాయం చేసుకున్న వారి స్థలాలలో మీరు నివసించారు. మరియు వారితో ఎలా వ్యవహరించామో మీకు బాగా తెలుసు. మరియు మేము మీకు ఎన్నో ఉపమానాలు కూడా ఇచ్చాము."

وَقَدْ مَكَرُوا۟ مَكْرَهُمْ وَعِندَ ٱللَّهِ مَكْرُهُمْ وَإِن كَانَ مَكْرُهُمْ لِتَزُولَ مِنْهُ ٱلْجِبَالُ ﴿٤٦﴾

**46.** మరియు వాస్తవానికి వారు తమ కుట్ర పన్నారు మరియు వారి కుట్ర అల్లాహ్‌కు బాగా తెలుసు. కాని వారి కుట్ర కొండలను తమ చోటునుండి కదిలింపగలిగేది కాదు.[2]

فَلَا تَحْسَبَنَّ ٱللَّهَ مُخْلِفَ وَعْدِهِۦ رُسُلَهُۥٓ إِنَّ ٱللَّهَ عَزِيزٌ ذُو ٱنتِقَامٍ ﴿٤٧﴾

**47.** కనుక అల్లాహ్ తన ప్రవక్తలకు చేసిన వాగ్దానాన్ని భంగపరుస్తాడని భావించకు. నిశ్చయంగా, అల్లాహ్! సర్వశక్తిమంతుడు, ప్రతీకారం తీర్చుకోగలవాడు.

1. చూడండి, 6:27.

2 చూడండి, 19:90-91 పై తాత్పర్యం ఇబ్నె కసీర్ (ర'హ్మ)గారిది. కొందరు వ్యాఖ్యాతలు ఈ విధంగా కూడా బోధించారు: 'ముష్రిక్ ఖురైషులు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)ను చంపటానికి పన్నాగాలు పన్నారు. కాని వారు తమ పన్నాగాలలో నెగ్గలేకపోయారు, విఫలులయ్యారు.'

**48.** ఈ భూమి మరొక భూమిగా మరియు ఆకాశాలు (వేరే ఆకాశాలుగా) మారే రోజు;[1] ఆ అద్వితీయుడు, ప్రబలుడు అయిన అల్లాహ్ ముందు అందరూ హాజరుచేయబడతారు.

يَوْمَ تُبَدَّلُ الْأَرْضُ غَيْرَ الْأَرْضِ وَالسَّمَٰوَٰتُ ۖ وَبَرَزُوا لِلَّهِ الْوَاحِدِ الْقَهَّارِ ﴿٤٨﴾

**49.** మరియు ఆ రోజు అపరాధులను సంకెళ్ళలో, కూడబెట్టి, బంధించి ఉంచటాన్ని నీవు చూస్తావు.

وَتَرَى الْمُجْرِمِينَ يَوْمَئِذٍ مُّقَرَّنِينَ فِي الْأَصْفَادِ ﴿٤٩﴾

**50.** వారి వస్త్రాలు 'తారు' (నల్లని జిడ్డు ద్రవం)తో చేయబడిఉంటాయి మరియు అగ్ని జ్వాలలు వారి ముఖాలను క్రమ్ముకొని ఉంటాయి;

سَرَابِيلُهُم مِّن قَطِرَانٍ وَتَغْشَىٰ وُجُوهَهُمُ النَّارُ ﴿٥٠﴾

**51.** అల్లాహ్ ప్రతిప్రాణికి దాని కర్మల ప్రతిఫలం ఇవ్వటానికి. నిశ్చయంగా, అల్లాహ్ లెక్కతీసుకోవటంలో అతిశీఘ్రుడు.

لِيَجْزِيَ اللَّهُ كُلَّ نَفْسٍ مَّا كَسَبَتْ ۚ إِنَّ اللَّهَ سَرِيعُ الْحِسَابِ ﴿٥١﴾

**52.** ఇది (ఈ ఖుర్ఆన్) మానవులకు ఒక సందేశం. వారు దీనితో హెచ్చరించబడటానికి మరియు నిశ్చయంగా, ఆయన (అల్లాహ్) ఒక్కడే ఆరాధ్య దైవమని వారు తెలుసుకోవడానికి మరియు బుద్ధిమంతులు గ్రహించడానికి ఇది పంపబడింది.

هَٰذَا بَلَاغٌ لِّلنَّاسِ وَلِيُنذَرُوا بِهِ وَلِيَعْلَمُوا أَنَّمَا هُوَ إِلَٰهٌ وَاحِدٌ وَلِيَذَّكَّرَ أُولُو الْأَلْبَابِ ﴿٥٢﴾

---

1. చూడండి, 20:105-107.

# 15. సూరహ్ అల్-'హిజ్ర్

سُوْرَةُ الْحِجْرِ

ఇది, సూరహ్ యూసుఫ్ (12) తరువాత అవతరింపజేయబడిందని సుయూతిగారు అభిప్రాయపడ్డారు. "నిశ్చయంగా, మేమే ఈ జ్ఞాపిక(ఖుర్ఆన్)ను అవతరింపజేశాము మరియు నిశ్చయంగా మేమే దీనిని కాపాడేవారము." (9వ ఆయత్) దీని పేరు **80**వ **ఆయత్** నుండి తీసుకోనబడింది. ఇందులో **99 ఆయతులు** ఉన్నాయి. అల్ 'హిజ్ర్ (**Rocky Tract**). గుట్టల ప్రాంతం. ఇది ఒక ప్రాంతం పేరు. స'మూద్ జాతివారు ఇక్కడ నివసించారు. ఇది మక్కా సిరియా మార్గంలో ఉంది. అక్కడ చాలా గుట్టలున్నాయి. ఇది చివరి 6 మక్కా సూరాహ్‌ల(10-15) సమూహంలో చివరిది.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

**1.** (*) అలిఫ్-లామ్-రా. ఇవి దివ్యగ్రంథ ఆయత్‌లు మరియు (ఇది) ఒక స్పష్టమైన ఖుర్ఆన్.[1]

الٓرٰ ۚ تِلْكَ اٰيٰتُ الْكِتٰبِ وَقُرْاٰنٍ مُّبِيْنٍ ①

**2.** సత్యతిరస్కారులు: "మేము అల్లాహ్‌కు విధేయు (ముస్లిము)లమైతే ఎంత బాగుండేది!" అని (పునరుత్థాన దినమున), పలుమార్లు కోరుకుంటారు.

رُبَمَا يَوَدُّ الَّذِيْنَ كَفَرُوْا لَوْ كَانُوْا مُسْلِمِيْنَ ②

**3.** వారిని తింటూ (త్రాగుతూ) సుఖ సంతోషాలను అనుభవిస్తూ, (వృథా) ఆశలలో ఉండటానికి విడిచిపెట్టు. తరువాత వారు (సత్యాన్ని) తెలుసుకుంటారు.

ذَرْهُمْ يَاْكُلُوْا وَيَتَمَتَّعُوْا وَيُلْهِهِمُ الْاَمَلُ فَسَوْفَ يَعْلَمُوْنَ ③

**4.** మరియు (దాని వ్యవధి) నిర్ణయించి వ్రాయబడి ఉండనిదే, మేము ఏ నగరాన్ని కూడా నాశనం చేయలేదు.[2]

وَمَآ اَهْلَكْنَا مِنْ قَرْيَةٍ اِلَّا وَلَهَا كِتَابٌ مَّعْلُوْمٌ ④

**5.** ఏ సమాజం కూడా తన నిర్ణీత గడువుకు, ముందు గానీ మరియు వెనక గానీ కాజాలదు.[3]

مَا تَسْبِقُ مِنْ اُمَّةٍ اَجَلَهَا وَمَا يَسْتَاْخِرُوْنَ ⑤

---

1. చూడండి, 5:15

2. ఇంకా చూడండి, 26:208 మరియు 6:131

3. చూడండి, 7:34. ఏ నగరం కూడా దాని సత్యతిరస్కారం మరియు అత్యాచారాలకు వెంటనే

وَقَالُوا يَا أَيُّهَا الَّذِي نُزِّلَ عَلَيْهِ الذِّكْرُ إِنَّكَ لَمَجْنُونٌ ﴿٦﴾

**6.** మరియు (సత్యతిరస్కారులు) అంటారు: "ఓ హితబోధ (ఖుర్ఆన్) అవతరింప జేయబడిన వాడా (ము'హమ్మద్)! నిశ్చయంగా నీవు పిచ్చివాడవు.

لَوْ مَا تَأْتِينَا بِالْمَلَائِكَةِ إِنْ كُنْتَ مِنَ الصَّادِقِينَ ﴿٧﴾

**7.** "నీవు సత్యవంతుడవే అయితే, మా వద్దకు దేవదూతలను ఎందుకు తీసుకొని రావు?"

مَا نُنَزِّلُ الْمَلَائِكَةَ إِلَّا بِالْحَقِّ وَمَا كَانُوا إِذًا مُنْظَرِينَ ﴿٨﴾

**8.** మేము దేవదూతలను, సత్యంతో తప్ప పంపము మరియు వారు వచ్చినప్పుడు వీరికి ఏ మాత్రం వ్యవధి ఇవ్వబడదు.[1]

إِنَّا نَحْنُ نَزَّلْنَا الذِّكْرَ وَإِنَّا لَهُ لَحَافِظُونَ ﴿٩﴾

**9.** నిశ్చయంగా, మేమే ఈ జ్ఞాపిక (ఖుర్ఆన్)ను అవతరింపజేశాము మరియు నిశ్చయంగా మేమే దీనిని కాపాడేవారము.[2]

وَلَقَدْ أَرْسَلْنَا مِنْ قَبْلِكَ فِي شِيَعِ الْأَوَّلِينَ ﴿١٠﴾

**10.** మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి మేము, నీకు పూర్వం గతించిన తెగల వారి వద్దకు కూడా (ప్రవక్తలను) పంపాము.

وَمَا يَأْتِيهِمْ مِنْ رَسُولٍ إِلَّا كَانُوا بِهِ يَسْتَهْزِئُونَ ﴿١١﴾

**11.** మరియు వారి వద్దకు వచ్చిన ఏ ప్రవక్తను కూడా, వారు పరిహసించకుండా ఉండలేదు.[3]

كَذَٰلِكَ نَسْلُكُهُ فِي قُلُوبِ الْمُجْرِمِينَ ﴿١٢﴾

**12.** ఈ విధంగా మేము దీనిని (సత్య తిరస్కారాన్ని) అపరాధుల హృదయాలలో ప్రవేశపెడుతున్నాము.

لَا يُؤْمِنُونَ بِهِ وَقَدْ خَلَتْ سُنَّةُ الْأَوَّلِينَ ﴿١٣﴾

**13.** వారు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించడం లేదు. మరియు వాస్తవానికి

---

నాశనం చేయబడదు. దానికి ఒక వ్యవధి, నియమితకాలం అల్లాహుతా'ఆలా తరఫు నుండి ఇవ్వబడుతోంది. ఇక ఆ నియమితకాలం వచ్చిన తరువాత వారు దాని నుండి వెనుకా ముందు కాలేరు అంటే ఒక్కక్షణం కూడా వ్యవధి పొందలేరు.

1. చూడండి, 6:8 9

2. 1400 సంవత్సరాలలో ఒక అక్షరంలో కూడా మార్పులేకుండా భద్రపరచబడిన దివ్యగ్రంథం కేవలం ఈ ఖుర్ఆన్ మాత్రమే ఎందుకంటే అల్లాహుతా'ఆలా: "నిశ్చయంగా, మేమే ఈ జ్ఞాపిక(ఖుర్ఆన్)ను అవతరింపజేశాము మరియు నిశ్చయంగా మేమే దీనిని కాపాడేవారము." అని అన్నాడు. ఇంకా చూడండి, 2:23 మరియు 85:22

3. చూడండి, 6:10

(సత్యతిరస్కారులైన) వారి పూర్వీకుల విధానం కూడా ఇలాగే ఉండేది.

14. మరియు ఒకవేళ మేము వారి కొరకు ఆకాశపు ఒక ద్వారాన్ని తెరిచినా, వారు దాని పైకి ఎక్కుతూ పోతూ!

وَلَوْ فَتَحْنَا عَلَيْهِم بَابًا مِّنَ السَّمَاءِ فَظَلُّوا فِيهِ يَعْرُجُونَ ﴿١٤﴾

15. ఇలా అనే వారు: "నిశ్చయంగా, మా చూపులు భ్రమింపజేయబడ్డాయి. అలాకాదు, మాపై మంత్రజాలం చేయబడింది."[1]

لَقَالُوا إِنَّمَا سُكِّرَتْ أَبْصَارُنَا بَلْ نَحْنُ قَوْمٌ مَّسْحُورُونَ ﴿١٥﴾

16. మరియు వాస్తవానికి, మేము ఆకాశంలో తారాగణాన్ని (నక్షత్రరాశులను) సృష్టించి, దానిని చూపరులకు అలంకారమైనదిగా చేశాము

وَلَقَدْ جَعَلْنَا فِي السَّمَاءِ بُرُوجًا وَزَيَّنَّاهَا لِلنَّاظِرِينَ ﴿١٦﴾

17. మరియు శపించ (బహిష్కరించ)బడిన ప్రతి షై'తాను నుండి దానిని (ఆకాశాన్ని) సురక్షితంగా ఉంచాము.[2]

وَحَفِظْنَاهَا مِن كُلِّ شَيْطَانٍ رَّجِيمٍ ﴿١٧﴾

18. కాని, ఎవడైనా (ఏ షై'తానైనా) దొంగచాటుగా వినటానికి ప్రయత్నిస్తే, స్పష్టమైన కొరవి (అగ్నిజ్వాల) అతనిని వెంబడిస్తుంది.[3]

إِلَّا مَنِ اسْتَرَقَ السَّمْعَ فَأَتْبَعَهُ شِهَابٌ مُّبِينٌ ﴿١٨﴾

19. మరియు మేము భూమిని వ్యాపింపజేశాము మరియు దానిలో స్థిరమైన పర్వతాలను నాటాము మరియు దానిలో ప్రతి వస్తువును తగిన పరిమాణంలో ఉత్పత్తిచేశాము.

وَالْأَرْضَ مَدَدْنَاهَا وَأَلْقَيْنَا فِيهَا رَوَاسِيَ وَأَنبَتْنَا فِيهَا مِن كُلِّ شَيْءٍ مَّوْزُونٍ ﴿١٩﴾

20. మరియు అందులో మీకూ - మరియు మీరు పోషించని - వాటి (జీవరాసుల) కొరకూ, మేము జీవనోపాధిని కల్పించాము.[4]

وَجَعَلْنَا لَكُمْ فِيهَا مَعَايِشَ وَمَن لَّسْتُمْ لَهُ بِرَازِقِينَ ﴿٢٠﴾

21. మరియు మా దగ్గర పుష్కలంగా నిలువలేని వస్తువు అంటూ ఏదీలేదు మరియు

وَإِن مِّن شَيْءٍ إِلَّا عِندَنَا خَزَائِنُهُ وَمَا نُنَزِّلُهُ

1 చూడండి, 6:7 మరియు 10:2
2 చూడండి, 2:14 మరియు 37:7.
3. చూడండి, 37:10
4 చూడండి, 11:6.

إِلَّا بِقَدَرٍ مَّعْلُومٍ ﴿٢١﴾

దానిని మేము ఒకనిర్ణీత పరిమాణంలో మాత్రమే పంపుతూ ఉంటాము.

وَأَرْسَلْنَا الرِّيَاحَ لَوَاقِحَ فَأَنزَلْنَا مِنَ السَّمَاءِ مَاءً
فَأَسْقَيْنَاكُمُوهُ وَمَا أَنتُمْ لَهُ بِخَازِنِينَ ﴿٢٢﴾

**22.** మరియు మేము (వృక్షకోటిని) ఫలవంతం చేయటానికి గాలులను పంపుతాము! తరువాత మేము ఆకాశంనుండి నీటిని కురిపించి, దానిని మీకు త్రాగటానికి సమకూర్చుతాము మరియు దాని కోశాధికారులు మీరు మాత్రం కారు!

وَإِنَّا لَنَحْنُ نُحْيِي وَنُمِيتُ وَنَحْنُ الْوَارِثُونَ ﴿٢٣﴾

**23.** మరియు నిశ్చయంగా, మేమే జీవన్మరణాలను ఇచ్చేవారము; మరియు చివరకు మేమే వారసులుగా మిగిలేవారము.[1]

وَلَقَدْ عَلِمْنَا الْمُسْتَقْدِمِينَ مِنكُمْ وَلَقَدْ
عَلِمْنَا الْمُسْتَأْخِرِينَ ﴿٢٤﴾

**24.** మరియు వాస్తవానికి, మీకు ముందు గడిచిపోయిన వారిని గురించి మాకు తెలుసు మరియు వాస్తవంగా మీ తరువాత వచ్చే వారిని గురించి కూడా మాకు బాగా తెలుసు.[2]

وَإِنَّ رَبَّكَ هُوَ يَحْشُرُهُمْ إِنَّهُ حَكِيمٌ عَلِيمٌ ﴿٢٥﴾

**25.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు, ఆయనే! వారందరినీ సమావేశపరుస్తాడు. నిశ్చయంగా, ఆయన మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు.

وَلَقَدْ خَلَقْنَا الْإِنسَانَ مِن صَلْصَالٍ مِّنْ
حَمَإٍ مَّسْنُونٍ ﴿٢٦﴾

**26.** మరియు వాస్తవంగా మేము మానవుణ్ణి మ్రోగే (ధ్వనిచేసే) మట్టి, రూపాంతరం చెందిన జిగట బురద (బంకమట్టి)తో సృష్టించాము.[3]

---

**1.** చూడండి, 3:180 మరియు 57:10.

**2** 'ఎవరైతే ముందుగా (మావద్దకు) వస్తారో మరియు ఎవరు వెనుక ఉండిపోతారో తెలుసు' ఈ రెండురకాల వ్యాఖ్యానాలు కూడా సరైనవే అని వ్యాఖ్యాతలు అంగీకరించారు
మరొక వ్యాఖ్యానం 'మరియు వాస్తవానికి, మీలో ముందుకు సాగిపోయే వారెవరో మాకు తెలుసు మరియు వాస్తవానికి, వెనుకంజ వేసేవారెవరో కూడా మాకు తెలుసు' అని కూడా ఇవ్వబడింది.

**3** మానవుడు మట్టితో సృష్టించబడ్డాడు. వేర్వేరు చోట్లలో ఆ మట్టి స్థితిని బట్టి వేర్వేరు పేర్లు ఇవ్వబడ్డాయి 1) సాధారణంగా ఎండిపోయిన (తడి లేని) మట్టిని తురాబ్ దుమ్ము అని, 2) దానిని నీళ్ళుపోసి కలిపితే తీన్ మట్టి అని, 3) అది చాలా నీళ్ళతో కలిపి వాసన వచ్చే బురదగా ఉంటె, 'హమఇన్ మస్నూనిన్ జిగట బురద అని, 4) అది ఎండిపోయి శబ్దం చేస్తే, 'సల్సాల్ అని, 5) దానిని కాల్చితే, ఫ'ఖ్ఖార్ పెంకు. అని పేర్లు ఇవ్వబడ్డాయి. (చూడండి, 55:14)

وَالْجَآنَّ خَلَقْنٰهُ مِنْ قَبْلُ مِنْ نَّارِ السَّمُوْمِ ﴿٢٧﴾

**27.** మరియు దీనికి పూర్వం మేము జిన్నాతులను (పొగలేని) మండే అగ్ని జ్వాలతో సృష్టించాము.[1]

وَاِذْ قَالَ رَبُّكَ لِلْمَلٰٓئِكَةِ اِنِّیْ خَالِقٌۢ بَشَرًا مِّنْ صَلْصَالٍ مِّنْ حَمَاٍ مَّسْنُوْنٍ ﴿٢٨﴾

**28.** మరియు నీ ప్రభువు దేవదూతలతో ఇలా అన్న విషయం (జ్ఞాపకం చేసుకో!): "నిశ్చయంగా నేను మ్రోగే మట్టి, రూపాంతరం చెందిన జిగట బురదతో మానవుణ్ణి సృష్టించబోతున్నాను.

فَاِذَا سَوَّیْتُهٗ وَنَفَخْتُ فِیْهِ مِنْ رُّوْحِیْ فَقَعُوْا لَهٗ سٰجِدِیْنَ ﴿٢٩﴾

**29.** "ఇక నేను అతనికి పూర్తిగా ఆకారమిచ్చి (రూపమిచ్చి), అతని (ఆదమ్)లో నా తరఫు నుండి ప్రాణం (రూ'హ్) ఊదిన తరువాత, మీరంతా అతని ముందు సాష్టాంగం (సజ్దా) చేయాలి."[2]

فَسَجَدَ الْمَلٰٓئِكَةُ كُلُّهُمْ اَجْمَعُوْنَ ﴿٣٠﴾

**30.** అప్పుడు దేవదూతలు, అందరూ కలిసి సాష్టాంగం (సజ్దా) చేశారు -

اِلَّاۤ اِبْلِیْسَ ؕ اَبٰۤی اَنْ یَّكُوْنَ مَعَ السّٰجِدِیْنَ ﴿٣١﴾

**31.** ఒక్క ఇబ్లీస్ తప్ప! అతడు సాష్టాంగం (సజ్దా) చేసేవారిలో చేరనని మొండికేశాడు.[3]

قَالَ یٰۤاِبْلِیْسُ مَا لَكَ اَلَّا تَكُوْنَ مَعَ السّٰجِدِیْنَ ﴿٣٢﴾

**32.** (అల్లాహ్) ఇలా ప్రశ్నించాడు: "ఓ ఇబ్లీస్! నీకేమయింది, నీవు సాష్టాంగం (సజ్దా)

---

1 అల్-జిన్నున్, జిన్నాతున్ (బ.వ.) అంటే మానవుల కంటికి కనబడనిది అని అర్థము. అందుకే వారిని ఈ పేరుతో పిలుస్తారు. వారికి తెలివి ఉంది. మంచి చెడుల విచక్షణా శక్తి ఉంది. పొగలేని అగ్నిజ్వాలలతో సృష్టించబడ్డారు. వారు తింటారు, త్రాగుతారు. వారి సంతతి పెరుగుతుంది. వారికి మరణం ఉంది. వారి కర్మలను బట్టి వారికి, మానవులవలే స్వర్గ నరకాల ప్రతిఫలాలు కూడా ఉన్నాయి ('అబ్దుల్ మజీద్ దర్యాబాది, ర'హ్మ.) చూడండి. 55:15 మరియు 6:100

2 ఈ సాష్టాంగం కేవలం అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను శిరసావహించటానికి చేయబడిన గౌరవ ప్రదమైన సాష్టాంగం. ఇది ఆరాధనార్థం చేసింది కాదు. ము'హమ్మద్ ('స'అస) షరీఅత్‌లో గౌరవార్థం కూడా ఎవ్వరికైనను సాష్టాంగం చేయుటం ధర్మసమ్మతం కాదు. ఇంకా చూడండి, 2:30-34 మరియు 7:11-18

3 "మానవుడు మట్టితో సృష్టించబడ్డాడు, కాని నేనైతే అగ్నితో సృష్టించబడ్డాను. కాబట్టి నేను మానవుని కంటే ఉత్తముడను, నేనెందుకు అతనికి సజ్దా చేయాలి." అని ఇబ్లీస్ అన్నాడు. దైవప్రవక్తలందరూ మట్టితోనే సృష్టించబడ్డ మానవులేనని ఖుర్ఆన్ విశదీకరించింది. దీనిని విశ్వసించక పోవడం మరియు మట్టితో సృష్టించబడ్డవారు అధములని భావించడం షై'తాన్‌ను అనుసరించడమే. ఇంకా చూడండి, 7:11

చేసేవారిలో ఎందుకు చేరలేదు?"

33. (ఇబ్లీస్) ఇలా జవాబిచ్చాడు: "మ్రోగే మట్టి, రూపాంతరం చెందిన జిగట బురదతో నీవు సృష్టించిన మానవునికి నేను సాష్టాంగం (సజ్దా) చేసేవాడను కాను."

قَالَ لَمْ أَكُن لِّأَسْجُدَ لِبَشَرٍ خَلَقْتَهُ مِن صَلْصَالٍ مِّنْ حَمَإٍ مَّسْنُونٍ ﴿٣٣﴾

34. (అల్లాహ్) అన్నాడు: "అయితే నీవు ఇక్కడినుండి వెళ్ళిపో! ఇక, నిశ్చయంగా, నీవు శపించ (బహిష్కరించ)బడ్డవాడవు!

قَالَ فَاخْرُجْ مِنْهَا فَإِنَّكَ رَجِيمٌ ﴿٣٤﴾

35. "మరియు నిశ్చయంగా, తీర్పుదినము వరకు నీపై శాపం (బహిష్కారం) ఉంటుంది."

وَإِنَّ عَلَيْكَ اللَّعْنَةَ إِلَىٰ يَوْمِ الدِّينِ ﴿٣٥﴾

36. (ఇబ్లీస్) వేడుకున్నాడు: "ఓ నా ప్రభూ! పునరుత్థానదినం వరకు నాకు వ్యవధి నివ్వు!"

قَالَ رَبِّ فَأَنظِرْنِي إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ﴿٣٦﴾

37. (అల్లాహ్) జవాబిచ్చాడు: "ఇక నిశ్చయంగా, నీవు వ్యవధి ఇవ్వబడిన వారిలోని వాడవు!

قَالَ فَإِنَّكَ مِنَ الْمُنظَرِينَ ﴿٣٧﴾

38. "(నాకు మాత్రమే) తెలిసివున్న ఆ దినపు, ఆ సమయం వరకు!"

إِلَىٰ يَوْمِ الْوَقْتِ الْمَعْلُومِ ﴿٣٨﴾

39. (ఇబ్లీస్) అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు నన్ను అపమార్గం పట్టించావు, కావున నేను వారికి, భూమిలో(వారి దుష్కర్మలన్నీ) మంచివిగా కనబడేటట్లు చేస్తాను మరియు నిశ్చయంగా, వారందరినీ అపమార్గంలో పడవేస్తాను.

قَالَ رَبِّ بِمَا أَغْوَيْتَنِي لَأُزَيِّنَنَّ لَهُمْ فِي الْأَرْضِ وَلَأُغْوِيَنَّهُمْ أَجْمَعِينَ ﴿٣٩﴾

40. "వారిలో నీవు ఎన్నుకున్న (నీ ఆజ్ఞాను వర్తనులైన) నీ దాసులు తప్ప!"

إِلَّا عِبَادَكَ مِنْهُمُ الْمُخْلَصِينَ ﴿٤٠﴾

41. (అల్లాహ్) అన్నాడు: "ఇదే నా దగ్గరకు తెచ్చే ఋజుమార్గం.[1]

قَالَ هَٰذَا صِرَاطٌ عَلَيَّ مُسْتَقِيمٌ ﴿٤١﴾

---

1 బహిష్కరించబడిన ఇబ్లీస్, అల్లాహ్‌తో ఆలా ఇచ్చినే నెరవేరుస్తున్నాడు. అల్లాహ్ (సు.తా.) మానవునికి మంచి చెడును అర్థంచేసుకునే జ్ఞానాన్ని ప్రసాదించి, ఎవడు చెడు (షైతాన్ ప్రేరణ)లో పడిపోతాడో చూస్తాడు. ఈ విధంగా షైతాన్ అల్లాహ్ (సు.తా.) ఇచ్చిన నిర్వహణలో ఒక

42. "నిశ్చయంగా, నా దాసులపై నీ అధికారం సాగదు! కేవలం మార్గభ్రష్టులై నిన్ను అనుసరించే వారిమీద తప్ప![1]

إِنَّ عِبَادِي لَيْسَ لَكَ عَلَيْهِمْ سُلْطَانٌ إِلَّا مَنِ اتَّبَعَكَ مِنَ الْغَاوِينَ ﴿٤٢﴾

43. "మరియు నిశ్చయంగా, వారందరి కొరకు వాగ్దానం చేయబడిన (నివాసం) నరకమే.

وَإِنَّ جَهَنَّمَ لَمَوْعِدُهُمْ أَجْمَعِينَ ﴿٤٣﴾

44. "దానికి (నరకానికి) ఏడు ద్వారాలు ఉన్నాయి.[2] వాటిలో ఒక్కొక్క ద్వారానికి ఒక్కొక్క వర్గం వారు ప్రత్యేకించబడి ఉన్నారు.

لَهَا سَبْعَةُ أَبْوَابٍ لِكُلِّ بَابٍ مِنْهُمْ جُزْءٌ مَقْسُومٌ ﴿٤٤﴾

45. "నిశ్చయంగా, దైవభీతి గలవారు స్వర్గవనాలలో చెలమల మధ్య ఉంటారు.

إِنَّ الْمُتَّقِينَ فِي جَنَّاتٍ وَعُيُونٍ ﴿٤٥﴾

46. " (వారు): 'శాంతితో సురక్షితంగా ప్రవేశించండి!' అని ఆహ్వానించబడతారు.

ادْخُلُوهَا بِسَلَامٍ آمِنِينَ ﴿٤٦﴾

47. "వారి హృదయాలలో మిగిలివున్న కాపట్యాన్ని (మాలిన్యాన్ని) మేము తొలగిస్తాము. వారు సోదరులవలే ఎదురెదురుగా పీఠాలపై కూర్చొని ఉంటారు.[3]

وَنَزَعْنَا مَا فِي صُدُورِهِمْ مِنْ غِلٍّ إِخْوَانًا عَلَىٰ سُرُرٍ مُتَقَابِلِينَ ﴿٤٧﴾

48. "అక్కడ వారికి అలసట ఉండదు. మరియు అక్కడినుండి వారు ఎన్నడూ వెడలగొట్టబడరు." (1/8)

لَا يَمَسُّهُمْ فِيهَا نَصَبٌ وَمَا هُمْ مِنْهَا بِمُخْرَجِينَ ﴿٤٨﴾

49. * నా దాసులకు ఇలా తెలియజెయ్యి: నిశ్చయంగా నేను, కేవలం నేనే! క్షమించే వాడను, కరుణించేవాడను.[4]

نَبِّئْ عِبَادِي أَنِّي أَنَا الْغَفُورُ الرَّحِيمُ ﴿٤٩﴾

---

పాత్ర నిర్వహిస్తున్నాడు కావున షైతాన్ వలనుండి తప్పించుకునే వారు ఋజుమార్గం మీద ఉండగలరు. ఇంకా చూడండి, 19:83 మరియు 7.24

1. చూడండి, 14:22 మరియు 7:11-18

2 నరకానికి ఏడు అంతస్తులు లేక శ్రేణులున్నాయి 1) జహన్నమ్, 2) లజ్జా, 3) 'హు'తమ, 4) స'యీర్, 5) సఖర్, 6) జ'హీమ్, 7) హావియహ్. ఇది అన్నిటి కంటే క్రింది అంతస్తు, ఇందులో మునాఫిఖులు (కపటవిశ్వాసులు) ఉంటారు. (ఫ'త్హ అల్ ఖదీర్). చూడండి, 74:27 వ్యాఖ్యానం 2

3 చూడండి, 56:15 మరియు 88:13

4 చూడండి, 6:12 మరియు 6.54

73. (మూసా) అన్నాడు: "మరచిపోయి చేసిన దానికి నన్ను తప్పుపట్టకు. నేను చేసినదానికి నా పట్ల కఠినంగా వ్యవహరించకు!"

قَالَ لَا تُؤَاخِذْنِي بِمَا نَسِيتُ وَلَا تُرْهِقْنِي مِنْ أَمْرِي عُسْرًا ﴿٧٣﴾

74. ఆ పిదప వారు తమ ప్రయాణం సాగించగా వారికి ఒక బాలుడు కలిశాడు. అతను వానిని (ఆ బాలుణ్ణి) చంపాడు. (అది చూసి) మూసా అన్నాడు: "ఏమీ? ఒక అమాయకుడిని చంపావా? అతడు ఎవ్వడినీ (చంపలేదే)! వాస్తవానికి నీవు ఒక ఘోరమైన పని చేశావు!"

فَانطَلَقَا حَتَّىٰ إِذَا لَقِيَا غُلَامًا فَقَتَلَهُ قَالَ أَقَتَلْتَ نَفْسًا زَكِيَّةً بِغَيْرِ نَفْسٍ لَّقَدْ جِئْتَ شَيْئًا نُّكْرًا ﴿٧٤﴾

75. (*) అతను ('ఖి'ద్ర్) అన్నాడు: "నేను నీతో అనలేదా, నిశ్చయంగా, నీవు నాతోపాటు ఏ మాత్రం సహనం వహించలేవని?"

قَالَ أَلَمْ أَقُل لَّكَ إِنَّكَ لَن تَسْتَطِيعَ مَعِيَ صَبْرًا ﴿٧٥﴾

76. (మూసా) అన్నాడు: "ఇక ముందు దేన్ని గురించి అయినా నిన్ను అడిగితే నన్ను నీతోపాటు ఉండనివ్వకు. వాస్తవానికి నీవు, నా తరఫునుండి ఇంతవరకు చాలినన్ని సాకులు స్వీకరించావు."

قَالَ إِن سَأَلْتُكَ عَن شَيْءٍ بَعْدَهَا فَلَا تُصَاحِبْنِي قَدْ بَلَغْتَ مِن لَّدُنِّي عُذْرًا ﴿٧٦﴾

77. ఆపిదప వారిద్దరూ ముందుకు సాగిపోయి ఒక నగరం చేరుకొని ఆ నగరవాసులను భోజనమడిగారు. కాని వారు (ఆ నగరవాసులు) వారిద్దరికి ఆతిథ్యమివ్వటానికి నిరాకరించారు[1] అప్పుడు వారక్కడ కూలిపోనున్న ఒక గోడను చూశారు. అతను ('ఖి'ద్ర్) దానిని మళ్ళీ నిలబెట్టాడు. (మూసా) అన్నాడు: "నీవు కోరితే దానికి (ఆ శ్రమకు) ప్రతిఫలం (వేతనం) తీసుకొని ఉండవచ్చు కదా!"

فَانطَلَقَا حَتَّىٰ إِذَا أَتَيَا أَهْلَ قَرْيَةٍ اسْتَطْعَمَا أَهْلَهَا فَأَبَوْا أَن يُضَيِّفُوهُمَا فَوَجَدَا فِيهَا جِدَارًا يُرِيدُ أَن يَنقَضَّ فَأَقَامَهُ قَالَ لَوْ شِئْتَ لَاتَّخَذْتَ عَلَيْهِ أَجْرًا ﴿٧٧﴾

78. అతను ('ఖి'ద్ర్) అన్నాడు: "ఇక నేనూ-నీవూ విడిపోవలసిన (సమయం) వచ్చింది. ఇక నీవు

قَالَ هَٰذَا فِرَاقُ بَيْنِي وَبَيْنِكَ سَأُنَبِّئُكَ بِتَأْوِيلِ

---

1 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహ్‌తా'ఆలాను మరియు పరలోకాన్ని విశ్వసించే వాడు, తన అతిథిని ఆదరించాలి, ఆతిథ్యమివ్వాలి.' (ఫ'త్'హ్ అల్ ఖదీర్, ష'ర్హ్ అల్ జామె' అ'స్స'గీర్ 5 209)

సహనం వహించలేకపోయిన విషయాల వాస్తవాలను (తత్త్వాలను) గురించి నీకు తెలుపుతాను.

مَا لَمْ تَسْتَطِعْ عَّلَيْهِ صَبْرًا ﴿٧٨﴾

**79.** "ఇక ఆ నావ విషయం: అది సముద్రంలో పనిచేసుకునే కొందరు పేదవారిది. కావున దానిలో లోపం కలిగించగోరాను; ఎందుకంటే వారి వెనుక ఒక క్రూరుడైన రాజు ఉన్నాడు. అతడు (లోపంలేని) ప్రతి నావను బలవంతంగా తీసుకుంటాడు.

أَمَّا السَّفِينَةُ فَكَانَتْ لِمَسَاكِينَ يَعْمَلُونَ فِي الْبَحْرِ فَأَرَدتُّ أَنْ أَعِيبَهَا وَكَانَ وَرَاءَهُم مَّلِكٌ يَأْخُذُ كُلَّ سَفِينَةٍ غَصْبًا ﴿٧٩﴾

**80.** "ఇక ఆ బాలుని విషయం: అతని తల్లిదండ్రులు విశ్వాసులు. అతడు తన సత్య తిరస్కారం మరియు తలబిరుసుతనం వలన వారిని బాధిస్తాడని భయపడ్డాము.

وَأَمَّا الْغُلَامُ فَكَانَ أَبَوَاهُ مُؤْمِنَيْنِ فَخَشِينَا أَن يُرْهِقَهُمَا طُغْيَانًا وَكُفْرًا ﴿٨٠﴾

**81.** "కావున వారిద్దరి ప్రభువు వారికి అతనికి బదులుగా అతనికంటే ఎక్కువ నీతిమంతుడు మరియు కారుణ్యం గలవాడిని ఇవ్వాలని కోరాము.

فَأَرَدْنَا أَن يُبْدِلَهُمَا رَبُّهُمَا خَيْرًا مِّنْهُ زَكَاةً وَأَقْرَبَ رُحْمًا ﴿٨١﴾

**82.** "ఇక ఆ గోడ విషయం: అది ఈ పట్టణంలోని ఇద్దరు అనాథ బాలురకు చెందినది. దానిక్రింద వారి ఒక నిధి (పాతబడి) ఉంది. మరియు వారి తండ్రి పుణ్యపురుషుడు. ఆ ఇద్దరు బాలురు యుక్తవయస్కులైన పిదప నీ ప్రభువు కారుణ్యంగా - తమ నిధిని, వారు త్రవ్వి తీసుకోవాలని, నీ ప్రభువు సంకల్పం. ఇదంతా నా అంతట నేను చేయలేదు. నీవు సహనం వహించలేని విషయాల వాస్తవం (తత్త్వం) ఇదే!"

وَأَمَّا الْجِدَارُ فَكَانَ لِغُلَامَيْنِ يَتِيمَيْنِ فِي الْمَدِينَةِ وَكَانَ تَحْتَهُ كَنزٌ لَّهُمَا وَكَانَ أَبُوهُمَا صَالِحًا فَأَرَادَ رَبُّكَ أَن يَبْلُغَا أَشُدَّهُمَا وَيَسْتَخْرِجَا كَنزَهُمَا رَحْمَةً مِّن رَّبِّكَ ۚ وَمَا فَعَلْتُهُ عَنْ أَمْرِي ۚ ذَٰلِكَ تَأْوِيلُ مَا لَمْ تَسْطِع عَّلَيْهِ صَبْرًا ﴿٨٢﴾

**83.** మరియు వారు నిన్ను జు'ల్-ఖర్నైన్‌ను[1] గురించి అడుగుతున్నారు. వారితో అను: "అతనిని గురించి జ్ఞాపకముంచుకోదగిన విషయాన్ని నేను మీకు వినిపిస్తాను."

وَيَسْأَلُونَكَ عَن ذِي الْقَرْنَيْنِ ۖ قُلْ سَأَتْلُو عَلَيْكُم مِّنْهُ ذِكْرًا ﴿٨٣﴾

**84.** నిశ్చయంగా మేము అతని (అధికారాన్ని)

إِنَّا مَكَّنَّا لَهُ فِي الْأَرْضِ وَآتَيْنَاهُ مِن كُلِّ شَيْءٍ

---

1. జు'ల్-ఖర్నైన్ అంటే రెండు కొమ్ములున్నవాడు.

سَبَبًا ﴿٨٤﴾

భూమిలో స్థాపించాము. మరియు అతనికి ప్రతి దానిని పొందే మార్గాన్ని చూపాము.[1]

فَأَتْبَعَ سَبَبًا ﴿٨٥﴾

**85**. అతను ఒక మార్గం మీద పోయాడు.

حَتَّىٰٓ إِذَا بَلَغَ مَغْرِبَ ٱلشَّمْسِ وَجَدَهَا تَغْرُبُ فِى
عَيْنٍ حَمِئَةٍ وَوَجَدَ عِندَهَا قَوْمًا ۗ قُلْنَا يَٰذَا
ٱلْقَرْنَيْنِ إِمَّآ أَن تُعَذِّبَ وَإِمَّآ أَن تَتَّخِذَ
فِيهِمْ حُسْنًا ﴿٨٦﴾

**86**. చివరకు సూర్యుడు అస్తమించు (నట్లు కనబడే) స్థలానికి చేరాడు. దానిని (సూర్యుణ్ణి) నల్లటి బురదవంటి నీటిచెలిమలో మునుగుతున్నట్లు చూశాడు.[2] మరియు అక్కడొక జాతివారిని చూశాడు. మేము అతనితో అన్నాము:[3] "ఓ జు'ల్-ఖర్నైన్! నీవు వారిని శిక్షించవచ్చు, లేదా, వారియెడల ఉదారవైఖరిని అవలంబించవచ్చు!"

قَالَ أَمَّا مَن ظَلَمَ فَسَوْفَ نُعَذِّبُهُۥ ثُمَّ يُرَدُّ إِلَىٰ
رَبِّهِۦ فَيُعَذِّبُهُۥ عَذَابًا نُّكْرًا ﴿٨٧﴾

**87**. అతను అన్నాడు: "ఎవడైతే దుర్మార్గం చేస్తాడో మేము అతనిని శిక్షిస్తాము. ఆ పిదప అతడు తన ప్రభువు వైపునకు మరలింపబడతాడు. అప్పుడు ఆయన అతనికి ఘోరమైన శిక్ష విధిస్తాడు.

وَأَمَّا مَنْ ءَامَنَ وَعَمِلَ صَٰلِحًا فَلَهُۥ جَزَآءً ٱلْحُسْنَىٰ ۖ
وَسَنَقُولُ لَهُۥ مِنْ أَمْرِنَا يُسْرًا ﴿٨٨﴾

**88**. "ఇక ఎవడైతే, విశ్వసించి సత్కార్యాలు చేస్తాడో అతనికి మంచి ప్రతిఫలముంటుంది. మేము అతనిని ఆజ్ఞాపించినపుడు, సులభతరమైన ఆజ్ఞనే ఇస్తాము."

ثُمَّ أَتْبَعَ سَبَبًا ﴿٨٩﴾

**89**. తరువాత అతను మరొక మార్గం మీద పోయాడు.

---

1 ఆస్-సబబు: అంటే దారి. ఇక్కడ తాను కోరిన దానిని పొందే మార్గాన్ని అన్వేషించడమని అర్థం.

2. 'ఐనున్: సముద్రం లేక చెలిమ. 'హమిఅతిన్: బురద.
వజద: పొందాడు, చూశాడు, కనుగొన్నాడు. అతడు పూర్తి పశ్చిమ దిశకు పోయిన తరువాత అక్కడ ఒక సముద్రం లేక చెలిమను చూశాడు. దాని నీరు నల్లని బురదగా కనిపించింది. దాని తరువాత అతనికి ఏమీ కనిపించక అస్తమయ్యే సూర్యుడు మాత్రమే కనిపించాడు. సముద్రపు ఒడ్డున నిలబడి అస్తమించే సూర్యుణ్ణి చూస్తే, సూర్యుడు ఆ సముద్రంలో మునిగిపోతున్నట్లు కనబడటం మనం చూస్తున్న విషయమే. భూమి గుండ్రంగా ఉన్నదనటానికి ఇదొక నిదర్శనం.

3 ఖుల్నా, మేమన్నాము, అంటే అల్లాహుతా'ఆలా అతనికి వ'హీ ద్వారా తెలిపాడు. అంటే, అతడు ప్రవక్త కావచ్చని కొందరు భావిస్తారు. అతనిని ప్రవక్తగా పరిగణించని వారు; ఆ కాలపు ప్రవక్త ద్వారా అతనికి సందేశం ఇవ్వబడిందని అంటారు.

**90.** చివరకు సూర్యుడు ఉదయించు (నట్లు కనపడే) స్థలానికి చేరాడు అక్కడ అతను దానిని (సూర్యుణ్ణి) ఒక జాతిపై ఉదయించడం చూశాడు. వారికి మేము దాని (సూర్యుని) నుండి కాపాడు కోవటానికి ఎలాంటి చాటు(రక్షణ) నివ్వలేదు.[1]

حَتَّىٰٓ إِذَا بَلَغَ مَطْلِعَ ٱلشَّمْسِ وَجَدَهَا تَطْلُعُ عَلَىٰ قَوْمٍ لَّمْ نَجْعَل لَّهُم مِّن دُونِهَا سِتْرًا ﴿٩٠﴾

**91.** ఈ విధంగా! వాస్తవానికి, అతనికి (జు'ల్-ఖర్నైన్‌కు) తెలిసిఉన్న విషయాలను గురించి మాకు బాగా తెలుసు.

كَذَٰلِكَ وَقَدْ أَحَطْنَا بِمَا لَدَيْهِ خُبْرًا ﴿٩١﴾

**92.** ఆ తరువాత అతను మరొక మార్గం మీద పోయాడు.

ثُمَّ أَتْبَعَ سَبَبًا ﴿٩٢﴾

**93.** చివరకు అతను రెండు పర్వతాల మధ్య చేరాడు. వాటి మధ్య ఒక జాతి వారిని చూశాడు. వారు అతని మాటలను అతి కష్టంతో అర్థం చేసుకోగలిగారు.[2]

حَتَّىٰٓ إِذَا بَلَغَ بَيْنَ ٱلسَّدَّيْنِ وَجَدَ مِن دُونِهِمَا قَوْمًا لَّا يَكَادُونَ يَفْقَهُونَ قَوْلًا ﴿٩٣﴾

**94.** వారన్నారు: "ఓ జు'ల్-ఖర్నైన్. వాస్తవానికి య'అజూజ్ మరియు మ'అజూజ్‌లు,[3] ఈ భూభాగంలో కల్లోలం రేకెత్తిస్తున్నారు అయితే నీవు మాకూ మరియు వారికీ మధ్య ఒక

قَالُوا۟ يَـٰذَا ٱلْقَرْنَيْنِ إِنَّ يَأْجُوجَ وَمَأْجُوجَ مُفْسِدُونَ فِى ٱلْأَرْضِ فَهَلْ نَجْعَلُ لَكَ خَرْجًا عَلَىٰٓ أَن تَجْعَلَ بَيْنَنَا وَبَيْنَهُمْ سَدًّا ﴿٩٤﴾

---

1 ఆ జాతివారు ఇండ్లలో నివసించేవారు కాదు మైదానాలలో నివసించేవారు మరియు వారు బట్టలు కూడా ధరించకుండా నివసించే ఆదివాసులు.

2 ఆ జాతి వారు తమ భాష తప్ప ఇతరుల భాషను అర్థం చేసుకోలేరు కావున వారు అతని మాటలను అర్థం చేసుకోలేక పోయారు.

3. వీరి గాథ బైబిల్‌లో కూడా పేర్కొనబడింది చూడండి, యహెజ్కేలు (Ezekiel), 38:2 మరియు 39:6 ఇంకా ఇతర చోట్లలోకూడా వీరి విషయం పేర్కొనబడింది. చూడండి, యోహాను ప్రకటన (Revelation of St. John), 20:8
చాలా మంది వ్యాఖ్యాతలు వీరిని మంగోలులు లేక టాటార్‌లు (Mongols or Tatars) కావచ్చని అంటారు వీరు అసత్యవాదులు మరియు అంతిమ గడియకు ముందు భూమిలో కల్లోలం రేకెత్తించి మానవ నాగరికతను నాశనం చేస్తారు. ఇంకా చూడండి, 21:96-97 వాస్తవం అల్లాహ్(సు.తా.)కే తెలుసు స'హీ'హ్ బు'ఖారీ మరియు ముస్లింలలో ఇలా ఉంది. 'య'అజూజ్ మ'అజూజ్‌లు,' రెండు మానవ జాతులు. వారి సంఖ్య ఇతర మానవుల కంటే అధికముగా ఉంటుంది మరియు వారితోనే నరకం అత్యధికంగా నిండుతుంది

అడ్డుగోడను నిర్మించటానికి, మేము నీకేమైనా శుల్కం చెల్లించాలా?"

**95.** అతను అన్నాడు: "నా ప్రభువు ఇచ్చిందే నాకు ఉత్తమమైనది. ఇక మీరు మీ శ్రమ ద్వారా మాత్రమే నాకు సహాయపడితే, నేను మీకూ మరియు వారికీ మధ్య అడ్డుగోడను నిర్మిస్తాను

قَالَ مَا مَكَّنِّي فِيهِ رَبِّي خَيْرٌ فَأَعِينُونِي بِقُوَّةٍ أَجْعَلْ بَيْنَكُمْ وَبَيْنَهُمْ رَدْمًا ﴿٩٥﴾

**96.** "మీరు నాకు ఇనుపముద్దలు తెచ్చి ఇవ్వండి." అతను ఆ రెండు కొండల మధ్య ఉన్న సందును మూసిన తరువాత వారితో అన్నాడు: "అగ్ని రగిలించండి." దానిని ఎర్రని నిప్పుగా మార్చిన తరువాత, అన్నాడు: "ఇక కరిగిన రాగిని తీసుకురండి, దీనిమీద పోయటానికి."

آتُونِي زُبَرَ الْحَدِيدِ حَتَّىٰ إِذَا سَاوَىٰ بَيْنَ الصَّدَفَيْنِ قَالَ انفُخُوا حَتَّىٰ إِذَا جَعَلَهُ نَارًا قَالَ آتُونِي أُفْرِغْ عَلَيْهِ قِطْرًا ﴿٩٦﴾

**97.** ఈ విధంగా వారు (యా'జూజ్ మరియు మా'జూజ్‌లు) దానిపై నుండి ఎక్కి రాలేక పోయారు. మరియు దానిలో కన్నం కూడా చేయలేక పోయారు.

فَمَا اسْطَاعُوا أَن يَظْهَرُوهُ وَمَا اسْتَطَاعُوا لَهُ نَقْبًا ﴿٩٧﴾

**98.** అతను (జు'ల్-ఖర్నైన్) అన్నాడు: "ఇది నా ప్రభువు యొక్క కారుణ్యం. కాని నా ప్రభువు వాగ్దానపు ఘడియ వచ్చినపుడు ఆయన దీనిని బూడిదగా మార్చివేస్తాడు మరియు నా ప్రభువు వాగ్దానం నిజమైతీరుతుంది." (1/8)

قَالَ هَٰذَا رَحْمَةٌ مِّن رَّبِّي فَإِذَا جَاءَ وَعْدُ رَبِّي جَعَلَهُ دَكَّاءَ وَكَانَ وَعْدُ رَبِّي حَقًّا ﴿٩٨﴾

**99.** * మరియు ఆ (యా'జూజ్ మరియు మా'జూజ్‌లు బయటికి వచ్చిన) రోజు, మేము వారిని అలలవలే ఒకరిమీద ఒకరు పడటానికి వదిలివేస్తాము మరియు బాకా ('సూర్) ఊదబడి నప్పుడు, వారందరినీ ఒకచోట సమావేశపరుస్తాము.

وَتَرَكْنَا بَعْضَهُمْ يَوْمَئِذٍ يَمُوجُ فِي بَعْضٍ وَنُفِخَ فِي الصُّورِ فَجَمَعْنَاهُمْ جَمْعًا ﴿٩٩﴾

**100.** మరియు ఆ రోజున మేము సత్యతిరస్కారులకు నరకాన్ని స్పష్టంగా చూపేందుకు వారి ముందుకు తెస్తాము.

وَعَرَضْنَا جَهَنَّمَ يَوْمَئِذٍ لِّلْكَافِرِينَ عَرْضًا ﴿١٠٠﴾

**101.** అలాంటి వారికి, ఎవరి కన్నులైతే,

الَّذِينَ كَانَتْ أَعْيُنُهُمْ فِي غِطَاءٍ عَن ذِكْرِي

وَكَانُوا لَا يَسْتَطِيعُونَ سَمْعًا ﴿١٠١﴾

మా హితోపదేశం పట్ల కప్పబడిఉండెనో మరియు వారికి, ఎవరైతే (దానిని) ఏ మాత్రమూ వినటానికి కూడా ఇష్టపడలేదో!

أَفَحَسِبَ الَّذِينَ كَفَرُوا أَن يَتَّخِذُوا عِبَادِي مِن دُونِي أَوْلِيَاءَ ۚ إِنَّا أَعْتَدْنَا جَهَنَّمَ لِلْكَافِرِينَ نُزُلًا ﴿١٠٢﴾

**102.** ఏమీ? ఈ సత్యతిరస్కారులు నన్ను వదలి, నా దాసులను తమ స్నేహితులుగా (సంరక్షకులుగా) చేసుకోనగలరని భావించారా? నిశ్చయంగా, మేము సత్యతిరస్కారుల ఆతిథ్యం కొరకు నరకాన్ని సిద్ధపరచిఉంచాము

قُلْ هَلْ نُنَبِّئُكُم بِالْأَخْسَرِينَ أَعْمَالًا ﴿١٠٣﴾

**103.** వారితో అను: "కర్మలను బట్టి అందరికంటే ఎక్కువ నష్టపడే వారు ఎవరో మీకు తెలుపాలా?

الَّذِينَ ضَلَّ سَعْيُهُمْ فِي الْحَيَاةِ الدُّنْيَا وَهُمْ يَحْسَبُونَ أَنَّهُمْ يُحْسِنُونَ صُنْعًا ﴿١٠٤﴾

**104.** "ఎవరైతే ఇహలోక జీవితంలో చేసే కర్మలన్నీ వ్యర్థమైనా, తాము చేసేవన్నీ సత్కార్యాలే అని భావిస్తారో!

أُولَٰئِكَ الَّذِينَ كَفَرُوا بِآيَاتِ رَبِّهِمْ وَلِقَائِهِ فَحَبِطَتْ أَعْمَالُهُمْ فَلَا نُقِيمُ لَهُمْ يَوْمَ الْقِيَامَةِ وَزْنًا ﴿١٠٥﴾

**105.** "వీరే తమ ప్రభువు సూచనలను మరియు ఆయనను కలుసుకోవలసి వున్నదనే విషయాన్ని తిరస్కరించిన వారు. కావున వారి కర్మలన్నీ వ్యర్థమయ్యాయి. కాబట్టి మేము పునరుత్థానదినమున వారి కర్మలకు ఎలాంటి విలువ (తూకము) నివ్వము.

ذَٰلِكَ جَزَاؤُهُمْ جَهَنَّمُ بِمَا كَفَرُوا وَاتَّخَذُوا آيَاتِي وَرُسُلِي هُزُوًا ﴿١٠٦﴾

**106.** "అదే వారి ప్రతిఫలం, నరకం! ఎందుకంటే వారు సత్యాన్ని తిరస్కరించారు మరియు నా సూచనలను మరియు నా సందేశహరులను పరిహసించారు.

إِنَّ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ كَانَتْ لَهُمْ جَنَّاتُ الْفِرْدَوْسِ نُزُلًا ﴿١٠٧﴾

**107.** "నిశ్చయంగా, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో! వారి ఆతిథ్యం కొరకు ఫిర్దౌస్ స్వర్గవనాలు ఉంటాయి.[1]

خَالِدِينَ فِيهَا لَا يَبْغُونَ عَنْهَا حِوَلًا ﴿١٠٨﴾

**108.** "వారందులో శాశ్వతంగా ఉంటారు,

---

1 జన్నతుల్ ఫిర్దౌస్ ఇది అన్నిటి కంటే ఉత్తమమైన స్వర్గం. దైవప్రవక్త (స'అస) ప్రవచనం: 'మీరు ఎల్లప్పుడు జన్నతుల్ ఫిర్దౌస్ కొరకే ప్రార్థించండి.' (స'హీ'హ్ బు'ఖారీ)

వారు అక్కడి నుండి వేరగుటకు ఇష్టపడరు."

**109.** వారితో అను: "నా ప్రభువు మాటలను వ్రాయటానికి, సముద్రమంతా సిరాగా మారి పోయినా - నా ప్రభువు మాటలు పూర్తికాక ముందే - దానికి తోడుగా దానివంటి మరొక సముద్రాన్ని తెచ్చినా, అది కూడా తరిగి పోతుంది."[1]

قُل لَّوْ كَانَ ٱلْبَحْرُ مِدَادًا لِّكَلِمَٰتِ رَبِّى لَنَفِدَ ٱلْبَحْرُ
قَبْلَ أَن تَنفَدَ كَلِمَٰتُ رَبِّى وَلَوْ جِئْنَا بِمِثْلِهِۦ مَدَدًا ﴿١٠٩﴾

**110.** (ఓ ప్రవక్తా!) ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, నేను కూడా మీలాంటి ఒక మానవుడనే! నాపై దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడింది. నిశ్చయంగా, మీ ఆరాధ్య దేవుడు ఆ ఏకైక దైవం (అల్లాహ్) మాత్రమే. కావున తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి. మరియు ఆరాధనలో తన ప్రభువుతో పాటు మరెవ్వరినీ భాగస్వాము (షరీక్)లుగా కల్పించుకోరాదు."

قُلْ إِنَّمَآ أَنَا۠ بَشَرٌ مِّثْلُكُمْ يُوحَىٰٓ إِلَىَّ أَنَّمَآ إِلَٰهُكُمْ إِلَٰهٌ وَٰحِدٌ
فَمَن كَانَ يَرْجُوا۟ لِقَآءَ رَبِّهِۦ فَلْيَعْمَلْ عَمَلًا صَٰلِحًا وَلَا يُشْرِكْ
بِعِبَادَةِ رَبِّهِۦٓ أَحَدًۢا ﴿١١٠﴾

1. చూడండి, 31:27

## 19. సూరహ్ మర్యమ్

سُوْرَةُ مَرْيَمَ

జ'అఫర్ బిన్ అబీ 'తాలిబ్ (ర'ది.'అ.) 'హబషా (Abyssinia)కు వలస పోయినప్పుడు, 'హబషా రాజు నజాషీ (Negus) సభలో సూరహ్ మర్యం మొదటి భాగం చదివి వినిపిస్తారు అప్పుడు వారందరి గడ్డాలు కన్నీరుతో నిండుతాయి. అప్పుడతడు అంటాడు 'ఖుర్ఆన్ మరియు 'ఈసా ('అ.స.) తెచ్చిన గ్రంథం రెండూ ఒకే జ్యోతి యొక్క కిరణాలు' (ఫ'త్హ్ అల్ ఖదీర్). దీని పేరు 16వ ఆయత్ నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ హి'జ్రత్‌కు దాదాపు 7-8 సంవత్సరాలకు ముందు మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో 98 ఆయతులు ఉన్నాయి. ఇందులో సయ్యిదా మర్యం ('అ.స.) ఆమె కుమారులు 'ఈసా ('అ.స.) ఆమె పోషకులు 'జకరియ్యా ('అ.స.) మరియు అతని కుమారులు య'హ్యా ('అ.స.)ల గాథలు ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

كٓهٰيٰعٓصٓ ۝

1. కాఫ్-హా-యా-'ఐన్-సాద్.

ذِكْرُ رَحْمَتِ رَبِّكَ عَبْدَهٗ زَكَرِيَّا ۝

2. ఇది నీ ప్రభువు తన దాసుడు 'జకరియ్యాపై చూపిన కారుణ్యప్రస్తావన.

اِذْ نَادٰى رَبَّهٗ نِدَآءً خَفِيًّا ۝

3. అతను తన ప్రభువును రహస్యంగా (ఏకాంతంలో) మొరపెట్టుకుంటూ,

قَالَ رَبِّ اِنِّيْ وَهَنَ الْعَظْمُ مِنِّيْ وَاشْتَعَلَ الرَّاْسُ شَيْبًا وَّلَمْ اَكُنْۢ بِدُعَآئِكَ رَبِّ شَقِيًّا ۝

4. ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నా ఎముకలు బలహీనమైపోయాయి మరియు నా తల (వెంట్రుకలు) ముసలితనంవల్ల తెల్లబడి మెరిసిపోతున్నాయి. మరియు ఓ నా ప్రభూ! నిన్ను వేడుకొని నేను ఎన్నడూ నిష్ఫలుడను కాలేదు!

وَاِنِّيْ خِفْتُ الْمَوَالِيَ مِنْ وَّرَآءِيْ وَكَانَتِ امْرَاَتِيْ عَاقِرًا فَهَبْ لِيْ مِنْ لَّدُنْكَ وَلِيًّا ۝

5. "మరియు వాస్తవానికి నా తరువాత నా బంధువులు (ఏమిచేస్తారో అని) నేను భయపడుతున్నాను నా భార్య గొడ్రాలు. కావున (నీ అనుగ్రహంతో) నాకు ఒక వారసుణ్ణి ప్రసాదించు.

يَّرِثُنِيْ وَيَرِثُ مِنْ اٰلِ يَعْقُوْبَ وَاجْعَلْهُ رَبِّ رَضِيًّا ۝

6. "అతడు నాకు మరియు య'అఖూబ్ సంతతి వారికి వారసుడవుతాడు. మరియు ఓ నా ప్రభూ! అతనిని నీకు ప్రీతిపాత్రునిగా చేసుకో!"

**7.** (అతనికి ఇలా జవాబివ్వబడింది): "ఓ 'జకరియ్యా! నిశ్చయంగా, మేము నీకు య'హ్యా అనే పేరుగల ఒక కుమారుని శుభవార్తను ఇస్తున్నాము.[1] ఇంతకు పూర్వం మేము ఈ పేరు ఎవ్వరికీ ఇవ్వలేదు."

يَٰزَكَرِيَّآ إِنَّا نُبَشِّرُكَ بِغُلَٰمٍ ٱسْمُهُۥ يَحْيَىٰ لَمْ نَجْعَل لَّهُۥ مِن قَبْلُ سَمِيًّا ۝

**8.** ('జకరియ్యా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకు కుమారుడు ఎలా కలుగుతాడు? నా భార్యనేమో గొడ్రాలు,[2] మరియు నే నేమో వృద్ధాప్యంతో క్షీణించి (దుర్బలుడనై) పోయాను?"

قَالَ رَبِّ أَنَّىٰ يَكُونُ لِى غُلَٰمٌ وَكَانَتِ ٱمْرَأَتِى عَاقِرًا وَقَدْ بَلَغْتُ مِنَ ٱلْكِبَرِ عِتِيًّا ۝

**9.** ఇలా జవాబిచ్చాడు: "అలాగే అవుతుంది నీ ప్రభువు ఇలా అంటున్నాడు: 'ఇది నాకు సులభం మరియు వాస్తవానికి ఇంతకు ముందు నీవు ఏమీ లేనప్పుడు, నేను నిన్ను సృష్టించాను కదా!' "

قَالَ كَذَٰلِكَ قَالَ رَبُّكَ هُوَ عَلَىَّ هَيِّنٌ وَقَدْ خَلَقْتُكَ مِن قَبْلُ وَلَمْ تَكُ شَيْـًٔا ۝

**10.** ('జకరియ్యా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నాకొక గుర్తును నియమించు." ఇలా జవాబు ఇవ్వబడింది: "నీ గుర్తు ఏమిటంటే! నీవు స్వస్థతతో ఉండికూడా వరుసగా మూడు రాత్రులు (దినములు) ప్రజలతో మాట్లాడలేవు."[3]

قَالَ رَبِّ ٱجْعَل لِّىٓ ءَايَةً قَالَ ءَايَتُكَ أَلَّا تُكَلِّمَ ٱلنَّاسَ ثَلَٰثَ لَيَالٍ سَوِيًّا ۝

**11.** ఆ పిదప అతను ('జకరియ్యా) తన ప్రార్థనాలయం నుండి బయటికి వచ్చి తన జాతి వారికి, సైగలతో ఉదయమూ మరియు సాయంత్రమూ, ఆయన (ప్రభువు) పవిత్రతను కొనియాడండని సూచించాడు.

فَخَرَجَ عَلَىٰ قَوْمِهِۦ مِنَ ٱلْمِحْرَابِ فَأَوْحَىٰٓ إِلَيْهِمْ أَن سَبِّحُوا۟ بُكْرَةً وَعَشِيًّا ۝

**12.** (అతని కుమారునితో ఇలా అనబడింది): "ఓ య'హ్యా! ఈ దివ్యగ్రంథాన్ని గట్టిగా పట్టుకో."

يَٰيَحْيَىٰ خُذِ ٱلْكِتَٰبَ بِقُوَّةٍ وَءَاتَيْنَٰهُ ٱلْحُكْمَ صَبِيًّا ۝

---

1. చూడండి, 3:39
2. 'జకరియ్యా ('అ.స.) భార్య, మర్యమ్ ('అ.స.) తల్లి యొక్క సోదరీమణి అని కొందరంటారు చూడండి, 3:37 వ్యాఖ్యానం 3. మరికొందరు ఆమె మర్యమ్ ('అ.స.) తండ్రి 'ఇమ్రాన్ కూతురని అంటారు. అంటే య'హ్యా ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.) అక్కాచెల్లెళ్ళ కుమారులు. అంటే కజిన్‌లు (స'హీ'హ్ అ'హాదీస్‌ల ఆధారంగా, ఫ'త్'హ్ అల్ ఖదీర్)
3. చూడండి, 3:41.

మరియు మేము అతనికి బాల్యంలోనే వివేకాన్ని[1] ప్రసాదించాము.

**13.** మరియు మా తరఫునుండి కనికరాన్ని, పరిశుద్ధతను ఒసంగాము మరియు అతను దైవభీతి గలవాడు.

وَحَنَانًا مِّن لَّدُنَّا وَزَكَوٰةً وَكَانَ تَقِيًّا ﴿١٣﴾

**14.** మరియు తన తల్లిదండ్రుల పట్ల కర్తవ్య పాలకుడు. మరియు అతను హింసాపరుడు గానీ మరియు అవిధేయుడు గానీ కాదు.

وَبَرًّا بِوَٰلِدَيْهِ وَلَمْ يَكُن جَبَّارًا عَصِيًّا ﴿١٤﴾

**15.** మరియు అతను పుట్టినరోజూ మరియు అతను మరణించేరోజూ మరియు అతను బ్రతికించి మరల లేపబడేరోజూ అతనికి శాంతి కలుగు గాక![2]

وَسَلَٰمٌ عَلَيْهِ يَوْمَ وُلِدَ وَيَوْمَ يَمُوتُ وَيَوْمَ يُبْعَثُ حَيًّا ﴿١٥﴾

**16.** మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో ఉన్న మర్యమ్ (గాథను) ప్రస్తావించు. ఆమె తన కుటుంబంవారిని విడిచి తూర్పుదిశలో ఒక స్థలానికి వెళ్ళిపోయింది.

وَاذْكُرْ فِي الْكِتَٰبِ مَرْيَمَ إِذِ انتَبَذَتْ مِنْ أَهْلِهَا مَكَانًا شَرْقِيًّا ﴿١٦﴾

**17.** అక్కడ ఆమె వారి నుండి ఏకాంతంలో ఒక అడ్డుతెర కట్టుకొని ఉండసాగింది. అప్పుడు మేము ఆమె వద్దకు మా దూత (జిబ్రీల్)ను పంపాము.[3] అతను ఆమె ముందు సంపూర్ణ మానవ ఆకారం (రూపం)లో ప్రత్యక్ష మయ్యాడు.

فَاتَّخَذَتْ مِن دُونِهِمْ حِجَابًا فَأَرْسَلْنَا إِلَيْهَا رُوحَنَا فَتَمَثَّلَ لَهَا بَشَرًا سَوِيًّا ﴿١٧﴾

---

1 అల్ 'హుక్మ్ అంటే జ్ఞానం, తెలివి, నిర్ణయసామర్థ్యం, గ్రంథాన్ని అర్థంచేసుకునే శక్తి, మొదలైనవన్నీ అని ఇమామ్ షౌకాని అభిప్రాయం.

2 ఎందుకంటే ఈ మూడుదినాలు మానవుని కొరకు ఎంతో కష్టదాయకమైనవి మరియు భయంకరమైనవి

3 రూ'హున్: దివ్యజ్ఞానం (వ'హీ)గా లేక దానిని తెచ్చే దేవదూత జిబ్రీల్ ('అ.స.)గా ఉపయోగించబడింది. ఇక్కడ దేవదూత జిబ్రీల్ ('అ.స.)గా ఉపయోగించబడింది.
రూ'హుల్ ఖుద్స్, అని, 2:87, 253, 5:110 మరియు 16:102లలో జిబ్రీల్ ('అ.స.) కొరకు నాలుగు చోట్లలో వాడబడింది.
రూ'హుల్ అమీన్, అని 26:193లో జిబ్రీల్ ('అ.స.) కొరకు వాడబడింది.
అర్ రూ'హు: అని ఇక్కడ, 78:38 మరియు 97:4లలో జిబ్రీల్ ('అ.స.) కొరకు మూడు చోట్లలో వాడబడింది, అవతరణలో మొదటిసారిగా 97:4లో వచ్చింది.
అర్ రూ'హు: అంటే దివ్యజ్ఞానం అని, 16:2, 40:15 మరియు 42:52లలో మూడు చోట్లలో వాడబడింది.

**18.** (మర్యమ్) ఇలా అన్నది: "ఒకవేళ నీవు దైవభీతి గలవాడవే అయితే! నిశ్చయంగా నేను నీ నుండి (రక్షింపబడటానికి) అనంత కరుణామయుని శరణు వేడుకుంటున్నాను."

قَالَتْ إِنِّيٓ أَعُوذُ بِٱلرَّحْمَٰنِ مِنكَ إِن كُنتَ
تَقِيًّا ۝

**19.** (దేవదూత ఇలా) జవాబిచ్చాడు: "నిశ్చయంగా నేను నీ ప్రభువు యొక్క సందేశహరుడను! నీకు ఒక నీతిమంతుడైన కుమారుని (సందేశాన్ని) ఇవ్వటానికి పంపబడ్డాను."

قَالَ إِنَّمَآ أَنَا۠ رَسُولُ رَبِّكِ لِأَهَبَ لَكِ غُلَٰمًا زَكِيًّا ۝

**20.** ఆమె ఇలా ప్రశ్నించింది: "నాకు కుమారుడు ఎలా కలుగుతాడు? నన్ను ఏ మానవుడునూ ముట్టుకోలేదే! మరియు నేను చెడు నడవడిక గలదానిని కూడా కాను!"

قَالَتْ أَنَّىٰ يَكُونُ لِى غُلَٰمٌ وَلَمْ يَمْسَسْنِى
بَشَرٌ وَلَمْ أَكُ بَغِيًّا ۝

**21.** అతను అన్నాడు: "అలాగే అవుతుంది! నీ ప్రభువు అంటున్నాడు: 'అది నాకు సులభం! మేము అతనిని, మా నుండి ప్రజలకు ఒక సూచనగా మరియు కారుణ్యంగా పంపుతున్నాము ' మరియు (నీ ప్రభువు) ఆజ్ఞ నెరవేరి తీరుతుంది." (1/4)

قَالَ كَذَٰلِكِ قَالَ رَبُّكِ هُوَ عَلَىَّ هَيِّنٌ ۖ
وَلِنَجْعَلَهُۥٓ ءَايَةً لِّلنَّاسِ وَرَحْمَةً مِّنَّا ۚ وَكَانَ
أَمْرًا مَّقْضِيًّا ۝

**22.** * తరువాత మర్యమ్ ఆ బాలుణ్ణి గర్భంలో భరించి, అతనితో ఒక దూరమైన స్థలానికి వెళ్ళిపోయింది.

فَحَمَلَتْهُ فَٱنتَبَذَتْ بِهِۦ مَكَانًا قَصِيًّا ۝

**23.** తరువాత ప్రసవ వేదనతో ఆమె ఒక ఖర్జూరపు చెట్టు మొదలు దగ్గరికి చేరుకొని ఇలా వాపోయింది: "అయ్యో! నా దౌర్భాగ్యం, దీనికి ముందే నేను చనిపోయివుంటే! మరియు నామరూపాలు లేకుండా నశించిపోతే ఎంత బాగుండేది!"

فَأَجَآءَهَا ٱلْمَخَاضُ إِلَىٰ جِذْعِ ٱلنَّخْلَةِ قَالَتْ
يَٰلَيْتَنِى مِتُّ قَبْلَ هَٰذَا وَكُنتُ نَسْيًا مَّنسِيًّا ۝

**24.** అప్పుడు క్రింది నుండి ఒక ధ్వని వినిపించింది: "నీవు దుఃఖించకు! వాస్తవంగా, నీ ప్రభువు, నీ క్రింద (దగ్గరగా) ఒక సెలయేరు సృష్టించాడు;

فَنَادَىٰهَا مِن تَحْتِهَآ أَلَّا تَحْزَنِى قَدْ جَعَلَ
رَبُّكِ تَحْتَكِ سَرِيًّا ۝

25. "మరియు నీవు ఈ చెట్టు మొదలు పట్టి ఊపితే నీపై తాజా ఖర్జూరపండ్లు రాలుతాయి.

وَهُزِّيٓ إِلَيْكِ بِجِذْعِ ٱلنَّخْلَةِ تُسَٰقِطْ عَلَيْكِ رُطَبًا جَنِيًّا ۝٢٥

26. "కావున నీవు తిను త్రాగు, నీ కళ్ళను చల్లబరచుకో! ఇక ఏ మానవుణ్ణి చూసినా అతనితో (సైగలతో): 'నేను నా కరుణామయుని కొరకు ఉపవాసం ఉన్నాను, కావున ఈ రోజు నేను ఏ మానవునితో మాట్లాడను' అని చెప్పు."

فَكُلِي وَٱشْرَبِي وَقَرِّي عَيْنًا ۖ فَإِمَّا تَرَيِنَّ مِنَ ٱلْبَشَرِ أَحَدًا فَقُولِيٓ إِنِّي نَذَرْتُ لِلرَّحْمَٰنِ صَوْمًا فَلَنْ أُكَلِّمَ ٱلْيَوْمَ إِنسِيًّا ۝٢٦

27. తరువాత ఆమె ఆ బాలుణ్ణి తీసుకొని తన జాతివారి వద్దకు రాగా! వారన్నారు: "ఓ మర్యమ్! వాస్తవానికి నీవు ఊహించరాని (నింద్యమైన) పని చేశావు!

فَأَتَتْ بِهِۦ قَوْمَهَا تَحْمِلُهُۥ ۖ قَالُوا۟ يَٰمَرْيَمُ لَقَدْ جِئْتِ شَيْـًٔا فَرِيًّا ۝٢٧

28. "ఓ హారూన్ సోదరీ![1] నీ తండ్రీ చెడ్డవాడు కాదు మరియు నీ తల్లి కూడా చెడునడత గలది కాదే!"

يَٰٓأُخْتَ هَٰرُونَ مَا كَانَ أَبُوكِ ٱمْرَأَ سَوْءٍ وَمَا كَانَتْ أُمُّكِ بَغِيًّا ۝٢٨

29. అప్పుడామె అతని (ఆ బాలుని) వైపు సైగచేసింది వారన్నారు: "తొట్లెలో వున్న ఈ బాలునితో మేమెలా మాట్లాడగలము?"

فَأَشَارَتْ إِلَيْهِ ۖ قَالُوا۟ كَيْفَ نُكَلِّمُ مَن كَانَ فِى ٱلْمَهْدِ صَبِيًّا ۝٢٩

30. (ఆ బాలుడు) అన్నాడు: "నిశ్చయంగా, నేను అల్లాహ్ దాసుణ్ణి. ఆయన నాకు దివ్య గ్రంథాన్నిచ్చి, నన్ను ప్రవక్తగా నియమించాడు

قَالَ إِنِّى عَبْدُ ٱللَّهِ ءَاتَىٰنِىَ ٱلْكِتَٰبَ وَجَعَلَنِى نَبِيًّا ۝٣٠

31. "మరియు నేనెక్కడ ఉన్నా సరే ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు, నేను బ్రతికివున్నంత కాలం నమా'జ్ చేయమని మరియు విధిదానం ('జకాత్) ఇవ్వమని నన్ను ఆదేశించాడు

وَجَعَلَنِى مُبَارَكًا أَيْنَ مَا كُنتُ وَأَوْصَٰنِى بِٱلصَّلَوٰةِ وَٱلزَّكَوٰةِ مَا دُمْتُ حَيًّا ۝٣١

32. "మరియు నన్ను నా తల్లి యెడల కర్తవ్యపాలకునిగా చేశాడు నన్ను దౌర్జన్యపరునిగా,

وَبَرًّۢا بِوَٰلِدَتِى وَلَمْ يَجْعَلْنِى جَبَّارًا شَقِيًّا ۝٣٢

---

1 హారూన్ సోదరీ, అంటే ఆమెకు హారూన్ అనే సవతి (అర్ధ) సోదరుడు ఉండవచ్చు, లేదా మూసా ('అ.స.) సోదరుడు హారూన్‌తో సంబంధం ఉన్నందువల్ల అలా పిలువబడి ఉండవచ్చు! తమ వంశంలోని పెద్దవాని పేరుతో పిలువబడటం ఆచారమే (ఇబ్నె కసీ'ర్ మరియు ఐసర్ అత్ తఫాసీర్) చూడండి, 3:37 వ్యాఖ్యానం 3.

దౌర్భాగ్యునిగా చేయలేదు.

وَالسَّلٰمُ عَلَیَّ یَوْمَ وُلِدْتُّ وَیَوْمَ اَمُوْتُ وَیَوْمَ اُبْعَثُ حَیًّا ۝

**33.** "మరియు నేను పుట్టిన రోజూ మరియు నేను మరణించేరోజూ మరియు నేను సజీవుడనై మరల లేచేరోజూ, నాకు శాంతి కలుగు గాక!"

ذٰلِكَ عِیْسَی ابْنُ مَرْیَمَ ۚ قَوْلَ الْحَقِّ الَّذِیْ فِیْهِ یَمْتَرُوْنَ ۝

**34.** ఇతనే మర్యమ్ కుమారుడు ఈసా. ఇదే సత్యమైన మాట, దీనిని గురించే వారు వాదులాడుతున్నారు (సందేహంలో పడి ఉన్నారు).

مَا كَانَ لِلّٰهِ اَنْ یَّتَّخِذَ مِنْ وَّلَدٍ ۙ سُبْحٰنَهٗ ؕ اِذَا قَضٰۤی اَمْرًا فَاِنَّمَا یَقُوْلُ لَهٗ كُنْ فَیَكُوْنُ ۝

**35.** ఎవరినైనా కుమారునిగా చేసుకోవటం అల్లాహ్‌కు తగినపని కాదు ఆయన సర్వలోపాలకు అతీతుడు. ఆయన ఏదైనా చేయదలుచుకుంటే, దానిని కేవలం: "అయిపో!" అని అంటాడు. అంతే అది అయిపోతుంది.[1]

وَاِنَّ اللّٰهَ رَبِّیْ وَرَبُّكُمْ فَاعْبُدُوْهُ ؕ هٰذَا صِرَاطٌ مُّسْتَقِیْمٌ ۝

**36.** ('ఈసా అన్నాడు): "నిశ్చయంగా అల్లాహ్‌యే నా ప్రభువు మరియు మీ ప్రభువు. కావున మీరు ఆయననే ఆరాధించండి ఇదే ఋజుమార్గము."

فَاخْتَلَفَ الْاَحْزَابُ مِنْ بَیْنِهِمْ ۚ فَوَیْلٌ لِّلَّذِیْنَ كَفَرُوْا مِنْ مَّشْهَدِ یَوْمٍ عَظِیْمٍ ۝

**37.** తరువాత విభిన్న (క్రైస్తవ) వర్గాల వారు ('ఈసాను గురించి) పరస్పర అభిప్రాయ భేధాలు నెలకొల్పుకున్నారు. కావున ఈ సత్యతిరస్కారులకు ఆ మహాదినపు దర్శనం వినాశాత్మకంగా ఉంటుంది.[2]

---

1 అల్లాహుతా'ఆలా ప్రతిదీ చేయగల సమర్థుడు తాను చేయదలచుకున్న దానిని 'అయిపో' అని అనగానే, అది అయిపోతుంది అలాంటప్పుడు ఆయన (సు.తా.)కు సంతానపు ఆవశ్యకత ఎలా ఉంటుంది అల్లాహుతా'ఆలాకు సంతానముందని భావించేవారు ఆయన (సు.తా.) శక్తి సామర్థ్యాలను విశ్వసించనట్లే! అది సత్యతిరస్కారం

2 యూదులు 'ఈసా ('అ.స.)ను మాంత్రికుడు, యూసుఫ్ నజ్జార్ కుమారుడు అన్నారు. ప్రొటెస్టంట్ క్రైస్తవులు అతనిని అల్లాహ్ (సు.తా.) కుమారుడు అన్నారు. కేథోలిక్ తెగవారు అతను ముగ్గురు దైవాలలో, అంటే అల్లాహ్ (సు.తా.), జిబ్రీల్ ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.) ముగ్గురిలో మూడవవారు అన్నారు. ఆర్థోడాక్స్ తెగవారు అతనిని స్వయం దేవుడు (God అల్లాహ్) అన్నారు. (ఫ'త్హ్ అల్ ఖదీర్ మరియు అయ్‌సర్ అత్ తఫాసీర్)

**38.** వారు మాముందు హాజరయ్యే రోజున వారి చెవులు బాగానే వింటాయి మరియు వారి కండ్లు కూడా బాగానే చూస్తాయి. కాని ఈ నాడు ఈ దుర్మార్గులు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నారు.[1]

أَسْمِعْ بِهِمْ وَأَبْصِرْ يَوْمَ يَأْتُونَنَا لَٰكِنِ الظَّالِمُونَ الْيَوْمَ فِي ضَلَالٍ مُبِينٍ ﴿٣٨﴾

**39.** మరియు వారిని (రాబోయే) ఆ పశ్చాత్తాపపడవలసిన దినాన్ని[2] గురించి హెచ్చరించు అప్పుడు పరిణామం నిర్ణయించబడి ఉంటుంది.[3] (ఇప్పుడైతే) వారు ఏమరుపాటులో పడి ఉన్నారు, కావున వారు విశ్వసించడం లేదు

وَأَنذِرْهُمْ يَوْمَ الْحَسْرَةِ إِذْ قُضِيَ الْأَمْرُ وَهُمْ فِي غَفْلَةٍ وَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٣٩﴾

**40.** నిశ్చయంగా! భూమికి మరియు దానిపై వున్న వారికి వారసులం మేమే! వారందరూ మా వైపునకే మరలింపబడతారు.

إِنَّا نَحْنُ نَرِثُ الْأَرْضَ وَمَنْ عَلَيْهَا وَإِلَيْنَا يُرْجَعُونَ ﴿٤٠﴾

**41.** మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో వున్న ఇబ్రాహీమ్ గాథను ప్రస్తావించు నిశ్చయంగా అతను సత్యవంతుడైన దైవప్రవక్త.

وَاذْكُرْ فِي الْكِتَابِ إِبْرَاهِيمَ إِنَّهُ كَانَ صِدِّيقًا نَبِيًّا ﴿٤١﴾

**42.** అతను తన తండ్రితో ఇలా అన్నప్పుడు: "ఓ నాన్నా! వినలేని మరియు చూడలేని మరియు నీకు ఏ విధంగానూ సహాయపడలేని వాటిని, నీ వెందుకు ఆరాధిస్తున్నావు?

إِذْ قَالَ لِأَبِيهِ يَا أَبَتِ لِمَ تَعْبُدُ مَا لَا يَسْمَعُ وَلَا يُبْصِرُ وَلَا يُغْنِي عَنكَ شَيْئًا ﴿٤٢﴾

**43.** "ఓ నాన్నా, వాస్తవానికి, నా వద్దకు వచ్చిన జ్ఞానం నీ వద్దకు రాలేదు, కావున నీవు నన్ను

يَا أَبَتِ إِنِّي قَدْ جَاءَنِي مِنَ الْعِلْمِ مَا لَمْ يَأْتِكَ فَاتَّبِعْنِي أَهْدِكَ صِرَاطًا سَوِيًّا ﴿٤٣﴾

---

1 కాని వారి వినడం మరియు చూడడం పునరుత్థాన దినమున వారికి ఏమీ పనికి రావు

2 యౌమల్ 'హస్రతి: పశ్చాత్తాపపడే దినం అంటే పునరుత్థానదినము

3 పునరుత్థానదినమున స్వర్గానికి అర్హులైనవారిని స్వర్గానికి మరియు నరకానికి అర్హులైన వారిని నరకానికి పంపిన తరువాత మరణం ఒక గొర్రె ఆకారంలో తేబడుతుంది. దానిని స్వర్గనరకాల మధ్య నిలబెట్టబడి, స్వర్గ నరక వాసులతో: 'దీనిని ఎరుగుదురా?' అని ప్రశ్నించగా వారు 'అవును, ఇది మరణం' అని అంటారు. వారి సమక్షంలో అది వధింపబడుతుంది. అప్పుడు స్వర్గవాసులతో ఇలా అనబడుతుంది. 'స్వర్గవాసులారా! మీ కొరకు స్వర్గజీవితం కలకాలం ఉంటుంది' మరియు నరకవాసులతో అనబడుతుంది. 'మీకు ఈ నరకశిక్ష ఎల్లప్పుడూ ఉంటుంది. మరియు మీ కెవ్వరికీ ఇక చావురాదు. ('స'హీ'హ్ బు'ఖారీ)

అనుసరిస్తే, నేను నీకు సన్మార్గం చూపుతాను.

يَٰٓأَبَتِ لَا تَعۡبُدِ ٱلشَّيۡطَٰنَۖ إِنَّ ٱلشَّيۡطَٰنَ كَانَ لِلرَّحۡمَٰنِ عَصِيّٗا ٤٤

**44** "ఓ నాన్నా! నీవు షైతాన్‌ను ఆరాధించకు, నిశ్చయంగా షైతాన్ అనంత కరుణామయుణ్ణి ఉల్లంఘించాడు.

يَٰٓأَبَتِ إِنِّيٓ أَخَافُ أَن يَمَسَّكَ عَذَابٞ مِّنَ ٱلرَّحۡمَٰنِ فَتَكُونَ لِلشَّيۡطَٰنِ وَلِيّٗا ٤٥

**45.** "ఓ నాన్నా! నిశ్చయంగా, నీవు అనంత కరుణామయుని శిక్షకు గురిఅయ్యి, షైతాను యొక్క సహచరుడవు (వలీ) అయిపోతా వేమోనని నేను భయపడుతున్నాను!"

قَالَ أَرَاغِبٌ أَنتَ عَنۡ ءَالِهَتِي يَٰٓإِبۡرَٰهِيمُۖ لَئِن لَّمۡ تَنتَهِ لَأَرۡجُمَنَّكَۖ وَٱهۡجُرۡنِي مَلِيّٗا ٤٦

**46.** (అతని తండ్రి) అన్నాడు: "ఓ ఇబ్రాహీమ్! ఏమీ? నీవు నా దేవుళ్ళకు విముఖత చూపుతున్నావా? ఒకవేళ నీవిది మానుకోకపోతే నేను నిన్ను రాళ్ళురువ్వి చంపివేస్తాను. కావున నీవు నానుండి చాలా దూరమైపో!"

قَالَ سَلَٰمٌ عَلَيۡكَۖ سَأَسۡتَغۡفِرُ لَكَ رَبِّيٓۖ إِنَّهُۥ كَانَ بِي حَفِيّٗا ٤٧

**47.** (ఇబ్రాహీమ్) అన్నాడు: "నీకు సలాం![1] నీ కొరకు నా ప్రభువు క్షమాపణను వేడుకుంటాను.[2] నిశ్చయంగా, ఆయన నా యెడల ఎంతో దయాళువు.

وَأَعۡتَزِلُكُمۡ وَمَا تَدۡعُونَ مِن دُونِ ٱللَّهِ وَأَدۡعُواْ رَبِّي عَسَىٰٓ أَلَّآ أَكُونَ بِدُعَآءِ رَبِّي شَقِيّٗا ٤٨

**48.** "మరియు నేను మిమ్మల్ని - మరియు అల్లాహ్‌కు బదులుగా మీరు ప్రార్థిస్తున్న వాటిని - అందరినీ వదలిపోతున్నాను మరియు నేను నా ప్రభువును ప్రార్థిస్తాను. నేను నా ప్రభువును ప్రార్థించి విఫలుడనుకానని, నమ్ముతున్నాను!"

فَلَمَّا ٱعۡتَزَلَهُمۡ وَمَا يَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ وَهَبۡنَا لَهُۥٓ إِسۡحَٰقَ وَيَعۡقُوبَۖ وَكُلًّا جَعَلۡنَا نَبِيّٗا ٤٩

**49.** అతను (ఇబ్రాహీమ్) వారిని మరియు అల్లాహ్‌ను వదలి వారు ఆరాధించే వాటిని వదలిపోయిన తరువాత మేము అతనికి ఇస్‌హాఖ్

---

1 ఈ సలాం ఇక నా సంభాషణ ముగిస్తాను. అనే భావంలో ఉంది ఎందుకంటే దీని ముందు 'అల్ లేదు. ఇంకా ఇటువంటి సందర్భానికి చూడండి, 25:63.

2 ఈ దు'ఆ ముష్రిక్‌ల కొరకు క్షమాపణ వేడుకోరాదని తెలియక అల్లాహ్ (సు.తా.)ను, తన తండ్రిని క్షమించమని వేడుకున్నది కాని ముష్రిక్ కొరకు క్షమాపణ వేడుకోరాదని, తెలిసిన తరువాత, అతని తండ్రి అల్లాహ్ (సు.తా.)కు విరోధుడని స్పష్టమైనప్పుడు. అతను ('అ.స.) తన తండ్రి నుండి దూరమయ్యాడు. అంటే అతని క్షమాపణ కొరకు ప్రార్థించడం మానుకున్నాడు చూడండి, 9:114

మరియు య'అఖూబ్‌లను ప్రసాదించాము. మరియు ప్రతి ఒక్కరినీ ప్రవక్తలగా చేశాము.

**50.** మరియు వారికి మా కారుణ్యాన్ని ప్రసాదించాము. వారికి నిజమైన, ఉన్నతమైన కీర్తిప్రతిష్ఠలను కలుగజేశాము.

وَوَهَبْنَا لَهُم مِّن رَّحْمَتِنَا وَجَعَلْنَا لَهُمْ لِسَانَ صِدْقٍ عَلِيًّا ﴿٥٠﴾

**51.** మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో వచ్చిన మూసా గాథను ప్రస్తావించు. నిశ్చయంగా, అతను (అల్లాహ్) ఎన్నుకున్న ఒక సందేశహరుడు మరియు ఒక ప్రవక్త.[1]

وَاذْكُرْ فِي الْكِتَابِ مُوسَىٰ إِنَّهُ كَانَ مُخْلَصًا وَكَانَ رَسُولًا نَّبِيًّا ﴿٥١﴾

**52.** మరియు మేము 'తూర్ కొండ కుడివైపు నుండి అతనిని (మూసాను) పిలిచి,[2] అతనితో ఏకాంతంలో మాట్లాడటానికి మమ్మల్ని సమీపింపజేశాము.

وَنَادَيْنَاهُ مِن جَانِبِ الطُّورِ الْأَيْمَنِ وَقَرَّبْنَاهُ نَجِيًّا ﴿٥٢﴾

**53.** మరియు మా కారుణ్యంతో, అతనికి తోడుగా అతని సోదరుడైన, హారూన్‌ను కూడా ప్రవక్తగా నియమించాము.

وَوَهَبْنَا لَهُ مِن رَّحْمَتِنَا أَخَاهُ هَارُونَ نَبِيًّا ﴿٥٣﴾

**54.** మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో వచ్చిన ఇస్మా'యీల్ గాథను ప్రస్తావించు. నిశ్చయంగా, అతను వాగ్దానాలను సత్యం చేసే (నెరవేర్చే) వాడు మరియు ఒక సందేశహరుడు మరియు ఒక ప్రవక్త

وَاذْكُرْ فِي الْكِتَابِ إِسْمَاعِيلَ إِنَّهُ كَانَ صَادِقَ الْوَعْدِ وَكَانَ رَسُولًا نَّبِيًّا ﴿٥٤﴾

**55.** మరియు అతను తన కుటుంబం వారిని నమా'జ్ మరియు విధిదానం ('జకాత్)లను పాటించమని ఆజ్ఞాపించేవాడు. మరియు తన ప్రభువుకు ప్రీతిపాత్రుడుగా ఉండేవాడు

وَكَانَ يَأْمُرُ أَهْلَهُ بِالصَّلَاةِ وَالزَّكَاةِ وَكَانَ عِندَ رَبِّهِ مَرْضِيًّا ﴿٥٥﴾

---

1. చూడండి. 22:52. రసూలున్: సందేశహరుడు - అంటే అల్లాహ్ (సు.తా.) తన సందేశం అవతరింపజేయటానికి ఎన్నుకున్న ప్రవక్త సందేశహరునిపై దివ్యగ్రంథం అవతరింపజేయ బడుతుంది, ఉదా: మూసా ('అ.స.) నబియ్యున్: ప్రవక్త అంటే దివ్యగ్రంథ మివ్వబడక అతనికంటే ముందు వచ్చిఉన్న దివ్యగ్రంథపు సందేశాన్నే ప్రజలకు బోధించేవాడు ఉదా: హారూన్ ('అ.స.) చూడండి, 19:53. సందేశహరులందరూ ప్రవక్తలే కాని ప్రవక్తలందరూ సందేశహరులు కారు.
2. వివరాల కొరకు చూడండి, 20:9 మరియు దాని తరువాత ఉన్న ఆయతులు

وَاذْكُرْ فِي الْكِتٰبِ اِدْرِيْسَ اِنَّهٗ كَانَ صِدِّيْقًا نَّبِيًّا ﴿٥٦﴾

**56.** మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్)లో వచ్చిన ఇద్రీస్ గాథను ప్రస్తావించు నిశ్చయంగా, అతను సత్యవంతుడైన ప్రవక్త.

وَّرَفَعْنٰهُ مَكَانًا عَلِيًّا ﴿٥٧﴾

**57.** మరియు మేము అతనిని ఉన్నత స్థానానికి ఎత్తాము.[1]

اُولٰٓئِكَ الَّذِيْنَ اَنْعَمَ اللّٰهُ عَلَيْهِمْ مِّنَ النَّبِيّٖنَ مِنْ ذُرِّيَّةِ اٰدَمَ وَمِمَّنْ حَمَلْنَا مَعَ نُوْحٍ وَّمِنْ ذُرِّيَّةِ اِبْرٰهِيْمَ وَاِسْرَآءِيْلَ وَمِمَّنْ هَدَيْنَا وَاجْتَبَيْنَا اِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيٰتُ الرَّحْمٰنِ خَرُّوْا سُجَّدًا وَّبُكِيًّا ﴿٥٨﴾

**58.** వారందరూ, అల్లాహ్ అనుగ్రహించిన ఆదమ్ సంతతి వారిలోని దైవప్రవక్తలలో కొందరు మరియు వారిలో కొందరు మేము నూ'హ్ ఓడలో ఎక్కింపజేసిన వారు. మరికొందరు ఇబ్రాహీమ్ మరియు ఇస్రాయీ'ల్ (య'అఖూబ్) సంతానానికి చెందిన వారున్నారు మరియు వారిలో మేము ఎన్నుకొని సన్మార్గం చూపిన వారున్నారు. ఒకవేళ వారికి కరుణామయుని సూచన (ఆయాత్)లు చదివి వినిపించినప్పుడు, వారు విలపిస్తూ సాష్టాంగం (సజ్దా)లో పడి పోయేవారు ↑ (3/8)

فَخَلَفَ مِنْۢ بَعْدِهِمْ خَلْفٌ اَضَاعُوا الصَّلٰوةَ وَاتَّبَعُوا الشَّهَوٰتِ فَسَوْفَ يَلْقَوْنَ غَيًّا ﴿٥٩﴾

**59.** * కాని వారి తరువాత వచ్చిన, వారి సంతతి వారు కొందరు, నమా'జ్‌లను విడిచి పెట్టి, తమ (దుష్ట) మనోవాంఛలను అనుసరించారు. కావున త్వరలోనే వారు అధోగతికి (నరకంలోకి) చేరగలరు

اِلَّا مَنْ تَابَ وَاٰمَنَ وَعَمِلَ صَالِحًا فَاُولٰٓئِكَ يَدْخُلُوْنَ الْجَنَّةَ وَلَا يُظْلَمُوْنَ شَيْئًا ﴿٦٠﴾

**60.** కాని ఎవరైతే, పశ్చాత్తాపపడి మరియు విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, అలాంటి వారు స్వర్గంలో ప్రవేశిస్తారు మరియు వారి కెలాంటి అన్యాయం జరుగదు.

جَنّٰتِ عَدْنِ ِۨالَّتِيْ وَعَدَ الرَّحْمٰنُ عِبَادَهٗ

**61.** అనంత కరుణామయుడు, తన దాసులకు వాగ్దానం చేసిన, అగోచర జగత్తులోని శాశ్వతమైన

1 ఇద్రీస్ ('అ.స.) ఆదమ్ ('అ.స.) తరువాత వచ్చిన మొదటి ప్రవక్త. ఇతను నూ'హ్ ('అ.స.) లేక అతని తండ్రి యొక్క తాత. ఇస్రాయీ'లీ గాథలలో అతను ఆకాశంలోకి లేపుకోబడ్డారు. అని ఉంది. కాని ఖుర్ఆన్ మరియు 'స'హీ'హ్ 'హదీస్'లు ఈ విషయాన్ని ధృవపరచలేదు. వాస్తవం అల్లాహ్(సు.తా.)కే తెలుసు. ఇంకా చూడండి, 21:85. ఇతను బైబిల్‌లో Enochగా పేర్కొనబడ్డారు. చూడండి, ఆదికాండము - (Genesis), 5:18-19 మరియు 21-24.

بِالْغَيْبِ ۚ إِنَّهُ كَانَ وَعْدُهُ مَأْتِيًّا ﴿٦١﴾

స్వర్గవనాలు. నిశ్చయంగా, ఆయన వాగ్దానం పూర్తిఅయి తీరుతుంది.

لَا يَسْمَعُونَ فِيهَا لَغْوًا إِلَّا سَلَامًا ۖ وَلَهُمْ رِزْقُهُمْ فِيهَا بُكْرَةً وَعَشِيًّا ﴿٦٢﴾

**62.** వారందులో మీకు శాంతి కలుగు గాక (సలాం)! అనడం తప్ప ఇతర ఏ విధమైన వ్యర్థపు మాటలు వినరు. మరియు అందులో వారికి ఉదయం మరియు సాయంత్రం జీవనోపాధి లభిస్తూ ఉంటుంది.

تِلْكَ الْجَنَّةُ الَّتِي نُورِثُ مِنْ عِبَادِنَا مَنْ كَانَ تَقِيًّا ﴿٦٣﴾

**63.** మా దాసులలో దైవభీతి గలవారిని వారసులుగా చేసే స్వర్గం ఇదే!

وَمَا نَتَنَزَّلُ إِلَّا بِأَمْرِ رَبِّكَ ۖ لَهُ مَا بَيْنَ أَيْدِينَا وَمَا خَلْفَنَا وَمَا بَيْنَ ذَٰلِكَ ۚ وَمَا كَانَ رَبُّكَ نَسِيًّا ﴿٦٤﴾

**64.** (దేవదూతలు అంటారు): "మరియు మేము కేవలం నీ ప్రభువు ఆజ్ఞతో తప్ప క్రిందికి దిగిరాము మా ముందున్నది, మా వెనుకనున్నది మరియు వాటి మధ్య నున్నదీ, సర్వం ఆయనకు చెందినదే.[1] నీ ప్రభువు మరచిపోయేవాడు కాడు.

رَبُّ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَمَا بَيْنَهُمَا فَاعْبُدْهُ وَاصْطَبِرْ لِعِبَادَتِهِ ۚ هَلْ تَعْلَمُ لَهُ سَمِيًّا ﴿٦٥﴾

**65.** "ఆకాశాలకూ, భూమికీ మరియు వాటి మధ్యనున్న సమస్తానికీ ఆయనే ప్రభువు. కావున మీరు ఆయననే ఆరాధించండి మరియు ఆయన ఆరాధనలోనే స్థిరంగా వుండండి ఆయనతో సమానమైన స్థాయిగల వానిని ఎవడినైనా మీరెరుగుదురా?"

وَيَقُولُ الْإِنْسَانُ أَإِذَا مَا مِتُّ لَسَوْفَ أُخْرَجُ حَيًّا ﴿٦٦﴾

**66.** మరియు మానవుడు[2] ఇలా అంటూ ఉంటాడు: "ఏమీ? నేను చనిపోయిన తరువాత మళ్ళీ బ్రతికించబడి లేపబడతానా?"

أَوَلَا يَذْكُرُ الْإِنْسَانُ أَنَّا خَلَقْنَاهُ مِنْ قَبْلُ وَلَمْ يَكُ شَيْئًا ﴿٦٧﴾

**67.** ఏమీ? మునుపు, అతడి ఉనికే లేనప్పుడు, మేము అతనిని సృష్టించిన విషయం అతనికి జ్ఞాపకం రావటం లేదా?

---

1. ఇటువంటి వాక్యం కొరకు చూడండి, 2:255

2 ఇక్కడ మానవుడు అంటే సత్యతిరస్కారుడు, చనిపోయిన తరువాత పునరుత్థానాన్ని మరియు పరలోక ప్రతిఫలాన్ని నమ్మని వాడు.

**68.** కావున నీ ప్రభువు సాక్షిగా! నిశ్చయంగా మేము వారందరినీ మరియు (వారితో పాటు) షైతానులను కూడా ప్రోగుచేసి, ఆ తరువాత నిశ్చయంగా, వారందరినీ నరకం చుట్టు మోకాళ్ళ మీద సమావేశపరుస్తాము.

فَوَرَبِّكَ لَنَحْشُرَنَّهُمْ وَالشَّيَاطِينَ ثُمَّ لَنُحْضِرَنَّهُمْ حَوْلَ جَهَنَّمَ جِثِيًّا ﴿٦٨﴾

**69.** ఆ తరువాత నిశ్చయంగా, ప్రతి తెగవారిలోనుండి అనంత కరుణామయునికి ఎవరు ఎక్కువ అవిధేయులుగా ఉండేవారో, వారిని వేరుచేస్తాము.[1]

ثُمَّ لَنَنزِعَنَّ مِن كُلِّ شِيعَةٍ أَيُّهُمْ أَشَدُّ عَلَى الرَّحْمَٰنِ عِتِيًّا ﴿٦٩﴾

**70.** అప్పుడు వారిలో (నరకాగ్నిలో) కాలటానికి ఎక్కువ అర్హులెవరో, మాకు బాగా తెలుసు.

ثُمَّ لَنَحْنُ أَعْلَمُ بِالَّذِينَ هُمْ أَوْلَىٰ بِهَا صِلِيًّا ﴿٧٠﴾

**71.** మరియు మీలో ఎవ్వతునూ దాని (నరకంపై గల వంతెన) మీద నుండి దాటకుండా ఉండలేడు. ఇది తప్పించుకోలేని, నీ ప్రభువు యొక్క నిర్ణయం.[2]

وَإِن مِّنكُمْ إِلَّا وَارِدُهَا ۚ كَانَ عَلَىٰ رَبِّكَ حَتْمًا مَّقْضِيًّا ﴿٧١﴾

**72.** ఆ పిదప మేము దైవభీతి గలవారిని రక్షిస్తాము. మరియు దుర్మార్గులను అందులో మోకాళ్ళ మీద పడి ఉండటానికి వదులుతాము.

ثُمَّ نُنَجِّي الَّذِينَ اتَّقَوا وَّنَذَرُ الظَّالِمِينَ فِيهَا جِثِيًّا ﴿٧٢﴾

**73.** మరియు స్పష్టమైన మా సూచనలను వారికి చదివి వినిపించినపుడు, సత్యతిరస్కారులు విశ్వాసులతో అంటారు: "మన రెండు వర్గాల

وَإِذَا تُتْلَىٰ عَلَيْهِمْ آيَاتُنَا بَيِّنَاتٍ قَالَ الَّذِينَ كَفَرُوا لِلَّذِينَ آمَنُوا أَيُّ الْفَرِيقَيْنِ خَيْرٌ مَّقَامًا

---

1 అంటే సత్యతిరస్కారుల నాయకులు. ఎవరైతే దురహంకారంతో సత్యాన్ని తిరస్కరించే వారో వారికి అధిక శిక్ష విధించబడుతుంది.

2 'స'హీ'హ్ 'హదీస్'లో ఈ ఆయత్ వివరాలు ఈ విధంగా వచ్చాయి. నరకం మీద ఒక వంతెన ఉంది ప్రతిఒక్కనికి దానిపై నుండి దాటవలసి ఉంటుంది విశ్వాసులు తమతమ సత్కార్యాలను బట్టి త్వరత్వరగా లేక నెమ్మదిగా దానిపై నుండి దాటిపోతారు. కొందరు ఏ హాని కలుగకుండా దాటుతారు మరికొందరు గాయాలు తగిలి చివరకు దానిని దాటుకుంటారు. మరికొందరు నరకంలో పడిపోతారు కాని తరువాత సిఫారసు వల్ల దాని నుండి బయటపడి స్వర్గం చేరుకుంటారు. కాని సత్యతిరస్కారులు ఆ వంతెనను దాటలేరు. వారు నరకాగ్నిలో పడిపోతారు. మరొక హదీసు ఇలా ఉంది. 'ఏ విశ్వాసుల ముగ్గురు పిల్లలు యౌవ్వనానికి చేరకముందే మరణిస్తారో వారిని నరకాగ్ని కేవలం వారి ప్రమాణాలను పూర్తిచేయటానికే తాకుతుంది.' ('స'హీ'హ్ బు'ఖారీ) చూడండి, ఇబ్నె కసీ'ర్

وَأَحْسَنُ نَدِيًّا ۝٧٣

వారిలో ఎవరివర్గం మంచిస్థితిలో ఉంది మరియు ఎవరి సభ ఉత్తమమైనది?"[1]

وَكَمْ أَهْلَكْنَا قَبْلَهُم مِّن قَرْنٍ هُمْ أَحْسَنُ أَثَاثًا
وَرِءْيًا ۝٧٤

**74.** మరియు వారికి ముందు మేము ఎన్నో తరాలను (వంశాలను) నాశనం చేశాము; వారు వీరి కంటే ఎక్కువ సిరిసంపదలు మరియు బాహ్య ఆడంబరాలు గలవారై ఉండిరి?

قُلْ مَن كَانَ فِي الضَّلَالَةِ فَلْيَمْدُدْ لَهُ الرَّحْمَٰنُ
مَدًّا ۚ حَتَّىٰ إِذَا رَأَوْا مَا يُوعَدُونَ إِمَّا الْعَذَابَ وَإِمَّا
السَّاعَةَ فَسَيَعْلَمُونَ مَنْ هُوَ شَرٌّ مَّكَانًا وَأَضْعَفُ
جُندًا ۝٧٥

**75.** వారితో అను: "మార్గభ్రష్టత్వంలో పడివున్న వానికి, అనంత కరుణామయుడు, ఒక సమయం వరకు వ్యవధినిస్తూ ఉంటాడు. తుదకు వారు తమకు వాగ్దానం చేయబడిన దానిని చూసి నపుడు, అది (కఠినమైన) శిక్షనో కావచ్చు లేదా అంతిమగడియనో కావచ్చు! హీనస్థితిలో ఉన్న వాడెవడో మరియు బలహీన వర్గం (సేన) ఎవరిదో వారికి తెలియగలదు!

وَيَزِيدُ اللَّهُ الَّذِينَ اهْتَدَوْا هُدًى ۗ وَالْبَاقِيَاتُ
الصَّالِحَاتُ خَيْرٌ عِندَ رَبِّكَ ثَوَابًا وَخَيْرٌ مَّرَدًّا ۝٧٦

**76.** "మరియు (దానికి ప్రతిగా) మార్గదర్శకత్వం పొందిన వారికి, అల్లాహ్ మార్గదర్శకత్వంలో వృద్ధిని ప్రసాదిస్తాడు. చిరస్థాయిగా ఉండిపోయే సత్కార్యాలే, నీ ప్రభువు దగ్గర ప్రతిఫలం రీత్యా ఉత్తమమైనవి మరియు పర్యవసానం దృష్ట్యా కూడా ఉత్తమమైనవి."[2]

أَفَرَأَيْتَ الَّذِي كَفَرَ بِآيَاتِنَا وَقَالَ لَأُوتَيَنَّ
مَالًا وَوَلَدًا ۝٧٧

**77.** ఏమీ? మా సూచనలను తిరస్కరించి: "నిశ్చయంగా, నాకు ధనసంపదలూ మరియు సంతానం ఇవ్వబడుతూనే ఉంటాయి." అని పలికే వానిని నీవు చూశావా?

---

1 సత్యతిరస్కారులైన ఖురైషులు పేద ముస్లింలు అయిన 'అమ్మార్, బిలాల్, 'సుహైబ్ (ర'ది'అ)లను మరియు వారి సమావేశ స్థలాలైన దారున్నూరా' మరియు దారుల్ అ'ర్ఖమ్‌లను అబూ జహల్, న'దర్ బిన్ హారిస్, 'ఉత్బా, షైబా, వంటి ధనవంతుల మరియు వారి పెద్ద పెద్ద భవనాల మరియు వారు సమావేశాలు చేసే దారున్నద్వాలతో పోల్చి తమ భౌతిక ఉన్నతస్థాయికి గర్వించే వారు మరియు పునరుత్థానాన్ని తిరస్కరించే వారు మనం జీవించేది ఈ భూలోక జీవితం మాత్రమేనని వాదులాడే వారు. కాని వారికి ముందున్నవారు, వారికంటే ఎక్కువ సిరిసంపదలున్నా నాశనం చేయబడ్డారనే విషయాన్ని మరచిపోయే వారు. చూడండి, 19:74

2 చూడండి, 18.46.

78. ఏమీ? అతడు అగోచరాన్ని చూశాడా? లేదా అనంత కరుణామయుని వాగ్దానం పొందాడా?

أَطَّلَعَ الْغَيْبَ أَمِ اتَّخَذَ عِندَ الرَّحْمَٰنِ عَهْدًا ﴿٧٨﴾

79. అలాకాదు! అతడు చెప్పేది, మేము వ్రాసి పెట్టగలము. మరియు అతడి శిక్షను మరింత పెంచగలము.

كَلَّا ۚ سَنَكْتُبُ مَا يَقُولُ وَنَمُدُّ لَهُ مِنَ الْعَذَابِ مَدًّا ﴿٧٩﴾

80. మరియు అతడు చెప్పే వస్తువులకు మేమే వారసులమవుతాము మరియు అతడు ఒంటరిగానే మావద్దకు వస్తాడు.

وَنَرِثُهُ مَا يَقُولُ وَيَأْتِينَا فَرْدًا ﴿٨٠﴾

81. మరియు వారు అల్లాహ్‌ను వదిలి ఆరాధ్యదైవాలుగా చేసుకున్నారు, వారు వీరికి అండగా ఉంటారనుకొని!

وَاتَّخَذُوا مِن دُونِ اللَّهِ آلِهَةً لِّيَكُونُوا لَهُمْ عِزًّا ﴿٨١﴾

82. అలాకాదు! వారు (ఆ దైవాలు) వీరి ఆరాధనను నిరాకరించటమే గాక, వీరికి విరోధులుగా ఉంటారు.

كَلَّا ۚ سَيَكْفُرُونَ بِعِبَادَتِهِمْ وَيَكُونُونَ عَلَيْهِمْ ضِدًّا ﴿٨٢﴾

83. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, మేము సత్యతిరస్కారులపై షైతానులను వదిలామని? అవి వారిని (సత్యాన్ని తిరస్కరించమని) అత్యధికంగా ప్రేరేపిస్తూ ఉంటాయని?[1]

أَلَمْ تَرَ أَنَّا أَرْسَلْنَا الشَّيَاطِينَ عَلَى الْكَافِرِينَ تَؤُزُّهُمْ أَزًّا ﴿٨٣﴾

84. కావున వారి మీద (శిక్షను) అవతరింపజేయమని నీవు తొందరపెట్టకు. నిశ్చయంగా, మేము (వారి దినాలను) ఖచ్చితంగా లెక్కపెడుతున్నాము.

فَلَا تَعْجَلْ عَلَيْهِمْ ۖ إِنَّمَا نَعُدُّ لَهُمْ عَدًّا ﴿٨٤﴾

85. ఆ రోజు మేము దైవభీతి గలవారిని అనంత కరుణామయుని సన్నిధిలో అతిథులుగా ప్రవేశపెడతాము.

يَوْمَ نَحْشُرُ الْمُتَّقِينَ إِلَى الرَّحْمَٰنِ وَفْدًا ﴿٨٥﴾

86. మరియు అపరాధులను దప్పికగొన్న వాటి (జంతువుల) వలే, నరకం వైపునకు తోలుకొని పోతాము.

وَنَسُوقُ الْمُجْرِمِينَ إِلَىٰ جَهَنَّمَ وِرْدًا ﴿٨٦﴾

---

1 షైతాన్ చివరకు ఎలాంటి బాధ్యత వహించడు దానికి చూడండి, 14:22

**87.** (ఆనాడు) అనంత కరుణామయుని అనుమతి పొందినవాడు తప్ప మరెవ్వరికీ సిఫారసుచేసే అధికారం ఉండదు.[1]

لَا يَمْلِكُونَ الشَّفَاعَةَ إِلَّا مَنِ اتَّخَذَ عِندَ الرَّحْمَٰنِ عَهْدًا ﴿٨٧﴾

**88.** వారిలా అన్నారు: "అనంత కరుణామయునికి కొడుకున్నాడు."[2]

وَقَالُوا اتَّخَذَ الرَّحْمَٰنُ وَلَدًا ﴿٨٨﴾

**89.** వాస్తవానికి, మీరు ఎంత పాపిష్ఠికరమైన విషయాన్ని కల్పించారు.

لَقَدْ جِئْتُمْ شَيْئًا إِدًّا ﴿٨٩﴾

**90.** దాని వలన ఆకాశాలు ప్రేలిపోవచ్చు! భూమి చీలిపోవచ్చు! మరియు పర్వతాలు ధ్వంసమై పోవచ్చు!

تَكَادُ السَّمَاوَاتُ يَتَفَطَّرْنَ مِنْهُ وَتَنشَقُّ الْأَرْضُ وَتَخِرُّ الْجِبَالُ هَدًّا ﴿٩٠﴾

**91.** ఎందుకంటే వారు అనంత కరుణామయునికి కొడుకు ఉన్నాడని ఆరోపించారు.

أَن دَعَوْا لِلرَّحْمَٰنِ وَلَدًا ﴿٩١﴾

**92** ఎవరినైనా కొడుకుగా చేసుకోవటం అనంత కరుణామయునికి తగినది కాదు.[3]

وَمَا يَنبَغِي لِلرَّحْمَٰنِ أَن يَتَّخِذَ وَلَدًا ﴿٩٢﴾

**93** ఎందుకంటే! భూమ్యాకాశాలలో నున్న వారందరూ కేవలం అనంత కరుణామయుని దాసులుగా మాత్రమే హాజరు కానున్నారు.[4]

إِن كُلُّ مَن فِي السَّمَاوَاتِ وَالْأَرْضِ إِلَّا آتِي الرَّحْمَٰنِ عَبْدًا ﴿٩٣﴾

**94.** వాస్తవానికి, ఆయన అందరినీ పరివేష్ఠించి ఉన్నాడు మరియు వారిని సరిగ్గా లెక్కపెట్టి ఉన్నాడు.

لَقَدْ أَحْصَاهُمْ وَعَدَّهُمْ عَدًّا ﴿٩٤﴾

---

**1** సిఫారసు చేసే అనుమతి అల్లాహుతా'లా తాను కోరిన వారికే ఇస్తాడు. చూడండి, 10:3, 21:28, 53:26.

**2** ప్రవక్తలకు దైవత్వం అంటగట్టడం అల్లాహ్(సు.తా.)తో సంబంధం తెంపుకోవటమే మరియు ఇది క్షమింపబడని మహా పాపం. చూడండి, 4:48.

**3** చూడండి, 42:11 'ఆయనను పోలిన వస్తువు ఏదీలేదు.' అనే ఖుర్ఆన్ ఆయత్ అల్లాహ్ (సు.తా.)కు సంతానం లేదు అనే విషయాన్ని స్పష్టపరుస్తోంది. ఇంకా చూడండి, 112:4 మరియు 6:100 'మరియు ఆయన(సు.తా.)తో పోల్చదగినది ఏదియూ లేదు. సంతానమనేది ఇంద్రియ సంబంధమైనది. కావున దీనిని అల్లాహ్(సు.తా.)కు అంటగట్టడం ఘోరపాపం.

**4** మానవులు కానీ, దేవదూతలు కానీ, జిన్నాతులు కానీ, అందరూ ఆయన (సు.తా.) సృష్టించిన వారే, కావున వారికి ఆయన దైవత్వంలో ఎలాంటి భాగం లేదు. వారంతా ఇష్టంతో గానీ అయిష్టంతో గానీ ఆయన ఇచ్ఛను శిరసావహించవలసిందే. చూడండి.13:15,16:48-49

وَكُلُّهُمْ ءَاتِيهِ يَوْمَ ٱلْقِيَٰمَةِ فَرْدًا ﴿٩٥﴾

**95.** మరియు పునరుత్థానదినమున వారందరూ, ఒంటరిగానే ఆయన ముందు హాజరవుతారు.[1]

إِنَّ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ سَيَجْعَلُ لَهُمُ ٱلرَّحْمَٰنُ وُدًّا ﴿٩٦﴾

**96.** నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసేవారి పట్ల అనంత కరుణామయుడు (ప్రజల హృదయాలలో) ప్రేమను (వాత్సల్యాన్ని) కలుగజేయగలడు.

فَإِنَّمَا يَسَّرْنَٰهُ بِلِسَانِكَ لِتُبَشِّرَ بِهِ ٱلْمُتَّقِينَ وَتُنذِرَ بِهِۦ قَوْمًا لُّدًّا ﴿٩٧﴾

**97.** కావున నీవు (ఓ ప్రవక్తా!) దైవభీతి గలవారికి శుభవార్తనివ్వటానికీ మరియు వాదులాడే జాతివారిని హెచ్చరించటానికీ, మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) సులభతరం చేసి, నీ భాషలో అవతరింపజేశాము.[2]

وَكَمْ أَهْلَكْنَا قَبْلَهُم مِّن قَرْنٍ هَلْ تُحِسُّ مِنْهُم مِّنْ أَحَدٍ أَوْ تَسْمَعُ لَهُمْ رِكْزًۢا ﴿٩٨﴾

**98.** మరియు వీరికి పూర్వం మేము ఎన్నితరాల వారిని నాశనం చేయలేదు! ఏమీ? నీవు ఇప్పుడు వారిలో ఏ ఒక్కరినైనా చూస్తున్నావా? లేక వారి మెల్లని శబ్దమైనా వింటున్నావా? (1/2)

---

1 అక్కడ ధన సంపత్తులు గానీ, సంతానం గానీ ఏ విధంగానూ పనికిరావు చూడండి, 26:88

2 మానవుడు అల్లాహ్ (సు.తా.) మాటలను అర్థం చేసుకోవటానికి ఆయన దివ్యగ్రంథాలను ఆ ప్రాంతపు ప్రజల భాషలోనే అవతరింపజేశాడు, చూడండి, 14:4 మరియు ముహమ్మద్ ('స'అస)పై ఈ ఖుర్ఆన్ అవతరణ కొరకు చూడండి, 2:97 మరియు 26:193 194.

# 20. సూరహ్ తా-హా

سُورَةُ طه

'ఉమర్ (ర'ది.'అ) ఇస్లాం స్వీకరించిన విధానాలు ఎన్నో వివరించబడ్డాయి. కొన్ని ఉల్లేఖనాలలో (రివాయాత్) ఇలా ఉంది: అతడు తన చెల్లెలు మరియు ఆమె భర్త ఇంట్లో ఎవరైతే అతని కంటే ముందే ఇస్లాం స్వీకరించి ఉన్నారో - ఈ సూరహ్‌ను విని ప్రభావితుడై ఇస్లాం స్వీకరించారు. ఇది హిజ్రత్‌కు దాదాపు 7 సంవత్సరాలకు ముందు - అబీసీనియాకు ముస్లింలు వెళ్ళక ముందు - మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో 135 ఆయతులు ఉన్నాయి. ఈ సూరహ్‌లో మూసా ('అ.స.) వృత్తాంతం 9-98 ఆయత్‌లలో వివరంగా ఉంది.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

1. * తా-హా!

طٰهٰ ۝١

2. మేము ఈ ఖుర్ఆన్‌ను నీపై అవతరింప జేసింది నిన్ను కష్టానికి గురిచేయటానికి కాదు.[1]

مَآ اَنْزَلْنَا عَلَيْكَ الْقُرْاٰنَ لِتَشْقٰٓى ۝٢

3. కేవలం (అల్లాహ్‌కు) భయపడే వారికి హితబోధ చేయటానికే!

اِلَّا تَذْكِرَةً لِّمَنْ يَّخْشٰى ۝٣

4. ఇది (ఈ ఖుర్ఆన్) భూమినీ మరియు అత్యున్నతమైన ఆకాశాలనూ సృష్టించిన ఆయన (అల్లాహ్) తరఫు నుండి క్రమక్రమంగా అవతరింపజేయబడింది.

تَنْزِيْلًا مِّمَّنْ خَلَقَ الْاَرْضَ وَالسَّمٰوٰتِ الْعُلٰى ۝٤

5. ఆ కరుణామయుడు, సింహాసనం ('అర్ష్)పై ఆసీనుడై ఉన్నాడు.[2]

اَلرَّحْمٰنُ عَلَى الْعَرْشِ اسْتَوٰى ۝٥

6. ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ మరియు ఆ రెండింటి మధ్యనూ, ఇంకా నేల క్రిందనూ ఉన్న[3] సమస్తమూ ఆయనకు చెందినదే.

لَهٗ مَا فِى السَّمٰوٰتِ وَمَا فِى الْاَرْضِ وَمَا بَيْنَهُمَا وَمَا تَحْتَ الثَّرٰى ۝٦

7. మరియు నీవు బిగ్గరగా మాట్లాడితే (ఆయన

وَاِنْ تَجْهَرْ بِالْقَوْلِ فَاِنَّهٗ يَعْلَمُ السِّرَّ وَاَخْفٰى ۝٧

1. చూడండి, 18:6

2. తన గొప్పతనానికి అనుగుణంగా అల్లాహ్ (సు.తా.) 'అర్ష్ (విశ్వసామ్రాజ్యాధిపత్య పీఠం)పై అధిష్ఠుడై ఉన్నాడు. కాని ఎట్లు, ఏ విధంగా ఎవ్వరికీ తెలియదు.

3. అస్-స'రా అంటే భూమిలోని లోతైన భాగంలో. అంటే సర్వం ఆయనకు చెందిందే!

వినడే వింటాడు); వాస్తవానికి, ఆయనకు రహస్యంగా (చెప్పుకునే మాటలే గాక) అతి గోప్యమైన మాటలు కూడా, తెలుస్తాయి.[1]

**8** అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు. ఆయనకు అత్యుత్తమమైన పేర్లు ఉన్నాయి.[2]

اَللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ؕ لَهُ الْاَسْمَآءُ الْحُسْنٰی ۝

**9.** ఇక మూసా వృత్తాంతం నీకు అందిందా?[3]

وَهَلْ اَتٰىكَ حَدِيْثُ مُوْسٰی ۝

**10.** అతను ఒక మంటను చూసినపుడు తన ఇంటి వారితో ఇలా అన్నాడు:[4] "ఆగండి! నిశ్చయంగా, నాకొక మంట కనబడుతోంది; బహుశా నేను దానినుండి మీ కొరకు ఒక కొరివిని తీసుకొనివస్తాను లేదా ఆ మంట దగ్గర, నాకేదైనా మార్గదర్శకత్వం లభించవచ్చు!"

اِذْ رَاٰ نَارًا فَقَالَ لِاَهْلِهِ امْكُثُوْۤا اِنِّیْۤ اٰنَسْتُ نَارًا
لَّعَلِّیْۤ اٰتِیْكُمْ مِّنْهَا بِقَبَسٍ اَوْ اَجِدُ عَلَی النَّارِ
هُدًی ۝

**11.** అతను దాని దగ్గరకు చేరినప్పుడు ఇలా పిలువబడ్డాడు:[5] "ఓ మూసా!

فَلَمَّاۤ اَتٰىهَا نُوْدِیَ یٰمُوْسٰی ۝

**12.** "నిశ్చయంగా, నేనే నీ ప్రభువును,

اِنِّیْۤ اَنَا رَبُّكَ فَاخْلَعْ نَعْلَیْكَ ۚ اِنَّكَ بِالْوَادِ

1 అల్లాహ్(సు.తా.)ను పెద్ద స్వరంతో అర్థించే అవసరం లేదు. ఎందుకంటే ఆయన అతిరహస్య విషయాలను కూడా తెలుసుకుంటాడు. ఆయనకు మానవుల భవిష్యత్తు కూడా తెలుసు. అది ఆయన దగ్గర వ్రాయబడి ఉంది. ఆయనకు జరిగిపోయిందే గాక, జరుగుతున్నది మరియు ముందు జరుగబోయేది అన్నీ తెలుసు. అంటే పునరుత్థానదినం వరకు మరియు ఆ తరువాతకూడా ఎల్లప్పుడూ జరుగబోయే అన్ని విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్(సు.తా.)కే ఉంది మరియు ఇతరులకు ఎవ్వరికీ లేదు. అంటే ప్రవక్తలు, దైవదూత(అలైహిమ్.స.)లకు మరియు జిన్నాతులకు కూడా లేదు.

2 'అల్లాహ్ (సు.తా.) యొక్క అత్యుత్తమ పేర్లు" (అల్-అస్మాఉ'ల్-'హుస్నా) ఈ శబ్దం ఖుర్ఆన్‌లో నాలుగుసార్లు వచ్చింది. 7:180, 17:110, 59:24 మరియు ఇక్కడ.

3 మూసా (అ.స.) వృత్తాంతం, 7, 17, 18 మరియు 28 సూరాహ్‌లలో వచ్చింది. ఈ సూరహ్‌లో 9-98 ఆయత్‌లలో కొన్ని వివరాలున్నాయి.

4 మూసా ('అ.స.) కొన్ని సంవత్సరాలు ఐయ్‌కహ్‌లో గడిపిన తరువాత తన భార్యా పిల్లలతో సహా తన తల్లి, సోదరుడు హారూన్ ('అ.స.) మరియు తనజాతి వారి వద్దకు వెళ్ళటానికి బయలుదేరుతారు. సినాయి ద్వీపకల్పం దక్షిణ ప్రాంతం గుండా ప్రయాణం చేస్తున్నప్పుడు ఈ విషయం సంభవిస్తుంది. ఇంకా చూడండి. 27:7-8 మరియు 28:29.

5 మూసా ('అ.స.) అక్కడికి చేరుకున్న తరువాత ఒక వృక్షం వెలుగుతో నిండి ఉంటుంది. దాని నుండి ఈ విధంగా పిలువబడతారు. చూడండి, 28:30.

الْمُقَدَّسِ طُوًى ⑫

కావున నీవు నీ చెప్పులను విడువు. వాస్తవానికి, నీవు పవిత్రమైన 'తువా[1] లోయలో ఉన్నావు.

وَأَنَا اخْتَرْتُكَ فَاسْتَمِعْ لِمَا يُوحَىٰ ⑬

13. "మరియు నేను నిన్ను (ప్రవక్తగా) ఎన్నుకున్నాను. నేను నీ పై అవతరింపజేసే దివ్యజ్ఞానాన్ని (వ'హీని) జాగ్రత్తగా విను.

إِنَّنِي أَنَا اللَّهُ لَا إِلَٰهَ إِلَّا أَنَا فَاعْبُدْنِي وَأَقِمِ الصَّلَاةَ لِذِكْرِي ⑭

14. "నిశ్చయంగా, నేనే అల్లాహ్‌ను! నేను తప్ప మరొక ఆరాధ్యుడు లేడు, కావున నన్నే ఆరాధించు మరియు నన్ను స్మరించడానికి నమా'జ్‌ను స్థాపించు

إِنَّ السَّاعَةَ آتِيَةٌ أَكَادُ أُخْفِيهَا لِتُجْزَىٰ كُلُّ نَفْسٍ بِمَا تَسْعَىٰ ⑮

15. "నిశ్చయంగా, తీర్పుఘడియ రానున్నది. ప్రతివ్యక్తి తాను చేసిన కర్మల ప్రకారం ప్రతిఫలం పొందటానికి; నేను దానిని గోప్యంగా ఉంచాలని నిర్ణయించాను.[2]

فَلَا يَصُدَّنَّكَ عَنْهَا مَنْ لَا يُؤْمِنُ بِهَا وَاتَّبَعَ هَوَاهُ فَتَرْدَىٰ ⑯

16. "కావున దానిని విశ్వసించకుండా, తన మనోవాంఛలను అనుసరించే వాడు, నిన్ను దాని (ఆ ఘడియ చింత) నుండి మరలింపనివ్వరాదు; అలాఅయితే నీవు నాశనానికి గురికాగలవు.

وَمَا تِلْكَ بِيَمِينِكَ يَا مُوسَىٰ ⑰

17. "మరియు ఓ మూసా! నీ కుడి చేతిలో ఉన్నది ఏమిటి?"

قَالَ هِيَ عَصَايَ أَتَوَكَّأُ عَلَيْهَا وَأَهُشُّ بِهَا عَلَىٰ غَنَمِي وَلِيَ فِيهَا مَآرِبُ أُخْرَىٰ ⑱

18. (మూసా) అన్నాడు: "ఇది నా చేతి కర్ర, దీనిని ఆనుకొని నిలబడతాను మరియు దీనితో నా మేకలకొరకు ఆకులురాల్చుతాను మరియు దీని నుండి నాకు ఇంకా ఇతర ఉపయోగాలు కూడా ఉన్నాయి."

قَالَ أَلْقِهَا يَا مُوسَىٰ ⑲

19. (అల్లాహ్) అన్నాడు: "ఓ మూసా! దానిని భూమిమీద పడవేయి."

فَأَلْقَاهَا فَإِذَا هِيَ حَيَّةٌ تَسْعَىٰ ⑳

20. అప్పుడు అతను దానిని పడవేశాడు

1. 'తువా ఆ లోయ పేరు.
2. చూడండి, 53:39

వెంటనే అది పాముగా[1] మారిపోయి చురుకుగా చలించసాగింది

21. (అల్లాహ్) ఆజ్ఞాపించాడు: "దానిని పట్టుకో, భయపడకు. మేము దానిని దాని పూర్వస్థితిలోకి మార్చుతాము.

قَالَ خُذْهَا وَلَا تَخَفْ سَنُعِيدُهَا سِيرَتَهَا الْأُولَىٰ ﴿٢١﴾

22. "మరియు నీ చేతిని చంకలో పెట్టుకో, దానికెలాంటి బాధలేకుండా, అది తెల్లగా మెరుస్తూ బయటికివస్తుంది,[2] ఇది రెండవ అద్భుత సూచన!

وَاضْمُمْ يَدَكَ إِلَىٰ جَنَاحِكَ تَخْرُجْ بَيْضَاءَ مِنْ غَيْرِ سُوءٍ آيَةً أُخْرَىٰ ﴿٢٢﴾

23. "ఇదంతా మేము నీకు మా గొప్ప సూచనలను చూపటానికి!

لِنُرِيَكَ مِنْ آيَاتِنَا الْكُبْرَى ﴿٢٣﴾

24. "నీవు ఫిర్'ఔన్ వద్దకుపో! నిశ్చయంగా, అతడు మితిమీరిపోయాడు."[3]

اذْهَبْ إِلَىٰ فِرْعَوْنَ إِنَّهُ طَغَىٰ ﴿٢٤﴾

25. (మూసా) ఇలా మనవి చేసుకున్నాడు: "ఓ నా ప్రభూ! నా హృదయాన్ని వికసింపజేయి

قَالَ رَبِّ اشْرَحْ لِي صَدْرِي ﴿٢٥﴾

26. "మరియు నా వ్యవహారాన్ని నా కొరకు సులభంచేయి.

وَيَسِّرْ لِي أَمْرِي ﴿٢٦﴾

27. "నా నాలుకలోని ముడిని (అటంకాన్ని) తొలగించు.

وَاحْلُلْ عُقْدَةً مِنْ لِسَانِي ﴿٢٧﴾

28. "(దానితో) వారు నా మాటలను సులభంగా అర్థం చేసుకోవటానికి.

يَفْقَهُوا قَوْلِي ﴿٢٨﴾

29. "మరియు నా కొరకు నా కుటుంబం నుండి ఒక సహాయకుణ్ణి నియమించు.[4]

وَاجْعَلْ لِي وَزِيرًا مِنْ أَهْلِي ﴿٢٩﴾

---

1 ఇక్కడ (20:20లో) 'హయ్యతున్ అని, 27:10, 28:31లలో జాన్నున్ అని 7:107లో సు''అబానున్ అని ఉంది. సందర్భాన్ని బట్టి దానిని మార్చబడింది.

2. చూడండి, 7:108, 28:32

3 ఫిర్'ఔన్ తనను తాను ఆరాధ్య దైవంగా చేసుకున్నాడు. చూడండి, 28:38 మరియు 79:24. 'నేనే మీ ప్రభువును.' అని అనేవాడు

4 వ'జీరున్: భారం మోసేవాడు, మంత్రి, రాజు యొక్క రాజకీయ భారాన్ని పంచుకునేవాడు.

**30.** "నా సోదరుడైన హారూన్‌ను.

هٰرُوْنَ اَخِى ۝

**31.** "అతని ద్వారా నా బలాన్ని దృఢపరచు.

اشْدُدْ بِهٖٓ اَزْرِىْ ۝

**32.** "మరియు అతనిని నా వ్యవహారంలో సహాయకారిగా (భాగస్వామిగా) చేయి.

وَاَشْرِكْهُ فِىْٓ اَمْرِىْ ۝

**33.** "మేము నీ పవిత్రతను బాగా కొనియాడటానికి;

كَىْ نُسَبِّحَكَ كَثِيْرًا ۝

**34.** "మరియు నిన్ను అత్యధికంగా స్మరించటానికి;

وَّنَذْكُرَكَ كَثِيْرًا ۝

**35.** "నిశ్చయంగా, నీవు మమ్మల్ని ఎల్లప్పుడూ కనిపెట్టుకునే ఉంటావు!"

اِنَّكَ كُنْتَ بِنَا بَصِيْرًا ۝

**36.** (అల్లాహ్) సెలవిచ్చాడు: "ఓ మూసా! వాస్తవంగా, నీవు కోరినదంతా నీకు ఇవ్వబడింది.

قَالَ قَدْ اُوْتِيْتَ سُؤْلَكَ يٰمُوْسٰى ۝

**37.** "మరియు వాస్తవానికి మేము నీకు మరొకసారి ఉపకారం చేశాము.[1]

وَلَقَدْ مَنَنَّا عَلَيْكَ مَرَّةً اُخْرٰٓى ۝

**38.** "అప్పుడు మేము నీ తల్లికి ఇవ్వవలసిన ఆ సూచనను ఈ విధంగా సూచించాము:

اِذْ اَوْحَيْنَآ اِلٰٓى اُمِّكَ مَا يُوْحٰٓى ۝

**39.** 'ఇతనిని (ఈ బాలుణ్ణి) ఒక పెట్టెలో పెట్టి దానిని (ఆ పెట్టెను) నదిలో విడువు. నది దానిని ఒక ఒడ్డుకు చేర్చుతుంది, దానిని నాకు మరియు అతనికి శత్రువు అయినవాడు తీసుకుంటాడు' మరియు నేను నా తరఫు నుండి నీ మీద ప్రేమను కురిపించాను మరియు నిన్ను నా కంటి ముందు పోషింపబడేటట్లు చేశాను.[2]

اَنِ اقْذِفِيْهِ فِى التَّابُوْتِ فَاقْذِفِيْهِ فِى الْيَمِّ فَلْيُلْقِهِ الْيَمُّ بِالسَّاحِلِ يَاْخُذْهُ عَدُوٌّ لِّىْ وَعَدُوٌّ لَّهٗ ۗ وَاَلْقَيْتُ عَلَيْكَ مَحَبَّةً مِّنِّىْ ۚ وَلِتُصْنَعَ عَلٰى عَيْنِىْ ۝

**40** "అప్పుడు నీ సోదరి (నిన్ను) అనుసరిస్తూ పోయి, వారితో ఇలా అన్నది: 'ఇతనిని పెంచి పోషించగల ఒకామెను నేను

اِذْ تَمْشِىْٓ اُخْتُكَ فَتَقُوْلُ هَلْ اَدُلُّكُمْ عَلٰى مَنْ يَّكْفُلُهٗ ۗ فَرَجَعْنٰكَ اِلٰٓى اُمِّكَ كَىْ تَقَرَّ عَيْنُهَا

---

1 ఈ వివరాలకు చూడండి, 28:3-21

2. చూడండి, 79:24 మరియు 28:9

మేము దానిని ముందుకు తెస్తాము. మరియు లెక్కచూడటానికి మేమే చాలు!

وَلَقَدْ آتَيْنَا مُوسَىٰ وَهَارُونَ الْفُرْقَانَ وَضِيَاءً وَذِكْرًا لِّلْمُتَّقِينَ ﴿٤٨﴾

**48.** మరియు వాస్తవానికి మేము, మూసా మరియు హారూన్‌లకు ఒక గీటురాయిని మరియు దివ్యజ్యోతిని ('తౌరాత్‌ను) ప్రసాదించి ఉన్నాము మరియు దైవభీతిగల వారికి ఒక హితబోధను.[1]

الَّذِينَ يَخْشَوْنَ رَبَّهُم بِالْغَيْبِ وَهُم مِّنَ السَّاعَةِ مُشْفِقُونَ ﴿٤٩﴾

**49.** వారికొరకు ఎవరైతే అగోచరుడైన తమ ప్రభువుకు భయపడతారో![2] మరియు అంతిమ ఘడియను గురించి భీతిపరులై ఉంటారో!

وَهَٰذَا ذِكْرٌ مُّبَارَكٌ أَنزَلْنَاهُ ۚ أَفَأَنتُمْ لَهُ مُنكِرُونَ ﴿٥٠﴾

**50.** మరియు ఈ శుభప్రదమైన జ్ఞాపిక (ఖుర్ఆన్)ను మేము అవతరింపజేశాము ఏమీ? మీరు దీనిని నిరాకరిస్తారా? (1/4)

وَلَقَدْ آتَيْنَا إِبْرَاهِيمَ رُشْدَهُ مِن قَبْلُ وَكُنَّا بِهِ عَالِمِينَ ﴿٥١﴾

**51.** * మరియు వాస్తవానికి, మేము ఇంతకు పూర్వం ఇబ్రాహీమ్‌కు కూడా మార్గదర్శకత్వం చేశాము మరియు అతనిని గురించి మాకు బాగా తెలుసు.[3]

إِذْ قَالَ لِأَبِيهِ وَقَوْمِهِ مَا هَٰذِهِ التَّمَاثِيلُ الَّتِي أَنتُمْ لَهَا عَاكِفُونَ ﴿٥٢﴾

**52.** అతను తన తండ్రి మరియు తన జాతి ప్రజలతో ఇలా అన్నప్పుడు: "మీరు భక్తితో ఆరాధిస్తున్న ఈ విగ్రహాలు ఏమిటి?"

قَالُوا وَجَدْنَا آبَاءَنَا لَهَا عَابِدِينَ ﴿٥٣﴾

**53.** వారన్నారు: "మేము మా తండ్రితాతలను, వీటిని ఆరాధిస్తూ ఉండగా చూశాము."

قَالَ لَقَدْ كُنتُمْ أَنتُمْ وَآبَاؤُكُمْ فِي ضَلَالٍ مُّبِينٍ ﴿٥٤﴾

**54.** (ఇబ్రాహీమ్) అన్నాడు: "వాస్తవానికి, మీరు మరియు మీ తండ్రితాతలు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు."

قَالُوا أَجِئْتَنَا بِالْحَقِّ أَمْ أَنتَ مِنَ اللَّاعِبِينَ ﴿٥٥﴾

**55.** వారన్నారు: "ఏమీ? నీవు మా వద్దకు ఏదైనా సత్యాన్ని తెచ్చావా? లేదా నీవు

---

1 అంటే దివ్యజ్ఞానమే నీతి నిజాయితీలను పరీక్షించే గీటురాయి. కావున అల్లాహ్ (సు.తా.) వరుసగా దివ్యగ్రంథాలను అవతరింపజేశాడు. చూడండి, 2:44 మరియు 2:53

2. చూడండి, 2:3

3. ఇబ్రాహీమ్ గాథకు చూడండి, 6:74-79 మరియు 83

మాతో పరిహాసమాడుతున్నావా?"

قَالَ بَل رَّبُّكُمْ رَبُّ السَّمَٰوَٰتِ وَالْأَرْضِ الَّذِي فَطَرَهُنَّ وَأَنَا عَلَىٰ ذَٰلِكُم مِّنَ الشَّٰهِدِينَ ٥٦

**56.** (ఇబ్రాహీమ్) అన్నాడు: "అలాకాదు! భూమ్యాకాశాల ప్రభువే మీ ప్రభువు! ఆయనే వాటన్నింటినీ సృజించాడు. మరియు నేను ఈ విషయంగురించి మీ ముందు సాక్ష్యమిస్తున్నాను

وَتَاللَّهِ لَأَكِيدَنَّ أَصْنَٰمَكُم بَعْدَ أَن تُوَلُّوا مُدْبِرِينَ ٥٧

**57.** "మరియు నేను అల్లాహ్‌పై ప్రమాణం చేసి చెబుతున్నాను. మీరు వెళ్ళిపోయిన తరువాత మీ విగ్రహాలకు విరుద్ధంగా తప్పక యుక్తి పన్నుతాను."

فَجَعَلَهُمْ جُذَٰذًا إِلَّا كَبِيرًا لَّهُمْ لَعَلَّهُمْ إِلَيْهِ يَرْجِعُونَ ٥٨

**58.** తరువాత అతను ఒక పెద్ద దానిని (విగ్రహాన్ని) తప్ప అన్నింటినీ ముక్కలు ముక్కలుగా చేశాడు. బహుశా వారు దాని వైపునకు మరలుతారని!

قَالُوا مَن فَعَلَ هَٰذَا بِـَٔالِهَتِنَآ إِنَّهُۥ لَمِنَ الظَّٰلِمِينَ ٥٩

**59.** వారన్నారు: "మా ఆరాధ్యదైవాలతో ఈ విధంగా ప్రవర్తించిన వాడెవడు? నిశ్చయంగా, వాడు దుర్మార్గుడు."

قَالُوا سَمِعْنَا فَتًى يَذْكُرُهُمْ يُقَالُ لَهُۥٓ إِبْرَٰهِيمُ ٦٠

**60.** (కొందరు) ఇలా అన్నారు: "ఇబ్రాహీమ్ అనే ఒక యువకుడు, వీటిని గురించి ప్రస్తావిస్తూ ఉండగా మేము విన్నాము."

قَالُوا فَأْتُوا بِهِۦ عَلَىٰٓ أَعْيُنِ النَّاسِ لَعَلَّهُمْ يَشْهَدُونَ ٦١

**61.** (ఇతరులు) అన్నారు: "అయితే, అతనిని ప్రజల కళ్ళముందుకు తీసుకురండి, బహుశా వారు సాక్ష్యమిస్తారేమో!"

قَالُوٓا ءَأَنتَ فَعَلْتَ هَٰذَا بِـَٔالِهَتِنَا يَٰٓإِبْرَٰهِيمُ ٦٢

**62.** (అతనిని తెచ్చిన తరువాత) వారు అడిగారు: "ఓ ఇబ్రాహీమ్! ఏమీ? నీవేనా మా ఆరాధ్య దైవాలతో ఇలా వ్యవహరించిన వాడవు?"

قَالَ بَلْ فَعَلَهُۥ كَبِيرُهُمْ هَٰذَا فَسْـَٔلُوهُمْ إِن كَانُوا يَنطِقُونَ ٦٣

**63.** (ఇబ్రాహీమ్) జవాబిచ్చాడు: "కాదు కాదు. వారిలోని ఈ పెద్దవాడే ఇలా చేశాడు! అవి మాట్లాడగలిగితే వాటినే అడగండి!"

فَرَجَعُوٓا إِلَىٰٓ أَنفُسِهِمْ فَقَالُوٓا إِنَّكُمْ أَنتُمُ الظَّٰلِمُونَ ٦٤

**64.** వారు తమలో తాము సమాలోచనలు చేసుకుంటూ ఇలా అనుకున్నారు: "నిశ్చయంగా స్వయంగా మీరే దుర్మార్గులు!"

ثُمَّ نُكِسُوا عَلَىٰ رُءُوسِهِمْ لَقَدْ عَلِمْتَ مَا هَٰؤُلَاءِ يَنطِقُونَ ﴿٦٥﴾

**65.** కాని తరువాత వారి బుద్ధి తలక్రిందులై వారు ఇలా అన్నారు: "వాస్తవానికి, నీకు తెలుసు కదా, ఇవి మాట్లాడలేవని!"

قَالَ أَفَتَعْبُدُونَ مِن دُونِ اللَّهِ مَا لَا يَنفَعُكُمْ شَيْئًا وَلَا يَضُرُّكُمْ ﴿٦٦﴾

**66.** (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు: "అలా అయితే! మీరు అల్లాహ్‌ను వదలి, మీకెలాంటి లాభంగానీ, నష్టంగానీ చేకూర్చలేని వాటిని ఆరాధిస్తారా?

أُفٍّ لَّكُمْ وَلِمَا تَعْبُدُونَ مِن دُونِ اللَّهِ ۖ أَفَلَا تَعْقِلُونَ ﴿٦٧﴾

**67.** "ధిక్కారం! మీపై మరియు అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వాటి (దైవాల)పై! ఏమీ? మీరు ఏ మాత్రమూ తెలివిని ఉపయోగించరా?"

قَالُوا حَرِّقُوهُ وَانصُرُوا آلِهَتَكُمْ إِن كُنتُمْ فَاعِلِينَ ﴿٦٨﴾

**68.** వారన్నారు: "మీరేమైనా చేయదలుచు కుంటే, ఇతనిని కాల్చివేయండి. మీ ఆరాధ్య దైవాలకు తోడ్పడండి."

قُلْنَا يَا نَارُ كُونِي بَرْدًا وَسَلَامًا عَلَىٰ إِبْرَاهِيمَ ﴿٦٩﴾

**69.** మేము (అల్లాహ్) ఆజ్ఞాపించాము: "ఓ అగ్నీ! నీవు ఇబ్రాహీమ్ కొరకు చల్లగా సురక్షితంగా అయిపో!"[1]

وَأَرَادُوا بِهِ كَيْدًا فَجَعَلْنَاهُمُ الْأَخْسَرِينَ ﴿٧٠﴾

**70.** మరియు వారు ఇబ్రాహీమ్‌కు కీడు తలపెట్టగోరారు కాని మేము వారినే నష్టంలో పడవేశాము.

وَنَجَّيْنَاهُ وَلُوطًا إِلَى الْأَرْضِ الَّتِي بَارَكْنَا فِيهَا لِلْعَالَمِينَ ﴿٧١﴾

**71.** మరియు మేము అతనిని (ఇబ్రాహీమ్‌ను) మరియు లూ'త్‌ను రక్షించి, సర్వజనుల కొరకు శుభప్రదం చేసిన భూమి వైపునకు పంపాము.[2]

وَوَهَبْنَا لَهُ إِسْحَاقَ وَيَعْقُوبَ نَافِلَةً ۖ

**72.** మరియు అతనికి (ఇబ్రాహీమ్‌కు), ఇస్'హాఖ్ మరియు య'అఖూబ్‌లను అదనపు

---

1. చూడండి, 29:24 మరియు 37:97
2. లూ'త్ ('అ.స.), ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క సోదరుని కుమారులు. అతను ఇస్లాం స్వీకరించి ఇబ్రాహీమ్ ('అ.స.)తో సహా తమ నగరం 'ఊర్' ఏదైతే Mesopotamia (ఇరాఖ్)లో ఉందో, విడిచి ఫలస్తీన్(సిరియా)కు వెళ్ళారు. అల్లాహ్ (సు.తా.) అతనిని కూడా ప్రవక్తగా ఎన్నుకున్నాడు. లూ'త్ ('అ.స.) సోదోమ్ మరియు గొమొర్రాహ్ (సదూమ్, 'అమూరహ్) ప్రాంతంలో నివసించారు. అవి ఈ నాటి మృత సముద్రం (Dead Sea) దగ్గర ఉండేవి.

وَكُلًّا جَعَلْنَا صٰلِحِيْنَ ۝

కానుకగా ప్రసాదించాము.[1] మరియు మేము ప్రతిఒక్కరినీ సద్వర్తనులుగా చేశాము.

وَجَعَلْنٰهُمْ اَىِٕمَّةً يَّهْدُوْنَ بِاَمْرِنَا وَاَوْحَيْنَاۤ اِلَيْهِمْ فِعْلَ الْخَيْرٰتِ وَاِقَامَ الصَّلٰوةِ وَاِيْتَآءَ الزَّكٰوةِ ۚ وَكَانُوْا لَنَا عٰبِدِيْنَ ۝

**73.** మరియు మేము వారిని నాయకులుగా చేశాము. వారు ప్రజలకు మా ఆజ్ఞ ప్రకారం మార్గదర్శకత్వం చేస్తూ ఉండేవారు. మరియు మేము వారిపై - సత్కార్యాలు చేయాలని, నమా'జ్ స్థాపించాలని, విధిదానం ('జకాత్) ఇవ్వాలని దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము. మరియు వారు (కేవలం) మమ్మల్నే ఆరాధించే వారు.

وَلُوْطًا اٰتَيْنٰهُ حُكْمًا وَّعِلْمًا وَّنَجَّيْنٰهُ مِنَ الْقَرْيَةِ الَّتِيْ كَانَتْ تَّعْمَلُ الْخَبٰٓىِٕثَ ۗ اِنَّهُمْ كَانُوْا قَوْمَ سَوْءٍ فٰسِقِيْنَ ۝

**74.** మరియు (జ్ఞాపకం చేసుకోండి) మేము లూ'త్‌కు[2] వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము మరియు మేము అతనిని అసహ్యకరమైన పనులు చేస్తున్న వారి నగరం నుండి కాపాడాము. నిశ్చయంగా వారు నీచులు, అవిధేయులు (ఫాసిఖీన్) అయిన ప్రజలు.

وَاَدْخَلْنٰهُ فِيْ رَحْمَتِنَا ۗ اِنَّهٗ مِنَ الصّٰلِحِيْنَ ۝

**75.** మరియు మేము అతనిని మా కారుణ్యంలోకి ప్రవేశింపజేసుకున్నాము. నిశ్చయంగా, అతను సద్వర్తనులలోనివాడు.

وَنُوْحًا اِذْ نَادٰى مِنْ قَبْلُ فَاسْتَجَبْنَا لَهٗ فَنَجَّيْنٰهُ وَاَهْلَهٗ مِنَ الْكَرْبِ الْعَظِيْمِ ۝

**76.** మరియు (జ్ఞాపకం చేసుకోండి) నూ'హ్[3] అంతకు ముందు, మమ్మల్ని వేడుకొనగా మేము అతని (ప్రార్థనను) అంగీకరించాము. కావున అతనికి మరియు అతనితో బాటు ఉన్నవారికి ఆ మహా విపత్తునుండి విముక్తి కలిగించాము.

وَنَصَرْنٰهُ مِنَ الْقَوْمِ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا ۗ اِنَّهُمْ كَانُوْا قَوْمَ سَوْءٍ فَاَغْرَقْنٰهُمْ اَجْمَعِيْنَ ۝

**77.** మరియు మా సూచనలను అబద్ధాలని నిరాకరించిన వారికి వ్యతిరేకంగా మేము అతనికి సహాయంచేశాము. నిశ్చయంగా, వారు దుష్ట ప్రజలు. కావున మేము వారందరినీ ముంచివేశాము

---

**1** మొదటి కుమారుడు ఇస్మా'యీలు ('అ స) కావున ఇస్హా'ఖ్ ('అ స) 'అదనపు కానుకగా' అని ఇక్కడ పేర్కొనబడ్డారు

**2** లూ'త్ ('అ స) గాథ కొరకు చూడండి, 7:80-84; 11:77-83, 15:58-76

**3** నూ'హ్ ('అ స) గాథ ఖుర్ఆన్‌లోఎన్నోసార్లు వచ్చింది. ముఖ్యంగా చూడండి,11:25-48

وَدَاوُۥدَ وَسُلَيْمَٰنَ إِذْ يَحْكُمَانِ فِى ٱلْحَرْثِ إِذْ نَفَشَتْ فِيهِ غَنَمُ ٱلْقَوْمِ وَكُنَّا لِحُكْمِهِمْ شَٰهِدِينَ ٧٨

**78.** మరియు దావూద్ మరియు సులైమాన్ ఇద్దరూ ఒక చేను గురించి తీర్పుచేసిన విషయం (జ్ఞాపకం చేసుకోండి):[1] ఒక తెగవారి మేకలు (మరొక తెగవారి చేను) మేశాయి. అప్పుడు వాస్తవానికి, మేము వారి తీర్పుకు సాక్షులుగా ఉన్నాము.

فَفَهَّمْنَٰهَا سُلَيْمَٰنَ ۚ وَكُلًّا ءَاتَيْنَا حُكْمًا وَعِلْمًا ۚ وَسَخَّرْنَا مَعَ دَاوُۥدَ ٱلْجِبَالَ يُسَبِّحْنَ وَٱلطَّيْرَ ۚ وَكُنَّا فَٰعِلِينَ ٧٩

**79.** అసలు సులైమాన్‌కు మేము (వాస్తవ విషయం) తెలియజేశాము మరియు వారిద్దరికీ మేము వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము. మరియు మేము పర్వతాలను మరియు పక్షులను దావూద్‌తో బాటు మా స్తోత్రం చేయటానికి లోబరచాము[2] మరియు నిశ్చయంగా, మేమే (ప్రతీదీ) చేయగలవారము.

وَعَلَّمْنَٰهُ صَنْعَةَ لَبُوسٍ لَّكُمْ لِتُحْصِنَكُم مِّنۢ بَأْسِكُمْ ۖ فَهَلْ أَنتُمْ شَٰكِرُونَ ٨٠

**80** మరియు మేము అతనికి, మీ యుద్ధాలలో, మీ రక్షణ కొరకు కవచాలు తయారుచేయడం నేర్పాము. అయితే! (ఇప్పుడైనా) మీరు కృతజ్ఞులవుతారా?

وَلِسُلَيْمَٰنَ ٱلرِّيحَ عَاصِفَةً تَجْرِى بِأَمْرِهِۦٓ إِلَى ٱلْأَرْضِ ٱلَّتِى بَٰرَكْنَا فِيهَا ۚ وَكُنَّا بِكُلِّ شَىْءٍ عَٰلِمِينَ ٨١

**81.** మరియు మేము తీవ్రంగా వీచేగాలిని సులైమాన్‌కు (వశపరిచాము). అది, అతని ఆజ్ఞతో మేము శుభాలను ప్రసాదించిన (అనుగ్రహించిన) భూమి మీద వీచేది.[3] మరియు నిశ్చయంగా, మాకు ప్రతి విషయం

---

1 ఒకవ్యక్తి మేకలు ఒకరాత్రి మరొకవ్యక్తి పంటపొలాన్ని మేస్తాయి అతడు, దావూద్ ('అ స ) దగ్గరకు తీర్పుకొరకు వస్తాడు అతను ('అ స ) పంట నష్టానికి సమానమైన విలువగల మేకలను, పొలం వానికి ఇవ్వాలని తీర్పుచేస్తారు ఇది విని అక్కడే ఉన్న అతని ('అ స ) కుమారుడు సులైమాన్ ('అ స ) అంటారు. 'అలా కాదు చేను మేకలవానికి ఇవ్వాలి అతడు సేద్యంచేసి దానిని మేకలు మేయక ముందు ఉన్న స్థితిలోకి పెంచి తీసుకురావాలి ఈ కాలమంతా మేకలు చేనువాని దగ్గర ఉండాలి అతడు వాటిపాలు, ఉన్ని మరియు పిల్లలతో లాభం పొందవచ్చు ఎప్పుడైతే చేను మొదటి స్థితిలోకి వస్తుందో అప్పుడు చేనూ, మేకలూ, తమతమ యజమానులకు తిరిగి ఇవ్వాలి ' ఈ తీర్పు ఎక్కువ ఉచితమైనదై నందుకు, దానినే అమలుపరుస్తారు

2 చూడండి, 17:44, 57:1 మరియు 13:13.

3 ఈ భూమి ఆ కాలపు షామ్, అంటే ఈ కాలపు ఫలస్తీన్, జోర్డాన్ మరియు సిరియాలు

గురించి బాగా తెలుసు.

وَمِنَ الشَّيٰطِيۡنِ مَنۡ يَّغُوۡصُوۡنَ لَهٗ وَيَعۡمَلُوۡنَ عَمَلًا دُوۡنَ ذٰلِكَ‌ ۚ وَكُنَّا لَهُمۡ حٰفِظِيۡنَ ۝٨٢

**82** మరియు షైతానులలో కొందరు అతని (సులైమాన్) కొరకు (సముద్రంలో) మునిగే వారు మరియు ఇతర పనులు కూడా చేసేవారు. మరియు నిశ్చయంగా, మేమే వారిని కనిపెట్టుకొని ఉండేవారము. (3/8)

وَاَيُّوۡبَ اِذۡ نَادٰى رَبَّهٗۤ اَنِّىۡ مَسَّنِىَ الضُّرُّ وَاَنۡتَ اَرۡحَمُ الرّٰحِمِيۡنَ ۝٨٣

**83.** * మరియు (జ్ఞాపకం చేసుకోండి), అయ్యూబ్ తన ప్రభువును వేడుకున్నప్పుడు (ఇలా అన్నాడు): "నిశ్చయంగా, నన్ను బాధ (వ్యాధి) చుట్టుకున్నది. మరియు నీవే కరుణామయులలో కెల్లా గొప్ప కరుణామయుడవు!"[1]

فَاسۡتَجَبۡنَا لَهٗ فَكَشَفۡنَا مَا بِهٖ مِنۡ ضُرٍّ‌ وَّاٰتَيۡنٰهُ اَهۡلَهٗ وَمِثۡلَهُمۡ مَّعَهُمۡ رَحۡمَةً مِّنۡ عِنۡدِنَا وَذِكۡرٰى لِلۡعٰبِدِيۡنَ ۝٨٤

**84.** అప్పుడు మేము అతని (ప్రార్థనను) అంగీకరించి, అతని బాధనుండి అతనికి విముక్తి కలిగించాము. మరియు అతనికి, అతని కుటుంబవాసులను తిరిగి ఇవ్వటమే గాక వారితోబాటు ఇంకా అంతమందిని ఎక్కువగా ఇచ్చి, దానిని మా నుండి ఒక ప్రత్యేక కరుణగా మరియు మమ్మల్ని ఆరాధించే వారికి ఒక జ్ఞాపికగా చేశాము.

وَاِسۡمٰعِيۡلَ وَاِدۡرِيۡسَ وَذَا الۡكِفۡلِ‌ ؕ كُلٌّ مِّنَ الصّٰبِرِيۡنَ ۝٨٥

**85.** మరియు (జ్ఞాపకం చేసుకోండి), ఇస్మా'యీల్, ఇద్రీస్ మరియు జు'ల్‌కిఫ్ల్[2] వీరందరు కూడా సహనశీలురైన వారే।

وَاَدۡخَلۡنٰهُمۡ فِىۡ رَحۡمَتِنَا‌ ؕ اِنَّهُمۡ مِّنَ الصّٰلِحِيۡنَ ۝٨٦

**86.** మరియు మేము వారందరినీ మా కారుణ్యంలోకి తీసుకున్నాము. నిశ్చయంగా, వారందరూ సద్వర్తనులు.

---

1 అయ్యూబ్ ('అ.స.) మొదట, సుఖసంతోషాలలో జీవితం గడిపారు. తరువాత అల్లాహ్ (సు.తా.) అతనిని తీవ్రమైన కష్టాలతో, వ్యాధితో పరీక్షించాడు. అతను, ఆ కష్ట కాలంలో కూడా సహనం వహించారు. ఆ తరువాత అల్లాహ్ (సు.తా.) అతనిని అనుగ్రహించి మరల మొదటి కంటే మంచి స్థితికి తెచ్చాడు. చూడండి, 38:44

2 జు'ల్‌కిఫ్ల్ ('అ.స.) ప్రవక్తనా కాదా అనే విషయం గురించి వ్యాఖ్యాతలలో భేదాభిప్రాయాలు ఉన్నాయి. ఇబ్నె కసీ'ర్ (ర'హ్మ) అంటారు: అతని పేరు ఇతర ప్రవక్త('అలైహిమ్ స.)ల పేర్లతో పాటు వచ్చింది కాబట్టి అతను కూడా ప్రవక్తయే!

وَذَا ٱلنُّونِ إِذ ذَّهَبَ مُغَٰضِبًا فَظَنَّ أَن لَّن نَّقۡدِرَ عَلَيۡهِ فَنَادَىٰ فِي ٱلظُّلُمَٰتِ أَن لَّآ إِلَٰهَ إِلَّآ أَنتَ سُبۡحَٰنَكَ إِنِّي كُنتُ مِنَ ٱلظَّٰلِمِينَ ۝٨٧

87 మరియు (జ్ఞాపకం చేసుకోండి) చేపవాడు (యూనుస్)[1] ఉద్రేకంతో వెళ్ళిపోతూ - మేము అతనిని పట్టుకోలేమని అనుకున్నాడు! కాని ఆ తరువాత, అంధకారాలలో చిక్కుకొని పోయినప్పుడు, ఇలా మొరపెట్టుకున్నాడు: "వాస్తవానికి నీవు (అల్లాహ్) తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు, నీవు సర్వలోపాలకు అతీతుడవు, నిశ్చయంగా, నేనే అపరాధులలోని వాడను."

فَٱسۡتَجَبۡنَا لَهُۥ وَنَجَّيۡنَٰهُ مِنَ ٱلۡغَمِّۚ وَكَذَٰلِكَ نُـۨجِي ٱلۡمُؤۡمِنِينَ ۝٨٨

88. అప్పుడు మేము అతని (ప్రార్థనను) అంగీకరించి, అతనిని ఆ దుఃఖమునుండి విముక్తి కలిగించాము. మరియు విశ్వసించిన వారిని మేము ఇదేవిధంగా కాపాడుతూ ఉంటాము.

وَزَكَرِيَّآ إِذۡ نَادَىٰ رَبَّهُۥ رَبِّ لَا تَذَرۡنِي فَرۡدًا وَأَنتَ خَيۡرُ ٱلۡوَٰرِثِينَ ۝٨٩

89. మరియు (జ్ఞాపకం చేసుకోండి), 'జకరియ్యా[2] తన ప్రభువును వేడుకున్నపుడు ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నన్ను ఒంటరివానిగా (సంతానహీనునిగా) వదలకు. నీవే సర్వశ్రేష్ఠమైన వారసుడవు!"

فَٱسۡتَجَبۡنَا لَهُۥ وَوَهَبۡنَا لَهُۥ يَحۡيَىٰ وَأَصۡلَحۡنَا لَهُۥ زَوۡجَهُۥٓۚ إِنَّهُمۡ كَانُواْ يُسَٰرِعُونَ فِي ٱلۡخَيۡرَٰتِ وَيَدۡعُونَنَا رَغَبٗا وَرَهَبٗاۖ وَكَانُواْ لَنَا خَٰشِعِينَ ۝٩٠

90. అప్పుడు మేము అతని ప్రార్థనను అంగీకరించి, అతని కొరకు అతని భార్యను (సంతానానికి) యోగ్యురాలుగా జేసి, అతనికి యహ్యాను ప్రసాదించాము. వాస్తవానికి వారు సత్కార్యాలు చేయటానికి పోటీ పడేవారు. మరియు శ్రద్ధతో మరియు భీతితో మమ్మల్ని ఆరాధించేవారు. మరియు మా సమక్షంలో వినమ్రులై ఉండేవారు.

1 యూనుస్ ('అ.స.) తన ప్రజల సత్యతిరస్కారాన్ని ఓర్చుకోలేక అల్లాహ్ (సు.తా.) అనుమతించక ముందే వారిని విడిచి పారిపోయి పడవనెక్కారు. అతను చీటీలలో ఓడిపోయి, పడవను మునిగిపోకుండా కాపాడటానికి, సముద్రంలోకి దూకారు. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో అతనిని ఒక పెద్ద చేప మింగింది. అతను ('అ.స.) ఆ చేప కడుపులో తమ ప్రభువు (అల్లాహుతా'లా)ను వేడుకున్నారు. అప్పుడు అల్లాహ్ (సు.తా.) అతనిని తిరిగి ఒడ్డు మీదికి చేర్చారు. అతను ('అ.స.) తిరిగి వెళ్ళి తన ప్రజలకు హితబోధ చేశారు. వివరాలకు చూడండి, 37:139-148 మరియు 10:98

2 'జకరియ్యా ('అ.స.) గాథకు చూడండి, 3:37, 19:2 మరియు సూరహ్ 'తా-హా (20)

**91.** మరియు (జ్ఞాపకం చేసుకోండి), తన శీలాన్ని కాపాడుకున్న ఆ మహిళ (మర్యమ్)లో మా నుండి ప్రాణం (రూ'హ్) ఊది, ఆమెను మరియు ఆమె కొడుకును, సర్వలోకాల వారికి ఒక సూచనగా చేశాము.[1]

وَالَّتِي أَحْصَنَتْ فَرْجَهَا فَنَفَخْنَا فِيهَا مِن
رُّوحِنَا وَجَعَلْنَاهَا وَابْنَهَا آيَةً لِّلْعَالَمِينَ ﴿٩١﴾

**92.** నిశ్చయంగా, మీ ఈ సమాజం ఒకే ఒక్క సమాజం[2] మరియు కేవలం నేనే మీ ప్రభువును, కావున మీరు నన్ను మాత్రమే ఆరాధించండి.

إِنَّ هَٰذِهِ أُمَّتُكُمْ أُمَّةً وَاحِدَةً
وَأَنَا رَبُّكُمْ فَاعْبُدُونِ ﴿٩٢﴾

**93.** కాని, వారు (ప్రజలు) తమ ధర్మ విషయంలో తెగలుతెగలుగా చీలిపోయారు. వారందరికీ మావైపునకే మరలి రావలసి వున్నది.

وَتَقَطَّعُوا أَمْرَهُم بَيْنَهُمْ ۖ كُلٌّ إِلَيْنَا رَاجِعُونَ ﴿٩٣﴾

**94.** సత్కార్యాలు చేసేవాడు విశ్వసించే వాడై ఉంటే, అతని శ్రమ నిరాదరించబడదు మరియు నిశ్చయంగా, మేము దానిని వ్రాసిపెడతాము.

فَمَن يَعْمَلْ مِنَ الصَّالِحَاتِ وَهُوَ مُؤْمِنٌ
فَلَا كُفْرَانَ لِسَعْيِهِ وَإِنَّا لَهُ كَاتِبُونَ ﴿٩٤﴾

**95.** మరియు మేము నాశనంచేసిన ప్రతి నగరం (వారి)పై, వారు మరలి రావటం నిషేధించబడింది.

وَحَرَامٌ عَلَىٰ قَرْيَةٍ أَهْلَكْنَاهَا أَنَّهُمْ
لَا يَرْجِعُونَ ﴿٩٥﴾

**96.** ఎంతవరకైతే యా'జూజ్ మరియు మా'జూజ్‌లు వదలి పెట్టబడి ప్రతి మిట్టనుండి పరుగెడుతూ వారో![3]

حَتَّىٰ إِذَا فُتِحَتْ يَأْجُوجُ وَمَأْجُوجُ وَهُم مِّن
كُلِّ حَدَبٍ يَنسِلُونَ ﴿٩٦﴾

---

1 చూడండి, 15:29, 38:72 మరియు 32:9

2 ఉమ్మతున్: అంటే ధర్మం లేక సమాజం. ఇక్కడ ఇస్లాం ధర్మం మరియు సమాజం. దీని వైపునకే ప్రవక్తలందరూ తమ ప్రజలను ఆహ్వానించారు. ప్రవక్తలందరి ధర్మం ఇస్లామే. దైవప్రవక్త ప్రవచనం: 'ప్రవక్తలందరి కుటుంబం ఒక్కటే, మా తండ్రి ఒక్కడు మరియు మా తల్లులు వేరువేరు. మా అందరి ధర్మం ఒక్కటే, ఇస్లాం.' (ఇబ్నె కసీ'ర్).

3 చూడండి, 18:94-98. తీర్పుదినం దగ్గరికి వచ్చి 'ఈసా ('అ.స.) తిరిగి భూలోకంలోకి వచ్చినపుడు యా'జూజ్ మరియు మా'జూజ్‌లు ప్రపంచంలో ప్రతిచోట వ్యాపించి ఉంటారు. వారి హింసలు మరియు దౌర్జన్యాలకు విశ్వాసులు తాళలేకపోతారు. చివరకు 'ఈసా ('అ.స.) విశ్వాసులను తీసుకొని

**97.** మరియు సత్య వాగ్దానం నెరవేరే సమయం దగ్గర పడినప్పుడు సత్యతిరస్కారుల కళ్ళు విచ్చుకుపోయి: "అయ్యో మా దౌర్భాగ్యం! వాస్తవానికి మేము దీనినుండి అశ్రద్ధకు గురిఅయ్యాము కాదుకాదు! మేము దుర్మార్గులుగా ఉండేవారము." అని అంటారు.

وَاقۡتَرَبَ الۡوَعۡدُ الۡحَقُّ فَاِذَا هِيَ شَاخِصَةٌ اَبۡصَارُ الَّذِيۡنَ كَفَرُوۡا يٰوَيۡلَنَا قَدۡ كُنَّا فِيۡ غَفۡلَةٍ مِّنۡ هٰذَا بَلۡ كُنَّا ظٰلِمِيۡنَ ۝

**98.** (వారితో ఇంకా ఇలా అనబడుతుంది): "నిశ్చయంగా, మీరూ మరియు అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వారూ, నరకాగ్నికి ఇంధనమవుతారు. (ఎందుకంటే) మీకు అక్కడికే పోవలసి ఉన్నది.[1]

اِنَّكُمۡ وَمَا تَعۡبُدُوۡنَ مِنۡ دُوۡنِ اللّٰهِ حَصَبُ جَهَنَّمَ ؕ اَنۡتُمۡ لَهَا وٰرِدُوۡنَ ۝

**99.** ఒకవేళ ఇవన్నీ ఆరాధ్యదైవాలే అయి వుంటే, ఇవి అందులో (నరకంలో) ప్రవేశించి ఉండేవి కావు! ఇక మీరంతా అందులోనే శాశ్వతంగా ఉంటారు!"

لَوۡ كَانَ هٰٓؤُلَآءِ اٰلِهَةً مَّا وَرَدُوۡهَا ؕ وَكُلٌّ فِيۡهَا خٰلِدُوۡنَ ۝

**100.** అందులో వారు (దుఃఖంచేత) మూలుగుతూ ఉంటారు. అందులో వారేమీ వినలేరు.[2]

لَهُمۡ فِيۡهَا زَفِيۡرٌ وَّهُمۡ فِيۡهَا لَا يَسۡمَعُوۡنَ ۝

**101.** నిశ్చయంగా, ఎవరికొరకైతే, మా తరఫునుండి మేలు (స్వర్గం) నిర్ణయింపబడి ఉందో, అలాంటి వారు దాని (నరకం) నుండి

اِنَّ الَّذِيۡنَ سَبَقَتۡ لَهُمۡ مِّنَّا الۡحُسۡنٰٓى ۙ اُولٰٓـئِكَ عَنۡهَا مُبۡعَدُوۡنَ ۝

---

'తూర్ పర్వతంపైకి ఎక్కుతారు. అతను య'అ్జూజ్ మరియు మా'జూజ్‌లను శిక్షించటానికి అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థిస్తారు. అప్పుడు వారంతా వధింపబడతారు. వారి శవాల దుర్వాసన అంతటా వ్యాపించిపోతుంది. అప్పుడు అల్లాహ్ (సు.తా.) పక్షులను పంపుతాడు. అవి ఆ శవాలను సముద్రంలోకి విసరుతాయి. ఆ తరువాత ఒక పెద్ద వర్షం కురుస్తుంది. దానితో భూమి శుభ్రపరచబడుతుంది. ('స'హీ'హ్ 'హదీస్'ల ఆధారంగా, ఇబ్నె-కసీ'ర్)

1 ఒక 'హదీస్' ప్రకారం ఈ ఆయత్ విని ఒక ముష్రికుల నాయకుడు అన్నాడు: 'యూదులు మరియు క్రైస్తవులు ఆరాధించే 'ఉ'జైర్ ('అ.స.) మరియు 'ఈసా ('అ.స.)లు కూడా నరకానికి పోతారా?' దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'అల్లాహ్ (సు.తా.)కు బదులుగా తనను ఆరాధించటాన్ని సమ్మతించిన ప్రతివ్యక్తి, తనను ఆరాధించిన వారితోపాటు నరకానికి పోతాడు.'

2 నరకంలో వారంతా బాధలవల్ల ఏడుస్తూ ఉంటారు. వారి రోదనల ధ్వనివల్ల వారందు ఏమీ వినలేక పోతారు.

దూరంగా ఉంచబడతారు.

**102**. వారు దాని మెల్లని శబ్దం కూడా వినరు వారు తాముకోరిన వాటిలో శాశ్వతంగా ఉంటారు

لَا يَسْمَعُونَ حَسِيسَهَا ۖ وَهُمْ فِي مَا اشْتَهَتْ أَنفُسُهُمْ خَالِدُونَ ﴿١٠٢﴾

**103**. ఆ గొప్ప భీతి కూడా వారికి దుఃఖం కలిగించదు;[1] మరియు దేవదూతలు వారిని ఆహ్వానిస్తూ వచ్చి: "మీకు వాగ్దానం చేయబడిన మీ దినం ఇదే!" అని అంటారు.

لَا يَحْزُنُهُمُ الْفَزَعُ الْأَكْبَرُ وَتَتَلَقَّاهُمُ الْمَلَائِكَةُ هَٰذَا يَوْمُكُمُ الَّذِي كُنتُمْ تُوعَدُونَ ﴿١٠٣﴾

**104**. (జ్ఞాపకముంచుకోండి)! ఆ రోజు మేము ఆకాశాన్ని, ఖాతాగ్రంథాలను చుట్టినట్లు చుట్టివేస్తాము.[2] మేము ఏవిధంగా సృష్టిని మొదట ఆరంభించామో! అదేవిధంగా దానిని మరల ఉనికిలోకితెస్తాము. ఇది (మాపై బాధ్యతగా) నున్న మా వాగ్దానం. మేము దానిని తప్పక పూర్తిచేస్తాము.

يَوْمَ نَطْوِي السَّمَاءَ كَطَيِّ السِّجِلِّ لِلْكُتُبِ ۚ كَمَا بَدَأْنَا أَوَّلَ خَلْقٍ نُّعِيدُهُ ۚ وَعْدًا عَلَيْنَا ۚ إِنَّا كُنَّا فَاعِلِينَ ﴿١٠٤﴾

**105**. వాస్తవానికి మేము 'జబూర్'లో మా హితబోధ తరువాత - నిశ్చయంగా ఈ భూమికి[3] సద్వర్తనులైన నా దాసులు వారసులవుతారని వ్రాసిఉన్నాము.

وَلَقَدْ كَتَبْنَا فِي الزَّبُورِ مِن بَعْدِ الذِّكْرِ أَنَّ الْأَرْضَ يَرِثُهَا عِبَادِيَ الصَّالِحُونَ ﴿١٠٥﴾

**106**. నిశ్చయంగా, ఇందులో భక్తిపరులైన ప్రజలకు సందేశం ఉంది.[4]

إِنَّ فِي هَٰذَا لَبَلَاغًا لِّقَوْمٍ عَابِدِينَ ﴿١٠٦﴾

---

1 ఆ గొప్ప భీతి అంటే ఇస్రాఫీల్ ('అ.స.) యొక్క 'సూర్, లేక స్వర్గ-నరకాలమధ్య 'చావు'ను వధించటం అంటే స్వర్గానికి మరియు నరకానికి పోయే వారి తీర్పు ముగిసిన తరువాత 'చావు' ఒకగొర్రె ఆకారంలో తెచ్చి జి''బ్హ్ చేయటం ఆ తరువాత ఎవ్వరికీ చావుఉండదు చూడండి 19.39

2. చూడండి. 39.67.

3 ఇక్కడ భూమి అంటే స్వర్గమని అనేక వ్యాఖ్యాతల అభిప్రాయం.

4. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై అవతరింపజేయబడిన ఈ ఖుర్ఆన్ సర్వమానవాళి కొరకు అవతరింపజేయబడిన దివ్యగ్రంథం అల్లాహ్ (సు.తా) దీనిని తీర్పుదినం వరకు భద్రంగా ఉంచుతానని, అన్నాడు. (చూడండి, 15:9) ఇది రంగు రూపాల, పుట్టుపూర్వోత్తరాల, భేదభావాలు లేకుండా సర్వమానవులను ఆకర్షిస్తుంది ఇది మానవుని హేతువాదానికి జవాబునిస్తుంది మరొక విశేషమేమిటంటే 1400 సంవత్సరాలలో ఒక్క అక్షరం కూడా మార్చబడకుండా ఉన్న ఒకే ఒక్క దివ్యగ్రంథం, ఈ ఖుర్ఆన్ మాత్రమే మరియు ఇది అవతరింపజేయబడిన ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) చివరి ప్రవక్త. చూడండి, 33:40

**107.** మరియు మేము నిన్ను (ఓ ప్రవక్తా!) సర్వలోకాల వారి కొరకు కారుణ్యంగా మాత్రమే పంపాము.[1]

وَمَآ أَرۡسَلۡنَٰكَ إِلَّا رَحۡمَةٗ لِّلۡعَٰلَمِينَ ۝١٠٧

**108.** (ఓ ము'హమ్మద్) ఇలా అను: "నిశ్చయంగా, నాపై దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడింది. వాస్తవంగా, మీ ఆరాధ్యదైవం ఆ అద్వితీయ ఆరాధ్యుడే (అల్లాహ్‌యే)! ఇకనైనా మీరు అల్లాహ్‌కు విధేయులు (ముస్లింలు) అవుతారా?"

قُلۡ إِنَّمَا يُوحَىٰٓ إِلَيَّ أَنَّمَآ إِلَٰهُكُمۡ إِلَٰهٞ وَٰحِدٞۖ فَهَلۡ أَنتُم مُّسۡلِمُونَ ۝١٠٨

**109.** ఒకవేళ వారు వెను దిరిగితే వారితో ఇలా అను: "నేను మీకు అందరికీ బహిరంగంగా ప్రకటిస్తున్నాను. మరియు మీతో చేయబడిన వాగ్దానం సమీపంలో ఉందో లేదా బహుదూరం ఉందో నాకు తెలియదు."

فَإِن تَوَلَّوۡاْ فَقُلۡ ءَاذَنتُكُمۡ عَلَىٰ سَوَآءٖۖ وَإِنۡ أَدۡرِيٓ أَقَرِيبٌ أَم بَعِيدٞ مَّا تُوعَدُونَ ۝١٠٩

**110.** నిశ్చయంగా, ఆయన (అల్లాహ్)కు, మీరు బహిరంగంగా వ్యక్తపరిచేది మరియు దాచేది అంతా తెలుసు.

إِنَّهُۥ يَعۡلَمُ ٱلۡجَهۡرَ مِنَ ٱلۡقَوۡلِ وَيَعۡلَمُ مَا تَكۡتُمُونَ ۝١١٠

**111.** మరియు బహుశా ఇది (ఈ ఆలస్యం) మీకు పరీక్ష కావచ్చు, లేదా, మీకు కొంతకాలం సుఖసంతోషాలు అనుభవించుటకు ఇవ్వబడిన వ్యవధి కావచ్చు, అది నాకు తెలియదు!

وَإِنۡ أَدۡرِي لَعَلَّهُۥ فِتۡنَةٞ لَّكُمۡ وَمَتَٰعٌ إِلَىٰ حِينٖ ۝١١١

**112.** అతను (ము'హమ్మద్) ఇలా అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు సత్యంతో తీర్పుచేయి! మరియు మీరు కల్పించే వాటికి (ఆరోపణలకు), ఆ అపార కరుణా మయుడైన మా ప్రభువు సహాయమే కోరబడుతోంది!" (1/2)

قَٰلَ رَبِّ ٱحۡكُم بِٱلۡحَقِّۗ وَرَبُّنَا ٱلرَّحۡمَٰنُ ٱلۡمُسۡتَعَانُ عَلَىٰ مَا تَصِفُونَ ۝١١٢

---

1 దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) సర్వమానవజాతి కొరకు పంపబడిన దైవప్రవక్త చూడండి, 7:158 దైవప్రవక్త ('స'అస) ముష్రికులను శపించలేదు ('స'హీ'హ్ ముస్లిం, 2006)

# 22. సూరహ్ అల్-హజ్ఞ్

سُورَةُ الحَجِّ

ఈ సూరహ్ మదీనాలో అవతరింపజేయబడింది. ఇందులో **78 ఆయతులున్నాయి** దీని పేరు **27 38 ఆయత్**ల నుండి తీసుకోబడింది దీనికంటే ముందున్న ఐదు (17 21) సూరాహ్‌లు ప్రవక్తల గాథలు తెలిపాయి. ఇది మరియు దీని తరువాత వచ్చే మూడు (22-25) సూరాహ్‌లు ధర్మ విషయాలను బోధిస్తున్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణా ప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** * ఓ మానవులారా! మీ ప్రభువునందు భయభక్తులు కలిగి ఉండండి! నిశ్చయంగా, అ అంతిమఘడియ యొక్క భూకంపం ఎంతో భయంకరమైనది.

يَا أَيُّهَا النَّاسُ اتَّقُوا رَبَّكُمْ إِنَّ زَلْزَلَةَ السَّاعَةِ
شَيْءٌ عَظِيمٌ ﴿١﴾

**2.** ఆ రోజు అవరించినప్పుడు, పాలిచ్చే ప్రతి స్త్రీ తన చంటిబిడ్డను మరచిపోవటాన్ని, గర్భవతి అయిన ప్రతి స్త్రీ తన గర్భాన్ని కోల్పోవటాన్ని నీవు చూస్తావు. మరియు మానవులందరినీ మత్తులో ఉన్నట్లు నీవు చూస్తావు. కానీ (వాస్తవానికి) వారు త్రాగి (మత్తులో) ఉండరు కాని అల్లాహ్ శిక్షయే అంత తీవ్రంగా ఉంటుంది.

يَوْمَ تَرَوْنَهَا تَذْهَلُ كُلُّ مُرْضِعَةٍ عَمَّا
أَرْضَعَتْ وَتَضَعُ كُلُّ ذَاتِ حَمْلٍ حَمْلَهَا
وَتَرَى النَّاسَ سُكَارَىٰ وَمَا هُمْ بِسُكَارَىٰ
وَلَٰكِنَّ عَذَابَ اللَّهِ شَدِيدٌ ﴿٢﴾

**3.** మరియు ప్రజలలో ఒకడుంటాడు, జ్ఞానం లేనిదే, అల్లాహ్‌ను గురించి వాదులాడే వాడు మరియు ధిక్కారి అయిన ప్రతి షైతాన్‌ను అనుసరించేవాడు.

وَمِنَ النَّاسِ مَنْ يُجَادِلُ فِي اللَّهِ بِغَيْرِ عِلْمٍ
وَيَتَّبِعُ كُلَّ شَيْطَانٍ مَرِيدٍ ﴿٣﴾

**4.** అతడిని (షైతాన్‌ను) గురించి వ్రాయబడిన దేమిటంటే, వాస్తవానికి ఎవడైతే అతడి వైపునకు మరలుతాడో, వాడిని నిశ్చయంగా, అతడు మార్గభ్రష్టునిగా చేస్తాడు మరియు వాడికి మండే నరకాగ్ని వైపునకు మార్గదర్శకత్వం చేస్తాడు

كُتِبَ عَلَيْهِ أَنَّهُ مَنْ تَوَلَّاهُ فَأَنَّهُ يُضِلُّهُ
وَيَهْدِيهِ إِلَىٰ عَذَابِ السَّعِيرِ ﴿٤﴾

**5.** ఓ మానవులారా! ఒకవేళ (మరణించిన తరువాత) మరల సజీవులుగా లేపబడటాన్ని

يَا أَيُّهَا النَّاسُ إِنْ كُنْتُمْ فِي رَيْبٍ مِنَ الْبَعْثِ فَإِنَّا

خَلَقْنٰكُمْ مِّنْ تُرَابٍ ثُمَّ مِنْ نُّطْفَةٍ ثُمَّ مِنْ عَلَقَةٍ ثُمَّ مِنْ مُّضْغَةٍ مُّخَلَّقَةٍ وَّغَيْرِ مُخَلَّقَةٍ لِّنُبَيِّنَ لَكُمْ ۚ وَنُقِرُّ فِي الْاَرْحَامِ مَا نَشَآءُ اِلٰٓى اَجَلٍ مُّسَمًّى ثُمَّ نُخْرِجُكُمْ طِفْلًا ثُمَّ لِتَبْلُغُوْٓا اَشُدَّكُمْ ۚ وَمِنْكُمْ مَّنْ يُّتَوَفّٰى وَمِنْكُمْ مَّنْ يُّرَدُّ اِلٰٓى اَرْذَلِ الْعُمُرِ لِكَيْلَا يَعْلَمَ مِنْۢ بَعْدِ عِلْمٍ شَيْـًٔا ۗ وَتَرَى الْاَرْضَ هَامِدَةً فَاِذَآ اَنْزَلْنَا عَلَيْهَا الْمَآءَ اهْتَزَّتْ وَرَبَتْ وَاَنْۢبَتَتْ مِنْ كُلِّ زَوْجٍۢ بَهِيْجٍ ۝

గురించి మీకు ఏదైనా సందేహముంటే. (జ్ఞాపకముంచుకోండి) నిశ్చయంగా, మేము మిమ్మల్ని మట్టితో[1] సృష్టించాము, తరువాత వీర్యబిందువుతో, ఆ తరువాత నెత్తురుగడ్డతో, ఆ పైన మాంసపుకండతో; అది పూర్తిగా రూపం పొందవచ్చు, లేక పూర్తిగా రూపం పొందక పోవచ్చు, ఇదంతా మేము మీకు (మా శక్తిని తెలుసుకోవటానికి) స్పష్టం చేస్తున్నాము. ఆ తరువాత మేము కోరిన వారిని ఒక నిర్ణీత కాలం వరకు గర్భకోశాలలో ఉంచుతాము. పిదప మిమ్మల్ని శిశువుల రూపంలో బయటికితీస్తాము ఆ తరువాత మిమ్మల్ని యవ్వనదశకు చేరనిస్తాము. మీలో ఒకడు (వృద్ధుడు కాకముందే) చనిపోతాడు, మరొకడు నికృష్టమైన వృద్ధాప్యం వరకు చేర్చబడతాడు;[2] అప్పుడతడు, మొదట అంతా తెలిసినవాడైనా ఏమీ తెలియని వాడిగా అయిపోతాడు నీవు భూమిని ఫలింపలేనిదానిగా చూస్తావు. కాని ఒకవేళ మేము దానిపై నీటిని (వర్షాన్ని) కురిపిస్తే, అది పులకరించి పొంగిపోయి అన్ని రకాల మనోహరమైన వృక్షకోటిని ఉత్పన్నం చేస్తుంది.

ذٰلِكَ بِاَنَّ اللّٰهَ هُوَ الْحَقُّ وَاَنَّهٗ يُحْيِ الْمَوْتٰى وَاَنَّهٗ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ۝

**6.** ఇదంతా ఎందుకంటే! నిశ్చయంగా, అల్లాహ్! ఆయనే సత్యం మరియు నిశ్చయంగా ఆయన మాత్రమే చచ్చిన వారిని తిరిగి బ్రతికించగలవాడు మరియు నిశ్చయంగా ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَّاَنَّ السَّاعَةَ اٰتِيَةٌ لَّا رَيْبَ فِيْهَا ۙ وَاَنَّ اللّٰهَ يَبْعَثُ مَنْ فِي الْقُبُوْرِ ۝

**7.** మరియు అంతిమ ఘడియ నిశ్చయంగా రానున్నది. అందులోఎలాంటి సందేహం లేదు మరియు నిశ్చయంగా అల్లాహ్ గోరీలలోనున్న వారిని మరల బ్రతికించి లేపుతాడు.

1 'మట్టితో సృష్టించాము.' ఇటువంటి ఇతర ఆయతులకు చూడండి, 3:59, 11:61, 18:37, 30:20, 23:12.
2. చూడండి, 16:70.

وَمِنَ النَّاسِ مَن يُجَادِلُ فِي اللَّهِ بِغَيْرِ عِلْمٍ وَلَا هُدًى وَلَا كِتَابٍ مُّنِيرٍ ﴿٨﴾

**8.** అయినా మానవులలో - జ్ఞానంలేనిదే మరియు మార్గదర్శకత్వంలేనిదే మరియు ప్రకాశవంతమైన గ్రంథంలేనిదే - అల్లాహ్‌ను గురించి వాదులాడేవాడు ఉన్నాడు

ثَانِيَ عِطْفِهِ لِيُضِلَّ عَن سَبِيلِ اللَّهِ ۖ لَهُ فِي الدُّنْيَا خِزْيٌ ۖ وَنُذِيقُهُ يَوْمَ الْقِيَامَةِ عَذَابَ الْحَرِيقِ ﴿٩﴾

**9.** (అలాంటి వాడు) గర్వంతో తన మెడను త్రిప్పుకుంటాడు. ఇతరులను అల్లాహ్ మార్గం నుండి తప్పించజూస్తాడు.[1] వానికి ఈ లోకంలో అవమానముంటుంది. మరియు పునరుత్థానదినమున అతనికి మేము దహించే అగ్నిశిక్షను రుచిచూపుతాము.

ذَٰلِكَ بِمَا قَدَّمَتْ يَدَاكَ وَأَنَّ اللَّهَ لَيْسَ بِظَلَّامٍ لِّلْعَبِيدِ ﴿١٠﴾

**10.** (అతనితో): "ఇది నీవు నీ చేతులారా చేసిపంపిన దాని (ఫలితం) మరియు నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులకు ఎలాంటి అన్యాయం చేయడు!" (అని అనబడుతుంది).

وَمِنَ النَّاسِ مَن يَعْبُدُ اللَّهَ عَلَىٰ حَرْفٍ ۖ فَإِنْ أَصَابَهُ خَيْرٌ اطْمَأَنَّ بِهِ ۖ وَإِنْ أَصَابَتْهُ فِتْنَةٌ انقَلَبَ عَلَىٰ وَجْهِهِ خَسِرَ الدُّنْيَا وَالْآخِرَةَ ۚ ذَٰلِكَ هُوَ الْخُسْرَانُ الْمُبِينُ ﴿١١﴾

**11.** మరియు ప్రజలలో కొందరు అంచున[2] నిలచి (సందేహంతో) అల్లాహ్‌ను ఆరాధించే వారున్నారు. (అలాంటివాడు) తనకు లాభం కలిగితే, ఎంతో తృప్తిపొందుతాడు కాని ఆపదకు గురిఅయితే ముఖం త్రిప్పుకొని, ఇహమును మరియు పరమును కూడా కోల్పోతాడు. స్పష్టమైన నష్టమంటే ఇదే!

يَدْعُو مِن دُونِ اللَّهِ مَا لَا يَضُرُّهُ وَمَا لَا يَنفَعُهُ ۚ ذَٰلِكَ هُوَ الضَّلَالُ الْبَعِيدُ ﴿١٢﴾

**12.** అతడు అల్లాహ్‌ను వదలి తనకు నష్టం గానీ, లాభం గానీ చేకూర్చలేని వారిని ప్రార్థిస్తున్నాడు. ఇదే మార్గభ్రష్టత్వంలో చాలా దూరం పోవటం.[3]

---

1. ఇక్కడ ఆ వ్యక్తిని గురించి చెప్పబడింది. ఎవనికైతే అల్లాహ్ (సు.తా.)ను గురించి ఎలాంటి జ్ఞానం లేదో! ఈ విధమైన వివరాలకు చూడండి. 31:7, 63:5 మరియు 17:83

2. హర్ఫున్: అంచున నిలబడినవాడు. అంటే హృదయపూర్వకంగా పూర్తిగా ఇస్లాంలో చేరనివాడు. ఇస్లాం స్వీకరించిన తరువాత లాభం కనిపిస్తే మంచి ధర్మం అంటాడు, లేకుంటే మంచిది కాదు అంటాడు. కొందరు ఎడారి వాసులు (బద్దూలు) మొదట ఇస్లాం స్వీకరించినప్పుడు ఈ విధంగానే వ్యవహరించారు

3. చూడండి, 14:18

**13** ఎవరివల్ల లాభం కంటే, నష్టమే ఎక్కువ రానున్నదో వారినే అతడు ప్రార్థిస్తున్నాడు. ఎంత నికృష్టుడైన సంరక్షకుడు మరియు ఎంత నికృష్టుడైన అనుచరుడు ('అషీరు).

يَدْعُوا لَمَن ضَرُّهُ أَقْرَبُ مِن نَّفْعِهِ لَبِئْسَ
الْمَوْلَىٰ وَلَبِئْسَ الْعَشِيرُ ﴿١٣﴾

**14.** విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని, అల్లాహ్ నిశ్చయంగా, క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ తానుకోరింది చేస్తాడు

إِنَّ اللَّهَ يُدْخِلُ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا
الصَّالِحَاتِ جَنَّاتٍ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ
إِنَّ اللَّهَ يَفْعَلُ مَا يُرِيدُ ﴿١٤﴾

**15.** ఎవడైతే ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా అల్లాహ్, అతనికి (ప్రవక్తకు) సహాయపడడని భావిస్తాడో! (వాడికి సాధ్యమైతే) వాడిని ఒక త్రాడు సహాయంతో ఆకాశం పైకి పోయి, తరువాత వాటిని (అంటే ప్రవక్తపై అవతరింపజేయబడే వ'హీ మరియు ఇతర సహాయాలను) త్రెంపిచూడమను, అతడి ఈ యుక్తి అతడి క్రోధావేశాన్ని దూరం చేయుగలదేమో![1]

مَن كَانَ يَظُنُّ أَن لَّن يَنصُرَهُ اللَّهُ فِي
الدُّنْيَا وَالْآخِرَةِ فَلْيَمْدُدْ بِسَبَبٍ إِلَى السَّمَاءِ
ثُمَّ لْيَقْطَعْ فَلْيَنظُرْ هَلْ يُذْهِبَنَّ كَيْدُهُ مَا يَغِيظُ ﴿١٥﴾

**16** మరియు ఈ విధంగా మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) స్పష్టమైన సందేశాలతో అవతరింపజేశాము. మరియు నిశ్చయంగా, అల్లాహ్ తానుకోరిన వారికి సన్మార్గం చూపుతాడు.[2]

وَكَذَٰلِكَ أَنزَلْنَاهُ آيَاتٍ بَيِّنَاتٍ وَأَنَّ اللَّهَ يَهْدِي
مَن يُرِيدُ ﴿١٦﴾

**17.** నిశ్చయంగా, (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించిన వారి మరియు యూదులు, సాబీయులు, క్రైస్తవులు, మజూసీలు[3] మరియు బహుదైవారాధకులు

إِنَّ الَّذِينَ آمَنُوا وَالَّذِينَ هَادُوا وَالصَّابِئِينَ
وَالنَّصَارَىٰ وَالْمَجُوسَ وَالَّذِينَ أَشْرَكُوا إِنَّ اللَّهَ

---

1 పైది ఇమామ్ అష్ షౌకాని (ర'హ్మ) గారి తాత్పర్యం. ఇమామ్ ఇబ్నె కసీ'ర్ (ర'హ్మ) గారి తాత్పర్యం ఇలా ఉంది: 'ఎవడైతే ఇహలోకంలో మరియు పరలోకంలో కూడా అల్లాహ్, దైవప్రవక్తకు సహాయపడడని భావిస్తాడో! వాడిని (తన ఇంటి) కప్పుకు ఒక త్రాడు వేసి దానితో ఉరివేసుకొని చూడమను. అతడి ఈ యుక్తి అతడి క్రోధావేశాన్ని దూరం చేయుగలదేమో.'

2. చూడండి, 14:4

3 అల్ మజూసు (Magians Zoroastrians) అంటే మజూసీలు వారు Zerdusht అనే ఇరాన్ ప్రవక్తను అనుసరిస్తారు. వారి గ్రంథం పేరు, Zend Avesta. వీరు రెండు ఆరాధ్య దైవాలున్నాయి అంటారు. ఒకటి చీకటి, రెండోది వెలుగు. వీరు ఇరాన్‌లో మరియు ఇండియా పాకిస్తాన్‌లలో ఉన్న పార్సీలు. వీరు అగ్నిని పూజిస్తారు. కాని అల్లాహ్ (సు.తా.) సర్వసృష్టికి మూలాధారుడు అని కూడా విశ్వసిస్తారు.

يَفْصِلُ بَيْنَهُمْ يَوْمَ الْقِيَامَةِ ۚ إِنَّ اللَّهَ عَلَىٰ كُلِّ شَيْءٍ شَهِيدٌ ﴿١٧﴾

అయిన వారి మధ్య పునరుత్థానదినమున అల్లాహ్ తప్పక తీర్పుచేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతి దానికి సాక్షిగా ఉంటాడు.

أَلَمْ تَرَ أَنَّ اللَّهَ يَسْجُدُ لَهُ مَن فِي السَّمَاوَاتِ وَمَن فِي الْأَرْضِ وَالشَّمْسُ وَالْقَمَرُ وَالنُّجُومُ وَالْجِبَالُ وَالشَّجَرُ وَالدَّوَابُّ وَكَثِيرٌ مِّنَ النَّاسِ ۖ وَكَثِيرٌ حَقَّ عَلَيْهِ الْعَذَابُ ۗ وَمَن يُهِنِ اللَّهُ فَمَا لَهُ مِن مُّكْرِمٍ ۚ إِنَّ اللَّهَ يَفْعَلُ مَا يَشَاءُ ﴿١٨﴾

**18.** ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, ఆకాశాలలో ఉన్నవన్నీ మరియు భూమిలో ఉన్నవన్నీ మరియు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పర్వతాలు, సర్వవృక్షరాశి, సర్వజీవరాశి మరియు ప్రజలలో చాలామంది, అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటారని?[1] మరియు చాలా మంది శిక్షకు కూడా గురిఅవుతారు. మరియు అల్లాహ్ ఎవడి నైతే అవమానంపాలు చేస్తాడో, అతడికి గౌరవమిప్పించ గలవాడు ఎవ్వడూ లేడు. నిశ్చయంగా అల్లాహ్ తాను కోరిందే చేస్తాడు. ۩ (5/8)

هَٰذَانِ خَصْمَانِ اخْتَصَمُوا فِي رَبِّهِمْ ۖ فَالَّذِينَ كَفَرُوا قُطِّعَتْ لَهُمْ ثِيَابٌ مِّن نَّارٍ يُصَبُّ مِن فَوْقِ رُءُوسِهِمُ الْحَمِيمُ ﴿١٩﴾

**19.** * ఆ రెండు విపక్ష తెగలవారు తమ ప్రభువును గురించి వాదులాడారు, కావున వారిలో సత్యతిరస్కారులకు అగ్ని వస్త్రాలు కత్తిరించబడి (కుట్టించబడి) ఉంటాయి, వారి తలలమీద సలసలకాగే నీరు పోయబడుతుంది.[2]

يُصْهَرُ بِهِ مَا فِي بُطُونِهِمْ وَالْجُلُودُ ﴿٢٠﴾

**20.** దానితో వారి కడుపులలో ఉన్నది మరియు వారి చర్మాలు కరిగిపోతాయి.

وَلَهُم مَّقَامِعُ مِنْ حَدِيدٍ ﴿٢١﴾

**21.** మరియు వారిని (శిక్షించటానికి) ఇనుపగదలు ఉంటాయి.

كُلَّمَا أَرَادُوا أَن يَخْرُجُوا مِنْهَا مِنْ غَمٍّ أُعِيدُوا فِيهَا وَذُوقُوا عَذَابَ الْحَرِيقِ ﴿٢٢﴾

**22.** ప్రతిసారి వారు దాని (ఆ నరకం) నుండి దాని బాధనుండి బయటపడటానికి ప్రయత్నించినప్పుడల్లా తిరిగి అందులోకే

---

1 చూడండి,13:15, 16:48-49

2 కొందరు వ్యాఖ్యాతలు వీరిని, విశ్వాసులు మరియు సత్యతిరస్కారులతో పోల్చారు. ఇతరులు బద్ర్ యుద్ధంలో పోరాడిన విశ్వాసులు మరియు ముష్రిక్‌లైన మక్కా ఖురైషులతో పోల్చారు. ఇబ్నె కసీ'ర్ (ర'హ్మ) ఈ రెండు వ్యాఖ్యానాలు సరైనవే అంటారు.

నెట్టబడతారు. మరియు వారితో: "నరకాగ్నిని చవిచూడండి!" (అని అనబడుతుంది).

23 నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని అల్లాహ్ క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు అందులో వారికి బంగారం మరియు ముత్యాలతో చేయబడిన కంకణాలు తొడిగింపబడతాయి అక్కడ వారికొరకు పట్టువస్త్రాలు ఉంటాయి.[1]

إِنَّ اللَّهَ يُدْخِلُ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا
الصَّالِحَاتِ جَنَّاتٍ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ
يُحَلَّوْنَ فِيهَا مِنْ أَسَاوِرَ مِن ذَهَبٍ
وَلُؤْلُؤًا وَلِبَاسُهُمْ فِيهَا حَرِيرٌ ﴿٢٣﴾

24. ఎందుకంటే వారికి మంచి మాటల వైపునకు మార్గదర్శకత్వం చూపబడింది. మరియు వారు సర్వస్తోత్రాలకు అర్హుడైన (అల్లాహ్) యొక్క మార్గం వైపునకు మార్గదర్శకత్వం పొందారు

وَهُدُوا إِلَى الطَّيِّبِ مِنَ الْقَوْلِ وَهُدُوا إِلَىٰ
صِرَاطِ الْحَمِيدِ ﴿٢٤﴾

25. నిశ్చయంగా, ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తూ (ప్రజలను) అల్లాహ్ మార్గంనుండి మరియు మస్జిద్ అల్-'హరామ్ నుండి ఆటంకపరుస్తారో[2] దేనినైతే మేము అందరి కొరకు సమానంగా చేసిఉన్నామో - వారు అక్కడ నివసించేవారైనా సరే, లేదా బయటనుండి వచ్చిన వారైనాసరే[3] మరియు ఎవరైనా అందులో అపవిత్రత మరియు అన్యాయం చేయగోరుతారో, అలాంటి వారికి

إِنَّ الَّذِينَ كَفَرُوا وَيَصُدُّونَ عَن سَبِيلِ اللَّهِ
وَالْمَسْجِدِ الْحَرَامِ الَّذِي جَعَلْنَاهُ لِلنَّاسِ
سَوَاءً الْعَاكِفُ فِيهِ وَالْبَادِ ۚ وَمَن يُرِدْ فِيهِ
بِإِلْحَادٍ بِظُلْمٍ نُّذِقْهُ مِنْ عَذَابٍ أَلِيمٍ ﴿٢٥﴾

---

1 చూడండి, 18:31.

2 ఈ ఆటంకపరచే వారు, మక్కా ముష్రికులు వీరు 6వ హి'జ్రీలో దైవప్రవక్త ('స'అస) మరియు అతని అనుచరు(ర'ది 'అన్హుమ్)లను మక్కాలో ప్రవేశించకుండా ఆపారు మరియు వారు హుదైబియా నుండి మరలిపోయారు

3 దీనిని ఈ విధంగా చాలామంది వ్యాఖ్యాతలు వివరించారు. మస్జిద్ అల్ 'హరామ్ మీద అక్కడ నివసించే వారికి మరియు బయటి నుండి వచ్చే వారికి సరిసమానమైన హక్కులున్నాయి అంటే ఏ ముస్లింకు అయినా ఏ సమయంలో గానీ రాత్రింబవళ్ళు, మస్జిద్ అల్ 'హరాంలో ప్రవేశించి 'తవాఫ్, నమా'జ్, 'ఉమ్రా మొదలైనవి చేసే హక్కు ఉంది అతనిని ఎవ్వరూ, తన ప్రార్థనలనుండి ఆపరాదు ఇక 'హరమ్ హద్దులలో ఉన్న భూమిలో ఇండ్లు కట్టుకున్న వారు తమ ఇండ్ల యజమానులు కాని మినా, ము'జ్దలిఫా, 'అరఫాత్ ('హజ్జ్ ప్రాంతాలు) మాత్రం సర్వ ముస్లింల కొరకు ఉన్నాయి. వాటిపై ఎవ్వరీ యజమాన్యం లేదు ఈ విషయంపై ధర్మవేత్తలందరూ ఏకీభవిస్తున్నారు చూ 2:125

మేము బాధాకరమైన శిక్షను రుచిచూపుతాము

**26.** మరియు మేము ఇబ్రాహీమ్‌కు ఈ గృహం (క'అబహ్) యొక్క స్థలాన్ని నిర్ధేశించి (చూపుతూ)[1] అతనితో: "ఎవ్వరినీ నాకు సాటిగా (భాగస్వాములుగా) కల్పించకు. మరియు నా గృహాన్ని, ప్రదక్షిణ ('తవాఫ్) చేసేవారి కొరకు, నమా'జ్ చేసేవారి కొరకు, వంగే (రుకూ'ఉ) మరియు సాష్టాంగం (సజ్దా) చేసేవారి కొరకు, పరిశుద్ధంగా ఉంచు."[2] అని అన్నాము.

وَإِذْ بَوَّأْنَا لِإِبْرَٰهِيمَ مَكَانَ ٱلْبَيْتِ أَن لَّا تُشْرِكْ
بِى شَيْـًٔا وَطَهِّرْ بَيْتِىَ لِلطَّآئِفِينَ وَٱلْقَآئِمِينَ
وَٱلرُّكَّعِ ٱلسُّجُودِ ﴿٢٦﴾

**27.** మరియు ప్రజలకు 'హజ్ యాత్రను గురించి ప్రకటించు:[3] వారు పాదాచారులుగా మరియు ప్రతి బలహీనమైన ఒంటె (సవారీ) మీద, విశాల (దూర) ప్రాంతాల నుండి మరియు కనుమల నుండి నీ వైపుకు వస్తారు.

وَأَذِّن فِى ٱلنَّاسِ بِٱلْحَجِّ يَأْتُوكَ رِجَالًا وَعَلَىٰ
كُلِّ ضَامِرٍ يَأْتِينَ مِن كُلِّ فَجٍّ عَمِيقٍ ﴿٢٧﴾

**28.** వారు, తమకొరకు ఇక్కడ ఉన్న ప్రయోజనాలను అనుభవించటానికి మరియు ఆయన వారికి జీవనోపాధిగా ప్రసాదించిన పశువుల మీద, నిర్ధిత దినాలలో అల్లాహ్ పేరును స్మరించి (జి'బ్హ్ చేయుటానికి) కావున దానిని (వాటి మాంసాన్ని) తినండి మరియు లేమికి గురిఅయిన నిరుపేదలకు తినిపించండి.[4]

لِّيَشْهَدُوا۟ مَنَٰفِعَ لَهُمْ وَيَذْكُرُوا۟ ٱسْمَ ٱللَّهِ فِىٓ
أَيَّامٍ مَّعْلُومَٰتٍ عَلَىٰ مَا رَزَقَهُم مِّنۢ
بَهِيمَةِ ٱلْأَنْعَٰمِ فَكُلُوا۟ مِنْهَا وَأَطْعِمُوا۟
ٱلْبَآئِسَ ٱلْفَقِيرَ ﴿٢٨﴾

1 నూ'హ్ ('అ.స.) 'తుఫాన్ తరువాత, క'అబహ్‌గృహాన్ని నిర్మించిన వారు ఇబ్రాహీమ్ ('అ.స.) మరియు అతని కుమారుడు ఇస్మా'యీల్ ('అ.స.) ఆ తరువాత 40 సంవత్సరాల పిదప మస్జిద్ అల్ అ'ఖ్సా నిర్మించబడింది. (ముస్నద్ అ'హ్మద్ 5/150, 166, 167 మరియు ముస్లిం, కితాబుల్ మసాజిద్)

2 'తవాఫ్ మరియు నమా'జ్ కేవలం ఈ కాబాకే ప్రత్యేకించబడ్డాయి. కావున అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞ ప్రకారం కేవలం క'అబహ్‌కు మాత్రమే 'తవాఫ్ చేయాలి మరియు కేవలం ఈ క'అబహ్ వైపునకే ముఖం చేసి నమాజ్ చేయాలి. ఈ క'అబహ్‌ను విడిచి ఏ ఇతర దానికి 'తవాఫ్ చేయుటం లేక దాని వైపునకు ముఖం చేసి నమా'జ్ చేయటం సత్యతిరస్కారం (కుఫ్ర్) అవుతుంది.

3 'హజ్ వివరాలకు చూడండి, 2:196-203.

4 అయ్యామిమ్ మ'అలూమాత్: అంటే జి'బ్హ్ చేసే దినాలు, అంటే 10వ తేది మరియు దాని తరువాత మూడు దినాలు, అంటే 11, 12, 13 జుల్ 'హజ్ తేదీలు. దాని మూడోవంతు మాంసాన్ని నిరుపేదలకు పంచటం విధి. ఈ జి'బ్హ్ ఇస్మా'యీల్ ('అ.స.)ను, అతని తండ్రి ఇబ్రాహీమ్ ('అ.స.)

ثُمَّ لْيَقْضُوا تَفَثَهُمْ وَلْيُوفُوا نُذُورَهُمْ وَلْيَطَّوَّفُوا بِالْبَيْتِ الْعَتِيقِ ﴿٢٩﴾

**29.** తరువాత వారు 'హజ్జ్ ఆచారాలు[1] (తఫస్') మరియు మొక్కుబడులు (నుజు'ర్) పూర్తి చేసుకొనిన పిదప ఆ ప్రాచీన గృహం (క'అబహ్) యొక్క ప్రదక్షిణచేయాలి.[2]

ذَٰلِكَ وَمَن يُعَظِّمْ حُرُمَاتِ اللَّهِ فَهُوَ خَيْرٌ لَّهُ عِندَ رَبِّهِ ۗ وَأُحِلَّتْ لَكُمُ الْأَنْعَامُ إِلَّا مَا يُتْلَىٰ عَلَيْكُمْ ۖ فَاجْتَنِبُوا الرِّجْسَ مِنَ الْأَوْثَانِ وَاجْتَنِبُوا قَوْلَ الزُّورِ ﴿٣٠﴾

**30.** ఇదే ('హజ్జ్). మరియు ఎవడైతే అల్లాహ్ విధించిన నిషేధాలను (పవిత్ర నియమాలను) ఆదరిస్తాడో, అది అతనికొరకు, అతని ప్రభువువద్ద ఎంతో మేలైనది. మరియు మీ కొరకు ఇదివరకు మీకు (నిషిద్ధమని) చెప్పబడినవి తప్ప,[3] ఇతర పశువులన్నీ ధర్మసమ్మతం చేయబడ్డాయి. ఇకమీరు విగ్రహారాధన వంటి మాలిన్యంనుండి దూరంగా ఉండండి మరియు అబద్ధపు (బూటకపు) మాటలనుండి కూడా దూరంగాఉండండి.

حُنَفَاءَ لِلَّهِ غَيْرَ مُشْرِكِينَ بِهِ ۚ وَمَن يُشْرِكْ بِاللَّهِ فَكَأَنَّمَا خَرَّ مِنَ السَّمَاءِ فَتَخْطَفُهُ الطَّيْرُ أَوْ تَهْوِي بِهِ الرِّيحُ فِي مَكَانٍ سَحِيقٍ ﴿٣١﴾

**31.** ఏకాగ్రచిత్తంతో (ఏక దైవసిద్ధాంతంతో)[4] అల్లాహ్ వైపునకే మరలండి. ఆయనకు సాటి (భాగస్వాములను) కల్పించకండి. అల్లాహ్‌కు సాటి కల్పించిన వాని గతి ఆకాశంనుండి క్రింద పడిపోయే దానివంటిదే! దానిని పక్షులైనా ఎత్తుకొని పోవచ్చు, లేదా గాలి అయినా దూరప్రదేశాలకు

---

- అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో - జ'బ్హ్ చేసిన సందర్భాన్ని జ్ఞాపకంచేసుకోవటానికే అంటే అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను శిరసావహించటమే ప్రతి ముస్లిం విధి చూడండి, 37:102-107

1. అంటే 10వ జు'ల్ 'హజ్జ్‌న చివరి షై'తాన్(జమరతుల్ 'అఖబహ్)కు - ఏదైతే మక్కా వైపు ఉందో - ఏడు రవ్వలు రువ్వి, ఖుర్బానీ చేసి, తలవెంట్రుకలను కత్తిరించుకుంటే, అది త'హ్లీల అవ్వల్ లేక చిన్న'హలాల్ అవుతుంది అంటే ఇ'హ్రామ్ నిషేధాలన్నీ ముగిసిపోతాయి కాని 'తవాఫ్ ఇఫాదా ('జ్యారహ్) చేసే వరకు భార్యతో సంభోగం చేయడం నిషిద్ధం

2. 'తవాఫె 'జ్యారహ్: ఇది విధి, తప్పకచేయవలసింది. ఇది 'అరఫాత్ నుండి బయలుదేరి 9-10తేదీల మధ్య రాత్రి ము'జ్దలిఫాలో గడిపి 10వతేదీ ఉదయం చివరి షై'తాన్(జమరతుల్ 'అఖబహ్)కు ఏడురవ్వలు రువ్వి, 'ఖుర్బానీ ఇచ్చి తలవెంట్రుకలు కత్తిరించుకొని, ఇ'హ్రామ్ విడిచిన తరువాత మక్కాకు పోయి క'అబహ్ గృహం చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణ చేయటం. ఇది 10,11,12 జు'ల్ 'హజ్జ్ తేదీలలో పూర్తిచేయాలి. దీని తరువాత భార్యతో సంభోగం చేయవచ్చు ఇది చివరి 'హలాల్. వివరాలకు చూడండి, 2:196-197

3. చూడండి, 5:3

4. 'హునఫా' అంటే ఒకే వైపుకు మొగ్గటం. అంటే ఏకదైవ సిద్ధాంతాన్ని పాటించటం ఆరాధనలను కేవలం ఆ ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.)కే ప్రత్యేకించుకోవటం ఇంకా చూడండి, 2:135

ఎగురగొట్టుకు పోవచ్చు!

32. ఇదే! మరియు ఎవడైతే, అల్లాహ్ నియమించిన చిహ్నాలను[1] గౌరవిస్తాడో, అది నిశ్చయంగా, హృదయాలలో ఉన్న దైవభీతి వల్లనే.

ذٰلِكَ وَمَنْ يُّعَظِّمْ شَعَآئِرَ اللّٰهِ فَاِنَّهَا مِنْ تَقْوَى الْقُلُوْبِ ﴿٣٢﴾

33. ఒక నిర్ణీత కాలం వరకు మీకు వాటిలో (ఈ పశువులలో) లాభాలున్నాయి[2] ఆ తరువాత వాటి గమ్యస్థానం ప్రాచీన గృహమే (క'అబహ్ యే)!

لَكُمْ فِيْهَا مَنَافِعُ اِلٰٓى اَجَلٍ مُّسَمًّى ثُمَّ مَحِلُّهَآ اِلَى الْبَيْتِ الْعَتِيْقِ ﴿٣٣﴾

34. మరియు ప్రతి సమాజానికి మేము ధర్మ ఆచారాలు (ఖుర్బానీపద్ధతి)[3] నియమించి ఉన్నాము మేము వారి జీవనోపాధికొరకు ప్రసాదించిన పశువులను, వారు (వధించేటప్పుడు) అల్లాహ్ పేరును ఉచ్చరించాలి. ఎందుకంటే మీరందరి ఆరాధ్యదైవం ఆ ఏకైక దేవుడు (అల్లాహ్). కావున మీరు ఆయనకు మాత్రమే విధేయులై (ముస్లింలై) ఉండండి మరియు వినయవిధేయతలు గలవారికి శుభవార్తనివ్వు.

وَلِكُلِّ اُمَّةٍ جَعَلْنَا مَنْسَكًا لِّيَذْكُرُوا اسْمَ اللّٰهِ عَلٰى مَا رَزَقَهُمْ مِّنْۢ بَهِيْمَةِ الْاَنْعَامِ فَاِلٰهُكُمْ اِلٰهٌ وَّاحِدٌ فَلَهٗٓ اَسْلِمُوْا وَبَشِّرِ الْمُخْبِتِيْنَ ﴿٣٤﴾

35. (వారికి) ఎవరి హృదయాలైతే, అల్లాహ్ పేరు ఉచ్చరించబడినప్పుడు భయంతో వణికిపోతాయో మరియు ఆపదలలో సహనం వహిస్తారో మరియు నమా'జ్ స్థాపిస్తారో మరియు వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి ఇతరులపై ఖర్చుచేస్తారో!

الَّذِيْنَ اِذَا ذُكِرَ اللّٰهُ وَجِلَتْ قُلُوْبُهُمْ وَالصّٰبِرِيْنَ عَلٰى مَآ اَصَابَهُمْ وَالْمُقِيْمِي الصَّلٰوةِ وَمِمَّا رَزَقْنٰهُمْ يُنْفِقُوْنَ ﴿٣٥﴾

36. ఖుర్బానీ పశువులను,[4] మేము మీ

وَالْبُدْنَ جَعَلْنٰهَا لَكُمْ مِّنْ شَعَآئِرِ اللّٰهِ لَكُمْ

1. ష'ఆఇరల్లాహ్: అల్లాహ్ నియమించిన చిహ్నాలు అంటే 'సఫా-మర్వాలు మరియు ఖుర్బానీ పశువులు మొదలైనవి. ఇంకా చూడండి, 5:2.

2 అంటే ఖుర్బానీ పశువులను, జి'బ్హ్ చేయనంతవరకు వాటిని వినియోగించుకోవటం ధర్మ సమ్మతమే! అంటే ఒకవేళ అది ఒంటె ఉంటే దానిపై ఎక్కి 'హజ్జ్ కు పోవచ్చు. ('స'హీహ్ బు'ఖారీ,

3 అల్ మనాసికు: అంటే, విధేయత లేక ఆరాధన అంటే అల్లాహ్ (సు.తా.) సాన్నిధ్యం పొందటానికి, అల్లాహ్ (సు.తా.) ప్రీతి కొరకు అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞాపించిన ఆచారాలను పూర్తిచేయటం అల్లాహ్ యేతరుల పేరుతో ఖుర్బానీ చేయటం నిషిద్ధం ('హరాం). 'హజ్జ్ ఆచారాలు కూడా మనాసిక్ అనబడతాయి. దీని ఏకవచనం నుసుకున్.

4 బుద్నున్, బదనతున్ యొక్క బహువచనం అంటే బాగా బలసిన పశువు సాధారణంగా ఈ శబ్దం

فِيهَا خَيْرٌ ۖ فَاذْكُرُوا اسْمَ اللَّهِ عَلَيْهَا صَوَافَّ ۖ فَإِذَا وَجَبَتْ جُنُوبُهَا فَكُلُوا مِنْهَا وَأَطْعِمُوا الْقَانِعَ وَالْمُعْتَرَّ ۚ كَذَٰلِكَ سَخَّرْنَاهَا لَكُمْ لَعَلَّكُمْ تَشْكُرُونَ ﴿٣٦﴾

కొరకు అల్లాహ్ చిహ్నాలుగాచేశాము; మీకు వాటిలో మేలున్నది కావున వాటిని (ఖుర్బానీ కొరకు) నిలబెట్టి వాటిపై అల్లాహ్ పేరును ఉచ్ఛరించండి అవి (ప్రాణంవిడిచి) ప్రక్కల మీద పడిపోయిన తరువాత మీరు వాటిని తినండి.[1] మరియు యాచించని పేదలకు మరియు యాచించే పేదలకు కూడా తినిపించండి ఈ విధంగా మేము వాటిని మీకు ఉపయుక్తంగా చేశాము, బహుశా మీరు కృతజ్ఞులవుతారేమోనని.

لَن يَنَالَ اللَّهَ لُحُومُهَا وَلَا دِمَاؤُهَا وَلَٰكِن يَنَالُهُ التَّقْوَىٰ مِنكُمْ ۚ كَذَٰلِكَ سَخَّرَهَا لَكُمْ لِتُكَبِّرُوا اللَّهَ عَلَىٰ مَا هَدَاكُمْ ۗ وَبَشِّرِ الْمُحْسِنِينَ ﴿٣٧﴾

**37.** వాటి మాంసంగానీ, వాటి రక్తంగానీ అల్లాహ్‌కు చేరవు! కానీ మీ భయభక్తులే ఆయనకు చేరుతాయి. మీకు సన్మార్గం చూపినందుకు, మీరు అల్లాహ్ ఘనతను కొనియాడటానికి, ఈవిధంగా ఆయన వాటిని మీకు వశపరిచాడు. సజ్జనులకు శుభవార్తను వినిపించు! (3/4)

۞ إِنَّ اللَّهَ يُدَافِعُ عَنِ الَّذِينَ آمَنُوا ۗ إِنَّ اللَّهَ لَا يُحِبُّ كُلَّ خَوَّانٍ كَفُورٍ ﴿٣٨﴾

**38.** * నిశ్చయంగా అల్లాహ్ విశ్వసించిన వారిని కాపాడుతాడు. నిశ్చయంగా అల్లాహ్ ఏ విశ్వాసఘాతకుణ్ణి మరియు కృతఘ్నుణ్ణి ప్రేమించడు.

أُذِنَ لِلَّذِينَ يُقَاتَلُونَ بِأَنَّهُمْ ظُلِمُوا ۚ وَإِنَّ اللَّهَ عَلَىٰ

**39.** తమపై దాడి చేసిన వారితో యుద్ధం చేయటానికి అనుమతి ఇవ్వబడుతోంది.[2]

ఒంటెలకే వాడబడుతుంది. కానీ 'హదీస్'ల ప్రకారం. ఖుర్బానీ కొరకు తేబడిన ఆవులు ఎద్దు మొదలైన వాటిని సూచిస్తుంది.

1 అంటే వాటి రక్తం పూర్తిగా పారిన తరువాత అవి పూర్తిగా కదలకుండా పడిపోయిన తరువాత వాటిని తినండి ఎందుకంటే సజీవిగా ఉన్న పశువు మాంసం తినటం నిషిద్ధం. (అబూ దావూద్, తిర్మిజీ) 'ఖుర్బానీ పశువు మాంసం స్వయంగా తినటం కొందరు ధర్మవేత్తలు వాజిబ్‌గా మరికొందరు ముస్తహబ్‌గా ఖరారు చేశారు. 'ఖుర్బానీ మాంసాన్ని మూడు భాగాలు చేయాలి ఒక భాగం స్వంతం మరియు తన కుటుంబం వారికి, రెండోది బంధుమిత్రులకు మరియు మూడోది పేదవారి కొరకు. (ముస్లిం, బు'ఖారీ) 'ఖుర్బానీ, 'హజ్జ్ సమయంలోనే గాక, జు'ల్ 'హజ్జ్ పండుగ కొరకు కూడా చేయాలి 108:2, అలాగే ఎవరు హజ్జ్ యాత్రకుపోరో, వారు తమ ఇండ్లలో 10-12వ జు'ల్ 'హజ్జ్ రోజులలో ఖుర్బానీ చేయాలి ఇది 'ఈద్ నమా'జ్ తరువాత చేయాలి. ('స'హీ'హ్ బు'ఖారీ)

2 ఈ ఆయత్‌లో, ఖుర్ఆన్ అవతరణలో, మొదటిసారి ఆత్మరక్షణ కొరకు యుద్ధపరిమితి ఇవ్వబడింది 'అబ్దుల్లాహ్ ఇబ్నె 'అబ్బాస్ (ర'ది.'అ) కథనం ప్రకారం ఈ ఆయత్ దైవప్రవక్త (స'అస) మక్కానుండి

نَصْرِهِمْ لَقَدِيرٌ ﴿٣٩﴾

ఎందుకంటే, వారు అన్యాయానికి గురిచేయబడ్డారు. నిశ్చయంగా, అల్లాహ్ వారికి సహాయం చేయగల సమర్థుడు.

ٱلَّذِينَ أُخْرِجُوا۟ مِن دِيَـٰرِهِم بِغَيْرِ حَقٍّ إِلَّآ أَن يَقُولُوا۟ رَبُّنَا ٱللَّهُ ۗ وَلَوْلَا دَفْعُ ٱللَّهِ ٱلنَّاسَ بَعْضَهُم بِبَعْضٍ لَّهُدِّمَتْ صَوَٰمِعُ وَبِيَعٌ وَصَلَوَٰتٌ وَمَسَـٰجِدُ يُذْكَرُ فِيهَا ٱسْمُ ٱللَّهِ كَثِيرًا ۗ وَلَيَنصُرَنَّ ٱللَّهُ مَن يَنصُرُهُۥٓ ۗ إِنَّ ٱللَّهَ لَقَوِىٌّ عَزِيزٌ ﴿٤٠﴾

**40.** వారికి ఎవరైతే కేవలం: "మా ప్రభువు అల్లాహ్" అని అన్నందుకు మాత్రమే, అన్యాయంగా తమ ఇండ్లనుండి తరిమివేయబడ్డారో! ఒకవేళ అల్లాహ్ ప్రజలను ఒకరిద్వారా మరొకరిని తొలగిస్తూ ఉండకపోతే[1] క్రైస్తవ సన్యాసుల మఠాలు, చర్చులు, యూదుల ప్రార్థనాలయాలు[2] మరియు మస్జిదులు, ఎక్కడైతే అల్లాహ్ పేరు అత్యధికంగా స్మరించబడుతుందో, అన్నీ ధ్వంసం చేయబడి ఉండేవి.[3] నిశ్చయంగా, తనకు తాను సహాయం చేసుకునే వానికి అల్లాహ్ తప్పకుండా సహాయం చేస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ మహాబలవంతుడు, సర్వశక్తిమంతుడు

ٱلَّذِينَ إِن مَّكَّنَّـٰهُمْ فِى ٱلْأَرْضِ أَقَامُوا۟ ٱلصَّلَوٰةَ وَءَاتَوُا۟ ٱلزَّكَوٰةَ وَأَمَرُوا۟ بِٱلْمَعْرُوفِ وَنَهَوْا۟ عَنِ ٱلْمُنكَرِ ۗ وَلِلَّهِ عَـٰقِبَةُ ٱلْأُمُورِ ﴿٤١﴾

**41.** వారే! ఒకవేళ మేము వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమా'జ్ స్థాపిస్తారు. విధిదానం ('జకాత్) ఇస్తారు మరియు ధర్మమును (మంచిని) ఆదేశిస్తారు మరియు అధర్మము (చెడు) నుండి నిషేధిస్తారు.[4] సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతిలోనే వుంది

---

మదీనా వలసపోయిన వెంటనే అవతరింపజేయబడింది. మొదటి హిజ్రీ మొదట్లో దీని తరువాత రెండవ హిజ్రీలో ఆయత్‌లు 2:190-193 అవతరింపజేయబడ్డాయి ఆ తరువాత 2:216, 224 అవతరింపజేయబడ్డాయి.

1. ఇటువంటి వాక్యానికి చూడండి, 2:251.
2. యూదుల మతాచారు (అ'హ్‌బార్)లు తమ మతధర్మాలను ఉపదేశించే స్థలాలు, లేక యూదుల ప్రార్థనాలయాలు (సెనగోజెస్ Synagogues) అనబడతాయి.
3. ధర్మ స్వాతంత్ర్యం కొరకు ఆయుధాలు ఎత్తుకోవటం అత్యవసరమైనపని చూడండి, 2:193
4. ఈ ఆయత్‌లో ఇస్లామీయ రాజ్యం యొక్క మూల సూత్రాలు పేర్కొనబడ్డాయి 1) నమా'జ్, 2) 'జకాత్, 3) మంచిని ఆదేశించడం లేక ప్రోత్సహించడం, 4) చెడును నిరోధించడం లేక నివారించడం మరియు 5) షరీయత్ ప్రకారం శిక్ష విధించడం మొదలైనవి. ఇటువంటి సూత్రాలు ఇప్పుడు స'ఊదీ 'అరేబియాలోనే అత్యధికంగా పాటించబడుతున్నాయి. కాబట్టి అక్కడ ప్రపంచంలో ఏ దేశంలో లేని శాంతిభద్రతలు ఉన్నాయి. అల్లాహ్ (సు.తా.) దానిని క్షేమపరచు గాక!

وَإِنْ يُكَذِّبُوكَ فَقَدْ كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ وَعَادٌ وَثَمُودُ ۝

42. మరియు (ఓ ము'హమ్మద్!) వారు (సత్యతిరస్కారులు) ఒక వేళ నిన్ను అసత్య వాదుడవని తిరస్కరిస్తే (ఆశ్చర్యపడకు): వాస్తవానికి, వారికి పూర్వం నూ'హ్, 'ఆద్ మరియు స'మూద్ జాతులవారు కూడా (తమ ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించారు:

وَقَوْمُ إِبْرَاهِيمَ وَقَوْمُ لُوطٍ ۝

43. మరియు ఇబ్రాహీమ్ జాతి వారు మరియు లూ'త్ జాతి వారు;

وَأَصْحَابُ مَدْيَنَ ۖ وَكُذِّبَ مُوسَىٰ فَأَمْلَيْتُ لِلْكَافِرِينَ ثُمَّ أَخَذْتُهُمْ ۖ فَكَيْفَ كَانَ نَكِيرِ ۝

44. మరియు మద్‌యన్ వాసులు కూడాను! అంతే కాదు మూసా కూడా అసత్యవాదుడవని తిరస్కరించబడ్డాడు. కావున నేను సత్య తిరస్కారులకు (మొదట) కొంత వ్యవధినిచ్చి, తరువాత పట్టుకుంటాను. (చూశారా!) నన్ను తిరస్కరించడం వారికొరకు ఎంత ఘోరమైనదిగా ఉండెనో!

فَكَأَيِّن مِّن قَرْيَةٍ أَهْلَكْنَاهَا وَهِيَ ظَالِمَةٌ فَهِيَ خَاوِيَةٌ عَلَىٰ عُرُوشِهَا وَبِئْرٍ مُّعَطَّلَةٍ وَقَصْرٍ مَّشِيدٍ ۝

45. (ఈ విధంగా), మేము ఎన్నో పురాలను నాశనంచేశాము. ఎందుకంటే, వాటి (ప్రజలు) దుర్మార్గులై ఉండిరి (ఈ నాడు) అవి నాశనమై, తమ కప్పులమీద తలక్రిందులై పడివున్నాయి. వారి బావులు మరియు వారి దృఢమైన కోటలు గూడా పాడుపడి ఉన్నాయి!

أَفَلَمْ يَسِيرُوا فِي الْأَرْضِ فَتَكُونَ لَهُمْ قُلُوبٌ يَعْقِلُونَ بِهَا أَوْ آذَانٌ يَسْمَعُونَ بِهَا ۖ فَإِنَّهَا لَا تَعْمَى الْأَبْصَارُ وَلَٰكِن تَعْمَى الْقُلُوبُ الَّتِي فِي الصُّدُورِ ۝

46. ఏమీ? వారు భూమిలో ప్రయాణం చేయరా? దానిని వారి హృదయాలు (మనస్సులు) అర్థం చేసుకోగలగటానికి మరియు వారి చెవులు దానిని వినటానికి? వాస్తవమేమిటంటే వారి కన్నులైతే గ్రుడ్డివి కావు, కాని ఎదలలో ఉన్న హృదయాలే గ్రుడ్డి వయిపోయాయి.

وَيَسْتَعْجِلُونَكَ بِالْعَذَابِ وَلَن يُخْلِفَ اللَّهُ وَعْدَهُ ۚ وَإِنَّ يَوْمًا عِندَ رَبِّكَ كَأَلْفِ سَنَةٍ مِّمَّا تَعُدُّونَ ۝

47. మరియు (ఓ ము'హమ్మద్!) వారు నిన్ను శిక్ష కొరకు తొందర పెడుతున్నారు.[1] కాని, అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు.

1 చూడండి, 6:57, 8:32 మరియు 13:6.

మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్ద ఒక్క దినం మీ లెక్కల ప్రకారం వేయిసంవత్సరాలకు సమానమైనది.[1]

**48.** మరియు దుర్మార్గంలో మునిగివున్న ఎన్నో నగరాలకు నేను వ్యవధినిచ్చాను. తరువాత వాటిని (శిక్షించటానికి) పట్టుకున్నాను (వారి) గమ్యస్థానం నా వైపునకే కదా!"

وَكَأَيِّن مِّن قَرْيَةٍ أَمْلَيْتُ لَهَا وَهِيَ ظَالِمَةٌ ثُمَّ أَخَذْتُهَا وَإِلَيَّ الْمَصِيرُ ﴿٤٨﴾

**49.** (ఓ ము'హమ్మద్!) వారితో అను: "ఓ మానవులారా! నేను కేవలం మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

قُلْ يَا أَيُّهَا النَّاسُ إِنَّمَا أَنَا لَكُمْ نَذِيرٌ مُّبِينٌ ﴿٤٩﴾

**50** కావున ఎవరైతే, విశ్వసించి సత్కార్యాలు చేస్తారో, వారికి క్షమాపణ మరియు గౌరవప్రదమైన జీవనోపాధి ఉంటాయి.[2]

فَالَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ لَهُم مَّغْفِرَةٌ وَرِزْقٌ كَرِيمٌ ﴿٥٠﴾

**51.** కాని ఎవరైతే మా సూచనలను కించపరచటానికి ప్రయత్నిస్తారో అలాంటి వారు తప్పక భగభగ మండే నరకాగ్ని వాసులవుతారు.

وَالَّذِينَ سَعَوْا فِي آيَاتِنَا مُعَاجِزِينَ أُولَٰئِكَ أَصْحَابُ الْجَحِيمِ ﴿٥١﴾

**52.** మరియు (ఓ ప్రవక్తా!) నీకు పూర్వం మేము పంపిన ఏ సందేశహరుడు గానీ, లేదా ప్రవక్త గానీ, (నా సందేశాన్ని ప్రజలకు) అందించగోరినపుడు, షై'తాన్ అతని కోరికలను ఆటంకపరచకుండా ఉండలేదు[3] కాని షై'తాన్ కల్పించిన ఆటంకాలను అల్లాహ్ నిర్మూలించాడు. ఆ తరువాత అల్లాహ్ తన ఆయత్‌లను స్థిరపరచాడు.[4] మరియు అల్లాహ్

وَمَا أَرْسَلْنَا مِن قَبْلِكَ مِن رَّسُولٍ وَلَا نَبِيٍّ إِلَّا إِذَا تَمَنَّىٰ أَلْقَى الشَّيْطَانُ فِي أُمْنِيَّتِهِ فَيَنسَخُ اللَّهُ مَا يُلْقِي الشَّيْطَانُ ثُمَّ يُحْكِمُ اللَّهُ آيَاتِهِ ۗ وَاللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿٥٢﴾

---

1 మానవుల 'కాలగణనం' భూమి, సూర్య చంద్రుల సంచారంతో బంధింపబడివుంది అల్లాహ్ (సు.తా) కాలానికి పరిమితుడైనవాడు కాడు. ఆయన అంతర్యామి ఆయనకు మొదలు, ముగింపు అనేవి లేవు ఏవైతే కాలానికి సంబంధించినవో! ఇంకా చూడండి, 70:4. అక్కడ ఒక దినం ఏబదివేల సంవత్సరాలతో సమానమనబడింది దీనిని సమర్థించటానికి ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్'లున్నాయి అల్లాహ్ (సు.తా) అన్నాడు: 'నేనే కాలాన్ని (అర్థహ్).'

2 చూడండి, 8 4

3. చూడండి, 6.112.

4 చూడండి, 11:1.

సర్వజ్ఞుడు, మహావివేచనాపరుడు;

لِّيَجْعَلَ مَا يُلْقِى ٱلشَّيْطَـٰنُ فِتْنَةً لِّلَّذِينَ فِى قُلُوبِهِم مَّرَضٌ وَٱلْقَاسِيَةِ قُلُوبُهُمْ ۗ وَإِنَّ ٱلظَّـٰلِمِينَ لَفِى شِقَاقٍۭ بَعِيدٍ ﴿٥٣﴾

**53.** ఎవరి హృదయాలలో రోగముందో![1] మరియు ఎవరి హృదయాలు కఠినమైనవో, వారికి షైతాన్ కల్పించే (సందేహాలు) ఒక పరీక్షగా చేయబడటానికి మరియు నిశ్చయంగా ఈ దుర్మార్గులు విరోధంలో చాలా దూరం వెళ్ళిపోయారు.

وَلِيَعْلَمَ ٱلَّذِينَ أُوتُوا۟ ٱلْعِلْمَ أَنَّهُ ٱلْحَقُّ مِن رَّبِّكَ فَيُؤْمِنُوا۟ بِهِۦ فَتُخْبِتَ لَهُۥ قُلُوبُهُمْ ۗ وَإِنَّ ٱللَّهَ لَهَادِ ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٥٤﴾

**54.** మరియు జ్ఞానమొసంగబడిన వారు ఇది (ఈ ఖుర్ఆన్) నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమని తెలుసుకొని దానిని విశ్వసించ టానికి, వారి హృదయాలు దానికి అంకితం అవటానికి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ విశ్వసించేవారికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం[2] చేస్తాడు.

وَلَا يَزَالُ ٱلَّذِينَ كَفَرُوا۟ فِى مِرْيَةٍ مِّنْهُ حَتَّىٰ تَأْتِيَهُمُ ٱلسَّاعَةُ بَغْتَةً أَوْ يَأْتِيَهُمْ عَذَابُ يَوْمٍ عَقِيمٍ ﴿٥٥﴾

**55.** మరియు సత్యతిరస్కారులు దీనిని (ఈ ఖుర్ఆన్) గురించి, అకస్మాత్తుగా అంతిమ ఘడియ వచ్చేవరకు లేదా ఆ ఏకైక దినపు శిక్ష అవతరించేవరకు సందేహంలో పడిఉంటారు.[3]

ٱلْمُلْكُ يَوْمَئِذٍ لِّلَّهِ يَحْكُمُ بَيْنَهُمْ ۚ فَٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّـٰلِحَـٰتِ فِى جَنَّـٰتِ ٱلنَّعِيمِ ﴿٥٦﴾

**56.** ఆ రోజు సర్వాధిపత్యం అల్లాహ్‌దే.[4] ఆయన వారి మధ్య తీర్పుచేస్తాడు. కావున విశ్వసించి సత్కార్యాలు చేసేవారు పరమానందకరమైన స్వర్గవనాలలో ఉంటారు

وَٱلَّذِينَ كَفَرُوا۟ وَكَذَّبُوا۟ بِـَٔايَـٰتِنَا فَأُو۟لَـٰٓئِكَ لَهُمْ عَذَابٌ مُّهِينٌ ﴿٥٧﴾

**57.** కాని, ఎవరైతే సత్యతిరస్కారులై, మా సూచనలను అబద్ధాలని తిరస్కరించారో, వారికి అవమానకరమైన శిక్ష ఉంటుంది.

---

1 చూడండి, 2:10

2 అల్ హాది. సేకరించబడిన పదం Guide. Leader మార్గదర్శకుడు, సన్మార్గం చూపువాడు ఇది అల్లాహ్ (సు తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

3. యౌమిన్ 'అఖీమ్: అంటే గొడ్డుదినం అంటే మళ్ళీరాని ఏకైకదినం. పునరుత్థానం. చూ 51:41

4 చూడండి, 25:26 మరియు 40:16.

وَالَّذِينَ إِذَا أَنفَقُوا لَمْ يُسْرِفُوا وَلَمْ يَقْتُرُوا
وَكَانَ بَيْنَ ذَٰلِكَ قَوَامًا ﴿٦٧﴾

**67.** మరియు ఎవరైతే, ఖర్చు చేసేటప్పుడు అనవసర ఖర్చు గానీ లేక లోభత్వం గానీ చేయకుండా, ఈ రెండింటి మధ్య మితంగా ఉంటారో:

وَالَّذِينَ لَا يَدْعُونَ مَعَ اللَّهِ إِلَٰهًا آخَرَ وَلَا
يَقْتُلُونَ النَّفْسَ الَّتِي حَرَّمَ اللَّهُ إِلَّا بِالْحَقِّ
وَلَا يَزْنُونَ ۚ وَمَن يَفْعَلْ ذَٰلِكَ يَلْقَ أَثَامًا ﴿٦٨﴾

**68.** మరియు ఎవరైతే, అల్లాహ్‌తో పాటు ఇతర దైవాలను ఆరాధించరో! మరియు అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణిని కూడ న్యాయానికి తప్ప చంపరో![1] మరియు వ్యభిచారానికి పాల్పడరో.[2] మరియు ఈ విధంగా చేసేవాడు దాని ఫలితాన్ని తప్పక పొందుతాడు.

يُضَاعَفْ لَهُ الْعَذَابُ يَوْمَ الْقِيَامَةِ وَيَخْلُدْ فِيهِ
مُهَانًا ﴿٦٩﴾

**69.** పునరుత్థాన దినమునాడు, అతనికి రెట్టింపు శిక్షపడుతుంది మరియు అతడు అందులోనే అవమానంతో శాశ్వతంగా పడిఉంటాడు.

إِلَّا مَن تَابَ وَآمَنَ وَعَمِلَ عَمَلًا صَالِحًا فَأُولَٰئِكَ
يُبَدِّلُ اللَّهُ سَيِّئَاتِهِمْ حَسَنَاتٍ ۗ وَكَانَ اللَّهُ غَفُورًا
رَّحِيمًا ﴿٧٠﴾

**70.** కాని, ఇక ఎవరైతే (తాము చేసిన పాపాలకు) పశ్చాత్తాపపడి, విశ్వసించి సత్కార్యాలు చేస్తారో! అలాంటి వారి పాపాలను అల్లాహ్ పుణ్యాలుగా మార్చుతాడు.[3] మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

1 న్యాయానికి చంపే పరిస్థితులు మూడు: 1) ఇస్లాం స్వీకరించిన తరువాత మరల సత్యతిరస్కారి అవటం, 2) పెండ్లి అయినవాడు వ్యభిచారం చేయుటం. 3) ఎవరినైనా చంపటం

2 ఒకడు దైవప్రవక్త('స'అస)తో ప్రశ్నించాడు: 'అన్నిటి కంటే మహాపాపం ఏమిటి?' అతను ('స'అస) జవాబిచ్చారు: 'అల్లాహ్ (సు.తా.)కు ఎవరినైనా సాటికల్పించటం (షిర్క్) ఎందుకంటే ఆయనయే నిన్ను సృష్టించాడు.' అతడన్నాడు: 'దాని తరువాత ఏ పాపం పెద్దది?' దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'తన సంతానాన్ని జీవనోపాధికి భయపడి చంపటం' అతడు మళ్ళీ అడిగాడు ఆ తరువాత అతను జవాబిచ్చారు: 'తన పొరుగు వాని భార్యతో వ్యభిచారం చేయుటం' ఆ తరువాత దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'ఈ మూడు విషయాలు ఈ ఆయత్‌తో విశదీకరింపబడుతున్నాయి.' అని ఈ ఆయత్‌ను చదివారు ('స. బు'ఖారీ, ముస్లిం).

3 ఎంత పెద్ద పాపం చేసినా మరణానికి ముందు దానికై సహృదయంతో పశ్చాత్తపపడితే అల్లాహ్ (సు.తా.) క్షమించవచ్చు, ఒక్క షిర్క్ తప్ప! చూడండి, 4:93 అతడు క్షమాపణ వేడుకోనివిదే మరణిస్తే నరకం తప్పదు. ('స. ముస్లిం).

**71.** మరియు ఎవడైతే, పశ్చాత్తాపపడి సత్కార్యాలు చేస్తాడో! నిశ్చయంగా అలాంటి వాడు హృదయపూర్వకంగా అల్లాహ్ వైపునకు పశ్చాత్తాపంతో మరలుతాడు!

وَمَن تَابَ وَعَمِلَ صَٰلِحًا فَإِنَّهُۥ يَتُوبُ إِلَى ٱللَّهِ مَتَابًا ﴿٧١﴾

**72.** మరియు ఎవరైతే, అబద్ధమైన సాక్ష్యం ఇవ్వరో! మరియు వ్యర్థమైన పనుల వైపునుండి పోవటం జరిగితే, సంస్కారవంతులుగా అక్కడి నుండి దాటిపోతారో![1]

وَٱلَّذِينَ لَا يَشْهَدُونَ ٱلزُّورَ وَإِذَا مَرُّوا۟ بِٱللَّغْوِ مَرُّوا۟ كِرَامًا ﴿٧٢﴾

**73.** మరియు ఎవరైతే, తమ ప్రభువు సూచన (ఆయాత్)ల హితబోధ చేసినపుడు, వారు దానికి చెవిటివారిగా మరియు గ్రుడ్డివారిగా ఉండిపోరో!

وَٱلَّذِينَ إِذَا ذُكِّرُوا۟ بِـَٔايَٰتِ رَبِّهِمْ لَمْ يَخِرُّوا۟ عَلَيْهَا صُمًّا وَعُمْيَانًا ﴿٧٣﴾

**74.** మరియు ఎవరైతే, ఇలా ప్రార్థిస్తారో: "ఓ మా ప్రభూ! మా సహవాసు (అ'జ్వాజ్)ల మరియు సంతానం ద్వారా మా కన్నులకు చల్లదనం ప్రసాదించు. మరియు మమ్మల్ని దైవభీతి గలవారికి నాయకు(ఇమాము)లుగా చేయి."

وَٱلَّذِينَ يَقُولُونَ رَبَّنَا هَبْ لَنَا مِنْ أَزْوَٰجِنَا وَذُرِّيَّٰتِنَا قُرَّةَ أَعْيُنٍ وَٱجْعَلْنَا لِلْمُتَّقِينَ إِمَامًا ﴿٧٤﴾

**75.** ఇలాంటి వారే తమ సహనశీలతకు ప్రతిఫలంగా (స్వర్గంలో) ఉన్నత స్థానాన్ని పొందేవారు. అక్కడ వారికి గౌరవమైన స్వాగతం మరియు శాంతి లభిస్తాయి.

أُو۟لَٰٓئِكَ يُجْزَوْنَ ٱلْغُرْفَةَ بِمَا صَبَرُوا۟ وَيُلَقَّوْنَ فِيهَا تَحِيَّةً وَسَلَٰمًا ﴿٧٥﴾

**76.** వారందు శాశ్వతంగా ఉంటారు. అది ఎంత మంచి నివాసం మరియు ఎంత మంచి స్థలం.

خَٰلِدِينَ فِيهَا ۚ حَسُنَتْ مُسْتَقَرًّا وَمُقَامًا ﴿٧٦﴾

**77.** (ఓ ము'హమ్మద్! అవిశ్వాసులతో) ఇలా అను: "మీరు ఆయనను ప్రార్థిస్తున్నారు కాబట్టి నా ప్రభువు మిమ్మల్ని అలక్ష్యం

قُلْ مَا يَعْبَؤُا۟ بِكُمْ رَبِّى لَوْلَا دُعَآؤُكُمْ ۖ فَقَدْ كَذَّبْتُمْ فَسَوْفَ يَكُونُ لِزَامًا ﴿٧٧﴾

---

1. ల'గ్వున్: అంటే ఆ పని దేనికైతే షరీయత్లో ఎలాంటి స్థానం లేదో! ఇటువంటి చేష్టలు మరియు మాటలు జరిగేటప్పుడు, వారు అక్కడి నుండి మెల్లగా దాటిపోతారు.

చేయడం లేదు.[1] కాని వాస్తవానికి, ఇప్పుడు మీరు (ఆయనను) తిరస్కరించారు. కావున త్వరలోనే ఆయన శిక్ష మీ పై అనివార్యమవుతుంది." (1/4)

1 అల్లాహ్ (సు.తా.) యందు భయభక్తులు కలిగివుండి కేవలం ఆయననే ఆరాధించే వారిని ఆయన (సు.తా.) లక్ష్యంచేస్తాడు. అల్లాహ్ (సు.తా.)ను తిరస్కరించిన వారికీ మరియు ఆయనకు సాటికల్పించిన వారికీ నరక శిక్ష తప్పదు.

## 26. సూరహ్ అష్-షు'అరా'

سُورَةُ الشُّعَرَاءِ

అష్-షు'అరాఉ': కవులు. ఈ సూరహ్ పేరు **224** ఆయత్ నుండి తీసుకోబడింది. కవులు కేవలం ఊహాగానాలే చేస్తారు. వారు తాము పలికే మాటలను ఆచరించరు. ఈ సూరహ్ దైవప్రవక్త ('స'అస) యొక్క మదీనా ప్రస్థానానికి 6-7 సంవత్సరాలకు ముందు మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో **227** ఆయతులు ఉన్నాయి. కాని దైవప్రవక్తలు('అలైహిమ్ స.) తమ మాటలను ఆచరణలో పెట్టి చూపుతారు. మార్గదర్శకత్వం చేస్తారు. వారు సత్యమే పలికారు. దైవప్రవక్తలు('అలైహిమ్ స.) అందరూ ఒకే విధమైన సందేశం తెచ్చారు. వారందరూ ఆరాధనను కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే ప్రత్యేకించుకొని, అల్లాహ్(సు.తా.)కు విధేయులై ఉండాలని (ఇస్లాం) మరియు ఆయనకు భాగస్వాములను కల్పించటం, ఎన్నడూ క్షమించబడని పాపమని బోధించారు. ఈ సూరహ్ నుండి క్రొత్త విధమైన నాలుగు సూరహ్‌లు వస్తున్నాయి. వాటి(26-29)లో దైవప్రవక్తల ద్వారా పంపబడిన దివ్యజ్యోతి మరియు దానికి వారి కాలపు ప్రజల ప్రతిక్రియలు వివరించబడ్డాయి. ఇందులో మూసా, ఇబ్రాహీమ్, నూ'హ్, హూద్, 'సాలి'హ్, లూ'త్ మరియు షు'ఐబ్ ('అలైహిమ్ అస్సలాము) విషయాలున్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

طسٓمٓ ١

**1.** * 'తా-సీన్-మీమ్.

تِلۡكَ ءَايَٰتُ ٱلۡكِتَٰبِ ٱلۡمُبِينِ ٢

**2.** ఇవి స్పష్టమైన గ్రంథ సూచనలు (ఆయతులు).

لَعَلَّكَ بَٰخِعٞ نَّفۡسَكَ أَلَّا يَكُونُواْ مُؤۡمِنِينَ ٣

**3.** (ఓ ము'హమ్మద్!) వారు విశ్వసించలేదనే బాధతో బహుశా నీవు నీ ప్రాణాలే కోల్పోతావేమో![1]

إِن نَّشَأۡ نُنَزِّلۡ عَلَيۡهِم مِّنَ ٱلسَّمَآءِ ءَايَةٗ فَظَلَّتۡ أَعۡنَٰقُهُمۡ لَهَا خَٰضِعِينَ ٤

**4.** మేము కోరితే ఆకాశం నుండి వారిపై ఒక అద్భుత సంకేతాన్ని (ఆయత్‌ను) అవతరింపజేసి, దానికి వారి మెడలను నమ్రతతో వంగిపోయేలా చేసేవారము.

وَمَا يَأۡتِيهِم مِّن ذِكۡرٖ مِّنَ ٱلرَّحۡمَٰنِ مُحۡدَثٍ إِلَّا كَانُواْ عَنۡهُ مُعۡرِضِينَ ٥

**5.** మరియు వారి వద్దకు అనంత కరుణామయుని వద్దనుండి క్రొత్త సందేశం

---

1. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 18:6.

వచ్చినప్పుడల్లా, వారు దాని నుండి విముఖులు కాకుండా ఉండలేదు

فَقَدْ كَذَّبُوا فَسَيَأْتِيهِمْ أَنۢبَٰٓؤُا مَا كَانُوا بِهِۦ يَسْتَهْزِءُونَ ⦿

**6.** వాస్తవానికి, ఇప్పుడు వారు తిరస్కరించారు, కాని త్వరలోనే వారు ఎగతాళి చేస్తూ వచ్చిన దాని యథార్థమేమిటో వారికి తెలిసిపోతుంది.[1]

أَوَلَمْ يَرَوْا إِلَى ٱلْأَرْضِ كَمْ أَنۢبَتْنَا فِيهَا مِن كُلِّ زَوْجٍ كَرِيمٍ ⦿

**7.** ఏమీ? వారు భూమివైపు చూడలేదా? మేము దానిలో ఎంత పుష్కలంగా శ్రేష్ఠమైన రకరకాల (జీవరాసుల్ని)[2] పుట్టించామో?

إِنَّ فِى ذَٰلِكَ لَءَايَةً وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ⦿

**8.** నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించడం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ⦿

**9.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

وَإِذْ نَادَىٰ رَبُّكَ مُوسَىٰٓ أَنِ ٱئْتِ ٱلْقَوْمَ ٱلظَّٰلِمِينَ ⦿

**10.** మరియు నీ ప్రభువు మూసాను ఇలా ఆదేశించిన విషయాన్ని వారికి జ్ఞాపకం చేయించు: "దుర్మార్గులైన జాతి ప్రజల వద్దకు వెళ్ళు;[3]

قَوْمَ فِرْعَوْنَ أَلَا يَتَّقُونَ ⦿

**11.** "ఫిర్'ఔన్ జాతి వారి వద్దకు ఏమీ? వారికి దైవభీతిలేదా?"

قَالَ رَبِّ إِنِّىٓ أَخَافُ أَن يُكَذِّبُونِ ⦿

**12.** (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ, వారు నన్ను అసత్యుడవని తిరస్కరిస్తారేమోనని నేను భయపడుతున్నాను.[4]

---

1. చూడండి, 6:4 5
2. 'జౌజున్: అంటే ఇక్కడ వివిధరకాలు అని అర్థం.
3 మూసా ('అ స ) తన పరివారంతో సహా తిరిగి ఈజిప్టుకు వస్తున్నప్పుడు అతనికి ఒక వెలుగు కనిపిస్తుంది అతను దాని దగ్గరికి వెళ్ళినప్పుడు ఈ ఆదేశం వస్తుంది
4. దీనితో తెలిసేదేమిటంటే సాధారణ మానవులవలె, దైవప్రవక్తలకు కూడా సహజమైన భయం కలగవచ్చు.

**13.** "నా హృదయం కుంచించుకు పోతోంది మరియు నా నాలుక తడబడుతోంది.[1] కావున నీవు హారూన్ వద్దకు కూడా (వ'హీ) పంపు.

وَيَضِيقُ صَدْرِي وَلَا يَنطَلِقُ لِسَانِي فَأَرْسِلْ إِلَىٰ هَارُونَ ﴿١٣﴾

**14.** "మరియు వారి దగ్గర నా మీద ఒక నేరం మోపబడి ఉన్నది,[2] కావున వారు నన్ను చంపుతారేమోనని భయపడుతున్నాను."

وَلَهُمْ عَلَيَّ ذَنبٌ فَأَخَافُ أَن يَقْتُلُونِ ﴿١٤﴾

**15.** (అల్లాహ్) సెలవిచ్చాడు: "అట్లు కానేరదు! మీరిద్దరూ మా సూచనలతో వెళ్ళండి. నిశ్చయంగా, మేము కూడా మీతో పాటు ఉండి సర్వమూ వింటూ ఉంటాము.[3]

قَالَ كَلَّا ۖ فَاذْهَبَا بِآيَاتِنَا ۖ إِنَّا مَعَكُم مُّسْتَمِعُونَ ﴿١٥﴾

**16** "కావున మీరిద్దరూ ఫిర్'ఔన్ వద్దకు వెళ్ళి అనండి: 'నిశ్చయంగా, మేము సర్వ లోకాల పోషకుని సందేశహరులము.

فَأْتِيَا فِرْعَوْنَ فَقُولَا إِنَّا رَسُولُ رَبِّ الْعَالَمِينَ ﴿١٦﴾

**17.** " 'కావున ఇస్రాయీ'ల్ సంతతివారిని మావెంట పోనివ్వు.' "[4]

أَنْ أَرْسِلْ مَعَنَا بَنِي إِسْرَائِيلَ ﴿١٧﴾

**18.** (ఫిర్'ఔన్) అన్నాడు: "ఏమీ? మేము నిన్ను బాల్యంలో మాతోపాటు పోషించలేదా? మరియు నీవు నీ వయస్సులోని అనేక సంవత్సరాలు మాతోపాటు గడిపావు కదా!

قَالَ أَلَمْ نُرَبِّكَ فِينَا وَلِيدًا وَلَبِثْتَ فِينَا مِنْ عُمُرِكَ سِنِينَ ﴿١٨﴾

**19.** "అయినా నీవు హీనమైన ఆ పని చేశావు, కావున నీవు కృతఘ్నులలోని

وَفَعَلْتَ فَعْلَتَكَ الَّتِي فَعَلْتَ وَأَنتَ مِنَ الْكَافِرِينَ ﴿١٩﴾

---

**1** దీనికి కారణం అతని నాలుకలో ఉన్న ముడి ('ఉఖ్దతున్) చూడండి, 20:25-34

**2** ఇది మూసా ('అ.స.) ఈజిప్టు నుండి వెళ్ళిపోకముందు అనుకోకుండా జరిగిన సంఘటన. ఒక ఫిర్'ఔన్ జాతివాడు, ఒక ఇస్రాయీ'ల్ జాతివానితో కలహిస్తూ ఉండగా, ఇస్రాయీ'లు వాని పిలుపు విని, మూసా ('అ.స.) అతనికి సహాయపడటానికి, ఫిర్'ఔన్ జాతి వానిని ఒక దెబ్బ కొట్టడం వల్ల, అతడు మరణిస్తాడు. ఆ నేరానికి వారు అతనిని చంపగోరుతారు (వివరాలకు చూడండి, 28:15)

**3** 'మీతోపాటు ఉండి.' అంటే అల్లాహ్ (సు.తా.) నేలపైకి ప్రతి మానవుని దగ్గరికి రాడు. ఆయన జ్ఞానం ప్రతి ఒక్కరితో ఉంటుంది. కాని అల్లాహ్ (సు.తా.) 'అర్ష్ పైననే కూర్చొని ఉంటాడు. అంటే విశ్వంలో జరిగేది ఏది కూడా అల్లాహ్ (సు.తా.)కు తెలియకుండా లేదు.

**4.** ఎందుకంటే నీవు నాలుగువందల సంవత్సరాలు వారిని బానిసలుగా చేసి ఉంచావు. ఇప్పుడు వారికి స్వేచ్ఛనివ్వు. నేను వారిని బైతుల్ మఖ్దిస్ వైపునకు తీసుకొని పోతాను.

వాడవు!"[1]

20. (మూసా) అన్నాడు: "నేను పొరపాటుగా ఆ పని చేశాను!

قَالَ فَعَلْتُهَا إِذًا وَأَنَا مِنَ الضَّالِّينَ ﴿٢٠﴾

21. "ఆ పిదప మీకు భయపడి పారిపోయాను, కాని ఆ తరువాత నా ప్రభువు నాకు వివేకాన్ని ప్రసాదించి, నన్ను సందేశహరులలో చేర్చుకున్నాడు.[2]

فَفَرَرْتُ مِنكُمْ لَمَّا خِفْتُكُمْ فَوَهَبَ لِي رَبِّي حُكْمًا وَجَعَلَنِي مِنَ الْمُرْسَلِينَ ﴿٢١﴾

22. "ఇక నీవు నాకు చేసిన ఆ ఉపకారానికి నన్ను ఎత్తిపొడిస్తే! నీవు మాత్రం ఇస్రాయీ'ల్ సంతతి వారినంతా బానిసలుగా చేసుకున్నావు కదా!"[3]

وَتِلْكَ نِعْمَةٌ تَمُنُّهَا عَلَيَّ أَنْ عَبَّدتَّ بَنِي إِسْرَائِيلَ ﴿٢٢﴾

23. (ఫిర్'ఔన్) అడిగాడు: "అయితే ఈ సర్వలోకాల ప్రభువు అంటే ఏమిటి?"[4]

قَالَ فِرْعَوْنُ وَمَا رَبُّ الْعَالَمِينَ ﴿٢٣﴾

24. (మూసా) జవాబిచ్చాడు: "మీరు నమ్మేవారే అయితే! ఆయనే ఆకాశాలకూ మరియు భూమికీ మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు!"

قَالَ رَبُّ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَمَا بَيْنَهُمَا إِن كُنتُم مُّوقِنِينَ ﴿٢٤﴾

25. (ఫిర్'ఔన్) తన చుట్టూ ఉన్న వారితో: "ఏమీ? మీరు వింటున్నారా?"[5] అని ప్రశ్నించాడు.

قَالَ لِمَنْ حَوْلَهُ أَلَا تَسْتَمِعُونَ ﴿٢٥﴾

26. (మూసా) అన్నాడు: "ఆయన (అల్లాహ్) మీ ప్రభువు మరియు మీ పూర్వీకులైన మీ తాతముత్తాతల ప్రభువు కూడాను!"

قَالَ رَبُّكُمْ وَرَبُّ آبَائِكُمُ الْأَوَّلِينَ ﴿٢٦﴾

27. (ఫిర్'ఔన్) అన్నాడు: "మీ వద్దకు

قَالَ إِنَّ رَسُولَكُمُ الَّذِي أُرْسِلَ إِلَيْكُمْ لَمَجْنُونٌ ﴿٢٧﴾

---

1 చూడండి, 28:4-22 హీనమైన పని అంటే ఒక ఫిర్'ఔన్ జాతి వానిని దెబ్బకొట్టి చంపింది.

2. చూడండి, 28:15-16

3 చూడండి, 28:4-5

4 ఫిర్'ఔన్ తన దురహంకారంలో ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు. ఎందుకంటే ఈజిప్టు వాసులందరికీ అతడు, తానే దైవమని చెప్పి, తన ఆరాధ్యం చేయించుకునేవాడు. చూడండి, 28:38.

5 నేను తప్ప మీకు మరొక ప్రభువు కూడా ఉన్నాడా?

పంపబడిన మీ ఈ సందేశహరుడు నిశ్చయంగా, పిచ్చివాడే!"

**28.** (మూసా) అన్నాడు: "మీరు అర్థంచేసుకో గలిగితే, ఆయనే తూర్పు పడమరలకూ మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు."[1]

قَالَ رَبُّ الْمَشْرِقِ وَالْمَغْرِبِ وَمَا بَيْنَهُمَا إِن كُنتُمْ تَعْقِلُونَ ﴿٢٨﴾

**29.** (ఫిర్'ఔన్) అన్నాడు: "నీవు నన్ను కాదని మరెవరినైనా ఆరాధ్యదైవంగా చేసుకుంటే నేను నిన్ను చెరసాలలో ఉన్నవారితో చేర్చుతాను."

قَالَ لَئِنِ اتَّخَذْتَ إِلَٰهًا غَيْرِي لَأَجْعَلَنَّكَ مِنَ الْمَسْجُونِينَ ﴿٢٩﴾

**30.** (మూసా) అన్నాడు: "ఏమీ? నేను నీ వద్దకు ఒక స్పష్టమైన విషయాన్ని (సత్యాన్ని) తీసుకు వచ్చిన తరువాత కూడానా?"[2]

قَالَ أَوَلَوْ جِئْتُكَ بِشَيْءٍ مُّبِينٍ ﴿٣٠﴾

**31.** (ఫిర్'ఔన్) అన్నాడు: "నీవు సత్య వంతుడవే అయితే దానిని (ఆ అద్భుత సూచనను) చూపు!"

قَالَ فَأْتِ بِهِ إِن كُنتَ مِنَ الصَّادِقِينَ ﴿٣١﴾

**32.** అప్పుడు (మూసా) తన చేతి కర్రను పడవేయగానే, అది ఒక స్పష్టమైన పెద్ద సర్పంగా మారిపోయింది.[3]

فَأَلْقَىٰ عَصَاهُ فَإِذَا هِيَ ثُعْبَانٌ مُّبِينٌ ﴿٣٢﴾

**33.** తరువాత అతను (మూసా) తన చేతిని (చంకనుండి) వెలుపలికి తీయగానే, అది చూసేవారి యెదుట తెల్లగా ప్రకాశించ సాగింది![4]

وَنَزَعَ يَدَهُ فَإِذَا هِيَ بَيْضَاءُ لِلنَّاظِرِينَ ﴿٣٣﴾

**34.** (ఫిర్'ఔన్) తన చుట్టూ ఉన్న నాయకులతో అన్నాడు: "నిశ్చయంగా, ఇతనొక నేర్పుగల మాంత్రికుడు.

قَالَ لِلْمَلَإِ حَوْلَهُ إِنَّ هَٰذَا لَسَاحِرٌ عَلِيمٌ ﴿٣٤﴾

**35.** "ఇతను తన మంత్రజాలంతో మిమ్మల్ని మీ దేశంనుండి తరుమగోరుతున్నాడు, అయితే

يُرِيدُ أَن يُخْرِجَكُم مِّنْ أَرْضِكُم بِسِحْرِهِ فَمَاذَا تَأْمُرُونَ ﴿٣٥﴾

---

**1.** చూడండి, 2:115

**2.** చూడండి, 12:1

**3** జాన్నున్ (27:10, 28:31) అంటే చిన్న సర్పం. సు'అబా నున్ (7:107) అంటే పెద్ద సర్పం. 'హయ్యతున్ (20:20) అంటే చిన్నదీ కావచ్చు పెద్దదీ కావచ్చు (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**4** చూడండి, 7:107-108, 20:22, 27:12, 28:38

మీ సలహా ఏమిటి?"[1]

قَالُوٓا أَرْجِهْ وَأَخَاهُ وَابْعَثْ فِى الْمَدَآئِنِ حٰشِرِينَ ﴿٣٦﴾

36. వారన్నారు: "అతనిని మరియు అతని సోదరుణ్ణి ఆపి ఉంచు మరియు (మంత్రగాళ్ళను) సమావేశపరచటానికి అన్ని నగరాలకు వార్తాహరులను పంపు;

يَأْتُوكَ بِكُلِّ سَحَّارٍ عَلِيمٍ ﴿٣٧﴾

37. "వారు నీ వద్దకు నేర్పుగల ప్రతి మాంత్రికుణ్ణి తెస్తారు."

فَجُمِعَ السَّحَرَةُ لِمِيقٰتِ يَوْمٍ مَّعْلُومٍ ﴿٣٨﴾

38. ఈ విధంగా ఒక నియమిత రోజున ఒక నియమిత ప్రదేశంలో మాంత్రికులంతా సమావేశపరచబడ్డారు.[2]

وَقِيلَ لِلنَّاسِ هَلْ أَنتُم مُّجْتَمِعُونَ ﴿٣٩﴾

39. మరియు ప్రజలతో ఇలా ప్రశ్నించటం జరిగింది: "ఏమీ? మీరంతా సమావేశ మయ్యారా?

لَعَلَّنَا نَتَّبِعُ السَّحَرَةَ إِن كَانُوا هُمُ الْغٰلِبِينَ ﴿٤٠﴾

40. "ఒకవేళ మాంత్రికులు గెలుపొందితే మనమంతా వారిని అనుసరించాలి కదా!"

فَلَمَّا جَآءَ السَّحَرَةُ قَالُوا لِفِرْعَوْنَ أَئِنَّ لَنَا لَأَجْرًا إِن كُنَّا نَحْنُ الْغٰلِبِينَ ﴿٤١﴾

41. మాంత్రికులు వచ్చిన తరువాత ఫిర్'ఔన్‌తో అన్నారు: "మేము గెలుపొందితే నిశ్చయంగా, మాకు బహుమానముంది కదా?"[3]

قَالَ نَعَمْ وَإِنَّكُمْ إِذًا لَّمِنَ الْمُقَرَّبِينَ ﴿٤٢﴾

42. (ఫిర్'ఔన్) అన్నాడు: "అవును! నిశ్చయంగా, అప్పుడు మీరు నా సన్నిహితులలో చేరుతారు!"

قَالَ لَهُم مُّوسَىٰٓ أَلْقُوا مَآ أَنتُم مُّلْقُونَ ﴿٤٣﴾

43. మూసా వారితో అన్నాడు: "మీరు విసరదలుచుకున్న దానిని విసరండి!"

فَأَلْقَوْا حِبَالَهُمْ وَعِصِيَّهُمْ وَقَالُوا بِعِزَّةِ فِرْعَوْنَ إِنَّا لَنَحْنُ الْغٰلِبُونَ ﴿٤٤﴾

44. అప్పుడు వారు తమ త్రాళ్ళను మరియు తమ కర్రలను విసిరి ఇలా అన్నారు:

---

1. చూడండి, 7:109-110

2. ఇది అల్లాహ్ (సు.తా.) ఇచ్ఛయే, ప్రజలకు, మూసా (అ.స.) సత్యుడని మరియు మాంత్రికులు చేసేదంతా బూటక కల్పనలని నిరూపించటానికి. చూడండి, 21:18

3. చూడండి, 7:113

"ఫిర్'ఔన్ శక్తిసాక్షిగా! నిశ్చయంగా మేమే విజయం పొందుతాము."[1]

**45.** ఆ తరువాత మూసా తన కర్రను పడవేయగా, తక్షణమే అది వారి బూటకపు కల్పనలను మ్రింగివేసింది.[2]

فَأَلْقَىٰ مُوسَىٰ عَصَاهُ فَإِذَا هِيَ تَلْقَفُ مَا يَأْفِكُونَ ٤٥

**46.** అప్పుడు ఆ మాంత్రికులు సజ్దాలో పడ్డారు.

فَأُلْقِيَ السَّحَرَةُ سَاجِدِينَ ٤٦

**47.** వారన్నారు: "మేము సర్వలోకాల ప్రభువును విశ్వసిస్తున్నాము.

قَالُوا آمَنَّا بِرَبِّ الْعَالَمِينَ ٤٧

**48.** "మూసా మరియు హారూన్‌ల ప్రభువును."

رَبِّ مُوسَىٰ وَهَارُونَ ٤٨

**49.** (ఫిర్'ఔన్) అన్నాడు: "నేను మీకు అనుమతి ఇవ్వకముందే మీరు అతనిని విశ్వసించారా?[3] నిశ్చయంగా, ఇతడే మీ గురువు, మీకు జాలవిద్యను నేర్పినవాడు. సరే, ఇప్పుడే మీరు తెలుసుకుంటారు. నేను మీ వ్యతిరేక (ప్రతిపక్ష) దిశల చేతులను మరియు కాళ్ళను నరికిస్తాను మరియు మీరందరినీ సిలువపై ఎక్కిస్తాను."[4]

قَالَ آمَنتُمْ لَهُ قَبْلَ أَنْ آذَنَ لَكُمْ إِنَّهُ لَكَبِيرُكُمُ الَّذِي
عَلَّمَكُمُ السِّحْرَ فَلَسَوْفَ تَعْلَمُونَ لَأُقَطِّعَنَّ أَيْدِيَكُمْ
وَأَرْجُلَكُم مِّنْ خِلَافٍ وَلَأُصَلِّبَنَّكُمْ
أَجْمَعِينَ ٤٩

**50.** (మాంత్రికులు) అన్నారు: "బాధలేదు! నిశ్చయంగా, మేము మా ప్రభువు వద్దకే కదా మరలిపోయేది.

قَالُوا لَا ضَيْرَ إِنَّا إِلَىٰ رَبِّنَا مُنقَلِبُونَ ٥٠

**51.** "నిశ్చయంగా, మా ప్రభువు మా పాపాలను క్షమిస్తాడని మేము ఆశిస్తున్నాము, ఎందుకంటే వాస్తవానికి అందరికంటే ముందుగా విశ్వసించినవారం మేమే!" (3/8)

إِنَّا نَطْمَعُ أَن يَغْفِرَ لَنَا رَبُّنَا خَطَايَانَا أَن كُنَّا أَوَّلَ
الْمُؤْمِنِينَ ٥١

---

1. చూడండి, 7:116 మరియు 20:66-67
2. చూడండి, 7:117
3. చూడండి, 7:123
4. చూడండి, 5:33 మరియు 7:124.

وَأَوْحَيْنَآ إِلَىٰ مُوسَىٰٓ أَنْ أَسْرِ بِعِبَادِيٓ إِنَّكُم مُّتَّبَعُونَ ﴿٥٢﴾

**52** * మరియు మేము మూసాకు ఈ విధంగా దివ్యజ్ఞానం (వ'హీ) పంపాము: "నీవు నా దాసులను రాత్రివేళ తీసుకొని వెళ్ళిపో నిశ్చయంగా, మీరు వెంబడించబడతారు."[1]

فَأَرْسَلَ فِرْعَوْنُ فِى ٱلْمَدَآئِنِ حَٰشِرِينَ ﴿٥٣﴾

**53.** తరువాత ఫిర్'ఔన్ అన్ని పట్టణాలకు వార్తాహరులను పంపాడు.

إِنَّ هَٰٓؤُلَآءِ لَشِرْذِمَةٌ قَلِيلُونَ ﴿٥٤﴾

**54.** (ఇలా ప్రకటన చేయించాడు): "వాస్తవానికి (ఈ ఇస్రాయీ'ల్ సంతతివారు) ఒక చిన్న తెగవారు మాత్రమే

وَإِنَّهُمْ لَنَا لَغَآئِظُونَ ﴿٥٥﴾

**55.** "మరియు నిశ్చయంగా, వారు మాకు చాలా కోపం తెప్పించారు;

وَإِنَّا لَجَمِيعٌ حَٰذِرُونَ ﴿٥٦﴾

**56.** "మరియు నిశ్చయంగా, మనం ఐకమత్యంతో ఉండి జాగరూకత చూపేవారము."

فَأَخْرَجْنَٰهُم مِّن جَنَّٰتٍ وَعُيُونٍ ﴿٥٧﴾

**57.** కావున మేము వారిని, తోటలనుండి మరియు చెలమల నుండి వెళ్ళగొట్టాము;

وَكُنُوزٍ وَمَقَامٍ كَرِيمٍ ﴿٥٨﴾

**58.** మరియు కోశాగారాల నుండి మరియు ఉన్నతమైన స్థానాల నుండి కూడా.

كَذَٰلِكَ وَأَوْرَثْنَٰهَا بَنِىٓ إِسْرَٰٓءِيلَ ﴿٥٩﴾

**59.** ఈ విధంగా! మేము ఇస్రాయీ'ల్ సంతతి వారిని, వాటికి వారసులుగా చేశాము.[2]

فَأَتْبَعُوهُم مُّشْرِقِينَ ﴿٦٠﴾

**60.** అప్పుడు (ఫిర్'ఔన్ జాతి) వారు సూర్యోదయ కాలమున వారిని (ఇస్రాయీ'ల్ సంతతివారిని) వెంబడించారు.

فَلَمَّا تَرَٰٓءَا ٱلْجَمْعَانِ قَالَ أَصْحَٰبُ مُوسَىٰٓ إِنَّا
لَمُدْرَكُونَ ﴿٦١﴾

**61.** ఆ ఇరుపక్షాల వారు ఒకరినొకరు ఎదురు పడినప్పుడు, మూసా అనుచరులు అన్నారు "నిశ్చయంగా మేము చిక్కిపోయాము!"

قَالَ كَلَّآ ۖ إِنَّ مَعِىَ رَبِّى سَيَهْدِينِ ﴿٦٢﴾

**62.** (మూసా) అన్నాడు: "అట్లు కానేరదు. నిశ్చయంగా, నా ప్రభువు నాతో ఉన్నాడు.

---

**1.** చూడండి, 7:130

**2.** చూడండి, 7:137.

ఆయన నాకు మార్గదర్శకత్వం చేస్తాడు (మార్గము చూపుతాడు)."[1]

فَأَوْحَيْنَا إِلَىٰ مُوسَىٰ أَنِ اضْرِب بِّعَصَاكَ الْبَحْرَ ۖ فَانفَلَقَ فَكَانَ كُلُّ فِرْقٍ كَالطَّوْدِ الْعَظِيمِ ﴿٦٣﴾

63. అప్పుడు మేము మూసాకు: "నీ చేతి కర్రతో సముద్రాన్ని కొట్టు!" అని వ'హీద్వారా తెలిపాము. అప్పుడది హటాత్తుగా చీలిపోయింది. దాని ప్రతిభాగం ఒక మహా పర్వతం మాదిరిగా అయిపోయింది.[2]

وَأَزْلَفْنَا ثَمَّ الْآخَرِينَ ﴿٦٤﴾

64. మరియు అక్కడికి మేము రెండవ పక్షం వారిని సమీపింపజేశాము.

وَأَنجَيْنَا مُوسَىٰ وَمَن مَّعَهُ أَجْمَعِينَ ﴿٦٥﴾

65. మరియు మూసాను మరియు అతనితో పాటు ఉన్నవారిని అందరినీ రక్షించాము.

ثُمَّ أَغْرَقْنَا الْآخَرِينَ ﴿٦٦﴾

66. ఆ తరువాత మిగతా వారినందరినీ ముంచివేశాము.

إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿٦٧﴾

67. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలా మంది విశ్వసించటం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿٦٨﴾

68. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే. సర్వశక్తి సంపన్నుడు, అపార కరుణాప్రదాత.

وَاتْلُ عَلَيْهِمْ نَبَأَ إِبْرَاهِيمَ ﴿٦٩﴾

69. ఇక వారికి ఇబ్రాహీమ్ గాథను వినిపించు.

إِذْ قَالَ لِأَبِيهِ وَقَوْمِهِ مَا تَعْبُدُونَ ﴿٧٠﴾

70. అతను తన తండ్రితో మరియు తన జాతివారితో: "మీరెవరిని ఆరాధిస్తున్నారు?" అని అడిగినపుడు;

قَالُوا نَعْبُدُ أَصْنَامًا فَنَظَلُّ لَهَا عَاكِفِينَ ﴿٧١﴾

71. వారన్నారు: "మేము విగ్రహాలను ఆరాధిస్తున్నాము మరియు మేము వాటికే ఎల్లప్పుడు భక్తులమై ఉంటాము."

1. అంటే అల్లాహ్ (సు.తా.) సహాయం నాతో ఉంది.
2. చూడండి, 20:77.

**72.** (ఇబ్రాహీమ్) అన్నాడు: "మీరు వీటిని పిలిచినప్పుడు ఇవి మీమొర అలకిస్తాయా?

قَالَ هَلْ يَسْمَعُونَكُمْ إِذْ تَدْعُونَ ﴿٧٢﴾

**73** "లేదా, మీ క్షేమైనా మేలు చేయగలవా? లేదా హాని చేయగలవా?"

أَوْ يَنفَعُونَكُمْ أَوْ يَضُرُّونَ ﴿٧٣﴾

**74.** వారన్నారు "అలాకాదు! మేము మా తండ్రితాతలను ఇలా చేస్తూఉండగా చూశాము."

قَالُوا بَلْ وَجَدْنَا آبَاءَنَا كَذَٰلِكَ يَفْعَلُونَ ﴿٧٤﴾

**75.** అతను అన్నాడు: "ఏమీ? మీరు ఎప్పుడైనా ఆలోచించారా? మీరెవరిని ఆరాధిస్తున్నారో?

قَالَ أَفَرَأَيْتُم مَّا كُنتُمْ تَعْبُدُونَ ﴿٧٥﴾

**76.** "మీరు గానీ మరియు మీ పూర్వీకులైన మీ తాతముత్తాతలు గానీ (ఆలోచించారా)?

أَنتُمْ وَآبَاؤُكُمُ الْأَقْدَمُونَ ﴿٧٦﴾

**77.** "ఎందుకంటే! నిశ్చయంగా, ఇవన్నీ నా శత్రువులే! కేవలం ఆ సర్వలోకాల ప్రభువు తప్ప!

فَإِنَّهُمْ عَدُوٌّ لِّي إِلَّا رَبَّ الْعَالَمِينَ ﴿٧٧﴾

**78.** "ఆయనే నన్ను సృష్టించాడు. కాబట్టి ఆయనే నాకు మార్గదర్శకత్వం చేస్తాడు.

الَّذِي خَلَقَنِي فَهُوَ يَهْدِينِ ﴿٧٨﴾

**79.** "ఆయనే నాకు తినిపించే వాడు మరియు త్రాగించే వాడు.

وَالَّذِي هُوَ يُطْعِمُنِي وَيَسْقِينِ ﴿٧٩﴾

**80.** "మరియు నేను వ్యాధిగ్రస్తుతనైతే, ఆయనే నాకు స్వస్థత నిచ్చేవాడు.

وَإِذَا مَرِضْتُ فَهُوَ يَشْفِينِ ﴿٨٠﴾

**81.** "మరియు ఆయనే నన్ను మరణింప జేసేవాడు, తరువాత మళ్ళీ బ్రతికింప జేసేవాడు.

وَالَّذِي يُمِيتُنِي ثُمَّ يُحْيِينِ ﴿٨١﴾

**82.** "మరియు ఆయనే తీర్పు దినమున నా తప్పులను క్షమిస్తాడని నేను ఆశిస్తున్నాను.

وَالَّذِي أَطْمَعُ أَن يَغْفِرَ لِي خَطِيئَتِي يَوْمَ الدِّينِ ﴿٨٢﴾

**83.** "మరియు ఓ నా ప్రభూ! నాకు వివేకాన్ని ప్రసాదించు మరియు నన్ను సద్వర్తనులలో కలుపు

رَبِّ هَبْ لِي حُكْمًا وَأَلْحِقْنِي بِالصَّالِحِينَ ﴿٨٣﴾

وَاجْعَل لِّي لِسَانَ صِدْقٍ فِي الْآخِرِينَ ﴿٨٤﴾

**84** ``మరియు తరువాత వచ్చే తరాల వారిలో నాకు మంచి పేరును ప్రసాదించు.[1]

وَاجْعَلْنِي مِن وَرَثَةِ جَنَّةِ النَّعِيمِ ﴿٨٥﴾

**85** ``మరియు సర్వసుఖాల స్వర్గానికి వారసులయ్యే వారిలో నన్ను చేర్చు.

وَاغْفِرْ لِأَبِي إِنَّهُ كَانَ مِنَ الضَّالِّينَ ﴿٨٦﴾

**86** ``మరియు నా తండ్రిని క్షమించు నిశ్చయంగా, అతడు మార్గభ్రష్టులలోని వాడే![2]

وَلَا تُخْزِنِي يَوْمَ يُبْعَثُونَ ﴿٨٧﴾

**87**. ``మరియు అందరూ తిరిగి బ్రతికింపబడే రోజు నన్ను అవమానంపాలు చేయకు.

يَوْمَ لَا يَنفَعُ مَالٌ وَلَا بَنُونَ ﴿٨٨﴾

**88**. ``ఏ రోజునైతే ధనసంపత్తులు గానీ, సంతానం గానీ పనికిరావో!

إِلَّا مَنْ أَتَى اللَّهَ بِقَلْبٍ سَلِيمٍ ﴿٨٩﴾

**89**. ``కేవలం నిర్మలమైన హృదయంతో అల్లాహ్ సన్నిధిలో హాజరైనవాడు తప్ప!''

وَأُزْلِفَتِ الْجَنَّةُ لِلْمُتَّقِينَ ﴿٩٠﴾

**90**. మరియు (ఆ రోజు) స్వర్గం దైవభీతి గలవారి దగ్గరకు తీసుకురాబడుతుంది.

وَبُرِّزَتِ الْجَحِيمُ لِلْغَاوِينَ ﴿٩١﴾

**91**. మరియు నరకం మార్గం తప్పిన వారి ముందు పెట్టబడుతుంది.

وَقِيلَ لَهُمْ أَيْنَ مَا كُنتُمْ تَعْبُدُونَ ﴿٩٢﴾

**92**. మరియు వారితో అనబడుతుంది. ''మీరు ఆరాధించే వారు (ఆ దైవాలు) ఇప్పుడు ఎక్కడున్నారు?

مِن دُونِ اللَّهِ هَلْ يَنصُرُونَكُمْ أَوْ يَنتَصِرُونَ ﴿٩٣﴾

**93**. ``అల్లాహ్‌ను వదలి (మీరు వాటిని ఆరాధించారు కదా)! ఏమీ? వారు మీకు సహాయం చేయగలరా? లేదా తమకు తామైనా సహాయం చేసుకోగలరా?''[3]

فَكُبْكِبُوا فِيهَا هُمْ وَالْغَاوُونَ ﴿٩٤﴾

**94**. అపుడు వారు మరియు (వారిని) మార్గం తప్పించిన వారు, అందు(నరకం)లోకి

**1**. చూడండి, 19:50.

**2**. చూడండి, 19:47-48 మరియు 9:114.

**3** అంటే దేవతలుగా భావించబడిన పుణ్యపురుషులు మరియు విగ్రహాలు లేక మానవుడు ఆరాధించే సంపత్తులు, హోదాలు ఉన్నత స్థానాలు మొదలైనవి చూడండి, 10:28-29

విసిరివేయబడతారు.

وَجُنُودُ إِبْلِيسَ أَجْمَعُونَ ﴿٩٥﴾

**95.** మరియు వారితో బాటు ఇబ్లీస్ సైనికులందరూ.[1]

قَالُوا وَهُمْ فِيهَا يَخْتَصِمُونَ ﴿٩٦﴾

**96.** వారు పరస్పరం వాదించుకుంటూ ఇలా అంటారు:

تَاللَّهِ إِن كُنَّا لَفِي ضَلَالٍ مُّبِينٍ ﴿٩٧﴾

**97.** "అల్లాహ్ సాక్షిగా! మేము స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉన్నాము.

إِذْ نُسَوِّيكُم بِرَبِّ الْعَالَمِينَ ﴿٩٨﴾

**98.** "ఎప్పుడైతే మేము మిమ్మల్ని సర్వ లోకాల ప్రభువుతో సమానులుగా చేశామో!

وَمَا أَضَلَّنَا إِلَّا الْمُجْرِمُونَ ﴿٩٩﴾

**99.** "మరియు మమ్మల్ని మార్గభ్రష్టులుగా చేసింది కేవలం ఈ అపరాధులే.[2]

فَمَا لَنَا مِن شَافِعِينَ ﴿١٠٠﴾

**100.** "మాకిప్పుడు సిఫారసు చేసేవారు ఎవ్వరూ లేరు.

وَلَا صَدِيقٍ حَمِيمٍ ﴿١٠١﴾

**101.** "మరియు ఏ ప్రాణ స్నేహితుడు కూడా లేడు.

فَلَوْ أَنَّ لَنَا كَرَّةً فَنَكُونَ مِنَ الْمُؤْمِنِينَ ﴿١٠٢﴾

**102.** "ఒకవేళ మళ్ళీ మరలిపోయే అవకాశం మాకు దొరికితే, మేము తప్పకుండా విశ్వసించిన వారిలో చేరిపోతాము!"[3]

إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٠٣﴾

**103.** నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿١٠٤﴾

**104.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

كَذَّبَتْ قَوْمُ نُوحٍ الْمُرْسَلِينَ ﴿١٠٥﴾

**105.** నూ'హ్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.

---

1. చూడండి, 2:24 19:68 మరియు 19:83
2. చూడండి, 7:38, 33:67-68 మరియు 38:60-61.
3. చూడండి, 6:27-28

**106.** వారి సహోదరుడు నూ'హ్ వారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ نُوحٌ أَلَا تَتَّقُونَ ١٠٦

**107.** "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన, విశ్వసనీయుడనైన సందేశహరుడను

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ١٠٧

**108.** "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ١٠٨

**109.** "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉన్నది.

وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعَالَمِينَ ١٠٩

**110.** "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు నన్ను అనుసరించండి." (1/2)

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ١١٠

**111.** * వారన్నారు: "ఏమీ? మేము నిన్ను విశ్వసించాలా? నిన్ను కేవలం అధములైన[1] వారే కదా అనుసరిస్తున్నది?"

قَالُوا أَنُؤْمِنُ لَكَ وَاتَّبَعَكَ الْأَرْذَلُونَ ١١١

**112.** (నూ'హ్) అన్నాడు: "వారేమి (పనులు) చేస్తూ ఉండేవారో నాకేం తెలుసు?

قَالَ وَمَا عِلْمِي بِمَا كَانُوا يَعْمَلُونَ ١١٢

**113.** "వారి లెక్క కేవలం నా ప్రభువు వద్ద ఉంది. మీరిది అర్థం చేసుకుంటే ఎంత బాగుండేది.[2]

إِنْ حِسَابُهُمْ إِلَّا عَلَىٰ رَبِّي لَوْ تَشْعُرُونَ ١١٣

**114.** "మరియు, నేను విశ్వసించే వారిని ధిక్కరించేవాడను కాను.

وَمَا أَنَا بِطَارِدِ الْمُؤْمِنِينَ ١١٤

---

**1.** అల్-అర్జ'లూన్: ధనసంపత్తులు లేనివారు. సమాజంలో తక్కువ శ్రేణికి చెందినవారిగా లెక్కింపబడేవారు లేక అధమమైనవిగా భావించే వృత్తులు చేసేవారు. చూడండి, 11:27

**2** ఏ మానవుడు కూడా ఇతర మానవుడి హృదయంలో ఏముందో ఎరుగలేడు కావున ఒకడు 'నేను విశ్వాసుణ్ణి' అని పలికి, తన ధర్మానికి విరుద్ధమైన చేష్టలు చేయడో, మాటలు పలుకడో, అట్టివాడు విశ్వాసుడిగానే పరిగణించబడాలి మానవుని హృదయంలో ఉన్నది కేవలం అల్లాహ్ (సు.తా.)కే తెలుసు కావున ఏ మానవునికి కూడా, ఇతర మానవుని విశ్వాసం గురించి అతని హృదయంలో ఉన్న ఆలోచనలను గురించి నిర్ణయం తీసుకునే హక్కు లేదు

إِنْ أَنَا إِلَّا نَذِيرٌ مُبِينٌ ﴿١١٥﴾

**115.** "నేను కేవలం స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

قَالُوا لَئِنْ لَمْ تَنْتَهِ يَا نُوحُ لَتَكُونَنَّ مِنَ الْمَرْجُومِينَ ﴿١١٦﴾

**116.** వారన్నారు: "ఓ నూ'హ్! నీవు దీనిని మానుకోకపోతే, నీవు తప్పక రాళ్ళురువ్వి చంపబడతావు."

قَالَ رَبِّ إِنَّ قَوْمِي كَذَّبُونِ ﴿١١٧﴾

**117.** (నూ'హ్) అన్నాడు: "ఓ నా ప్రభూ! నా జాతి ప్రజలు నన్ను అసత్యుడవని తిరస్కరిస్తున్నారు.

فَافْتَحْ بَيْنِي وَبَيْنَهُمْ فَتْحًا وَنَجِّنِي وَمَنْ مَعِيَ مِنَ الْمُؤْمِنِينَ ﴿١١٨﴾

**118.** "కావున నీవే నాకూ మరియు వారికీ మధ్య తీర్పుచేయి. మరియు నన్నూ మరియు నాతో పాటు ఉన్న విశ్వాసులనూ కాపాడు."[1]

فَأَنْجَيْنَاهُ وَمَنْ مَعَهُ فِي الْفُلْكِ الْمَشْحُونِ ﴿١١٩﴾

**119.** ఆ పిదప మేము అతనిని మరియు అతనితో పాటు నిండునావలో ఎక్కిఉన్నవారి నందరినీ కాపాడాము.

ثُمَّ أَغْرَقْنَا بَعْدُ الْبَاقِينَ ﴿١٢٠﴾

**120.** ఆ తరువాత మిగతా వారినందరినీ ముంచివేశాము.[2]

إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُمْ مُؤْمِنِينَ ﴿١٢١﴾

**121.** నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించడం లేదు.

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿١٢٢﴾

**122.** నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

كَذَّبَتْ عَادٌ الْمُرْسَلِينَ ﴿١٢٣﴾

**123.** 'ఆద్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.

إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ هُودٌ أَلَا تَتَّقُونَ ﴿١٢٤﴾

**124.** వారి సహోదరుడు[3] హూద్ వారితో

1. చూడండి, 7:89

2. నూ'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 11:25-48. ముంచివేయబడిన వారిలో నూ'హ్ ('అ.స.) భార్య మరియు కుమారుడు కూడా ఉన్నారు. ఎందుకంటే వారు సత్యతిరస్కారులు

3. సహోదరుడు అంటే జాతి సోదరుడు. అదే జాతికి చెందినవాడు. ఇంకా చూడండి, 7:65

ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ١٢٥

**125.** "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన, విశ్వసనీయుడనైన సందేశహరుడను.

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ١٢٦

**126.** "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి

وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعَالَمِينَ ١٢٧

**127.** "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువువద్దనే ఉంది.

أَتَبْنُونَ بِكُلِّ رِيعٍ آيَةً تَعْبَثُونَ ١٢٨

**128.** "ఏమీ? మీరు కేవలం ఆడంబరానికి ప్రతి ఎత్తైన స్థలంమీద ఒక స్మారకాన్ని నిర్మిస్తారా?

وَتَتَّخِذُونَ مَصَانِعَ لَعَلَّكُمْ تَخْلُدُونَ ١٢٩

**129.** "మరియు మీరు శాశ్వతంగా ఇక్కడే ఉండిపోతారన్నట్లు పెద్ద పెద్ద కోటలు కడతారా?

وَإِذَا بَطَشْتُمْ بَطَشْتُمْ جَبَّارِينَ ١٣٠

**130.** "మరియు మీరు ఎవరినైనా పట్టుకుంటే, అతి క్రూరులై పట్టుకుంటారా?

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ١٣١

**131.** "ఇకనైన మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి

وَاتَّقُوا الَّذِي أَمَدَّكُمْ بِمَا تَعْلَمُونَ ١٣٢

**132.** "మరియు మీకు తెలిసివున్న (మంచి) వస్తువులను, మీకు విస్తారంగా ఇచ్చిన ఆయన (అల్లాహ్) యందు భయభక్తులు కలిగిఉండండి

أَمَدَّكُمْ بِأَنْعَامٍ وَبَنِينَ ١٣٣

**133.** "ఆయన విస్తారంగా మీకు పశువులను మరియు సంతానాన్ని అనుగ్రహించాడు;

وَجَنَّاتٍ وَعُيُونٍ ١٣٤

**134.** "మరియు తోటలను మరియు చెలమలను.

إِنِّي أَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ عَظِيمٍ ١٣٥

**135.** "నిశ్చయంగా, మీపై ఒక మహా దినమున (పడబోయే) శిక్షకు నేను

భయపడుతున్నాను!"

136. వారన్నారు: "నీవు ఉపదేశించినా, ఉపదేశించక పోయినా మాకు అంతా సమానమే!

قَالُوْا سَوَآءٌ عَلَيْنَآ اَوَعَظْتَ اَمْ لَمْ تَكُنْ مِّنَ الْوٰعِظِيْنَ ۝

137. "ఇది మా పూర్వీకుల యొక్క ప్రాచీన ఆచారమే![1]

اِنْ هٰذَآ اِلَّا خُلُقُ الْاَوَّلِيْنَ ۝

138. "మరియు మాకు ఎలాంటి శిక్ష విధించబడదు."

وَمَا نَحْنُ بِمُعَذَّبِيْنَ ۝

139. ఈ విధంగా, వారు అతనిని అసత్యవాదుడని తిరస్కరించారు. కావున మేము వారిని నశింపజేశాము[2] నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

فَكَذَّبُوْهُ فَاَهْلَكْنٰهُمْ ۗ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيَةً ۗ وَمَا كَانَ اَكْثَرُهُمْ مُّؤْمِنِيْنَ ۝

140. నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

وَاِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ۝

141. స'మూద్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.[3]

كَذَّبَتْ ثَمُوْدُ الْمُرْسَلِيْنَ ۝

142. వారి సహోదరుడు 'సాలి'హ్ వారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?[4]

اِذْ قَالَ لَهُمْ اَخُوْهُمْ صٰلِحٌ اَلَا تَتَّقُوْنَ ۝

143. "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన విశ్వసనీయుడనైన సందేశహరుడను.

اِنِّيْ لَكُمْ رَسُوْلٌ اَمِيْنٌ ۝

---

1. కాబట్టి మేము దానిని విడువలేము.
2 'ఆద్‌జాతి ఒక బలవంతమైన సమాజముండేది చూడండి 89:8 మరియు 41:15 అయినా వారు సత్యాన్ని తిరస్కరించి, దౌర్జన్యాలు చేసినందుకు నాశనం చేయబడ్డారు.
3 స'మూద్ జాతి వారి నివాసం స'ఊది 'అరేబియాలో 'హిజ్ర్ అనే ప్రాంతంలో ఉండేది ఆ ప్రాంతం మదాయన్ 'సాలి'హ్ అని కూడా అనబడుతుంది. వారు అరబ్బులు దైవప్రవక్త ('స'అస) తబూక్ దండయాత్రకు పోయేటప్పుడు, ఈ ప్రాంతం గుండా ప్రయాణం చేశారు అక్కడినుండి పోయేటప్పుడు తన ఒంటెను త్వరత్వరగా నడిపిస్తూ, తన అనుచరులతో అల్లాహ్ (సు.తా.)ను క్షమాపణ కోరుతూ త్వరత్వరగా ఈ ప్రాంతం నుండి సాగిపోయారు.
4. చూడండి, 7:73 మరియు 11:61 68

**144.** "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ﴿١٤٤﴾

**145.** "నేను దానికొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువువద్దనే ఉంది.

وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ ۖ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعَالَمِينَ ﴿١٤٥﴾

**146.** "ఏమీ? మీరిప్పుడు ఇక్కడ ఉన్న స్థితిలోనే సుఖశాంతులలో ఎల్లప్పుడూ వదలి వేయబడతారని అనుకుంటున్నారా?

أَتُتْرَكُونَ فِي مَا هَاهُنَا آمِنِينَ ﴿١٤٦﴾

**147.** "తోటలలో మరియు చెలమలలో!

فِي جَنَّاتٍ وَعُيُونٍ ﴿١٤٧﴾

**148.** "మరియు ఈ పొలాలలో, మాగిన పండ్లగుత్తులు గల ఖర్జూరపుచెట్ల మధ్య![1]

وَزُرُوعٍ وَنَخْلٍ طَلْعُهَا هَضِيمٌ ﴿١٤٨﴾

**149.** "మరియు మీరు కొండలనుతొలిచి ఎంతో నేర్పుతో గృహాలను నిర్మిస్తూ ఉంటారనీ![2]

وَتَنْحِتُونَ مِنَ الْجِبَالِ بُيُوتًا فَارِهِينَ ﴿١٤٩﴾

**150.** "అలాకాదు, అల్లాహ్‌యందు భయభక్తులు కలిగిఉండండి మరియు నన్ను అనుసరించండి.

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ﴿١٥٠﴾

**151.** "మరియు మితిమీరి ప్రవర్తించే వారి ఆజ్ఞలను అనుసరించకండి.

وَلَا تُطِيعُوا أَمْرَ الْمُسْرِفِينَ ﴿١٥١﴾

**152.** "ఎవరైతే, భూమిలో కల్లోలం రేకెత్తిస్తున్నారో మరియు ఎన్నడూ సంస్కరణను చేపట్టరో!"

الَّذِينَ يُفْسِدُونَ فِي الْأَرْضِ وَلَا يُصْلِحُونَ ﴿١٥٢﴾

**153.** వారన్నారు: "నిశ్చయంగా, నీవు మంత్రజాలంతో వశపరచుకోబడ్డావు!

قَالُوا إِنَّمَا أَنْتَ مِنَ الْمُسَحَّرِينَ ﴿١٥٣﴾

**154.** "నీవు కేవలం మా వంటి ఒక

مَا أَنْتَ إِلَّا بَشَرٌ مِثْلُنَا فَأْتِ بِآيَةٍ إِنْ كُنْتَ مِنَ

---

1. ṭల్'ఉన్: అంటే క్రొత్తగా పుట్టే ఖర్జూర ఫలం. కొద్దిగా పెద్దదైన తరువాత దానిని బల్'హున్, ఆతరువాత బుస్రున్, ఆపిదప రు'తబున్, చివరకు తమ్రున్. ఈ విధంగా వేర్వేరు స్థితులలో ఖర్జూరఫలం పిలువబడుతోంది.
2. చూడండి, 7.74

మానవుడవు మాత్రమే! కావున నీవు సత్యవంతుడవే అయితే, ఏదైనా అద్భుతసూచన తీసుకురా!''

الصَّادِقِينَ ﴿١٥٤﴾

**155**. (సాలిహ్) అన్నాడు: ''ఇదిగో ఈ ఆడఒంటె. ఇది నీరుత్రాగే (దినం) మరియు మీరు నీరుత్రాగే దినం నిర్ణయించబడ్డాయి.[1]

قَالَ هَٰذِهِ نَاقَةٌ لَّهَا شِرْبٌ وَلَكُمْ شِرْبُ يَوْمٍ مَّعْلُومٍ ﴿١٥٥﴾

**156**. ''దీనికి హాని కలిగించకండి అలా చేస్తే ఒక మహాదినపు శిక్ష మిమ్మల్ని పట్టుకుంటుంది.''

وَلَا تَمَسُّوهَا بِسُوءٍ فَيَأْخُذَكُمْ عَذَابُ يَوْمٍ عَظِيمٍ ﴿١٥٦﴾

**157**. కాని వారు దాని మోకాలి నరమును కోసి చంపారు. ఆ తరువాత వారు పశ్చాత్తాపపడుతూ ఉండిపోయారు.[2]

فَعَقَرُوهَا فَأَصْبَحُوا نَادِمِينَ ﴿١٥٧﴾

**158**. కావున. వారిని శిక్ష పట్టుకుంది. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

فَأَخَذَهُمُ الْعَذَابُ ۗ إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٥٨﴾

**159**. నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణా ప్రదాత.

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿١٥٩﴾

**160**. లూ'త్ జాతి, సందేశహరులను అసత్యవాదులని తిరస్కరించింది.[3]

كَذَّبَتْ قَوْمُ لُوطٍ الْمُرْسَلِينَ ﴿١٦٠﴾

**161**. వారి సహోదరుడు లూ'త్ వారితో ఇలా అన్నప్పుడు: ''ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ لُوطٌ أَلَا تَتَّقُونَ ﴿١٦١﴾

---

1 ఒంటె వృత్తాంతానికి చూడండి, 7.73-77

2 వారు ఆ ఒంటెను చంపిన తరువాత 'సాలి'హ్ ('అ స) అన్నారు మీకు మూడు రోజుల వ్యవధి మాత్రమే ఉంది. నాలుగవ రోజు వారు అల్లాహ్ శిక్ష అవతరించటం చూసి పశ్చాత్తాపపడ్డారు కాని శిక్ష వచ్చిన తరువాత పడే పశ్చాత్తాపం లాభదాయకం కాజాలదు

3 లూ'త్ ('అ స) గాథ కొరకు చూడండి, 11·69·83 లూ'త్ ('అ స) ఇబ్రాహీమ్ ('అ స) యొక్క సోదరుడైన హా'రాన్ బిన్ ఆ'జర్ కుమారుడు. అతను కూడా ఇబ్రాహీం ('అ స) జీవిత కాలంలోనే ప్రవక్తగా ఎన్నుకొనబడి, సోదోమ్ మరియు గొమొర్రాహ్ ప్రాంతాలకు పంపబడ్డారు అవి జోర్డాన్‌లో మృతసముద్రం (Dead Sea), ప్రాంతంలో ఉండేవి

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٦٢﴾

**162.** "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన విశ్వసనీయుడవైన సందేశహరుడను.

فَاتَّقُوا اللَّهَ وَأَطِيعُونِ ﴿١٦٣﴾

**163.** "కావున మీరు అల్లాహ్ యందు భయభక్తులు కలిగిఉండండి మరియు నన్ను అనుసరించండి.

وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ ۖ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعَالَمِينَ ﴿١٦٤﴾

**164.** "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువు వద్దనే ఉన్నది

أَتَأْتُونَ الذُّكْرَانَ مِنَ الْعَالَمِينَ ﴿١٦٥﴾

**165.** "(ప్రకృతికి విరుద్ధంగా) సర్వ ప్రాణులలోకెల్లా మీరే పురుషుల వద్దకు పోతారేమిటీ?

وَتَذَرُونَ مَا خَلَقَ لَكُمْ رَبُّكُمْ مِنْ أَزْوَاجِكُمْ ۚ بَلْ أَنْتُمْ قَوْمٌ عَادُونَ ﴿١٦٦﴾

**166.** "మీ ప్రభువు, మీ కొరకు సహవాసులు(అ'జ్వాజ్)గా పుట్టించిన వారిని విడిచి పెడుతున్నారేమిటి? అలాకాదు, మీరు హద్దులు మీరి ప్రవర్తించే జాతివారు!"[1]

قَالُوا لَئِنْ لَمْ تَنْتَهِ يَا لُوطُ لَتَكُونَنَّ مِنَ الْمُخْرَجِينَ ﴿١٦٧﴾

**167.** (దానికి) వారన్నారు: "ఓ లూ'త్, ఇక నీవు మానుకోకపోతే నీవు దేశంనుండి బహిష్కరించబడిన వారిలో చేరుతావు!"

قَالَ إِنِّي لِعَمَلِكُمْ مِنَ الْقَالِينَ ﴿١٦٨﴾

**168.** (లూ'త్) అన్నాడు: "నిశ్చయంగా, మీ ఈ చేష్టలను అసహ్యించుకునే వారిలో నేనూ ఉన్నాను."

رَبِّ نَجِّنِي وَأَهْلِي مِمَّا يَعْمَلُونَ ﴿١٦٩﴾

**169.** (ఇలా ప్రార్థించాడు): "ఓ నా ప్రభూ! నన్నూ మరియు నా కుటుంబం వారినీ వీరి చేష్టలనుండి కాపాడు."

فَنَجَّيْنَاهُ وَأَهْلَهُ أَجْمَعِينَ ﴿١٧٠﴾

**170.** కావున మేము అతనిని మరియు

---

1 మొదటిసారిగా చరిత్రలో స్త్రీలను విడిచి, పురుషులు పురుషులతో రతిక్రీడ (సంభోగం) వీరే ప్రారంభించారంటారు. ఆ నగరం పేరట, ఆ క్రియ ఈనాటికీ సొడోమి (Sodomy) అనబడుతోంది. ఈ కాలపు పశ్చిమ దేశాలలో పరస్పర అంగీకారంతో చేసే సొడోమి, లిస్బనిస్మ (Lesbianism) మరియు స్త్రీ పురుషుల వ్యభిచారాలు చట్టప్రకారం నేరంకావు. ఈ సమాజం ఎటుపోతోంది?

అతని కుటుంబంవారి నందరినీ కాపాడాము -

171. వెనుక ఉండిపోయిన వారిలో కలసి పోయిన ముసలామె తప్ప![1]

إِلَّا عَجُوزًا فِي الْغَابِرِينَ ﴿١٧١﴾

172. ఆ తరువాత, మిగతా వారిని నిర్మూలించాము.

ثُمَّ دَمَّرْنَا الْآخَرِينَ ﴿١٧٢﴾

173. వారిపై ఒక వర్షాన్ని కురిపించాము. అది (ముందు) హెచ్చరించబడిన వారిపై (కురిపించబడ్డ) అతి భయంకరమైన వర్షం[2]

وَأَمْطَرْنَا عَلَيْهِم مَّطَرًا فَسَاءَ مَطَرُ الْمُنذَرِينَ ﴿١٧٣﴾

174. నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలా మంది విశ్వసించడం లేదు.

إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٧٤﴾

175. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿١٧٥﴾

176. వన (అ'య్‌కహ్) వాసులు సందేశ హరులను అసత్యవాదులనితిరస్కరించారు[3]

كَذَّبَ أَصْحَابُ لْـَٔيْكَةِ الْمُرْسَلِينَ ﴿١٧٦﴾

177. షు'ఐబ్ వారితో ఇలా అన్నాడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?[4]

إِذْ قَالَ لَهُمْ شُعَيْبٌ أَلَا تَتَّقُونَ ﴿١٧٧﴾

178. "నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన. విశ్వసనీయుడవైన సందేశహరుడను

إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٧٨﴾

---

1 ముసలామె అంటే లూ'త్ ('అస) భార్య ఆమె సత్యతిరస్కారి ఆమె అదే ప్రాంతవాసి చూడండి, 7:83, 11:81, 27:57, 29:32 33 మరియు 66:10.

2. చూడండి, 11:82 83

3 అ'య్‌కహ్ వాసులు అంటే, అడవివాసులు. మద్‌యన్‌కు కొంత దూరంలో ఉన్న అడవి ప్రాంతం అ'య్‌కహ్ అనబడుతుందని కొందరి అభిప్రాయం మరికొందరి అభిప్రాయం ఇలా ఉంది' అ'య్‌కహ్ అంటే ఒక పెద్ద చెట్టు అది మద్‌యన్‌కు కొంత దూరంలో ఉండింది దాని వాసులు ఆ చెట్టును ఆరాధించే వారు షు'ఐబ్ ('అస) మద్‌యన్ వాసులు కావున అతను మద్‌యన్ వాసుల సోదరుడు అని పేర్కొనబడ్డారు చూడండి, 7.85 వారు ఈ రెండు ప్రాంతాలలో ధర్మప్రచారం చేశారు. (ఇబ్నె-కసీ'ర్)

4 చూడండి 7.85 మరియు షు ఐబ్ ('అస) గాథ కొరకు చూడండి, 11:84 95

179 "కావున మీరు అల్లాహ్‌యందు భయభక్తులు కలిగిఉండండి మరియు నన్ను అనుసరించండి!

فَاتَّقُوا اللّٰهَ وَاَطِيْعُوْنِ ۟ۚ

180. "నేను దాని కొరకు మీ నుండి ఎలాంటి ప్రతిఫలం అడగటంలేదు. నా ప్రతిఫలం కేవలం సర్వలోకాల ప్రభువువద్దనే ఉన్నది. (5/8)

وَمَاۤ اَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ اَجْرٍ ۚ اِنْ اَجْرِیَ اِلَّا عَلٰی رَبِّ الْعٰلَمِیْنَ ۟ؕ

181. * "మీరు (ఇచ్చినపుడు) సరిగ్గా కొలిచి ఇవ్వండి. నష్టపరిచే వారిలో చేరకండి!

اَوْفُوا الْكَیْلَ وَلَا تَكُوْنُوْا مِنَ الْمُخْسِرِیْنَ ۟ۚ

182. "త్రాసుతో సరిసమానంగాతూచండి.

وَزِنُوْا بِالْقِسْطَاسِ الْمُسْتَقِیْمِ ۟ۚ

183. "ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. భూమిలో కల్లోలం రేకెత్తిస్తూ దౌర్జన్యపరులుగా ప్రవర్తించకండి.[1]

وَلَا تَبْخَسُوا النَّاسَ اَشْیَآءَهُمْ وَلَا تَعْثَوْا فِی الْاَرْضِ مُفْسِدِیْنَ ۟ۚ

184. "మిమ్మల్ని మరియు మీకు పూర్వం గతించిన తరాల వారిని సృష్టించిన ఆ (ప్రభువు) నందు భయభక్తులు కలిగి ఉండండి."[2]

وَاتَّقُوا الَّذِیْ خَلَقَكُمْ وَالْجِبِلَّةَ الْاَوَّلِیْنَ ۟ؕ

185. వారన్నారు: "నిశ్చయంగా, నీవు మంత్రజాలంతో వశపరచుకోబడ్డావు!

قَالُوْۤا اِنَّمَاۤ اَنْتَ مِنَ الْمُسَحَّرِیْنَ ۟ۙ

186. "నీవు కేవలం మా వంటి ఒక మానవుడవు మాత్రమే! నిశ్చయంగా, మేము నిన్ను అసత్యవాదులలో ఒకనిగా పరిగణిస్తున్నాము!

وَمَاۤ اَنْتَ اِلَّا بَشَرٌ مِّثْلُنَا وَاِنْ نَّظُنُّكَ لَمِنَ الْكٰذِبِیْنَ ۟ۚ

187. "నీవు సత్యవంతుడవే అయితే ఆకాశం యొక్క ఒక తునకను మాపై పడవేయి."

فَاَسْقِطْ عَلَیْنَا كِسَفًا مِّنَ السَّمَآءِ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِیْنَ ۟ؕ

188. (షు'ఐబ్) అన్నాడు: "మీరు చేసేది నా ప్రభువుకు బాగా తెలుసు!"

قَالَ رَبِّیْۤ اَعْلَمُ بِمَا تَعْمَلُوْنَ ۟

189. కాని, వారు అతనిని అసత్యవాదుడని తిరస్కరించారు, కావున, వారిపై ఛాయాకృత ఉపద్రవం (మేఘాల శిక్ష) వచ్చిపడింది.

فَكَذَّبُوْهُ فَاَخَذَهُمْ عَذَابُ یَوْمِ الظُّلَّةِ ؕ اِنَّهٗ كَانَ عَذَابَ یَوْمٍ عَظِیْمٍ ۟

1. చూడండి, 7:86.

2. జిబిల్లతున్: అంటే చాలామంది లేక పెద్ద వర్గం అని అర్థం

నిశ్చయంగా, అదొక భయంకరమైన దినపు శిక్ష![1]

**190.** నిశ్చయంగా, ఇందులో ఒక సూచన ఉంది. అయినా వారిలో చాలామంది విశ్వసించటం లేదు.

إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً ۖ وَمَا كَانَ أَكْثَرُهُم مُّؤْمِنِينَ ﴿١٩٠﴾

**191.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు కేవలం ఆయనే, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.[2]

وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿١٩١﴾

**192.** మరియు నిశ్చయంగా, ఇది సర్వ లోకాల ప్రభువు అవతరింపజేసిన (గ్రంథం).

وَإِنَّهُ لَتَنزِيلُ رَبِّ الْعَالَمِينَ ﴿١٩٢﴾

**193.** దానిని నమ్మదగిన ఆత్మ (రూ'హుల్ అమీన్) అవతరింపజేశాడు;[3]

نَزَلَ بِهِ الرُّوحُ الْأَمِينُ ﴿١٩٣﴾

**194.** నీ హృదయం మీద, నీవు హెచ్చరిక చేసేవారిలో చేరిపోవాలని;

عَلَىٰ قَلْبِكَ لِتَكُونَ مِنَ الْمُنذِرِينَ ﴿١٩٤﴾

**195.** స్పష్టమైన అరబ్బీ భాషలో![4]

بِلِسَانٍ عَرَبِيٍّ مُّبِينٍ ﴿١٩٥﴾

---

1 షు'ఐబ్ ('అ.స.) తెగవారి మీద మూడు రకాల శిక్షలు వచ్చాయి. 7:91లో భూకంపం, 11:94లో భయంకర ధ్వని, మరియు ఇక్కడ మేఘాల, రాళ్ళవర్షపు శిక్ష అని పేర్కొనబడ్డాయి. అంటే మూడురకాల శిక్షలు ఒకేసారి వచ్చాయన్నమాట. (ఇబ్నె కసీ'ర్)

2 దీనితో ఏడు గాథలు ముగుస్తున్నాయి. అన్నితరాల ప్రజలలో ఒకే విధమైన లక్షణాలు, స్వభావాలు ఉన్నాయి. వారంతా తమ సందేశహరుల సత్యసందేశాన్ని తిరస్కరించి, వారిపై దౌర్జన్యాలు చేశారు. తమ తండ్రితాతల ధర్మాలను అవలంబించారు. 'నీ ప్రభువు శిక్షను తీసుకురా,' అన్నారు. చివరకు వారిపై శిక్ష అవతరింపజేయబడి నాశనం చేయబడ్డారు. వారి పరలోక శిక్ష నరకమే. ప్రతికాలంలో కూడా చాలామట్టుకు పేదవారూ, తక్కువ ఆర్థిక, సామాజిక స్థానాలకు చెందిన వారే ప్రవక్తలను మొట్టమొదట అనుసరించారు. అందుకే స్వర్గంలో ఎక్కువగా ఇలాంటి వారే ఉంటారు.

3 ఏ విధంగానైతే పూర్వపు దైవప్రవక్తల మీద జిబ్రీల్ ('అ.స.) ద్వారా దివ్యజ్ఞానం అవతరింపజేయబడిందో, అదే విధంగా ము'హమ్మద్ ('స'అస) పైన కూడా ఈ ఖుర్ఆన్ అవతరింపజేయబడింది. అతను నిరక్షరాస్యుడయినా, పూర్వ ప్రవక్తల గాథలు వినిపించటమే ఖుర్ఆన్ దివ్యావతరణకు నిదర్శనం. అర్-రూ'హుల్ అమీన్: నమ్మదగిన ఆత్మ, అంటే జిబ్రీల్ ('అ.స.)

4. చూడండి 14:4. ఇతర 'అరబ్ ప్రవక్తలు ఇస్మా'యీల్, హూద్, 'సాలి'హ్ మరియు షు'ఐబ్ 'అలైహిముస్సలామ్‌లు. హీబ్రూ మరియు అరమాయిక్ ప్రాచీన 'అరబ్బీ భాషలే! ఇతర దివ్యగ్రంథాలు ఆయా సంఘాలవారి కొరకు అవతరింపజేయబడి ఉండగా 'అరబ్బీ భాషలో ఉన్న ఈ ఖుర్ఆన్ చివరి దివ్యగ్రంథం మరియు ఆధునిక కాలంలో వచ్చింది. ఇప్పుడు భూగోళమంతా ఒక గ్లోబల్ విల్లేజ్‌గా మారిపోయింది. కావున ఈ ఖుర్ఆన్ సర్వలోకాల వారికి మార్గదర్శినిగా చివరి

**196**. నిశ్చయంగా, దీని (ప్రస్తావన) పూర్వ దివ్యగ్రంథాలలో ఉంది.[1]

وَإِنَّهُۥ لَفِى زُبُرِ ٱلْأَوَّلِينَ ۝١٩٦

**197**. ఇస్రాయీ'ల్ సంతతి వారిలోని విద్వాంసులు[2] ఈ విషయాన్ని ఒప్పుకోవటం వారికొక సూచనగా సరిపోదా?

أَوَلَمْ يَكُن لَّهُمْ ءَايَةً أَن يَعْلَمَهُۥ عُلَمَٰٓؤُا۟ بَنِىٓ إِسْرَٰٓءِيلَ ۝١٩٧

**198**. ఒకవేళ మేము దీనిని 'అరబ్ కాని వానిపై అవతరింపజేసి ఉంటే!

وَلَوْ نَزَّلْنَٰهُ عَلَىٰ بَعْضِ ٱلْأَعْجَمِينَ ۝١٩٨

**199**. అతను దానిని వారికి చదివి వినిపించినా వారు దానిని విశ్వసించేవారు కారు.[3]

فَقَرَأَهُۥ عَلَيْهِم مَّا كَانُوا۟ بِهِۦ مُؤْمِنِينَ ۝١٩٩

**200**. ఈ విధంగా, మేము దీనిని (తిరస్కారాన్ని) అపరాధుల హృదయాల లోనికి దిగిపోయేలా చేశాము.

كَذَٰلِكَ سَلَكْنَٰهُ فِى قُلُوبِ ٱلْمُجْرِمِينَ ۝٢٠٠

**201**. కఠినశిక్షను చూడనంతవరకు వారు దీనిని విశ్వసించరు.

لَا يُؤْمِنُونَ بِهِۦ حَتَّىٰ يَرَوُا۟ ٱلْعَذَابَ ٱلْأَلِيمَ ۝٢٠١

**202**. అది వారికి తెలియకుండానే అకస్మాత్తుగా వచ్చిపడుతుంది.

فَيَأْتِيَهُم بَغْتَةً وَهُمْ لَا يَشْعُرُونَ ۝٢٠٢

**203**. అప్పుడు వారంటారు: "ఏమీ? మాకు కొంత వ్యవధి ఇవ్వబడుతుందా?"[4]

فَيَقُولُوا۟ هَلْ نَحْنُ مُنظَرُونَ ۝٢٠٣

---

దివ్యగ్రంథంగా పంపబడింది. చూడండి, 7:158 మరియు 25:1. ఈ ఖుర్ఆన్ 14 వందల సంవత్సరాలు గడిచినా దాని అసలు రూపంలో ఉంది, అందులో ఏ ఒక్క అక్షరపు మార్పు కూడా లేకుండా భద్రపరచబడింది. ఇది అల్లాహ్ (సు.తా.) వాగ్దానం. అల్లాహ్ (సు.తా.) ఇష్టంతో ఇది ఇప్పుడు ప్రపంచంలోని వివిధ భాషలలో అనువాదం చేయబడుతోంది. అల్లాహ్ (సు.తా.) అనుగ్రహంతో సత్యాన్ని అర్థంచేసుకోగల వారు, దీనిని అర్థంచేసుకొని, సత్యధర్మాన్ని (ఇస్లాంను) స్వీకరించి శాశ్వతంగా స్వర్గవాసానికి అర్హులయ్యే మార్గాన్ని అవలంబిస్తున్నారు.

1 ఈ ప్రస్తావన కొరకు చూడండి, 2:42 మరియు ద్వితీయోపదేశ కాండము (Deuteronony), 18:15,18 మరియు యోహాను (John), 14:16.

2 ఉదాహరణకు: 'అబ్దుల్లాహ్ ఇబ్నె సల్లాం, కా'బ్ ఇబ్నె మాలిక్ మరియు ఇతర మదీనా యూద విద్వాంసులు ఈ విషయం తెలుసుకొని ఇస్లాం స్వీకరించారు. ఈ రోజు వరకు కూడా ఎంతో మంది యూద మరియు క్రైస్తవ విద్వాంసులు ఈ విషయం తెలుసుకొని ఇస్లాం స్వీకరిస్తున్నారు.

3. చూడండి, 41:44.

4. శిక్ష వచ్చిన తరువాత వ్యవధి ఇవ్వబడదు మరియు అప్పుడు చేసే పశ్చాత్తాపం కూడా అంగీకరించబడదు. చూడండి, 23:85.

**204.** ఏమీ? మా శిక్ష శీఘ్రంగా రావలనని వారు కోరుతున్నారా?[1]

أَفَبِعَذَابِنَا يَسْتَعْجِلُونَ ﴿٢٠٤﴾

**205.** చూశావా? మేము కొన్ని సంవత్సరాలు వారికి (ఈ జీవితంలో) సుఖసంతోషాలతో గడిపే వ్యవధినిచ్చినా!

أَفَرَأَيْتَ إِن مَّتَّعْنَاهُمْ سِنِينَ ﴿٢٠٥﴾

**206.** తరువాత వాగ్దానం చేయబడినది (శిక్ష) వారిపైకి వచ్చినపుడు,

ثُمَّ جَاءَهُم مَّا كَانُوا يُوعَدُونَ ﴿٢٠٦﴾

**207.** వారు అనుభవిస్తూ ఉండిన సుఖ సంతోషాలు వారికేమీ పనికిరావు.[2]

مَا أَغْنَىٰ عَنْهُم مَّا كَانُوا يُمَتَّعُونَ ﴿٢٠٧﴾

**208.** మరియు - హెచ్చరిక చేసేవారిని (ప్రవక్తలను) పంపనిదే - మేము ఏ నగరాన్ని కూడా నాశనం చేయలేదు!

وَمَا أَهْلَكْنَا مِن قَرْيَةٍ إِلَّا لَهَا مُنذِرُونَ ﴿٢٠٨﴾

**209.** హితబోధ నివ్వటానికి; మేము ఎన్నడూ అన్యాయస్థులముగా ప్రవర్తించలేదు.[3]

ذِكْرَىٰ وَمَا كُنَّا ظَالِمِينَ ﴿٢٠٩﴾

**210.** మరియు దీనిని (ఈ దివ్యగ్రంథాన్ని) తీసుకొని క్రిందికి దిగిన వారు షైతానులు కారు.

وَمَا تَنَزَّلَتْ بِهِ الشَّيَاطِينُ ﴿٢١٠﴾

**211.** మరియు అది వారికి తగినది కాదు; వారది చేయలేరు.

وَمَا يَنبَغِي لَهُمْ وَمَا يَسْتَطِيعُونَ ﴿٢١١﴾

**212.** వాస్తవానికి, వారు దీనిని వినకుండా దూరంగా ఉంచబడ్డారు.

إِنَّهُمْ عَنِ السَّمْعِ لَمَعْزُولُونَ ﴿٢١٢﴾

**213.** కావున అల్లాహ్‌తోపాటు మరొక ఆరాధ్యదైవాన్ని వేడుకోకు, అలాచేస్తే నీవుకూడా శిక్షింపబడేవారిలో చేరిపోతావు

فَلَا تَدْعُ مَعَ اللَّهِ إِلَٰهًا آخَرَ فَتَكُونَ مِنَ الْمُعَذَّبِينَ ﴿٢١٣﴾

**214.** మరియు నీ దగ్గరి బంధువులను హెచ్చరించు;

وَأَنذِرْ عَشِيرَتَكَ الْأَقْرَبِينَ ﴿٢١٤﴾

---

**1.** ఈ శిక్ష కోరిన దానికి చూడండి, 6:57 మరియు 8:32.

**2** చూడండి, 2:96

**3** చూడండి, 6:131, 15:4, 20:134, 17:15, 28:59 అల్లాహ్ (సు.తా.). హెచ్చరిక చేయుటానికి ప్రవక్తలను పంపనిదే ఏ సమాజాన్ని కూడా నాశనం చేయలేదు

**215**. విశ్వాసులలో నిన్ను అనుసరించే వారిపై నీ కనికరపు రెక్కలను చాపు.[1]

وَاخْفِضْ جَنَاحَكَ لِمَنِ اتَّبَعَكَ مِنَ الْمُؤْمِنِينَ ﴿٢١٥﴾

**216**. ఒకవేళ వారు నీపట్ల అవిధేయత చూపితే వారితో అను: "మీరు చేసే కార్యాలకు నేను బాధ్యుడనుకాను."

فَإِنْ عَصَوْكَ فَقُلْ إِنِّي بَرِيءٌ مِّمَّا تَعْمَلُونَ ﴿٢١٦﴾

**217**. మరియు ఆ సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత మీద నమ్మకం ఉంచుకో!

وَتَوَكَّلْ عَلَى الْعَزِيزِ الرَّحِيمِ ﴿٢١٧﴾

**218**. ఆయన నీవు నిలిచినపుడు, నిన్ను చూస్తున్నాడు.[2]

الَّذِي يَرَاكَ حِينَ تَقُومُ ﴿٢١٨﴾

**219**. మరియు సాష్టాంగం (సజ్దా) చేసేవారితో, నీ రాకపోకడలను కూడా!

وَتَقَلُّبَكَ فِي السَّاجِدِينَ ﴿٢١٩﴾

**220**. నిశ్చయంగా, ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

إِنَّهُ هُوَ السَّمِيعُ الْعَلِيمُ ﴿٢٢٠﴾

**221**. షై'తాన్‌లు ఎవరిపై దిగుతారో నేను మీకు తెలుపనా?

هَلْ أُنَبِّئُكُمْ عَلَىٰ مَن تَنَزَّلُ الشَّيَاطِينُ ﴿٢٢١﴾

**222**. వారు అసత్యవాదులైన పాపాత్ములపై దిగుతారు;

تَنَزَّلُ عَلَىٰ كُلِّ أَفَّاكٍ أَثِيمٍ ﴿٢٢٢﴾

**223**. గాలి వార్తలను చెవులలో ఊదుతారు;[3] మరియు వారిలో చాలామంది అసత్యవాదులే!

يُلْقُونَ السَّمْعَ وَأَكْثَرُهُمْ كَاذِبُونَ ﴿٢٢٣﴾

**224**. మరియు మార్గభ్రష్టులే కవులను అనుసరిస్తారు.[4]

وَالشُّعَرَاءُ يَتَّبِعُهُمُ الْغَاوُونَ ﴿٢٢٤﴾

---

1. చూడండి, 17:24.
2. కొందరు వ్యాఖ్యాతలు: "నీవు నమా'జ్‌లో నిలిచినప్పుడు." అని అంటారు
3. అంటే ఆ షైతానులు తమను వినేవారి చెవులలో విని వినని బూటకపు మాటలను ఊదుతారు
4. చూడండి, 36:69 ఆ కాలపు కొందరు 'అరబ్బులు ఈ ఖుర్ఆన్‌ను ము'హమ్మద్ ('స'అస) రచించిన కవితగా అపోహపడ్డారు. అందుకే ఈ ఆయత్‌లో కవులను అనుసరించే వారు మార్గభ్రష్టులని అల్లాహ్ (సు.తా.) విశదీకరించాడు. ఈ ఖుర్ఆన్ దివ్యజ్ఞానం (వ'హీ) కాబట్టి ఖుర్ఆన్‌లో "దీనివంటి ఒక్కసూరహ్ నయినా మీరంతాకలసి రచించితీసుకురండి." అని సవాలు (Challenge) చేయబడింది. కానీ ఇంతవరకు ఎవ్వరుకూడా దానిని పూర్తిచేయలేక పోయారు.

225. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా వారు (కవులు) తమ కవిత్వంలో ప్రతి విషయాన్ని ఉద్దేశ రహితంగా (ప్రశంసిస్తూ) ఉంటారని,

أَلَمْ تَرَ أَنَّهُمْ فِي كُلِّ وَادٍ يَهِيمُونَ ﴿٢٢٥﴾

226. మరియు నిశ్చయంగా, వారు తాము ఆచరించని దానిని చెప్పుకుంటారని;

وَأَنَّهُمْ يَقُولُونَ مَا لَا يَفْعَلُونَ ﴿٢٢٦﴾

227. కాని, (వారిలో) విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ, అల్లాహ్‌ను అమితంగా స్మరించే వారూ మరియు - తమకు అన్యాయం జరిగినప్పుడే ప్రతీకారచర్య తీసుకునేవారు తప్ప![2] అన్యాయం చేసేవారు తమ పర్యవసానం ఏమిటో త్వరలో తెలుసుకోగలరు. (3/4)

إِلَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ وَذَكَرُوا اللَّهَ كَثِيرًا وَانتَصَرُوا مِن بَعْدِ مَا ظُلِمُوا ۗ وَسَيَعْلَمُ الَّذِينَ ظَلَمُوا أَيَّ مُنقَلَبٍ يَنقَلِبُونَ ﴿٢٢٧﴾

---

1 కవులు చాలామట్టుకు ఊహాగానాలే చేస్తుంటారు కాబట్టి కవిత్వంలో స్వవిరుద్ధమైన వ్యాఖ్యానాలు ఉంటాయి. వారి వివరణ లక్ష్యంలేనిది, భ్రమింపజేసేది కాని ఖుర్ఆన్ మానవులను సత్యమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేయటానికి అవతరింప జేయబడింది అల్లాహ్ (సు.తా.), మానవుని సృష్టికర్త అవతరింపజేసిన మానవుని యొక్క నిర్దేశక గ్రంథమే (Operation Manual) ఈ ఖుర్ఆన్ ఇది మానవునికి మార్గదర్శిని

2 ఇక్కడ ఆ కవులకే, కవిత్వం చేసే అనుమతి ఇవ్వబడింది, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో మరియు అల్లాహ్(సు.తా.)ను అమితంగా ప్రార్థిస్తారో మరియు ఊహాగానాలు చేయక సత్యాధారంపై కవిత్వం చేస్తారో! ఉదాహరణకు 'హస్సాన్ బిన్ సా'బిత్ (ర'ది'అ), తన కవిత్వంతో సత్యతిరస్కారుల కవిత్వానికి తగిన జవాబు ఇచ్చేవారు దైవప్రవక్త ('స'అస) అతనితో అనేవారు 'ఈ సత్యతిరస్కారులకు జవాబివ్వు, జిబ్రీల్ (అ.స.) నీకు తోడ్పడు గాక!' ('స'హీ'హ్ బు'ఖారీ) దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సత్యతిరస్కారులకు జవాబివ్వటానికి, సత్యాధారంగా చేసే కవిత్వం మరియు సత్యాన్ని, తౌహీద్‌ను మరియు సున్నత్‌ను స్థాపించటానికి చేసే కవిత్వం ధర్మసమ్మతమైనదే!

# 27. సూరహ్ అన్-నమ్ల్

سُوْرَةُ النَّمْلِ

నమ్‌లున్: చీమలు. ఈ సూరహ్‌లో చీమల సంభాషణ పేర్కొనబడింది కావున దీనికి ఈ పేరు ఇవ్వబడింది. ఇది 18వ ఆయత్‌లో ఉంది. దీని మరొకపేరు 'తా-సీన్, అని కూడా ఉంది. ఇది మొదటి ఆయత్‌లో ఉంది. ఈ సూరహ్ 26వ సూరహ్ తరువాత మధ్య మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో 93 ఆయతులు ఉన్నాయి.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ / అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

1. * తా-సీన్. ఇవి దివ్యఖుర్ఆన్ ఆయతులు మరియు ఇది ఒక స్పష్టమైన గ్రంథము.[1]

طٰسٓ تِلْكَ اٰيٰتُ الْقُرْاٰنِ وَكِتَابٍ مُّبِيْنٍ ○

2. ఇవి విశ్వాసులకు మార్గదర్శకత్వంగానూ మరియు శుభవార్తలు ఇచ్చేవిగానూ ఉన్నాయి.

هُدًى وَّبُشْرٰى لِلْمُؤْمِنِيْنَ ○

3. ఎవరైతే నమా'జ్ స్థాపిస్తారో మరియు విధిదానం ('జకాత్) ఇస్తారో మరియు పరలోక జీవితాన్ని నమ్ముతారో!

الَّذِيْنَ يُقِيْمُوْنَ الصَّلٰوةَ وَيُؤْتُوْنَ الزَّكٰوةَ وَهُمْ بِالْاٰخِرَةِ هُمْ يُوْقِنُوْنَ ○

4. నిశ్చయంగా, ఎవరైతే పరలోక జీవితాన్ని విశ్వసించరో, వారికి మేము వారి చేష్టలను ఆకర్షణీయమైనవిగా చేశాము. అందువల్ల వారు అంధులవలే దారితప్పి తిరుగుతూ ఉంటారు.[2]

اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ زَيَّنَّا لَهُمْ اَعْمَالَهُمْ فَهُمْ يَعْمَهُوْنَ ○

5. ఇలాంటి వారికి చెడ్డ శిక్ష ఉంది మరియు చివరకు వారే అందరికంటే ఎక్కువగా నష్టపడేవారు.

اُولٰٓئِكَ الَّذِيْنَ لَهُمْ سُوْٓءُ الْعَذَابِ وَهُمْ فِي الْاٰخِرَةِ هُمُ الْاَخْسَرُوْنَ ○

---

1. ఇటువంటి ఆయత్ కొరకు చూడండి, 12:1.

2. పరలోక జీవితాన్ని నమ్మని వారు తమ భౌతిక మరియు ఆర్థిక లాభాలకే ప్రాధాన్యత నిస్తారు. కాబట్టి వారికి వారి దుష్టచేష్టలు ఆకర్షణీయమైనవిగా కనిపిస్తాయి. దానివల్ల వారు మరింత మార్గభ్రష్టత్వంలో పడిపోతారు. జిన్నాతులకు మరియు మానవులకు, సత్యాసత్యాలనూ, మంచిచెడులనూ గుర్తించే విచక్షణా శక్తి ఇవ్వబడింది. కాబట్టి వారు తమ కర్మలకు తామే బాధ్యులవుతారు. అల్లాహ్ (సు.తా.) తనను తాను సరిదిద్దుకోవటానికి ప్రయత్నించేవానికే సన్మార్గం చూపుతాడు. మరియు బుద్ధిపూర్వకంగా దుర్మార్గాన్ని అవలంబించేవాడిని, వాడి దుర్మార్గంలో వదలుతాడు. చూడండి, 2:7.

**6.** మరియు (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా నీవు ఈ ఖుర్ఆన్‌ను, మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు అయిన (అల్లాహ్) నుండి పొందుతున్నావు.

وَإِنَّكَ لَتُلَقَّى الْقُرْآنَ مِن لَّدُنْ حَكِيمٍ عَلِيمٍ ﴿٦﴾

**7.** (జ్ఞాపకం చేసుకోండి!) మూసా తన ఇంటివారితో: "నిశ్చయంగా నాకు ఒకఅగ్ని కనిపిస్తోంది.[1] నేను దానినుండి మీ వద్దకు ఏదైనా వార్తను తీసుకువస్తాను లేదా మీరు కాచుకోవడానికి మండే కొరివినైనా తీసుకువస్తాను." అని అన్నాడు.

إِذْ قَالَ مُوسَىٰ لِأَهْلِهِ إِنِّي آنَسْتُ نَارًا سَآتِيكُم مِّنْهَا
بِخَبَرٍ أَوْ آتِيكُم بِشِهَابٍ قَبَسٍ لَّعَلَّكُمْ تَصْطَلُونَ ﴿٧﴾

**8.** కాని అతడు అక్కడికి చేరినప్పుడు ఒక ధ్వని ఇలా వినిపించింది: "ఈ అగ్నిలో ఉన్న వానికీ మరియు దాని పరిసరాలలో ఉన్న వానికీ శుభాలు కలుగు గాక! సర్వలోకాలకు ప్రభువైన అల్లాహ్ సర్వలోపాలకు అతీతుడు.

فَلَمَّا جَاءَهَا نُودِيَ أَن بُورِكَ مَن فِي النَّارِ وَمَنْ
حَوْلَهَا وَسُبْحَانَ اللَّهِ رَبِّ الْعَالَمِينَ ﴿٨﴾

**9.** "ఓ మూసా! నిశ్చయంగా ఆయన, అల్లాహ్‌ను నేనే! సర్వశక్తిమంతుడను, మహా వివేకవంతుడను.

يَا مُوسَىٰ إِنَّهُ أَنَا اللَّهُ الْعَزِيزُ الْحَكِيمُ ﴿٩﴾

**10.** "నీ చేతికర్రను పడవేయి!" అతను దానిని (పడవేసి) చూశాడు. అది పామువలె కదలసాగింది.[2] అతడు వెనుదిరిగి చూడకుండా పరుగెత్తసాగాడు. (అల్లాహ్ అన్నాడు): "ఓ మూసా! భయపడకు[3] నిశ్చయంగా, నా సన్నిధిలో సందేశహరులకు ఎలాంటి భయం ఉండదు.

وَأَلْقِ عَصَاكَ فَلَمَّا رَآهَا تَهْتَزُّ كَأَنَّهَا جَانٌّ وَلَّىٰ
مُدْبِرًا وَلَمْ يُعَقِّبْ يَا مُوسَىٰ لَا تَخَفْ إِنِّي لَا يَخَافُ
لَدَيَّ الْمُرْسَلُونَ ﴿١٠﴾

**11.** "కాని ఎవడైనా తప్పు చేస్తే తప్ప! ఆ తరువాత అతడు దానికి బదులుగా మంచి

إِلَّا مَن ظَلَمَ ثُمَّ بَدَّلَ حُسْنًا بَعْدَ سُوءٍ فَإِنِّي
غَفُورٌ رَّحِيمٌ ﴿١١﴾

1. చూడండి, 20:10
2. చూడండి, 20:17-21
3. దీనితో తెలిసేదేమిటంటే ప్రవక్తలకు అగోచరజ్ఞానం ఉండదు. వారు కూడా సాధారణ మానవుల వలే భయపడవచ్చు!

పనులు చేస్తే![1] నిశ్చయంగా, నేను క్షమించేవాడను, కరుణాప్రదాతను.

**12.** "ఇక నీ చేతిని నీ జేబులో పెట్టి (తీయి), అది ఎలాంటి లోపం లేకుండా తెల్లగా (ప్రకాశిస్తూ) బయటికి వస్తుంది.[2] ఈ తొమ్మిది అద్భుత సూచనలు (అయాత్) తీసుకొని నీవు ఫిర్'ఔన్ మరియు అతని జాతి వారి వద్దకు వెళ్ళు.[3] నిశ్చయంగా, వారు అవిధేయులై పోయారు!"

وَأَدْخِلْ يَدَكَ فِي جَيْبِكَ تَخْرُجْ بَيْضَاءَ مِنْ غَيْرِ سُوءٍ فِي تِسْعِ آيَاتٍ إِلَىٰ فِرْعَوْنَ وَقَوْمِهِ إِنَّهُمْ كَانُوا قَوْمًا فَاسِقِينَ ﴿١٢﴾

**13.** కాని వారి ముందుకు మా ప్రత్యక్ష సూచనలు వచ్చినపుడు వారు: "ఇది స్పష్టమైన మాయాజాలమే!" అని అన్నారు.[4]

فَلَمَّا جَاءَتْهُمْ آيَاتُنَا مُبْصِرَةً قَالُوا هَٰذَا سِحْرٌ مُبِينٌ ﴿١٣﴾

**14.** మరియు వారి హృదయాలు వాటిని అంగీకరించినా వారు అన్యాయంగా, అహంకారంతో తిరస్కరించారు. ఇక చూడు ఆ దౌర్జన్యపరుల గతి ఏమయిపోయిందో!

وَجَحَدُوا بِهَا وَاسْتَيْقَنَتْهَا أَنْفُسُهُمْ ظُلْمًا وَعُلُوًّا ۚ فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُفْسِدِينَ ﴿١٤﴾

**15.** మరియు వాస్తవంగా, మేము దావూద్ మరియు సులైమాన్‌లకు జ్ఞానాన్ని ప్రసాదించాము.[5] వారిద్దరు అన్నారు: "విశ్వాసులైన తన అనేక దాసులలో, మా ఇద్దరికి ఘనతను ప్రసాదించిన ఆ అల్లాహ్‌యే సర్వస్తోత్రాలకు అర్హుడు!"

وَلَقَدْ آتَيْنَا دَاوُودَ وَسُلَيْمَانَ عِلْمًا ۖ وَقَالَا الْحَمْدُ لِلَّهِ الَّذِي فَضَّلَنَا عَلَىٰ كَثِيرٍ مِنْ عِبَادِهِ الْمُؤْمِنِينَ ﴿١٥﴾

**16** మరియు సులైమాన్, దావూద్‌కు వారసుడయ్యాడు.[6] మరియు అతను

وَوَرِثَ سُلَيْمَانُ دَاوُودَ ۖ وَقَالَ يَا أَيُّهَا النَّاسُ عُلِّمْنَا

1 ఒకడు పాపంచేసి, దాని తరువాత హృదయపూర్వకంగా పశ్చాత్తాపపడి క్షమాభిక్ష వేడుకుంటే అల్లాహ్ (సు.తా.) అతనిని క్షమించవచ్చు. బహుశా మూసా ('అ.స.) వల్ల అనుకోకుండా జరిగిన ఫిర్'ఔన్ జాతివాని హత్య గురించి ఈ ఆయత్ చెప్పుతోంది. చూడండి, 28:15-17.

2 చూడండి, 7:108

3 ఆ తొమ్మిది అద్భుత సంకేతాల కొరకు చూడండి, 17:101.

4 చూడండి, 10:76.

5 జ్ఞానం అల్లాహ్ (సు.తా.) తన ప్రవక్తలకు ప్రసాదించే గొప్ప బహుమానం.

6 అంటే ప్రవక్తపదవి యొక్క వారసత్వం. ఎందుకంటే దావూద్ ('అ.స.)కు ఇతర కుమారులుండిరి

مَنطِقَ الطَّيْرِ وَأُوتِينَا مِن كُلِّ شَيْءٍ ۖ إِنَّ هَٰذَا لَهُوَ الْفَضْلُ الْمُبِينُ ﴿١٦﴾

(సులైమాన్) అన్నాడు: "ఓ ప్రజలారా! మాకు పక్షులభాష నేర్పబడింది మరియు మాకు ప్రతివస్తువు ఒసంగబడింది. నిశ్చయంగా, ఇది ఒకస్పష్టమైన (అల్లాహ్) అనుగ్రహమే!"

وَحُشِرَ لِسُلَيْمَانَ جُنُودُهُ مِنَ الْجِنِّ وَالْإِنسِ وَالطَّيْرِ فَهُمْ يُوزَعُونَ ﴿١٧﴾

**17.** మరియు సులైమాన్ కొరకు జిన్నాతుల,[1] మానవుల మరియు పక్షుల సైన్యాలు సమీకరింపబడి ఉండేవి. తరువాత వాటిని తమతమ స్థానాల ప్రకారం వరుసలలో పెట్టి (బయలుదేరారు)!

حَتَّىٰ إِذَا أَتَوْا عَلَىٰ وَادِ النَّمْلِ قَالَتْ نَمْلَةٌ يَا أَيُّهَا النَّمْلُ ادْخُلُوا مَسَاكِنَكُمْ لَا يَحْطِمَنَّكُمْ سُلَيْمَانُ وَجُنُودُهُ وَهُمْ لَا يَشْعُرُونَ ﴿١٨﴾

**18.** చివరకు వారు చీమల లోయ (కనుమ)కు చేరుకున్నప్పుడు ఒక చీమ ఇలా అన్నది: "ఓ చీమలారా! మీరు మీ ఇండ్లలోకి ప్రవేశించండి, లేకపోతే సులైమాన్ మరియు అతని సైనికులు - వారికి తెలియకుండానే - మిమ్మల్ని నలిపివేయవచ్చు!"[2]

فَتَبَسَّمَ ضَاحِكًا مِّن قَوْلِهَا وَقَالَ رَبِّ أَوْزِعْنِي أَنْ أَشْكُرَ نِعْمَتَكَ الَّتِي أَنْعَمْتَ عَلَيَّ وَعَلَىٰ وَالِدَيَّ وَأَنْ أَعْمَلَ صَالِحًا تَرْضَاهُ وَأَدْخِلْنِي بِرَحْمَتِكَ فِي عِبَادِكَ الصَّالِحِينَ ﴿١٩﴾

**19.** (సులైమాన్) దాని మాటలకు చిరు నవ్వు నవ్వి ఇలా అన్నాడు: "ఓ నా ప్రభూ! నీవు నన్ను నాకూ మరియు నా తల్లి దండ్రులకు చూపిన అనుగ్రహాలకు కృతజ్ఞత తెలిపే వానిగా[3] మరియు నీకు నచ్చే సత్కార్యాలు చేసేవానిగా, ప్రోత్సాహపరచు. మరియు నన్ను నీ కారుణ్యంతో సద్వర్తనులైన నీ దాసులలో చేర్చుకో!"[4]

---

కాని వారు ప్రవక్తలు కాలేరు. ప్రవక్త(అ.స.)లు వదలిపోయిన ధనసంపత్తులు 'సదఖ' అంటే దానాలుగా పరిగణింపబడతాయి. (సహీహ్ బుఖారీ).

1 ఖుర్ఆన్ అవతరణా క్రమంలో 114.6లో మొదటిసారి జిన్నాతుల పేరు వచ్చింది

2 దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సులైమాన్(అ.స.)కు పశుపక్షుల భాషలు అర్థమయ్యేవి. కాని అతనికి అగోచరజ్ఞానం లేదు. అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరికీ అగోచరజ్ఞానం ఉండదు. ఈ విషయం ముందు రాబోయే హుద్ హుద్ పిట్ట కథవల్ల తెలుస్తోంది

3 చూడండి, 38:31-33

4 దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే సద్వర్తనులైన విశ్వాసులకే స్వర్గం లభిస్తుంది. మరియు ఎవడు కూడా అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం లేనిదే స్వర్గంలో ప్రవేశించలేడు. దైవప్రవక్త

**20** మరియు (ఒక రోజు) అతను పక్షులను పరిశీలిస్తూ ఇలా అన్నాడు: "ఏమిటి నాకు వడ్రంగిపిట్ట (హుద్‌హుద్) కనిపించడం లేదే! అది ఎటు అదృశ్యమై పోయింది?

وَتَفَقَّدَ الطَّيْرَ فَقَالَ مَا لِيَ لَا أَرَى الْهُدْهُدَ أَمْ كَانَ مِنَ الْغَائِبِينَ ﴿٢٠﴾

**21.** "నేను దానిని కఠినంగా శిక్షిస్తాను. లేదా దానిని కోసివేస్తాను. అది నాకు సరైన కారణం చూపితేనే తప్ప!"

لَأُعَذِّبَنَّهُ عَذَابًا شَدِيدًا أَوْ لَأَاذْبَحَنَّهُ أَوْ لَيَأْتِيَنِّي بِسُلْطَانٍ مُبِينٍ ﴿٢١﴾

**22.** ఆ తరువాత ఎంతోసేపు గడవక ముందే అది వచ్చి ఇలా అన్నది: "నీకు తెలియని విషయమొకటి నేను తెలుసుకొని వచ్చాను. నేను సబా'ను గురించి ఒక నమ్మకమైన వార్తను నీకొరకు తెచ్చాను.[1]

فَمَكَثَ غَيْرَ بَعِيدٍ فَقَالَ أَحَطتُ بِمَا لَمْ تُحِطْ بِهِ وَجِئْتُكَ مِن سَبَإٍ بِنَبَإٍ يَقِينٍ ﴿٢٢﴾

**23.** "నిశ్చయంగా, నేను అక్కడ ఒక స్త్రీని చూశాను. ఆమె వారిపై (రాణిగా) పరిపాలన చేస్తుంది. ఆమెకు ప్రతివస్తువు ఒసంగబడి ఉంది. ఆమె దగ్గర ఒక గొప్ప సింహాసనం ఉంది.

إِنِّي وَجَدتُّ امْرَأَةً تَمْلِكُهُمْ وَأُوتِيَتْ مِن كُلِّ شَيْءٍ وَلَهَا عَرْشٌ عَظِيمٌ ﴿٢٣﴾

**24.** "మరియు నేను ఆమెను మరియు ఆమె జాతివారిని అల్లాహ్‌ను వదలి సూర్యునికి సాష్టాంగం (సజ్దా) చేయటం చూశాను మరియు షైతాన్ వారి కర్మలను, వారికి మంచివిగా తోచేటట్లు చేశాడు. కావున వారిని సన్మార్గం నుండి నిరోధించాడు, కాబట్టి వారు సన్మార్గం పొందలేక పోతున్నారు.

وَجَدتُّهَا وَقَوْمَهَا يَسْجُدُونَ لِلشَّمْسِ مِن دُونِ اللَّهِ وَزَيَّنَ لَهُمُ الشَّيْطَانُ أَعْمَالَهُمْ فَصَدَّهُمْ عَنِ السَّبِيلِ فَهُمْ لَا يَهْتَدُونَ ﴿٢٤﴾

---

('స'అస) ప్రవచనం. 'మీరు సన్మార్గం మీద మరియు సత్యం మీద ఉండండి మరియు జ్ఞాపకముంచుకోండి ఏ వ్యక్తి కూడా కేవలం తన సత్కార్యాలవల్లనే స్వర్గాన్ని పొందలేడు' అప్పుడు అనుచరు(ర'ది'అన్హుమ్)లు అన్నారు. 'ఓ సందేశహరుడా ('స'అస)! మీరు కూడానా?' అతను జవాబిచ్చారు: 'అవును నేను కూడా! అల్లాహ్ (సు.తా.) కరుణించే వరకు నేను కూడా స్వర్గంలో ప్రవేశించలేను' ('స'బు'ఖారీ, సం 6467, 'స ముస్లిం 217)

1 చూడండి, 34:15. సబా' ఒక ప్రఖ్యాత వ్యక్తి పేరు మీద, ఒక తెగ, ఒక పట్టణం మరియు దేశపు పేరు పెట్టబడింది. అది యమన్ ప్రాంతంలో ఉండేది. అది మ'ఆరిబే యమన్ అనే పేరుతో కూడా పిలువబడింది. ఆ సమయంలో దాని పాలకురాలు (రాణి) ఒక స్త్రీ. ఆమెపేరు బిల్ఖీస్ అని అంటారు. దాని రాజధాని మ'ఆరిబ్. వారు సూర్యుణ్ణి పూజించేవారు. (ఫ'త్హ్ అల్ ఖదీర్)

25. "అందుకే వారు - ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ దాగివున్న వాటిని బయటికి తీసేవాడూ మరియు మీరు దాచేవాటినీ మరియు వ్యక్తపరిచేవాటినీ ఎరుగు వాడూ అయిన - అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయటం లేదు.

أَلَّا يَسْجُدُوا لِلَّهِ الَّذِي يُخْرِجُ الْخَبْءَ فِي السَّمَاوَاتِ وَالْأَرْضِ وَيَعْلَمُ مَا تُخْفُونَ وَمَا تُعْلِنُونَ ۝

26. "అల్లాహ్! ఆయన తప్పమరొక ఆరాధ్య దైవం లేడు. ఆయనే సర్వోత్తమ సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు." ۩ 7/8)

اللَّهُ لَا إِلَٰهَ إِلَّا هُوَ رَبُّ الْعَرْشِ الْعَظِيمِ ۩ ۝

27. * (సులైమాన్) అన్నాడు: "నీవు సత్యం పలుకుతున్నావో, లేదా అబద్ధాలాడేవారిలో చేరినవాడవో, మేము ఇప్పుడే చూస్తాము.

قَالَ سَنَنظُرُ أَصَدَقْتَ أَمْ كُنتَ مِنَ الْكَاذِبِينَ ۝

28. నా ఈ ఉత్తరం తీసుకొని పో! దీనిని వారివద్ద పడవేయి, తరువాత వారి నుండి ఒక వైపుకు తొలగిపోయి వారేమి సమాధాన మిస్తారో చూడు."

اذْهَب بِّكِتَابِي هَٰذَا فَأَلْقِهْ إِلَيْهِمْ ثُمَّ تَوَلَّ عَنْهُمْ فَانظُرْ مَاذَا يَرْجِعُونَ ۝

29. (రాణి) అన్నది: "ఓ నా ఆస్థాన నాయకులారా, ఇదిగో నా వైపుకు ఒక విశేషమైన ఉత్తరం పంపబడింది

قَالَتْ يَا أَيُّهَا الْمَلَأُ إِنِّي أُلْقِيَ إِلَيَّ كِتَابٌ كَرِيمٌ ۝

30. "నిశ్చయంగా, ఇది సులైమాన్ దగ్గర నుండి వచ్చింది. మరియు ఇది: 'అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో,' ప్రారంభించబడింది"

إِنَّهُ مِن سُلَيْمَانَ وَإِنَّهُ بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

31. "(ఇందులో ఇలా వ్రాయబడి ఉంది): 'నా పై అధిక్యతను చూపకండి. నా సన్నిధిలోకి అల్లాహ్‌కు విధేయులు(ముస్లింలు) అయిరండి' "[1]

أَلَّا تَعْلُوا عَلَيَّ وَأْتُونِي مُسْلِمِينَ ۝

1. సబా' వాసులు అల్లాహ్ (సు.తా.)ను వదలి సూర్యుణ్ణి పూజించేవారు. (ఆయత్‌లు 24 25) కావున సులైమాన్ ('అ.స.) ఒక ప్రవక్త కాబట్టి వారిని అల్లాహ్(సు.తా.)కు విధేయులవటానికి ఆహ్వానించారు (చూడండి, 44:19) ఇదే విధంగా మహా ప్రవక్త ముహమ్మద్ ('స'అస) కూడా ఆయన కాలపు రాజులను ఇస్లాం స్వీకరించటానికి, ఆహ్వానపత్రాలు పంపారు

قَالَتْ يَٰٓأَيُّهَا ٱلْمَلَؤُا۟ أَفْتُونِى فِىٓ أَمْرِى مَا كُنتُ
قَاطِعَةً أَمْرًا حَتَّىٰ تَشْهَدُونِ ۝٣٢

**32** (రాణి) అన్నది. "ఓ నాయకులారా. ఈ విషయంలో మీరు నాకు సలహాఇవ్వండి నేను ఏ విషయంలోనూ, మీరు లేనిదే ఎలాంటి నిర్ణయం తీసుకోనే!"

قَالُوا۟ نَحْنُ أُو۟لُوا۟ قُوَّةٍ وَأُو۟لُوا۟ بَأْسٍ شَدِيدٍ وَٱلْأَمْرُ
إِلَيْكِ فَٱنظُرِى مَاذَا تَأْمُرِينَ ۝٣٣

**33.** వారిలా జవాబిచ్చారు: "మనం చాలా బలవంతులం మరియు గొప్ప యుద్ధ నిపుణులం, కాని నిర్ణయం మాత్రం నీదే! కావున, నీవు ఏమి ఆజ్ఞాపించదలచుకున్నావో ఆలోచించు!"

قَالَتْ إِنَّ ٱلْمُلُوكَ إِذَا دَخَلُوا۟ قَرْيَةً أَفْسَدُوهَا
وَجَعَلُوٓا۟ أَعِزَّةَ أَهْلِهَآ أَذِلَّةً ۖ وَكَذَٰلِكَ يَفْعَلُونَ ۝٣٤

**34.** (రాణి) అన్నది: "రాజులు ఏ దేశంలోనైనా జొరబడినప్పుడు, వారందులో కల్లోలంరేకెత్తిస్తారు మరియు అక్కడి గౌరవనీయులైన ప్రజలను అవమానపరుస్తారు వీరు కూడా అదేవిధంగా చేయవచ్చు!

وَإِنِّى مُرْسِلَةٌ إِلَيْهِم بِهَدِيَّةٍ فَنَاظِرَةٌۢ بِمَ يَرْجِعُ
ٱلْمُرْسَلُونَ ۝٣٥

**35.** "కావున నేను తప్పక, వారి వద్దకు ఒక కానుకను పంపుతాను. ఆ తరువాత నా దూతలు ఏమి జవాబుతెస్తారో చూస్తాను."

فَلَمَّا جَآءَ سُلَيْمَٰنَ قَالَ أَتُمِدُّونَنِ بِمَالٍ فَمَآ ءَاتَىٰنِۦَ
ٱللَّهُ خَيْرٌ مِّمَّآ ءَاتَىٰكُم بَلْ أَنتُم بِهَدِيَّتِكُمْ تَفْرَحُونَ ۝٣٦

**36.** (రాయబారులు) సులైమాన్ వద్దకు వచ్చినవుడు, అతను అన్నాడు: "ఏమీ? మీరు నాకు ధనసహాయం చేయదలచారా? అల్లాహ్ నాకు ఇచ్చింది, మీకు ఇచ్చిన దానికంటే ఎంతో ఉత్తమమైనది, ఇక మీ కానుకతో మీరే సంతోషపడండి!"

ٱرْجِعْ إِلَيْهِمْ فَلَنَأْتِيَنَّهُم بِجُنُودٍ لَّا قِبَلَ لَهُم بِهَا
وَلَنُخْرِجَنَّهُم مِّنْهَآ أَذِلَّةً وَهُمْ صَٰغِرُونَ ۝٣٧

**37.** (సులైమాన్ అన్నాడు): "నీవు వారి వద్దకు తిరిగిపో, మేము వారిపైకి గొప్ప సేనలతో వస్తాము. వారు వాటిని ఎదిరించ జాలరు. మేము వారిని పరాభవించి అచ్చటి నుండి వెడలగొడ్తాము. మరియు వారు అవమానితులై ఉండిపోతారు."

قَالَ يَٰٓأَيُّهَا ٱلْمَلَؤُا۟ أَيُّكُمْ يَأْتِينِى بِعَرْشِهَا قَبْلَ أَن
يَأْتُونِى مُسْلِمِينَ ۝٣٨

**38.** (తరువాత సులైమాన్) ఇలా అన్నాడు: "ఓ నాయకులారా! వారు అల్లాహ్‌కు విధేయు (ముస్లిం)లై రాకముందే, ఆమె సింహాసనాన్ని

నా దగ్గరకు మీలో ఎవరు తేగలరు?"

39. జిన్నాతులలో బలిష్ఠుడైన ఒకడు ఇలా అన్నాడు: "నీవు నీ స్థానంనుండి లేవకముందే నేను దానిని తీసుకువస్తాను. నిశ్చయంగా నేను ఇలాచేసే బలం గలవాడను, నమ్మదగిన వాడను!"

قَالَ عِفْرِيتٌ مِّنَ الْجِنِّ أَنَا آتِيكَ بِهِ قَبْلَ أَن تَقُومَ مِن مَّقَامِكَ ۖ وَإِنِّي عَلَيْهِ لَقَوِيٌّ أَمِينٌ ۝

40. గ్రంథ జ్ఞానంగల ఒకతను ఇలా అన్నాడు: "నేను కనురెప్పపాటు కాలంలో దానిని నీ వద్దకు తేగలను!" ఆ తరువాత (సులైమాన్) దానిని వాస్తవంగా తనముందు పెట్టబడి ఉండటాన్ని చూసి ఇలా అన్నాడు: "ఇది నా ప్రభువు అనుగ్రహం. నేను కృతజ్ఞతలు చూపుదునా లేక కృతఘ్నుడనవుదునా అని పరీక్షించటానికి ఇలా చేయబడింది. కృతజ్ఞతలు తెలిపేవాడు, నిశ్చయంగా తన మేలుకొరకే కృతజ్ఞతలు తెలుపుకుంటాడు కాని ఎవడైనాకృతఘ్నతకు పాల్పడితే, నిశ్చయంగా, నా ప్రభువు స్వయంసమృద్ధుడు, పరమదాత[1] (అని తెలుసుకోవాలి)."

قَالَ الَّذِي عِندَهُ عِلْمٌ مِّنَ الْكِتَابِ أَنَا آتِيكَ بِهِ قَبْلَ أَن يَرْتَدَّ إِلَيْكَ طَرْفُكَ ۚ فَلَمَّا رَآهُ مُسْتَقِرًّا عِندَهُ قَالَ هَٰذَا مِن فَضْلِ رَبِّي لِيَبْلُوَنِي أَأَشْكُرُ أَمْ أَكْفُرُ ۖ وَمَن شَكَرَ فَإِنَّمَا يَشْكُرُ لِنَفْسِهِ ۖ وَمَن كَفَرَ فَإِنَّ رَبِّي غَنِيٌّ كَرِيمٌ ۝

41. (సులైమాన్) అన్నాడు: "ఆమె గుర్తించలేకుండా ఆమె సింహాసనపు రూపాన్ని మార్చివేయండి. మనం చూద్దాం! ఆమె మార్గదర్శకత్వం పొందుతుందా, లేక మార్గదర్శకత్వం పొందనివారిలో చేరిపోతుందా?"

قَالَ نَكِّرُوا لَهَا عَرْشَهَا نَنظُرْ أَتَهْتَدِي أَمْ تَكُونُ مِنَ الَّذِينَ لَا يَهْتَدُونَ ۝

42. ఆ తరువాత ఆమె అక్కడికి రాగానే, "ఏమీ? నీ సింహాసనం ఈ విధంగానే ఉంటుందా?" అని అడగ్గా, ఆమె: "నిశ్చయంగా,

فَلَمَّا جَاءَتْ قِيلَ أَهَٰكَذَا عَرْشُكِ ۖ قَالَتْ كَأَنَّهُ هُوَ ۚ وَأُوتِينَا الْعِلْمَ مِن قَبْلِهَا وَكُنَّا

---

1 అల్-కరీము, Most Bounteous, Generous, Most Noble Honourable, దాతృత్వుడు, దానశీలుడు, ఔదార్యుడు, ఉదారుడు, పరమదాత, గొప్పవాడు, అత్యంత ఆదరణీయుడు, దివ్యుడు (82:6, 96:3,) ఈ శబ్దము అల్లాహ్ (సు.తా.)కే గాక, దివ్య ఖుర్ఆన్ కొరకు గూడా వాడబడింది, అల్-మజీద్ మాదిరిగా అల్-ఇక్రామ్: కొరకు చూడండి, 55:27,78

مُسْلِمِينَ ﴿٤٢﴾

ఇది దాని మాదిరిగానే ఉంది!" అని అన్నది మరియు (సులైమాన్ అన్నాడు): "మనకు ఈమెకంటే ముందు జ్ఞానంలభించింది కావున మనం అల్లాహ్‌కు విధేయు(ముస్లిం)ల మయ్యాము!"[1]

وَصَدَّهَا مَا كَانَت تَّعْبُدُ مِن دُونِ اللَّهِ ۖ إِنَّهَا كَانَتْ مِن قَوْمٍ كَافِرِينَ ﴿٤٣﴾

**43.** మరియు అల్లాహ్‌ను వదలి ఆమె ఆరాధిస్తున్నది, ఆమెను (ఇస్లాంనుండి) తొలగించింది. అందుకే! ఆమె వాస్తవానికి, సత్యతిరస్కారులలో చేరిఉండేది.

قِيلَ لَهَا ادْخُلِي الصَّرْحَ ۖ فَلَمَّا رَأَتْهُ حَسِبَتْهُ لُجَّةً وَكَشَفَتْ عَن سَاقَيْهَا ۚ قَالَ إِنَّهُ صَرْحٌ مُّمَرَّدٌ مِّن قَوَارِيرَ ۗ قَالَتْ رَبِّ إِنِّي ظَلَمْتُ نَفْسِي وَأَسْلَمْتُ مَعَ سُلَيْمَانَ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ ﴿٤٤﴾

**44.** ఆమెతో: "రాజ గృహంలోప్రవేశించు!" అని చెప్పగా! ఆమె దానిని చూసి, అదొక నీటి కొలనని భావించి (తన వస్త్రాలను) పైకెత్తగా ఆమె పిక్కలు కనబడ్డాయి. అప్పుడు (సులైమాన్): "ఇది గాజుతో నిర్మించబడిన నున్నని నేల మాత్రమే!" అని అన్నాడు. (రాణి) అన్నది: "ఓ నా ప్రభూ! నాకు నేను అన్యాయం చేసుకున్నాను మరియు నేను సులైమాన్‌తో పాటు సర్వలోకాల ప్రభువైన అల్లాహ్‌కు విధేయతను (ఇస్లాంను) స్వీకరిస్తున్నాను."[2]

وَلَقَدْ أَرْسَلْنَا إِلَىٰ ثَمُودَ أَخَاهُمْ صَالِحًا أَنِ اعْبُدُوا اللَّهَ فَإِذَا هُمْ فَرِيقَانِ يَخْتَصِمُونَ ﴿٤٥﴾

**45.** మరియు వాస్తవంగా! మేము స'మూద్ జాతివారి వద్దకు వారి సోదరుడగు 'సాలి'హ్‌ను: "మీరు అల్లాహ్‌నే ఆరాధించండి."[3] అనే (సందేశంతో) పంపాము. కాని వారు రెండు వర్గాలుగా చీలిపోయి పరస్పరం కలహించుకోసాగారు.

قَالَ يَا قَوْمِ لِمَ تَسْتَعْجِلُونَ بِالسَّيِّئَةِ قَبْلَ

**46.** ('సాలి'హ్) అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! మీరు సుస్థితికి ముందు దుస్థితి

---

1 ఇది సులైమాన్ ('అ.స.) వాక్యమని ఇబ్నె కసీ'ర్ మరియు షౌకాని గారి అభిప్రాయం

2 ఇస్లాం స్వీకరించిన తరువాత బిల్ఖీస్ వివాహం సులైమాన్('అ.స.)తో అయిందా లేదా అనే విషయం ఖుర్ఆన్ మరియు 'హదీస్'లలో పేర్కొనబడలేదు.

3. 'సాలి'హ్ ('అ.స.) గాథ కొరకు చూడండి, 7:73.

కొరకు ఎందుకు తొందర పెడుతున్నారు? మీరు అల్లాహ్‌ను మీ తప్పులను క్షమించమని ఎందుకు వేడుకోరు? బహుశా మీరు కరుణించ బడవచ్చు!"

الْحَسَنَةِ لَوْلَا تَسْتَغْفِرُونَ اللَّهَ لَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿٤٦﴾

**47** వారన్నారు: "మేము నిన్నూ మరియు నీ అనుచరులను అపశకునపు సూచనలుగా పరిగణిస్తున్నాము!" (సా'లి'హ్) అన్నాడు: "మీ శకునం అల్లాహ్ వద్ద ఉంది. వాస్తవానికి, మీరు పరీక్షించబడుతున్నారు!"[1]

قَالُوا اطَّيَّرْنَا بِكَ وَبِمَن مَّعَكَ قَالَ طَائِرُكُمْ عِندَ اللَّهِ بَلْ أَنتُمْ قَوْمٌ تُفْتَنُونَ ﴿٤٧﴾

**48.** మరియు ఆ నగరంలో తొమ్మిది మంది ఉండేవారు వారు దేశంలో కల్లోలం రేకెత్తిస్తూ ఉండేవారు. మరియు ఎలాంటి సంస్కరణ చేసేవారు కాదు.

وَكَانَ فِي الْمَدِينَةِ تِسْعَةُ رَهْطٍ يُفْسِدُونَ فِي الْأَرْضِ وَلَا يُصْلِحُونَ ﴿٤٨﴾

**49.** వారు పరస్పరం ఇలా అనుకున్నారు: "అల్లాహ్ పై ప్రమాణంచేసి ఇలా ప్రతిజ్ఞ చేయండి.[2] మనం అతనిపై మరియు అతనితో పాటు ఉన్న వారిపై రాత్రివేళ దాడి చేద్దాము. తరువాత అతని వారసులతో: 'మీ సంబంధీకులను వధించింది మేము చూడనేలేదు. మేము నిశ్చయంగా, సత్యం పలుకుతున్నాము.' " అని అందాము.

قَالُوا تَقَاسَمُوا بِاللَّهِ لَنُبَيِّتَنَّهُ وَأَهْلَهُ ثُمَّ لَنَقُولَنَّ لِوَلِيِّهِ مَا شَهِدْنَا مَهْلِكَ أَهْلِهِ وَإِنَّا لَصَادِقُونَ ﴿٤٩﴾

**50.** మరియు ఈ విధంగా, వారు పన్నాగం పన్నారు మరియు మేము కూడా ఒక పన్నాగం పన్నాము. కాని వారికది తెలియదు.

وَمَكَرُوا مَكْرًا وَمَكَرْنَا مَكْرًا وَهُمْ لَا يَشْعُرُونَ ﴿٥٠﴾

**51** ఇక చూడండి! వారి పన్నాగపు పర్యవసానం ఏమయిందో! వాస్తవానికి మేము

فَانظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ مَكْرِهِمْ أَنَّا دَمَّرْنَاهُمْ وَقَوْمَهُمْ أَجْمَعِينَ ﴿٥١﴾

---

1 చూడండి. 17:13.

2 అల్లాహ్ (సు.తా.) పై ప్రమాణం అంటే స'మూద్ జాతివారు అల్లాహ్ (సు.తా.) ను విశ్వసించే వారు కాని వారు పాటించే మతం వారిని ఏకైక ఆరాధ్యుడైన (అల్లాహ్ తా'ఆలా) ఆరాధన నుండి తొలగించింది. (చూడండి. 7:73)

వారిని మరియు వారి వంశంవారి నందరినీ సర్వనాశనం చేశాము.

فَتِلْكَ بُيُوتُهُمْ خَاوِيَةً بِمَا ظَلَمُوا إِنَّ فِي ذَٰلِكَ لَآيَةً لِّقَوْمٍ يَعْلَمُونَ ﴿٥٢﴾

**52.** అవిగో వారి గృహాలు! వారు చేసిన దుర్మార్గాలకు అవి ఎలా పాడుపడిపోయాయో చూడండి. నిశ్చయంగా ఇందులో తెలుసుకునే వారికి గొప్ప సూచన ఉంది.

وَأَنجَيْنَا الَّذِينَ آمَنُوا وَكَانُوا يَتَّقُونَ ﴿٥٣﴾

**53.** మరియు విశ్వసించి, దైవభీతి కలిగి ఉన్న వారిని మేము కాపాడాము.

وَلُوطًا إِذْ قَالَ لِقَوْمِهِ أَتَأْتُونَ الْفَاحِشَةَ وَأَنتُمْ تُبْصِرُونَ ﴿٥٤﴾

**54.** మరియు లూ'త్‌ను (జ్ఞాపకం చేసుకోండి)! అతను తన జాతివారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీరు బహిరంగంగా అశ్లీలకార్యాలు చేస్తారా?"[1]

أَئِنَّكُمْ لَتَأْتُونَ الرِّجَالَ شَهْوَةً مِّن دُونِ النِّسَاءِ بَلْ أَنتُمْ قَوْمٌ تَجْهَلُونَ ﴿٥٥﴾

**55.** "ఏమీ? మీరు స్త్రీలను వదలి పురుషుల వద్దకు, మీ కామఇచ్ఛను తీర్చుకోవటానికి పోతారా? వాస్తవానికి, మీరు మూఢజనులు!"

فَمَا كَانَ جَوَابَ قَوْمِهِ إِلَّا أَن قَالُوا أَخْرِجُوا آلَ لُوطٍ مِّن قَرْيَتِكُمْ إِنَّهُمْ أُنَاسٌ يَتَطَهَّرُونَ ﴿٥٦﴾

**56.** (*) కాని, అతని జాతి వారి జవాబు ఈవిధంగా మాత్రమే ఉండింది. వారు అన్నారు: "లూ'త్ కుటుంబాన్ని మీ పట్టణం నుండి వెళ్ళగొట్టండి వాస్తవానికి, వారు తమను తాము చాలా పవిత్రులుగా పరిగణిస్తున్నారు."[2]

فَأَنجَيْنَاهُ وَأَهْلَهُ إِلَّا امْرَأَتَهُ قَدَّرْنَاهَا مِنَ الْغَابِرِينَ ﴿٥٧﴾

**57.** కావున మేము అతనిని మరియు అతని కుటుంబంవారిని కాపాడాము - అతని భార్యతప్ప - ఆమెను వెనుక ఉండిపోయేవారిలో చేర్చుటకు నిర్ణయించాము.[3]

وَأَمْطَرْنَا عَلَيْهِم مَّطَرًا فَسَاءَ مَطَرُ الْمُنذَرِينَ ﴿٥٨﴾

**58.** మరియు వారిపై (రాళ్ళ) వర్షాన్ని కురిపించాము. కాని అది, హెచ్చరించబడిన

1 లూ'త్ (అ.స.) గాథ కొరకు చూడండి, 7:80-84, 11:69-83, 26:160-173.
2. చూడండి, 7:82.
3 చూడండి, 7:83, 11:81 మరియు 66:10

వారిపై కురిపించబడ్డ ఎంతో ఘోరమైన వర్షం.[1]

قُلِ الْحَمْدُ لِلَّهِ وَسَلَامٌ عَلَىٰ عِبَادِهِ الَّذِينَ
اصْطَفَىٰ ۗ آللَّهُ خَيْرٌ أَمَّا يُشْرِكُونَ ﴿٥٩﴾

**59.** (ఓ ము'హమ్మద్!) ఇలా అను: ''సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే ఆయన ఎన్నుకొన్న, ఆయన దాసులకు శాంతి కలుగు గాక (సలాం)! ఏమీ? అల్లాహ్ శ్రేష్ఠుడా? లేక వారు ఆయనకు సాటి కల్పించే భాగస్వాములా?''

أَمَّنْ خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ وَأَنزَلَ
لَكُم مِّنَ السَّمَاءِ مَاءً فَأَنبَتْنَا بِهِ حَدَائِقَ
ذَاتَ بَهْجَةٍ مَّا كَانَ لَكُمْ أَن تُنبِتُوا شَجَرَهَا ۗ
أَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ بَلْ هُمْ قَوْمٌ يَعْدِلُونَ ﴿٦٠﴾

**60.** ఏమీ? ఆయనే కాదా? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించినవాడు మరియు మీకొరకు ఆకాశంనుండి నీటిని కురిపించిన వాడు? దానితో మేము మనోహరమైన తోటలను పుట్టించాము. వాటిలో ఒక్క చెట్టును కూడా మొలిపించటం మీకు సాధ్యమయ్యే పని కాదు కదా? ఏమీ? అల్లాహ్ తో బాటు మరొకదేవుడు ఎవడైనా ఉన్నాడా? అలాకాదు! వారే (ఇతరులను) ఆయనకు సమానులుగా చేసే ప్రజలు!

أَمَّن جَعَلَ الْأَرْضَ قَرَارًا وَجَعَلَ خِلَالَهَا أَنْهَارًا
وَجَعَلَ لَهَا رَوَاسِيَ وَجَعَلَ بَيْنَ الْبَحْرَيْنِ
حَاجِزًا ۗ أَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ بَلْ أَكْثَرُهُمْ لَا يَعْلَمُونَ ﴿٦١﴾

**61.** ఏమీ? ఆయనే కాదా? భూమిని నివాసస్థలంగా చేసి,[2] దాని మధ్య నదులను ఏర్పరచి, అది కదలకుండా దానిపై పర్వతాలను మేకులుగా నాటినవాడు మరియు రెండు సముద్రాల మధ్య అడ్డుతెరను నిర్మించినవాడు?[3] ఏమీ? అల్లాహ్ తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా? వాస్తవానికి చాలామంది ఇది తెలుసుకోలేరు.

أَمَّن يُجِيبُ الْمُضْطَرَّ إِذَا دَعَاهُ وَيَكْشِفُ السُّوءَ
وَيَجْعَلُكُمْ خُلَفَاءَ الْأَرْضِ ۗ أَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ قَلِيلًا

**62.** ఏమీ? ఆయనే కాదా? బాధితుడు వేడుకొన్నప్పుడు అతని మొరను ఆలకించి ఆపదను తొలగించే వాడు[4] మరియు భూమిలో

---

**1.** చూడండి, 26.173

**2.** చూడండి, 77:25 26

**3.** చూడండి, 25:53

**4** చూడండి, 17:67 మరియు 27:53

مَّا تَذَكَّرُونَ ﴿٦٢﴾

మిమ్మల్ని ఉత్తరాధికారులుగా చేసినవాడు?[1] ఏమీ? అల్లాహ్‌తోపాటు మరొకదేవుడు ఎవడైనా ఉన్నాడా? మీరు ఆలోచించేది చాలా తక్కువ.

أَمَّن يَهْدِيكُمْ فِي ظُلُمَاتِ الْبَرِّ وَالْبَحْرِ وَمَن يُرْسِلُ الرِّيَاحَ بُشْرًا بَيْنَ يَدَيْ رَحْمَتِهِ ۗ أَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ تَعَالَى اللَّهُ عَمَّا يُشْرِكُونَ ﴿٦٣﴾

**63.** ఏమీ? ఆయనే కాడా? నేల మరియు సముద్రాల, అంధకారంలో మీకు మార్గదర్శకత్వం చేసేవాడు మరియు తన కారుణ్యానికి ముందు గాలులను శుభవార్తతో పంపేవాడు?[2] ఏమీ? అల్లాహ్‌తో పాటు మరొకదేవుడు ఎవడైనా ఉన్నాడా? వారు సాటిగా కల్పించే భాగస్వాములకంటే అల్లాహ్ అత్యున్నతుడు!

أَمَّن يَبْدَأُ الْخَلْقَ ثُمَّ يُعِيدُهُ وَمَن يَرْزُقُكُم مِّنَ السَّمَاءِ وَالْأَرْضِ ۗ أَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ قُلْ هَاتُوا بُرْهَانَكُمْ إِن كُنتُمْ صَادِقِينَ ﴿٦٤﴾

**64.** ఏమీ? ఆయనే కాడా? సృష్టిని తొలిసారి ప్రారంభించి, తరువాత దానిని మరల ఉనికిలోకి తేగలవాడు మరియు మీకు ఆకాశం నుండి మరియు భూమినుండి జీవనోపాధిని సమకూర్చేవాడు.[3] ఏమీ? అల్లాహ్‌తోపాటు మరొకదేవుడు ఎవడైనా ఉన్నాడా? వారితో అను: "మీరు సత్యవంతులే అయితే మీ నిదర్శనాన్ని తీసుకురండి!"

قُل لَّا يَعْلَمُ مَن فِي السَّمَاوَاتِ وَالْأَرْضِ الْغَيْبَ إِلَّا اللَّهُ ۚ وَمَا يَشْعُرُونَ أَيَّانَ يُبْعَثُونَ ﴿٦٥﴾

**65.** వారితో అను: "ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్న అగోచరవిషయ జ్ఞానం గలవాడు అల్లాహ్ తప్ప మరొకడు లేడు.[4]

---

1 చూడండి, 2:30.

2 చూడండి, 7:57

3 చూడండి, 10:31.

4 అగోచరజ్ఞానం అల్లాహ్ (సు.తా.)కు తప్ప మరెవ్వరికీ లేదు. ప్రవక్త('అలైహిమ్ స.)లకు అల్లాహ్ (సు.తా.) వ'హీ ద్వారా తెలిపిన జ్ఞానం మాత్రమే ఉంటుంది. 'ఆయి'షహ్ (ర.'అన్హా) కథనం: "ఎవడైతే ప్రవక్తకు రేపు కాబోయే విషయాల గురించి జ్ఞానముందని భావిస్తాడో, అతడు అల్లాహ్ (సు.తా.) మీద పెద్ద అపనింద మోపుతున్నాడు. ఎందుకంటే! అల్లాహ్ (సు.తా.) అంటున్నాడు: 'భూమ్యాకాశాలలో ఉన్న అగోచర విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్(సు.తా.)కే ఉంది.' " (స'హీ'హ్ బు'ఖారీ, నం. 4855, స'హీ'హ్ ముస్లిం, నం. 287, తిర్మిజీ' నం. 3068) ఖతదా (ర.ది.'అ.) అన్నారు: 'అల్లాహ్ (సు.తా.) నక్షత్రాలను మూడు విషయాల కొరకు పుట్టించాడు: 1) ఆకాశపు అలంకరణ కొరకు, 2) (రాత్రిలో)

మరియు వారు తిరిగి ఎప్పుడు లేపబడతారో కూడా వారికి తెలియదు."

**66.** వాస్తవానికి, పరలోకజీవితం గురించి వారి జ్ఞానం శూన్యమే. అలాకాదు! దానిని గురించి వారు సంశయంలో పడివున్నారు. అలాకాదు! దాని విషయంలో వారు అంధులై పోయారు.

بَلِ ادّٰرَكَ عِلْمُهُمْ فِي الْاٰخِرَةِ ۚ بَلْ هُمْ فِيْ شَكٍّ مِّنْهَا ۚ بَلْ هُمْ مِّنْهَا عَمُوْنَ ﴿٦٦﴾

**67.** సత్యతిరస్కారులు అంటారు: "ఏమీ? మేమూ మరియు మా తండ్రితాతలు మట్టిగా మారిపోయిన తరువాత కూడా వాస్తవానికి మరల (సజీవులుగా) వెలికి తీయబడతామా?

وَقَالَ الَّذِيْنَ كَفَرُوْٓا ءَاِذَا كُنَّا تُرٰبًا وَّاٰبَآؤُنَآ اَئِنَّا لَمُخْرَجُوْنَ ﴿٦٧﴾

**68.** "వాస్తవానికి ఇంతకు పూర్వం కూడా మాకు మరియు మా తండ్రితాతలకు ఇదే విధంగా వాగ్దానం చేయబడింది. ఇవి కేవలం పూర్వకాలపు గాథలు మాత్రమే."

لَقَدْ وُعِدْنَا هٰذَا نَحْنُ وَاٰبَآؤُنَا مِنْ قَبْلُ ۙ اِنْ هٰذَآ اِلَّآ اَسَاطِيْرُ الْاَوَّلِيْنَ ﴿٦٨﴾

**69.** వారితో అను: "భూమిలో ప్రయాణం చేసి చూడండి. అపరాధుల గతి ఏమయిందో!"

قُلْ سِيْرُوْا فِي الْاَرْضِ فَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُجْرِمِيْنَ ﴿٦٩﴾

**70.** మరియు నీవు వారిగురించి దుఃఖ పడకు మరియు వారి కుట్రలకు బాధపడకు.

وَلَا تَحْزَنْ عَلَيْهِمْ وَلَا تَكُنْ فِيْ ضَيْقٍ مِّمَّا يَمْكُرُوْنَ ﴿٧٠﴾

**71.** వారంటున్నారు: "మీరు సత్యవంతులే అయితే! ఈ వాగ్దానం ఎప్పుడు పూర్తికానున్నది?"

وَيَقُوْلُوْنَ مَتٰى هٰذَا الْوَعْدُ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿٧١﴾

**72.** వారితో అను: "మీరు దేనిని (ఏ శిక్షను) గురించి తొందరపెడుతున్నారో? అందులోని కొంతభాగం బహుశా మీకు సమీపంలోనే ఉండవచ్చు![1]

قُلْ عَسٰٓى اَنْ يَّكُوْنَ رَدِفَ لَكُمْ بَعْضُ الَّذِيْ تَسْتَعْجِلُوْنَ ﴿٧٢﴾

---

మార్గదర్శకానికి (దారి తెలుసుకోవటానికి), 3) షైతాన్‌లను తరిమి కొట్టడానికి కాని అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను ఎరుగని వారు వాటి ద్వారా అగోచర జ్ఞానం (జ్యోతిష్యం) చెప్పుతామని ఇతరులను మోసగిస్తున్నారు. వారు పలికేవన్నీ మోసపు మాటలే, అబద్ధాలే (ఇబ్నె కసీ'ర్).

1. ఇది బద్ర్ యుద్ధాన్ని సూచిస్తోంది.

**73.** "మరియు నిశ్చయంగా, నీ ప్రభువు మానవులపై ఎంతో అనుగ్రహం కలవాడు, కాని వారిలో చాలామంది కృతజ్ఞతలు చూపరు."

وَإِنَّ رَبَّكَ لَذُو فَضْلٍ عَلَى النَّاسِ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَشْكُرُونَ ۝

**74.** మరియు నిశ్చయంగా, వారి హృదయాలు ఏమి దాస్తున్నాయో మరియు ఏమి వ్యక్తపరుస్తున్నాయో, నీ ప్రభువుకు బాగా తెలుసు.

وَإِنَّ رَبَّكَ لَيَعْلَمُ مَا تُكِنُّ صُدُورُهُمْ وَمَا يُعْلِنُونَ ۝

**75.** మరియు, ఆకాశంలో మరియు భూమిలో అగోచరంగా ఉన్నది. ఏదీ కూడా. స్పష్టమైన ఒక గ్రంథంలో వ్రాయబడకుండా లేదు.[1]

وَمَا مِنْ غَائِبَةٍ فِي السَّمَاءِ وَالْأَرْضِ إِلَّا فِي كِتَابٍ مُبِينٍ ۝

**76.** నిశ్చయంగా, ఈ ఖుర్ఆన్ ఇస్రాయీ'ల్ సంతతివారు విభేదిస్తూవున్న పెక్కువిషయాల వాస్తవాన్ని వారికి తెలుపుతున్నది.

إِنَّ هَٰذَا الْقُرْآنَ يَقُصُّ عَلَىٰ بَنِي إِسْرَائِيلَ أَكْثَرَ الَّذِي هُمْ فِيهِ يَخْتَلِفُونَ ۝

**77.** మరియు నిశ్చయంగా, ఇది విశ్వాసులకు మార్గదర్శిని మరియు కారుణ్యం.

وَإِنَّهُ لَهُدًى وَرَحْمَةٌ لِلْمُؤْمِنِينَ ۝

**78.** నిశ్చయంగా, నీ ప్రభువు వారి మధ్య న్యాయంగా తీర్పుచేస్తాడు ఆయన సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు.

إِنَّ رَبَّكَ يَقْضِي بَيْنَهُمْ بِحُكْمِهِ ۚ وَهُوَ الْعَزِيزُ الْعَلِيمُ ۝

**79.** కావున నీవు అల్లాహ్‌పై ఆధారపడి ఉండు. నిశ్చయంగా, నీవు స్పష్టమైన సత్యంపై ఉన్నావు.

فَتَوَكَّلْ عَلَى اللَّهِ ۖ إِنَّكَ عَلَى الْحَقِّ الْمُبِينِ ۝

**80.** నిశ్చయంగా, నీవు మృతులకు వినిపింపజేయలేవు మరియు నీవుత్రిప్పి మరలిపోయే చెవిటివారికి కూడా నీ పిలుపును వినిపింపజేయలేవు.[2]

إِنَّكَ لَا تُسْمِعُ الْمَوْتَىٰ وَلَا تُسْمِعُ الصُّمَّ الدُّعَاءَ إِذَا وَلَّوْا مُدْبِرِينَ ۝

**81.** మరియు నీవు అంధులను మార్గ

وَمَا أَنْتَ بِهَادِي الْعُمْيِ عَنْ ضَلَالَتِهِمْ

1. దీని అర్థం: లౌ'హె మ'హ్ఫూజ్.
2. ఈ ఆయత్ సత్యతిరస్కారులను గురించి చెప్పుతోంది వారి బుద్ధి సత్యాన్ని గ్రహించకున్నది కావున వారు మృతులుగా పేర్కొనబడ్డారు.

إِن تُسْمِعُ إِلَّا مَن يُؤْمِنُ بِـَٔايَٰتِنَا فَهُم مُّسْلِمُونَ ٨١

భ్రష్టత్వం నుండి తొలగించి, వారికి మార్గదర్శకత్వం చేయలేవు. మా సూచన (ఆయాత్)లను విశ్వసించి, అల్లాహ్‌కు విధేయు (ముస్లిం)లు అయ్యే వారికిమాత్రమే నీవు (నీ మాటలను) వినిపించగలవు. (1/8)

وَإِذَا وَقَعَ ٱلْقَوْلُ عَلَيْهِمْ أَخْرَجْنَا لَهُمْ دَآبَّةً مِّنَ ٱلْأَرْضِ تُكَلِّمُهُمْ أَنَّ ٱلنَّاسَ كَانُوا۟ بِـَٔايَٰتِنَا لَا يُوقِنُونَ ٨٢

**82.** * మరియు వారిని గురించిన (శిక్ష) వాగ్దానం పూర్తికానున్నప్పుడు,[1] మేము వారికొరకు భూమినుండి ఒకజంతువును బయటికి తీస్తాము[2] అది వారితో నిశ్చయంగా మానవులు మా సూచన(ఆయాత్)లను నమ్మేవారు కాదని చెబుతుంది.

وَيَوْمَ نَحْشُرُ مِن كُلِّ أُمَّةٍ فَوْجًا مِّمَّن يُكَذِّبُ بِـَٔايَٰتِنَا فَهُمْ يُوزَعُونَ ٨٣

**83.** మరియు (జ్ఞాపకముంచుకోండి) ఆ రోజు (పునరుత్థాన దినమున) మేము ప్రతి జాతివారిలో నుండి మా సూచనలను అసత్యాలని తిరస్కరించిన జన సమూహాన్ని సమీకరిస్తాము మరియు వారు (వారి పాపాల ప్రకారం) వివిధ వరుసలలో నిలబెట్టబడతారు.

حَتَّىٰٓ إِذَا جَآءُو قَالَ أَكَذَّبْتُم بِـَٔايَٰتِى وَلَمْ تُحِيطُوا۟ بِهَا عِلْمًا أَمَّاذَا كُنتُمْ تَعْمَلُونَ ٨٤

**84.** చివరకు అందరూ వచ్చిన తరువాత వారి (ప్రభువు) వారిని ప్రశ్నిస్తాడు: "ఏమీ? మీరు నా సూచనలను, మీ జ్ఞానంతో గ్రహించకుండానే వాటిని అసత్యాలని తిరస్కరించారా? ఇదిగాక మీరు ఏమి చేస్తూ ఉండేవారు?"

وَوَقَعَ ٱلْقَوْلُ عَلَيْهِم بِمَا ظَلَمُوا۟ فَهُمْ لَا يَنطِقُونَ ٨٥

**85.** మరియు వారు చేసిన దుర్మార్గం వలన వారికి చేయబడిన వాగ్దానం (శిక్ష) పూర్తి అవుతుంది, కావున వారేమీ మాట్లాడలేరు.

---

1 ఎప్పుడైతే మంచిని ఉపదేశించే వాడు మరియు చెడునుండి నిరోధించే వాడు ఎవ్వడూ ఉండడో!

2 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'పునరుత్థానదినం అంతవరకురాదు, ఎంతవరకైతే మీరు పది సంకేతాలు చూడరో' ఆ పది సంకేతాలలో ఈ జంతువు ఒకటి, ('స'హీ'హ్ ముస్లిం) మరొక 'హదీస్'లో ఉంది. అన్నిటి కంటే మొదటి సంకేతం, సూర్యుడు తూర్పునుండి గాక పడమర నుండి ఉదయించటం. ('స'హీ'హ్ ముస్లిం).

**86.** ఏమీ? వారికి తెలియదా? మేము రాత్రిని వారు విశ్రాంతి పొందటానికి మరియు పగటిని (చూడగలగటానికి) ప్రకాశవంతంగా చేశామని?[1] నిశ్చయంగా, విశ్వసించేవారికి ఇందులో ఎన్నో సూచనలున్నాయి.

أَلَمْ يَرَوْا أَنَّا جَعَلْنَا اللَّيْلَ لِيَسْكُنُوا فِيهِ
وَالنَّهَارَ مُبْصِرًا ۚ إِنَّ فِي ذَٰلِكَ لَآيَاتٍ لِقَوْمٍ
يُؤْمِنُونَ ۝

**87.** మరియు (జ్ఞాపకముంచుకోండి) బాకా ('సూర్) ఊదబడే దినమున - అల్లాహ్ కోరిన వారు తప్ప[2]- ఆకాశాలలోను మరియు భూమిలోను ఉన్నవన్నీ భయంతో కంపించిపోతాయి.[3] మరియు అన్నీ అత్యంత వినమ్రతతో ఆయన ముందు హాజరవుతాయి

وَيَوْمَ يُنْفَخُ فِي الصُّورِ فَفَزِعَ مَنْ فِي
السَّمَاوَاتِ وَمَنْ فِي الْأَرْضِ إِلَّا مَنْ شَاءَ
اللَّهُ ۚ وَكُلٌّ أَتَوْهُ دَاخِرِينَ ۝

**88.** మరియు నీవు పర్వతాలను చూసి అవి స్థిరంగా ఉన్నాయని అనుకుంటున్నావు. కాని అవి అప్పుడు మేఘాలవలే ఎగురుతూ పోతుంటాయి. ఇది అల్లాహ్ కార్యం! ఆయన ప్రతి కార్యాన్ని నేర్పుతో చేస్తాడు. నిశ్చయంగా మీరు చేసేదంతా ఆయన ఎరుగును.[4]

وَتَرَى الْجِبَالَ تَحْسَبُهَا جَامِدَةً وَهِيَ تَمُرُّ مَرَّ
السَّحَابِ ۚ صُنْعَ اللَّهِ الَّذِي أَتْقَنَ كُلَّ شَيْءٍ ۚ
إِنَّهُ خَبِيرٌ بِمَا تَفْعَلُونَ ۝

**89.** మంచి పనులు చేసి వచ్చిన వారికి, అంతకంటే మంచి (ప్రతిఫలం) ఉంటుంది. మరియు వారు ఆ దినపు మహా భీతినుండి సురక్షితంగా ఉంటారు.[5]

مَنْ جَاءَ بِالْحَسَنَةِ فَلَهُ خَيْرٌ مِنْهَا وَهُمْ مِنْ فَزَعٍ
يَوْمَئِذٍ آمِنُونَ ۝

---

1. చూడండి, 10.67 మరియు 40:61
2 ఎవరా అల్లాహ్ (సు.తా.) కోరినవారు? ఇమామ్ షౌకాని ప్రకారం: వారు దేవదూతలు, దైవ ప్రవక్తలు, అమరవీరులు (షుహదా') మరియు విశ్వాసులందరూ!
3 'సూర్, బాకా, లేక కొమ్ము, దానిని ఇస్రాఫీల్ ('అ.స.) అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో ఊదుతారు ఇది రెండుసార్లు లేక అంతకంటే ఎక్కువ సార్లు ఊదబడుతుంది మొదట ఊదబడినప్పుడు సమస్త (జీవరాసులు) భయంతో స్పృహ కోల్పోతారు. రెండవసారి ఊదబడినప్పుడు అందరూ చనిపోతారు మూడవసారి ఊదినప్పుడు అందరూ తమ గోరీలనుండి లేచివస్తారు మరికొందరి ప్రకారం నాలుగవసారి బాకా ఊదబడినప్పుడు అందరూ మైదానంలో సమీకరించబడతారు
4. చూడండి, 14.48 మరియు 20:105-107
5 చూడండి, 21:103

وَمَنْ جَآءَ بِالسَّيِّئَةِ فَكُبَّتْ وُجُوهُهُمْ فِي النَّارِ هَلْ تُجْزَوْنَ إِلَّا مَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٩٠﴾

**90.** మరియు చెడుపనులు చేసివచ్చిన వారు నరకాగ్నిలోకి బోర్లా త్రోయబడతారు. (వారితో అనబడుతుంది): "మీకు ఇవ్వబడే ప్రతిఫలం మీ కర్మలకు భిన్నంగా ఉండ గలదా?"

إِنَّمَا أُمِرْتُ أَنْ أَعْبُدَ رَبَّ هَٰذِهِ الْبَلْدَةِ الَّذِي حَرَّمَهَا وَلَهُ كُلُّ شَيْءٍ وَأُمِرْتُ أَنْ أَكُونَ مِنَ الْمُسْلِمِينَ ﴿٩١﴾

**91.** (ఓ ము'హమ్మద్! వారితో ఇలా అను): "నిశ్చయంగా, ఈ (మక్కా) నగరపు ప్రభువునే ఆరాధించాలని నాకు ఆజ్ఞ ఇవ్వ బడింది. ఆయనే! దీనిని పవిత్రక్షేత్రంగా చేశాడు.[1] మరియు ప్రతి వస్తువు ఆయనకు చెందినదే! మరియు నేను ఆయనకు విధేయుడ (ముస్లిం)నై ఉండాలని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది.

وَأَنْ أَتْلُوَا الْقُرْآنَ فَمَنِ اهْتَدَىٰ فَإِنَّمَا يَهْتَدِي لِنَفْسِهِ وَمَن ضَلَّ فَقُلْ إِنَّمَا أَنَا مِنَ الْمُنذِرِينَ ﴿٩٢﴾

**92.** మరియు ఈ ఖుర్ఆన్‌ను చదివి వినిపించాలని కూడా (ఆజ్ఞ ఇవ్వబడింది) కావున మార్గదర్శకత్వం పొందినవాడు తన మేలుకే. మార్గదర్శకత్వం పొందుతాడు. మరియు మార్గభ్రష్టుడైన వాడితో అను: "నిశ్చయంగా. నేను హెచ్చరిక చేసేవాడను మాత్రమే!"

وَقُلِ الْحَمْدُ لِلَّهِ سَيُرِيكُمْ آيَاتِهِ فَتَعْرِفُونَهَا وَمَا رَبُّكَ بِغَافِلٍ عَمَّا تَعْمَلُونَ ﴿٩٣﴾

**93.** వారితో (ఇంకా) ఇలా అను: "సర్వ స్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! త్వరలోనే ఆయన మీకు తన సూచనలను చూపుతాడు, అప్పుడు మీకు తెలుస్తుంది.[2] మరియు మీరు చేస్తున్న కార్యాలను నీ ప్రభువు ఎరుగకుండా లేడు!"

---

1 చూడండి 3:96 'హ'రమహ్' అంటే ఈ నగరంలో రక్తప్రసారం (హత్యచేయుటం, ఇతరులపై దౌర్జన్యం, అన్యాయం చేయటం, వేటాడటం, చెట్లను నరకటం, ముల్లు కూడా తెంపటం నిషేధింపబడింది. (స'హీ'హ్ బు'ఖారీ).

2. చూడండి, 41:53

## 28. సూరహ్ అల్-ఖ'స'స్

## سُورَةُ القَصَصِ

అల్-ఖ'స'స్: కథలు, వృత్తాంతాలు. ఈ పేరు **25**వ **ఆయత్**‌లో ఉంది. ఈ సూరహ్‌లో చాలా మట్టుకు మూసా ('అ.స.) గాథ ఉంది. ఇది చివరి మక్కా కాలపు సూరాహ్‌లలో ఒకటి. ఇది సూరహ్ అల్-ఇస్రా(17)కు ముందు అవతరింపజేయబడింది. ఆయత్ 85 దైవప్రవక్త (స'అస) యొక్క ప్రస్థాన సమయంలో జుహ్ఫాలో అవతరింపజేయబడింది. అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఆరాధ్యనీయుడు లేడు. ఆ నిత్యుడు, అల్లాహ్ (సు.తా.) తప్ప ప్రతిదీ నశింపనున్నది. ఇందులో **88** ఆయతులున్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1.** తా-సీన్-మీమ్.

طٰسٓمٓ ①

**2.** ఇవి స్పష్టమైన గ్రంథ సూచనలు (ఆయాత్).[1]

تِلْكَ اٰيٰتُ الْكِتٰبِ الْمُبِيْنِ ②

**3.** విశ్వసించే ప్రజల కొరకు, మేము మూసా మరియు ఫిర్'ఔన్‌ల యొక్క నిజ వృత్తాంతాన్ని నీకు వినిపిస్తున్నాము.

نَتْلُوْا عَلَيْكَ مِنْ نَّبَاِ مُوْسٰى وَفِرْعَوْنَ بِالْحَقِّ لِقَوْمٍ يُّؤْمِنُوْنَ ③

**4.** నిశ్చయంగా, ఫిర్'ఔన్ భూమి మీద అహంకారంతో ప్రవర్తిస్తూ ఉండేవాడు. మరియు అందులోని ప్రజలను వర్గాలుగా విభజించి, వారిలోని ఒక తెగ వారిని నీచపరచి వారి పుత్రులను వధిస్తూ ఉండేవాడు[2] మరియు వారి స్త్రీలను బ్రతుకనిచ్చే వాడు. నిశ్చయంగా, అతడు దౌర్జన్యపరులలోని వాడిగా ఉండేవాడు.

اِنَّ فِرْعَوْنَ عَلَا فِى الْاَرْضِ وَجَعَلَ اَهْلَهَا شِيَعًا يَّسْتَضْعِفُ طَآئِفَةً مِّنْهُمْ يُذَبِّحُ اَبْنَآءَهُمْ وَيَسْتَحْىٖ نِسَآءَهُمْ ؕ اِنَّهٗ كَانَ مِنَ الْمُفْسِدِيْنَ ④

**5.** మరియు భూమి మీద అణచివేయబడిన వారిని కనికరించాలని మరియు వారిని నాయకులుగా చేయాలని మరియు వారిని వారసులుగా చేయాలని మేము కోరాము.[3]

وَنُرِيْدُ اَنْ نَّمُنَّ عَلَى الَّذِيْنَ اسْتُضْعِفُوْا فِى الْاَرْضِ وَنَجْعَلَهُمْ اَئِمَّةً وَّنَجْعَلَهُمُ الْوٰرِثِيْنَ ⑤

---

1. చూడండి, 12:1.
2. వీరు ఇస్రాయీ'ల్ సంతతి వారు. ఫిర్'ఔన్ జాతి వారు వీరిని బానిసలుగా చేసి హింసించే వారు.
3. చూడండి, 7:137

وَنُمَكِّنَ لَهُمْ فِي الْأَرْضِ وَنُرِيَ فِرْعَوْنَ وَهَامَانَ وَجُنُودَهُمَا مِنْهُم مَّا كَانُوا يَحْذَرُونَ ۝

6. మరియు (ఇస్రాయీ'ల్ సంతతి) వారికి భూమిలో అధికారం ఒసంగాలనీ[1] మరియు ఫిర్'ఔన్, హామాన్[2] మరియు వారి సైనికులకు - దేనిని గురించైతే (ఫిర్'ఔన్ జాతి) వారు భయపడుతూ ఉండేవారో[3] - అదే వారికి చూపాలని!

وَأَوْحَيْنَا إِلَىٰ أُمِّ مُوسَىٰ أَنْ أَرْضِعِيهِ ۖ فَإِذَا خِفْتِ عَلَيْهِ فَأَلْقِيهِ فِي الْيَمِّ وَلَا تَخَافِي وَلَا تَحْزَنِي ۖ إِنَّا رَادُّوهُ إِلَيْكِ وَجَاعِلُوهُ مِنَ الْمُرْسَلِينَ ۝

7. మేము మూసా తల్లి మనస్సులో ఇలా[4] సూచించాము: "నీవు అతనికి (మూసాకు) పాలు ఇస్తూ ఉండు. కాని అతనికి ప్రమాదమున్నదని, నీవు భావిస్తే అతనిని నదిలో విడిచిపెట్టు.[5] మరియు నీవు భయపడకు మరియు దుఃఖించకు; నిశ్చయంగా మేము అతనిని నీ వద్దకు తిరిగి చేర్చుతాము మరియు అతనిని (మా) సందేశహరులలో ఒకనిగా చేస్తాము!"

فَالْتَقَطَهُ آلُ فِرْعَوْنَ لِيَكُونَ لَهُمْ عَدُوًّا وَحَزَنًا ۗ إِنَّ فِرْعَوْنَ وَهَامَانَ وَجُنُودَهُمَا كَانُوا خَاطِئِينَ ۝

8. తరువాత ఫిర్'ఔన్ కుటుంబంవారు[6] - తమకు శత్రువై, దుఃఖకారణుడవటానికి - అతనిని ఎత్తుకున్నారు. నిశ్చయంగా ఫిర్'ఔన్, హామాన్ మరియు వారి సైనికులు పాపిష్ఠులు!

وَقَالَتِ امْرَأَتُ فِرْعَوْنَ قُرَّتُ عَيْنٍ لِّي وَلَكَ ۖ لَا تَقْتُلُوهُ عَسَىٰ أَن يَنفَعَنَا أَوْ نَتَّخِذَهُ وَلَدًا وَهُمْ لَا يَشْعُرُونَ ۝

9. మరియు ఫిర్'ఔన్ భార్య (అతనితో) ఇలా అన్నది: "ఇతను నీకూ మరియు నాకూ కంటిచలువ! ఇతనిని చంపకు, బహుశా ఇతడు మనకు ఉపయోగకారి కావచ్చు! లేదా మనం ఇతనిని కుమారునిగా చేసుకోవచ్చు!"[7] కాని వారు (వాస్తవాన్ని) తెలుసుకోలేక పోయారు.

---

1. ఇక్కడ అ'ర్దున్, భూమి అంటే కనాన్ (షామ్)
2. హామాన్, ఫిర్'ఔన్ యొక్క ముఖ్య నాయకుడు చూడండి, 40:36-37
3. అంటే, ఇస్రాయీ'ల్ సంతతివారి ద్వారా తమ నాశనం కావచ్చునే ఏ భయంవల్లనైతే ఫిర్'ఔన్ జాతి వారు ఇస్రాయీ'ల్ సంతతివారి మగ సంతానాన్ని హత్య చేస్తూ ఉండేవారో - దానినే వారికి సత్యం చేసి చూపటానికి.
4. వ'హీ - అంటే ఇక్కడ ఆమె మనస్సులో ఆలోచన పుట్టించడం.
5. చూడండి, 20:39
6. అంటే ఫిర్'ఔన్ భార్య, ఇంకా చూడండి, 66:11
7. వారికి సంతానం లేనందుకు ఆమె అతనిని ('అ.స.) కుమారునిగా చేసుకోదలచింది.

**10.** మరియు మూసా తల్లి హృదయం తల్లడిల్లిపోయింది. ఆమె విశ్వసించిన వారిలో ఉండటానికి మేము, ఆమె హృదయాన్ని దృఢపరచి ఉండకపోతే, ఆమె అతనిని (మూసాను) గురించి అంతా బట్టబయలు చేసిఉండేది.

وَأَصْبَحَ فُؤَادُ أُمِّ مُوسَىٰ فَارِغًا إِن كَادَتْ لَتُبْدِي بِهِ لَوْلَا أَن رَّبَطْنَا عَلَىٰ قَلْبِهَا لِتَكُونَ مِنَ الْمُؤْمِنِينَ ۝

**11.** ఆమె, అతని (మూసా) సోదరితో[1] అన్నది: "అతని వెంటవెళ్ళు." కావున ఆమె దూరంనుండియే అతనిని గమనించసాగింది. కానీ, వారది గ్రహించలేక పోయారు. (1/4)

وَقَالَتْ لِأُخْتِهِ قُصِّيهِ فَبَصُرَتْ بِهِ عَن جُنُبٍ وَهُمْ لَا يَشْعُرُونَ ۝

**12.** * మరియు మేము అతనిని (ఇతరుల) పాలు త్రాగకుండా మొదటనే నిషేధించి ఉన్నాము. (అతని సోదరి) వారితో అన్నది: "మీ కొరకు అతనిని, (పాలిచ్చి) పోషించగల ఒక కుటుంబంవారిని నేను మీకు చూపనా? మరియు వారు అతనిని మంచిగా చూసుకొనేవారై ఉంటారు."

وَحَرَّمْنَا عَلَيْهِ الْمَرَاضِعَ مِن قَبْلُ فَقَالَتْ هَلْ أَدُلُّكُمْ عَلَىٰ أَهْلِ بَيْتٍ يَكْفُلُونَهُ لَكُمْ وَهُمْ لَهُ نَاصِحُونَ ۝

**13.** ఈ విధంగా మేము అతనిని (మూసాను) - అతని తల్లి కళ్ళు చల్లబడటానికి, ఆమె దుఃఖించకుండా ఉండటానికి మరియు అల్లాహ్ వాగ్దానం సత్యమైనదని ఆమె తెలుసుకోవటానికి తిరిగి ఆమెవద్దకు చేర్చాము కాని చాలామందికి ఇది తెలియదు.

فَرَدَدْنَاهُ إِلَىٰ أُمِّهِ كَيْ تَقَرَّ عَيْنُهَا وَلَا تَحْزَنَ وَلِتَعْلَمَ أَنَّ وَعْدَ اللَّهِ حَقٌّ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ۝

**14.** మరియు అతను (మూసా) యుక్త వయస్సుకు చేరి పరిపూర్ణుడు అయినప్పుడు, మేము అతనికి వివేకాన్ని మరియు జ్ఞానాన్ని ప్రసాదించాము. మరియు ఈ విధంగా, మేము సజ్జనులకు ప్రతిఫలాన్ని ఇస్తూ ఉంటాము.[2]

وَلَمَّا بَلَغَ أَشُدَّهُ وَاسْتَوَىٰ آتَيْنَاهُ حُكْمًا وَعِلْمًا وَكَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ۝

---

1 మూసా ('అ.స.) సోదరిపేరు మర్యమ్ బిన్తె ఇమ్రాన్ మరియు 'ఈసా ('అ.స.) తల్లిపేరు కూడా మర్యమ్ బిన్తె 'ఇమ్రాన్.

2. చూడండి, 12:22.

**15.** మరియు (ఒక రోజు) నగరవాసులు
ఏమరుపాటులో ఉన్నప్పుడు, అతను నగరంలోకి
ప్రవేశించాడు. అతను అక్కడ ఇద్దరువ్యక్తులు
పోట్లాడుకోవడం చూశాడు, వారిలో ఒకడు
అతని జాతికి చెందినవాడు, మరొకడు విరోధి
జాతికి చెందినవాడు. అతని జాతికి చెందినవాడు,
విరోధిజాతి వానికి వ్యతిరేకంగా సహాయపడమని
అతనిని (మూసాను) అర్థించాడు. మూసా అతనిని
ఒక గుద్దుగుద్దాడు. అది అతనిని
అంతమొందించింది. (అప్పుడు) అతను
(మూసా) అన్నాడు: "ఇది షై'తాన్ పనే!
నిశ్చయంగా, అతడు శత్రువు మరియు
స్పష్టంగా దారి తప్పించేవాడు."[1]

وَدَخَلَ الْمَدِينَةَ عَلَىٰ حِينِ غَفْلَةٍ مِّنْ أَهْلِهَا
فَوَجَدَ فِيهَا رَجُلَيْنِ يَقْتَتِلَانِ هَٰذَا مِن شِيعَتِهِ
وَهَٰذَا مِنْ عَدُوِّهِ ۖ فَاسْتَغَاثَهُ الَّذِي مِن شِيعَتِهِ
عَلَى الَّذِي مِنْ عَدُوِّهِ فَوَكَزَهُ مُوسَىٰ فَقَضَىٰ عَلَيْهِ ۖ
قَالَ هَٰذَا مِنْ عَمَلِ الشَّيْطَانِ ۖ إِنَّهُ عَدُوٌّ مُّضِلٌّ مُّبِينٌ ۝

**16.** (మూసా) ఇలా ప్రార్థించాడు: "ఓ నా
ప్రభూ! నాకు నేను అన్యాయం చేసుకున్నాను
కావున నన్ను క్షమించు!" (అల్లాహ్) అతనిని
క్షమించాడు నిశ్చయంగా ఆయన క్షమాశీలుడు,
అపారకరుణాప్రదాత.[2]

قَالَ رَبِّ إِنِّي ظَلَمْتُ نَفْسِي فَاغْفِرْ لِي فَغَفَرَ لَهُ ۚ
إِنَّهُ هُوَ الْغَفُورُ الرَّحِيمُ ۝

**17.** (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ!
నీవు నాకు మహోపకారం చేశావు. కావున
నేను ఇక ఎన్నటికీ నేరస్తులకు సహాయపడను!"

قَالَ رَبِّ بِمَا أَنْعَمْتَ عَلَيَّ فَلَنْ أَكُونَ ظَهِيرًا
لِّلْمُجْرِمِينَ ۝

**18.** మరుసటి రోజు ఉదయం అతను
(మూసా) భయపడుతూ అతి జాగ్రత్తగా
(ఇటూ అటూ చూస్తూ) నగరంలోకివెళ్ళాడు.
అప్పుడు అకస్మాత్తుగా అంతకు ముందు
రోజు, అతనిని సహాయానికి పిలిచిన వాడే,

فَأَصْبَحَ فِي الْمَدِينَةِ خَائِفًا يَتَرَقَّبُ فَإِذَا الَّذِي
اسْتَنصَرَهُ بِالْأَمْسِ يَسْتَصْرِخُهُ ۚ قَالَ لَهُ مُوسَىٰ
إِنَّكَ لَغَوِيٌّ مُّبِينٌ ۝

---

1 దైవప్రవక్త ప్రవచనం. 'తెగలకొరకు, తెగల పేరట కృషిచేసేవాడూ మరియు తెగలకొరకు పోరాడే వాడూ మరియు తెగలకొరకు మరణించేవాడూ మాలోనివాడుకాడు.' (అబూ దావూద్ 'జుబైర్ ఇబ్నె ముత్'ఇమ్ కథనం ఆధారంగా) దీని భావం అడుగగా అతను (స'అస) అన్నారు 'అన్యాయ విషయంలో తమ వారికి సహాయపడటం

2 ఉద్దేశ్యపూర్వకంగా చంపకున్నా, ఒక మానవుని హత్యజరిగింది. దానికి మూసా ('అ.స.) పశ్చాత్తాపపడి క్షమాపణ వేడుకుంటే, అల్లాహ్ (సు.తా.) అతనిని క్షమించాడు.

మళ్ళీ సహాయానికై అరవసాగాడు. మూసా వానితో అన్నాడు: "నిశ్చయంగా నీవు స్పష్టమైన తప్పుదారికి లాగేవాడవు!"[1]

19. ఆ తరువాత అతను తమ ఇద్దరికి విరోధిఅయిన వానిని గట్టిగా పట్టుకోబోగా, అతడు అరిచాడు: "ఓ మూసా! ఏమీ? నీవు నిన్న ఒకవ్యక్తిని చంపినట్లు నన్నుకూడా చంపదలచుకున్నావా? నీవు ఈ దేశంలో క్రూరునిగా మారి ఉండదలుచుకున్నావా? సద్వర్తనునిగా ఉండదలుచుకోలేదా?"

فَلَمَّآ أَنْ أَرَادَ أَن يَبْطِشَ بِالَّذِى هُوَ عَدُوٌّ
لَّهُمَا قَالَ يَـٰمُوسَىٰٓ أَتُرِيدُ أَن تَقْتُلَنِى كَمَا
قَتَلْتَ نَفْسًۢا بِالْأَمْسِ إِن تُرِيدُ إِلَّآ أَن تَكُونَ
جَبَّارًا فِى الْأَرْضِ وَمَا تُرِيدُ أَن تَكُونَ مِنَ
الْمُصْلِحِينَ ﴿١٩﴾

20. మరియు ఒక వ్యక్తి నగరపు ఒక వైపునుండి పరిగెత్తుకుంటూ వచ్చి ఇలా అన్నాడు: "ఓ మూసా! నాయకులందరూ కలిసి నిన్ను హత్యచేయాలని సంప్రదింపులు చేస్తున్నారు. కావున నీవు వెళ్ళిపో, నేను నిశ్చయంగా, నీ శ్రేయోభిలాషిని!"

وَجَآءَ رَجُلٌ مِّنْ أَقْصَا الْمَدِينَةِ يَسْعَىٰ قَالَ
يَـٰمُوسَىٰٓ إِنَّ الْمَلَأَ يَأْتَمِرُونَ بِكَ لِيَقْتُلُوكَ
فَاخْرُجْ إِنِّى لَكَ مِنَ النَّـٰصِحِينَ ﴿٢٠﴾

21. అప్పుడతను భయపడుతూ, అతి జాగ్రత్తగా అక్కడినుండి బయలుదేరాడు అతను ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నన్ను దుర్మార్గులనుండి కాపాడు!"

فَخَرَجَ مِنْهَا خَآئِفًا يَتَرَقَّبُ قَالَ رَبِّ نَجِّنِى مِنَ
الْقَوْمِ الظَّـٰلِمِينَ ﴿٢١﴾

22. ఆ తరువాత అతను మద్'యన్ వైపుకు బయలుదేరుతూ, ఇలా అనుకున్నాడు: "బహుశా, నా ప్రభువు నాకు సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తున్నాడు!"[2]

وَلَمَّا تَوَجَّهَ تِلْقَآءَ مَدْيَنَ قَالَ عَسَىٰ رَبِّىٓ أَن
يَهْدِيَنِى سَوَآءَ السَّبِيلِ ﴿٢٢﴾

1 ఇబ్నె 'అబ్బాస్ మరియు ముఖాతిల్(ర'ది'అన్హుమ్)ల కథనం ప్రకారం ఆ ఇస్రాయీ'ల్ వంశీయుడు సత్యతిరస్కారి.

2 మద్'యన్ అక్కడ నివసించే ప్రజల తెగపేరు. వారు అమోరైట్ (Amonte) తెగకు చెందిన 'అరబ్బులు. యూదుల సంతతితో వారికి దగ్గరి సంబంధం ఉండెను. చూడండి, 7:85 ఇబ్రాహీమ్ ('అ.స.) కుమారుడైన ఇస్'హాఖ్ ('అ.స.) యొక్క కుమారుడగు య'అఖూబ్ ('అ.స.), మరొక పేరు ఇస్రాయీ'ల్. ఆ పేరుతోనే పిలువబడే అతని పన్నెండుమంది కుమారుల సంతతి వారే ఇస్రాయీ'ల్ సంతతివారు (బనీ ఇస్రాయీ'ల్)

23. ఇక అతను మద్‌యన్‌లోని ఒక బావి వద్దకు చేరుకున్నప్పుడు; అక్కడ చాలా మంది ప్రజలు, తమ తమ పశువులకు నీరు త్రాగించటాన్ని మరియు వారికి దూరంగా ఒక ప్రక్కన ఇద్దరు స్త్రీలు తమ పశువులను ఆపుతూ ఉండటాన్ని చూశాడు. (మూసా) ఆ స్త్రీలను అడిగాడు: "మీరిద్దరి చిక్కు ఏమిటి?" వారిద్దరన్నారు: "ఈ పశువుల కాపరులంతా పోయేవరకు మేము (మా పశువులకు) నీరు త్రాపలేము మరియు మా తండ్రి చాలావృద్ధుడు."

وَلَمَّا وَرَدَ مَآءَ مَدۡيَنَ وَجَدَ عَلَيۡهِ أُمَّةً مِّنَ ٱلنَّاسِ يَسۡقُونَ وَوَجَدَ مِن دُونِهِمُ ٱمۡرَأَتَيۡنِ تَذُودَانِۖ قَالَ مَا خَطۡبُكُمَاۖ قَالَتَا لَا نَسۡقِي حَتَّىٰ يُصۡدِرَ ٱلرِّعَآءُۖ وَأَبُونَا شَيۡخٌ كَبِيرٌ ٢٣

24. అప్పుడు అతను వారిద్దరి పశువులకు నీరుత్రాపాడు. తరువాత నీడలోకి పోయి ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నీవు నాపై ఏ మేలును అవతరింపజేసినా, నేను దాని ఆవశ్యకత గలవాడనే!"

فَسَقَىٰ لَهُمَا ثُمَّ تَوَلَّىٰٓ إِلَى ٱلظِّلِّ فَقَالَ رَبِّ إِنِّي لِمَآ أَنزَلۡتَ إِلَيَّ مِنۡ خَيۡرٍ فَقِيرٌ ٢٤

25. తరువాత ఆ ఇద్దరిలో ఒకామె సిగ్గుపడుతూ మెల్లగా అతని వద్దకు వచ్చి ఇలాఅన్నది: "వాస్తవానికి నాతండ్రి - నీవు మా కొరకు (మా పశువులకు) నీరు త్రాపించి నందుకు - ప్రతిఫలమివ్వటానికి, నిన్ను పిలుస్తున్నాడు."[1] అతను, అతని వద్దకు పోయి తన వృత్తాంతాన్ని వినిపించాడు అప్పుడతను అన్నాడు: "నీవు ఏ మాత్రం భయపడకు నీవు దుర్మార్గప్రజలనుండి విముక్తి పొందావు."

فَجَآءَتۡهُ إِحۡدَىٰهُمَا تَمۡشِي عَلَى ٱسۡتِحۡيَآءٖ قَالَتۡ إِنَّ أَبِي يَدۡعُوكَ لِيَجۡزِيَكَ أَجۡرَ مَا سَقَيۡتَ لَنَاۚ فَلَمَّا جَآءَهُۥ وَقَصَّ عَلَيۡهِ ٱلۡقَصَصَ قَالَ لَا تَخَفۡۖ نَجَوۡتَ مِنَ ٱلۡقَوۡمِ ٱلظَّٰلِمِينَ ٢٥

26. వారిద్దరిలో ఒకామె ఇలా అన్నది: "నాన్నా! ఇతనిని పనికొరకు పెట్టుకో. నిశ్చయంగా, ఇలాంటి బలవంతుని మరియు

قَالَتۡ إِحۡدَىٰهُمَا يَٰٓأَبَتِ ٱسۡتَـٔۡجِرۡهُۖ إِنَّ خَيۡرَ مَنِ ٱسۡتَـٔۡجَرۡتَ ٱلۡقَوِيُّ ٱلۡأَمِينُ ٢٦

1 ఆ ఇద్దరు స్త్రీల తండ్రి పేరు ఖుర్ఆన్ పేర్కొనలేదు ఇమామ్ షౌకాని మరియు ఇతర చాలామంది వ్యాఖ్యాతలు అతని పేరు షు'ఐబ్ ('అ.స.) అని అన్నారు. ఎందుకంటే అతను మద్‌యన్ జాతి వారివైపునకే ప్రవక్తగా పంపబడి ఉండెను. కాని ఇబ్నె కసీ'ర్ అభిప్రాయం వేరుంది. అతను అంటారు: 'షు'ఐబ్ ('అ స) మరియు మూసా ('అ స) కాలాలలో చాల గడువు ఉంది కాబట్టి ఇతను షు'ఐబ్ ('అ స.) తెగకు చెందిన మరొక వ్యక్తి కావచ్చు.' అల్లాహు అలమ్.

సమ్మర్ధగిన వానిని పనికొరకు పెట్టుకోవటం ఎంతో మేలైనది.''

قال اني اريد ان انكحك احدى ابنتي هتين
على ان تاجرني ثمني حجج فان اتممت عشرا
فمن عندك وما اريد ان اشق عليك ستجدني
ان شاء الله من الصلحين ﴿٢٧﴾

**27.** (వారి తండ్రి) అన్నాడు: ''నీవు నా వద్ద ఎనిమిదిసంవత్సరాలు పనిచేస్తూ ఉండటానికి ఒప్పుకుంటే, నేను నా ఈ ఇద్దరు కుమార్తెలలో ఒకామెను నీకిచ్చి వివాహం చేయగోరుతున్నాను[1] నీవు ఒకవేళ పది సంవత్సరాలు పూర్తిచేయదలిస్తే అది నీ ఇష్టం! నేను నీకు కష్టం కలిగించదలచుకోలేదు. అల్లాహ్‌కోరితే, నీవు నన్ను సద్వర్తనునిగా పొందుతావు!''

قال ذلك بيني وبينك ايما الاجلين قضيت
فلا عدوان علي والله على ما نقول وكيل ﴿٢٨﴾

**28.** (మూసా) అన్నాడు: ''ఈ విషయం నీకూ మరియు నాకూ మధ్య నిశ్చయమే! ఈ రెండు గడువులలో నేను దేనిని పూర్తిచేసినా, నా పై ఎలాంటి ఒత్తిడి ఉండకూడదు. మరియు మన ఈ మాటలకు అల్లాహ్‌యే సాక్షి!'' (3/8)

فلما قضى موسى الاجل وسار باهله انس
من جانب الطور نارا قال لاهله امكثوا اني
انست نارا لعلي اتيكم منها بخبر او جذوة
من النار لعلكم تصطلون ﴿٢٩﴾

**29.** * ఆ తరువాత మూసా తన గడువు[2] పూర్తిచేసి, తన కుటుంబంవారిని తీసుకొని పోతుండగా, 'తూర్ పర్వతపు దిక్కులో ఒక మంటను చూశాడు (అప్పుడు) తన ఇంటి వారితో అన్నాడు: ''ఆగండి! నేను ఒక మంటను చూశాను, బహుశా! నేను అక్కడి

1 మన సాంఘిక సంప్రదాయంలో ఆడబిడ్డ (వధువు) ఇంటివారు తమ బిడ్డకొరకు వరుని (పెండ్లి కుమారుని) వారితో వివాహసంబంధం గురించి మొదట మాట ప్రారంభించటం అనుచితమైన విషయంగా భావిస్తారు. కాని అల్లాహ్ (సు.తా.) షరీయత్‌లో ఇది అనుచితం కాదు. ఒకవేళ సద్వర్తనుడు, సుశీలుడు అయిన వరుడు ఉంటే అతనితో గానీ, లేక అతని కుటుంబంవారితో గానీ, వధువు ఇంటివారు మాట్లాడితే తప్పులేదు. దైవప్రవక్త (స'అస) మరియు సహాబీల (ర'ది'అన్హుమ్)లలో కూడా ఈ ఆచారం ఉండెను.

2 ఇబ్నె 'అబ్బాస్ (ర'ది'అ) కథనం ప్రకారం అతను ఈ గడువు పది సంవత్సరాలు పూర్తిచేశారు. ఎందుకంటే మూసా ('అ.స.) వృద్ధుడైన తన భార్య తండ్రికి సహాయపడగోరారు. చూడండి, 27:7-8.

నుండి ఏదైనా మంచివార్తను తీసుకొని రావచ్చు, లేదా ఒక అగ్నికొరవినైనా! అప్పుడు మీరు దానితో చలికాచుకోవచ్చు."

فَلَمَّآ أَتَىٰهَا نُودِىَ مِن شَٰطِئِ ٱلْوَادِ ٱلْأَيْمَنِ فِى ٱلْبُقْعَةِ ٱلْمُبَٰرَكَةِ مِنَ ٱلشَّجَرَةِ أَن يَٰمُوسَىٰٓ إِنِّىٓ أَنَا ٱللَّهُ رَبُّ ٱلْعَٰلَمِينَ ﴿٣٠﴾

**30.** కాని అతను దాని (అగ్ని) వద్దకు చేరుకున్నప్పుడు,[1] ఆ లోయ కుడివైపు ఉన్న ఒక శుభవంతమైన స్థలములో ఉన్న ఒకచెట్టు నుండి: "ఓ మూసా! నిశ్చయంగా, నేనే అల్లాహ్‌ను! సర్వలోకాల ప్రభువును." అనే మాటలు వినిపించాయి.

وَأَنْ أَلْقِ عَصَاكَ ۖ فَلَمَّا رَءَاهَا تَهْتَزُّ كَأَنَّهَا جَآنٌّ وَلَّىٰ مُدْبِرًا وَلَمْ يُعَقِّبْ ۚ يَٰمُوسَىٰٓ أَقْبِلْ وَلَا تَخَفْ ۖ إِنَّكَ مِنَ ٱلْءَامِنِينَ ﴿٣١﴾

**31.** (ఇంకా ఇలా వినిపించింది): "నీ చేతికర్రను పడవేయి!" అతను (మూసా) దానిని పామువలే కదలటం చూసి వెనక్కి మరలి పరుగెత్తాడు, తిరిగికూడా చూడలేదు (తరువాత ఇలా సెలవీయబడింది): "ఓ మూసా, ముందుకురా, భయపడకు. నిశ్చయంగా నీవు సురక్షితంగా ఉన్నావు!

ٱسْلُكْ يَدَكَ فِى جَيْبِكَ تَخْرُجْ بَيْضَآءَ مِنْ غَيْرِ سُوٓءٍ وَٱضْمُمْ إِلَيْكَ جَنَاحَكَ مِنَ ٱلرَّهْبِ ۖ فَذَٰنِكَ بُرْهَٰنَانِ مِن رَّبِّكَ إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِي۟هِۦٓ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمًا فَٰسِقِينَ ﴿٣٢﴾

**32.** "నీ చేతిని నీచంకలోకి దూర్చుకో, అది ఎట్టి లోపంలేకుండా ప్రకాశిస్తూ బయటికి వస్తుంది[2] నీవు భయపడకుండా ఉండటానికి నీ చేతిని నీ ప్రక్కకు అదుముకో! ఈ రెండు నీవు ఫిర్'ఔన్ మరియు అతని నాయకులకు (చూపటానికి) నీ ప్రభువు ప్రసాదించిన నిదర్శనాలు (ఆయాత్). నిశ్చయంగా, వారు చాలా దుష్టులయిపోయారు!"

قَالَ رَبِّ إِنِّى قَتَلْتُ مِنْهُمْ نَفْسًا فَأَخَافُ أَن يَقْتُلُونِ ﴿٣٣﴾

**33.** (మూసా) అన్నాడు: "ఓ నా ప్రభూ! నేను వారి మనిషిని ఒకనిని చంపాను, కావున వారు నన్ను చంపుతారేమోనని భయపడుతున్నాను.

---

1 ఆ మంట వాస్తవానికి అల్లాహ్ (సు.తా.) దివ్యజ్యోతి. చూడండి, 19:52, 20:80

2. చూడండి, 7:108

وَأَخِي هَارُونُ هُوَ أَفْصَحُ مِنِّي لِسَانًا فَأَرْسِلْهُ مَعِيَ رِدْءًا يُصَدِّقُنِي إِنِّي أَخَافُ أَن يُكَذِّبُونِ ۝

34. "మరియు నా సోదరుడు హారూన్ మాట్లాడటంలో నాకంటే మంచి వాగ్ధాటి గలవాడు.[1] నన్ను సమర్థించటానికి అతనిని నాకు సహాయకునిగా నాతోపాటు పంపు వాస్తవానికి వారు నన్ను అసత్యవాదివని తిరస్కరిస్తారేమోనని నేను భయపడుతున్నాను!"

قَالَ سَنَشُدُّ عَضُدَكَ بِأَخِيكَ وَنَجْعَلُ لَكُمَا سُلْطَانًا فَلَا يَصِلُونَ إِلَيْكُمَا ۚ بِآيَاتِنَا ۚ أَنتُمَا وَمَنِ اتَّبَعَكُمَا الْغَالِبُونَ ۝

35. ఆయన (అల్లాహ్) అన్నారు: "మేము నీ సోదరుని ద్వారా నీ చేతులను బలపరుస్తాము. మరియు మేము మీ ఇద్దరికి విశేషశక్తి నొసంగుతాము. వారు మీ ఇద్దరికి ఏ మాత్రం హానిచేయలేరు. మా సూచనలద్వారా మీరిద్దరూ మరియు మిమ్మల్ని అనుసరించే వారు గెలుపొందుతారు."[2]

فَلَمَّا جَاءَهُم مُّوسَىٰ بِآيَاتِنَا بَيِّنَاتٍ قَالُوا مَا هَٰذَا إِلَّا سِحْرٌ مُّفْتَرًى وَمَا سَمِعْنَا بِهَٰذَا فِي آبَائِنَا الْأَوَّلِينَ ۝

36. ఆ తరువాత మూసా మా స్పష్టమైన సూచనలను తీసుకొని వారివద్దకు పోగా వారన్నారు: "ఇది కల్పితమైన మాయాజాలం మాత్రమే[3] ఇలాంటిది పూర్వీకులైన మా తండ్రితాతల కాలంలో కూడా జరిగినట్లు మేము వినలేదు."[4]

وَقَالَ مُوسَىٰ رَبِّي أَعْلَمُ بِمَن جَاءَ بِالْهُدَىٰ مِنْ عِندِهِ وَمَن تَكُونُ لَهُ عَاقِبَةُ الدَّارِ ۖ إِنَّهُ لَا يُفْلِحُ الظَّالِمُونَ ۝

37. ఇక మూసా అన్నాడు: "నా ప్రభువు తరఫునుండి ఎవడు మార్గదర్శకత్వం తీసుకొనివచ్చాడో మరియు చివరికి ఎవరి పర్యవసానం మంచిదవుతుందో ఆయనకు బాగాతెలుసు.[5] నిశ్చయంగా, దుర్మార్గులు ఎన్నడూ సాఫల్యం పొందలేరు."

---

1. చూడండి, 20:27-28 మరియు 26:12-13.
2. ఈ వాక్యం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చింది. చూడండి, 5:67, 33:39,51:21, 40:51-52
3. చూడండి, 74:24.
4 చూడండి, 38:5
5 పరలోక సాఫల్యమే నిజమైన సాఫల్యం. సత్యతిరస్కారులు ఇహలోకంలో సాఫల్యం పొంద వచ్చు. భూలోకంలో దొరికే సుఖసంతోషాలు తాత్కాలికమైనవే! వాస్తవానికి పరలోక సుఖ సంతోషాలే చిరకాలముండేవి.

38. మరియు ఫిర్'ఔన్ అన్నాడు: "ఓ నాయకులారా! నేను తప్ప మీకు మరొక ఆరాధ్యదేవుడు గలడని నాకు తెలియదు.[1] కావున ఓ హామాన్! కాల్చిన మట్టిఇటుకలతో నాకొక ఎత్తైన గోపురాన్ని నిర్మించు. దానిపై ఎక్కి నేను బహుశా, మూసా దేవుణ్ణి చూడగలనేమో! నిశ్చయంగా నేను ఇతనిని అసత్యవాదిగా భావిస్తున్నాను."

وَقَالَ فِرْعَوْنُ يَٰٓأَيُّهَا ٱلْمَلَأُ مَا عَلِمْتُ لَكُم مِّنْ إِلَٰهٍ غَيْرِى فَأَوْقِدْ لِى يَٰهَٰمَٰنُ عَلَى ٱلطِّينِ فَٱجْعَل لِّى صَرْحًا لَّعَلِّىٓ أَطَّلِعُ إِلَىٰٓ إِلَٰهِ مُوسَىٰ وَإِنِّى لَأَظُنُّهُۥ مِنَ ٱلْكَٰذِبِينَ ﴿٣٨﴾

39. మరియు, అతడు మరియు అతడి సైనికులు భూమిపై అన్యాయంగా అహంభావాన్ని ప్రదర్శించారు. మరియు నిశ్చయంగా, మా వైపుకు తాము ఎన్నడూ మరలిరారని భావించారు.

وَٱسْتَكْبَرَ هُوَ وَجُنُودُهُۥ فِى ٱلْأَرْضِ بِغَيْرِ ٱلْحَقِّ وَظَنُّوٓا۟ أَنَّهُمْ إِلَيْنَا لَا يُرْجَعُونَ ﴿٣٩﴾

40. కావున మేము అతనిని మరియు అతని సేనలను పట్టుకొని సముద్రంలోకి విసరివేశాము. ఇకచూడు, దుర్మార్గుల పర్యవసానం ఏమయిందో

فَأَخَذْنَٰهُ وَجُنُودَهُۥ فَنَبَذْنَٰهُمْ فِى ٱلْيَمِّ فَٱنظُرْ كَيْفَ كَانَ عَٰقِبَةُ ٱلظَّٰلِمِينَ ﴿٤٠﴾

41. మరియు మేము వారిని నరకం వైపునకు పిలిచే నాయకులుగా చేశాము. మరియు పునరుత్థానదినమున వారికెలాంటి సహాయం దొరకదు.

وَجَعَلْنَٰهُمْ أَئِمَّةً يَدْعُونَ إِلَى ٱلنَّارِ وَيَوْمَ ٱلْقِيَٰمَةِ لَا يُنصَرُونَ ﴿٤١﴾

42. మరియు మేము ఈ లోకంలో కూడా అభిశాపం వారిని వెంటాడేటట్లు చేశాము. మరియు పునరుత్థాన దినమున వారు తృణీకరింపబడేవారిలో చేరుతారు.

وَأَتْبَعْنَٰهُمْ فِى هَٰذِهِ ٱلدُّنْيَا لَعْنَةً وَيَوْمَ ٱلْقِيَٰمَةِ هُم مِّنَ ٱلْمَقْبُوحِينَ ﴿٤٢﴾

43. మరియు వాస్తవానికి - పూర్వతరాల వారిని నాశనంచేసిన తరువాత - మేము మానవులకు జ్ఞానవృద్ధి చేయటానికి మరియు వారికి మార్గదర్శకత్వంగా కారుణ్యంగా ఉండటానికి, మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى ٱلْكِتَٰبَ مِنۢ بَعْدِ مَآ أَهْلَكْنَا ٱلْقُرُونَ ٱلْأُولَىٰ بَصَآئِرَ لِلنَّاسِ وَهُدًى وَرَحْمَةً لَّعَلَّهُمْ يَتَذَكَّرُونَ ﴿٤٣﴾

1. చూడండి, 79:24.

لِيَكْفُرُوا بِمَا آتَيْنَاهُمْ وَلِيَتَمَتَّعُوا فَسَوْفَ يَعْلَمُونَ ﴿٦٦﴾

**66.** ఈ విధంగా మేము వారికి ప్రసాదించిన వాటికి కృతఘ్నులై (ప్రాపంచిక) భోగభాగ్యాలలో మునిగివున్న (దాని ఫలితం), వారు ముందు తెలుసుకుంటారు.

أَوَلَمْ يَرَوْا أَنَّا جَعَلْنَا حَرَمًا آمِنًا وَيُتَخَطَّفُ النَّاسُ مِنْ حَوْلِهِمْ أَفَبِالْبَاطِلِ يُؤْمِنُونَ وَبِنِعْمَةِ اللَّهِ يَكْفُرُونَ ﴿٦٧﴾

**67.** ఏమీ? వారికి తెలియదా? నిశ్చయంగా మేము 'హరమ్ (మక్కా)ను ఒక శాంతినిలయంగా నెలకొల్పామని![1] మరియు వారి చుట్టుప్రక్కల ఉన్న ప్రజలు వారినుండి లాక్కోబడుతున్నారని? అయినా వారు అసత్యాన్ని నమ్మి, అల్లాహ్ అనుగ్రహాన్ని తిరస్కరిస్తారా?

وَمَنْ أَظْلَمُ مِمَّنِ افْتَرَىٰ عَلَى اللَّهِ كَذِبًا أَوْ كَذَّبَ بِالْحَقِّ لَمَّا جَاءَهُ أَلَيْسَ فِي جَهَنَّمَ مَثْوًى لِلْكَافِرِينَ ﴿٦٨﴾

**68.** మరియు అల్లాహ్ మీద అబద్ధాలు కల్పించే వానికంటే, లేక తనవద్దకు సత్యం వచ్చినపుడు దానిని అబద్ధమని తిరస్కరించే వానికంటే, ఎక్కువ దుర్మార్గుడు ఎవడు? ఏమీ? ఇలాంటి సత్యతిరస్కారులకు నరకమే నివాసస్థలం కాదా?

وَالَّذِينَ جَاهَدُوا فِينَا لَنَهْدِيَنَّهُمْ سُبُلَنَا وَإِنَّ اللَّهَ لَمَعَ الْمُحْسِنِينَ ﴿٦٩﴾

**69.** మరియు ఎవరైతే మా కొరకు హృదయపూర్వకంగా పాటుపడతారో, వారికి మేము మా మార్గాల వైపునకు మార్గదర్శకత్వం చేస్తాము. మరియు నిశ్చయంగా, అల్లాహ్ సజ్జనులకు తోడుగా ఉంటాడు. (1/8)

స్వీకరిస్తాను" అని అనుకుంటాడు. అదేవిధంగా జరుగుతుంది అతడు (ర'ది'అ) ఇస్లాం స్వీకరించి ఇస్లాం ప్రచారంలో చాలా పాటుపడ్డారు. (ఇబ్నె కసీ'ర్)

1. చూడండి, 28:57

## 30. సూరహ్ అర్ రూమ్ سُورَةُ الرُّومِ

అర్ రూమ్: బైజాంతీన్ (Eastern Roman Empire / The Byzantine / Constantinople) అంటే రోమన్ సామ్రాజ్యం. వీరు గ్రంథ ప్రజలు (క్రైస్తవులు). పర్షియన్‌లు అగ్ని పూజారులు. ఆ కాలంలో ఈ రెండే పెద్ద సామ్రాజ్యాలు ఉండేవి. ఈ సూరహ్ మధ్య మక్కా కాలంలో, ప్రస్థానం (హిజ్రత్) కంటే 6-7 సంవత్సరాలకు ముందు (క్రీ.శ. 615-616)లలో అవతరింపజేయబడింది. ఇందులో **60 ఆయతులు** ఉన్నాయి. ఇలాంటి నాలుగు సూరాహ్‌ల వరుసలో ఇది రెండవది (29-32). ఈ నాలుగు సూరాహ్‌లు, అలిఫ్-లామ్-మీమ్, అక్షరాలతో ప్రారంభమవుతున్నాయి. క్రైస్తవ రాజులైన రోమన్‌లు, పర్షియన్‌లకు జేరూసలం మరియు ఇతర భాగాలు కోల్పోతారు. పర్షియన్‌లంటే ఇష్టపడే మక్కా ముష్రికులు దీనికి సంతోషపడి దైవప్రవక్త (స'అస)ను మరియు అతని తోటి ముస్లింలను ఎగతాళిచేస్తారు. అప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడుతుంది. అల్లాహ్ (సు.తా.) వాగ్దానం ప్రకారం 7 సంవత్సరాలలోనే రోమన్‌లు తిరిగి జేరూసలంను తీసుకుంటారు. రోమన్ చక్రవర్తి హెరాకల్ (Heraclius) పర్షియన్‌లను ఓడించి వారిని ఏసియామైనర్ నుండి పారద్రోలుతాడు. చివరకు క్రీ. శకం 626లో పర్షియన్ సామ్రాజ్యం పూర్తిగా నిర్మూలించబడుతుంది. రోమన్‌ల ఈ విజయం ఖుర్ఆన్‌లో చెప్పబడిన దాన్ని సత్యపరుస్తుంది.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓ ۝١

**1.** * అలిఫ్-లామ్-మీమ్.

غُلِبَتِ الرُّومُ ۝٢

**2.** రోమన్‌లు పరాజితులయ్యారు;

فِيٓ أَدْنَى الْأَرْضِ وَهُم مِّنۢ بَعْدِ غَلَبِهِمْ سَيَغْلِبُونَ ۝٣

**3.** తమ పొరుగు భూభాగంలోనే! మరియు వారు తమ ఈ పరాజయం తరువాత, తిరిగి విజేతలు కాగలరు[1] -

فِي بِضْعِ سِنِينَ ۗ لِلَّهِ الْأَمْرُ مِن قَبْلُ وَمِنۢ بَعْدُ ۚ وَيَوْمَئِذٍ يَفْرَحُ الْمُؤْمِنُونَ ۝٤

**4.** (రాబోయే) కొన్ని[2] సంవత్సరాలలోనే. మొదటనయినా, తరువాతనయినా నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌దే మరియు ఆరోజు విశ్వాసులు సంతోషపడతారు;

---

**1.** పొరుగు నేల అంటే షామ్ మరియు ఫలస్తీన్.

**2.** బి'దఇన్: అంటే, 3 నుండి 10 అని అర్థం.

5 అల్లాహ్ ప్రసాదించిన సహాయానికి.[1] ఆయన తనకు ఇష్టమైనవారికి సహాయం చేస్తాడు. మరియు ఆయనే సర్వశక్తి మంతుడు, అపార కరుణాప్రదాత.

بِنَصْرِ اللَّهِ ۚ يَنصُرُ مَن يَشَاءُ ۖ
وَهُوَ الْعَزِيزُ الرَّحِيمُ ۝٥

6. మరియు (ఇది) అల్లాహ్ చేసిన వాగ్దానం అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు, కానీ వాస్తవానికి చాలామందికి ఇది తెలియదు.[2]

وَعْدَ اللَّهِ ۖ لَا يُخْلِفُ اللَّهُ وَعْدَهُ وَلَٰكِنَّ أَكْثَرَ
النَّاسِ لَا يَعْلَمُونَ ۝٦

7. వారికి ఇహలోక జీవితపు బాహ్యరూపం మాత్రమే తెలుసు మరియు వారు పరలోకాన్ని గురించి ఏమరుపాటులో పడిఉన్నారు.

يَعْلَمُونَ ظَاهِرًا مِّنَ الْحَيَاةِ الدُّنْيَا وَهُمْ عَنِ
الْآخِرَةِ هُمْ غَافِلُونَ ۝٧

8. ఏమీ? వారు తమను గురించి తాము ఎన్నడూ ఆలోచించలేదా? ఆకాశాలనూ భూమినీ మరియు వాటిమధ్య ఉన్నదంతా, అల్లాహ్ సత్యంతో ఒక నిర్ణీతగడువు కొరకు మాత్రమే సృష్టించాడని? అయినా నిశ్చయంగా ప్రజలలో చాలా మంది తమ ప్రభువును దర్శించ వలసివున్న వాస్తవాన్ని తిరస్కరిస్తున్నారు.

أَوَلَمْ يَتَفَكَّرُوا فِي أَنفُسِهِم ۗ مَّا خَلَقَ اللَّهُ السَّمَاوَاتِ
وَالْأَرْضَ وَمَا بَيْنَهُمَا إِلَّا بِالْحَقِّ وَأَجَلٍ مُّسَمًّى ۗ
وَإِنَّ كَثِيرًا مِّنَ النَّاسِ بِلِقَاءِ رَبِّهِمْ لَكَافِرُونَ ۝٨

9. ఏమీ? వీరు భూమిపై ప్రయాణం చేయలేదా? వీరి పూర్వీకుల గతి ఏమయిందో చూడటానికి? వారు, వీరికంటే ఎక్కువ బలవంతులుగా ఉండేవారు మరియు వారు భూమిని బాగా దున్నేవారు, సేద్యం చేసేవారు మరియు *దానిపై, వీరి కట్టడాల కంటే ఎక్కువ కట్టడాలు కట్టారు*[3] మరియు వారి వద్దకు వారి సందేశహరులు, స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చారు. అల్లాహ్ వారికెలాంటి అన్యాయం

أَوَلَمْ يَسِيرُوا فِي الْأَرْضِ فَيَنظُرُوا كَيْفَ كَانَ
عَاقِبَةُ الَّذِينَ مِن قَبْلِهِمْ ۚ كَانُوا أَشَدَّ مِنْهُمْ
قُوَّةً وَأَثَارُوا الْأَرْضَ وَعَمَرُوهَا أَكْثَرَ مِمَّا
عَمَرُوهَا وَجَاءَتْهُمْ رُسُلُهُم بِالْبَيِّنَاتِ ۖ فَمَا كَانَ اللَّهُ
لِيَظْلِمَهُمْ وَلَٰكِن كَانُوا أَنفُسَهُمْ يَظْلِمُونَ ۝٩

---

1 ఇది దాదాపు ఎనిమిది సంవత్సరాల తరువాత 2 హిజ్రీలో (622 క్రీస్తు శకంలో) కాబోయే బద్ర్ యుద్ధం గురించి చెప్పబడుతోంది.

2 ఇది రోమన్‌లు తిరిగి విజేతలౌతారన్న వాగ్దానం. అది పూర్తిఅయింది.

3 వంకర అక్షరాలలో ఉన్నవాక్యం నోబుల్ ఖుర్ఆన్‌లో ఈ విధంగా వ్యాఖ్యానించబడింది. "వారు దానిని వీరికంటే ఎక్కువ సంఖ్యలో వసింపజేశారు."

చేయలేదు, కాని వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

**10.** చివరకు చెడు కార్యాలు చేసినవారి ముగింపు చెడుగానే జరిగింది. ఎందుకంటే, వారు అల్లాహ్ సూచనలను అబద్ధాలని నిరాకరించేవారు వాటిని గురించి ఎగతాళి చేసేవారు.

ثُمَّ كَانَ عَاقِبَةَ الَّذِينَ أَسَاءُوا السُّوٓأَىٰٓ أَن كَذَّبُوا بِـَٔايَٰتِ اللَّهِ وَكَانُوا بِهَا يَسْتَهْزِءُونَ ﴿١٠﴾

**11.** అల్లాహ్‌యే సృష్టిని ప్రారంభిస్తాడు, తరువాత దానిని తిరిగి ఉనికి(పూర్వస్థితి)లోకి తెస్తాడు, ఆ తరువాత మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు.

اللَّهُ يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ ثُمَّ إِلَيْهِ تُرْجَعُونَ ﴿١١﴾

**12.** మరియు ఆ ఘడియ (పునరుత్థానం) ఆసన్నమైన రోజు, అపరాధులందరూ నిరాశచెందుతారు.

وَيَوْمَ تَقُومُ السَّاعَةُ يُبْلِسُ الْمُجْرِمُونَ ﴿١٢﴾

**13.** మరియు వారు అల్లాహ్‌కు భాగస్వాములుగా కల్పించిన వారెవ్వరూ వారి సిఫారసు చేయజాలరు. మరియు వారు తాము కల్పించుకున్న భాగస్వాములను తిరస్కరిస్తారు.

وَلَمْ يَكُن لَّهُم مِّن شُرَكَآئِهِمْ شُفَعَٰٓؤُا وَكَانُوا بِشُرَكَآئِهِمْ كَٰفِرِينَ ﴿١٣﴾

**14.** మరియు ఆ ఘడియ (పునరుత్థానం) ఆసన్నమైన రోజు - ఆ రోజు వారు (ప్రజలు) - వేర్వేరు వర్గాలలో విభజింపబడతారు.

وَيَوْمَ تَقُومُ السَّاعَةُ يَوْمَئِذٍ يَتَفَرَّقُونَ ﴿١٤﴾

**15.** అప్పుడు ఎవరైతే, విశ్వసించి, సత్కార్యాలు చేసి ఉంటారో, వారు ఉద్యాన వనంలో ఆనందంగా ఉంచబడతారు

فَأَمَّا الَّذِينَ ءَامَنُوا وَعَمِلُوا الصَّٰلِحَٰتِ فَهُمْ فِى رَوْضَةٍ يُحْبَرُونَ ﴿١٥﴾

**16.** మరియు ఎవరైతే సత్యతిరస్కారులై మా సూచనలను మరియు పరలోక సమావేశాన్ని తిరస్కరించారో, అలాంటి వారు శిక్షకొరకు హాజరు చేయబడతారు.[1]

وَأَمَّا الَّذِينَ كَفَرُوا وَكَذَّبُوا بِـَٔايَٰتِنَا وَلِقَآئِ الْءَاخِرَةِ فَأُولَٰٓئِكَ فِى الْعَذَابِ مُحْضَرُونَ ﴿١٦﴾

**17.** కావున, మీరు సాయంత్రము వేళ మరియు ఉదయం పూట అల్లాహ్ పవిత్రతను

فَسُبْحَٰنَ اللَّهِ حِينَ تُمْسُونَ وَحِينَ تُصْبِحُونَ ﴿١٧﴾

---

**1.** చూడండి. 7:147

కొనియాడండి.

وَلَهُ الْحَمْدُ فِي السَّمٰوٰتِ وَالْأَرْضِ وَعَشِيًّا وَحِينَ تُظْهِرُونَ ۝

**18.** మరియు ఆకాశాలలోనూ మరియు భూమిలోనూ సర్వస్తోత్రాలు ఆయన (అల్లాహ్) కే మరియు సంధ్యా కాలంలోనూ మరియు మధ్యాహ్న కాలంలోనూ (స్తోత్రాలు ఆయనకే)![1]

يُخْرِجُ الْحَيَّ مِنَ الْمَيِّتِ وَيُخْرِجُ الْمَيِّتَ مِنَ الْحَيِّ وَيُحْيِ الْأَرْضَ بَعْدَ مَوْتِهَا ۚ وَكَذٰلِكَ تُخْرَجُونَ ۝

**19.** ఆయన సజీవిని నిర్జీవినుండి తీస్తాడు. మరియు నిర్జీవిని సజీవినుండి తీస్తాడు. మరియు ఆయన భూమి మృతిచెందిన తరువాత దానికి ప్రాణంపోస్తాడు. ఇదేవిధంగా మీరుకూడా (గోరీలనుండి) వెలికితీయబడతారు.

وَمِنْ اٰيٰتِهِ أَنْ خَلَقَكُمْ مِنْ تُرَابٍ ثُمَّ إِذَا أَنْتُمْ بَشَرٌ تَنْتَشِرُونَ ۝

**20.** మరియు ఆయన సూచనలలో ఒకటి మిమ్మల్ని మట్టినుండి సృష్టించటం.[2] ఆ తరువాత మీరు మానవులుగా (భూమిలో) వ్యాపిస్తున్నారు!

وَمِنْ اٰيٰتِهِ أَنْ خَلَقَ لَكُمْ مِنْ أَنْفُسِكُمْ أَزْوَاجًا لِتَسْكُنُوا إِلَيْهَا وَجَعَلَ بَيْنَكُمْ مَوَدَّةً وَرَحْمَةً ۚ إِنَّ فِي ذٰلِكَ لَاٰيٰتٍ لِقَوْمٍ يَتَفَكَّرُونَ ۝

**21.** మరియు ఆయన సూచనలలో; ఆయన మీ కొరకు మీ జాతి నుండియే - మీరు వారివద్ద సౌఖ్యం పొందటానికి - మీ సహవాసు (అ'జ్వాజ్)లను పుట్టించి, మీ మధ్య ప్రేమను మరియు కారుణ్యాన్ని కలిగించడం. నిశ్చయంగా, ఇందులో ఆలోచించే వారికి ఎన్నో సూచనలున్నాయి.

وَمِنْ اٰيٰتِهِ خَلْقُ السَّمٰوٰتِ وَالْأَرْضِ وَاخْتِلَافُ أَلْسِنَتِكُمْ وَأَلْوَانِكُمْ ۚ إِنَّ فِي ذٰلِكَ لَاٰيٰتٍ لِلْعٰلِمِينَ ۝

**22.** మరియు ఆయన సూచనలలో ఆయన ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించడం; మరియు మీ భాషలలో మరియు మీ రంగులలో ఉన్న విభేదాలు కూడా ఉన్నాయి. నిశ్చయంగా, ఇందులో జ్ఞానులకు ఎన్నో

---

1 ఈ రెండు ఆయతులలో ప్రతి దినపు ఐదు నమా'జుల ప్రస్తావన ఉంది. తుమ్సూన అంటే మ'గ్రిబ్ మరియు ఇషా నమా'జులు. తుస్'బి'హూన అంటే ఫ'జ్ర్ నమా'జు మరియు 'అషియ్యన్ - 'అస్ర్ నమా'జు, తు''జ్'హిరూన్ - ''జుహ్ర్ నమా'జు అని అర్థం (ఫ'త్హ్ అల్-ఖదీర్). ఇంకా చూడండి, 11:114, 17:78 మరియు 20:130

2. చూడండి, 3:59, 23:12 మరియు ఇతరచోట్లలో కూడా

సూచనలున్నాయి.

23. మరియు ఆయన సూచనలలో, మీరు రాత్రిపూట మరియు పగటిపూట, నిద్ర పోవటం మరియు మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించడం కూడా ఉన్నాయి. నిశ్చయంగా, ఇందులో శ్రద్ధతో వినేవారికి ఎన్నో సూచనలున్నాయి.

ومن ءايته منامكم باليل والنهار وابتغاؤكم من فضله إن في ذلك لأيت لقوم يسمعون ٢٣

24. మరియు ఆయన సూచనలలో, ఆయన మీకు మెరుపును చూపించి, భయాన్ని మరియు ఆశను కలుగజేయటం;[1] మరియు ఆకాశం నుండి నీటిని కురిపించి దానితో నిర్జీవిఅయిన భూమికి ప్రాణం పోయటంకూడా ఉన్నాయి. నిశ్చయంగా, ఇందులో బుద్ధిమంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి.

ومن ءايته يريكم البرق خوفا وطمعا وينزل من السماء ماء فيحي به الأرض بعد موتها إن في ذلك لأيت لقوم يعقلون ٢٤

25. మరియు ఆయన సూచనలలో, ఆయన ఆజ్ఞతో భూమ్యాకాశాలు నిలకడ కలిగి ఉండటం.[2] ఆ తరువాత ఆయన మిమ్మల్ని ఒక్క పిలుపు పిలువగానే మీరంతా భూమినుండి లేచి ఒకేసారి బయటికి రావటం కూడా ఉన్నాయి.

ومن ءايته أن تقوم السماء والأرض بأمره ثم إذا دعاكم دعوة من الأرض إذا أنتم تخرجون ٢٥

26. మరియు ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సమస్తమూ ఆయనదే. అన్నీ ఆయనకే ఆజ్ఞావర్తనులై ఉంటాయి.

وله من في السموت والأرض كل له قنتون ٢٦

27. మరియు ఆయనే సృష్టిని ఆరంభించిన వాడు, ఆ తరువాత దానిని తిరిగి ఉనికిలోకి తెచ్చేవాడు.[3] ఇది ఆయనకు ఎంతో సులభమైనది. భూమ్యాకాశాలలో ఆయన

وهو الذي يبدؤا الخلق ثم يعيده وهو أهون عليه وله المثل الأعلى في السموت والأرض وهو العزيز الحكيم ٢٧

1. వర్షం కురువవచ్చునే ఆశ. చూడండి, 13:12.
2. చూడండి, 13:2
3. చూడండి, 10:4.

సామ్యమే సర్వోన్నతమైనది.[1] ఆయనే సర్వశక్తి మంతుడు, మహా వివేచనాపరుడు.

ضَرَبَ لَكُم مَّثَلًا مِّنْ أَنفُسِكُمْ ۖ هَل لَّكُم مِّن
مَّا مَلَكَتْ أَيْمَانُكُم مِّن شُرَكَاءَ فِي مَا
رَزَقْنَاكُمْ فَأَنتُمْ فِيهِ سَوَاءٌ تَخَافُونَهُمْ
كَخِيفَتِكُمْ أَنفُسَكُمْ ۚ كَذَٰلِكَ نُفَصِّلُ الْآيَاتِ لِقَوْمٍ
يَعْقِلُونَ ﴿٢٨﴾

**28.** ఆయన, స్వయంగా మీకే చెందిన ఒక ఉపమానాన్ని మీకు తెలుపుతున్నాడు. ఏమీ? మేము మీకు జీవనోపాధిగా సమకూర్చిన దానిలో మీ బానిసలు మీతోపాటు సరిసమానులుగా, భాగస్వాములు కాగలరా? మీరు పరస్పరం ఒకరిపట్ల నొకరు భీతికలిగి ఉన్నట్లు వారిపట్ల కూడా భీతి కలిగిఉంటారా? ఈవిధంగా మేము బుద్ధిమంతులకు మా సూచనలను వివరిస్తూ ఉంటాము.[2]

بَلِ اتَّبَعَ الَّذِينَ ظَلَمُوا أَهْوَاءَهُم بِغَيْرِ عِلْمٍ ۖ فَمَن
يَهْدِي مَنْ أَضَلَّ اللَّهُ ۖ وَمَا لَهُم مِّن نَّاصِرِينَ ﴿٢٩﴾

**29.** కాని దుర్మార్గులైనటువంటి వారు, తెలివిలేనిదే, తమ కోరికలను అనుసరిస్తారు అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదిలిన వ్యక్తికి మార్గదర్శకత్వం ఎవడు చేయగలడు?[3] మరియు వారికి సహాయపడే వారు ఎవ్వరూ ఉండరు.

---

1 చూడండి, 42:11.

2 చూడండి, 16:75-76 ఇటువంటి సామెతలకు మానవులు. తమతోటి మానవులైన బానిసలను తమతో పాటు సమానులుగా స్వీకరించలేరు అయితే అల్లాహ్ (సు.తా.) సర్వసృష్టికర్త తాను సృష్టించిన దానిని తనకు సమానంగా ఏ విధంగా స్వీకరించగలడు అయన(సు.తా.)ను వదలి, ఆయన పుట్టించిన వాటిని ఆరాధించటం ఎలా క్షమించగలడు. అందుకే ఆయన ఖుర్ఆన్‌లో వ్యక్తం చేశాడు షిర్క్ (అల్లాహ్‌కు సాటికల్పించడం) అల్లాహ్ (సు.తా.) ఎన్నటికీ క్షమించడు

3 ఎందుకంటే అల్లాహ్ (సు.తా.) తరఫునుండి వారికే మార్గదర్శకత్వం లభిస్తుంది, ఎవరైతే మార్గదర్శకత్వాన్ని అపేక్షిస్తారో! ఇక ఎవరైతే హృదయపూర్వకంగా అల్లాహ్ (సు.తా.) మార్గదర్శకత్వాన్ని అపేక్షించరో ఆయన వారిని మార్గభ్రష్టత్వంలో వదులుతాడు ఇదే సున్నతుల్లాహ్ అల్లాహ్ (సు.తా.) సంప్రదాయం. ఈ విషయం ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు విశదీకరించబడింది. అల్లాహ్ (సు.తా.) మానవులకు మరియు జిన్నాతులకు మంచి చెడుల మధ్య విచక్షణా జ్ఞానాన్నొసంగి; విశ్వసించి, మంచి పనులు చేసేవారికి స్వర్గం మరియు చెడుదారి పట్టేవారికి నరకం. అని వ్యక్తంచేశాడు. మరియు ప్రతి యుగం వారికి, అల్లాహ్(సు.తా.)ను మాత్రమే ఆరాధించమని మరియు మంచిని చేయుమని ఆదేశించటానికి, చెడునుండి నివారించటానికి మార్గదర్శకులుగా ప్రవక్తలను పంపి, వారి వద్దకు దివ్యజ్ఞానం (వహీ) పంపుతూ వచ్చాడు. చూడండి, 14:4 మరియు 2:7

**30.** కావున నీవు నీ ముఖాన్ని, ఏకాగ్ర చిత్తంతో, సత్యధర్మం (ఇస్లాం) దిశలో స్థిరంగా నిలుపు. అల్లాహ్ మానవులను ఏ స్వభావంతో పుట్టించాడో, ఆ స్వభావంపైననే వారు ఉంటారు.[1] అల్లాహ్ సృష్టి స్వభావాన్ని (ఎవ్వరూ) మార్చలేరు. ఇదే సరైన ధర్మం. కాని చాలామందికి ఇది తెలియదు. (1/4)

فَأَقِمْ وَجْهَكَ لِلدِّينِ حَنِيفًا ۚ فِطْرَتَ اللَّهِ الَّتِي فَطَرَ النَّاسَ عَلَيْهَا ۚ لَا تَبْدِيلَ لِخَلْقِ اللَّهِ ۚ ذَٰلِكَ الدِّينُ الْقَيِّمُ وَلَٰكِنَّ أَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُونَ ﴿٣٠﴾

**31.** * (ఎల్లప్పుడు) మీరు అయన వైపునకే పశ్చాత్తాపంతో మరలుతూ ఉండండి మరియు ఆయనయందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నమా'జ్‌ను స్థాపించండి. మరియు ఆయన (అల్లాహ్)కు సాటి (భాగస్వాములు) కల్పించే వారిలో చేరిపోకండి;

مُنِيبِينَ إِلَيْهِ وَاتَّقُوهُ وَأَقِيمُوا الصَّلَاةَ وَلَا تَكُونُوا مِنَ الْمُشْرِكِينَ ﴿٣١﴾

**32.** వారిలో ఎవరైతే, తమ ధర్మాన్ని విభజించి వేర్వేరు తెగలుగా చేసుకున్నారో, ప్రతివర్గం వారు తమ వద్దనున్న దాని (సిద్ధాంతం)తోనే సంతోషపడుతున్నారు.[2]

مِنَ الَّذِينَ فَرَّقُوا دِينَهُمْ وَكَانُوا شِيَعًا ۖ كُلُّ حِزْبٍ بِمَا لَدَيْهِمْ فَرِحُونَ ﴿٣٢﴾

**33.** మరియు మానవులకు ఆపద వచ్చినపుడు, వారు తమ ప్రభువు వైపునకు పశ్చాత్తాపంతో మరలి ఆయనను వేడుకుంటారు. ఆ తరువాత ఆయన కారుణ్యం నుండి కొంత వారికి రుచిచూపినప్పుడు, వారిలో కొందరు

وَإِذَا مَسَّ النَّاسَ ضُرٌّ دَعَوْا رَبَّهُمْ مُنِيبِينَ إِلَيْهِ ثُمَّ إِذَا أَذَاقَهُمْ مِنْهُ رَحْمَةً إِذَا فَرِيقٌ مِنْهُمْ بِرَبِّهِمْ يُشْرِكُونَ ﴿٣٣﴾

---

1 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ప్రతివ్యక్తి పుట్టుకతో స్వాభావికంగా అల్లాహ్ (సు.తా.)కు విధేయుడు (ముస్లిం) అయి ఉంటాడు. కానీ ముస్లిమేతరులైన అతని తల్లిదండ్రులు అతనిని యూదుడు, క్రైస్తవుడు, మజూసీ (లేక ఇతర మతస్థుడి)గా చేస్తారు.' ('స'హీ'హ్ బు'ఖారీ మరియు 'స'హీ'హ్ ముస్లిం).

2 అంటే ప్రతి ధర్మం, తెగ లేక వర్గం వారు తాము అనుసరించే దానితోనే సంతుష్టులై ఉంటారు మరియు వారివద్ద దానిని సమర్థించే వాదాలు కూడా ఉంటాయి. వాస్తవానికి సత్యం మీద ఒకే ఒక్క ధర్మం, తెగ ఉండగలదు. ఆ ధర్మమే అల్లాహ్ (సు.తా.) మార్గదర్శకత్వం చేసిన, ప్రవక్తలందరూ మరియు చివరి ప్రవక్త ము'హమ్మద్ ('స'అస) కూడా అనుసరించి, బోధించిన ధర్మం ఇస్లాం, మహాప్రవక్త ('స'అస) మరియు అతని అనుచరు(ర'ది.'అన్హుమ్)లు అనుసరించిన ధర్మం. ఇంకా చూడండి, 6:159, 21:92-93 మరియు 23:52-53.

తమ ప్రభువుకు సాటి (భాగస్వాములను) కల్పిస్తారు,[1]

لِيَكْفُرُوا بِمَا آتَيْنَاهُمْ ۚ فَتَمَتَّعُوا فَسَوْفَ تَعْلَمُونَ ﴿٣٤﴾

**34.** మేము వారికి ప్రసాదించిన దానికి (అనుగ్రహాలకు) కృతఘ్నత చూపటానికి (వారు అలా చేస్తారు). సరే! మీరు కొంతకాలం సుఖసంతోషాలు అనుభవించండి, త్వరలోనే మీరు (మీ ముగింపును) తెలుసుకుంటారు.

أَمْ أَنزَلْنَا عَلَيْهِمْ سُلْطَانًا فَهُوَ يَتَكَلَّمُ بِمَا كَانُوا بِهِ
يُشْرِكُونَ ﴿٣٥﴾

**35.** లేక మేము వారిపై ఏదైనా ప్రమాణాన్ని[2] అవతరింపజేశామా, అది వారు ఆయనకు కల్పించే భాగస్వాములను గురించి పలుకటానికి?[3]

وَإِذَا أَذَقْنَا النَّاسَ رَحْمَةً فَرِحُوا بِهَا ۖ وَإِن تُصِبْهُمْ
سَيِّئَةٌ بِمَا قَدَّمَتْ أَيْدِيهِمْ إِذَا هُمْ يَقْنَطُونَ ﴿٣٦﴾

**36.** మరియు మేము మానవులకు కారుణ్యపు రుచి చూపినప్పుడు వారు దానితో చాలా సంతోషపడతారు. కాని వారు తమ చేతులారా చేసుకున్న కర్మల ఫలితంగా[4] వారికేదైనా కీడుకలిగితే నిరాశచెందుతారు.

أَوَلَمْ يَرَوْا أَنَّ اللَّهَ يَبْسُطُ الرِّزْقَ لِمَن يَشَاءُ
وَيَقْدِرُ ۚ إِنَّ فِي ذَٰلِكَ لَآيَاتٍ لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿٣٧﴾

**37.** ఏమీ? వారికి తెలియదా? అల్లాహ్ తాను కోరిన వారికి జీవనోపాధిని పుష్కలంగా ఇస్తాడని మరియు (తాను కోరినవారికి) మితంగా ఇస్తాడని? నిశ్చయంగా, ఇందులో విశ్వసించేవారికి ఎన్నో సూచనలున్నాయి.

فَآتِ ذَا الْقُرْبَىٰ حَقَّهُ وَالْمِسْكِينَ وَابْنَ
السَّبِيلِ ۚ ذَٰلِكَ خَيْرٌ لِّلَّذِينَ يُرِيدُونَ وَجْهَ اللَّهِ

**38.** కావున నీవు నీ బంధువుకు అతని హక్కు ఇవ్వు మరియు యాచించని పేదవానికి మరియు బాటసారికి (కూడా).[5] ఇది అల్లాహ్

---

1. చూడండి, 16:54.
2. సుల్తానున్: అంటే ఇక్కడ దివ్యజ్ఞానం వ'హీ అని అర్థం
3. చూడండి, 35:40.
4. చూడండి, 4:79
5. చూడండి, 17:26 బంధువులకు, పేదవారికి మరియు బాటసారులకు మీరు ఇచ్చేది వారిపై చేసిన అనుగ్రహం కాదు మీరు వారిహక్కు చెల్లిస్తున్నారు. పేదవాడైన దగ్గరి బంధువుకు ఇవ్వటం వల్ల రెండింతలు పుణ్యం దొరుకుతుంది ఒకటి నీవు నీ దగ్గరివానికి ఇచ్చినందుకు,

وَأُولَٰئِكَ هُمُ الْمُفْلِحُونَ ﴿٣٨﴾

ప్రసన్నతను కోరే వారికి ఎంతో ఉత్తమమైనది మరియు ఇలాంటి వారే సాఫల్యము పొందేవారు.

وَمَا آتَيْتُم مِّن رِّبًا لِّيَرْبُوَ فِي أَمْوَالِ النَّاسِ فَلَا يَرْبُو عِندَ اللَّهِ ۖ وَمَا آتَيْتُم مِّن زَكَاةٍ تُرِيدُونَ وَجْهَ اللَّهِ فَأُولَٰئِكَ هُمُ الْمُضْعِفُونَ ﴿٣٩﴾

**39.** మరియు మీరు ప్రజలకు రిబా[1] (వడ్డీమీద డబ్బు - కానుకలు) ఇచ్చి దానిద్వార వారి సంపదనుండి వృద్ధి పొందాలని - ఇచ్చే ధనం, అల్లాహ్ దృష్టిలో ఏ మాత్రం వృద్ధిపొందదు. మరియు మీరు అల్లాహ్ ప్రసన్నతను పొందే ఉద్దేశంతో ఏదైనా దానం ('జకాత్) చేస్తే అలాంటి వారి (సంపద) ఎన్నోరెట్లు అధికమవుతుంది.

اللَّهُ الَّذِي خَلَقَكُمْ ثُمَّ رَزَقَكُمْ ثُمَّ يُمِيتُكُمْ ثُمَّ يُحْيِيكُمْ ۖ هَلْ مِن شُرَكَائِكُم مَّن يَفْعَلُ مِن ذَٰلِكُم مِّن شَيْءٍ ۚ سُبْحَانَهُ وَتَعَالَىٰ عَمَّا يُشْرِكُونَ ﴿٤٠﴾

**40.** అల్లాహ్‌యే మిమ్మల్ని పుట్టించాడు. తరువాత జీవనోపాధినిచ్చాడు తరువాత ఆయనే మిమ్మల్ని మరణింపజేస్తాడు ఆ తరువాత మళ్ళీ బ్రతికిస్తాడు. అయితే? మీరు (అల్లాహ్‌కు) సాటి (భాగస్వాములు)గా కల్పించినవారిలో, ఎవడైనా వీటిలో నుండి ఏదైనా ఒక్క పనిని చేయుగలవాడు ఉన్నాడా![2] ఆయన సర్వలోపాలకు అతీతుడు, మీరు సాటికల్పించే భాగస్వాములకంటే ఆయన మహోన్నతుడు.

ظَهَرَ الْفَسَادُ فِي الْبَرِّ وَالْبَحْرِ بِمَا كَسَبَتْ أَيْدِي

**41.** మానవులు తమ చేజేతులా

రెండవది పేదవానికి ఇచ్చినందుకు ('స'హీ'హ్ 'హదీస్').

1 రిబా', వడ్డీ అనేపదం ఖుర్ఆన్ అవతరణా క్రమంలో ఈ ఆయత్‌లో మొదటిసారి వచ్చింది దాని అర్థం ఏదైనా ఇచ్చి ఇచ్చిన దానికంటే ఎక్కువ తీసుకోవటం ఇబ్నె 'అబ్బాస్ మరియు చాలామంది ఇతర 'స'హాబీలు (ర'ది'అన్హుమ్) ఈ ఆయత్‌లో వచ్చిన పదం రిబా' అంటే ఈ విధమైన వ్యాఖ్యానం కూడా ఇచ్చారు: ఒక పేదవాడు ఒక ధనవంతునికి లేక ఒక వ్యక్తి తన రాజుకు, లేక ఒక సేవకుడు తనను పెట్టుకున్న వానికి, తాను ఇచ్చిన దానికంటే ఎక్కువ తిరిగి వచ్చునని ఆశతో, ఇచ్చే బహుమానం, అని ఇచ్చేటప్పుడు, ఎక్కువ తిరిగి వస్తుంది అనే భావన ఉండటం వల్లనే, ఇది నిషిద్ధం చేయబడింది (ఇబ్నె కసీ'ర్, అయ్‌సర్ అత్తఫాసీర్). చూడండి, 3:130 మరియు 2:275 281.

2 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "ఒక దుష్టుడు మరణిస్తే, కేవలం మానవులే గాక పశుపక్షులు, చెట్లు చేమలు కూడా వాని నుండి శాంతి పొందుతాయి." ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం)

النَّاسِ لِيُذِيقَهُم بَعْضَ الَّذِي عَمِلُوا لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٤١﴾

సంపాదించుకున్న దాని ఫలితంగా భూమిలో మరియు సముద్రంలో కల్లోలం వ్యాపించింది ఇది వారిలో కొందరు చేసిన దుష్కర్మల ఫలితాన్ని రుచిచూపటానికి, బహుశా ఇలాగైనా వారు (అల్లాహ్ వైపునకు) మరలుతారేమోనని!

قُلْ سِيرُوا فِي الْأَرْضِ فَانظُرُوا كَيْفَ كَانَ عَاقِبَةُ الَّذِينَ مِن قَبْلُ ۚ كَانَ أَكْثَرُهُم مُّشْرِكِينَ ﴿٤٢﴾

**42** వారితో ఇలా అను: ''భూమిలో ప్రయాణం చేసి చూడండి, మీకు పూర్వం గతించిన వారి అంతం ఎలా జరిగిందో! వారిలో చాలామంది బహుదైవారాధకులుండిరి.''

فَأَقِمْ وَجْهَكَ لِلدِّينِ الْقَيِّمِ مِن قَبْلِ أَن يَأْتِيَ يَوْمٌ لَّا مَرَدَّ لَهُ مِنَ اللَّهِ ۖ يَوْمَئِذٍ يَصَّدَّعُونَ ﴿٤٣﴾

**43.** కావున నీవు నీ ముఖాన్ని సరైన ధర్మం (ఇస్లాం) వైపునకే స్థిరంగా నిలుపు[1] అల్లాహ్ తరఫునుండి - ఆ రోజు రాకముందే దేనినైతే ఎవ్వరూ తొలగించలేరో! ఆ రోజు వారు పరస్పరం చెదిరిపోయి వేరవుతారు[2]

مَن كَفَرَ فَعَلَيْهِ كُفْرُهُ ۖ وَمَنْ عَمِلَ صَالِحًا فَلِأَنفُسِهِمْ يَمْهَدُونَ ﴿٤٤﴾

**44.** సత్యాన్ని తిరస్కరించినవాడు, తన తిరస్కార ఫలితాన్ని అనుభవిస్తాడు మరియు సత్కార్యాలు చేసినవారు, తమ కొరకే (సాఫల్య మార్గాన్ని) తయారు చేసుకుంటారు.

لِيَجْزِيَ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ مِن فَضْلِهِ ۚ إِنَّهُ لَا يُحِبُّ الْكَافِرِينَ ﴿٤٥﴾

**45.** ఇది ఆయన (అల్లాహ్), తన అనుగ్రహంతో విశ్వసించి సత్కార్యాలు చేసేవారికి ప్రతిఫలమివ్వటానికి.[3] నిశ్చయంగా ఆయన సత్యతిరస్కారులను ప్రేమించడు.

وَمِنْ آيَاتِهِ أَن يُرْسِلَ الرِّيَاحَ مُبَشِّرَاتٍ وَلِيُذِيقَكُم مِّن رَّحْمَتِهِ وَلِتَجْرِيَ الْفُلْكُ بِأَمْرِهِ

**46** ఇక ఆయన సూచనలలో ఆయన గాలులను శుభవార్తలిచ్చేవిగా పంపి, మీకు తన కారుణ్యాన్ని రుచిచూపటం మరియు

---

1 అల్లాహ్ (సు.తా.) దృష్టిలో సత్యధర్మం అల్లాహ్ (సు.తా.)కు దాస్యం (ఇస్లాం) మాత్రమే చూడండి, 3:19

2. ఒకటి విశ్వాసులది, రెండవది సత్యతిరస్కారులది.

3 స్వర్గం పొందటానికి కేవలం విశ్వసించి సత్కార్యాలు చేయుటమే సరిపోదు దానికి అల్లాహ్ (సు.తా.) అనుగ్రహం కూడా ఉండాలి ఆయన (సు.తా.)యే సత్కార్యాల ప్రతి ఫలాన్ని ఎన్నోరెట్లు అధికంచేసి ఇస్తాడు.

وَلِتَبْتَغُوا مِنْ فَضْلِهِ وَلَعَلَّكُمْ تَشْكُرُونَ ۝

ఆయన ఆజ్ఞతో ఓడలను నడిపి, మిమ్మల్ని ఆయన అనుగ్రహాన్ని అన్వేషించనివ్వటం కూడా ఉన్నాయి. ఇవన్నీ, బహుశా మీరు కృతజ్ఞతలు చూపుతారేమోనని!

وَلَقَدْ أَرْسَلْنَا مِنْ قَبْلِكَ رُسُلًا إِلَىٰ قَوْمِهِمْ فَجَاءُوهُمْ بِالْبَيِّنَاتِ فَانْتَقَمْنَا مِنَ الَّذِينَ أَجْرَمُوا ۖ وَكَانَ حَقًّا عَلَيْنَا نَصْرُ الْمُؤْمِنِينَ ۝

**47.** మరియు వాస్తవానికి మేము నీకు పూర్వం కూడా, సందేశహరులను తమ తమ జాతివారి వద్దకు పంపాము.[1] వారు, వారి వద్దకు స్పష్టమైన సూచనలను తీసుకొని వచ్చారు. ఆ తరువాత కూడా నేరం చేసిన వారికి తగిన ప్రతీకారం[2] చేశాము. మరియు విశ్వాసులకు సహాయం చేయటం మా కర్తవ్యం

اللَّهُ الَّذِي يُرْسِلُ الرِّيَاحَ فَتُثِيرُ سَحَابًا فَيَبْسُطُهُ فِي السَّمَاءِ كَيْفَ يَشَاءُ وَيَجْعَلُهُ كِسَفًا فَتَرَى الْوَدْقَ يَخْرُجُ مِنْ خِلَالِهِ ۖ فَإِذَا أَصَابَ بِهِ مَنْ يَشَاءُ مِنْ عِبَادِهِ إِذَا هُمْ يَسْتَبْشِرُونَ ۝

**48.** అల్లాహ్‌యే గాలులను పంపేవాడు, కావున అవి మేఘాలను పైకిఎత్తుతాయి, ఆ తరువాత ఆయన వాటిని తాను కోరినట్లు ఆకాశంలో వ్యాపింపజేస్తాడు. మరియు వాటిని ముక్కలు ముక్కలుగా చేసి, తరువాత వాటి మధ్య నుండి వర్షాన్ని కురిపిస్తాడు. ఆయన దానిని తన దాసులలో తాను కోరినవారిపై కురిపించగా వారు సంతోషపడతారు!

وَإِنْ كَانُوا مِنْ قَبْلِ أَنْ يُنَزَّلَ عَلَيْهِمْ مِنْ قَبْلِهِ لَمُبْلِسِينَ ۝

**49.** మరియు వాస్తవానికి, అది (వర్షం) కురువక ముందు వారు ఎంతో నిరాశచెంది ఉండే వారు.

فَانْظُرْ إِلَىٰ آثَارِ رَحْمَتِ اللَّهِ كَيْفَ يُحْيِي الْأَرْضَ بَعْدَ مَوْتِهَا ۚ إِنَّ ذَٰلِكَ لَمُحْيِي الْمَوْتَىٰ ۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ۝

**50.** కావున (ఓ మానవుడా!) అల్లాహ్ కారుణ్యచిహ్నాలను చూడు: ఆయన నిర్జీవంగా ఉన్న భూమిలో ఏ విధంగా ప్రాణం పోస్తాడో! నిశ్చయంగా, ఇదేవిధంగా ఆయన (మరణాంతరం) మృతులకు కూడా ప్రాణంపోస్తాడు! మరియు ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

---

1. చూడండి, 10:74.
2. అల్-ముంతఖిమ్ (సేకరించబడిన పదం) Retributor, Avenger of evil, ప్రతీకారం తీర్చుకునే ప్రతీకారం చేసే, దుష్టులను శిక్షించేవాడు. చూడండి, 32:22 ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

وَلَئِنْ أَرْسَلْنَا رِيحًا فَرَأَوْهُ مُصْفَرًّا لَّظَلُّوا مِن بَعْدِهِ يَكْفُرُونَ ﴿٥١﴾

**51.** మరియు మేము గాలిని పంపితే, దాని నుండి వారి పంటలను పసుపువచ్చగా మారిపోవటాన్ని చూసిన తరువాత వారు కృతఘ్నతకు లోనవుతారు (సత్య తిరస్కారులవుతారు).

فَإِنَّكَ لَا تُسْمِعُ الْمَوْتَىٰ وَلَا تُسْمِعُ الصُّمَّ الدُّعَاءَ إِذَا وَلَّوْا مُدْبِرِينَ ﴿٥٢﴾

**52.** నిశ్చయంగా, నీవు (ఓ ము'హమ్మద్!) మృతులకు వినిపించలేవు. మరియు నీవు వెనుదిరిగిపోయే చవిటివారికి కూడా సందేశాన్ని వినిపించలేవు.

وَمَا أَنتَ بِهَادِ الْعُمْيِ عَن ضَلَالَتِهِمْ ۖ إِن تُسْمِعُ إِلَّا مَن يُؤْمِنُ بِآيَاتِنَا فَهُم مُّسْلِمُونَ ﴿٥٣﴾

**53.** మరియు నీవు అంధులను, వారి మార్గభ్రష్టత్వం నుండి తప్పించి, వారికి మార్గదర్శకత్వం చేయలేవు. నీవు కేవలం విశ్వసించి, అల్లాహ్‌కు విధేయు(ముస్లిం)లు అయిన వారికి మాత్రమే మా సూచనలు వినిపించగలవు.[1] (3/8)

اللَّهُ الَّذِي خَلَقَكُم مِّن ضَعْفٍ ثُمَّ جَعَلَ مِن بَعْدِ ضَعْفٍ قُوَّةً ثُمَّ جَعَلَ مِن بَعْدِ قُوَّةٍ ضَعْفًا وَشَيْبَةً ۚ يَخْلُقُ مَا يَشَاءُ ۖ وَهُوَ الْعَلِيمُ الْقَدِيرُ ﴿٥٤﴾

**54.** * అల్లాహ్‌యే మిమ్మల్ని బలహీన స్థితిలో పుట్టించిన వాడు మళ్ళీ ఆ బలహీన స్థితి, తరువాత మీకు బలాన్నిఇచ్చాడు. ఆ బలం తరువాత మళ్ళీ మిమ్మల్ని బలహీనులుగా, ముసలివారిగా చేశాడు. ఆయన తాను కోరింది సృష్టిస్తాడు మరియు కేవలం ఆయనే సర్వజ్ఞుడు సర్వసమర్థుడు.

وَيَوْمَ تَقُومُ السَّاعَةُ يُقْسِمُ الْمُجْرِمُونَ مَا لَبِثُوا غَيْرَ سَاعَةٍ ۚ كَذَٰلِكَ كَانُوا يُؤْفَكُونَ ﴿٥٥﴾

**55.** మరియు ఆ ఘడియ[2] సంభవించిన రోజు, అపరాధులు, ప్రమాణం చేసి: "మేము ఒక ఘడియసేపు కంటే ఎక్కువ కాలం (ప్రపంచంలో) ఉండలేదు" అని అంటారు. ఇదేవిధంగా వారు (ప్రాపంచిక జీవితంలో) భ్రమలో ఉండేవారు.[3]

---

1. ఇటువంటి ఆయత్‌లకు చూడండి, 27:80-81
2. ఆ ఘడియ అంటే పునరుత్థాన ఘడియ. అదే ఈ లోకపు ఆఖరు ఘడియ.
3. చూడండి, 10:45, 17:52

وَقَالَ الَّذِينَ أُوتُوا الْعِلْمَ وَالْإِيمَانَ لَقَدْ
لَبِثْتُمْ فِي كِتَابِ اللَّهِ إِلَىٰ يَوْمِ الْبَعْثِ ۖ فَهَٰذَا
يَوْمُ الْبَعْثِ وَلَٰكِنَّكُمْ كُنتُمْ لَا تَعْلَمُونَ ٥٦

**56.** మరియు జ్ఞానం మరియు విశ్వాసం అనుగ్రహింపబడినవారు ఇలా అంటారు: "వాస్తవానికి అల్లాహ్ మూలగ్రంథం[1] ప్రకారం మీరు పునరుత్థానదినంవరకు (ఇహలోకంలో) ఉంటిరి. ఇక ఇదే ఆ పునరుత్థానదినం. కాని నిశ్చయంగా! మీరిది తెలుసుకోలేక పోయారు."

فَيَوْمَئِذٍ لَّا يَنفَعُ الَّذِينَ ظَلَمُوا مَعْذِرَتُهُمْ
وَلَا هُمْ يُسْتَعْتَبُونَ ٥٧

**57.** కనుక ఆ రోజు దుర్మార్గులకు, వారి సాకులు ఏ మాత్రం ప్రయోజనకరం కావు మరియు వారికి తమను తాము సరిదిద్దుకొనే అవకాశం కూడా ఇవ్వబడదు.

وَلَقَدْ ضَرَبْنَا لِلنَّاسِ فِي هَٰذَا الْقُرْآنِ مِن كُلِّ
مَثَلٍ ۚ وَلَئِن جِئْتَهُم بِآيَةٍ لَّيَقُولَنَّ الَّذِينَ كَفَرُوا
إِنْ أَنتُمْ إِلَّا مُبْطِلُونَ ٥٨

**58.** మరియు వాస్తవానికి, మేము ఈ ఖుర్ఆన్‌లో ప్రజలకు, ప్రతిఒక్క విషయపు ఉపమానాన్ని బోధించాము.[2] అయినా నీవు వారివద్దకు ఏ అద్భుత సూచన(ఆయాత్)ను తెచ్చినా, వారిలో సత్యతిరస్కారులైన వారు ఇలా అంటారు: "మీరు కేవలం బూటకాలే పలుకుతున్నారు."

كَذَٰلِكَ يَطْبَعُ اللَّهُ عَلَىٰ قُلُوبِ الَّذِينَ لَا يَعْلَمُونَ ٥٩

**59.** ఈ విధంగా, అల్లాహ్ జ్ఞానహీనుల హృదయాల మీద ముద్రవేస్తాడు.[3]

فَاصْبِرْ إِنَّ وَعْدَ اللَّهِ حَقٌّ ۖ وَلَا يَسْتَخِفَّنَّكَ
الَّذِينَ لَا يُوقِنُونَ ٦٠

**60.** కావున నీవు సహనంవహించు! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం! కావున విశ్వాసహీనులు నిన్ను వ్యాకులపరచరాదు సుమా!

---

1. కితాబిల్లాహి: అంటే అల్లాహ్ వ్రాసి ఉంచిన లౌ'హె మ'హ్ఫూ'జ్, మూల గ్రంథం
2. చూడండి, 39 27
3. చూడండి, 2:7

# 31. సూరహ్ లుఖ్మాన్

سُورَةُ لُقْمَانَ

ఇంతకు ముందు సూరహ్‌వలే ఈ సూరహ్ కూడా మధ్య మక్కా కాలంలో, హిజ్రత్‌కు 6-7 సంవత్సరాలకు పూర్వం అవతరింపజేయబడింది. ఈ సమూహంలో ఇది మూడవది. ఇందులో 34 ఆయతులు ఉన్నాయి. దీనిపేరు 12-19 ఆయత్‌లలో నుండి తీసుకోబడింది. లుఖ్మాన్ ('అ.స.) ఒక మంచి జ్ఞానవంతుడు మరియు ప్రజ్ఞుడు.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

الٓمٓ ۝١

**1.** అలిఫ్-లామ్-మీమ్.[1]

تِلْكَ ءَايَٰتُ ٱلْكِتَٰبِ ٱلْحَكِيمِ ۝٢

**2.** ఇవి వివేకంతో నిండిఉన్న గ్రంథ సూచనలు (ఆయాత్).

هُدًى وَرَحْمَةً لِّلْمُحْسِنِينَ ۝٣

**3.** (ఇందులో) సజ్జనులకు[2] మార్గదర్శకత్వమూ మరియు కారుణ్యమూ ఉన్నాయి.

ٱلَّذِينَ يُقِيمُونَ ٱلصَّلَوٰةَ وَيُؤْتُونَ ٱلزَّكَوٰةَ وَهُم بِٱلْءَاخِرَةِ هُمْ يُوقِنُونَ ۝٤

**4.** (వారికే) ఎవరైతే నమా'జ్‌ను స్థాపించి విధిదానం ('జకాత్) ఇస్తారో[3] మరియు పరలోక జీవితంమీద దృఢమైన నమ్మకం కలిగిఉంటారో;

أُو۟لَٰٓئِكَ عَلَىٰ هُدًى مِّن رَّبِّهِمْ ۖ وَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ۝٥

**5.** అలాంటివారే, తమ ప్రభువు తరఫు నుండి మార్గదర్శకత్వంమీద ఉన్నవారు. మరియు అలాంటివారే సాఫల్యం పొందే వారు.

وَمِنَ ٱلنَّاسِ مَن يَشْتَرِى لَهْوَ ٱلْحَدِيثِ لِيُضِلَّ

**6.** మరియు మానవులలో కొందరు జ్ఞానం లేక, వ్యర్థ కాలక్షేపం చేసే మాటలను

1 ఈ అక్షరాలను ముఖ'త్త'అత్, అంటారు. వీటి అర్థం మరియు కొన్ని సూరాహ్‌ల ప్రారంభంలో ఇవి ఎందుకు వ్రాయబడ్డాయో కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే తెలుసు.

2 ము'హ్సినీన్, ము'హ్సిన్ (ఏ.వ.): దీనికి మూడు అర్థాలున్నాయి. 1) ఉపకారం చేసేవాడు; తన తల్లిదండ్రులకు, బంధువులకు, మొదలైనవారికి. 2) సత్కార్యాలు చేసేవాడు మరియు పాపాలనుండి దూరంగా ఉండేవాడు. 3) అల్లాహ్ (సు.తా.) యొక్క ఆరాధన భక్తి, శ్రద్ధ, దైవభీతి మరియు ఏకాగ్రతతో చేసేవాడు.

3. చూడండి, 2:2-4.

కొని[1] - ప్రజలను అల్లాహ్ మార్గం నుండి తప్పించేవారున్నారు మరియు వారు దానిని (అల్లాహ్ మార్గాన్ని) పరిహాసం చేస్తుంటారు. అలాంటివారికి అవమానకరమైన శిక్ష పడుతుంది.

عَنْ سَبِيلِ اللَّهِ بِغَيْرِ عِلْمٍ وَيَتَّخِذَهَا هُزُوًا ۚ أُولَٰئِكَ لَهُمْ عَذَابٌ مُهِينٌ ﴿٦﴾

7. అలాంటి వానికి, మా సూచనలు (ఆయాత్) వినిపింపజేసినప్పుడు, అతని రెండు చెవులలో చెవుడున్నట్లుగా, అతడు వాటిని విననేలేదన్నట్లుగా, అహంకారంతో మరలిపోతాడు.[2] వానికి అతి బాధాకరమైన శిక్ష పడుతుందనే వార్తను వినిపించు.

وَإِذَا تُتْلَىٰ عَلَيْهِ آيَاتُنَا وَلَّىٰ مُسْتَكْبِرًا كَأَنْ لَمْ يَسْمَعْهَا كَأَنَّ فِي أُذُنَيْهِ وَقْرًا ۖ فَبَشِّرْهُ بِعَذَابٍ أَلِيمٍ ﴿٧﴾

8. నిశ్చయంగా, ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలుచేస్తారో, వారి కొరకు పరమానందకరమైన స్వర్గవనాలు ఉంటాయి.

إِنَّ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ لَهُمْ جَنَّاتُ النَّعِيمِ ﴿٨﴾

9. వారు, శాశ్వతంగా వాటిలో ఉంటారు. ఇది అల్లాహ్ యొక్క సత్యవాగ్దానం. మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

خَالِدِينَ فِيهَا ۖ وَعْدَ اللَّهِ حَقًّا ۚ وَهُوَ الْعَزِيزُ الْحَكِيمُ ﴿٩﴾

10. మీరు చూస్తున్నారు కదా! ఆయన ఆకాశాలను స్థంభాలు లేకుండానే సృష్టించాడు.[3] మరియు భూమిలో పర్వతాలను నాటాడు, అది మీతోపాటు కదలకుండా ఉండాలని;[4] మరియు దానిలో ప్రతిరకమైన ప్రాణిని నివసింపజేశాడు. మరియు మేము ఆకాశంనుండి నీటిని కురిపించి, దానిలో రకరకాల శ్రేష్ఠమైన (పదార్థాలను)[5] ఉత్పత్తిచేశాము.

خَلَقَ السَّمَاوَاتِ بِغَيْرِ عَمَدٍ تَرَوْنَهَا ۖ وَأَلْقَىٰ فِي الْأَرْضِ رَوَاسِيَ أَنْ تَمِيدَ بِكُمْ وَبَثَّ فِيهَا مِنْ كُلِّ دَابَّةٍ ۚ وَأَنْزَلْنَا مِنَ السَّمَاءِ مَاءً فَأَنْبَتْنَا فِيهَا مِنْ كُلِّ زَوْجٍ كَرِيمٍ ﴿١٠﴾

---

1 అంటే సంగీతం మరియు ఇతర వృథా మాటలలో, విషయాలలో కాలక్షేపం చేయడానికి వాడే వస్తువులు.

2 చూడండి, 23:66-67

3. చూడండి, 13:2

4. చూడండి, 16:15

5 'జౌజిన్ ' అంటే ప్రతిరకమైన ధాన్యాలు మరియు ఫలాలు, (ము'హమ్మద్ జూనాగఢీ) మరొక అర్థం: రకరకాల జీవరాశి, (నోబుల్ ఖుర్'ఆన్). రెండూ సరైనవే ఇంకా చూడండి, 26:7

هَٰذَا خَلْقُ اللَّهِ فَأَرُونِي مَاذَا خَلَقَ الَّذِينَ مِن دُونِهِ ۚ بَلِ الظَّالِمُونَ فِي ضَلَالٍ مُّبِينٍ ﴿١١﴾

**11.** ఇదంతా అల్లాహ్ సృష్టియే! ఇక ఆయన తప్ప ఇతరులు ఏమి సృష్టించారో నాకు చూపండి. అలాకాదు ఈ దుర్మార్గులు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.

وَلَقَدْ آتَيْنَا لُقْمَانَ الْحِكْمَةَ أَنِ اشْكُرْ لِلَّهِ ۚ وَمَن يَشْكُرْ فَإِنَّمَا يَشْكُرُ لِنَفْسِهِ ۖ وَمَن كَفَرَ فَإِنَّ اللَّهَ غَنِيٌّ حَمِيدٌ ﴿١٢﴾

**12.** మరియు నిశ్చయంగా, మేము లుఖ్మాన్‌కు వివేకాన్ని ప్రసాదించాము.[1] అతను అల్లాహ్‌కు కృతజ్ఞుడుగా ఉండాలని. మరియు ఎవడైతే ఆయనకు కృతజ్ఞతలు తెలుపుతాడో, అతడు నిశ్చయంగా, తన మేలుకొరకే కృతజ్ఞతలు తెలుపుతాడు. మరియు కృతఘ్నతకు పాల్పడినవాడు, నిశ్చయంగా అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడని (తెలుసుకోవాలి).

وَإِذْ قَالَ لُقْمَانُ لِابْنِهِ وَهُوَ يَعِظُهُ يَا بُنَيَّ لَا تُشْرِكْ بِاللَّهِ ۖ إِنَّ الشِّرْكَ لَظُلْمٌ عَظِيمٌ ﴿١٣﴾

**13.** మరియు (జ్ఞాపకంచేసుకోండి) లుఖ్మాన్ తన కుమారునికి హితబోధ చేస్తూ ఇలా అన్నాడు: "ఓ నా పుత్రుడా! అల్లాహ్‌కు సాటి (భాగస్వాములను) కల్పించకు నిశ్చయంగా, అల్లాహ్‌కు భాగస్వాములను కల్పించటం (బహుదైవారాధన) గొప్ప దుర్మార్గము.

وَوَصَّيْنَا الْإِنسَانَ بِوَالِدَيْهِ حَمَلَتْهُ أُمُّهُ وَهْنًا عَلَىٰ وَهْنٍ وَفِصَالُهُ فِي عَامَيْنِ أَنِ اشْكُرْ لِي وَلِوَالِدَيْكَ إِلَيَّ الْمَصِيرُ ﴿١٤﴾

**14.** "మరియు (అల్లాహ్ ఇలా ఆదేశిస్తున్నాడు): 'మేము మానవునకు తన తల్లిదండ్రుల యెడల మంచితనంతో మెలగటం విధిగాజేశాము. అతని తల్లి అతనిని బలహీనతపై బలహీనతను సహిస్తూ (తన గర్భంలో) భరిస్తుంది. మరియు ఆ బిడ్డ చనుపాలు మాన్పించే గడువు రెండు సంవత్సరాలు. నీవు నాకు మరియు నీ తల్లిదండ్రులకు కృతజ్ఞుడవై ఉండు. నీకు నా వైపునకేమరలి రావలసి ఉన్నది.[2]

1. లుఖ్మాన్ (అ.స.) ఒక మహా సత్పురుషుడు అల్లాహ్ (సు.తా.) అతనికి (అ.స.) మంచి జ్ఞానం, దూరదృష్టి, దైవభీతి మరియు వివేచనాశక్తిని ప్రసాదించాడు
2. చూడండి, 17:23 24

وَإِن جَٰهَدَاكَ عَلَىٰٓ أَن تُشْرِكَ بِى مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ فَلَا تُطِعْهُمَا ۖ وَصَاحِبْهُمَا فِى ٱلدُّنْيَا مَعْرُوفًا ۖ وَٱتَّبِعْ سَبِيلَ مَنْ أَنَابَ إِلَىَّ ۚ ثُمَّ إِلَىَّ مَرْجِعُكُمْ فَأُنَبِّئُكُم بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿١٥﴾

**15.** " 'మరియు ఒకవేళ వారిరువురు - నీవు ఎరగని దానిని - నాకు (అల్లాహ్‌కు) భాగస్వామిగా చేర్చుమని, నిన్ను బలవంతం చేస్తే, వారి మాటను నీవు ఏ మాత్రం వినకు.[1] మరియు ఇహలోక విషయాలలో ధర్మ సమ్మతమైన వాటిలో వారికి తోడుగా ఉండు. మరియు పశ్చాత్తాపంతో నా వైపుకు మరలేవాని మార్గాన్ని అనుసరించు. తరువాత మీరంతా నావైపునకే మరలి రావలసి ఉన్నది అప్పుడు నేను మీరు చేసే కర్మలను గురించి మీకు తెలుపుతాను.'

يَٰبُنَىَّ إِنَّهَآ إِن تَكُ مِثْقَالَ حَبَّةٍ مِّنْ خَرْدَلٍ فَتَكُن فِى صَخْرَةٍ أَوْ فِى ٱلسَّمَٰوَٰتِ أَوْ فِى ٱلْأَرْضِ يَأْتِ بِهَا ٱللَّهُ ۚ إِنَّ ٱللَّهَ لَطِيفٌ خَبِيرٌ ﴿١٦﴾

**16.** "ఓ నా కుమారా! ఒక వేళ ఏ కర్మ ఆవగింజంత ఉండి, అది ఒక పెద్ద రాతి బండలో గానీ, ఆకాశాలలో గానీ లేదా భూమిలో గానీ దాగివున్నా, అల్లాహ్ దానిని తప్పక (వెలుగులోకి) తెస్తాడు. నిశ్చయంగా, అల్లాహ్ ఎంతో సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసిన వాడు.

يَٰبُنَىَّ أَقِمِ ٱلصَّلَوٰةَ وَأْمُرْ بِٱلْمَعْرُوفِ وَٱنْهَ عَنِ ٱلْمُنكَرِ وَٱصْبِرْ عَلَىٰ مَآ أَصَابَكَ ۖ إِنَّ ذَٰلِكَ مِنْ عَزْمِ ٱلْأُمُورِ ﴿١٧﴾

**17.** "ఓ నా కుమారా! నమా'జ్‌ను స్థాపించు మరియు ధర్మాన్ని ఆదేశించు మరియు అధర్మాన్ని నిషేధించు. ఆపదలో సహనంవహించు. నిశ్చయంగా, ఇవి ఎంతో *గట్టిగా ఆజ్ఞాపించబడిన విషయాలు.*[2]

وَلَا تُصَعِّرْ خَدَّكَ لِلنَّاسِ وَلَا تَمْشِ فِى ٱلْأَرْضِ مَرَحًا ۖ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ كُلَّ مُخْتَالٍ فَخُورٍ ﴿١٨﴾

**18.** "మరియు నీ చెంపలను *గర్వంతో*, ప్రజల యెదుట ఉబ్బించకు.[3] మరియు భూమిపై అహంకారంతో నడవకు. నిశ్చయంగా, అల్లాహ్ డాంబికాలు చెప్పుకొని, విర్రవీగే వాడంటే ఇష్టపడడు.

---

1. చూడండి, 29 8
2. వంకర అక్షరా (*Italics*)లలో ఉన్నది నోబుల్ ఖుర్ఆన్‌లో ఉన్న తాత్పర్యం
3. పైన ఉన్నది ముహమ్మద్ జూనాగఢీ గారి తాత్పర్యం ఈ వాక్యపు తాత్పర్యం నోబుల్ ఖుర్ఆన్‌లో ఇలా ఉంది: "ప్రజలతో ముఖం ప్రక్కకు త్రిప్పుకొని (చిట్లించుకొని) *గర్వంతో* మాట్లాడకు"

19. "మరియు నీ నడకలలో వినమ్రత పాటించు.[1] మరియు నీ స్వరాన్నితగ్గించు. నిశ్చయంగా, స్వరాలలో అన్నిటికంటే కఠకైన (వినసొంపుకానిది) గాడిద స్వరమే!"

وَاقْصِدْ فِي مَشْيِكَ وَاغْضُضْ مِن صَوْتِكَ ۚ إِنَّ أَنكَرَ الْأَصْوَاتِ لَصَوْتُ الْحَمِيرِ ﴿١٩﴾

20. ఏమీ? ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సకల వస్తువులను వాస్తవానికి అల్లాహ్ మీకు ఉపయుక్తంగాచేశాడనీ[2] మరియు ఆయన బహిరంగం గానూ మరియు గోప్యం గానూ తన అనుగ్రహాలను మీకు ప్రసాదించాడనీ, మీకు తెలియదా? మరియు ప్రజలలో కొందరు ఎలాంటి జ్ఞానం, మార్గదర్శకత్వం మరియు వెలుగు చూపే స్పష్టమైన గ్రంథం లేనిదే అల్లాహ్‌ను గురించి వాదులాడేవారున్నారు!

أَلَمْ تَرَوْا أَنَّ اللَّهَ سَخَّرَ لَكُم مَّا فِي السَّمَاوَاتِ وَمَا فِي الْأَرْضِ وَأَسْبَغَ عَلَيْكُمْ نِعَمَهُ ظَاهِرَةً وَبَاطِنَةً ۗ وَمِنَ النَّاسِ مَن يُجَادِلُ فِي اللَّهِ بِغَيْرِ عِلْمٍ وَلَا هُدًى وَلَا كِتَابٍ مُّنِيرٍ ﴿٢٠﴾

21. మరియు వారితో: "అల్లాహ్ అవతరింపజేసిన దానిని అనుసరించండి!" అని అన్నప్పుడు, వారు: "కాదు మా తండ్రి తాతలు నడిచిన మార్గాన్నే మేము అనుసరిస్తాము." అని అంటారు. ఏమీ? షైతాన్ వారిని భగభగమండే అగ్ని వైపునకు ఆహ్వానిస్తున్నప్పటికీ, (వారు అలాంటి మార్గాన్నే అనుసరిస్తారా)?[3] (1/2)

وَإِذَا قِيلَ لَهُمُ اتَّبِعُوا مَا أَنزَلَ اللَّهُ قَالُوا بَلْ نَتَّبِعُ مَا وَجَدْنَا عَلَيْهِ آبَاءَنَا ۚ أَوَلَوْ كَانَ الشَّيْطَانُ يَدْعُوهُمْ إِلَىٰ عَذَابِ السَّعِيرِ ﴿٢١﴾

22. * ఎవడైతే, తన ముఖాన్ని (తనను తాను) అల్లాహ్‌కు సమర్పించుకొని[4] సజ్జనుడై ఉంటాడో, అలాంటి వాడు నిస్సందేహంగా దృఢమైన ఆధారాన్ని పట్టుకున్నవాడే! మరియు సకల వ్యవహారాల ముగింపు (తీర్పు) అల్లాహ్ వద్దనే ఉంది.

وَمَن يُسْلِمْ وَجْهَهُ إِلَى اللَّهِ وَهُوَ مُحْسِنٌ فَقَدِ اسْتَمْسَكَ بِالْعُرْوَةِ الْوُثْقَىٰ ۗ وَإِلَى اللَّهِ عَاقِبَةُ الْأُمُورِ ﴿٢٢﴾

1. చూడండి, 25:63
2. చూడండి, 14:32-33.
3. చూడండి, 2:14 మరియు 15:17
4. చూడండి, 2:112

**23.** మరియు సత్యాన్ని తిరస్కరించేవాని, తిరస్కారం నిన్ను దుఃఖానికి గురిచేయకూడదు. వారందరి మరలింపు మా వైపునకే ఉంది: అప్పుడు మేము వారు చేసిన కర్మలను వారికి తెలుపుతాము. నిశ్చయంగా, అల్లాహ్‌కు హృదయాలలో ఉన్న విషయాలు సైతం బాగా తెలుసు.

وَمَن كَفَرَ فَلَا يَحْزُنكَ كُفْرُهُۥٓ ۚ إِلَيْنَا مَرْجِعُهُمْ فَنُنَبِّئُهُم بِمَا عَمِلُوٓا۟ ۚ إِنَّ ٱللَّهَ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿٢٣﴾

**24.** మేము వారిని కొంతకాలం సుఖాలను అనుభవించనిస్తాము. ఆ తరువాత మేము వారిని కఠినమైన శిక్ష వైపుకు త్రోస్తాము.

نُمَتِّعُهُمْ قَلِيلًا ثُمَّ نَضْطَرُّهُمْ إِلَىٰ عَذَابٍ غَلِيظٍ ﴿٢٤﴾

**25.** ఒకవేళ నీవు వారిని: "ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించింది ఎవరు?" అని అడిగితే! వారు నిస్సంకోచంగా అంటారు: "అల్లాహ్!" అని. వారితో అను: "సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే!" కాని వారిలో చాలా మందికి ఇది తెలియదు.

وَلَئِن سَأَلْتَهُم مَّنْ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ لَيَقُولُنَّ ٱللَّهُ ۚ قُلِ ٱلْحَمْدُ لِلَّهِ ۚ بَلْ أَكْثَرُهُمْ لَا يَعْلَمُونَ ﴿٢٥﴾

**26.** ఆకాశాలలో మరియు భూమిలో నున్న సమస్తమూ అల్లాహ్‌కే చెందుతుంది. నిశ్చయంగా, అల్లాహ్! కేవలం ఆయనే సర్వసంపన్నుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు.

لِلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ إِنَّ ٱللَّهَ هُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ ﴿٢٦﴾

**27.** ఒకవేళ వాస్తవానికి, భూమిలో ఉన్న వృక్షాలన్నీ కలములై ఈ సముద్రం మరియు దానితో పాటు అటువంటి ఏడు సముద్రాల (నీళ్ళంతా) సిరాగా ఉన్నా, అల్లాహ్ మాటలు (సూచనలు వ్రాయటానికి) పూర్తికావు. నిశ్చయంగా అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.[1]

وَلَوْ أَنَّمَا فِى ٱلْأَرْضِ مِن شَجَرَةٍ أَقْلَٰمٌ وَٱلْبَحْرُ يَمُدُّهُۥ مِنۢ بَعْدِهِۦ سَبْعَةُ أَبْحُرٍ مَّا نَفِدَتْ كَلِمَٰتُ ٱللَّهِ ۗ إِنَّ ٱللَّهَ عَزِيزٌ حَكِيمٌ ﴿٢٧﴾

**28.** మీ అందరినీ సృష్టించటం మరియు తిరిగి (సజీవులుగా) లేపటం ఆయనకు ఒక మానవుణ్ణి (సృష్టించి, తిరిగిలేపటం వంటిదే).

مَّا خَلْقُكُمْ وَلَا بَعْثُكُمْ إِلَّا كَنَفْسٍ وَٰحِدَةٍ ۗ إِنَّ ٱللَّهَ سَمِيعٌۢ بَصِيرٌ ﴿٢٨﴾

---

1. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 18:109

నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

أَلَمْ تَرَ أَنَّ ٱللَّهَ يُولِجُ ٱلَّيْلَ فِى ٱلنَّهَارِ وَيُولِجُ ٱلنَّهَارَ فِى ٱلَّيْلِ وَسَخَّرَ ٱلشَّمْسَ وَٱلْقَمَرَ كُلٌّ يَجْرِىٓ إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى وَأَنَّ ٱللَّهَ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿٢٩﴾

**29.** ఏమీ? నీకు తెలియదా (చూడటంలేదా)? నిశ్చయంగా, అల్లాహ్ రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేస్తున్నాడని మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేస్తున్నాడని[1] మరియు సూర్యుణ్ణి మరియు చంద్రుణ్ణి నియమబద్ధులుగా చేసిఉంచాడనీ ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీతకాలంలో మరియు (పరిధిలో) తిరుగుతూ ఉంటాయనీ[2] మరియు నిశ్చయంగా మీరు చేసేదంతా అల్లాహ్ ఎరుగునని?

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ هُوَ ٱلْحَقُّ وَأَنَّ مَا يَدْعُونَ مِن دُونِهِ ٱلْبَٰطِلُ وَأَنَّ ٱللَّهَ هُوَ ٱلْعَلِىُّ ٱلْكَبِيرُ ﴿٣٠﴾

**30.** ఇదంతా ఎందుకంటే! నిశ్చయంగా అల్లాహ్, కేవలం ఆయనే సత్యం. మరియు ఆయనను వదలి వారు ఆరాధించేవన్నీ అసత్యాలు మరియు నిశ్చయంగా అల్లాహ్! కేవలం ఆయనే మహోన్నతుడు, మహనీయుడు (గొప్పవాడు).

أَلَمْ تَرَ أَنَّ ٱلْفُلْكَ تَجْرِى فِى ٱلْبَحْرِ بِنِعْمَتِ ٱللَّهِ لِيُرِيَكُم مِّنْ ءَايَٰتِهِۦٓ إِنَّ فِى ذَٰلِكَ لَءَايَٰتٍ لِّكُلِّ صَبَّارٍ شَكُورٍ ﴿٣١﴾

**31.** ఏమీ? నీకు తెలియదా? మీకు కొన్ని సూచనలను తెలుపటానికి, అల్లాహ్ అనుగ్రహంతో, ఓడ సముద్రంలో పయనం చేస్తున్నదనీ? నిశ్చయంగా, ఇందులో సహనం వహించే ప్రతివానికి, కృతజ్ఞునికి, ఎన్నో సూచనలున్నాయి.

وَإِذَا غَشِيَهُم مَّوْجٌ كَٱلظُّلَلِ دَعَوُا۟ ٱللَّهَ مُخْلِصِينَ لَهُ ٱلدِّينَ فَلَمَّا نَجَّىٰهُمْ إِلَى ٱلْبَرِّ فَمِنْهُم مُّقْتَصِدٌ وَمَا يَجْحَدُ بِـَٔايَٰتِنَآ إِلَّا كُلُّ خَتَّارٍ كَفُورٍ ﴿٣٢﴾

**32.** మరియు వారిని సముద్రపు అల, మేఘంగా క్రమ్ముకున్నపుడు, వారు పరిపూర్ణ భక్తితో అల్లాహ్‌నే వేడుకుంటారు కాని ఆయన వారిని రక్షించి ఒడ్డుకు చేర్చిన తరువాత

---

1 అంటే చలికాలంలో రాత్రి పెద్దదై పగలు చిన్నదవటం మరియు వేసవి కాలంలో పగలు పెద్దదయి రాత్రి చిన్నదవటం

2 ఈ నిర్ణీతకాలం, పునరుత్థానదినం కావచ్చు లేక అవి తమ పరిధిలో ఒకసారి చుట్టు తిరిగి మరల మొదటి స్థానానికి వచ్చుటకు పట్టే కాలం కావచ్చు.

వారిలో కొందరు (విశ్వాస-అవిశ్వాసాల) మధ్య ఆగిపోతారు[1] మరియు మా సూచనలను, కేవలం విశ్వాసఘాతకులు, కృతఘ్నులైన వారు మాత్రమే, తిరస్కరిస్తారు.

**33.** ఓ మానవులారా! మీ ప్రభువునందే భయభక్తులు కలిగి ఉండండి. మరియు ఆ దినానికి భయపడండి. (ఏనాడైతే) తండ్రి తన కుమారునికి నష్టపరిహారం చెల్లించలేడో మరియు ఏ కుమారుడు కూడా తన తండ్రికి ఎలాంటి నష్టపరిహారం చెల్లించలేడో! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం! కావున ఈ ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసానికి గురిచేయనివ్వకూడదు. మరియు ఆ వంచకుణ్ణి (షై'తానును) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో వంచనకు గురిచేయ నివ్వకూడదు సుమా!

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱتَّقُوا۟ رَبَّكُمْ وَٱخْشَوْا۟ يَوْمًا لَّا يَجْزِى وَالِدٌ عَن وَلَدِهِۦ وَلَا مَوْلُودٌ هُوَ جَازٍ عَن وَالِدِهِۦ شَيْـًٔا ۚ إِنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ ۖ فَلَا تَغُرَّنَّكُمُ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا وَلَا يَغُرَّنَّكُم بِٱللَّهِ ٱلْغَرُورُ ﴿٣٣﴾

**34.** నిశ్చయంగా, ఆ (అంతిమ) ఘడియ జ్ఞానం, కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉంది. మరియు ఆయనే వర్షం కురిపించేవాడు మరియు గర్భాలలో ఉన్నదాని విషయం తెలిసినవాడు. మరియు తాను రేపు ఏమి సంపాదిస్తాడో, ఏ మానవుడు కూడా ఎరుగడు మరియు ఏ మానవుడు కూడా తాను ఏ భూభాగంలో మరణిస్తాడో కూడా ఎరుగడు.[2] నిశ్చయంగా, అల్లాహ్ మాత్రమే సర్వజ్ఞుడు, సమస్తం తెలిసినవాడు (ఎరిగినవాడు).

إِنَّ ٱللَّهَ عِندَهُۥ عِلْمُ ٱلسَّاعَةِ وَيُنَزِّلُ ٱلْغَيْثَ وَيَعْلَمُ مَا فِى ٱلْأَرْحَامِ ۖ وَمَا تَدْرِى نَفْسٌ مَّاذَا تَكْسِبُ غَدًا ۖ وَمَا تَدْرِى نَفْسٌۢ بِأَىِّ أَرْضٍ تَمُوتُ ۚ إِنَّ ٱللَّهَ عَلِيمٌ خَبِيرٌۢ ﴿٣٤﴾

1. చూడండి, 17:67 మరియు 29:65

2 పై ఐదు అగోచర విషయాల జ్ఞానం కేవలం అల్లాహ్‌కే ఉంది అవి: 1) అంతిమ ఘడియ సమయం, 2) వర్షం వచ్చే సమయం, 3) మాతృ గర్భంలో ఉన్నదాని గతి, 4) రేపు సంభవించబోయే విషయం మరియు 5) మానవుని మరణ స్థానం ('స'హీ'హ్ బు'ఖారీ)

## 32. సూరహ్ అస్-సజ్దహ్

سُورَةُ السَّجْدَة

అస్-సజ్దహ్: సాష్టాంగం. ఇది చివరి మక్కా సూరాహ్‌లలోనిది. సూరహ్ అల్-ము'మినూన్ (23) తరువాత అవతరింపజేయబడింది. దీని పేరు **15**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది సూరహ్ అల్-'అంకబూత్ (29)తో మొదలైన నాల్గు సూరాహ్‌లలో 4వది, చివరిది. దైవప్రవక్త (స'అస) జుము'అహ్ రోజు ఫజ్ర్ నమా'జ్‌లో మొదటి రక'అత్‌లో ఈ సూరహ్ మరియు రెండవ రక'అత్‌లో సూరహ్ అల్-ఇన్సాన్ (76), చదివేవారు. (బు'ఖారీ, ముస్లిం) దైవప్రవక్త ('స'అస) రాత్రి నిద్రపోయే ముందు ఈ సూరహ్ మరియు సూరహ్ అల్-ముల్క్ (67) చదివేవారు. (తిర్మిజీ' 892; అ'హ్మద్ 3/340). ఇందులో **30 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

**1.** అలిఫ్-లామ్-మీమ్.

الٓمٓ ۝

**2.** నిస్సంకోచంగా, ఈ గ్రంథ (ఖుర్ఆన్) అవతరణ సర్వలోకాల ప్రభువు తరఫు నుండియే ఉంది.

تَنزِيلُ الْكِتَابِ لَا رَيْبَ فِيهِ مِن رَّبِّ الْعَالَمِينَ ۝

**3** ఏమీ? వారు (అవిశ్వాసులు): "ఇతనే (ము'హమ్మద్) దీనిని కల్పించాడు." అని అంటున్నారా?[1] అలాకాదు, వాస్తవానికి ఇది నీ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యం. నీకు పూర్వం హెచ్చరించే వారెవ్వరూ రాని జాతివారికి నీవు హెచ్చరిక చేయుటానికి, బహుశా వారు మార్గదర్శకత్వం పొందుతా రేమోనని!

أَمْ يَقُولُونَ افْتَرَاهُ ۚ بَلْ هُوَ الْحَقُّ مِن رَّبِّكَ لِتُنذِرَ قَوْمًا مَّا أَتَاهُم مِّن نَّذِيرٍ مِّن قَبْلِكَ لَعَلَّهُمْ يَهْتَدُونَ ۝

**4.** అల్లాహ్, ఆయనే ఆకాశాలను భూమిని మరియు వాటి మధ్య ఉన్నదంతా ఆరు దినము (అయ్యామ్)లలో[2] సృష్టించాడు, ఆ

اللَّهُ الَّذِي خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ وَمَا بَيْنَهُمَا فِي سِتَّةِ أَيَّامٍ ثُمَّ اسْتَوَىٰ عَلَى الْعَرْشِ ۖ مَا لَكُم مِّن

1 అలాంటప్పుడు వారిని ఇలాంటి గ్రంథాన్ని రచించి తెమ్మను? అనే ప్రశ్నకు చూడండి, 17:88, 52:34. ఇలాంటి 10 సూరాహ్‌లనైనా రచించి తెమ్మను? అనే ప్రశ్నకు, 11:13 ఇలాంటి ఒక్క సూరహ్‌నైనా రచించి తెమ్మను? అనే ప్రశ్నకు, 2:23, 10:38

2. చూడండి, 7:54 వ్యాఖ్యానం 1.

తరువాత సింహాసనాన్ని ('అర్ష్ ను) అధిష్ఠించాడు. ఆయన తప్ప మీకు మరొక సంరక్షకుడు గానీ, సిఫారసు చేసేవాడుగానీ ఎవ్వడూ లేడు, అయినా మీరు హితబోధ గ్రహించరా?

دُونِهِۦ مِن وَلِيٍّ وَلَا شَفِيعٍ ۚ أَفَلَا تَتَذَكَّرُونَ ۝

**5.** ఆయనే ఆకాశంనుండి భూమివరకు ప్రతి వ్యవహారాన్ని నడిపిస్తున్నాడు; తరువాత అంతా ఒకే దినమున,[1] ఆయన వద్దకు పోయి చేరుతుంది; దాని (ఆ దినపు) పరిమాణం మీ లెక్క ప్రకారం వేయిసంవత్సరాలు.

يُدَبِّرُ ٱلْأَمْرَ مِنَ ٱلسَّمَآءِ إِلَى ٱلْأَرْضِ ثُمَّ يَعْرُجُ إِلَيْهِ فِى يَوْمٍ كَانَ مِقْدَارُهُۥٓ أَلْفَ سَنَةٍ مِّمَّا تَعُدُّونَ ۝

**6.** ఆయన (అల్లాహ్)యే అగోచర మరియు గోచర విషయాల జ్ఞానం గలవాడు, సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

ذَٰلِكَ عَٰلِمُ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ ٱلْعَزِيزُ ٱلرَّحِيمُ ۝

**7.** ఆయన తాను సృష్టించిన ప్రతిదానిని ఉత్తమరీతిలో చేశాడు. మరియు మానవ సృష్టిని మట్టితో ప్రారంభించాడు.[2]

ٱلَّذِىٓ أَحْسَنَ كُلَّ شَىْءٍ خَلَقَهُۥ ۖ وَبَدَأَ خَلْقَ ٱلْإِنسَٰنِ مِن طِينٍ ۝

**8.** తరువాత అతని సంతతిని ఒక అధమమైన ద్రవపదార్థపు సారం (వీర్యం)తో చేశాడు.

ثُمَّ جَعَلَ نَسْلَهُۥ مِن سُلَٰلَةٍ مِّن مَّآءٍ مَّهِينٍ ۝

**9.** ఆ తరువాత, అతనిని యుక్తమైన రూపంలో తీర్చిదిద్ది, అతనిలో తన (నుండి) ప్రాణం (ఆత్మ) ఊదాడు.[3] మరియు మీకు వినేశక్తిని, చూసేశక్తిని మరియు హృదయాలను (అర్థంచేసుకునే శక్తిని) ఇచ్చాడు. (అయినా)

ثُمَّ سَوَّىٰهُ وَنَفَخَ فِيهِ مِن رُّوحِهِۦ ۖ وَجَعَلَ لَكُمُ ٱلسَّمْعَ وَٱلْأَبْصَٰرَ وَٱلْأَفْـِٔدَةَ ۚ قَلِيلًا مَّا تَشْكُرُونَ ۝

---

1 అంటే ఇది పునరుత్థానదినం అని. కొందరు వ్యాఖ్యాతలు బోధించారు. అది చాలా కష్టతరమైన దినం కావటం వల్ల వేయి సంవత్సరాలవలే కనిపిస్తుంది. చూడండి, 22:47లో కూడా; "మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్ద ఒక్క దినం, మీ లెక్కల ప్రకారం వేయి సంవత్సరాలకు సమానమైనది" అని ఉంది. కాని 70:4లో: "యాభై వేల సంవత్సరాలకు సమానమైన (ప్రమాణం గల) ఒక రోజులో, దేవదూతలు మరియు ఆత్మ (జిబ్రీల్ 'అ.స.) ఆయన (సన్నిధా) వద్దకు అధిరోహిస్తారు" అని, ఉంది. అంటే వారు అంత తీవ్రంగా ప్రయాణం చేస్తారన్నమాట.

2 చూడండి, 23:12

3 చూడండి, 15:29, 38:72

మీరు కృతజ్ఞతలు తెలుపుకునేది చాలా తక్కువ!

وَقَالُوٓا أَءِذَا ضَلَلْنَا فِي ٱلْأَرْضِ أَءِنَّا لَفِي خَلْقٍ
جَدِيدٍۭ ۚ بَلْ هُم بِلِقَآءِ رَبِّهِمْ كَٰفِرُونَ ﴿١٠﴾

**10** మరియు వారు (అవిశ్వాసులు) అంటున్నారు: "ఏమీ? మేము నశించి, మట్టిలో కలిసిపోయినా, మేము మళ్ళీ క్రొత్తగా సృష్టించబడతామా?" అది కాదు! వారు తమ ప్రభువుతో కాబోయే సమావేశాన్ని తిరస్కరిస్తున్నారు.[1] (5/8)

قُلْ يَتَوَفَّىٰكُم مَّلَكُ ٱلْمَوْتِ ٱلَّذِي وُكِّلَ بِكُمْ ثُمَّ
إِلَىٰ رَبِّكُمْ تُرْجَعُونَ ﴿١١﴾

**11.** * వారితో ఇలా అను: "మీపై నియమించబడిన మృత్యుదూత మీ ప్రాణం తీస్తాడు ఆ తరువాత మీరు మీ ప్రభువు వద్దకు మరలింపబడతారు."

وَلَوْ تَرَىٰٓ إِذِ ٱلْمُجْرِمُونَ نَاكِسُوا رُءُوسِهِمْ عِندَ رَبِّهِمْ
رَبَّنَآ أَبْصَرْنَا وَسَمِعْنَا فَٱرْجِعْنَا نَعْمَلْ صَٰلِحًا إِنَّا
مُوقِنُونَ ﴿١٢﴾

**12.** మరియు (పునరుత్థాన దినమున) ఈ అపరాధులు, తమ ప్రభువు సమక్షంలో, ఏ విధంగా తమ తలలు వంచుకొని నిలబడి ఉంటారో, నీవు చూడగలిగితే, వారు: "ఓ మా ప్రభూ! మేమిప్పుడు చూశాము మరియు విన్నాము, కావున మమ్మల్ని తిరిగి (భూలోకానికి) పంపించు. మేము సత్కార్యాలు చేస్తాము, నిశ్చయంగా, మాకు ఇప్పుడు నమ్మకం కలిగింది." అని అంటారు

وَلَوْ شِئْنَا لَءَاتَيْنَا كُلَّ نَفْسٍ هُدَىٰهَا وَلَٰكِنْ حَقَّ
ٱلْقَوْلُ مِنِّي لَأَمْلَأَنَّ جَهَنَّمَ مِنَ ٱلْجِنَّةِ وَٱلنَّاسِ
أَجْمَعِينَ ﴿١٣﴾

**13.** మరియు, మేము కోరినట్లయితే, ప్రతి వ్యక్తికి (ఆత్మకు) దాని మార్గదర్శకత్వం చేసి ఉండేవారము[2] కాని, నేను: "నిశ్చయంగా జిన్నాతులు మరియు మానవులందరితో నరకాన్ని నింపివేస్తాను." అని పలికిన, నా మాట సత్యమయ్యింది.[3]

---

1. చూడండి, 13:5
2 చూడండి, 26:4 అల్లాహ్ (సు.తా.) ఎవ్వరినీ సన్మార్గం మీద ఉండటానికి బలవంతంచేయడు. కాని మార్గదర్శకత్వంచేస్తాడు. దానిని అనుసరించనివాడు శిక్షకు గురిఅవుతాడు.
3. ఇటువంటి వాక్యాలకు చూడండి, 7:18 మరియు 11:119.

فَذُوقُوا بِمَا نَسِيتُمْ لِقَاءَ يَوْمِكُمْ هَٰذَا إِنَّا نَسِينَاكُمْ ۖ وَذُوقُوا عَذَابَ الْخُلْدِ بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿١٤﴾

**14.** కావున మీరు మీయొక్క ఈనాటి సమావేశాన్ని మరచిపోయిన దాని ఫలితాన్ని రుచిచూడండి. నిశ్చయంగా, మేము కూడా మిమ్మల్ని మరచిపోయాము. మరియు మీరు మీకర్మల ఫలితమైన ఈ శాశ్వత శిక్షను రుచిచూడండి.

إِنَّمَا يُؤْمِنُ بِآيَاتِنَا الَّذِينَ إِذَا ذُكِّرُوا بِهَا خَرُّوا سُجَّدًا وَسَبَّحُوا بِحَمْدِ رَبِّهِمْ وَهُمْ لَا يَسْتَكْبِرُونَ ۩ ﴿١٥﴾

**15.** నిశ్చయంగా వారే, మా సూచనలు (ఆయాత్) వారికి బోధించినప్పుడు, వాటిని విశ్వసించి సాష్టాంగం (సజ్దా)లో పడిపోతారు మరియు తమప్రభువు పవిత్రతను కొనియాడుతారు మరియు ఆయనను స్తుతిస్తారు మరియు వారెన్నడూ గర్వపడరు; ۩

تَتَجَافَىٰ جُنُوبُهُمْ عَنِ الْمَضَاجِعِ يَدْعُونَ رَبَّهُمْ خَوْفًا وَطَمَعًا وَمِمَّا رَزَقْنَاهُمْ يُنفِقُونَ ﴿١٦﴾

**16.** వారు (రాత్రులలో) తమ ప్రక్కలను తమ పరుపులనుండి దూరంచేసి, తమ ప్రభువును భయంతో మరియు ఆశతో వేడుకుంటారు[1] మరియు మేము వారికి ప్రసాదించిన జీవనోపాధినుండి ఖర్చుచేస్తారు.

فَلَا تَعْلَمُ نَفْسٌ مَّا أُخْفِيَ لَهُم مِّن قُرَّةِ أَعْيُنٍ جَزَاءً بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿١٧﴾

**17.** కాని వారికి, వారి కర్మల ఫలితంగా వారి కొరకు (పరలోకంలో) కళ్ళకు చలువనిచ్చే ఎటువంటి సామాగ్రి దాచిపెట్టబడి ఉందో ఏ ప్రాణికీ తెలియదు.[2]

أَفَمَن كَانَ مُؤْمِنًا كَمَن كَانَ فَاسِقًا ۚ لَّا يَسْتَوُونَ ﴿١٨﴾

**18.** ఏమీ? విశ్వాసి అయినవాడు (దైవభీతిలేని) అవిధేయునితో సమానుడా? (కాదు)! వారు సరిసమానులు కాలేరు.[3]

أَمَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ فَلَهُمْ جَنَّاتُ

**19.** ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో, వారికి వారి కర్మలకు ఫలితంగా,

---

1. రాత్రులలో లేచి తహజ్జుద్ (నఫిల్) నమాజులు చేస్తారు.
2. 'హదీస్' ఖుద్సీ: నేను నా పుణ్యాత్ములైన దాసులకొరకు స్వర్గంలో సిద్ధపరచి ఉంచిన వాటిని ఇంతవరకు ఏ కన్నూ చూడలేదు, ఏ చెవీ వినలేదు మరియు ఏ మానవుడు కూడా వాటిని గురించి ఆలోచించలేదు. (సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లిం)
3. ఇటువంటి ఆయతులకు చూడండి. 45:21, 38:28, 59:20 మొదలైనవి.

نُزُلًۢا بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿١٩﴾

వారి ఆతిథ్యం కొరకు స్వర్గవనాలలో నివాసాలుంటాయి

وَأَمَّا الَّذِينَ فَسَقُوا فَمَأْوَاهُمُ النَّارُ ۖ كُلَّمَا أَرَادُوا أَن يَخْرُجُوا مِنْهَا أُعِيدُوا فِيهَا وَقِيلَ لَهُمْ ذُوقُوا عَذَابَ النَّارِ الَّذِي كُنتُم بِهِ تُكَذِّبُونَ ﴿٢٠﴾

**20.** ఇక ఎవరైతే, విద్రోహవైఖరి అవలంబిస్తారో, వారి నివాసం నరకాగ్నియే. ప్రతిసారి వారు దానినుండి బయటపడటానికి ప్రయత్నించినపుడల్లా, వారందులోకి తిరిగి నెట్టబడతారు. మరియు వారితో ఇలా అనబడుతుంది: "మీరు తిరస్కరిస్తూ ఉండిన నరకాగ్ని శిక్షను చవిచూడండి."

وَلَنُذِيقَنَّهُم مِّنَ الْعَذَابِ الْأَدْنَىٰ دُونَ الْعَذَابِ الْأَكْبَرِ لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٢١﴾

**21.** మరియు ఆ పెద్ద శిక్షకు ముందు మేము (ఇహలోకంలో) వారికి సమీప శిక్షను రుచిచూపుతాము.[1] బహుశా, వారు (పశ్చాత్తాపపడి సత్కార్యాల వైపునకు) మరలి వస్తారేమోనని!

وَمَنْ أَظْلَمُ مِمَّن ذُكِّرَ بِآيَاتِ رَبِّهِ ثُمَّ أَعْرَضَ عَنْهَا ۚ إِنَّا مِنَ الْمُجْرِمِينَ مُنتَقِمُونَ ﴿٢٢﴾

**22.** మరియు తన ప్రభువు సూచన (ఆయాత్)ల ద్వారా హితబోధ చేయబడిన తరువాత కూడా, వాటి నుండి విముఖుడయ్యే వానికంటే ఎక్కువ దుర్మార్గుడెవడు? నిశ్చయంగా, మేము అలాంటి అపరాధులకు ప్రతీకారం[2] చేసి తీరుతాము.

وَلَقَدْ آتَيْنَا مُوسَى الْكِتَابَ فَلَا تَكُن فِي مِرْيَةٍ مِّن لِّقَائِهِ ۖ وَجَعَلْنَاهُ هُدًى لِّبَنِي إِسْرَائِيلَ ﴿٢٣﴾

**23.** మరియు వాస్తవంగా, మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము. కావున, (ఓ ప్రవక్తా)! నీవు అతనిని (ఇస్రా' రాత్రిలో) కలుసుకోబోయే విషయాన్ని గురించి సందేహంలోపడకు.[3] మరియు మేము దానిని

---

1. చూడండి, 52:47.
2. అల్-ముంతఖిమ్ (సేకరించబడిన పదం): ప్రతీకారం తీర్చుకునే, ప్రతీకారం చేసే. దుష్టులను శిక్షించే వాడు. చూడండి, 30:47.
3. మహాప్రవక్త (స'అస) మి'అరాజ్ రాత్రిలో మూసా (అ'స)ను కలుసుకున్నప్పుడు అతను, దైవప్రవక్త ముహమ్మద్ (స'అస)కు, అల్లాహ్ (సు.తా)ను వేడుకొని, నమా'జ్ల సంఖ్యను, తగ్గించుకోమని సలహా ఇచ్చిన విషయాన్ని ఈ ఆయత్ సూచిస్తుందని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు.

(తౌరాత్‌ను) ఇస్రాయీ'ల్ సంతతివారికి మార్గదర్శకత్వంగా చేశాము.[1]

24. మరియు మేము (ఇస్రాయీ'ల్ సంతతి) వారిలోనుండి కొందరిని నాయకులుగా చేశాము - వారు, వారికి మా ఆజ్ఞానుసారంగా మార్గదర్శకత్వం చేస్తూ ఉన్నారు - ఎంతవరకైతే వారు సహనం వహించిఉన్నారో మరియు వారు మా సూచన(ఆయాత్)లను నమ్ముతూ ఉన్నారో!

وَجَعَلْنَا مِنْهُمْ أَئِمَّةً يَهْدُونَ بِأَمْرِنَا لَمَّا
صَبَرُوا ۖ وَكَانُوا بِآيَاتِنَا يُوقِنُونَ ﴿٢٤﴾

25. నిశ్చయంగా, నీ ప్రభువు, పునరుత్థాన దినమున, వారికున్న భేదాభిప్రాయాలను గురించి వారిమధ్య తీర్పుచేస్తాడు.[2]

إِنَّ رَبَّكَ هُوَ يَفْصِلُ بَيْنَهُمْ يَوْمَ الْقِيَامَةِ
فِيمَا كَانُوا فِيهِ يَخْتَلِفُونَ ﴿٢٥﴾

26. ఏమీ? వీరికి పూర్వం అనేక తరాలను నాశనం చేసిన విషయం వీరికి మార్గదర్శకత్వం కాదా? వీరు, వారి నివాసస్థలాలలో తిరుగుతున్నారు కదా! నిశ్చయంగా ఇందులో ఎన్నో సూచనలున్నాయి. ఏమీ? వీరు వినటంలేదా?

أَوَلَمْ يَهْدِ لَهُمْ كَمْ أَهْلَكْنَا مِن قَبْلِهِم مِّنَ
الْقُرُونِ يَمْشُونَ فِي مَسَاكِنِهِمْ ۚ إِنَّ فِي ذَٰلِكَ
لَآيَاتٍ ۖ أَفَلَا يَسْمَعُونَ ﴿٢٦﴾

27. ఏమీ? వారు చూడటం లేదా? నిశ్చయంగా, మేము ఒక బంజరుభూమి వైపునకు నీళ్ళను (వర్షాన్ని)పంపి దానినుండి పైరును ఉత్పత్తి చేస్తే, దానిని వారి పశువులు మరియు వారూ తింటున్నారని. ఏమీ? వారిది గమనించటం (చూడటం) లేదా?

أَوَلَمْ يَرَوْا أَنَّا نَسُوقُ الْمَاءَ إِلَى الْأَرْضِ الْجُرُزِ
فَنُخْرِجُ بِهِ زَرْعًا تَأْكُلُ مِنْهُ أَنْعَامُهُمْ
وَأَنفُسُهُمْ ۖ أَفَلَا يُبْصِرُونَ ﴿٢٧﴾

28. ఇంకా ఇలా అంటున్నారు: "మీరు సత్యవంతులే అయితే, ఆ తీర్పు ఎప్పుడు వస్తుందో చెప్పండి!"[3]

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا الْفَتْحُ إِن كُنتُمْ
صَادِقِينَ ﴿٢٨﴾

1. ఇక్కడ సంబోధన మూసా ('అ.స.)కు కూడా కావచ్చు.
2. చూడండి, 22.67 69
3 ఇక్కడ తీర్పు అంటే, ఆ తీర్పు దేనివైతే ముష్రిక్ ఖురైషులు తమ మీదికి తమ్మని దైవప్రవక్త ('స'అస)ను హేళనతో అడిగేవారో అంటే అల్లాహ్ (సు.తా.) శిక్ష

قُلْ يَوْمَ الْفَتْحِ لَا يَنْفَعُ الَّذِينَ كَفَرُوا إِيمَانُهُمْ وَلَا هُمْ يُنْظَرُونَ ۝

**29.** ఇలా అను: "ఆ తీర్పుదినం నాడు[1] సత్యతిరస్కారులు విశ్వసించగోరినా, అది వారికి ఏవిధంగానూ పనికిరాదు! మరియు వారికలాంటి గడువు కూడా ఇవ్వబడదు."

فَأَعْرِضْ عَنْهُمْ وَانْتَظِرْ إِنَّهُمْ مُنْتَظِرُونَ ۝

**30.** కావున నీవు వారితో విముఖుడవగు![2] మరియు వేచిఉండు, నిశ్చయంగా, వారు కూడా (ఆ దినంకొరకు) వేచిఉంటారు. (3/4)

---

**1.** ఇక్కడ తీర్పుదినం అంటే పునరుత్థాన దినం.

**2.** చూడండి, 6:106.

అల్లాహ్ కోరితే, తానే తినిపించగల వారికి, మేము తినిపించాలా? మీరు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో ఉన్నారు."

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا الْوَعْدُ إِن كُنتُمْ صَادِقِينَ ﴿٤٨﴾

**48.** వారు ఇంకా ఇలా అంటారు: "మీరు సత్యవంతులే అయితే, ఆ వాగ్దానం (పునరుత్థానం) ఎప్పుడు పూర్తికానున్నది?"

مَا يَنظُرُونَ إِلَّا صَيْحَةً وَاحِدَةً تَأْخُذُهُمْ وَهُمْ يَخِصِّمُونَ ﴿٤٩﴾

**49.** వారు నిరీక్షిస్తున్నది కేవలం ఒక పెద్ద ధ్వని[1] కొరకే. మరియు వారు వాదులాడుకుంటూ ఉండగానే, అది వారిని చిక్కించుకుంటుంది.

فَلَا يَسْتَطِيعُونَ تَوْصِيَةً وَلَا إِلَىٰ أَهْلِهِمْ يَرْجِعُونَ ﴿٥٠﴾

**50.** వారు ఏ విధమైన వీలునామా కూడా వ్రాయలేరు మరియు తమ కుటుంబంవారి వద్దకు కూడా తిరిగి పోలేరు.

وَنُفِخَ فِي الصُّورِ فَإِذَا هُم مِّنَ الْأَجْدَاثِ إِلَىٰ رَبِّهِمْ يَنسِلُونَ ﴿٥١﴾

**51.** మరియు (మరొకసారి) బాకా ఊదబడినప్పుడు, వారంతా గోరీలనుండి (లేచి) తమ ప్రభువు వైపునకు వేగంగా పరిగెత్తుకుంటూ వస్తారు.[2]

قَالُوا يَا وَيْلَنَا مَن بَعَثَنَا مِن مَّرْقَدِنَا ۜ هَٰذَا مَا وَعَدَ الرَّحْمَٰنُ وَصَدَقَ الْمُرْسَلُونَ ﴿٥٢﴾

**52.** వారంటారు: "అయ్యో! మా దౌర్భాగ్యం! మమ్మల్ని మా పడకలనుండి లేపి ఎవరు నిలబెట్టారు?" (వారితో అనబడుతుంది): "ఇదే ఆ కరుణామయుడు చేసిన వాగ్దానం. మరియు అతని సందేశహరులు సత్యమే పలికారు!"

إِن كَانَتْ إِلَّا صَيْحَةً وَاحِدَةً فَإِذَا هُمْ جَمِيعٌ لَّدَيْنَا مُحْضَرُونَ ﴿٥٣﴾

**53.** అది కేవలం ఒక పెద్ద ధ్వని[3] మాత్రమే అయి ఉంటుంది! వెంటనే వారంతా

---

1. అంటే అకస్మాత్తుగా ఊదబడే పునరుత్థానదినపు బాకా (కొమ్ము) ధ్వని. అరుపు, గర్జన లేక శబ్దం. దీనిని మొదటిబాకా లేక నఫ్ ఖతుల్ ఫ'జ'అ అంటారు. దీని తరువాత రెండవబాకా ఊదబడుతుంది. దానిని నఫ్ ఖతు'స్స'అఖ్. అంటారు. అప్పుడు అల్లాహ్ (సు.తా.) తప్ప సర్వజీవరాసులు మరణిస్తారు. ఇంకా చూడండి. 36:29, 53; 38:15
2. కొందరు వ్యాఖ్యాతలు దీనిని రెండవ బాకా అని, మరికొందరు దీనిని మూడవ బాకా అంటే నఫ్ ఖతుల్ బ'అసి' వన్నుషూర్ అని, అంటారు. ఇది ఊదబడగానే గోరీలలోని వారంతా లేచి వస్తారు. (ఇబ్నె కసీ'ర్).
3. ఇది పునరుత్థాన దినమున ఇస్రాఫీల్ ('అ.స.) ఊదే బాకా ధ్వని

మాముందు హాజరుచేయబడతారు!

54. ఆ రోజు ఎవ్వరికీ ఎలాంటి అన్యాయం జరుగదు. మరియు మీ కర్మలకు తగినది తప్ప, మరే ప్రతిఫలమివ్వబడదు.

فَالْيَوْمَ لَا تُظْلَمُ نَفْسٌ شَيْـًٔا وَلَا تُجْزَوْنَ إِلَّا مَا كُنْتُمْ تَعْمَلُونَ ﴿٥٤﴾

55. నిశ్చయంగా, ఆ రోజు స్వర్గవాసులు, సుఖసంతోషాలలో నిమగ్నులై ఉంటారు.

إِنَّ أَصْحٰبَ الْجَنَّةِ الْيَوْمَ فِي شُغُلٍ فٰكِهُونَ ﴿٥٥﴾

56. వారు మరియు వారి సహవాసు (అ'జ్వాజ్)లు, చల్లని నీడలలో, ఆనుదు ఆసనాలమీద హాయిగా కూర్చొనిఉంటారు.[1]

هُمْ وَأَزْوٰجُهُمْ فِي ظِلٰلٍ عَلَى الْأَرَآئِكِ مُتَّكِـُٔونَ ﴿٥٦﴾

57. అందులో వారికి ఫలాలు మరియు వారు కోరేవన్నీ ఉంటాయి.

لَهُمْ فِيهَا فٰكِهَةٌ وَلَهُمْ مَا يَدَّعُونَ ﴿٥٧﴾

58. "మీకు శాంతి కలుగుగాక (సలాం)!" అనే పలుకులు అపార కరుణాప్రదాత అయిన ప్రభువు తరఫునుండి వస్తాయి.[2]

سَلٰمٌ قَوْلًا مِنْ رَبٍّ رَحِيمٍ ﴿٥٨﴾

59. ఇంకా (ఇలా అనబడుతుంది): "ఓ అపరాధులారా! ఈనాడు మీరు వేరయిపొండి.[3] (1/8)

وَامْتٰزُوا الْيَوْمَ أَيُّهَا الْمُجْرِمُونَ ﴿٥٩﴾

60. * "ఓ ఆదమ్ సంతతి వారలారా! 'షై'తానును ఆరాధించకండి.' అని నేను మిమ్మల్ని ఆదేశించలేదా? నిశ్చయంగా, అతడు మీకు బహిరంగశత్రువు![4]

أَلَمْ أَعْهَدْ إِلَيْكُمْ يٰبَنِي آدَمَ أَنْ لَا تَعْبُدُوا الشَّيْطٰنَ إِنَّهُ لَكُمْ عَدُوٌّ مُبِينٌ ﴿٦٠﴾

61. "మరియు మీరు నన్నే ఆరాధించండి. ఇదే ఋజుమార్గమని.

وَأَنِ اعْبُدُونِي هٰذَا صِرٰطٌ مُسْتَقِيمٌ ﴿٦١﴾

62. "మరియు వాస్తవానికి వాడు (షై'తాన్) మీలో పెద్దసమూహాన్ని దారి తప్పించాడు.

وَلَقَدْ أَضَلَّ مِنْكُمْ جِبِلًّا كَثِيرًا أَفَلَمْ تَكُونُوا تَعْقِلُونَ ﴿٦٢﴾

1. చూడండి, 4:57, 18:31 మరియు 55:54.
2. చూడండి, 5:16
3. చూడండి, 30:14, 43
4. చూడండి, 19:44.

ఏమీ? మీకు తెలివి లేక పోయిందా?

63. "మీకు వాగ్దానం చేయబడిన ఆ నరకం ఇదే!

هَٰذِهِۦ جَهَنَّمُ ٱلَّتِى كُنتُمْ تُوعَدُونَ ﴿٦٣﴾

64 "మీరు సత్యాన్ని తిరస్కరిస్తూ ఉన్నందుకు, ఈ రోజు దీనిలో ప్రవేశించండి (కాలండి)."

ٱصْلَوْهَا ٱلْيَوْمَ بِمَا كُنتُمْ تَكْفُرُونَ ﴿٦٤﴾

65. ఆ రోజు మేము వారి నోళ్ళమీద ముద్రవేస్తాము[1] మరియు వారేమి అర్జించారో వారిచేతులు మాతో చెబుతాయి మరియు వారికాళ్ళు మాముందు సాక్ష్యమిస్తాయి.

ٱلْيَوْمَ نَخْتِمُ عَلَىٰٓ أَفْوَٰهِهِمْ وَتُكَلِّمُنَآ أَيْدِيهِمْ وَتَشْهَدُ أَرْجُلُهُم بِمَا كَانُوا۟ يَكْسِبُونَ ﴿٦٥﴾

66. మరియు మేము కోరినట్లయితే, వారి దృష్టిని నిర్మూలించేవారము, అప్పుడు వారు దారికొరకు పెనుగులాడే వారు. కాని వారు ఎలా చూడగలిగే వారు?[2]

وَلَوْ نَشَآءُ لَطَمَسْنَا عَلَىٰٓ أَعْيُنِهِمْ فَٱسْتَبَقُوا۟ ٱلصِّرَٰطَ فَأَنَّىٰ يُبْصِرُونَ ﴿٦٦﴾

67. మరియు మేము కోరినట్లయితే, వారిని వారి స్థానంలోనే రూపాన్ని మార్చి ఉంచేవారం, అప్పుడు వారు ముందుకూ పోలేరు మరియు వెనుకకూ మరలలేరు.

وَلَوْ نَشَآءُ لَمَسَخْنَٰهُمْ عَلَىٰ مَكَانَتِهِمْ فَمَا ٱسْتَطَٰعُوا۟ مُضِيًّا وَلَا يَرْجِعُونَ ﴿٦٧﴾

68. మరియు మేము ఎవరికి దీర్ఘాయువు నొసంగుతామో, అతని శారీరకరూపాన్ని మార్చుతాము. ఏమీ? వారు ఇది కూడా గ్రహించలేరా?[3]

وَمَن نُّعَمِّرْهُ نُنَكِّسْهُ فِى ٱلْخَلْقِ ۖ أَفَلَا يَعْقِلُونَ ﴿٦٨﴾

69. మరియు మేము అతనికి (ము'హమ్మద్‌కు) కవిత్వం నేర్పలేదు[4] మరియు అది అతనికి

وَمَا عَلَّمْنَٰهُ ٱلشِّعْرَ وَمَا يَنۢبَغِى لَهُۥٓ ۚ إِنْ هُوَ إِلَّا ذِكْرٌ وَقُرْءَانٌ مُّبِينٌ ﴿٦٩﴾

---

1 ఎందుకంటే మొదట వారు తాము చేసిన షిర్కును తిరస్కరిస్తారు. చూడండి, 6:23

2 చూడండి, 2:20

3. చూడండి, 4:28

4 మక్కా ముష్రికులు దైవప్రవక్త (స'అస)ను వివిధ ఆరోపణలతో పీడించేవారు. వాటిలో ఒకటి ఇతను (స'అస) కవిత్వం చెబుతున్నాడని. దానికి అల్లాహ్ (సు'తా) ఇక్కడ జవాబిస్తున్నాడు: ఒకవేళ ఇది కవిత్వం అయితే మీరు దీనివంటి ఒక్క సూరహ్‌నైనా రచించి తీసుకురండని. కాని

శోభించదు కూడా! ఇది కేవలం ఒక హితోపదేశం మరియు స్పష్టమైన పఠనగ్రంథం (ఖుర్ఆన్) మాత్రమే.[1]

لِّيُنذِرَ مَن كَانَ حَيًّا وَيَحِقَّ الْقَوْلُ عَلَى الْكَافِرِينَ ﴿٧٠﴾

**70.** బ్రతికివున్న ప్రతివానికి హెచ్చరిక చేయటానికి మరియు సత్యతిరస్కారుల ఎడల మా ఆదేశాన్ని నిరూపించటానికి!

أَوَلَمْ يَرَوْا أَنَّا خَلَقْنَا لَهُم مِّمَّا عَمِلَتْ أَيْدِينَا أَنْعَامًا فَهُمْ لَهَا مَالِكُونَ ﴿٧١﴾

**71.** ఏమి వారికి తెలియదా? నిశ్చయంగా మేము వారికొరకు మా చేతులతో పశువులను సృష్టించి, తరువాత వాటిపై వారికి యాజమాన్యం ఇచ్చామని?

وَذَلَّلْنَاهَا لَهُمْ فَمِنْهَا رَكُوبُهُمْ وَمِنْهَا يَأْكُلُونَ ﴿٧٢﴾

**72.** మరియు వాటిని, వారికి స్వాధీన పరిచాము. కావున వాటిలో కొన్నిటిపై వారు స్వారీచేస్తారు, మరి కొన్నిటిని (వాటి మాంసాన్ని) వారు తింటారు.

وَلَهُمْ فِيهَا مَنَافِعُ وَمَشَارِبُ أَفَلَا يَشْكُرُونَ ﴿٧٣﴾

**73.** మరియు వాటిలో వారికి ఎన్నో ప్రయోజనాలు మరియు పానీయాలు (పాలు) ఉన్నాయి. అయినా, వారెందుకు కృతజ్ఞతలు చూపరు?

وَاتَّخَذُوا مِن دُونِ اللَّهِ آلِهَةً لَّعَلَّهُمْ يُنصَرُونَ ﴿٧٤﴾

**74** మరియు వారు అల్లాహ్‌ను వదలి, ఇతరులను ఆరాధ్యదైవాలుగా చేసుకున్నారు.[2] బహుశా వారి వలన తమకు సహాయం దొరుకుతుందేమోననే ఆశతో!

لَا يَسْتَطِيعُونَ نَصْرَهُمْ وَهُمْ لَهُمْ جُندٌ مُّحْضَرُونَ ﴿٧٥﴾

**75** వారు (ఆ దైవాలు), తమకెలాంటి సహాయం చేయలేరు. అయినా! వీరు (సత్యతిరస్కారులు) వారి (ఆ దైవాల) కొరకు

---

దానిని ఎవ్వరూ ఈ రోజు వరకు పూర్తిచేయలేక పోయారు. ఇంకా చూడండి, 26:224 226

1 చూడండి, 15:1.

2 అంటే విగ్రహాలు, కల్పితదైవాలు, అవతారాలుగా భావించబడే మానవులు, సాధువులు, సన్యాసులు, ప్రవక్తలు, షైతాన్ మరియు దైవదూతలూ లేక ధనసంపత్తులు, జలం, శక్తి, అదృష్టం, శకునం మొదలైనవి. వీటినే వారు దైవాలుగా చేసుకొని ఆరాధిస్తున్నారు

సైన్యం మాదిరిగా సర్వసన్నద్ధులై ఉన్నారు.[1]

فَلَا يَحْزُنكَ قَوْلُهُمْ ۘ إِنَّا نَعْلَمُ مَا يُسِرُّونَ وَمَا يُعْلِنُونَ ﴿٧٦﴾

**76.** కావున (ఓ ము'హమ్మద్!) వారి మాటలు నిన్ను బాధింపనివ్వరాదు. వాస్తవానికి! మాకు, వారు దాచేవీ మరియు వెలిబుచ్చేవీ అన్నీ బాగా తెలుసు.

أَوَلَمْ يَرَ الْإِنسَانُ أَنَّا خَلَقْنَاهُ مِن نُّطْفَةٍ فَإِذَا هُوَ خَصِيمٌ مُّبِينٌ ﴿٧٧﴾

**77.** ఏమీ? మానవుడు ఎరుగడా? నిశ్చయంగా, మేము అతనిని వీర్య బిందువుతో సృష్టించామని? అయినా! అతడు బహిరంగ ప్రత్యర్థిగా తయారయ్యాడు?[2]

وَضَرَبَ لَنَا مَثَلًا وَنَسِيَ خَلْقَهُ ۖ قَالَ مَن يُحْيِي الْعِظَامَ وَهِيَ رَمِيمٌ ﴿٧٨﴾

**78.** మరియు అతడు మాకు పోలికలు కల్పిస్తూ తన సృష్టినే మరచిపోయాడు. అతడు ఇలా అంటాడు: "కృశించిపోయిన ఈ ఎముకలను తిరిగి ఎవడు బ్రతికించగలడు?"

قُلْ يُحْيِيهَا الَّذِي أَنشَأَهَا أَوَّلَ مَرَّةٍ ۖ وَهُوَ بِكُلِّ خَلْقٍ عَلِيمٌ ﴿٧٩﴾

**79.** ఇలా అను: "మొదట వాటిని పుట్టించిన ఆయనే, మళ్ళీ వాటిని బ్రతికిస్తాడు మరియు ఆయనకు, ప్రతిదానిని సృష్టించే జ్ఞానముంది."

الَّذِي جَعَلَ لَكُم مِّنَ الشَّجَرِ الْأَخْضَرِ نَارًا فَإِذَا أَنتُم مِّنْهُ تُوقِدُونَ ﴿٨٠﴾

**80.** ఆయనే పచ్చని చెట్టునుండి మీ కొరకు అగ్నిని పుట్టించే వాడు, తరువాత మీరు దానినుండి మంటను వెలిగించు కుంటారు.

أَوَلَيْسَ الَّذِي خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ بِقَادِرٍ عَلَىٰ أَن يَخْلُقَ مِثْلَهُم ۚ بَلَىٰ وَهُوَ الْخَلَّاقُ الْعَلِيمُ ﴿٨١﴾

**81.** ఏమీ? ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించగల వాడు, వాటిలాంటి వాటిని మరల సృష్టించలేడా? ఎందుకు చేయలేడు! ఆయనే సర్వసృష్టికర్త, సర్వజ్ఞుడు.[3]

---

1. ఈ ఆయత్ యొక్క మరొక తాత్పర్యం ఈ విధంగా కూడా ఉంది: "వారు (ఆ దైవాలు), వీరికెలాంటి సహాయం చేయలేరు కాని వారు (ఆ దైవాలు పునరుత్థాన దినమున తమను ఆరాధించిన వారికి) విరుద్ధ భటులుగా హాజరుచేయబడతారు." (ఇబ్నె కసీ'ర్)
2. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 16:4.
3. చూడండి, 40:57, 46:33 మరియు 17:99.

إِنَّمَآ أَمۡرُهُۥٓ إِذَآ أَرَادَ شَيۡـًٔا أَن يَقُولَ لَهُۥ كُن فَيَكُونُ ﴿٨٢﴾

**82.** నిశ్చయంగా, ఆయన విధాన మేమిటంటే! ఆయన ఏదైనా చేయదలచు కున్నప్పుడు దానితో: "అయిపో!" అని అంటాడు, అంతే! అది అయిపోతుంది.

فَسُبۡحَٰنَ ٱلَّذِي بِيَدِهِۦ مَلَكُوتُ كُلِّ شَيۡءٖ وَإِلَيۡهِ تُرۡجَعُونَ ﴿٨٣﴾

**83.** ఎందుకంటే! సర్వలోపాలకు అతీతుడైన ఆయన (అల్లాహ్) చేతిలో ప్రతిదానికి సంబంధించిన సర్వాధికారాలు ఉన్నాయి మరియు మీరంతా ఆయన వైపునకే మరలింపబడతారు



## 37. సూరహ్ అ'స్-'సాఫ్ఫాత్

## سُوْرَةُ الصّٰٓفّٰتِ

ఈ సూరహ్ మధ్య మక్కా కాలంలో అవతరింపజేయబడింది. అ'స్-'సాఫ్ఫాత్ అంటే వరుసలలో లేక పంక్తులలో నిలబడినవారు. ఈ సూరహ్ ఈ సమూహంలో నాలుగవది. ఇందులో నూ'హ్, ఇబ్రాహీమ్, మూసా, హారూన్, ఇల్యాస్, లూ'త్ మరియు యూనుస్ ('అలైహిమ్ స.)లు చెడుతో చేసిన పోరాటం మరియు వారికి లభించిన విజయాలు వివరించబడ్డాయి. ఇందులో 182 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَالصّٰٓفّٰتِ صَفًّا ۝١

1. వరుసగా బారులు తీరి నిలుచున్న వారి (దైవదూతల) సాక్షిగా!

فَالزّٰجِرٰتِ زَجْرًا ۝٢

2. మేఘాలను నడిపించే వారి (దైవదూతల) సాక్షిగా![1]

فَالتّٰلِيٰتِ ذِكْرًا ۝٣

3. ఈ ఉపదేశాన్ని (ఖుర్ఆన్‌ను, అల్లాహ్ దగ్గరి నుండి మానవులకు) తెచ్చే వారి (దైవదూతల) సాక్షిగా![2]

اِنَّ اِلٰهَكُمْ لَوَاحِدٌ ۝٤

4. నిశ్చయంగా, మీ ఆరాధ్య దైవం కేవలం ఆయన (అల్లాహ్) ఒక్కడే![3]

رَبُّ السَّمٰوٰتِ وَالْاَرْضِ وَمَا بَيْنَهُمَا وَرَبُّ الْمَشَارِقِ ۝٥

5. ఆకాశాలు మరియు భూమి మరియు వాటి మధ్యనున్న వాటి ప్రభువు మరియు సూర్యోదయ (తూర్పు) స్థానాలకు ప్రభువు.[4]

---

1. ఈ ఆయత్ ఈ విధంగా కూడా వివరించబడింది: 'తరుమగొట్టే వారి సాక్షిగా!'
2. ఈ ఆయత్: 'ఖుర్ఆన్ పఠించేవారి సాక్షిగా!' అని కూడా వివరించబడింది.
3. పై మూడు ఆయతులలో దైవదూత ('అ.స.)ల వివిధ కార్యాలు వివరించబడ్డాయి. ప్రతిదీ అల్లాహ్ (సు.తా.) యొక్క సృష్టి మరియు ఆయనకు చెందినదే. కావున ఆయన తాను కోరిన దాని ప్రమాణం చేస్తాడు. కాని మానవులకు అల్లాహ్ (సు.తా.) తప్ప ఇతరుల ప్రమాణం చేయటం నిషిద్ధం (హరాం). ఎందుకంటే ప్రమాణం తీసుకునే దానిని సాక్షిగా తీసుకోవలసి ఉంటుంది. మానవునికి అల్లాహ్ (సు.తా.) తప్ప మరొక ఉత్తమ సాక్షి లేడు. ఎందుకంటే కేవలం అల్లాహ్ (సు.తా.)యే సర్వసాక్షి.
4. చూడండి, 55:17 అక్కడ రెండు తూర్పులు మరియు రెండు పడమరలు అని ఉంది. అంటే చలికాలం మరియు వేసవి కాలంలో సూర్యోదయం మరియు సూర్యాస్తమయం అయ్యే రెండు

إِنَّا زَيَّنَّا السَّمَاءَ الدُّنْيَا بِزِينَةٍ الْكَوَاكِبِ ﴿٦﴾

**6.** నిశ్చయంగా, మేము భూలోకానికి దగ్గరి ఆకాశాన్ని నక్షత్రసముదాయాలతో అలంకరించాము;

وَحِفْظًا مِّن كُلِّ شَيْطَانٍ مَّارِدٍ ﴿٧﴾

**7.** మరియు ధిక్కారి అయిన ప్రతి షై'తాన్ నుండి కాపాడటానికి;[1]

لَّا يَسَّمَّعُونَ إِلَى الْمَلَإِ الْأَعْلَىٰ وَيُقْذَفُونَ مِن كُلِّ جَانِبٍ ﴿٨﴾

**8.** ఇక వారు (షై'తాన్‌లు), ఉన్నత స్థానాలలో ఉన్న నాయకుల (దైవదూతల) మాటలు వినలేరు మరియు వారు ప్రతి దిక్కునుండి తరమబడుతూ ఉంటారు.

دُحُورًا ۖ وَلَهُمْ عَذَابٌ وَاصِبٌ ﴿٩﴾

**9.** ఎందుకంటే) వారు (షై'తాన్‌లు) బహిష్కరించబడ్డారు. మరియు వారికి నిరంతరమైన శిక్ష ఉంది.

إِلَّا مَنْ خَطِفَ الْخَطْفَةَ فَأَتْبَعَهُ شِهَابٌ ثَاقِبٌ ﴿١٠﴾

**10.** కాని, ఎవరైనా (ఏ షై'తానైనా), దేనినైనా ఎగురవేసుకొని పోతున్నట్లైతే, మండే అగ్నిజ్వాల అతనిని వెంబడిస్తుంది.[2]

فَاسْتَفْتِهِمْ أَهُمْ أَشَدُّ خَلْقًا أَم مَّنْ خَلَقْنَا ۚ إِنَّا خَلَقْنَاهُم مِّن طِينٍ لَّازِبٍ ﴿١١﴾

**11.** అయితే వారిని అడగండి: "ఏమీ? వారు (మానవులు) దృఢమైన సృష్టా! లేక, మేము సృష్టించిన (ఈ సృష్టి దృఢమైనదా)?" నిశ్చయంగా, మేము వారిని జిగట మట్టి ('తీనిల్లా'జిబ్)తో సృష్టించాము.

بَلْ عَجِبْتَ وَيَسْخَرُونَ ﴿١٢﴾

**12.** వాస్తవానికి, నీవైతే ఆశ్చర్యపడుతున్నావు, కాని వారు ఎగతాళిచేస్తున్నారు.

وَإِذَا ذُكِّرُوا لَا يَذْكُرُونَ ﴿١٣﴾

**13.** మరియు వారికి ఉపదేశమిచ్చినపుడు,

---

చివరలు. వాస్తవానికి సంవత్సరపు ప్రతిరోజున సూర్యుడు ఒక క్రొత్త చోటునుండి ఉదయిస్తాడు మరియు ఒక క్రొత్త చోటులో అస్తమిస్తాడు (ఫ'త్హ్ అల్ ఖదీర్)

1 చూడండి, 15:17 నక్షత్రాల ఉనికికి మూడు కారణాలున్నాయి. 1) ఆకాశపు అలంకరణ 2) షైతానులు ఆకాశాలలోకి పోయి దైవదూతల మాటలు వినటానికి ప్రయత్నిస్తే వాటిని తరుమటం 3) రాత్రి చీకటిలో మానవులకు మార్గదర్శకత్వము చేయుటం. ఈ మూడు తప్ప ఇతర ఉపయోగాలు పేర్కొనబడలేదు.

2 చూడండి, 15:18.

వారు దానిని స్వీకరించరు.

**14.** మరియు వారొక సంకేతాన్ని చూసినప్పుడు, దానిని ఎగతాళిచేస్తారు.

**15.** మరియు వారిలా అంటారు: "ఇది స్పష్టమైన మంత్రజాలం మాత్రమే!

**16.** "ఏమిటి? మేము మరణించి మట్టిగా, ఎముకలుగా (అస్థిపంజరంగా) మారిపోయిన తరువాత కూడా మరల సజీవులుగా లేపబడతామా?

**17.** "ఏమిటి? మరియు పూర్వీకులైన మా తాతముత్తాతలు కూడానా?"

**18.** వారితో ఇలా అను: "అవును! అప్పుడు మీరు అధమమైనవారు అవుతారు."[1]

**19.** నిశ్చయంగా, అది ఒక పెద్ద ధ్వని మాత్రమే (రెండవ బాకా), అప్పుడు వారు (లేచి) చూస్తూ ఉండిపోతారు.

**20.** మరియు వారు ఇలా అంటారు: "అయ్యో! మాదౌర్భాగ్యం. ఇదే ఆ తీర్పుదినం."

**21.** (అప్పుడు వారితో ఇలా అనబడుతుంది): "మీరు అబద్ధమని తిరస్కరిస్తూ ఉండే న్యాయవిచారణదినం ఇదే!"[2] (1/4)

**22.** * (దైవదూతలతో ఇలా అనబడుతుంది) 'ఆ దుర్మార్గులను సమావేశపరచండి. మరియు వారి సహవాసులను మరియు వారు ఆరాధిస్తూ ఉన్న వారిని -

**23.** "అల్లాహ్ ను కాదని! తరువాత వారందరికీ ప్రజ్వలించే నరకాగ్ని మార్గాన్ని

وَإِذَا رَأَوْا آيَةً يَسْتَسْخِرُونَ ﴿١٤﴾

وَقَالُوا إِنْ هَٰذَا إِلَّا سِحْرٌ مُبِينٌ ﴿١٥﴾

أَإِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا وَعِظَامًا أَإِنَّا لَمَبْعُوثُونَ ﴿١٦﴾

أَوَآبَاؤُنَا الْأَوَّلُونَ ﴿١٧﴾

قُلْ نَعَمْ وَأَنْتُمْ دَاخِرُونَ ﴿١٨﴾

فَإِنَّمَا هِيَ زَجْرَةٌ وَاحِدَةٌ فَإِذَا هُمْ يَنْظُرُونَ ﴿١٩﴾

وَقَالُوا يَا وَيْلَنَا هَٰذَا يَوْمُ الدِّينِ ﴿٢٠﴾

هَٰذَا يَوْمُ الْفَصْلِ الَّذِي كُنْتُمْ بِهِ تُكَذِّبُونَ ﴿٢١﴾

احْشُرُوا الَّذِينَ ظَلَمُوا وَأَزْوَاجَهُمْ وَمَا كَانُوا يَعْبُدُونَ ﴿٢٢﴾

مِنْ دُونِ اللَّهِ فَاهْدُوهُمْ إِلَىٰ صِرَاطِ الْجَحِيمِ ﴿٢٣﴾

---

1. చూడండి, 27:87 మరియు 40:60.
2. చూడండి, 77:13.

చూపండి;

وَقِفُوهُمْ ۖ إِنَّهُم مَّسْئُولُونَ ﴿٢٤﴾

**24.** "మరియు వారిని అక్కడ నిలబట్టండి వాస్తవానికి వారిని ప్రశ్నించవలసి ఉంది.

مَا لَكُمْ لَا تَنَاصَرُونَ ﴿٢٥﴾

**25.** "మీకేమైంది? మీరు పరస్పరం ఎందుకు సహాయం చేసుకోవటం లేదు?"

بَلْ هُمُ الْيَوْمَ مُسْتَسْلِمُونَ ﴿٢٦﴾

**26.** అలాకాదు! ఆ రోజు వారు తమను తాము అల్లాహ్‌కు అప్పగించుకుంటారు.

وَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَاءَلُونَ ﴿٢٧﴾

**27.** మరియు వారు ఒకరి వైపునకు మరొకరు మరలి ఇలా ప్రశ్నించుకుంటారు.

قَالُوا إِنَّكُمْ كُنتُمْ تَأْتُونَنَا عَنِ الْيَمِينِ ﴿٢٨﴾

**28.** కొందరు అంటారు: "మీరు మా వద్దకు (మమ్మల్ని మోసగించటానికి) మా కుడివైపు నుండి వచ్చేవారు!"[1]

قَالُوا بَل لَّمْ تَكُونُوا مُؤْمِنِينَ ﴿٢٩﴾

**29.** ఇతరులు ఇలా జవాబిస్తారు: "అలా కాదు, మీఅంతట మీరే విశ్వసించేవారుకాదు

وَمَا كَانَ لَنَا عَلَيْكُم مِّن سُلْطَانٍ ۖ بَلْ كُنتُمْ قَوْمًا طَاغِينَ ﴿٣٠﴾

**30.** "మాకు మీపై ఎలాంటి అధికారం ఉండేది కాదు. అలాకాదు! మీరే తలబిరుసు తనం చూపేవారు.[2]

فَحَقَّ عَلَيْنَا قَوْلُ رَبِّنَا ۖ إِنَّا لَذَائِقُونَ ﴿٣١﴾

**31.** "కావున, ఇప్పుడు మన ప్రభువు వాక్కు మనపై పూర్తిఅయ్యింది. నిశ్చయంగా మనమంతా (శిక్షను) రుచిచూడగలము

فَأَغْوَيْنَاكُمْ إِنَّا كُنَّا غَاوِينَ ﴿٣٢﴾

**32.** "కావున మేము మిమ్మల్ని తప్పు దారిలో పడవేశాము, నిశ్చయంగా, మేము కూడా మార్గభ్రష్టులమై ఉంటిమి!"[3]

فَإِنَّهُمْ يَوْمَئِذٍ فِي الْعَذَابِ مُشْتَرِكُونَ ﴿٣٣﴾

**33** అప్పుడు నిశ్చయంగా, వారందరూ ఆ రోజు, శిక్షలో భాగస్వాములవుతారు.

---

1 అంటే ధర్మం మరియు సత్యం పేరట వచ్చేవారు. అంటే వారు ఆచరించే ధర్మమే సత్యమైనదని!

2 ఇలాంటి ఆయత్‌లకు చూడండి, 14:21, 40:47-48, 34:31-32, 33:67-68, 7:38-39

3 చివరకు వారి నాయకులు ఒప్పుకుంటారు, వారు స్వయంగా తప్పుదారిలో ఉండి, తమ అనుచరులను కూడా తప్పుదారి పట్టించారని! షై'తాన్ మాటల కోసం చూడండి, 14:22

إِنَّا كَذَٰلِكَ نَفْعَلُ بِالْمُجْرِمِينَ ﴿٣٤﴾

**34.** నిశ్చయంగా, మేము అపరాధులతో ఇదే విధంగా ప్రవర్తిస్తాము.

إِنَّهُمْ كَانُوا إِذَا قِيلَ لَهُمْ لَا إِلَٰهَ إِلَّا اللَّهُ يَسْتَكْبِرُونَ ﴿٣٥﴾

**35.** వాస్తవానికి, వారితో: "అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దైవం లేదు" అని అన్నప్పుడు, వారు దురహంకారం చూపేవారు.

وَيَقُولُونَ أَئِنَّا لَتَارِكُو آلِهَتِنَا لِشَاعِرٍ مَجْنُونٍ ﴿٣٦﴾

**36.** మరియు వారు ఇలా అనేవారు: "ఏమిటి? మేము ఒక పిచ్చికవి కొరకు మా ఆరాధ్యదైవాలను త్యజించాలా?"[1]

بَلْ جَاءَ بِالْحَقِّ وَصَدَّقَ الْمُرْسَلِينَ ﴿٣٧﴾

**37.** వాస్తవానికి, అతను (ము'హమ్మద్) సత్యాన్ని తీసుకొనివచ్చాడు మరియు అతను (తనకు పూర్వం వచ్చిన) ప్రవక్తలను సత్యవంతులని ధృవపరచాడు.

إِنَّكُمْ لَذَائِقُو الْعَذَابِ الْأَلِيمِ ﴿٣٨﴾

**38.** నిశ్చయంగా, మీరు బాధాకరమైన శిక్షను రుచిచూడ గలరు;

وَمَا تُجْزَوْنَ إِلَّا مَا كُنْتُمْ تَعْمَلُونَ ﴿٣٩﴾

**39.** మరియు మీకు, మీరు చేస్తూ ఉండిన కర్మలకు తగిన ఫలితం తప్ప, మరేమీ ఇవ్వబడదు -

إِلَّا عِبَادَ اللَّهِ الْمُخْلَصِينَ ﴿٤٠﴾

**40.** ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులు తప్ప![2]

أُولَٰئِكَ لَهُمْ رِزْقٌ مَعْلُومٌ ﴿٤١﴾

**41.** అలాంటి వారి కొరకు వారికి తెలిసి ఉన్న జీవనోపాధి ఉంది;[3]

فَوَاكِهُ ۖ وَهُمْ مُكْرَمُونَ ﴿٤٢﴾

**42.** అన్నిరకాల ఫలాలు. మరియు వారు ఆదరించబడతారు;

فِي جَنَّاتِ النَّعِيمِ ﴿٤٣﴾

**43.** పరమ సుఖాలు గల స్వర్గవనాలలో:

---

1 వారు దైవప్రవక్త ('స'అస)ను పిచ్చికవి మరియు దివ్యఖుర్ఆన్‌ను కవిత్వం అని హేళన చేసేవారు. చూడండి, 36:69

2 వారికి అంటే అల్లాహ్ (సు.తా.) ఎన్నుకొన్న దాసులకు పదిరెట్లు పుణ్యఫలితం లభిస్తుంది చూడండి, 6:160

3. చూడండి, 2:25

**44.** ఆసనాల మీద ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చొని ఉంటారు;[1]

على سرر متقبلين

**45.** వారి మధ్య ప్రవహించే చెలమల నుండి, పానీయపు (మధు) పాత్రలు త్రిప్పబడుతుంటాయి;

يطاف عليهم بكأس من معين

**46.** అది తెల్లగా (మెరిసిపోతూ) త్రాగే వారికి ఎంతో రుచికరమైనదిగా ఉంటుంది;

بيضاء لذة للشربين

**47.** దానివల్ల వారికి ఎలాంటి బాధా కలుగదు మరియు వారు తమ తెలివినీ పోగొట్టుకోరు.

لا فيها غول ولا هم عنها ينزفون

**48.** మరియు వారి దగ్గర, శీలవతులైన తమ చూపులను నిగ్రహించుకునే, అందమైన కళ్ళుగల స్త్రీలు ఉంటారు.[2]

وعندهم قصرت الطرف عين

**49.** వారు దాచబడిన గ్రుడ్లవలే (కోమలంగా) ఉంటారు.[3]

كأنهن بيض مكنون

**50** అప్పుడు వారు ఒకరివైపుకొకరు మరలి, పరస్పరం ఇలా ప్రశ్నించుకుంటారు.

فأقبل بعضهم على بعض يتساءلون

**51.** వారిలో ఒకడు అంటాడు: "వాస్తవానికి (భూలోకంలో) నాకొక స్నేహితుడు (ఖరీనున్) ఉండేవాడు;

قال قائل منهم إني كان لي قرين

**52.** "అతడు నన్ను ఇలా అడిగేవాడు: 'ఏమీ? నీవు కూడా (పునరుత్థానం) నిజమేనని నమ్మేవారిలో ఒకడివా?

يقول أءنك لمن المصدقين

**53.** 'ఏమీ? మనం చనిపోయి మట్టిగా ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా నిశ్చయంగా, మనకు ప్రతిఫలమునేది

أءذا متنا وكنا ترابا وعظما أءنا لمدينون

1. చూడండి, 1۶ 47
2 చూడండి. 38.52.
3 చూడండి. 56.34 ఉష్ట్రపక్షి (నిప్పుకోడి) తన గ్రుడ్లను భద్రంగా దాచినందుకు అవి ఎంత సౌందర్యంగా ఉంటాయో స్వర్గపు 'హూర్‌లు అలాగే ఉంటారు

ఉంటుందా?' ''

قَالَ هَلْ أَنتُم مُّطَّلِعُونَ ﴿٥٤﴾

54. అతడు ఇంకా ఇలా అంటాడు: ''ఏమీ? మీరు అతనిని చూడదలచు కున్నారా?''

فَاطَّلَعَ فَرَآهُ فِي سَوَاءِ الْجَحِيمِ ﴿٥٥﴾

55. తరువాత అతడు తొంగిచూసి, అతనిని (తన పూర్వ స్నేహితుణ్ణి) భగభగ మండే నరకాగ్ని మధ్యలో చూస్తాడు.

قَالَ تَاللَّهِ إِن كِدتَّ لَتُرْدِينِ ﴿٥٦﴾

56. అతని (ఆ స్నేహితుని)తో, అతడు అంటాడు: ''అల్లాహ్ సాక్షిగా! నీవు నన్ను నాశనంచేసి ఉండేవాడివే!

وَلَوْلَا نِعْمَةُ رَبِّي لَكُنتُ مِنَ الْمُحْضَرِينَ ﴿٥٧﴾

57. ''ఒకవేళ నా ప్రభువు అనుగ్రహమే లేకున్నట్లయితే! నేనుకూడా (నరకానికి) హాజరుచేయబడినవారిలో చేరిపోయేవాడిని.''

أَفَمَا نَحْنُ بِمَيِّتِينَ ﴿٥٨﴾

58. (తరువాత ఆ స్వర్గవాసి తన సహచరులతో అంటాడు): ''ఏమీ? ఇక మనం మరల చనిపోము కదా?

إِلَّا مَوْتَتَنَا الْأُولَىٰ وَمَا نَحْنُ بِمُعَذَّبِينَ ﴿٥٩﴾

59 ''మన మొదటి (భూలోక) మరణం తప్ప! మనకు ఇక ఎలాంటి శిక్ష పడదు కదా?''

إِنَّ هَٰذَا لَهُوَ الْفَوْزُ الْعَظِيمُ ﴿٦٠﴾

60 నిశ్చయంగా, ఇదే ఆ గొప్ప సాఫల్యం (విజయం).[1]

لِمِثْلِ هَٰذَا فَلْيَعْمَلِ الْعَامِلُونَ ﴿٦١﴾

61. ఇలాంటి (స్థానం) పొందటానికి పాటు పడేవారు పాటుపడాలి

أَذَٰلِكَ خَيْرٌ نُّزُلًا أَمْ شَجَرَةُ الزَّقُّومِ ﴿٦٢﴾

62. ఏమీ? ఇలాంటి ఆతిథ్యం మేలైనదా? లేక జముదుఫలపు[2] ఆతిథ్యమా?

---

1 అంటే తీర్పు తరువాత స్వర్గవాసులు ఎల్లప్పుడు స్వర్గంలో మరియు నరకవాసులు శాశ్వతంగా నరకంలో ఉంటారు. అప్పుడు మరణాన్ని ఒక గొర్రె ఆకారంలో తెచ్చి స్వర్గనరకాల మధ్య జిబ్హ్ చేయడం జరుగుతుంది. ('హదీస్')

2 అజ్-'జఖ్ఖూము: జముడుచెట్టు ఫలం. ఇది అరబ్ తిహామహ్ ప్రాంతాలలో ఉన్నదేనని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇది ఎంతో చేదైన దుర్వాసన గల ఫలం. ఇంకా చూడండి, 17:60, 44:43 మరియు 56:52

إِنَّا جَعَلْنَٰهَا فِتْنَةً لِّلظَّٰلِمِينَ ۝٦٣

**63.** నిశ్చయంగా, మేము దానిని, దుర్మార్గుల కొరకు ఒక పరీక్షగా చేశాము.

إِنَّهَا شَجَرَةٌ تَخْرُجُ فِىٓ أَصْلِ ٱلْجَحِيمِ ۝٦٤

**64.** నిశ్చయంగా, అది నరకపు అడుగు భాగంనుండి మొలిచే ఒక చెట్టు;

طَلْعُهَا كَأَنَّهُۥ رُءُوسُ ٱلشَّيَٰطِينِ ۝٦٥

**65.** దాని మొగ్గలు షైతానుల తలలవలే ఉంటాయి

فَإِنَّهُمْ لَءَاكِلُونَ مِنْهَا فَمَالِـُٔونَ مِنْهَا ٱلْبُطُونَ ۝٦٦

**66.** నిశ్చయంగా, వారు దానినుంచే తింటారు మరియు దానితోనే తమకడుపులు నింపుకుంటారు.

ثُمَّ إِنَّ لَهُمْ عَلَيْهَا لَشَوْبًا مِّنْ حَمِيمٍ ۝٦٧

**67.** తరువాత నిశ్చయంగా, దాని మీద వారికి త్రాగటానికి సలసల కాగే పానీయం మాత్రమే ఉంటుంది.[1]

ثُمَّ إِنَّ مَرْجِعَهُمْ لَإِلَى ٱلْجَحِيمِ ۝٦٨

**68.** ఆ తరువాత నిశ్చయంగా, వారి మరలింపు కేవలం భగభగ మండే నరకాగ్ని వైపునకే అవుతుంది.

إِنَّهُمْ أَلْفَوْا۟ ءَابَآءَهُمْ ضَآلِّينَ ۝٦٩

**69.** నిశ్చయంగా, అప్పుడు వారు తమ తండ్రితాతలు, మార్గభ్రష్టత్వంలో ఉండేవారని కనుగొంటారు!

فَهُمْ عَلَىٰٓ ءَاثَٰرِهِمْ يُهْرَعُونَ ۝٧٠

**70.** మరియు తాము కూడా వారి అడుగు జాడలను అనుసరించటానికి త్వరపడుతూ ఉండేవారమని!

وَلَقَدْ ضَلَّ قَبْلَهُمْ أَكْثَرُ ٱلْأَوَّلِينَ ۝٧١

**71.** మరియు వాస్తవానికి వారి పూర్వీకులు కూడా చాలామంది మార్గభ్రష్టులుగానే ఉండేవారు.

وَلَقَدْ أَرْسَلْنَا فِيهِم مُّنذِرِينَ ۝٧٢

**72.** మరియు వాస్తవానికి మేము వారి వద్దకు హెచ్చరిక చేయటానికి (సందేశహరులను) పంపిఉన్నాము.

1. చూడండి. 47:15

فَانظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُنذَرِينَ ﴿٧٣﴾

**73.** ఇక చూడండి! హెచ్చరిక చేయబడిన వారి పర్యవసానం ఎలా ఉండిందో!

إِلَّا عِبَادَ اللَّهِ الْمُخْلَصِينَ ﴿٧٤﴾

**74.** ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులుతప్ప!

وَلَقَدْ نَادَانَا نُوحٌ فَلَنِعْمَ الْمُجِيبُونَ ﴿٧٥﴾

**75.** మరియు వాస్తవంగా, నూ'హ్[1] మమ్మల్ని వేడుకున్నాడు ఎందుకంటే, మేము (ప్రార్థనలకు) ప్రత్యుత్తరమిచ్చేవారిలో సర్వోత్తములము.

وَنَجَّيْنَاهُ وَأَهْلَهُ مِنَ الْكَرْبِ الْعَظِيمِ ﴿٧٦﴾

**76.** మరియు మేము అతనిని మరియు అతని కుటుంబంవారిని మహావిపత్తు (జలప్రళయం) నుండి కాపాడాము.[2]

وَجَعَلْنَا ذُرِّيَّتَهُ هُمُ الْبَاقِينَ ﴿٧٧﴾

**77.** మరియు అతని సంతతివారిని మాత్రమే మిగిలి ఉండేటట్లు చేశాము.[3]

وَتَرَكْنَا عَلَيْهِ فِي الْآخِرِينَ ﴿٧٨﴾

**78.** మరియు తరువాత వచ్చేవారిలో అతని కీర్తిని (పేరు ప్రతిష్ఠలను) నిలిపాము.

سَلَامٌ عَلَىٰ نُوحٍ فِي الْعَالَمِينَ ﴿٧٩﴾

**79.** సర్వ లోకాలలో నూ'హ్‌కు శాంతి కలుగు గాక (సలాం)!

إِنَّا كَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ﴿٨٠﴾

**80.** నిశ్చయంగా, మేము సజ్జనులకు ఈ విధంగా ప్రతిఫలం ఇస్తూ ఉంటాము.

إِنَّهُ مِنْ عِبَادِنَا الْمُؤْمِنِينَ ﴿٨١﴾

**81.** నిశ్చయంగా, అతను మా విశ్వాసులైన దాసులలోని వాడు

ثُمَّ أَغْرَقْنَا الْآخَرِينَ ﴿٨٢﴾

**82.** తరువాత మేము ఇతరులను ముంచివేశాము. (3/8)

---

**1**. నూ'హ్ ('అ.స.) గాథ కోసం చూడండి, 11:25-48.

**2** అహ్లున్, అంటే అతని కుటుంబంవారే కాక అతనితో బాటు విశ్వసించిన అతని అనుచరులు కూడాను

**3** నూ'హ్ ('అ.స.) భార్య మరియు అతని ఒక కుమారుడు విశ్వసించలేదు కాబట్టి వారు. మునిగిపోయారు అతని కుమారులలో 'హామ్, సామ్, యాఫస్'లు నావలో ఉన్నారు 1) సామ్ నుండి 'అరబ్బులు, పర్షియన్‌లు, యూరోపియన్‌లు మరియు యూదులు, 2) 'హామ్ సంతతి నుండి సూడాన్, ఇండియా, 'హబషా, ఖిబ్తీలు మరియు బర్‌బర్‌లు మరియు 3) యాఫస్' సంతతినుండి తుర్కులు, ఖజర్, య'అ'జూజ్ మ'అ'జూజ్ మొదలైన వారు పుట్టారని చెబుతారు (ఫ'త్హ్ అల్ ఖదీర్).

وَاِنَّ مِنۡ شِيۡعَتِهٖ لَاِبۡرٰهِيۡمَ‌ۘ‏

**83.** * మరియు నిశ్చయంగా, అతనిని అనుసరించిన వారిలో ఇబ్రాహీమ్ ఒకడు.

اِذۡ جَآءَ رَبَّهٗ بِقَلۡبٍ سَلِيۡمٍ‏

**84.** అతను తన ప్రభువు సాన్నిధ్యానికి నిర్మల హృదయంతో వచ్చి;

اِذۡ قَالَ لِاَبِيۡهِ وَقَوۡمِهٖ مَاذَا تَعۡبُدُوۡنَ‌ۚ‏

**85.** అతను తన తండ్రి మరియు తనజాతి వారితో ఇలా అన్నాడు: "మీరు దేనిని ఆరాధిస్తున్నారు?

اَئِفۡكًا اٰلِهَةً دُوۡنَ اللّٰهِ تُرِيۡدُوۡنَ‌ؕ‏

**86.** "ఏమీ? మీరు అల్లాహ్‌ను వదలి మిథ్య (బూటక) దైవాలను (ఆరాధించ) గోరుతున్నారా?

فَمَا ظَنُّكُمۡ بِرَبِّ الۡعٰلَمِيۡنَ‏

**87.** "అయితే సర్వలోకాల ప్రభువును గురించి మీ అభిప్రాయమేమిటి?"

فَنَظَرَ نَظۡرَةً فِى النُّجُوۡمِۙ‏

**88.** ఆ తరువాత, అతను నక్షత్రాలవైపుకు తన దృష్టిని సారించాడు;[1]

فَقَالَ اِنِّىۡ سَقِيۡمٌ‏

**89.** అప్పుడు అతను ఇలా అన్నాడు: "నిశ్చయంగా, నా ఆరోగ్యం బాగులేదు."[2]

فَتَوَلَّوۡا عَنۡهُ مُدۡبِرِيۡنَ‏

**90.** కావున వారు అతనిని వదలిపెట్టి వెళ్ళిపోయారు.

فَرَاغَ اِلٰٓى اٰلِهَتِهِمۡ فَقَالَ اَلَا تَاۡكُلُوۡنَ‌ۚ‏

**91.** తరువాత అతను మెల్లగా వారిదేవతల (విగ్రహాల) దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాడు: "ఏమీ? మీరు తినటం లేదే?

مَا لَـكُمۡ لَا تَنۡطِقُوۡنَ‏

**92.** "మీ కేమైంది? మీరెందుకు మాట్లాడరు?"

فَرَاغَ عَلَيۡهِمۡ ضَرۡبًاۢ بِالۡيَمِيۡنِ‏

**93.** తరువాత అతను వాటి వద్దకు వెళ్ళి తన కుడిచేతితో వాటిని పగులగొట్టాడు.[3]

فَاَقۡبَلُوۡۤا اِلَيۡهِ يَزِفُّوۡنَ‏

**94.** అప్పుడు, వారు (ప్రజలు) అతని

---

1. చూడండి, 6:76-78.
2. చూడండి, 21:63
3. వివరాలకు చూడండి, 21:58

దగ్గరకు త్వరత్వరగా వచ్చారు.

95. అతను (ఇబ్రాహీమ్) వారితో అన్నాడు: "ఏమీ? మీరు చెక్కిన వాటినే మీరు ఆరాధిస్తారా?

قَالَ أَتَعْبُدُونَ مَا تَنْحِتُونَ ﴿٩٥﴾

96. "వాస్తవానికి, మిమ్మల్ని మరియు మీరు (చెక్కి) చేసిన వాటిని సృష్టించింది అల్లాహ్‌యే కదా!"[1]

وَاللَّهُ خَلَقَكُمْ وَمَا تَعْمَلُونَ ﴿٩٦﴾

97. వారు (పరస్పరం ఇలా చెప్పుకున్నారు): "ఇతనికొరకు ఒక (అగ్ని) గుండం నిర్మించి, తరువాత అతనిని ఆ భగభగ మండే అగ్నిలో పడవేయండి!"

قَالُوا ابْنُوا لَهُ بُنْيَانًا فَأَلْقُوهُ فِي الْجَحِيمِ ﴿٩٧﴾

98. కావున, వారు అతనికి విరుద్ధంగా పన్నాగాలు పన్నారు, కాని మేము వారిని కించపరచాము.

فَأَرَادُوا بِهِ كَيْدًا فَجَعَلْنَاهُمُ الْأَسْفَلِينَ ﴿٩٨﴾

99. మరియు అతను (ఇబ్రాహీమ్) అన్నాడు: "నిశ్చయంగా, నేను నా ప్రభువు (తీసుకొని వెళ్ళే) వైపునకు వెళ్ళిపోతాను ఆయనే నాకు మార్గదర్శకత్వం చేస్తాడు."[2]

وَقَالَ إِنِّي ذَاهِبٌ إِلَىٰ رَبِّي سَيَهْدِينِ ﴿٩٩﴾

100. (అతను ఇలా ప్రార్థించాడు): "ఓ నా ప్రభూ. నాకు సద్వర్తనుడైన (కుమారుణ్ణి) ప్రసాదించు!"

رَبِّ هَبْ لِي مِنَ الصَّالِحِينَ ﴿١٠٠﴾

101. కావున మేము అతనికి సహన శీలుడైన కుమారుని శుభవార్తనిచ్చాము.[3]

فَبَشَّرْنَاهُ بِغُلَامٍ حَلِيمٍ ﴿١٠١﴾

102. ఆ బాలుడు అతనికి తోడుగా శ్రమ చేయగల వయస్సుకు చేరుకున్నపుడు, అతను

فَلَمَّا بَلَغَ مَعَهُ السَّعْيَ قَالَ يَا بُنَيَّ إِنِّي أَرَىٰ فِي

1 సర్వసృష్టికి మూలాధారి అల్లాహ్ (సు.తా.) మాత్రమే! కావున ఆయనను ఆరాధించకుండా మీరు మీ చేతులతో తయారు చేసిన వాటిని ఎందుకు ఆరాధిస్తున్నారు

2 ఇబ్రాహీమ్ ('అ.స.) మొదట బాబుల్ అనే నగరంలో ఉండేవారు. అది ఇరాఖ్‌లో ఉంది. ఆ తరువాత అతను షామ్ వైపునకు వెళ్ళిపోయారు

3. అతను ఇబ్రాహీమ్ ('అ.స.) మొదటి కుమారుడు ఇస్మా'యీల్ ('అ.స.).

الْمَنَامِ أَنِّي أَذْبَحُكَ فَانظُرْ مَاذَا تَرَىٰ ۚ قَالَ يَا أَبَتِ افْعَلْ مَا تُؤْمَرُ ۖ سَتَجِدُنِي إِن شَاءَ اللَّهُ مِنَ الصَّابِرِينَ ﴿١٠٢﴾

(ఇబ్రాహీమ్) అన్నాడు: "ఓ నా కుమారా! వాస్తవానికి నేను నిన్ను బలి (జిబ్హ్) చేస్తున్నట్లుగా కలలో చూశాను, ఇక నీ సలహా ఏమిటో చెప్పు." అతను (ఇస్మా'యీల్) అన్నాడు: "ఓ నాన్నా! నీకు ఇవ్వబడిన ఆజ్ఞను నెరవేర్చు. అల్లాహ్ కోరితే నీవు నన్ను సహనశీలునిగా పొందగలవు!"

فَلَمَّا أَسْلَمَا وَتَلَّهُ لِلْجَبِينِ ﴿١٠٣﴾

**103.** ఆ తరువాత వారిద్దరూ ఆయన (అల్లాహ్) ఆజ్ఞను నెరవేర్చటానికి సిద్ధపడ్డారు మరియు అతను (ఇబ్రాహీమ్) అతనిని (ఇస్మా'యీల్‌ను) నుదుటిపై బోర్లా పరుండబెట్టాడు.

وَنَادَيْنَاهُ أَن يَا إِبْرَاهِيمُ ﴿١٠٤﴾

**104.** మరియు మేము అతనిని పిలుస్తూ ఇలా అన్నాము: "ఓ ఇబ్రాహీమ్!

قَدْ صَدَّقْتَ الرُّؤْيَا ۚ إِنَّا كَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ﴿١٠٥﴾

**105.** "వాస్తవంగా, నీవు కలను నిజం చేసి చూపించావు!" నిశ్చయంగా, మేము సజ్జనులకు ఇలాంటి ప్రతిఫలమిస్తాము.

إِنَّ هَٰذَا لَهُوَ الْبَلَاءُ الْمُبِينُ ﴿١٠٦﴾

**106.** నిశ్చయంగా ఇదొక స్పష్టమైన (కఠిన) పరీక్ష.

وَفَدَيْنَاهُ بِذِبْحٍ عَظِيمٍ ﴿١٠٧﴾

**107.** మరియు మేము అతనికి (ఇస్మా'యీల్‌కు) బదులుగా ఒక గొప్ప బలిని పరిహారంగా ఇచ్చాము.[1]

وَتَرَكْنَا عَلَيْهِ فِي الْآخِرِينَ ﴿١٠٨﴾

**108.** మరియు తరువాత వచ్చేతరాలలో అతని కీర్తిని నిలిపాము

سَلَامٌ عَلَىٰ إِبْرَاهِيمَ ﴿١٠٩﴾

**109.** "ఇబ్రాహీమ్‌కు శాంతి కలుగు గాక (సలాం)!"

كَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ﴿١١٠﴾

**110.** ఈ విధంగా మేము సజ్జనులకు ప్రతిఫలమిస్తాము.

---

1 ఈ బలి ఒక గొర్రె. అది ఇస్మా'యీల్ ('అ.స.)కు బదులుగా పంపబడింది. అది బలి చేయబడింది. దీని జ్ఞాపకార్థమే ముస్లింలు ప్రతి సంవత్సరం జుల్-హజ్జ్‌లో బలి (ఖుర్బానీ) ఇస్తారు. వివరాల కోసం చూడండి, 22:27-37 మరియు 2:196-203.

إِنَّهُۥ مِنْ عِبَادِنَا ٱلْمُؤْمِنِينَ ﴿١١١﴾

**111.** నిశ్చయంగా, అతను (ఇబ్రాహీమ్) విశ్వసించిన మా దాసులలోని వాడు!

وَبَشَّرْنَٰهُ بِإِسْحَٰقَ نَبِيًّا مِّنَ ٱلصَّٰلِحِينَ ﴿١١٢﴾

**112.** మరియు మేము అతనికి ఇస్'హాఖ్ యొక్క శుభవార్తను ఇచ్చాము, అతను ఒక సద్వర్తనుడైన ప్రవక్త.[1]

وَبَٰرَكْنَا عَلَيْهِ وَعَلَىٰٓ إِسْحَٰقَ ۚ وَمِن ذُرِّيَّتِهِمَا مُحْسِنٌ وَظَالِمٌ لِّنَفْسِهِۦ مُبِينٌ ﴿١١٣﴾

**113** మరియు మేము అతనిని (ఇబ్రాహీమ్‌ను) మరియు ఇస్'హాఖ్‌ను అనుగ్రహించాము. మరియు వారి సంతతిలో కొందరు సజ్జనులు ఉండేవారు మరికొందరు తమకు తాము స్పష్టంగా అన్యాయం చేసుకున్నవారు కూడా ఉన్నారు.[2]

وَلَقَدْ مَنَنَّا عَلَىٰ مُوسَىٰ وَهَٰرُونَ ﴿١١٤﴾

**114.** మరియు వాస్తవానికి, మేము మూసా మరియు హారూన్‌లను అనుగ్రహించాము

وَنَجَّيْنَٰهُمَا وَقَوْمَهُمَا مِنَ ٱلْكَرْبِ ٱلْعَظِيمِ ﴿١١٥﴾

**115.** మరియు మేము వారిద్దరిని మరియు వారి జాతి వారిని మహా విపత్తునుండి విముక్తి కలిగించాము.

1 ఒక కుమారుణ్ణి జి'బ్'హ్ చేసిన గాథ తరువాత మరొక కుమారుని, ఇ'స్హాఖ్ ('అ.స.) యొక్క శుభవార్త ఇవ్వబడుతోంది దీనితో స్పష్టమయ్యేది ఏమిటంటే జి'బ్'హ్ చేయబడిన కుమారుడు ఇస్మాయీల్ ('అ.స.) మాత్రమే అప్పుడతను('అ.స.)ను ఇబ్రాహీమ్ ('అ.స.) యొక్క ఏకైక పుత్రుడు (చూడండి, ఇబ్నె కసీ'ర్ మరియు ఫ'త్'హ్ అల్-ఖదీర్)

2 అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞతో, ఇ'స్హాఖ్ ('అ.స.) పుట్టకముందే, ఇబ్రాహీమ్ ('అ.స.) తన రెండవ భార్య హాజర్ మరియు ఆమె కుమారుడు ఇస్మా'యీల్ ('అలైహిమ్ స.)లను మక్కాలో వదిలారు. ఇస్మా'యీల్ ('అ.స.) అక్కడ జుర్'హుమ్ అనే 'అరబ్బు తెగ స్త్రీతో వివాహం చేసుకొని అక్కడేనివసిస్తూ 'అరబ్బులలో కలిసిపోయి 'అరబ్బు అయిపోయారు. అతని వంశంలో నుండి కేవలం ము'హమ్మద్ ('స.'అస) మాత్రమే ప్రవక్తగా ఎన్నుకోబడ్డారు.
ఇక ఇ'స్హాఖ్ ('అ.స.) కుమారుడు య'అఖూబ్ ('అ.స.). అతని మరొకపేరు ఇస్రాయీ'ల్ అదే పేరుతో అతని కుటుంబం వారు బనీ ఇస్రాయీ'ల్ అనబడ్డారు. అతనికి 12 మంది కుమారులు ప్రతి కుమారుని సంతతి నుండి ఒక బనీ ఇస్రాయీ'ల్ తెగ ఏర్పడింది. యూసుఫ్ ('అ.స.) ఆ పన్నెండు కుమారులలో ఒకరు. బనీ-ఇస్రాయీ'ల్ సంతతిలో నుండి చాలమంది ప్రవక్తలు వచ్చారు. మూసా మరియు 'ఈసా ('అలైహిమ్ స.)లు కూడా వారి సంతతిలోని వారే.
ఈ రెండు ప్రవక్తల సంతతిలో మంచివారు పుట్టారు, దుష్టులు కూడా పుట్టారు. కావున కేవలం తండ్రి తాతలు పుణ్యపురుషులు అయినంత మాత్రాన సంతానంలో అందరూ పుణ్యవంతులవటం తప్పనిసరి కాదు!

**116.** మరియు మేము వారికి సహాయం చేశాము, కాబట్టి వారు విజయం పొందిన వారయ్యారు.

وَنَصَرْنَٰهُمْ فَكَانُوا۟ هُمُ ٱلْغَٰلِبِينَ ﴿١١٦﴾

**117.** మరియు వారిద్దరికి (మంచిచెడులను) స్పష్టపరిచే గ్రంథాన్ని ప్రసాదించాము.[1]

وَءَاتَيْنَٰهُمَا ٱلْكِتَٰبَ ٱلْمُسْتَبِينَ ﴿١١٧﴾

**118.** మరియు వారిద్దరికి ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేశాము.

وَهَدَيْنَٰهُمَا ٱلصِّرَٰطَ ٱلْمُسْتَقِيمَ ﴿١١٨﴾

**119.** మరియు తరువాత తరాలవారిలో వారిద్దరిని గురించి మంచి కీర్తిని నిలిపాము.

وَتَرَكْنَا عَلَيْهِمَا فِى ٱلْءَاخِرِينَ ﴿١١٩﴾

**120.** "మూసా మరియు హారూన్‌లకు శాంతి కలుగు గాక (సలాం)!"

سَلَٰمٌ عَلَىٰ مُوسَىٰ وَهَٰرُونَ ﴿١٢٠﴾

**121.** నిశ్చయంగా, ఈ విధంగా మేము సజ్జనులకు ప్రతిఫలమిస్తాము.

إِنَّا كَذَٰلِكَ نَجْزِى ٱلْمُحْسِنِينَ ﴿١٢١﴾

**122.** నిశ్చయంగా, వారిద్దరూ, విశ్వాసులైన మా దాసులలోని వారు.

إِنَّهُمَا مِنْ عِبَادِنَا ٱلْمُؤْمِنِينَ ﴿١٢٢﴾

**123.** మరియు నిశ్చయంగా, ఇల్యాస్ కూడా మా సందేశహరులలో ఒకడు.[2]

وَإِنَّ إِلْيَاسَ لَمِنَ ٱلْمُرْسَلِينَ ﴿١٢٣﴾

**124.** అతను తన జాతివారితో ఇలా అన్నప్పుడు: "ఏమీ? మీకు దైవభీతి లేదా?

إِذْ قَالَ لِقَوْمِهِۦٓ أَلَا تَتَّقُونَ ﴿١٢٤﴾

**125.** "ఏమీ? మీరు బ'అల్[3] (అనే విగ్రహాన్ని) ఆరాధిస్తూ సర్వోత్తముడైన సృష్టికర్తను వదలిపెడుతున్నారా?

أَتَدْعُونَ بَعْلًا وَتَذَرُونَ أَحْسَنَ ٱلْخَٰلِقِينَ ﴿١٢٥﴾

**126.** "అల్లాహ్‌యే మీ ప్రభువు! మరియు

ٱللَّهَ رَبَّكُمْ وَرَبَّ ءَابَآئِكُمُ ٱلْأَوَّلِينَ ﴿١٢٦﴾

---

1. చూడండి. 5:44

2 ఇల్యాస్ (Elijah) ('అ.స.) హారూన్ ('అ.స.) సంతతికి చెందిన వారు. అతని నివాసం బఅల్‌బక్ నగరం. ఇల్యాస్ (ఎలియా) హెబ్రూ (యూదుల) ప్రవక్త. ఇతను ఫలస్తీన్ ఉత్తర భాగంలో అహాబ్ మరియు అహాజియా రాజుల కాలంలో ఉన్నారు. (దాదాపు క్రీ. శకానికి 9 సంవత్సరాలకు ముందు) ఇతని తరువాత అల్-యస'అ (Elisha, 'అ.స.) ప్రవక్తగా వచ్చారు.

3 ఇల్యాస్ (Elijah 'అ.స.) కాలపు ముష్రికులు బ'అల్ అనే విగ్రహాన్ని పూజించేవారు.

మీ పూర్వీకులైన మీ తండ్రితాతల ప్రభువు కదా?''

فَكَذَّبُوهُ فَإِنَّهُمْ لَمُحْضَرُونَ ۝
**127.** కాని వారు అతనిని (ఇల్యాస్‌ను) అసత్యవాదుడని తిరస్కరించారు, కాబట్టి వారు తప్పకుండా (శిక్ష కొరకు) హాజరు చేయబడతారు.

إِلَّا عِبَادَ اللَّهِ الْمُخْلَصِينَ ۝
**128.** ఎన్నుకోబడిన అల్లాహ్ దాసులు తప్ప!

وَتَرَكْنَا عَلَيْهِ فِي الْآخِرِينَ ۝
**129.** తరువాత వచ్చే తరాలలో అతని కీర్తిని (పేరు ప్రతిష్ఠలను) నిలిపాము.

سَلَامٌ عَلَىٰ إِلْ يَاسِينَ ۝
**130.** '' ఇల్-యాసీన్‌కు[1] శాంతి కలుగు గాక (సలాం)!''

إِنَّا كَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ۝
**131.** నిశ్చయంగా, సజ్జనులకు మేము ఈ విధంగా ప్రతిఫలమిస్తాము.

إِنَّهُ مِنْ عِبَادِنَا الْمُؤْمِنِينَ ۝
**132.** నిశ్చయంగా, అతను విశ్వాసులైన మా దాసులలోని వాడు.[2]

وَإِنَّ لُوطًا لَمِنَ الْمُرْسَلِينَ ۝
**133.** మరియు నిశ్చయంగా, లూ'త్ కూడా మేము పంపిన సందేశహరులలో ఒకడు.[3]

إِذْ نَجَّيْنَاهُ وَأَهْلَهُ أَجْمَعِينَ ۝
**134** ఎప్పుడైతే మేము అతనిని మరియు అతని కుటుంబం వారినందరిని రక్షించామో -

إِلَّا عَجُوزًا فِي الْغَابِرِينَ ۝
**135.** ముసలామె (అతని భార్య) తప్ప! ఆమె వెనుక ఉండిపోయే వారిలో చేరి

---

1 ఇల్-యాసీన్ (Elias), ఇల్యాస్ (Elijah) 'అ.స. పేరు యొక్క మరొక విధమైన ఉచ్చరణ ఏవిధంగానైతే తూర్ సీనా, యొక్క మరొక పేరు 'తూర్ సీనీన్ ఉందో!

2 ఖుర్ఆన్‌లో ఇతర ప్రవక్తల ప్రస్తావన వచ్చినపుడు, వారిని 'విశ్వాసులు' అని పేర్కొనబడింది దీని ద్వారా తెలిసేది ఏమిటంటే, ప్రవక్తల అందరి ధర్మం ఏకదైవ సిద్ధాంతం ఇస్లాం వారు అందరూ విశ్వాసం అంటే అల్లాహ్ (సు.తా.)కు విధేయులై ఉండాలనీ. అల్లాహ్ (సు.తా.) తప్ప ఇతరులను ఆరాధించరాదని బోధించారు.

3 లూ'త్ ('అ.స.) గాథ కొరకు, చూడండి. 7:80-84 మరియు 11:69-83

పోయింది[1]

136 ఆ తరువాత మిగతా వారినందరినీ నిర్మూలించాము.

137 మరియు వాస్తవానికి, మీరిప్పుడు వారి (శిథిల) ప్రాంతాల మీదుగా ఉదయపు వేళల్లో ప్రయాణిస్తూ ఉంటారు;[2]

138. మరియు రాత్రులలో కూడా! అయినా మీరు అర్థం చేసుకోలేరా?

139. మరియు నిశ్చయంగా, యూనుస్[3] కూడా మేము పంపిన సందేశహరులలోని వాడు.

140. అతను నిండు పడవవైపుకు పరిగెత్తి నప్పుడు;[4]

141. అక్కడ చీటీలలో పాల్గొన్నాడు, కాని ఓడిపోయాడు.

142. ఆ పిదప అతనిని ఒక పెద్దచేప మింగింది; ఎందుకంటే అతను నిందార్హుడు[5]

ثُمَّ دَمَّرْنَا الْاٰخَرِيْنَ ۝١٣٦

وَاِنَّكُمْ لَتَمُرُّوْنَ عَلَيْهِمْ مُّصْبِحِيْنَ ۝١٣٧

وَبِالَّيْلِ ۭ اَفَلَا تَعْقِلُوْنَ ۝١٣٨

وَاِنَّ يُوْنُسَ لَمِنَ الْمُرْسَلِيْنَ ۝١٣٩

اِذْ اَبَقَ اِلَى الْفُلْكِ الْمَشْحُوْنِ ۝١٤٠

فَسَاهَمَ فَكَانَ مِنَ الْمُدْحَضِيْنَ ۝١٤١

فَالْتَقَمَهُ الْحُوْتُ وَهُوَ مُلِيْمٌ ۝١٤٢

---

1 ఆమె - లూ'త్ ('అ.స.) భార్య - అవిశ్వాసులలో చేరిపోయి వెనుక ఉండిపోయింది చూడండి, 7:83 మరియు 11:81.

2 చూడండి, 15:76 మక్కా-సిరియా మార్గంలో ఈ నగరాలు సొదొమ్ మరియు గొమ్మొరాహ్‌లు - ఇప్పటి మృతసముద్రం - ప్రాంతంలో ఉండేవి.

3 యూనుస్ ('అ.స.) బైబిల్‌లో యోనా (Jonah)గా పేర్కొనబడ్డారు

4 అబఖ అంటే, to escape, ఒక బానిస తన స్వామిని విడిచి పారిపోవటం యూనుస్ ('అ.స.) తన స్వామి, అల్లాహ్ (సు.తా.) అనుమతి లేనిదే తన ప్రజలను విడిచి పారిపోయారు

5 యూనుస్ ('అ.స.) ఇరాఖ్ ప్రాంతంలో నైనవా (ఇప్పటి మోసల్) నగరానికి ప్రవక్తగా పంపబడ్డారు. అక్కడి రాజు ఒక లక్ష బనీ ఇస్రాయీల్ సంతతి వారిని బందీలుగా చేసుకున్నాడు వారి మార్గదర్శకత్వానికి అల్లాహ్ (సు.తా.), యూనుస్ ('అ.స.)ను పంపాడు కాని వారు అతనిని విశ్వసించలేదు. అతను వారిని అల్లాహ్(సు.తా.)శిక్ష రానున్నదనీ భయపెట్టారు ఆ శిక్ష రాకముందే అల్లాహ్ (సు.తా.) అనుమతి లేకుండానే అతను అక్కడి నుండి పారిపోయి నావ ఎక్కారు నావ బరువుతో మునిగి పోతుండగా, అక్కడ చీటీలు వేశారు దానిలో అతని పేరు రాగా అతను సముద్రంలోకి దూకారు అతనిని ఒక పెద్ద చేప మింగింది

**143** అప్పుడతను, (అల్లాహ్) పవిత్రతను కొనియాడే వారిలోని వాడు కాకపోయినట్లైతే![1]

فَلَوْلَآ أَنَّهُۥ كَانَ مِنَ ٱلْمُسَبِّحِينَ ١٤٣

**144** దాని (చేప) కడుపులో పునరుత్థాన దినం వరకు ఉండిపోయే వాడు. (1/2)

لَلَبِثَ فِى بَطْنِهِۦٓ إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ١٤٤

**145** * ఆ పిదప మేము అతనిని అనారోగ్యస్థితిలో, ఒక దిగంబర మైదానంలో పడవేశాము.

فَنَبَذْنَٰهُ بِٱلْعَرَآءِ وَهُوَ سَقِيمٌ ١٤٥

**146**. మరియు అతనిపై ఒక ఆనపజాతి తీగను మొలిపించాము.[2]

وَأَنۢبَتْنَا عَلَيْهِ شَجَرَةً مِّن يَقْطِينٍ ١٤٦

**147**. మరియు అతనిని ఒకలక్ష లేదా అంతకంటే ఎక్కువమంది (ప్రజల) వద్దకు పంపాము.

وَأَرْسَلْنَٰهُ إِلَىٰ مِا۟ئَةِ أَلْفٍ أَوْ يَزِيدُونَ ١٤٧

**148**. వారు విశ్వసించారు. కావున మేము ఒక నిర్ణీత కాలంవరకు వారిని సుఖసంతోషాలు అనుభవించనిచ్చాము.[3]

فَـَٔامَنُوا۟ فَمَتَّعْنَٰهُمْ إِلَىٰ حِينٍ ١٤٨

**149**. అయితే వారిని ఇలా అడుగు: "ఏమీ? నీ ప్రభువుకైతే కుమార్తెలు మరియు వారికొరకు కుమారులా?"[4]

فَٱسْتَفْتِهِمْ أَلِرَبِّكَ ٱلْبَنَاتُ وَلَهُمُ ٱلْبَنُونَ ١٤٩

**150** "లేక మేము దేవదూతలను స్త్రీలుగా పుట్టించామా? మరియు వారు దానికి సాక్షులా?"[5]

أَمْ خَلَقْنَا ٱلْمَلَٰٓئِكَةَ إِنَٰثًا وَهُمْ شَٰهِدُونَ ١٥٠

---

చేప కడుపులో అతను అల్లాహ్ (సు.తా.)ను వేడుకున్నారు. అప్పుడతను బయట వేయబడ్డారు. ఇంకా చూడండి, 68:48

1. అతని ప్రార్థన కోసం చూడండి, 21:87.

2 యఖ్'తీనున్. Gourd plant, ఆనపజాతి తీగ. అల్లాహ్ (సు.తా.) యూనుస్ ('అ.స.)ను ఏ చెట్టు చేమ లేని మైదానంలో పడవేసిన తరువాత అతని సహాయానికి ఒక ఆనప తీగను పుట్టించాడు. అదే విధంగా అల్లాహ్ (సు.తా.) కోరితే ఒక అవిశ్వాసిని విశ్వాసిగా మార్చవచ్చు! ఎప్పుడైతే అతడు హృదయపూర్వకంగా వేడుకుంటాడో!

3. వారు విశ్వసించిన వివరాల కోసం చూడండి, 10:98

4 చూడండి 16:57-59

5 వారు దైవదూతలలో స్త్రీలలో ఉండే లక్షణాలు ఏవైనా చూశారా? లేక మేము దేవదూతలను పుట్టించినప్పుడు వారు అక్కడ ఉన్నారా? వారిని స్త్రీలుగా పరిగణించటానికి?

**151.** అలాకాదు! నిశ్చయంగా, వారు (ఖురైషులు) తమ బూటకపు నమ్మకాల ఆధారంగా అంటున్నారు:

الا انهم من افكهم ليقولون ﴿١٥١﴾

**152.** "అల్లాహ్‌కు సంతానముంది!" అని. మరియు వారు నిశ్చయంగా, అబద్ధాలాడు తున్నారు!

ولد الله وانهم لكذبون ﴿١٥٢﴾

**153.** ఆయన (అల్లాహ్) కుమార్తెలను - కుమారులకు బదులుగా - ఎన్నుకున్నాడా?[1]

اصطفى البنات على البنين ﴿١٥٣﴾

**154.** మీ కేమయింది? మీరెట్టి నిర్ణయాలు చేస్తున్నారు?

ما لكم كيف تحكمون ﴿١٥٤﴾

**155.** ఏమీ? మీరు గ్రహించలేరా?

افلا تذكرون ﴿١٥٥﴾

**156.** లేక! మీవద్ద ఏదైనా స్పష్టమైన ప్రమాణం ఉందా?

ام لكم سلطن مبين ﴿١٥٦﴾

**157.** మీరు సత్యవంతులే అయితే మీ గ్రంథాన్ని తీసుకురండి!

فاتوا بكتبكم ان كنتم صدقين ﴿١٥٧﴾

**158.** మరియు వారు, ఆయన (అల్లాహ్) మరియు జిన్నాతుల మధ్య బంధుత్వం కల్పించారు.[2] కాని వాస్తవానికి జిన్నాతులకు తెలుసు, తాము ఆయన (అల్లాహ్) ముందు (లెక్కకొరకు) హాజరుచేయబడతామని.

وجعلوا بينه وبين الجنة نسبا ولقد علمت الجنة انهم لمحضرون ﴿١٥٨﴾

**159.** వారు కల్పించే విషయాలకు అల్లాహ్ అతీతుడు (పరమపవిత్రుడు)![3]

سبحن الله عما يصفون ﴿١٥٩﴾

**160.** ఎన్నుకోబడిన అల్లాహ్‌దాసులుతప్ప!

الا عباد الله المخلصين ﴿١٦٠﴾

**161.** ఇక నిశ్చయంగా, మీరు మరియు

فانكم وما تعبدون ﴿١٦١﴾

---

1 చూడండి, 6:100, 17:40, 53:19-22

2 ముష్రికుల కల్పన ఏమిటంటే అల్లాహ్ (సు.తా.) జిన్నాతులతో వివాహసంబంధం ఏర్పరచుకున్నాడు, దానితో ఆడపిల్లలు పుట్టారు, వారే దైవదూతలు అని. ఇది అసత్యం. *జిన్నున్:* అంటే మానవ ఇంద్రియాలకు అగోచర ప్రాణి.

3. చూడండి, 2:32, 6:100.

మీ ఆరాధ్య దైవాలు (కలిసి),

مَآ اَنْتُمْ عَلَيْهِ بِفٰتِنِيْنَ ۝
**162.** ఎవ్వడినీ కూడా, దుష్టకార్యాలు చేయటానికి పురికొలుపలేరు,

اِلَّا مَنْ هُوَ صَالِ الْجَحِيْمِ ۝
**163.** భగభగ మండే నరకాగ్నిలో కాలి పోనున్నవాడిని తప్ప!

وَمَا مِنَّآ اِلَّا لَهٗ مَقَامٌ مَّعْلُوْمٌ ۝
**164.** (దైవదూతలు ఇలా అంటారు): "మరియు మాలో ఒక్కడు కూడా తన స్థానం నియమించబడకుండా లేడు.

وَّاِنَّا لَنَحْنُ الصَّآفُّوْنَ ۝
**165.** మరియు నిశ్చయంగా, మేము కూడా (ఆయనను ప్రార్థించటానికి) వరుసలు దీరి నిలుచుంటాము.

وَاِنَّا لَنَحْنُ الْمُسَبِّحُوْنَ ۝
**166.** మరియు నిశ్చయంగా, మేముకూడా ఆయన పవిత్రతను కొనియాడేవారమే![1]

وَاِنْ كَانُوْا لَيَقُوْلُوْنَ ۝
**167.** మరియు (సత్యతిరస్కారులు) ఇలా అంటూ ఉండేవారు:

لَوْ اَنَّ عِنْدَنَا ذِكْرًا مِّنَ الْاَوَّلِيْنَ ۝
**168.** "ఒకవేళ మా పూర్వీకుల నుండి మాకు ఇలాంటి బోధన లభించిఉంటే!

لَكُنَّا عِبَادَ اللّٰهِ الْمُخْلَصِيْنَ ۝
**169.** "మేము కూడా, అల్లాహ్ యొక్క ఎన్నుకున్న, భక్తులమై ఉండేవారము!"

فَكَفَرُوْا بِهٖ فَسَوْفَ يَعْلَمُوْنَ ۝
**170.** కాని, వారిప్పుడు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) తిరస్కరిస్తున్నారు. ఇక త్వరలోనే వారు తెలుసుకుంటారు!

وَلَقَدْ سَبَقَتْ كَلِمَتُنَا لِعِبَادِنَا الْمُرْسَلِيْنَ ۝
**171.** మరియు వాస్తవానికి మా దాసులైన, మేము పంపిన సందేశహరుల విషయంలో మా నిర్ణయం జరిగింది:

---

1 అంటే దైవదూతలు కూడా అల్లాహ్(సు.తా.) సృష్టించిన ఆయన దాసులు. ఎల్లప్పుడు వారు కూడా అల్లాహ్ (సు.తా.)ను స్తుతిస్తూ ఉంటారు. ఆయన ఆజ్ఞా పాలన చేస్తూ ఉంటారు. ముష్రికులు భావించినట్లు వారు అల్లాహ్ (సు.తా.) కూతుళ్ళు కారు.

**172** నిశ్చయంగా, వారు సహాయం పొందుతారని!

إِنَّهُمْ لَهُمُ الْمَنصُورُونَ ﴿١٧٢﴾

**173**. మరియు నిశ్చయంగా, మా సైనికులే తప్పక విజయం పొందుతారని![1]

وَإِنَّ جُندَنَا لَهُمُ الْغَالِبُونَ ﴿١٧٣﴾

**174**. కావున నీవు వారిని (సత్య తిరస్కారులను) కొంతకాలం వదలిపెట్టు.

فَتَوَلَّ عَنْهُمْ حَتَّىٰ حِينٍ ﴿١٧٤﴾

**175**. మరియు వారిని చూస్తూ ఉండు. ఇక త్వరలోనే వారు కూడా (తమ పర్యవసానాన్ని) చూడగలరు!

وَأَبْصِرْهُمْ فَسَوْفَ يُبْصِرُونَ ﴿١٧٥﴾

**176**. ఏమీ? వారు మా శిక్ష కొరకు తొందర పెడుతున్నారా?

أَفَبِعَذَابِنَا يَسْتَعْجِلُونَ ﴿١٧٦﴾

**177**. కాని, అది వారి ఇంటి ప్రాంగణంలో దిగినప్పుడు, హెచ్చరించబడిన వారికి అది దుర్భరమైన ఉదయం కాగలదు!

فَإِذَا نَزَلَ بِسَاحَتِهِمْ فَسَاءَ صَبَاحُ الْمُنذَرِينَ ﴿١٧٧﴾

**178**. కావున నీవు ప్రస్తుతానికి వారిని వదలిపెట్టు,

وَتَوَلَّ عَنْهُمْ حَتَّىٰ حِينٍ ﴿١٧٨﴾

**179**. మరియు చూస్తూ ఉండు ఇక త్వరలోనే వారు కూడా (తమ పర్యవసానాన్ని) చూడగలరు!

وَأَبْصِرْ فَسَوْفَ يُبْصِرُونَ ﴿١٧٩﴾

**180**. నీ ప్రభువు సర్వలోపాలకు అతీతుడు, సర్వశక్తిమంతుడైన ప్రభువు, వారి కల్పనలకు అతీతుడు

سُبْحَانَ رَبِّكَ رَبِّ الْعِزَّةِ عَمَّا يَصِفُونَ ﴿١٨٠﴾

**181**. మరియు సందేశహరులందరికి శాంతి కలుగు గాక (సలాం)!

وَسَلَامٌ عَلَى الْمُرْسَلِينَ ﴿١٨١﴾

**182** మరియు సర్వస్తోత్రాలకు అర్హుడైన అల్లాహ్ యే సమస్తలోకాలకు ప్రభువు!

وَالْحَمْدُ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ ﴿١٨٢﴾

---

1. చూడండి, 37:179, 58:21

## 38 సూరహ్ 'సాద్

## سُورَةُ صٓ

'సాద్: ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్‌లోని అక్షరంతో పెట్టబడింది. ఈ సూరహ్ ప్రవక్తృత్వం లభించిన నాలుగైదు సంవత్సరాల తరువాత అవతరింపజేయబడింది. దైవమార్గదర్శకత్వం గురించి ఇందులో వివరించబడింది. ఈ అనుక్రమంలో ఇది పదవది. మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **88** ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِیْمِ ۝

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

صٓ وَالْقُرْاٰنِ ذِی الذِّكْرِ ۝١

**1.** 'సాద్. మరియు హితబోధతో నిండివున్న ఈ ఖుర్‌ఆన్ సాక్షిగా!

بَلِ الَّذِیْنَ كَفَرُوْا فِیْ عِزَّةٍ وَّشِقَاقٍ ۝٢

**2.** వాస్తవానికి, సత్యాన్ని తిరస్కరించిన వారు అహంకారంలో మరియు విరోధంలో పడివున్నారు.

كَمْ اَهْلَكْنَا مِنْ قَبْلِهِمْ مِّنْ قَرْنٍ فَنَادَوْا وَّلَاتَ
حِیْنَ مَنَاصٍ ۝٣

**3.** వారికి పూర్వం గతించిన ఎన్నో తరాలను మేము నాశనంచేశాము. అప్పుడు వారు మొరపెట్టుకోసాగారు, కాని అప్పుడు వారికి దానినుండి తప్పించుకునే సమయం లేక పోయింది.

وَعَجِبُوْۤا اَنْ جَآءَهُمْ مُّنْذِرٌ مِّنْهُمْ ؗ وَقَالَ الْكٰفِرُوْنَ
هٰذَا سٰحِرٌ كَذَّابٌ ۝٤

**4.** మరియు వారిని హెచ్చరించేవాడు, తమలో నుంచే రావటం చూసి వారు ఆశ్చర్యపడ్డారు! మరియు సత్యతిరస్కారులు ఇలా అన్నారు: ''ఇతడు మాంత్రికుడు, అసత్యవాది.

اَجَعَلَ الْاٰلِهَةَ اِلٰهًا وَّاحِدًا ۖۚ اِنَّ هٰذَا لَشَیْءٌ عُجَابٌ ۝٥

**5.** ''ఏమీ? అతను (ప్రవక్త) దైవాలందరినీ, ఒకే ఆరాధ్య దైవంగా చేశాడా? నిశ్చయంగా ఇది ఎంతో విచిత్రమైన విషయం!''

وَانْطَلَقَ الْمَلَاُ مِنْهُمْ اَنِ امْشُوْا وَاصْبِرُوْا عَلٰۤی اٰلِهَتِكُمْ ۖۚ
اِنَّ هٰذَا لَشَیْءٌ یُّرَادُ ۝٦

**6.** మరియు వారి నాయకులు ఇలా అనసాగారు: ''పదండి! మీరు మీ దైవాల (ఆరాధన) మీద స్థిరంగాఉండండి.'' నిశ్చయంగా, ఇందులో (మీకు విరుద్ధంగా)

ఏదో ఉద్దేశింపబడి ఉంది!

7. "ఇలాంటి విషయాన్ని మేము ఇటీవలి కాలపు మతంలో వినిఉండలేదు. ఇది కేవలం కల్పన మాత్రమే!

مَا سَمِعْنَا بِهَٰذَا فِي الْمِلَّةِ الْآخِرَةِ إِنْ هَٰذَا إِلَّا اخْتِلَاقٌ ﴿٧﴾

8. "ఏమీ? మా అందరిలోనూ, కేవలం ఇతని పైననే, ఈ హితబోధ అవతరింపజేయ బడిందా?"[1] వాస్తవానికి వారు నా హితబోధను గురించి సంశయంలో పడివున్నారు.[2] అలాకాదు, వారు ఇంకా (నా) శిక్షను రుచిచూడలేదు!

أَأُنزِلَ عَلَيْهِ الذِّكْرُ مِن بَيْنِنَا ۚ بَلْ هُمْ فِي شَكٍّ مِّن ذِكْرِي ۖ بَل لَّمَّا يَذُوقُوا عَذَابِ ﴿٨﴾

9. లేక వారి దగ్గర సర్వశక్తుడు, సర్వప్రదుడు[3] అయిన నీ ప్రభువు యొక్క కారుణ్యనిధులు ఉన్నాయా?

أَمْ عِندَهُمْ خَزَائِنُ رَحْمَةِ رَبِّكَ الْعَزِيزِ الْوَهَّابِ ﴿٩﴾

10. లేక! ఆకాశాలు మరియు భూమి మరియు వాటి మధ్య ఉన్న సమస్తం మీద వారికి సామ్రాజ్యాధిపత్యం ఉందా? అలా అయితే వారిని తమ సాధనాలతో పైకి (ఆకాశంలోకి) ఎక్కమను!

أَمْ لَهُم مُّلْكُ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَمَا بَيْنَهُمَا ۖ فَلْيَرْتَقُوا فِي الْأَسْبَابِ ﴿١٠﴾

11. ఇంతకు ముందు ఓడించబడిన సైన్యాలవలే, ఒక వర్గం వీరిది కూడా ఉంటుంది!

جُندٌ مَّا هُنَالِكَ مَهْزُومٌ مِّنَ الْأَحْزَابِ ﴿١١﴾

12. వీరికి పూర్వం నూ'హ్ మరియు 'ఆద్ (జాతి) వారు మరియు మేకుల ఫిర్'ఔన్ జాతులవారు సత్యాన్ని తిరస్కరించారు;

كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ وَعَادٌ وَفِرْعَوْنُ ذُو الْأَوْتَادِ ﴿١٢﴾

13. మరియు, స'మూద్ మరియు లూ'త్ జాతుల వారు మరియు అయ్'కహ్ (మద్'యన్)[4]

وَثَمُودُ وَقَوْمُ لُوطٍ وَأَصْحَابُ الْأَيْكَةِ ۚ أُولَٰئِكَ الْأَحْزَابُ ﴿١٣﴾

---

1 చూడండి, 43:31-32

2 వారు సంశయంలో పడింది ము'హమ్మద్ (స'అస) అసత్యవాది అని కాదు. అతను బోధించే ధర్మం వారి దైవాలను వదలి, అగోచరుడైన ఏకైక దైవం అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించమని చెప్పడం

3 అల్-వహ్హాబ్: Bestower సర్వప్రదుడు, సర్వవర ప్రదాత, పరమదాత చూడండి, 3:8

4 అయ్'కహ్ వాసుల గాథ కొరకు చూడండి, 26:176.

వాసులు అందరూ ఇలాంటి వర్గాలకు చెందినవారే.

إِن كُلٌّ إِلَّا كَذَّبَ ٱلرُّسُلَ فَحَقَّ عِقَابِ ﴿١٤﴾

**14.** ఇక వీరిలో ఏ ఒక్కరూ ప్రవక్తలను అసత్యవాదులని తిరస్కరించకుండా ఉండ లేదు, కావున నా శిక్ష అనివార్యమయ్యింది.

وَمَا يَنظُرُ هَٰٓؤُلَآءِ إِلَّا صَيْحَةً وَٰحِدَةً مَّا لَهَا
مِن فَوَاقٍ ﴿١٥﴾

**15.** మరియు వీరందరూ కేవలం ఒక గర్జన ('సయ్'హా)[1] కొరకు మాత్రమే ఎదురు చూస్తున్నారు, దానికి ఎలాంటి నిలుపుదల ఉండదు

وَقَالُوا۟ رَبَّنَا عَجِّل لَّنَا قِطَّنَا قَبْلَ يَوْمِ
ٱلْحِسَابِ ﴿١٦﴾

**16.** మరియు వారు: "ఓ మా ప్రభూ, లెక్క దినానికి ముందే మా భాగం మాకు తొందరగా ఇచ్చివెయ్యి."[2] అని అంటారు.

ٱصْبِرْ عَلَىٰ مَا يَقُولُونَ وَٱذْكُرْ عَبْدَنَا دَاوُۥدَ
ذَا ٱلْأَيْدِ ۖ إِنَّهُۥٓ أَوَّابٌ ﴿١٧﴾

**17.** (ఓ ము'హమ్మద్!) వారి మాటల యెడల నీవు సహనంవహించు మరియు బలవంతుడైన, మా దాసుడు దావూద్‌ను జ్ఞాపకం చేసుకో.[3] నిశ్చయంగా, అతను ఎల్లప్పుడూ పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపునకు) మరలుతూ ఉండేవాడు.

إِنَّا سَخَّرْنَا ٱلْجِبَالَ مَعَهُۥ يُسَبِّحْنَ بِٱلْعَشِىِّ
وَٱلْإِشْرَاقِ ﴿١٨﴾

**18.** నిశ్చయంగా, మేము పర్వతాలను అతనితోబాటు సాయంత్రం మరియు ఉదయం మా పవిత్రతను కొనియాడుతూ ఉండేటట్లు చేశాము.

وَٱلطَّيْرَ مَحْشُورَةً ۖ كُلٌّ لَّهُۥٓ أَوَّابٌ ﴿١٩﴾

**19.** మరియు పక్షులు కూడా గుమికూడేవి అంతా కలసి ఆయన (అల్లాహ్) వైపుకు మరలే వారు

---

1 పునరుత్థాన దినమున ఇస్రాఫీల్ ('అ.స.) ఊదే బాకా ధ్వని, అరుపు, ప్రేలుడు గర్జన లేక శబ్దం. ఇంకా చూడండి, 36:29, 49, 53

2 అంటే వారు పునరుత్థానదినం గురించి పరిహాసం చేస్తూ 'ఆ దినం రాకముందే మా భాగపు శిక్ష మాకు ఇవ్వు.' అని అంటున్నారు. చూడండి, 8:32.

3 అల్లాహ్ (సు.తా.)కు ప్రియమైనవి దావూద్ ('అ.స.) నమా'జ్ మరియు అతని ఉపవాసం అతను సగం రాత్రి నిద్రపోయే వారు, లేచి మూడోవంతు రాత్రి నమా'జ్ చేసేవారు. అతను రోజు విడిచి రోజు ఉపవాసం ఉండేవారు. అతను యుద్ధరంగాన్ని విడిచి ఎన్నడూ పారిపోలేదు ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

**20.** మరియు మేము అతని సామ్రాజ్యాన్ని పటిష్ఠపరిచాము మరియు మేము అతనికి వివేకాన్ని మరియు తిరుగులేని తీర్పు చేయటంలో, నేర్పరితనాన్ని ప్రసాదించాము. (5/8)

وَشَدَدْنَا مُلْكَهُۥ وَءَاتَيْنَٰهُ ٱلْحِكْمَةَ وَفَصْلَ ٱلْخِطَابِ ﴿٢٠﴾

**21.** * మరియు తగవులాడుకొని వచ్చిన ఆ ఇద్దరివార్త నీకు చేరిందా?[1] వారు గోడఎక్కి అతని ప్రార్థనాగదిలోకి వచ్చారు.

وَهَلْ أَتَىٰكَ نَبَؤُا۟ ٱلْخَصْمِ إِذْ تَسَوَّرُوا۟ ٱلْمِحْرَابَ ﴿٢١﴾

**22.** వారు దావూద్ వద్దకు వచ్చినపుడు, అతను వారిని చూసి బెదిరిపోయాడు. వారన్నారు: "భయపడకు! మేమిద్దరం ప్రత్యర్థులం, మాలో ఒకడు మరొకనికి అన్యాయం చేశాడు. కావున నీవు మా మధ్య న్యాయంగా తీర్పుచెయ్యి మరియు నీతిమీరి నడువకు, మాకు సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చెయ్యి

إِذْ دَخَلُوا۟ عَلَىٰ دَاوُۥدَ فَفَزِعَ مِنْهُمْ ۖ قَالُوا۟ لَا تَخَفْ ۖ
خَصْمَانِ بَغَىٰ بَعْضُنَا عَلَىٰ بَعْضٍ فَٱحْكُم بَيْنَنَا
بِٱلْحَقِّ وَلَا تُشْطِطْ وَٱهْدِنَآ إِلَىٰ سَوَآءِ ٱلصِّرَٰطِ ﴿٢٢﴾

**23.** "వాస్తవానికి, ఇతడు నా సోదరుడు, ఇతనివద్ద తొంభై తొమ్మిది ఆడగొర్రెలున్నాయి మరియు నా దగ్గర కేవలం ఒకేఒక్క ఆడగొర్రె ఉంది, అయినా ఇతడు అంటున్నాడు: 'దీనిని నాకివ్వు.' మరియు తన మాటల నేర్పుతో నన్ను వశపరచుకుంటున్నాడు."

إِنَّ هَٰذَآ أَخِى لَهُۥ تِسْعٌ وَتِسْعُونَ نَعْجَةً وَلِىَ نَعْجَةٌ
وَٰحِدَةٌ فَقَالَ أَكْفِلْنِيهَا وَعَزَّنِى فِى ٱلْخِطَابِ ﴿٢٣﴾

**24.** (దావూద్) అన్నాడు: "వాస్తవంగా, నీ ఆడగొర్రెను తనగొర్రెలలో కలుపు కోవటానికి అడిగి, ఇతడు నీపై అన్యాయం చేస్తున్నాడు. మరియు వాస్తవానికి, చాలామంది భాగస్థులు ఒకరికొకరు అన్యాయం చేసుకుంటూ ఉంటారు, విశ్వసించి సత్కార్యాలు చేసేవారు తప్ప! కాని అటు వంటి వారు కొందరు మాత్రమే!" వాస్తవానికి మేము అతనిని (దావూద్‌ను) పరీక్షిస్తున్నా మని అతను అర్థంచేసుకున్నాడు.

قَالَ لَقَدْ ظَلَمَكَ بِسُؤَالِ نَعْجَتِكَ إِلَىٰ نِعَاجِهِۦ ۖ وَإِنَّ
كَثِيرًا مِّنَ ٱلْخُلَطَآءِ لَيَبْغِى بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ إِلَّا
ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ وَقَلِيلٌ مَّا هُمْ ۗ
وَظَنَّ دَاوُۥدُ أَنَّمَا فَتَنَّٰهُ فَٱسْتَغْفَرَ رَبَّهُۥ وَخَرَّ رَاكِعًا
وَأَنَابَ ۩ ﴿٢٤﴾

1 చాలా మంది వ్యాఖ్యాతల ప్రకారం ఆ ఇద్దరు ప్రత్యర్థులు దైవదూతలు

కాబట్టి తన ప్రభువును క్షమాపణ వేడుకున్నాడు. మరియు సాష్టాంగం (సజ్దా)లో పడిపోయాడు. మరియు పశ్చాత్తాపంతో (అల్లాహ్ వైపుకు) మరలాడు. ۩

**25.** అప్పుడు మేము అతని ఆ(తప్పును) క్షమించాము. మరియు నిశ్చయంగా మా వద్ద అతనికి సాన్నిహిత్యం మరియు మంచి స్థానం కూడా ఉన్నాయి.

فَغَفَرْنَا لَهُ ذَٰلِكَ ۖ وَإِنَّ لَهُ عِندَنَا لَزُلْفَىٰ وَحُسْنَ مَآبٍ ﴿٢٥﴾

**26.** (మేము అతనితో ఇలా అన్నాము): "ఓ దావూద్! నిశ్చయంగా, మేము నిన్ను భూమిలో ఉత్తరాధికారిగా నియమించాము కావున నీవు ప్రజల మధ్య న్యాయంగా తీర్పుచెయ్యి మరియు నీ మనోకాంక్షలను అనుసరించకు, ఎందుకంటే అవి నిన్ను అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తాయి." నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ మార్గంనుండి తప్పిపోతారో, వారికి లెక్క దినమును మరచిపోయిన దాని ఫలితంగా, కఠినమైన శిక్ష పడుతుంది.

يَا دَاوُودُ إِنَّا جَعَلْنَاكَ خَلِيفَةً فِي الْأَرْضِ فَاحْكُم بَيْنَ النَّاسِ بِالْحَقِّ وَلَا تَتَّبِعِ الْهَوَىٰ فَيُضِلَّكَ عَن سَبِيلِ اللَّهِ ۚ إِنَّ الَّذِينَ يَضِلُّونَ عَن سَبِيلِ اللَّهِ لَهُمْ عَذَابٌ شَدِيدٌ بِمَا نَسُوا يَوْمَ الْحِسَابِ ﴿٢٦﴾

**27.** మరియు మేము ఈ ఆకాశాన్ని మరియు ఈ భూమిని మరియు వాటిమధ్య ఉన్నదాన్నంతా వృథాగా సృష్టించలేదు! ఇది సత్యాన్ని తిరస్కరించిన వారి భ్రమ మాత్రమే.[1] కావున అట్టి సత్యతిరస్కారులకు నరకాగ్ని బాధ పడనున్నది!

وَمَا خَلَقْنَا السَّمَاءَ وَالْأَرْضَ وَمَا بَيْنَهُمَا بَاطِلًا ۚ ذَٰلِكَ ظَنُّ الَّذِينَ كَفَرُوا ۚ فَوَيْلٌ لِّلَّذِينَ كَفَرُوا مِنَ النَّارِ ﴿٢٧﴾

**28.** ఏమీ? మేము విశ్వసించి, సత్కార్యాలు చేసేవారిని భూమిలో కల్లోలం రేకెత్తించే వారితో సమానులుగా చేస్తామా? లేక మేము దైవభీతి గలవారిని దుష్టులతో సమానులుగా చేస్తామా?[2]

أَمْ نَجْعَلُ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ كَالْمُفْسِدِينَ فِي الْأَرْضِ أَمْ نَجْعَلُ الْمُتَّقِينَ كَالْفُجَّارِ ﴿٢٨﴾

---

**1** చూడండి, 3:191, 10:5

**2** ఇహలోకంలో కొందరు దుర్మార్గులు ఎన్నో సుఖసంతోషాలను అనుభవిస్తూ ఉండవచ్చు

భయపడే వానికి మరియు మా వైపునకు పశ్చాత్తాప హృదయంతో మరలేవానికి.

ادْخُلُوهَا بِسَلَامٍ ۖ ذَٰلِكَ يَوْمُ الْخُلُودِ ۝

34. "ఇందులో (స్వర్గంలో), శాంతితో ప్రవేశించండి. ఇదే శాశ్వత జీవితదినం."

لَهُم مَّا يَشَاءُونَ فِيهَا وَلَدَيْنَا مَزِيدٌ ۝

35. అందులో వారికి, వారు కోరేదంతా ఉంటుంది. మరియు మా దగ్గర ఇంకా చాలా ఉంది.[1]

وَكَمْ أَهْلَكْنَا قَبْلَهُم مِّن قَرْنٍ هُمْ أَشَدُّ مِنْهُم بَطْشًا فَنَقَّبُوا فِي الْبِلَادِ هَلْ مِن مَّحِيصٍ ۝

36. మరియు మేము, వీరికి పూర్వం ఎన్నోతరాల వారిని నాశనం చేశాము. వారు వీరికంటే ఎక్కువ శక్తిమంతులు. కాని, (మా శిక్ష పడినప్పుడు) వారు దేశదిమ్మరులై పోయారు. ఏమీ? వారికి తప్పించుకొనే మార్గం ఏదైనా దొరికిందా?

إِنَّ فِي ذَٰلِكَ لَذِكْرَىٰ لِمَن كَانَ لَهُ قَلْبٌ أَوْ أَلْقَى السَّمْعَ وَهُوَ شَهِيدٌ ۝

37. నిశ్చయంగా, హృదయమున్నవాడికి, శ్రద్ధతో వినేవాడికి మరియు లక్ష్యపెట్టేవాడికి ఇందులో ఒక గుణపాఠముంది.

وَلَقَدْ خَلَقْنَا السَّمَاوَاتِ وَالْأَرْضَ وَمَا بَيْنَهُمَا فِي سِتَّةِ أَيَّامٍ وَمَا مَسَّنَا مِن لُّغُوبٍ ۝

38. మరియు వాస్తవంగా! మేము ఆకాశాలను మరియు భూమిని మరియు వాటి మధ్య నున్న సమస్తాన్ని ఆరుదినము (అయ్యామ్)లలో సృష్టించాము. కాని మాకు ఎలాంటి అలసట కలుగలేదు.

فَاصْبِرْ عَلَىٰ مَا يَقُولُونَ وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ قَبْلَ طُلُوعِ الشَّمْسِ وَقَبْلَ الْغُرُوبِ ۝

39. కావున (ఓ ముహమ్మద్!) వారు పలికే మాటలకు సహనం వహించు మరియు నీ ప్రభువు పవిత్రతను కొనియాడు. ఆయన స్తోత్రాలు చెయ్యి, ప్రతి రోజు సూర్యోదయానికి ముందు మరియు సూర్యాస్తమయానికి ముందు కూడా;[2]

وَمِنَ اللَّيْلِ فَسَبِّحْهُ وَأَدْبَارَ السُّجُودِ ۝

40. మరియు రాత్రివేళలో కూడా ఆయన

1. చూడండి, 10:26.
2. ఫజ్ర్ మరియు 'అ'స్ర్ నమా'జ్‌లు చేయండి.

పవిత్రతను కొనియాడు[1] మరియు సాష్టాంగం (సజ్దా) చేసిన తరువాత కూడా స్తుతించు.[2]

وَاسْتَمِعْ يَوْمَ يُنَادِ الْمُنَادِ مِن مَّكَانٍ قَرِيبٍ ﴿٤١﴾

**41.** మరియు చెవియొగ్గి విను, చాటింపు చేసేవాడు అతి దగ్గరి నుంచే పిలిచే రోజున!

يَوْمَ يَسْمَعُونَ الصَّيْحَةَ بِالْحَقِّ ذَٰلِكَ يَوْمُ الْخُرُوجِ ﴿٤٢﴾

**42.** ఆ రోజు మీరు ఒక భయంకర శబ్దం వినేది సత్యం. (గోరీలలో నుండి) బయటికి వచ్చే దినం అదే!

إِنَّا نَحْنُ نُحْيِي وَنُمِيتُ وَإِلَيْنَا الْمَصِيرُ ﴿٤٣﴾

**43.** నిశ్చయంగా, మేమే జీవనమిచ్చే వారం మరియు మేమే మరణింపజేసేవారం మరియు మీరందరి మరలింపు మా వైపునకే జరుగుతుంది.

يَوْمَ تَشَقَّقُ الْأَرْضُ عَنْهُمْ سِرَاعًا ذَٰلِكَ حَشْرٌ عَلَيْنَا يَسِيرٌ ﴿٤٤﴾

**44.** ఆ రోజు భూమిచీలిపోయి వారందరూ పరుగిడుతూ బయటికివస్తారు. అదే సమావేశసమయం. అది మాకెంతో సులభం.

نَّحْنُ أَعْلَمُ بِمَا يَقُولُونَ وَمَا أَنتَ عَلَيْهِم بِجَبَّارٍ فَذَكِّرْ بِالْقُرْآنِ مَن يَخَافُ وَعِيدِ ﴿٤٥﴾

**45.** వారనేది మాకు బాగా తెలుసు. నీవు వారిని (విశ్వసించమని) బలవంతం చేయలేవు. కావున నా హెచ్చరికకు భయపడేవాడికి మాత్రమే నీవు ఈ ఖుర్ఆన్ ద్వారా హితబోధచెయ్యి.

---

1 చూడండి, 17:79 అంటే రాత్రిపూట లేచి తహజ్జుద్ నమా'జ్ చేయండి. మి'రాజ్‌కు ముందు ముస్లింలందరికీ ఫజ్ర్ మరియు 'అ'స్ర్ నమా'జ్‌లు విధించబడి ఉండేవి మరియు దైవప్రవక్త ('స'అస) తహజ్జుద్ విధిగా చేసేవారు. కానీ మి'రాజ్ తరువాత 5 నమా'జ్‌లు అందరి కొరకు విధిగా చేయబడ్డాయి. (ఇబ్నె-కసీ'ర్).

2 ఫ'ర్ద్ నమాజుల తరువాత త'స్బీహ్ చేయాలి అంటే సుబ్'హానల్లాహ్ 33 సార్లు, అల్'హమ్దులిల్లాహ్ 33 సార్లు మరియు అల్లాహు అక్బర్ 34 సార్లు చదవాలి ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

# 51. సూరహ్ అజ్-జా'రియాత్

سُوْرَةُ الذّٰرِيٰتِ

అజ్ జా'రియాత్. ఎగురగొట్టే, వెదజల్లే, చెల్లాచెదురుచేసే, లేక విసరే వాయువులు పునరుత్థానం గురించి వివరించే 7 సూరాహ్‌లలో ఇది 2వది. సుయూతీ అభిప్రాయంలో ఇది ప్రస్థానానికి 2 సంవత్సరాలకు ముందు మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో **60** ఆయతులున్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

**1** దుమ్ము ఎగురవేసే వాటి (గాలుల) సాక్షిగా!

وَالذّٰرِيٰتِ ذَرْوًا ۙ

**2.** మరియు, (నీటి)భారాన్ని మోసే (మేఘాల);

فَالْحٰمِلٰتِ وِقْرًا ۙ

**3.** మరియు సముద్రంలో సులభంగా తేలియాడే (ఓడల);

فَالْجٰرِيٰتِ يُسْرًا ۙ

**4.** మరియు (ఆయన) ఆజ్ఞతో (అనుగ్రహాలను) పంచిపెట్టే (దేవదూతలసాక్షిగా);[1]

فَالْمُقَسِّمٰتِ اَمْرًا ۙ

**5.** నిశ్చయంగా, మీకు చేయబడ్డ వాగ్దానం సత్యం.

اِنَّمَا تُوْعَدُوْنَ لَصَادِقٌ ۙ

**6.** మరియు నిశ్చయంగా తీర్పు రానున్నది.

وَّاِنَّ الدِّيْنَ لَوَاقِعٌ ۗ

**7.** మార్గాలతో నిండిన ఆకాశం సాక్షిగా!

وَالسَّمَآءِ ذَاتِ الْحُبُكِ ۙ

**8.** నిశ్చయంగా, మీరు భేదాభిప్రాయాలలో పడి ఉన్నారు.[2]

اِنَّكُمْ لَفِيْ قَوْلٍ مُّخْتَلِفٍ ۙ

---

1 సాక్షిగా అంటే ఇక్కడ నొక్కి చెప్పడం అన్నట్లు లేక ఉదాహరణగా ఇవ్వటం. ఏ విధంగానైతే గాలులు, మేఘాలు, నీటిపై ఓడలు పయనించటం ఎంత సత్యమో పునరుత్థానం కూడా అంతే సత్యం.

2 మీలో ఏకాభిప్రాయంలేదు. మీలో కొందరు దైవప్రవక్త (స'అస)ను మాంత్రికుడు, మరి కొందరు కవి, మరికొందరు జ్యోతిషుడు, మరికొందరు అసత్యవాది, అని అంటున్నారు. అంతే కాదు మీలో కొందరు పునరుత్థానదినం రానేరాదని అంటున్నారు. మరికొందరు దాని గురించి సంశయంలో పడిఉన్నారు. మీరు అల్లాహ్ (సు.తా.)ను సృష్టికర్త మరియు సర్వపోషకుడని, అంటారు, కాని ఇతరులను కూడా ఆయన (సు.తా.)కు సాటి (భాగస్వాములు)గా నిలబెడతారు. మీలో చిత్తశుద్ధి, ఏకాభిప్రాయం లేవు

يُؤْفَكُ عَنْهُ مَنْ أُفِكَ ۝٩

**9.** (సత్యంనుండి) మరలింపబడిన వాడే, మోసగింపబడిన వాడు

قُتِلَ الْخَرّٰصُونَ ۝١٠

**10.** అధారంలేని అభిప్రాయాలు గలవారే నాశనం చేయబడే వారు!

الَّذِينَ هُمْ فِي غَمْرَةٍ سَاهُونَ ۝١١

**11.** ఎవరైతే నిర్లక్ష్యంలోపడి అశ్రద్ధగా ఉన్నారో!

يَسْأَلُونَ أَيَّانَ يَوْمُ الدِّينِ ۝١٢

**12.** వారు ఇలా అడుగుతున్నారు: "తీర్పు దినం ఎప్పుడు రానున్నది?"

يَوْمَ هُمْ عَلَى النَّارِ يُفْتَنُونَ ۝١٣

**13.** ఆ దినమున, వారు అగ్నితో దహింప (పరీక్షింప)బడతారు.

ذُوقُوا فِتْنَتَكُمْ هَٰذَا الَّذِي كُنْتُمْ بِهِ تَسْتَعْجِلُونَ ۝١٤

**14.** (వారితో ఇలా అనబడుతుంది): "మీ పరీక్షను[1] రుచిచూడండి! మీరు దీని కొరకే తొందర పెట్టేవారు!"

إِنَّ الْمُتَّقِينَ فِي جَنَّاتٍ وَعُيُونٍ ۝١٥

**15.** నిశ్చయంగా, దైవభీతి గలవారు చెలమలు గల స్వర్గవనాలలో ఉంటారు.

آخِذِينَ مَا آتَاهُمْ رَبُّهُمْ ۚ إِنَّهُمْ كَانُوا قَبْلَ ذَٰلِكَ مُحْسِنِينَ ۝١٦

**16.** తమ ప్రభువు తమకు ప్రసాదించిన వాటితో సంతోషపడుతూ! నిశ్చయంగా వారు అంతకు పూర్వం సజ్జనులై ఉండే వారు.

كَانُوا قَلِيلًا مِنَ اللَّيْلِ مَا يَهْجَعُونَ ۝١٧

**17.** వారు రాత్రివేళలలో చాలా తక్కువగా నిద్రపోయే వారు.

وَبِالْأَسْحَارِ هُمْ يَسْتَغْفِرُونَ ۝١٨

**18.** మరియు వారు రాత్రి చివరి గడియలలో[2] క్షమాపణ వేడుకునే వారు.

---

1 ఫిత్నతున్: అంటే ఇక్కడ శిక్ష లేక నరకాగ్నిలో కాలటం చూడండి, 6:128, 40:12, 43:74

2 అల్ అస్'హారు అంటే చివరి మూడోవంతు రాత్రి అది ప్రార్థన (దు'ఆ)లు అంగీకరించబడే సమయం. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: మూడోవంతు రాత్రి బాకీ ఉన్నప్పుడు అల్లాహ్ (సు.తా.) భూమికి దగ్గరగా ఉన్న ఆకాశంమీదికి దిగివస్తాడు మరియు ఇలా అంటాడు: 'ఏమీ? తౌబాచేసే (పశ్చాత్తాపపడే) వారు ఎవరైనా ఉన్నారా? నేను వారి పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాను. క్షమాపణవేడుకొనేవారు ఎవరైనా ఉన్నారా? నేను వారిని క్షమిస్తాను. ఏమీ? ఎవరైనా ఏమైనా కోరుకునే వారున్నారా? నేను వారి కోరికలను పూర్తిచేస్తాను. ఇలా తెల్లవారే వరకు ప్రశ్నిస్తూ ఉంటాడు.' ('స'హీ'హ్ ముస్లిం) చూడండి, 3:17.

وَفِيْٓ اَمْوَالِهِمْ حَقٌّ لِّلسَّاۗىِٕلِ وَالْمَحْرُوْمِ ١٩

**19.** మరియు వారి సంపదలో యాచించే వారికి మరియు అవశ్యకత గలవారికి[1] హక్కు ఉండేది.

وَفِي الْاَرْضِ اٰيٰتٌ لِّلْمُوْقِنِيْنَ ٢٠

**20.** మరియు భూమిలో కూడా నమ్మేవారి కొరకు ఎన్నో నిదర్శనాలు (ఆయాత్) ఉన్నాయి

وَفِيْٓ اَنْفُسِكُمْ ۭ اَفَلَا تُبْصِرُوْنَ ٢١

**21.** మరియు స్వయంగా మీలో కూడా ఉన్నాయి. ఏమీ? మీరు చూడలేరా?[2]

وَفِي السَّمَاۗءِ رِزْقُكُمْ وَمَا تُوْعَدُوْنَ ٢٢

**22.** మరియు ఆకాశంలో మీ జీవనోపాధి మరియు మీకు వాగ్దానం చేయబడినది ఉంది

فَوَرَبِّ السَّمَاۗءِ وَالْاَرْضِ اِنَّهٗ لَحَقٌّ مِّثْلَ مَآ اَنَّكُمْ تَنْطِقُوْنَ ٢٣

**23.** కావున భూమ్యాకాశాల ప్రభువు సాక్షిగా! నిశ్చయంగా, ఇది సత్యం; అదే విధంగా ఏ విధంగానైతే మీరు మాట్లాడ గలిగేది (సత్యమో)!

هَلْ اَتٰىكَ حَدِيْثُ ضَيْفِ اِبْرٰهِيْمَ الْمُكْرَمِيْنَ ٢٤

**24.** ఏమీ? ఇబ్రాహీమ్ యొక్క గౌరవ నీయులైన అతిథుల గాథ నీకు చేరిందా?[3]

اِذْ دَخَلُوْا عَلَيْهِ فَقَالُوْا سَلٰمًا ۭ قَالَ سَلٰمٌ ۚ قَوْمٌ مُّنْكَرُوْنَ ٢٥

**25.** వారు అతని వద్దకు వచ్చినపుడు: "మీకు సలాం!" అని అన్నారు. అతను: "మీకూ సలాం." అని జవాబిచ్చి: "మీరు పరిచయంలేని (కొత్త) వారుగా ఉన్నారు." అని అన్నాడు.

فَرَاغَ اِلٰٓى اَهْلِهٖ فَجَاۗءَ بِعِجْلٍ سَمِيْنٍ ٢٦

**26.** తరువాత అతను తన ఇంటిలోకి పోయి బలిసిన (వేయించిన) ఒక ఆవు దూడను తీసుకొనివచ్చాడు.

فَقَرَّبَهٗٓ اِلَيْهِمْ قَالَ اَلَا تَاْكُلُوْنَ ٢٧

**27.** దానిని వారి ముందుకుజరిపి: "ఏమీ? మీరెందుకు తినటంలేదు?" అని అడిగాడు

---

**1** మ'హ్రూమ్‌లకు, అంటే అవశ్యకత ఉండి కూడా యాచించని వారికి

**2.** చూడండి, 45:4.

**3** ఇబ్రాహీమ్ (అ.స.) గాథ కోసం చూడండి. 11:69 మరియు 15:51. ఈ ఆయతులు అవతరింపజేయబడేవరకు ఈ గాథ దైవప్రవక్త ('స'అస)కు తెలియదు. కాబట్టి వహీ ద్వారా తెలుపబడుతోంది.

فَأَوْجَسَ مِنْهُمْ خِيفَةً ۖ قَالُوا لَا تَخَفْ ۖ وَبَشَّرُوهُ بِغُلَامٍ عَلِيمٍ ﴿٢٨﴾

**28.** (వారు తినకుండా ఉండటం చూసి), వారినుండి భయపడసాగాడు.[1] వారన్నారు: "భయపడకు!" మరియు వారు అతనికి జ్ఞానవంతుడైన కుమారుని శుభవార్తనిచ్చారు

فَأَقْبَلَتِ امْرَأَتُهُ فِي صَرَّةٍ فَصَكَّتْ وَجْهَهَا وَقَالَتْ عَجُوزٌ عَقِيمٌ ﴿٢٩﴾

**29.** అప్పుడతని భార్య అరుస్తూ వారి ముందుకు వచ్చి, తన చేతిని నుదుటి మీద కొట్టుకుంటూ: "నేను ముసలిదాన్ని, గొడ్రాలను కదా!" అని అన్నది.

قَالُوا كَذَٰلِكِ قَالَ رَبُّكِ ۖ إِنَّهُ هُوَ الْحَكِيمُ الْعَلِيمُ ﴿٣٠﴾

**30.** వారన్నారు: "నీ ప్రభువు ఇలాగే అన్నాడు! నిశ్చయంగా, ఆయన మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు!"

قَالَ فَمَا خَطْبُكُمْ أَيُّهَا الْمُرْسَلُونَ ﴿٣١﴾

**31.** (*) (ఇబ్రాహీమ్) అడిగాడు: "ఓ సందేశహరు(దేవదూత)లారా! అయితే మీరు వచ్చిన కారణమేమిటి?"

قَالُوا إِنَّا أُرْسِلْنَا إِلَىٰ قَوْمٍ مُجْرِمِينَ ﴿٣٢﴾

**32.** వారన్నారు: "వాస్తవానికి, మేము నేరస్థులైన జనుల వైపునకు పంపబడ్డాము.

لِنُرْسِلَ عَلَيْهِمْ حِجَارَةً مِنْ طِينٍ ﴿٣٣﴾

**33.** "వారి మీద (కాల్చబడిన) మట్టి రాళ్ళను కురిపించటం కోసం![2]

مُسَوَّمَةً عِنْدَ رَبِّكَ لِلْمُسْرِفِينَ ﴿٣٤﴾

**34.** "నీ ప్రభువు తరఫునుండి గుర్తువేయ బడిన(రాళ్ళు):[3] మితిమీరిప్రవర్తించే వారికొరకు!"

فَأَخْرَجْنَا مَنْ كَانَ فِيهَا مِنَ الْمُؤْمِنِينَ ﴿٣٥﴾

**35.** అప్పుడు మేము అందులో ఉన్న విశ్వాసులందరినీ బయటికి తీశాము.[4]

فَمَا وَجَدْنَا فِيهَا غَيْرَ بَيْتٍ مِنَ الْمُسْلِمِينَ ﴿٣٦﴾

**36.** మేము అందు ఒక్క గృహం తప్ప![5]

---

1 ఇంటికి వచ్చిన అతిథులు ఆహారం తినకపోవడం చూసి, వారు సహృదయంతో రాలేదు! ఏదో, ఆపద నిలబెట్టుటకైతే రాలేదు కదా! అని భయపడ్డాడు.

2 చూడండి, 11:82.

3 ముసవ్వమతున్: అంటే ప్రత్యేకించబడినవి.

4. వివరాలకు చూడండి, 11:77 మరియు 15:61.

5 ఆ ఇల్లు లూ'త్ ('అ.స.) యొక్క ఇల్లు. అతని ఇద్దరు కుమార్తెలు మరియు కొంతమంది విశ్వాసులు అంతా కలసి దాదాపు 13 మంది మాత్రమే ఉంటారు. లూ'త్ ('అ.స.) భార్య వారితో చేరక, సత్యతిరస్కారులలో చేరిపోతుంది.

ఇతర విధేయుల (ముస్లింల)[1] గృహాన్ని చూడలేదు.

37. మరియు బాధాకరమైన శిక్షకు భయపడేవారి కొరకు, మేము అక్కడ ఒక సూచన (ఆయత్)ను వదలిపెట్టాము.[2]

وَتَرَكْنَا فِيهَا آيَةً لِّلَّذِينَ يَخَافُونَ الْعَذَابَ الْأَلِيمَ ﴿٣٧﴾

38. ఇక మూసా (గాథ)లో కూడ (ఒక సూచన వుంది) మేము అతనిని ఫిర్'ఔన్ వద్దకు స్పష్టమైన ప్రమాణంతో పంపినప్పుడు:

وَفِي مُوسَىٰ إِذْ أَرْسَلْنَاهُ إِلَىٰ فِرْعَوْنَ بِسُلْطَانٍ مُّبِينٍ ﴿٣٨﴾

39. అతడు (ఫిర్'ఔన్) తన సభాసదులతో సహా మరలిపోతూ, ఇలా అన్నాడు: "ఇతడు మాంత్రికుడు లేదా పిచ్చివాడు!"

فَتَوَلَّىٰ بِرُكْنِهِ وَقَالَ سَاحِرٌ أَوْ مَجْنُونٌ ﴿٣٩﴾

40. కావున మేము అతనిని మరియు అతని సైనికులను పట్టుకొని, వారందరినీ సముద్రంలో ముంచివేశాము మరియు దానికి అతడే నిందితుడు.

فَأَخَذْنَاهُ وَجُنُودَهُ فَنَبَذْنَاهُمْ فِي الْيَمِّ وَهُوَ مُلِيمٌ ﴿٤٠﴾

41. ఇక 'ఆద్ జాతివారిలో కూడా (ఒక సూచన వుంది). మేము వారిపై వినాశకరమైన

وَفِي عَادٍ إِذْ أَرْسَلْنَا عَلَيْهِمُ الرِّيحَ الْعَقِيمَ ﴿٤١﴾

---

1 ఒకరు దైవప్రవక్త (స'అస)ను ప్రశ్నిస్తారు 'ఇస్లాం అంటే ఏమిటి?' అతను (స'అస) అంటారు '1) లా ఇలాహ ఇల్లల్లాహ్ (షహాదహ్) సాక్ష్యం పలకడం, 2) నమా'జ్ స్థాపించడం, 3) 'జకాత్ ఇవ్వడం, 4) రమజాన్ నెలలో ఉపవాసముండడం మరియు 5) 'హజ్జ్ చేయటం' అని అంటారు. తరువాత 'ఈమాన్ అంటే ఏమిటి?' అని ప్రశ్నిస్తే, అతను (స'అస) అంటారు '1) అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించడం, 2) ఆయన దూతలను, 3) దివ్యగ్రంథాలను, 4) ప్రవక్తలను, 5) పునరుత్థాన దినాన్ని మరియు 6) ఖద్ర్ (మంచి లేక చెడు ఏది సంభవించినా అల్లాహ్ తరఫునుండేనని) విశ్వసించడం' అంటే హృదయపూర్వకంగా ఈ విషయాలను నమ్మడమే ఈమాన్. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను మరియు విధులను పాలించడం ఇస్లాం. దీని ప్రకారం ప్రతి మూ'మిన్ ముస్లిం మరియు ప్రతి ముస్లిం మూ'మిన్. (ఫ'త్హుల్ ఖదీర్)
ఇక ఎవరైతే మూ'మిన్ మరియు ముస్లింల మధ్య వ్యత్యాసం చూపుతారో, వారు అంటారు 'ఖుర్ఆన్‌లో ఇక్కడ ఒకేరకమైన జనుల కొరకు మూ'మిన్ మరియు ముస్లిం శబ్దాలు వాడబడ్డాయి కాని వీటి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని బట్టి ప్రతి మూ'మిన్ ముస్లిం అవుతాడు కానీ ప్రతి ముస్లిం మూ'మిన్ అవటం అనివార్యం కాదు.' ఇబ్నె కసీ'ర్. (వివరాలకు ము'హమ్మద్ జూనాగఢీ పేజీ. 1478, మలిక్ ఫహద్ ఖుర్ఆన్ ప్రింటింగ్ కాంప్లెక్స్, మదీన మునవ్వరహ్)

2. ఆ సూచన (గుర్తు), అంటే మృత సముద్రం

గాలిని పంపినప్పుడు![1]

42. అది దేనిపైనయితే వీచిందో, దానిని క్షీణింపజేయకుండా వదలలేదు.[2]

مَا تَذَرُ مِن شَيْءٍ أَتَتْ عَلَيْهِ إِلَّا جَعَلَتْهُ كَالرَّمِيمِ ﴿٤٢﴾

43. మరియు స'మూద్ జాతివారి గాథలో కూడా (ఒక సూచనఉంది). వారితో: "కొంత కాలం మీరు సుఖసంతోషాలను అనుభవించండి." అని అన్నాము.[3]

وَفِي ثَمُودَ إِذْ قِيلَ لَهُمْ تَمَتَّعُوا حَتَّىٰ حِينٍ ﴿٤٣﴾

44. అప్పుడు వారు తమ ప్రభువు ఆజ్ఞను ఉపేక్షించారు. కావున వారు చూస్తూ ఉంతగానే ఒకపెద్ద పిడుగు వారి మీద విరుచుకు పడింది.[4]

فَعَتَوْا عَنْ أَمْرِ رَبِّهِمْ فَأَخَذَتْهُمُ الصَّاعِقَةُ وَهُمْ يَنظُرُونَ ﴿٤٤﴾

45. అప్పుడు వారికి లేచి నిలబడే శక్తి కూడా లేకపోయింది మరియు వారు తమను తాము కూడా కాపాడుకోలేక పోయారు.

فَمَا اسْتَطَاعُوا مِن قِيَامٍ وَمَا كَانُوا مُنتَصِرِينَ ﴿٤٥﴾

46. మరియు దీనికి ముందు నూ'హ్ జాతి వారినికూడా (నాశనంచేశాము). నిశ్చయంగా వారు కూడా అవిధేయులు.

وَقَوْمَ نُوحٍ مِّن قَبْلُ ۖ إِنَّهُمْ كَانُوا قَوْمًا فَاسِقِينَ ﴿٤٦﴾

47. మరియు ఆకాశాన్ని మేము (మా) చేతులతో నిర్మించాము మరియు నిశ్చయంగా మేమే దానిని విస్తరింపజేయగల వారము.

وَالسَّمَاءَ بَنَيْنَاهَا بِأَيْيدٍ وَإِنَّا لَمُوسِعُونَ ﴿٤٧﴾

48. మరియు భూమిని మేము పరువుగా చేశాము, మేమే చక్కగా పరిచేవారము!

وَالْأَرْضَ فَرَشْنَاهَا فَنِعْمَ الْمَاهِدُونَ ﴿٤٨﴾

---

1. చూడండి, 7:65
2. ఆ గాలి ఎనిమిది రోజులు ఏడురాత్రులు వీచింది చూడండి, 69:7
3. వారి కోరిక ప్రకారం వారికి ఒక ఆడఒంటె అల్లాహ్ (సు.తా.) తరఫునుండి, ఒక అద్భుత సూచనగా పంపబడితే, వారు దానిని చంపారు. అప్పుడు వారితో, 'ఇక మీరు మూడు రోజులు సుఖసంతోషాలను అనుభవించండి.' అని అనబడింది.
4. 'సా'ఇఖతున్, అంటే ఒకపెద్ద ధ్వని, గర్జన లేక పిడుగు నుండి వచ్చేధ్వనిలాంటిది. ఈ ధ్వని ఆకాశంలో నుండి వచ్చింది మరియు భూమిలో భూకంపం కూడా వచ్చింది. చూడండి, 7:73-79

**49.** మరియు మేము ప్రతి దానిని జంటలుగా సృష్టించాము, మీరు గ్రహించాలని.[1]

وَمِن كُلِّ شَيْءٍ خَلَقْنَا زَوْجَيْنِ لَعَلَّكُمْ تَذَكَّرُونَ ﴿٤٩﴾

**50.** "కావున మీరు అల్లాహ్ వైపునకు పరుగెత్తండి. నిశ్చయంగా, నేను (ము'హమ్మద్) ఆయన తరఫునుండి మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!

فَفِرُّوا إِلَى اللَّهِ إِنِّي لَكُم مِّنْهُ نَذِيرٌ مُّبِينٌ ﴿٥٠﴾

**51.** "మరియు మీరు అల్లాహ్‌కు పాటిగా ఇతర దైవాన్ని నిలుపకండి! నిశ్చయంగా, నేను (ము'హమ్మద్) ఆయన తరఫునుండి మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!"

وَلَا تَجْعَلُوا مَعَ اللَّهِ إِلَٰهًا آخَرَ إِنِّي لَكُم مِّنْهُ نَذِيرٌ
مُّبِينٌ ﴿٥١﴾

**52.** ఇదేవిధంగా, వారికి పూర్వం గడచిన వారివద్దకు ఏ ప్రవక్త వచ్చినా వారు: "ఇతను మాంత్రికుడు లేదా పిచ్చివాడు" అని అనకుండా ఉండలేదు.

كَذَٰلِكَ مَا أَتَى الَّذِينَ مِن قَبْلِهِم مِّن رَّسُولٍ
إِلَّا قَالُوا سَاحِرٌ أَوْ مَجْنُونٌ ﴿٥٢﴾

**53.** ఏమీ? దీనిని (ఇలా పలుకుటను) వారు ఒకరికొకరు వారసత్వంగా ఇచ్చుకున్నారా? అలాకాదు! అసలు వారు తలబిరుసుతనంతో ప్రవర్తించే జనం!

أَتَوَاصَوْا بِهِ بَلْ هُمْ قَوْمٌ طَاغُونَ ﴿٥٣﴾

**54.** కావున నీవు వారినుండి మరలిపో, ఇక నీపై ఎలాంటి నిందలేదు.

فَتَوَلَّ عَنْهُمْ فَمَا أَنتَ بِمَلُومٍ ﴿٥٤﴾

**55.** మరియు వారిని ఉపదేశిస్తూ వుండు, నిశ్చయంగా ఉపదేశం విశ్వాసులకు ప్రయోజనకరమవుతుంది.

وَذَكِّرْ فَإِنَّ الذِّكْرَىٰ تَنفَعُ الْمُؤْمِنِينَ ﴿٥٥﴾

**56.** మరియు నేను జిన్నాతులను మరియు మానవులను సృష్టించింది, కేవలం వారు నన్ను ఆరాధించటానికే!

وَمَا خَلَقْتُ الْجِنَّ وَالْإِنسَ إِلَّا لِيَعْبُدُونِ ﴿٥٦﴾

---

1 అంటే ప్రతి దానిని జంటలుగా సృష్టించాము. ఆడ మగలు, చీకటి వెలుగులు, సూర్య చంద్రులు, తీపి చేదులు, రాత్రింబవళ్ళు, కీడు మేలు. జీవన్మరణాలు. విశ్వాసం అవిశ్వాసం, స్వర్గనరకాలు, జిన్నాతులు మానవులు, మొదలైనవి వీటన్నింటినీ సృష్టించిన వాడు అల్లాహ్ (సు.తా.) ఆయన (సు.తా.)కు ఎవరూ భాగస్వాములు లేరు. చూడండి, 36:36.

مَآ اُرِيْدُ مِنْهُمْ مِّنْ رِّزْقٍ وَّمَآ اُرِيْدُ اَنْ يُّطْعِمُوْنِ ۝

**57.** నేను వారినుండి ఎలాంటి జీవనోపాధిని కోరటం లేదు మరియు వారు నాకు ఆహారం పెట్టాలని కూడా కోరటం లేదు.

اِنَّ اللّٰهَ هُوَ الرَّزَّاقُ ذُو الْقُوَّةِ الْمَتِيْنُ ۝

**58.** నిశ్చయంగా, అల్లాహ్! ఆయన మాత్రమే ఉపాధి ప్రదాత, మహా బలవంతుడు, స్థైర్యం గలవాడు.[1]

فَاِنَّ لِلَّذِيْنَ ظَلَمُوْا ذَنُوْبًا مِّثْلَ ذَنُوْبِ اَصْحٰبِهِمْ فَلَا يَسْتَعْجِلُوْنِ ۝

**59.** కావున నిశ్చయంగా, దుర్మార్గానికి పాల్పడినవారి పాపాలు వారి (పూర్వ) స్నేహితుల పాపాలవంటివే! కావున వారు నా (శిక్ష కొరకు) తొందరపెట్టనవసరం లేదు!

فَوَيْلٌ لِّلَّذِيْنَ كَفَرُوْا مِنْ يَّوْمِهِمُ الَّذِيْ يُوْعَدُوْنَ ۝

**60.** కావున సత్యతిరస్కారులకు వినాశం గలదు - వారికి వాగ్దానం చేయబడిన - ఆ దినమున!

---

1 అర్ రజ్జాఖు: All Provider, The Sustainer The supplier of the means of subsistence ఉపాధి ప్రదాత, సర్వపోషకుడు, జీవనోపాధిని ప్రసాదించేవాడు. అల్ ఖవియ్యు: Owner of Power, మహా బలవంతుడు, బలశాలి, బలాఢ్యుడు. చూడండి, 11:66, 28.26, 42.19
అల్ మతీను: The Strongest. Steadfast, Hard, Firm, స్థైర్యవంతుడు దృఢమైనవాడు, పటిష్ఠవంతుడు, నిలకడ, స్థామం గలవాడు, ఇక్కడ ఒకేచోట వచ్చింది. ప్రైవి అల్లాహ్ (సు తా) అత్యుత్తమ పేర్లు

## 52. సూరహ్ అ'త్-'తూర్

## سُورَةُ الطُّورِ

అ'త్ 'తూరు: ఒక పర్వతం పేరు ఈ పదం మొదటి ఆయత్‌లో పేర్కొనబడింది. అది సినాయి ద్వీపకల్పంలో ఉంది ఆ పర్వతం మీదనే మూసా ('అ.స.)పై 'తౌరాత్ అవతరింప జేయబడింది ఈ సూరహ్ ఈ సముదాయంలో 3వది మధ్య మక్కా కాలంలో అవతరింప జేయబడింది ఇందులో **49** ఆయతులు ఉన్నాయి

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** తూర్ పర్వతం సాక్షిగా![1]

وَالطُّورِ ۝

**2.** వ్రాయబడిన గ్రంథం సాక్షిగా!

وَكِتَابٍ مَّسْطُورٍ ۝

**3.** విప్పబడిన చర్మపత్రం మీద.[2]

فِي رَقٍّ مَّنشُورٍ ۝

**4.** చిరకాల సందర్శనాలయం సాక్షిగా![3]

وَالْبَيْتِ الْمَعْمُورِ ۝

**5.** పైకెత్తబడిన కప్పు (అంతరిక్షం) సాక్షిగా![4]

وَالسَّقْفِ الْمَرْفُوعِ ۝

**6.** ఉప్పొంగే సముద్రం సాక్షిగా![5]

وَالْبَحْرِ الْمَسْجُورِ ۝

**7.** నిశ్చయంగా, నీ ప్రభువు శిక్ష సంభవించనున్నది.

إِنَّ عَذَابَ رَبِّكَ لَوَاقِعٌ ۝

**8.** దానిని తప్పించేవాడు ఎవ్వడూ లేడు

مَّا لَهُ مِن دَافِعٍ ۝

**9.** ఆకాశాలు భయంకరంగా కంపించే రోజు!

يَوْمَ تَمُورُ السَّمَاءُ مَوْرًا ۝

---

**1** ఈ 'తూర్ పర్వతం మీదనే మూసా ('అ.స.) అల్లాహ్ (సు.తా.)తో మాట్లాడారు దీని మరొక పేరు 'తూర్ సినాయి అని కూడా ఉంది.

**2** రక్షిన్: Parchment, అంటే వ్రాతకు అనువయ్యేటట్లు పదునుచేసిన గొర్రెతోలు. చర్మపత్రం, చర్మపత్ర వ్రాతప్రతి.

**3** బైతుల్ మ'అమూర్. ఏడవ ఆకాశం మీద ఉన్న ఆలయం అక్కడ దైవదూతలు అల్లాహ్ (సు.తా.) ఆరాధన చేస్తూ ఉంటారు. ప్రతిరోజూ అక్కడికి డెబ్బై వేల దైవదూతలు ఆరాధన కోసం వస్తారు అయినా వారికి పునరుత్థానదినం వరకూ రెండవసారి దాని దర్శనం చేసే అవకాశం దొరకదు మ'అమూర్ అంటే నిండిఉన్న ప్రదేశం కాబట్టి కొందరు వ్యాఖ్యాతలు బైతుల్ మ'అమూర్ అంటే మక్కాలోని కాబా అని, కూడా అంటారు. ఎందుకంటే అదికూడా ఎల్లప్పుడు అక్కడికి ఆరాధనకొరకు వచ్చే ప్రజలతో నిండి ఉంటుంది

**4** చూడండి, 21:32

**5.** చూడండి, 81:6.

وَّتَسِيْرُ الْجِبَالُ سَيْرًا ۝

**10.** మరియు పర్వతాలు దారుణంగా చలించినప్పుడు!

فَوَيْلٌ يَّوْمَىِٕذٍ لِّلْمُكَذِّبِيْنَ ۝

**11.** అప్పుడు, ఆ రోజు, అసత్యవాదులకు వినాశం ఉంది.

الَّذِيْنَ هُمْ فِيْ خَوْضٍ يَّلْعَبُوْنَ ۝

**12.** ఎవరైతే వృథామాటలలో కాలక్షేపం చేస్తూ ఉంటారో!

يَوْمَ يُدَعُّوْنَ اِلٰى نَارِ جَهَنَّمَ دَعًّا ۝

**13.** వారు నరకాగ్నిలోకి నెట్టుతూ త్రోయబడే రోజు;

هٰذِهِ النَّارُ الَّتِيْ كُنْتُمْ بِهَا تُكَذِّبُوْنَ ۝

**14.** (వారితో ఇలా అనబడుతుంది): "మీరు అసత్యమని నిరాకరిస్తూవుండిన నరకాగ్ని ఇదే!

اَفَسِحْرٌ هٰذَآ اَمْ اَنْتُمْ لَا تُبْصِرُوْنَ ۝

**15.** "ఏమీ? ఇది మంత్రజాలమా? లేక దీనిని మీరు చూడలేక పోతున్నారా?

اِصْلَوْهَا فَاصْبِرُوْٓا اَوْ لَا تَصْبِرُوْا ۚ سَوَآءٌ عَلَيْكُمْ ۭ
اِنَّمَا تُجْزَوْنَ مَا كُنْتُمْ تَعْمَلُوْنَ ۝

**16.** "ఇందులో మీరు కాలుతూ ఉండండి. దానికి మీరు సహనం వహించినా, సహనం వహించక పోయినా అంతా మీకు సమానమే! నిశ్చయంగా, మీ కర్మలకు తగిన ప్రతిఫలమే మీకు ఇవ్వబడుతున్నది."

اِنَّ الْمُتَّقِيْنَ فِيْ جَنّٰتٍ وَّنَعِيْمٍ ۝

**17.** నిశ్చయంగా, భయభక్తులు గలవారు స్వర్గవనాలలో సుఖసంతోషాలలో ఉంటారు.

فٰكِهِيْنَ بِمَآ اٰتٰىهُمْ رَبُّهُمْ ۚ وَوَقٰىهُمْ رَبُّهُمْ عَذَابَ
الْجَحِيْمِ ۝

**18.** వారి ప్రభువు వారికి ప్రసాదించిన వాటిని హాయిగా అనుభవిస్తూ ఉంటారు. మరియు వారి ప్రభువు వారిని భగభగ మండే నరక శిక్ష నుండి కాపాడాడు.

كُلُوْا وَاشْرَبُوْا هَنِيْۗـــًٔا بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ۝

**19.** (వారితో ఇలా అనబడుతుంది): "మీరు చేస్తూవుండిన కర్మలకు ఫలితంగా హాయిగా తినండి త్రాగండి!"

مُتَّكِــِٕيْنَ عَلٰي سُرُرٍ مَّصْفُوْفَةٍ ۚ وَزَوَّجْنٰهُمْ بِحُوْرٍ عِيْنٍ ۝

**20.** వారు వరుసగా వేయబడిన ఆసనాల మీద, దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు. మరియు మేము అందమైన పెద్ద పెద్ద కన్నులుగల

సుందరీమణులతో[1] వారి వివాహం చేయిస్తాము.

وَالَّذِينَ آمَنُوا وَاتَّبَعَتْهُمْ ذُرِّيَّتُهُم بِإِيمَانٍ أَلْحَقْنَا بِهِمْ ذُرِّيَّتَهُمْ وَمَا أَلَتْنَاهُم مِّنْ عَمَلِهِم مِّن شَيْءٍ ۚ كُلُّ امْرِئٍ بِمَا كَسَبَ رَهِينٌ ﴿٢١﴾

**21.** మరియు ఎవరైతే విశ్వసించారో మరియు వారి సంతానం వారు విశ్వాసంలో వారిని అనుసరిస్తారో! అలాంటి వారిని వారి సంతానంతో (స్వర్గంలో) కలుపుతాము.[2] మరియు వారి కర్మలలో వారికి ఏ మాత్రం నష్టం కలిగించము. ప్రతివ్యక్తి తాను సంపా దించిన దానికి తాకట్టుగా ఉంటాడు.[3]

وَأَمْدَدْنَاهُم بِفَاكِهَةٍ وَلَحْمٍ مِّمَّا يَشْتَهُونَ ﴿٢٢﴾

**22.** మరియు మేము వారికి, వారు కోరే ఫలాలను మరియు మాంసాన్ని పుష్కలంగా ప్రసాదిస్తాము.

يَتَنَازَعُونَ فِيهَا كَأْسًا لَّا لَغْوٌ فِيهَا وَلَا تَأْثِيمٌ ﴿٢٣﴾

**23.** అందులో (ఆ స్వర్గంలో) వారు ఒకరి కొకరు (మధు) పాత్ర మార్చుకుంటూ ఉంటారు, దాన్ని (త్రాగటం) వల్ల వారు వ్యర్థపుమాటలు మాట్లాడరు మరియు పాపాలు చేయరు.[4] (1/8)

وَيَطُوفُ عَلَيْهِمْ غِلْمَانٌ لَّهُمْ كَأَنَّهُمْ لُؤْلُؤٌ مَّكْنُونٌ ﴿٢٤﴾

**24.** * మరియు దాచబడిన ముత్యాల వంటి బాలురు,[5] వారి సేవకొరకు వారి చుట్టు ప్రక్కలలో తిరుగుతూ ఉంటారు.

وَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَاءَلُونَ ﴿٢٥﴾

**25.** మరియు వారు ఒకరివైపుకొకరు మరలి పరస్పరం (తమ గతించిన జీవితాలను గురించి) మాట్లాడుకుంటూ ఉంటారు.

قَالُوا إِنَّا كُنَّا قَبْلُ فِي أَهْلِنَا مُشْفِقِينَ ﴿٢٦﴾

**26.** వారు ఇలా అంటారు: "వాస్తవానికి మనం ఇంతకుపూర్వం మన కుటుంబం వారి

---

1 హూరున్ కొరకు చూడండి. 56:22, 55:56, 44:54, 38:52, 37:48

2 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మానవుడు మరణిస్తే అతని కర్మలు ఆగిపోతాయి కాని మూడు విషయాల పుణ్యఫలితం మరణించిన తరువాత కూడా దొరుకుతూ ఉంటుంది 1) 'సదఖహ్ జారియహ్, 2) అతడు వదలిన జ్ఞానం – దేనితో నైతే ఇతరులు లాభంపొందుతూ ఉంటారో! 3) సద్వర్తనులైన సంతానం – ఎవరైతే అతని కొరకు ప్రార్థిస్తూ ఉంటారో.' ('స ముస్లిం)

3 ఇటువంటి ఆయత్ కే చూడండి. 74:38.

4 చూడండి, 37:47 మరియు 56:19

5 చూడండి, 56:17-18.

మధ్య ఉన్నప్పుడు (అల్లాహ్ శిక్షకు) భయపడుతూ ఉండేవారము.

27. "కావున నిశ్చయంగా, అల్లాహ్ మనమీద కనికరంచూపాడు మరియు మమ్ము దహించేగాలుల శిక్షనుండి కాపాడాడు.[1]

فَمَنَّ ٱللَّهُ عَلَيْنَا وَوَقَىٰنَا عَذَابَ ٱلسَّمُومِ ﴿٢٧﴾

28. "నిశ్చయంగా, మనం ఇంతకు పూర్వం ఆయననే ప్రార్థిస్తూ ఉండేవారము నిశ్చయంగా, ఆయన మహోపకారి,[2] అపార కరుణాప్రదాత!"

إِنَّا كُنَّا مِن قَبْلُ نَدْعُوهُ إِنَّهُۥ هُوَ ٱلْبَرُّ ٱلرَّحِيمُ ﴿٢٨﴾

29. కావున (ఓ ప్రవక్తా!) నీవు హితోపదేశం చేస్తూవుండు. నీ ప్రభువు అనుగ్రహం వల్ల నీవు జ్యోతిషుడవు కావు మరియు పిచ్చివాడవూ కావు.

فَذَكِّرْ فَمَآ أَنتَ بِنِعْمَتِ رَبِّكَ بِكَاهِنٍ وَلَا مَجْنُونٍ ﴿٢٩﴾

30. లేదా? వారు: "ఇతను ఒక కవి, ఇతని వినాశకాలం కోసం మేము ఎదురు చూస్తున్నాము." అని అంటున్నారా?[3]

أَمْ يَقُولُونَ شَاعِرٌ نَّتَرَبَّصُ بِهِۦ رَيْبَ ٱلْمَنُونِ ﴿٣٠﴾

31. వారితో ఇలా అను: "మీరు ఎదురుచూస్తూ ఉండండి, నిశ్చయంగా, నేను కూడా మీతోపాటు ఎదురుచూస్తూ ఉంటాను!"

قُلْ تَرَبَّصُوا۟ فَإِنِّى مَعَكُم مِّنَ ٱلْمُتَرَبِّصِينَ ﴿٣١﴾

32. ఏమీ? వారి బుద్ధులు వారికి ఇవే ఆజ్ఞాపిస్తున్నాయా? లేక వారు తలబిరుసు తనం గల జనులా?[4]

أَمْ تَأْمُرُهُمْ أَحْلَٰمُهُم بِهَٰذَآ ۚ أَمْ هُمْ قَوْمٌ طَاغُونَ ﴿٣٢﴾

33. ఏమీ? వారు: "ఇతనే, దీనిని (ఈ సందేశాన్ని) కల్పించుకున్నాడు." అని అంటున్నారా? అలాకాదు, వారు అసలు విశ్వసించదలుచుకోలేదు!

أَمْ يَقُولُونَ تَقَوَّلَهُۥ ۚ بَل لَّا يُؤْمِنُونَ ﴿٣٣﴾

---

1. సమూమున్: అతి వేడిగల దహించే గాలి నరకపు పేర్లలో ఇది కూడా ఒకటి

2 అల్-బర్రు: Truely Benign to His servants. Gentle. Kind. Most Subtle. కృపాళువు, మహోపకారి, దయామయుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి

3 రైబున్. అంటే ఆకస్మాత్తుగా జరిగే సంఘటన మనూనున్. ఇది మరణపు పేర్లలో ఒకటి అంటే కాల క్రమంలో సంభవించే ఉపద్రవం లేక దుర్ఘటన.

4 చూడండి. 96:6-7

فَلْيَأْتُوا بِحَدِيثٍ مِّثْلِهِ إِن كَانُوا صَادِقِينَ ۝

**34.** వారు సత్యవంతులే అయితే దీని వంటి ఒక వచనాన్ని (రచించి) తెమ్మను.[1]

أَمْ خُلِقُوا مِنْ غَيْرِ شَيْءٍ أَمْ هُمُ الْخَالِقُونَ ۝

**35.** వారు ఏ (సృష్టికర్త) లేకుండానే సృష్టింపబడ్డారా? లేక వారే సృష్టికర్తలా?

أَمْ خَلَقُوا السَّمَاوَاتِ وَالْأَرْضَ ۚ بَل لَّا يُوقِنُونَ ۝

**36.** లేక వారు ఆకాశాలను మరియు భూమిని సృష్టించారా? అలాకాదు, అసలు వారికి విశ్వాసం లేదు.

أَمْ عِندَهُمْ خَزَائِنُ رَبِّكَ أَمْ هُمُ الْمُصَيْطِرُونَ ۝

**37.** వారి దగ్గర నీ ప్రభువు కోశాగారాలు ఏవైనా ఉన్నాయా? లేక వారు వాటికి అధికారులా?

أَمْ لَهُمْ سُلَّمٌ يَسْتَمِعُونَ فِيهِ ۖ فَلْيَأْتِ مُسْتَمِعُهُم بِسُلْطَانٍ مُّبِينٍ ۝

**38.** వారి దగ్గర నిచ్చెన ఏదైనా ఉందా? దానితో పైకెక్కి వారు (దేవదూతలమాటలు) వినటానికి? అలా అయితే! వారిలో ఎవడైతే విన్నాడో, అతనిని స్పష్టమైన నిదర్శనాన్ని తెమ్మను.

أَمْ لَهُ الْبَنَاتُ وَلَكُمُ الْبَنُونَ ۝

**39.** ఆయన (అల్లాహ్)కు కూతుళ్ళూ మరియు మీకేమో కుమారులా?[2]

أَمْ تَسْأَلُهُمْ أَجْرًا فَهُم مِّن مَّغْرَمٍ مُّثْقَلُونَ ۝

**40.** (ఓ ము'హమ్మద్!) నీవు వారితో ఏమైనా ప్రతిఫలం అడుగుతున్నావా? వారు ఋణభారంతో అణిగిపోవటానికి?

أَمْ عِندَهُمُ الْغَيْبُ فَهُمْ يَكْتُبُونَ ۝

**41.** లేక వారి దగ్గర అగోచర విషయపు జ్ఞానముందా? వారు దానిని వ్రాసిపెట్టారా?[3]

أَمْ يُرِيدُونَ كَيْدًا ۖ فَالَّذِينَ كَفَرُوا هُمُ الْمَكِيدُونَ ۝

**42.** లేక వారేదైనా పన్నాగం పన్న దలచారా? కాని ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో, వారే పన్నాగానికి గురి అవుతారు.[4]

---

1. చూడండి, 17:88
2. చూడండి, 16:57 59.
3. చూడండి, 68:47
4. చూడండి, 35:43

**43.** లేక వారికి అల్లాహ్ గాకుండా మరొక ఆరాధ్య దేవుడు ఉన్నాడా? వారు కల్పించే భాగస్వాములకు అల్లాహ్ అతీతుడు.

أَمْ لَهُمْ إِلَٰهٌ غَيْرُ ٱللَّهِ ۚ سُبْحَٰنَ ٱللَّهِ عَمَّا يُشْرِكُونَ ﴿٤٣﴾

**44.** ఒకవేళ వారు ఆకాశపు ఒక తునకను రాలిపడటం చూసినా: "ఇవి దట్టమైన మేఘాలు!" అని అనేవారు.

وَإِن يَرَوْا۟ كِسْفًا مِّنَ ٱلسَّمَآءِ سَاقِطًا يَقُولُوا۟ سَحَابٌ مَّرْكُومٌ ﴿٤٤﴾

**45.** కావున వారు తమ (తీర్పు) దినాన్ని దర్శించేవరకు వారిని వదిలిపెట్టు. అప్పుడు వారు భీతితో మూర్ఛపోయి పడిపోతారు.

فَذَرْهُمْ حَتَّىٰ يُلَٰقُوا۟ يَوْمَهُمُ ٱلَّذِى فِيهِ يُصْعَقُونَ ﴿٤٥﴾

**46.** ఆ రోజు వారి పన్నాగం వారికి ఏ మాత్రం పనికి రాదు. మరియు వారికి ఎలాంటి సహాయం కూడా లభించదు.

يَوْمَ لَا يُغْنِى عَنْهُمْ كَيْدُهُمْ شَيْـًٔا وَلَا هُمْ يُنصَرُونَ ﴿٤٦﴾

**47.** మరియు నిశ్చయంగా, దుర్మార్గానికి పాల్పడినవారికి, ఇదే గాక మరొక శిక్షకూడా ఉంది.[1] కాని వారిలో చాలామందికి అది తెలియదు.

وَإِنَّ لِلَّذِينَ ظَلَمُوا۟ عَذَابًا دُونَ ذَٰلِكَ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٤٧﴾

**48.** కావున (ఓ ము'హమ్మద్!) నీవు, నీ ప్రభువు ఆజ్ఞ వచ్చేవరకు సహనంవహించు నిశ్చయంగా, నీవు మా దృష్టిలో ఉన్నావు. మరియు నీవు నిద్రనుండి లేచినపుడు నీ ప్రభువు పవిత్రతను కొనియాడు, ఆయన స్తోత్రం చెయ్యి.

وَٱصْبِرْ لِحُكْمِ رَبِّكَ فَإِنَّكَ بِأَعْيُنِنَا ۖ وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ حِينَ تَقُومُ ﴿٤٨﴾

**49.** మరియు రాత్రివేళలో కూడా ఆయన పవిత్రతను కొనియాడు.[2] మరియు నక్షత్రాలు అస్తమించేవేళలోకూడాను![3]

وَمِنَ ٱلَّيْلِ فَسَبِّحْهُ وَإِدْبَٰرَ ٱلنُّجُومِ ﴿٤٩﴾

---

1. ఇటువంటి ఆయత్‌కై చూడండి, 32:21.
2 అంటే తహజ్జుద్ నమా'జ్ దైవప్రవక్త (స'అస) ఎల్లప్పుడూ తహజ్జుద్ నమాజ్ చేసేవారు
3 అంటే ఫజ్ర్ నమా'జ్ వేళ చేసే సున్నత్‌లు. దైవప్రవక్త (స'అస) ప్రవచనం. 'ఫజ్ర్ యొక్క రెండు సున్నతులు ఈ లోకం మరియు దానిలో ఉన్నవాటన్నింటికంటే గొప్పవి' ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం)

## 53. సూరహ్ అన్-నజ్మ్

## سُورَةُ النَّجْمِ

అన్-నజ్మ్: నక్షత్రం. మొదటి ఆయత్‌లోనే ఈ పదం ఉంది. మక్కా సూరాహ్‌ల ఈ సమూహంలో ఇది 4వది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్, బహుశా సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ (112) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో **62 ఆయతులు** ఉన్నాయి. ఇందులో అల్లాహ్ (సు.తా.) ఏకత్వపు ప్రాముఖ్యత వివరించబడింది. ఇది దైవప్రవక్త ('స'అస) సత్యతిరస్కారుల ముందు చదివిన మొదటి సూరహ్. దీని పఠనం ముగించిన తరువాత అతను ('స'అస) సజ్దా చేశారు. అతని('స'అస)తో బాటు అందరూ సజ్దా చేశారు. ఒక్క ఉమయ్యా బిన్ 'ఖలఫ్ తప్ప. అతడు తన చేతిలోకి మట్టి తీసుకొని దానిపై సజ్దా చేశాడు. కాబట్టి అతను సత్యతిరస్కారిగానే మరణించాడు. ('స'హీ'హ్ బు'ఖారీ) కొందరు ఇతడు 'ఉత్బాబిన్- రబీ'అ అంటారు. (ఇబ్నె-కసీ'ర్)

'జైద్ బిన్ సా'బిత్ (ర'ది.'అ) కథనం: 'నేను దైవప్రవక్త ('స'అస) ముందు ఈ సూరహ్ చదివాను. అతనప్పుడు సజ్దా చేయలేదు.' ('స'హీ'హ్ బు'ఖారీ) దీని ద్వారా తెలిసేది ఏమిటంటే సజ్దా చేయటం అభిలషణీయం (ముస్త'హబ్), ఫ'ర్'ద్ కాదు. ఒకవేళ సజ్దా చేయక పోయినా ఫర్వాలేదు!

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** అస్తమించే నక్షత్రం సాక్షిగా![1]

وَالنَّجْمِ إِذَا هَوَىٰ ۝١

**2.** మీ సహచరుడు (ము'హమ్మద్), మార్గభ్రష్టుడు కాలేదు మరియు తప్పు దారిలోనూ లేడు.[2]

مَا ضَلَّ صَاحِبُكُمْ وَمَا غَوَىٰ ۝٢

**3.** మరియు అతను తన మనోవాంఛలను అనుసరించి కూడా మాట్లాడడు.

وَمَا يَنطِقُ عَنِ الْهَوَىٰ ۝٣

**4.** ఇది (అతను పలుకుతున్నది), అతనిపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం (వ'హీ) మాత్రమే.

إِنْ هُوَ إِلَّا وَحْيٌ يُوحَىٰ ۝٤

**5.** అది అతనికి మహా బలవంతుడు (జిబ్రీల్) నేర్పాడు.

عَلَّمَهُ شَدِيدُ الْقُوَىٰ ۝٥

---

1 లేక 'రాలిపోయే నక్షత్రం' అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం.

2 చూడండి, 7:184. మా 'గవా: తప్పు దారిలోనూ లేడు, పెడదారి పట్టలేదు.

ذُو مِرَّةٍ فَاسْتَوَىٰ ۝٦

**6** అతను శక్తిసామర్థ్యాలు గలవాడు,[1] తన వాస్తవరూపంలో ప్రత్యక్షమయినప్పుడు.

وَهُوَ بِالْأُفُقِ الْأَعْلَىٰ ۝٧

**7.** అతను ఎత్తైన దిఙ్మండలంలో (దిక్చక్రంలో) కనిపించాడు.[2]

ثُمَّ دَنَا فَتَدَلَّىٰ ۝٨

**8** తరువాత సమీపించాడు, మరింత క్రిందికి దిగివచ్చాడు.

فَكَانَ قَابَ قَوْسَيْنِ أَوْ أَدْنَىٰ ۝٩

**9.** అప్పుడు అతను రెండు ధనస్సుల దూరంలోనో లేక అంతకంటే తక్కువ దూరంలోనో ఉన్నాడు.

فَأَوْحَىٰ إِلَىٰ عَبْدِهِ مَا أَوْحَىٰ ۝١٠

**10.** అప్పుడు అతను (జిబ్రీల్), ఆయన (అల్లాహ్) దాసునిపై అవతరింపజేయవలసిన, దాని (వ'హీ)ని అవతరింపజేశాడు.

مَا كَذَبَ الْفُؤَادُ مَا رَأَىٰ ۝١١

**11.** అతను (ప్రవక్త) చూసిన దానిని, అతని హృదయం అబద్ధమని అనలేదు.

أَفَتُمَارُونَهُ عَلَىٰ مَا يَرَىٰ ۝١٢

**12.** అయితే మీరు, అతను (కళ్ళారా) చూసిన దానిని గురించి (అతనితో) వాదులాడుతారా?

وَلَقَدْ رَآهُ نَزْلَةً أُخْرَىٰ ۝١٣

**13.** మరియు వాస్తవానికి అతను (ప్రవక్త) అతనిని (జిబ్రీల్‌ను) మరొకసారి (ప్రత్యక్షంగా) అవతరించినప్పుడు చూశాడు.

عِندَ سِدْرَةِ الْمُنتَهَىٰ ۝١٤

**14.** (సప్తాకాశంలో) చివరి హద్దులోనున్న రేగుచెట్టు (సిద్‌రతుల్ మున్‌తహా) దగ్గర.[3]

---

**1.** శారీరక శక్తి గలవాడు

**2** చూడండి, 81:23. 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం దైవప్రవక్త ('స'అస), రెండుసార్లు దైవదూత జిబ్రీల్('అ.స.)ను అతని నిజరూపంలో చూశారు. మొదటిసారి ఫ'త్‌రతుల్ వ'హీ తరువాత చూడండి, సూరహ్ అల్-ముద్దస్సి'ర్ (74) మరియు రెండవ సారి మే'రాజ్ రాత్రిలో ఏడవఆకాశపు చివరిహద్దులోనున్న రేగుచెట్టు(సిద్‌రతుల్ మున్‌తహా) దగ్గర. ఎవరు కూడా ఆ హద్దును దాటిపోలేరు. చూడండి ఈ సూరహ్ 53:13-18 ఆయతులు.

**3** అంటే మే'రాజ్ రాత్రిలో ఏడవ ఆకాశపు చివరి హద్దులోనున్న రేగుచెట్టు(సిద్‌రతుల్ మున్‌తహా)దగ్గర దైవప్రవక్త('స'అస) జిబ్రీల్('అ.స.)ను అతని నిజరూపంలో రెండవసారి

عِندَهَا جَنَّةُ الْمَأْوَىٰ ﴿١٥﴾

**15.** అక్కడికి దగ్గరలోనే జన్నతుల్ మఅ'వా ఉంది.[1]

إِذْ يَغْشَى السِّدْرَةَ مَا يَغْشَىٰ ﴿١٦﴾

**16.** అప్పుడు ఆ సిద్‌రహ్ వృక్షాన్ని కప్పేది కప్పేసినప్పుడు![2]

مَا زَاغَ الْبَصَرُ وَمَا طَغَىٰ ﴿١٧﴾

**17.** అతని (ప్రవక్త) దృష్టి తప్పిపోనూ లేదు మరియు హద్దులుదాటి కూడా పోలేదు.

لَقَدْ رَأَىٰ مِنْ آيَاتِ رَبِّهِ الْكُبْرَىٰ ﴿١٨﴾

**18.** వాస్తవంగా, అతను (ము'హమ్మద్) తన ప్రభువు యొక్క గొప్పగొప్ప సూచన (ఆయాత్)లను చూశాడు.[3]

أَفَرَأَيْتُمُ اللَّاتَ وَالْعُزَّىٰ ﴿١٩﴾

**19.** మీరు, అల్-లాత్ మరియు అల్-'ఉ'జ్జాలను గురించి ఆలోచించారా?[4]

وَمَنَاةَ الثَّالِثَةَ الْأُخْرَىٰ ﴿٢٠﴾

**20.** మరియు మూడవదీ చివరిది అయిన మనాత్‌ను (గురించి కూడా)?[5]

---

చూశారు ఏ దైవదూత కూడా ఆ 'సిద్‌రతుల్ మున్‌తహా' కంటే ముందుకు పోలేదు దైవదూత ('అలైహిమ్ స.)లకు అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలు లభించేది అక్కడే

1 దీనిని జన్నతుల్-మఅ'వా అనటానికి కారణం ఇది ఒకప్పటి ఆదమ్('అ.స.) యొక్క నివాసస్థలం ఆత్మలన్నీ అక్కడికేపోయి చేరుతాయని కొందరంటారు (ఫ'త్హ్ అల్ ఖదీర్)

2 మే'రాజ్ రాత్రిలో దైవప్రవక్త('స'అస) అక్కడికి చేరుకున్నప్పుడు బంగారు పక్షులు దాని చుట్టూ ఎగురుతూ ఉంటాయి దైవదూతల నీడలు దానిపై పడుతూ ఉంటాయి అల్లాహ్ (సు.తా.) యొక్క జ్యోతి అక్కడ ఉంటుంది. (ఇబ్నె-కసీ'ర్ మరియు ఇతరులు) అక్కడ దైవప్రవక్త('స'అస)కు మూడు విషయాలు ప్రసాదించబడ్డాయి 1) ఐదుపూటల నమా'జులు, 2) సూరహ్ బఖరహ్ చివరి ఆయతులు మరియు 3) షిర్క్‌కు దూరంగా ఉండే ముస్లింను క్షమిస్తాననే వాగ్దానం. ('స'హీ'హ్ ముస్లిం).

3 ఆ సూచనలు, జిబ్రీల్('అ.స.)ను నిజరూపంలో చూసింది సిద్‌రతుల్ మున్‌తహాను చూసింది మరియు ఇతర విషయాలను చూసింది. అవి 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి వివరాలకు చూడండి, 17:1 మరియు 7 187-188

4 రఅ యేతుమ్. అంటే అసలు అర్థం: 'చూశారా?' అని కాని ఇక్కడ దాని అర్థం 'ఆలోచించారా?' లేక 'గమనించారా?' ఖుర్ఆన్‌లో ఈ పదం ఈ అర్థంలో చాలాసార్లు ఉపయోగించబడింది ఇతర అర్థాలు యోచించు, ఆనుకొను, భావించు, తలచు, అభిప్రాయపడు, మొదలైనవి

5 అంటే వారి శక్తి ఏమిటి? అవి మీ క్షేమవా మేలు గానీ, కీడు గానీ చేయగలవా? ఏమైనా సృష్టించగలవా? అవి తమకు తామే సహాయం చేసుకోలేవు మరి మీకెలా సహాయం చేయగలవు ఇక్కడ ఆ కాలపు కేవలం మూడు విగ్రహాల పేర్లే పేర్కొనబడ్డాయి

أَلَكُمُ الذَّكَرُ وَلَهُ الْأُنثَىٰ ﴿٢١﴾

**21.** మీ కొరకైతే కుమారులు మరియు ఆయన కొరకు కుమార్తెలా?[1]

تِلْكَ إِذًا قِسْمَةٌ ضِيزَىٰ ﴿٢٢﴾

**22.** ఇది అన్యాయమైన విభజన కాదా!

إِنْ هِيَ إِلَّا أَسْمَاءٌ سَمَّيْتُمُوهَا أَنتُمْ وَآبَاؤُكُم مَّا أَنزَلَ اللَّهُ بِهَا مِن سُلْطَانٍ ۚ إِن يَتَّبِعُونَ إِلَّا الظَّنَّ وَمَا تَهْوَى الْأَنفُسُ ۖ وَلَقَدْ جَاءَهُم مِّن رَّبِّهِمُ الْهُدَىٰ ﴿٢٣﴾

**23** ఇవన్నీ మీరు మరియు మీ తండ్రి తాతలు పెట్టిన పేర్లు మాత్రమే, అల్లాహ్ వీటిని గురించి ఎట్టి ప్రమాణం అవతరింపజేయలేదు.[2] వారు, కేవలం తమ ఊహాగానాలను మరియు తమ ఆత్మలు కోరే మనోవాంఛలను మాత్రమే అనుసరిస్తున్నారు[3] వాస్తవానికి వారి ప్రభువు తరఫునుండి వారి వద్దకు మార్గదర్శకత్వం కూడా వచ్చిఉన్నది!

أَمْ لِلْإِنسَانِ مَا تَمَنَّىٰ ﴿٢٤﴾

**24.** ఏమిటి? మానవునికి తాను కోరిన దంతా లభిస్తుందా?

فَلِلَّهِ الْآخِرَةُ وَالْأُولَىٰ ﴿٢٥﴾

**25.** వాస్తవానికి, అంతిమం (పరలోకం) మరియు ప్రథమం (ఇహలోకం) అన్నీ అల్లాహ్‌కే చెందినవి. (1/4)

وَكَم مِّن مَّلَكٍ فِي السَّمَاوَاتِ لَا تُغْنِي شَفَاعَتُهُمْ شَيْئًا إِلَّا مِن بَعْدِ أَن يَأْذَنَ اللَّهُ لِمَن يَشَاءُ وَيَرْضَىٰ ﴿٢٦﴾

**26.** * మరియు ఆకాశాలలో ఎందరో దేవదూతలు ఉన్నారు కాని వారి సిఫారసు ఏ మాత్రం పనికిరాదు; అల్లాహ్ ఎవరి పట్లనైతే ప్రసన్నుడై, తన ఇష్టంతో వారికి అనుమతి స్తేనే తప్ప![4]

إِنَّ الَّذِينَ لَا يُؤْمِنُونَ بِالْآخِرَةِ لَيُسَمُّونَ الْمَلَائِكَةَ تَسْمِيَةَ الْأُنثَىٰ ﴿٢٧﴾

**27.** నిశ్చయంగా, ఎవరైతే పరలోక జీవితాన్ని విశ్వసించరో! వారే దేవదూతలను స్త్రీల పేర్లతో పిలుస్తారు;

---

1 ఆడపిల్లలంటే ఆ కాలపు 'అరబ్బులలో ఉన్న అసహ్యానికి చూడండి, 16:57 59, 62.

2 చూడండి, 12 40.

3 మనోవాంఛలు అంటే, ఆ దేవతలు తమ కొరకు అల్లాహ్ (సు.తా.) దగ్గర సిఫారసు చేస్తారని భావించటం.

4 అల్లాహ్ (సు.తా.)కు అతి సమీపంగా ఉండే దైవదూత ('అ.స.)లకు కూడా కేవలం వారి కోసమే సిఫారసు చేసే హక్కు ఉంటుంది, ఎవరి కొరకైతే అల్లాహ్ (సు.తా.) సిఫారసు చేయటానికి అనుమతినిస్తాడో! వివరాలకు చూడండి, 10:3 మరియు 10:18

وَمَا لَهُم بِهِۦ مِنْ عِلْمٍ إِن يَتَّبِعُونَ إِلَّا ٱلظَّنَّ
وَإِنَّ ٱلظَّنَّ لَا يُغْنِى مِنَ ٱلْحَقِّ شَيْـًٔا ﴿٢٨﴾

**28.** ఈ విషయం గురించి వారికి ఎలాంటి జ్ఞానంలేదు. వారు కేవలం తమ ఊహలనే అనుసరిస్తున్నారు. కాని వాస్తవానికి, ఊహ సత్యానికి ఏమాత్రం బదులు కాజాలదు.

فَأَعْرِضْ عَن مَّن تَوَلَّىٰ عَن ذِكْرِنَا وَلَمْ يُرِدْ
إِلَّا ٱلْحَيَوٰةَ ٱلدُّنْيَا ﴿٢٩﴾

**29.** కావున, మా హితబోధ (ఖుర్ఆన్) నుండి ముఖం త్రిప్పుకొని ఇహలోక జీవితం తప్ప మరేమీ కోరని వ్యక్తిని నీవు పట్టించుకోకు.

ذَٰلِكَ مَبْلَغُهُم مِّنَ ٱلْعِلْمِ إِنَّ رَبَّكَ هُوَ أَعْلَمُ بِمَن
ضَلَّ عَن سَبِيلِهِۦ وَهُوَ أَعْلَمُ بِمَنِ ٱهْتَدَىٰ ﴿٣٠﴾

**30.** ఇదే వారి జ్ఞానపరిధి. నిశ్చయంగా, నీ ప్రభువుకు, ఆయన మార్గంనుండి ఎవడు తప్పిపోయాడో బాగా తెలుసు. మరియు ఎవడు సన్మార్గంలో ఉన్నాడో కూడా, ఆయనకు బాగా తెలుసు.

وَلِلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ لِيَجْزِىَ
ٱلَّذِينَ أَسَٰٓـُٔوا۟ بِمَا عَمِلُوا۟ وَيَجْزِىَ ٱلَّذِينَ
أَحْسَنُوا۟ بِٱلْحُسْنَى ﴿٣١﴾

**31.** మరియు ఆకాశాలలో నున్నది మరియు భూమిలో నున్నది. అంతా అల్లాహ్‌కే చెందుతుంది - దుష్టులకు వారి కర్మలకు తగిన ప్రతిఫలం ఇవ్వటానికి మరియు సత్కార్యాలు చేసిన వారికి మంచి ప్రతిఫలం ఇవ్వటానికి.[1]

ٱلَّذِينَ يَجْتَنِبُونَ كَبَٰٓئِرَ ٱلْإِثْمِ وَٱلْفَوَٰحِشَ إِلَّا ٱللَّمَمَ
إِنَّ رَبَّكَ وَٰسِعُ ٱلْمَغْفِرَةِ هُوَ أَعْلَمُ بِكُمْ إِذْ أَنشَأَكُم
مِّنَ ٱلْأَرْضِ وَإِذْ أَنتُمْ أَجِنَّةٌ فِى بُطُونِ أُمَّهَٰتِكُمْ
فَلَا تُزَكُّوٓا۟ أَنفُسَكُمْ هُوَ أَعْلَمُ بِمَنِ ٱتَّقَىٰٓ ﴿٣٢﴾

**32.** ఎవరైతే చిన్నచిన్న తప్పులు తప్ప, పెద్దపాపాల నుండి[2] మరియు అసహ్య కరమైన పనుల నుండి దూరంగా ఉంటారో వారి కొరకు, నిశ్చయంగా, నీ ప్రభువు క్షమాపణ పరిధి చాలా విశాలమైనది. మిమ్మల్ని మట్టినుండి సృష్టించినప్పటినుండి మరియు మీరు మీ

---

**1.** సత్కార్యాలకు ఎన్నోరెట్లు ప్రతిఫలమివ్వబడుతుంది కాని పాపాలకు మాత్రం సమాన శిక్షయే విధించబడుతుంది. చూడండి, 6:160.

**2** పెద్దపాపాల వివరణ విషయంలో విద్వాంసుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి చాలా మంది విద్వాంసుల దృష్టిలో నరకశిక్ష సూచించబడిన పాపాలు పెద్దవి లేక ఖుర్ఆన్ మరియు 'హదీస్'లో గట్టిగా వారించబడినవి కూడా! అలాగే చిన్న పాపాలు మళ్ళీమళ్ళీ చేయటం కూడా పెద్ద పాపమే.

ఫవా'హిషున్, ఫా'హిషతున్ యొక్క బహువచనం అంటే సిగ్గుమాలిన పనులు ఉదా: 'జినా మరియు లువా'తత్ ఎవరైతే పెద్ద పాపాల నుండి మరియు అసహ్యకరమైన పనుల నుండి దూరంగా ఉంటారో వారికి క్షమాభిక్ష దొరకవచ్చు అని ఈ ఆయత్‌లో చెప్పబడింది

తల్లుల గర్భాలలో పిండాలుగా[1] ఉన్నప్పటి నుండి కూడా, ఆయనకు మీ గురించి బాగా తెలుసు. కావున మీరు మీ పవిత్రతను గురించి (గొప్పలు) చెప్పుకోకండి.[2] ఎవడు భయభక్తులు గలవాడో ఆయనకు బాగా తెలుసు.

33. నీవు (ఇస్లాంనుండి) మరలిపోయే వాడిని చూశావా?

أَفَرَءَيْتَ ٱلَّذِى تَوَلَّىٰ ﴿٣٣﴾

34. మరియు (అల్లాహ్ మార్గంలో) కొంత మాత్రమే ఇచ్చి, చేయి ఆపుకునే వాడిని?

وَأَعْطَىٰ قَلِيلًا وَأَكْدَىٰٓ ﴿٣٤﴾

35 అతని వద్ద అగోచర జ్ఞానముందా? అతడు (స్పష్టంగా) చూడటానికి?

أَعِندَهُۥ عِلْمُ ٱلْغَيْبِ فَهُوَ يَرَىٰٓ ﴿٣٥﴾

36. లేక, మూసా గ్రంథంలో నున్న విషయాలు అతనికి తెలుపబడలేదా?

أَمْ لَمْ يُنَبَّأْ بِمَا فِى صُحُفِ مُوسَىٰ ﴿٣٦﴾

37. మరియు తన బాధ్యతను నెరవేర్చిన ఇబ్రాహీమ్ విషయము;[3]

وَإِبْرَٰهِيمَ ٱلَّذِى وَفَّىٰٓ ﴿٣٧﴾

38. మరియు (పాపాల) భారం మోసే వాడెవడూ ఇతరుల (పాపాల) భారం మోయడని;[4]

أَلَّا تَزِرُ وَازِرَةٌ وِزْرَ أُخْرَىٰ ﴿٣٨﴾

39. మరియు మానవునికి తాను చేసిన దాని ఫలితం తప్ప మరొకటి లభించదని;[5]

وَأَن لَّيْسَ لِلْإِنسَٰنِ إِلَّا مَا سَعَىٰ ﴿٣٩﴾

---

1 అజిన్నతున్-జనీనున్ యొక్క బహువచనం అంటే తల్లిగర్భంలో ఉండే పిండం. అది ఇతరులకు కనిపించదు కనుక దాన్ని ఆ విధంగా అంటారు.

2. చూడండి, 4:49

3 చూడండి, 2:124.

4 ఈ ఆయత్ ఖుర్ఆన్‌లో ఐదుసార్లు వచ్చింది 6:164, 17:15, 35:18, 39:7 మరియు ఇక్కడ ఈ సూరహ్‌లో ఖుర్ఆన్ అవతరణలో మొట్టమొదటి సారి వచ్చింది. ఇది క్రైస్తవుల 'మూలపాపం' అనే సిద్ధాంతాన్ని ఖండిస్తోంది. రెండవది: 'ఒకని పాపభారాన్ని ఒక ప్రవక్త (అ.స.) లేక సన్యాసి భరిస్తాడు.' అనే సిద్ధాంతాన్ని కూడా ఖండిస్తోంది. ఉదా: క్రైస్తవులు: 'దైవప్రవక్త 'ఈసా (అ.స.) మానవజాతి పాపాలను భరిస్తాడు.' అనే సిద్ధాంతం.

5 దైవప్రవక్త(స'అస) ప్రవచనం: 'కర్మల ఫలితాలు, వాటి కర్తల ఉద్దేశాలను బట్టి నిర్ణయించబడతాయి. ప్రతివాడు తాను బుద్ధిపూర్వకంగా చేసిన దాని ఫలితమే పొందుతాడు.'

**40.** మరియు నిశ్చయంగా, అతనికి తన కృషి ఫలితమే చూపబడుతుందని;

وَأَنَّ سَعْيَهُ سَوْفَ يُرَىٰ ۝٤٠

**41.** అప్పుడు అతనికి తన కృషికి పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుందని;

ثُمَّ يُجْزَاهُ الْجَزَاءَ الْأَوْفَىٰ ۝٤١

**42.** మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్దనే (ప్రతిదాని) ముగింపు ఉన్నదని;

وَأَنَّ إِلَىٰ رَبِّكَ الْمُنْتَهَىٰ ۝٤٢

**43.** మరియు నిశ్చయంగా, ఆయనే నిన్ను నవ్విస్తున్నాడు మరియు ఏడ్పిస్తున్నాడని;

وَأَنَّهُ هُوَ أَضْحَكَ وَأَبْكَىٰ ۝٤٣

**44.** మరియు నిశ్చయంగా, ఆయనే మరణింపజేసేవాడు మరియు జీవితాన్ని ప్రసాదించే వాడని;

وَأَنَّهُ هُوَ أَمَاتَ وَأَحْيَا ۝٤٤

**45.** మరియు నిశ్చయంగా, మగ-ఆడ జంటలను సృష్టించిన వాడు ఆయనేనని -

وَأَنَّهُ خَلَقَ الزَّوْجَيْنِ الذَّكَرَ وَالْأُنْثَىٰ ۝٤٥

**46.** విసర్జింపబడిన, వీర్య బిందువు నుండి.

مِنْ نُطْفَةٍ إِذَا تُمْنَىٰ ۝٤٦

**47.** మరియు నిశ్చయంగా, దానికి మరొక జీవితాన్ని (పునరుత్థానం) ప్రసాదించడం ఆయన (అల్లాహ్)కే చెందినదని;

وَأَنَّ عَلَيْهِ النَّشْأَةَ الْأُخْرَىٰ ۝٤٧

**48.** మరియు నిశ్చయంగా, ఆయనే సంపన్నునిగా చేసేవాడు మరియు తృప్తి నిచ్చువాడని;

وَأَنَّهُ هُوَ أَغْنَىٰ وَأَقْنَىٰ ۝٤٨

**49.** మరియు నిశ్చయంగా ఆయనే

وَأَنَّهُ هُوَ رَبُّ الشِّعْرَىٰ ۝٤٩

(బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ', అబూ దావూద్, నసాయి', ఇబ్నె మాజా, ఇబ్నె 'హంబల్ మరియు ఇతరులు) అమాల్ అంటే కర్మలు: మంచివి గానీ, చెడ్డవి గానీ చేయడమే గాక పలకడం గూడా లెక్కించబడుతుంది. ఒక పని, చేయుటమే గాక, బుద్ధిపూర్వకంగా ఒక పని చేయకుండా ఉండటం కూడా కర్మగానే లెక్కించబడుతుంది అది మంచిపని గానీ లేక చెడ్డ పని గానీ అదే విధంగా నమ్మకాలను, విశ్వాసాలను ప్రకటించటం కూడా, అవి మూఢనమ్మకాలు గానీ లేదా సత్య విశ్వాసాలు గానీ లెక్కించబడతాయి అంటే మానవుడు చేసే ప్రతి పని, పలికే ప్రతిమాట లెక్కించబడుతుందన్న మాట.

అగ్ని[1] నక్షత్రానికి ప్రభువని;

وَأَنَّهُۥٓ أَهۡلَكَ عَادًا ٱلۡأُولَىٰ ٥٠

**50.** మరియు నిశ్చయంగా, ఆయనే తొలి 'ఆద్ జాతిని నాశనం చేసినవాడని;[2]

وَثَمُودَاْ فَمَآ أَبۡقَىٰ ٥١

**51.** మరియు స'మూద్ జాతిని; ఒక్కడూ కూడా లేకుండా రూపుమాపాడని.[3]

وَقَوۡمَ نُوحٖ مِّن قَبۡلُۖ إِنَّهُمۡ كَانُواْ هُمۡ أَظۡلَمَ وَأَطۡغَىٰ ٥٢

**52.** మరియు అంతకు పూర్వం నూ'హ్ జాతివారిని. నిశ్చయంగా, వారు పరమ దుర్మార్గులు మరియు తలబిరుసులు.

وَٱلۡمُؤۡتَفِكَةَ أَهۡوَىٰ ٥٣

**53.** మరియు ఆయనే తలక్రిందులైన నగరాలను నాశనం చేశాడు.[4]

فَغَشَّىٰهَا مَا غَشَّىٰ ٥٤

**54.** తరువాత వాటిని క్రమ్ముకొనవలసింది (రాళ్ళ వర్షం) క్రమ్ముకున్నది.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكَ تَتَمَارَىٰ ٥٥

**55.** అయితే (ఓ మానవుడా!) నీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను గురించి నీవు అనుమానంలో పడిఉంటావు?[5]

هَٰذَا نَذِيرٞ مِّنَ ٱلنُّذُرِ ٱلۡأُولَىٰٓ ٥٦

**56.** ఇదివరకు వచ్చిన హెచ్చరిక చేసే వారివలే ఇతను (ము'హమ్మద్) కూడా హెచ్చరిక చేసేవాడు మాత్రమే!

أَزِفَتِ ٱلۡأٓزِفَةُ ٥٧

**57.** రానున్న ఘడియ (పునరుత్థానదినం) సమీపంలోనే వుంది.

لَيۡسَ لَهَا مِن دُونِ ٱللَّهِ كَاشِفَةٌ ٥٨

**58.** అల్లాహ్ తప్ప మరెవ్వరూ దానిని తొలగించ లేరు

---

1 అష్ షి'అరా Sirius, అగ్ని నక్షత్రం. ఇది ఆకాశంలో దేదీప్యమానంగా వెలుగుతూ ఉంటుంది. ముష్రిక్ 'అరబ్బులు దీన్ని పూజించేవారు.

2 'ఆద్ జాతివారి గాథకై చూడండి, 7:65-69. వీరు నూ'హ్ జాతివారి తరువాత నాశనం చేయబడ్డవారు.

3 స'మూద్ జాతివారి గాథకై చూడండి, 7:73 మరియు 26:141-158.

4. లూ'త్ ప్రజల నాశనానికై చూడండి, 11:77-83.

5. చూడండి, 55:13.

أَفَمِنْ هَٰذَا الْحَدِيثِ تَعْجَبُونَ ۝

**59.** ఏమీ? మీరు ఈ సందేశాన్ని చూసి ఆశ్చర్యపడుతున్నారా?

وَتَضْحَكُونَ وَلَا تَبْكُونَ ۝

**60.** మరియు మీరు నవ్వుతున్నారా? మరియు మీకు ఏడుపు రావటంలేదా?

وَأَنتُمْ سَامِدُونَ ۝

**61.** మరియు మీరు నిర్లక్ష్యంలో మునిగి ఉన్నారు.[1]

فَاسْجُدُوا لِلَّهِ وَاعْبُدُوا ۩ ۝

**62.** కావున, అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయండి. మరియు (ఆయనను మాత్రమే) ఆరాధించండి![2] ۩

---

1. లేక: 'ఆటపాటల్లో మునిగి ఉన్నారా?'
2. ఈ ఆజ్ఞను పాటిస్తూ దైవప్రవక్త ('స'అస) సజ్దా చేశారు. అతనితోబాటు 'స'హాబా(ర'ది'అన్హుమ్)లు మరియు అక్కడున్న ముష్రికీన్ కూడా సజ్దాచేశారు.

## 54. సూరహ్ అల్-ఖమర్

سُورَةُ القَمَر

అల్-ఖమరు: చంద్రుడు, The Moon. మొదటి ఆయత్‌లో ఈ పేరు ఉంది. ఈ సమూహంలో ఇది 5వ సూరహ్. ఇది మక్కా మొదటి కాలంలో అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) పండుగ('ఈద్)ల నమా'జ్‌లలో చదివే సూరాహ్‌లలో సూరహ్ ఖాఫ్ (50) మరియు ఇది పేర్కొనదగినవి. ఇందులో 55 ఆయతులు ఉన్నాయి.

బిస్మిల్లాహిర్ రహ్మానిర్ రహీమ్ — بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

اقْتَرَبَتِ السَّاعَةُ وَانشَقَّ الْقَمَرُ ۝

**1.** ఆ ఘడియ దగ్గరకువచ్చింది మరియు చంద్రుడు పూర్తిగా చీలిపోయాడు.[1]

وَإِن يَرَوْا آيَةً يُعْرِضُوا وَيَقُولُوا سِحْرٌ مُّسْتَمِرٌّ ۝

**2.** అయినా (సత్యతిరస్కారులు), అద్భుత సూచనను చూసినా తమ ముఖాలను త్రిప్పుకొంటున్నారు. మరియు: "ఇది ఎప్పటినుంచో జరుగుతూ వస్తున్న మంత్రజాలమే." అని అంటున్నారు.

وَكَذَّبُوا وَاتَّبَعُوا أَهْوَاءَهُمْ ۚ وَكُلُّ أَمْرٍ مُّسْتَقِرٌّ ۝

**3.** మరియు వారు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) అసత్యమని తిరస్కరించారు. మరియు తమ మనోవాంఛలను అనుసరించారు. మరియు ప్రతి వ్యవహారం ఒక పర్యవసానానికి చేరవలసి ఉంటుంది.[2]

وَلَقَدْ جَاءَهُم مِّنَ الْأَنبَاءِ مَا فِيهِ مُزْدَجَرٌ ۝

**4.** మరియు వాస్తవానికి, వారివద్దకు సమాచారాలు వచ్చాయి. అందు వారికి మందలింపులు ఉండేవి.

حِكْمَةٌ بَالِغَةٌ ۖ فَمَا تُغْنِ النُّذُرُ ۝

**5.** కావలసినంత వివేకమూ ఉండేది కాని ఆ హెచ్చరికలు వారికి ప్రయోజనకరం కాలేదు.

---

1 ఈ అద్భుత నిదర్శనం, మక్కావాసుల కోరికపై దైవప్రవక్త ('స'అస) చూపించారు. ('స 'హీ'హ్ ముస్లిం)

2 ప్రతి కార్యానికి పర్యవసానం ఉంది. అంటే మంచికి మంచి ప్రతిఫలం మరియు చెడుకు శిక్ష. ఈ ప్రతిఫలం ఈ లోకంలోనే లభించవచ్చు లేనిచో పరలోకంలో తప్పకుండా లభిస్తుంది.

فَتَوَلَّ عَنْهُمْ يَوْمَ يَدْعُ الدَّاعِ إِلَىٰ شَيْءٍ نُّكُرٍ ﴿٦﴾

**6.** కావున (ఓ ము'హమ్మద్!) నీవు వారి నుండి మరలిపో! పిలిచేవాడు భయంకరమైన ఒక విషయం వైపునకు పిలిచే రోజున;

خُشَّعًا أَبْصَارُهُمْ يَخْرُجُونَ مِنَ الْأَجْدَاثِ كَأَنَّهُمْ جَرَادٌ مُّنتَشِرٌ ﴿٧﴾

**7.** వారి చూపులు క్రిందికి వాలిఉంటాయి, వారు చెల్లాచెదురైన మిడతలవలే, తమ గోరీలనుండి లేచి బయటికి వస్తారు;

مُّهْطِعِينَ إِلَى الدَّاعِ يَقُولُ الْكَافِرُونَ هَٰذَا يَوْمٌ عَسِرٌ ﴿٨﴾

**8.** వేగంగా పిలిచేవాని వైపునకు! సత్య తిరస్కారులు: "ఇది చాలా కఠినమైన రోజు." అని అంటారు. (3/8)

كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ فَكَذَّبُوا عَبْدَنَا وَقَالُوا مَجْنُونٌ وَازْدُجِرَ ﴿٩﴾

**9.** * వారికి పూర్వం నూ'హ్[1] జాతివారు (తమ ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించి ఉన్నారు, అప్పుడు వారు మా దాసుణ్ణి: "అసత్యవాది!" అని అన్నారు. మరియు: "ఇతడు పిచ్చివాడు." అని అన్నారు మరియు అతను కసిరికొట్టబడ్డాడు.

فَدَعَا رَبَّهُ أَنِّي مَغْلُوبٌ فَانتَصِرْ ﴿١٠﴾

**10.** అప్పుడతను తన ప్రభువును ఇలా ప్రార్థించాడు: "నిశ్చయంగా నేను ఓడిపోయాను కావున నాకు సహాయం చేయి!"

فَفَتَحْنَا أَبْوَابَ السَّمَاءِ بِمَاءٍ مُّنْهَمِرٍ ﴿١١﴾

**11.** అప్పుడు మేము ఆకాశపు ద్వారాలు తెరిచి కుంభవర్షాన్ని కురిపించాము.

وَفَجَّرْنَا الْأَرْضَ عُيُونًا فَالْتَقَى الْمَاءُ عَلَىٰ أَمْرٍ قَدْ قُدِرَ ﴿١٢﴾

**12.** మరియు భూమినుండి ఊటలను పొంగింపజేశాము అపుడు నిర్ణీతకార్యానికి గాను నీళ్ళన్నీ కలిసిపోయాయి.

وَحَمَلْنَاهُ عَلَىٰ ذَاتِ أَلْوَاحٍ وَدُسُرٍ ﴿١٣﴾

**13.** మరియు మేము అతనిని (నూ'హ్‌ను) పలకలు మరియు మేకులు గల దాని (ఓడ)పై ఎక్కించాము.

تَجْرِي بِأَعْيُنِنَا جَزَاءً لِّمَن كَانَ كُفِرَ ﴿١٤﴾

**14.** అది మా కన్నుల ముందు తేలియాడుతూ పోయింది. (తన జాతివారిచేత) తిరస్కరింపబడిన

---

1. నూ'హ్ గాథ కోసం చూడండి, 11:25-48 మరియు 26:116.

వానికి ప్రతిఫలంగా!

وَلَقَد تَّرَكْنَٰهَآ ءَايَةً فَهَلْ مِن مُّدَّكِرٍ ۝١٥

**15.** మరియు వాస్తవానికి మేము దానిని (ఆ ఓడను) ఒక సూచనగా చేసి వదలిపెట్టాము. అయితే, హితబోధ స్వీకరించే వాడు ఎవడైనా ఉన్నాడా?[1]

فَكَيْفَ كَانَ عَذَابِى وَنُذُرِ ۝١٦

**16.** చూశారా! నా శిక్ష మరియు నా హెచ్చరికలు ఎలా ఉండెనో?

وَلَقَدْ يَسَّرْنَا ٱلْقُرْءَانَ لِلذِّكْرِ فَهَلْ مِن مُّدَّكِرٍ ۝١٧

**17.** మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటం కోసం సులభం చేశాము. అయితే హితబోధను స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

كَذَّبَتْ عَادٌ فَكَيْفَ كَانَ عَذَابِى وَنُذُرِ ۝١٨

**18.** ఆద్‌జాతి సత్యాన్ని తిరస్కరించింది. చూశారా! నా శిక్ష మరియు నాహెచ్చరికలు ఎలా ఉండెనో?

إِنَّآ أَرْسَلْنَا عَلَيْهِمْ رِيحًا صَرْصَرًا فِى يَوْمِ نَحْسٍ مُّسْتَمِرٍّ ۝١٩

**19.** నిశ్చయంగా, మేము పూర్తిగా దురదృష్టమైన (అరిష్టదాయకమైన) ఒక రోజున, తీవ్రమైన ఎడతెగని తుఫానుగాలిని పంపాము.[2]

تَنزِعُ ٱلنَّاسَ كَأَنَّهُمْ أَعْجَازُ نَخْلٍ مُّنقَعِرٍ ۝٢٠

**20.** అది ప్రజలను, వేళ్ళతో పెళ్ళగింప బడిన ఖర్జూరపు చెట్లవలె పెళ్ళగించి వేసింది.[3]

فَكَيْفَ كَانَ عَذَابِى وَنُذُرِ ۝٢١

**21.** ఇక చూశారా! నా శిక్ష మరియు నాహెచ్చరికలు ఎలా ఉండెనో?

وَلَقَدْ يَسَّرْنَا ٱلْقُرْءَانَ لِلذِّكْرِ فَهَلْ مِن مُّدَّكِرٍ ۝٢٢

**22.** మరియు వాస్తవానికి మేము ఈ

1 ముద్దకిర్: ఈ పదం అసలు రూపం, 'మజ్'తకిర్' అంటే హితబోధ స్వీకరించేవాడని అర్థం, (ఫ'త్హ్ అల్ ఖదీర్). చూడండి, 36:41-42.

2 ఆ 'తుఫాను గాలి ఏడు రాత్రులు మరియు ఎనిమిది పగళ్లు ఎడతెగకుండా వీచింది. ఆ విధంగా ఆ దినాలు, ఆ సత్యతిరస్కారులకు అశుభకరంగా పరిణమించాయి. అంతేగాని విశ్వాసులకు ఏ దినమూ అశుభం కాదు. ఏ దినాన్ని గూడా ఈ ప్రత్యేక దినం అశుభమైనదని అనటం తప్పు. వారంలోని ఏడుదినాలూ మంచివే.

3. చూడండి, 69:6-8.

ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటం కోసం సులభం చేశాము, అయితే హితబోధను స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

كَذَّبَتْ ثَمُودُ بِالنُّذُرِ ﴿٢٣﴾

**23.** స'మూద్ జాతి హెచ్చరికలను అసత్యాలని తిరస్కరించింది.

فَقَالُوا أَبَشَرًا مِّنَّا وَاحِدًا نَّتَّبِعُهُ إِنَّا إِذًا لَّفِي ضَلَالٍ وَسُعُرٍ ﴿٢٤﴾

**24.** అప్పుడు వారు ఇలా అన్నారు: "ఏమీ? మాలోని ఒకవ్యక్తిని, ఒంటరివాడిని, మేము అనుసరించాలా? అలా అయితే నిశ్చయంగా, మేము మార్గభ్రష్టులం మరియు పిచ్చివారం అయినట్లే కదా?"

أَأُلْقِيَ الذِّكْرُ عَلَيْهِ مِن بَيْنِنَا بَلْ هُوَ كَذَّابٌ أَشِرٌ ﴿٢٥﴾

**25.** "ఏమీ? మా అందరిలో, కేవలం అతని మీదనే (దివ్య) సందేశం పంపబడిందా? అలాకాదు! అసలు అతను అసత్యవాది, డంబాలు పలికేవాడు!"

سَيَعْلَمُونَ غَدًا مَّنِ الْكَذَّابُ الْأَشِرُ ﴿٢٦﴾

**26.** అసత్యవాది, డంబాలు పలికేవాడు! ఎవడో రేపే (త్వరలోనే) వారికి తెలిసిపోతుంది!

إِنَّا مُرْسِلُو النَّاقَةِ فِتْنَةً لَّهُمْ فَارْتَقِبْهُمْ وَاصْطَبِرْ ﴿٢٧﴾

**27.** నిశ్చయంగా, మేము ఆడఒంటెను, వారిని పరీక్షించటంకోసం పంపుతున్నాము, కావున (ఓ 'సాలి'హ్!) వారి విషయంలో వేచిఉండు మరియు సహనంవహించు!

وَنَبِّئْهُمْ أَنَّ الْمَاءَ قِسْمَةٌ بَيْنَهُمْ كُلُّ شِرْبٍ مُّحْتَضَرٌ ﴿٢٨﴾

**28.** మరియు వారి మధ్య నీరు (న్యాయంగా) పంచబడాలని వారికి బోధించు. ప్రతిఒక్కరూ తమవంతు వచ్చే రోజునే త్రాగాలని నియమించబడింది.[1]

فَنَادَوْا صَاحِبَهُمْ فَتَعَاطَىٰ فَعَقَرَ ﴿٢٩﴾

**29.** ఆ పిదప వారు తమ సహచరుణ్ణి పిలిచారు. వాడు దాన్ని పట్టుకొని (దాని వెనుకకాలి మోకాలినరాలు కోసి) చంపాడు.[2]

1. చూడండి, 26:155 ఒకరోజు ఒంటెను నీరుత్రాగనివ్వాలి, రెండవరోజు ప్రజలు త్రాగాలి
2. చూడండి. 7:77.

فَكَيْفَ كَانَ عَذَابِي وَنُذُرِ ٣٠

**30.** అప్పుడు చూశారా! నా శిక్ష మరియు నా హెచ్చరికలు ఎలా ఉండెనో?

إِنَّا أَرْسَلْنَا عَلَيْهِمْ صَيْحَةً وَاحِدَةً فَكَانُوا كَهَشِيمِ الْمُحْتَظِرِ ٣١

**31.** నిశ్చయంగా, మేము వారి మీదకు ఒక భయంకరమైన శబ్దాన్ని ('సయ్'హా) పంపాము, దాంతో వారు త్రొక్కబడిన పశువుల దొడ్డి కంచెవలే నుగ్గునుగ్గు అయిపోయారు

وَلَقَدْ يَسَّرْنَا الْقُرْآنَ لِلذِّكْرِ فَهَلْ مِن مُّدَّكِرٍ ٣٢

**32.** మరియు వాస్తవానికి, మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటానికి సులభం చేశాము, అయితే హితబోధ స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

كَذَّبَتْ قَوْمُ لُوطٍ بِالنُّذُرِ ٣٣

**33.** లూ'త్ జాతి కూడా హెచ్చరికలను అసత్యాలని తిరస్కరించింది.

إِنَّا أَرْسَلْنَا عَلَيْهِمْ حَاصِبًا إِلَّا آلَ لُوطٍ نَّجَّيْنَاهُم بِسَحَرٍ ٣٤

**34.** నిశ్చయంగా, మేము, లూ'త్ ఇంటి వారు తప్ప! ఇతరుల మీదికి రాళ్ళు విసిరే 'తుఫాన్ గాలిని పంపాము. (లూ'త్ ఇంటి) వారిని మేము వేకువజామున రక్షించాము;[1]

نِّعْمَةً مِّنْ عِندِنَا كَذَٰلِكَ نَجْزِي مَن شَكَرَ ٣٥

**35.** మా తరఫునుండి అనుగ్రహంగా. ఈ విధంగా మేము కృతజ్ఞులకు ప్రతిఫలం ఇస్తాము.

وَلَقَدْ أَنذَرَهُم بَطْشَتَنَا فَتَمَارَوْا بِالنُّذُرِ ٣٦

**36.** మరియు వాస్తవానికి (లూ'త్ తన జాతి) వారిని మా రాబోయే శిక్షను గురించి హెచ్చరించాడు. కాని వారు మా హెచ్చరికలను సందేహించి (మొండి) వాదనలకు దిగారు!

وَلَقَدْ رَاوَدُوهُ عَن ضَيْفِهِ فَطَمَسْنَا أَعْيُنَهُمْ فَذُوقُوا عَذَابِي وَنُذُرِ ٣٧

**37.** మరియు వాస్తవానికి వారు అతని అతిథులను[2] అతని నుండి బలవంతంగా లాక్కోవాలని అనుకున్నారు. కావున మేము

---

1 ఆల లూ'తున్ అంటే అతనితో సహా అతని ఇద్దరు కూతుళ్ళు మరియు కొందరు అతని అనుచరులు అతని భార్య సత్యతిరస్కారులలో చేరిపోయింది ఈ గాథ వివరాల కోసం చూడండి, 11:69-83

2 వారు జిబ్రీల్, మీకాయీ'ల్ మరియు ఇస్రాఫీల్ ('అలైహిమ్.స.)లు. చూడండి, 11:77-79

వారి కళ్ళను పోగొట్టాము. (వారితో ఇలా అన్నాము): "ఇప్పుడు నా శిక్షను మరియు నా హెచ్చరికను చవిచూడండి."

**38.** మరియు వాస్తవానికి, ఉదయపు వేళ శాశ్వతమైన శిక్ష వారిమీద పడింది:

وَلَقَدْ صَبَّحَهُم بُكْرَةً عَذَابٌ مُّسْتَقِرٌّ ﴿٣٨﴾

**39.** "ఇప్పుడు మీరు నా శిక్షను మరియు నా హెచ్చరికలను చవిచూడండి."

فَذُوقُوا عَذَابِي وَنُذُرِ ﴿٣٩﴾

**40.** మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించడానికి సులభం చేశాము. అయితే, హితబోధ స్వీకరించే వాడు ఎవడైనా ఉన్నాడా?

وَلَقَدْ يَسَّرْنَا الْقُرْآنَ لِلذِّكْرِ فَهَلْ مِن مُّدَّكِرٍ ﴿٤٠﴾

**41.** మరియు వాస్తవానికి ఫిర్'ఔన్ జాతి వారికి కూడా హెచ్చరికలు వచ్చాయి.

وَلَقَدْ جَاءَ آلَ فِرْعَوْنَ النُّذُرُ ﴿٤١﴾

**42.** వారు మా సూచనలను అన్నిటినీ అబద్ధాలని తిరస్కరించారు, కావున మేము వారిని పట్టుకున్నాము, సర్వశక్తిమంతుడు సర్వసమర్థుడు పట్టుకునే విధంగా!

كَذَّبُوا بِآيَاتِنَا كُلِّهَا فَأَخَذْنَاهُمْ أَخْذَ
عَزِيزٍ مُّقْتَدِرٍ ﴿٤٢﴾

**43.** (ఓ ఖురైషులారా!) ఏమీ? మీ సత్యతిరస్కారులు మీకు పూర్వం గడిచిన వారికంటే శ్రేష్ఠులా? లేక దివ్య గ్రంథాలలో మీ కొరకు (మా శిక్ష నుండి) ఏదైనా మినహాయింపు వ్రాయబడి ఉందా?

أَكُفَّارُكُمْ خَيْرٌ مِّنْ أُولَٰئِكُمْ أَمْ لَكُم بَرَاءَةٌ فِي
الزُّبُرِ ﴿٤٣﴾

**44.** లేక వారు: "మాది ఒక శక్తిగల వర్గం, (కావున) మేము ప్రాబల్యం పొందగలం" అని అంటున్నారా?

أَمْ يَقُولُونَ نَحْنُ جَمِيعٌ مُّنتَصِرٌ ﴿٤٤﴾

**45.** కాని త్వరలోనే ఈ శక్తిగల వర్గం పరాజయం పొందగలదు. మరియు వారు వెన్నుచూపి పారిపోతారు.[1]

سَيُهْزَمُ الْجَمْعُ وَيُوَلُّونَ الدُّبُرَ ﴿٤٥﴾

---

1 దైవప్రవక్త ('స'అస) ఈ ఆయత్‌ను బద్ర్ యుద్ధ ఆరంభంలో చదివారు.

**46.** అంతేకాదు! అంతిమ ఘడియయే, వారి వాగ్దాన సమయం మరియు ఆ ఘడియ ఎంతో దారుణమైనది మరియు ఎంతో తీవ్రమైనదీను (చేదైనదీను).

بَلِ السَّاعَةُ مَوْعِدُهُمْ وَالسَّاعَةُ أَدْهَىٰ وَأَمَرُّ ﴿٤٦﴾

**47.** నిశ్చయంగా, పాపాత్ములు మార్గ భ్రష్టత్వంలో ఉన్నారు మరియు వారు (పరలోకంలో) నరకాగ్నిలో కాలుతారు.

إِنَّ الْمُجْرِمِينَ فِي ضَلَالٍ وَسُعُرٍ ﴿٤٧﴾

**48.** ఆ రోజు వారు తమ ముఖాల మీద నరకాగ్నిలోకి ఈడ్చబడతారు; (వారితో): "నరకాగ్ని స్పర్శను చవిచూడండి!" అని అనబడుతుంది.[1]

يَوْمَ يُسْحَبُونَ فِي النَّارِ عَلَىٰ وُجُوهِهِمْ ذُوقُوا مَسَّ سَقَرَ ﴿٤٨﴾

**49.** నిశ్చయంగా, మేము ప్రతి దానిని ఒక విధివ్రాత (ఖద్ర్)తో సృష్టించాము.[2]

إِنَّا كُلَّ شَيْءٍ خَلَقْنَاهُ بِقَدَرٍ ﴿٤٩﴾

**50.** మరియు మా ఆజ్ఞ కేవలం ఒక్కటే చాలు, కనురెప్పపాటుది, (అది అయిపోతుంది).[3]

وَمَا أَمْرُنَا إِلَّا وَاحِدَةٌ كَلَمْحٍ بِالْبَصَرِ ﴿٥٠﴾

**51.** మరియు వాస్తవానికి, మేము మీవంటి వారిని, ఎందరినో నాశనంచేశాము. అయితే, హితబోధస్వీకరించేవాడు ఎవడైనాఉన్నాడా?

وَلَقَدْ أَهْلَكْنَا أَشْيَاعَكُمْ فَهَلْ مِن مُّدَّكِرٍ ﴿٥١﴾

**52.** మరియు వారు చేసిన ప్రతివిషయం వారి కర్మగ్రంథాలలో (చిట్టాలలో) వ్రాయబడి ఉంది.[4]

وَكُلُّ شَيْءٍ فَعَلُوهُ فِي الزُّبُرِ ﴿٥٢﴾

**53.** మరియు ప్రతి చిన్న మరియు ప్రతి

وَكُلُّ صَغِيرٍ وَكَبِيرٍ مُّسْتَطَرٌ ﴿٥٣﴾

---

1. చూడండి, 33:66 మరియు 25:34
2. అహ్లెసున్నత్ వల్ జమా'అత్ విద్వాంసులు ఈ ఆయత్ మరియు ఇటువంటి ఆయత్‌ల ఆధారంగా అంటారు అల్లాహ్(సు.తా.)కు మానవులను సృష్టించకముందే వారికి సంబంధించిన అన్ని విషయాల జ్ఞానముంది, కావున ఆయన అందరి 'ఖద్ర్,' Destiny, విధి, అంటే విధివ్రాత, నియమం, లేక అదృష్టం ముందే వ్రాసిపెట్టాడు. (ఇబ్నె కసీర్)
3. అల్లాహ్ (సు.తా.) ఏదైనా చేయాలనుకుంటే, దానిని 'అయిపో!' అని అంటాడు అంతే అది అయిపోతుంది చూడండి, 2:117, 3:47, 59, 6:73, 16:40, 19:35, 36:82, 40:68
4. లేక లౌహె మ'హ్ఫూ'జ్‌లో వ్రాయబడిఉంది.

పెద్ద విషయం అన్నీ వ్రాయబడి ఉన్నాయి.[1]

**54.** నిశ్చయంగా, దైవభీతి గలవారు స్వర్గవనాలలో సెలయేళ్ళదగ్గర ఉంటారు.

إِنَّ الْمُتَّقِينَ فِي جَنَّاتٍ وَنَهَرٍ ﴿٥٤﴾

**55** సత్యపీఠం మీద,[2] విశ్వసామ్రాట్టు,[3] సర్వసమర్థుని సన్నిధిలో. (1/2)

فِي مَقْعَدِ صِدْقٍ عِندَ مَلِيكٍ مُّقْتَدِرٍ ﴿٥٥﴾

1 అంటే మానవుల కర్మలూ, మాటలూ అన్నీ వ్రాయబడి ఉన్నాయి చిన్నవి గానీ పెద్దవి గానీ, మంచివి గానీ చెడ్డవి గానీ!

2 మఖ్'అది సిద్‌ఖిన్: గౌరవప్రదమైన స్థానంలో అంటే స్వర్గం

3. చూడండి, 20:114 వ్యాఖ్యానం 2.

## 55. సూరహ్ అర్-రహ్మాన్

سُورَةُ الرَّحْمَٰن

అర్ రహ్మాన్: **అనంతకరుణామయుడు.** చాలా మంది వ్యాఖ్యాతలు ఈ సూరహ్ **మదీనాలో** అవతరింపజేయబడిందని అంటారు. ఈ సూరహ్‌లో **78 ఆయతులు** ఉన్నాయి. ఈ సముదాయంలో ఇది 6వది. దీని పేరు **మొదటి ఆయత్‌లోనే** ఉంది. ఇది పునరుత్థానదినం గురించి వివరిస్తోంది. దైవప్రవక్త(స'అస) ప్రవచనం: "ఏమీ? మీరు మౌనం వహిస్తున్నారా? మీ కంటే జిన్నాతులు మేలు! రాత్రి నేను ఈ సూరహ్‌ను జిన్నాతులకు వినిపించినప్పుడు నేను 'ఫబి అయ్యి ఆలాయి' రబ్బికుమా తుకజ్జి'బాన్' చదివినప్పుడల్లా జిన్నాతులు దానికి జవాబుగా: 'ఓ మా ప్రభూ! మేము నీ యొక్క ఏ అనుగ్రహాలను కూడా నిరాకరించడం లేదు! సర్వస్తోత్రాలకు అర్హుడవు నీవు మాత్రమే!' అని అన్నారు." (తిర్మిజీ', అల్బానీ ప్రమాణీకం

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

1. * **అనంత కరుణామయుడు (అల్లాహ్)!** الرَّحْمَٰنُ ①

2. ఆయనే ఈ ఖుర్ఆన్‌ను నేర్పాడు.[1] عَلَّمَ الْقُرْآنَ ②

3. ఆయనే మానవుణ్ణి సృష్టించాడు. خَلَقَ الْإِنسَانَ ③

4. ఆయనే అతనికి మాట్లాడటం నేర్పాడు. عَلَّمَهُ الْبَيَانَ ④

5. సూర్యుడు మరియు చంద్రుడు ఒక నియమిత గమనాన్ని (నియమిత పరిధిలో) అనుసరిస్తున్నారు. الشَّمْسُ وَالْقَمَرُ بِحُسْبَانٍ ⑤

6. మరియు నక్షత్రాలు మరియు వృక్షాలు అన్నీ ఆయనకు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటాయి.[2] وَالنَّجْمُ وَالشَّجَرُ يَسْجُدَانِ ⑥

7. మరియు ఆయనే ఖగోళాన్ని పైకెత్తి ఉంచాడు మరియు ఆయనే త్రాసును وَالسَّمَاءَ رَفَعَهَا وَوَضَعَ الْمِيزَانَ ⑦

---

1 ఇది మక్కా ముష్రికులకు ఇవ్వబడిన జవాబు. ఎందుకంటే వారు, దైవప్రవక్త (స'అస) మీద, ఈ ఖుర్ఆన్‌ను అతనికి ఒక మానవుడు నేర్పాడు అనే అపనింద మోపారు. కాని వాస్తవానికి అల్లాహ్(సు.తా.) దీనిని తన సందేశహరునికి నేర్పాడు మరియు అతను తమ అనుచరులకు (ర'ది.'అన్హుమ్) నేర్పారు. (ఫత్'హ్ అల్-ఖదీర్).

2. చూడండి, 22:18

నెలకొల్పాడు.[1]

ٱلَّا تَطۡغَوۡاْ فِى ٱلۡمِيزَانِ ۝

8 తద్వారా మీరు తూకంలో మోసానికి పాల్పడకూడదని![2]

وَأَقِيمُواْ ٱلۡوَزۡنَ بِٱلۡقِسۡطِ وَلَا تُخۡسِرُواْ ٱلۡمِيزَانَ ۝

9. మరియు న్యాయంగా తూకంచేయండి మరియు తూకంలో తగ్గించకండి

وَٱلۡأَرۡضَ وَضَعَهَا لِلۡأَنَامِ ۝

10 మరియు ఆయన, భూమిని సకల జీవరాసులకొరకు ఉంచాడు.

فِيهَا فَٰكِهَةٞ وَٱلنَّخۡلُ ذَاتُ ٱلۡأَكۡمَامِ ۝

11. అందులో రకరకాల ఫలాలు మరియు పొర(పుష్పకోశా)లలో ఉండే ఖర్జూరపండ్లు ఉన్నాయి

وَٱلۡحَبُّ ذُو ٱلۡعَصۡفِ وَٱلرَّيۡحَانُ ۝

12. మరియు దంట్లపై (పొరలలో చుట్టబడి)[3] ఉన్న ధాన్యం మరియు సుగంధ పుష్పాలు కూడా!

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ۝

13. అయితే మీరిరువురు (మానవులు మరియు జిన్నాతులు) మీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

خَلَقَ ٱلۡإِنسَٰنَ مِن صَلۡصَٰلٖ كَٱلۡفَخَّارِ ۝

14. ఆయన మానవుణ్ణి పెంకులాంటి శబ్దమిచ్చే మట్టితో[4] సృష్టించాడు.

وَخَلَقَ ٱلۡجَآنَّ مِن مَّارِجٖ مِّن نَّارٖ ۝

15. మరియు జిన్నాతులను అగ్ని జ్వాలలతో సృష్టించాడు.[5]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ۝

16. అయితే మీరిద్దరు మీ ప్రభువుయొక్క ఏ యే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

1 అంటే ప్రపంచంలో న్యాయాన్ని నెలకొల్పాడు చూడండి, 57:25, 42:17

2 అంటే న్యాయానికి విరుద్ధంగా పోకండి. న్యాయాన్ని భంగపరచకండి

3 అల్ 'అ'స్ఫు: అంటే ఎండిన గడ్డి, గడ్డి పరక, పొట్టు, ఊక, పొర, ధాన్యపు దంట్లు ఎండిపోయిన తరువాత 'అ'స్ఫ్‌గా మారిపోతాయి దానిని పశువులు తింటాయి.

4 'సల్ 'సాలిన్, అంటే ఎండిన మట్టి ఫ'ఖ్ఖారున్ అంటే మంటలో కాలిన మట్టి ఇంకా చూడండి, 15:26

5. చూడండి, 15:27, 6:100 మరియు 37:158.

رَبُّ الْمَشْرِقَيْنِ وَرَبُّ الْمَغْرِبَيْنِ ﴿١٧﴾

**17.** ఆయనే రెండు తూర్పు (దిక్కు)లకు మరియు రెండు పడమర (దిక్కు)లకు ప్రభువు[1]

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿١٨﴾

**18.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

مَرَجَ الْبَحْرَيْنِ يَلْتَقِيَانِ ﴿١٩﴾

**19.** ఆయనే రెండు సముద్రాలను కలుసుకోవటానికి వదలిపెట్టాడు.

بَيْنَهُمَا بَرْزَخٌ لَّا يَبْغِيَانِ ﴿٢٠﴾

**20.** ఆ రెండింటి మధ్య, అవి అతిక్రమించలేని అడ్డుతెర వుంది.[2]

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢١﴾

**21.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يَخْرُجُ مِنْهُمَا اللُّؤْلُؤُ وَالْمَرْجَانُ ﴿٢٢﴾

**22.** ఆ రెండింటి నుండి ముత్యాలు మరియు పగడాలు వస్తాయి.

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٣﴾

**23.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

وَلَهُ الْجَوَارِ الْمُنشَآتُ فِي الْبَحْرِ كَالْأَعْلَامِ ﴿٢٤﴾

**24.** మరియు ఎత్తైన కొండలవలే సముద్రంలో పయనించే ఓడలు ఆయనకు చెందినవే![3]

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٥﴾

**25.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

كُلُّ مَنْ عَلَيْهَا فَانٍ ﴿٢٦﴾

**26.** దానిపై (భూమిపై) మున్నది ప్రతిదీ నశిస్తుంది.

---

1. చూడండి, 37:5 మరియు 70:40.

2. ఈ విషయం ఎన్నో విధాలుగా బోధించబడింది 1) భూమిపై మంచి నీళ్ళ నదులు, చెరువులు సరస్సులు మొదలైనవి మరియు ఉప్పునీటి సముద్రాలు, అన్నీ భూమి మీదనే ఉన్నా, వాటి రుచులు వేరు వేరుగా ఉన్నాయి 2) ఉప్పునీటి సముద్రాలలో మంచినీటి ప్రవాహాలు ప్రవహిస్తూ ఉంటాయి కాని అవి కలిసిపోవు వాటి రుచి, భిన్నంగానే ఉంటుంది 3) మరికొన్ని చోట్లలో నదుల నీరు సముద్రంలో పోయి కలుస్తుంది చాలా దూరం వరకు ఒకవైపు సముద్రపు నీళ్ళు ఉప్పుగానూ మరొక వైపు నది నీళ్ళు తియ్యగాను ఉంటాయి ఇంకా చూడండి, 25:53

3. చూడండి, 42:32 34

وَيَبْقَىٰ وَجْهُ رَبِّكَ ذُو الْجَلَالِ وَالْإِكْرَامِ ﴿٢٧﴾

**27.** మరియు మిగిలివుండేది, కేవలం మహిమాన్వితుడు[1] మరియు పరమదాత[2] అయిన నీ ప్రభువు ముఖం(ఉనికి) మాత్రమే![3]

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٨﴾

**28.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يَسْأَلُهُ مَن فِي السَّمَاوَاتِ وَالْأَرْضِ ۚ كُلَّ يَوْمٍ هُوَ فِي شَأْنٍ ﴿٢٩﴾

**29.** భూమిలో మరియు ఆకాశాలలో నున్న ప్రతిదీ (తమ జీవనోపాధి కొరకు) ఆయననే యాచిస్తుంది. మరియు ప్రతిక్షణం (రోజు) ఆయన ఒకకార్యంలో నిమగ్నుడై ఉంటాడు.

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٠﴾

**30.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

سَنَفْرُغُ لَكُمْ أَيُّهَ الثَّقَلَانِ ﴿٣١﴾

**31.** భారాలను మోసే మీరిద్దరు![4] త్వరలోనే మేము మీ విషయం నిర్ణయించగలము.

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٢﴾

**32.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يَا مَعْشَرَ الْجِنِّ وَالْإِنسِ إِنِ اسْتَطَعْتُمْ أَن تَنفُذُوا مِنْ أَقْطَارِ السَّمَاوَاتِ وَالْأَرْضِ فَانفُذُوا ۚ لَا تَنفُذُونَ إِلَّا بِسُلْطَانٍ ﴿٣٣﴾

**33.** ఓ జిన్నాతుల మరియు మానవ జాతివారలారా! ఒకవేళ మీరు ఆకాశాల మరియు భూమి యొక్క సరిహద్దుల నుండి బయటికి వెళ్ళిపోగలిగితే, వెళ్ళిపొండి! (అల్లాహ్) యొక్క సెలవు లేనిదే మీరు వాటినుండి వెళ్ళిపోలేరు.[5]

---

1 జు'ల్-జలాల్, Majesty, Possessor of Glory, Greatness, మహిమాన్వితుడు, ఘనత, వైభవం, విఖ్యాతి, ప్రతాపం గలవాడు, సార్వభౌముడు.

2 అల్ ఇక్రామ్: Most Generous, Bounteous, Noble, Honourable, పరమదాత, దాతృత్వుడు, ఆదరణీయుడు, మహోపకారి, ఉదారుడు, దివ్యుడు. చూడండి, 55:78 జుల్-జలాలి వల్-ఇక్రామ్: మహిమాన్వితుడు మరియు పరమదాత, Lord of Majesty and Generosity, ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు

3 చూడండి, 28:88

4 అస్-స'ఖలాని: దీని మరొక తాత్పర్యం: భూమికి భారమైన మీరిద్దరు! అని ఇవ్వబడింది. ఈ పదం జిన్నాతులు మరియు మానవుల కోసం వాడబడింది.

5 అల్లాహ్ (సు.తా.) యొక్క విధివ్రాత నుండి పారిపోగల శక్తి ఎవ్వరికీ లేదు. ఎక్కడికి పారిపోగలరు? అల్లాహ్ (సు.తా.) హద్దులలో లేని చోటు అనేదే లేదు!

**34.** అయితే మీరిద్దరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٤﴾

**35.** మీ ఇద్దరిపైకి అగ్నిజ్వాలలు మరియు పొగ[1] పంపబడతాయి, అప్పుడు మీరు ఎదుర్కోలేరు (మిమ్మల్ని మీరు కాపాడుకోలేరు)

يُرْسَلُ عَلَيْكُمَا شُوَاظٌ مِّن نَّارٍ وَنُحَاسٌ فَلَا تَنتَصِرَانِ ﴿٣٥﴾

**36.** అయితే మీరిద్దరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٦﴾

**37.** మరియు ఆకాశం ప్రేలిపోయినప్పుడు అది మండే నూనెగా ఎర్రగా మారిపోతుంది.[2]

فَإِذَا انشَقَّتِ السَّمَاءُ فَكَانَتْ وَرْدَةً كَالدِّهَانِ ﴿٣٧﴾

**38.** అయితే మీరిద్దరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٨﴾

**39.** ఇక, ఆ రోజు ఏ మానవునితో గానీ, లేక, ఏ జిన్నాతునితో గానీ అతని పాపాలను గురించి అడగడం జరుగదు.[3]

فَيَوْمَئِذٍ لَّا يُسْأَلُ عَن ذَنبِهِ إِنسٌ وَلَا جَانٌّ ﴿٣٩﴾

**40.** అయితే మీరిద్దరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٠﴾

**41.** ఈ నేరస్తులు వారి వారి ముఖ చిహ్నాలతోనే గుర్తింపబడతారు. అప్పుడు వారు, వారి ముంగురులు మరియు కాళ్ళుపట్టి లాగబడతారు.[4]

يُعْرَفُ الْمُجْرِمُونَ بِسِيمَاهُمْ فَيُؤْخَذُ بِالنَّوَاصِي وَالْأَقْدَامِ ﴿٤١﴾

**42.** అయితే మీరిద్దరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٢﴾

**43.** ఈ నేరస్థులు అసత్యమని తిరస్కరిస్తూ వుండిన నరకం ఇదే!

هَٰذِهِ جَهَنَّمُ الَّتِي يُكَذِّبُ بِهَا الْمُجْرِمُونَ ﴿٤٣﴾

---

**1.** నుహాసున్: దీని మరొక అర్థం కరిగిన రాగి లేక ఇత్తడి

**2.** అద్దిహాను: దీని మరొక అర్థం ఎర్రని చర్మం (పచ్చిది లేదా శుభ్రం చేసింది)

**3.** చూడండి, 18:49 వారి, నాలుకలు చేతులు మరియు కాళ్ళు వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయి, ఇంకా చూడండి, 24:24.

**4** చూడండి, 96:15-16.

**44.** వారు దాని (ఆ నరకం)లో మరియు సలసల కాగే నీటి మధ్య అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు.

يَطُوفُونَ بَيْنَهَا وَبَيْنَ حَمِيمٍ آنٍ ﴿٤٤﴾

**45.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٥﴾

**46.** మరియు ఎవడైతే తన ప్రభువు సన్నిధిలో హాజరుకావలసి ఉంటుందనే భయం కలిగిఉంటాడో, అతనికి రెండు స్వర్గ వనాలుంటాయి.

وَلِمَنْ خَافَ مَقَامَ رَبِّهِ جَنَّتَانِ ﴿٤٦﴾

**47.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٧﴾

**48.** అవి రెండూ అనేక శాఖల (వృక్షాల)తో నిండి ఉంటాయి.[1]

ذَوَاتَا أَفْنَانٍ ﴿٤٨﴾

**49.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٩﴾

**50.** ఆ రెండింటిలో రెండు సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి.[2]

فِيهِمَا عَيْنَانِ تَجْرِيَانِ ﴿٥٠﴾

**51.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥١﴾

**52.** ఆ రెండింటిలో ప్రతి ఫలము జోడుగా (రెండు రకాలుగా) ఉంటుంది.

فِيهِمَا مِن كُلِّ فَاكِهَةٍ زَوْجَانِ ﴿٥٢﴾

**53.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٣﴾

**54.** వారు జరీపని అస్తరుగల పట్టు తివాచీల మీద ఆనుకొని కూర్చొని ఉంటారు. మరియు ఆ రెండు స్వర్గవనాల ఫలాలు

مُتَّكِئِينَ عَلَىٰ فُرُشٍ بَطَائِنُهَا مِنْ إِسْتَبْرَقٍ ۚ وَجَنَى الْجَنَّتَيْنِ دَانٍ ﴿٥٤﴾

---

1 చూడండి, 32:17 స్వర్గంలో ఉన్న భోగభాగ్యాలు ఎవ్వరూ ఊహించలేరు

2. ఒక సెలయేరు పేరు తస్నీమ్, మరొక దానిపేరు సల్సబీల్

దగ్గరగా అందుబాటులో ఉంటాయి.[1]

**55.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٥﴾

**56.** అందులో తమ దృష్టిని ఎల్లప్పుడూ క్రిందికి వంచి ఉంచే నిర్మల కన్యలుంటారు వారిని ఇంతకు పూర్వం ఏ మానవుడు గానీ, ఏ జిన్నాతు గానీ తాకి ఉండడు.[2]

فِيهِنَّ قَاصِرَاتُ الطَّرْفِ لَمْ يَطْمِثْهُنَّ إِنسٌ قَبْلَهُمْ وَلَا جَانٌّ ﴿٥٦﴾

**57.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٧﴾

**58.** వారు కెంపులను (మాణిక్యాలను) మరియు పగడాలను పోలి ఉంటారు.

كَأَنَّهُنَّ الْيَاقُوتُ وَالْمَرْجَانُ ﴿٥٨﴾

**59.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٩﴾

**60.** సత్కార్యానికి మంచి ప్రతిఫలం తప్ప మరేమైనా ఉంటుందా?

هَلْ جَزَاءُ الْإِحْسَانِ إِلَّا الْإِحْسَانُ ﴿٦٠﴾

**61.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦١﴾

**62.** మరియు ఆ రెండే కాక ఇంకా రెండు స్వర్గవనాలు ఉంటాయి.

وَمِن دُونِهِمَا جَنَّتَانِ ﴿٦٢﴾

**63.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٣﴾

**64.** అవి దట్టంగా ముదురుపచ్చగా ఉంటాయి.

مُدْهَامَّتَانِ ﴿٦٤﴾

**65.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٥﴾

**66.** ఆ రెండు తోటలలో పొంగి ప్రవహించే

فِيهِمَا عَيْنَانِ نَضَّاخَتَانِ ﴿٦٦﴾

---

1 చూడండి, 18:31

2. చూడండి, 56:35-36, 38:52.

రెండు చెలమలుంటాయి.

**67.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٧﴾

**68.** ఆ రెండింటిలో ఫలాలు, ఖర్జూరాలు మరియు దానిమ్మలు ఉంటాయి.

فِيهِمَا فَاكِهَةٌ وَنَخْلٌ وَرُمَّانٌ ﴿٦٨﴾

**69.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٩﴾

**70.** వాటిలో గుణవంతులు, సౌందర్యవతులైన స్త్రీలు ఉంటారు.

فِيهِنَّ خَيْرَاتٌ حِسَانٌ ﴿٧٠﴾

**71.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧١﴾

**72.** నిర్మలమైన, శీలవతులైన స్త్రీ (హూర్)లు డేరాలలో ఉంటారు.[1]

حُورٌ مَّقْصُورَاتٌ فِي الْخِيَامِ ﴿٧٢﴾

**73.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٣﴾

**74.** ఆ స్త్రీలను ఇంతకుముందు ఏ మానవుడు కాని, ఏ జిన్నాతుకాని తాకి ఉండడు.

لَمْ يَطْمِثْهُنَّ إِنسٌ قَبْلَهُمْ وَلَا جَانٌّ ﴿٧٤﴾

**75.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٥﴾

**76.** వారు అందమైన తివాచీల మీద ఆకుపచ్చని దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు

مُتَّكِئِينَ عَلَىٰ رَفْرَفٍ خُضْرٍ وَعَبْقَرِيٍّ حِسَانٍ ﴿٧٦﴾

**77.** అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?[2]

فَبِأَيِّ آلَاءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٧﴾

---

1. చూడండి. 55.56. 52:20. 44:54. 38:52 మరియు 37.48

2 ఈ ఆయత్, ఈ సూరహ్‌లో 31 సార్లు వచ్చింది. అల్లాహ్(సు.తా.) ఈ సూరహ్‌లో స్వర్గంలో ప్రసాదించబడే అన్ని రకాల సౌకర్యాలను, భోగభాగ్యాలను వివరించిన తరువాత ఈ ప్రశ్న

تَبٰرَكَ اسْمُ رَبِّكَ ذِی الْجَلٰلِ وَالْاِكْرَامِ۝

78. మహిమాన్వితుడు మరియు పరమదాత[1] అయిన నీ ప్రభువు పేరే ఎంతో సర్వశ్రేష్ఠమైనది.[2] (5/8)

---

వేశాడు. అంతే కాక నరక శిక్ష తరువాత కూడా ఈ ప్రశ్న వేశాడు. అంటే మీరు దాని నుండి ఎందుకు తప్పించుకోవటానికి ప్రయత్నించరు? అని అర్థం. రెండవది: ఏమిటంటే, జిన్నాతులు కూడా మానవులవలే బుద్ధి మరియు మంచి చెడును అర్థం చేసుకునే విచక్షణాశక్తి కలిగిఉన్నారు. కావున వారు కూడా ఏక దైవారాధన చేయటానికి ఆజ్ఞాపించబడ్డారు. సర్వసృష్టిలో కేవలం ఈ రెండురకాల జీవులు మాత్రమే - బుద్ధి మరియు విచక్షణాశక్తి ప్రసాదించబడటం వల్ల - పరీక్షకు గురిచేయబడ్డారు. అందులో నెగ్గిన వారికి స్వర్గం మరియు నెగ్గని వారికి నరకం. మూడవది: అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన సుఖసంతోషాలను అనుభవించటం ముస్తహబ్. ఈ ఆయత్ మళ్ళీ మళ్ళీ చెప్పే నాలుగవ ఉద్దేశ్యం, అల్లాహ్‌కు అవిధేయులై ఉండటం నుండి ఆపటం. ఎందుకంటే ఆయనే (సు.తా.) ఈ అనుగ్రహాలన్నింటినీ ప్రసాదించాడు. కావున దైవప్రవక్త (స'అస) దీనికి జవాబుగా అన్నారు: 'ఓ మా ప్రభూ! మేము నీ యొక్క ఏ అనుగ్రహాన్ని కూడా నిరాకరించటంలేదు. సర్వస్తోత్రాలకు అర్హుడవు నీవే!' (తిర్మిజీ' - అల్బానీ ప్రమాణీకం).

1. చూడండి, 55:27 వ్యాఖ్యానం 2.

2 *తబారక, బరకతున్:* అంటే ఎల్లప్పుడు శాశ్వతంగా ఉండే మేలు. ఆయన దగ్గర ఎల్లప్పుడు మేలే ఉంది. కొందరు దీని అర్థం, ఎంతో శుభదాయకమైనది, సర్వశ్రేష్ఠమైనది అని అన్నారు. ఆయన పేరే ఇంత శ్రేష్ఠమైనదైతే ఆయన స్వయంగా ఎంత గొప్పవాడు, మహిమగల వాడు మరియు శుభాలను ప్రసాదించేవాడు కాగలడు!

## 56. సూరహ్ అల్-వాఖి'అహ్

## سُورَةُ الْوَاقِعَةِ

అల్-వాఖి'అహ్ : రానున్న సంఘటన. ఇది సంపదల సూరహ్ అని ప్రఖ్యాతి చెందింది "దీనిని ప్రతిరోజు రాత్రి చదివేవాడు ఎన్నడూ పస్తులుండడు." కాని ఈ ప్రవచనం, ప్రమాణీకమైనది కాదు (అల్బానీ). దీని పేరు మొదటి ఆయత్‌లో ఉంది. ఈ సమూహంలో ఇది 7వది, చివరిది. ఈ సూరాహ్‌లన్నీ దివ్యజ్ఞానం మరియు పరలోక జీవితాన్ని గురించి చర్చించాయి. ఈ సూరహ్ మక్కా మొదటి కాలానికి చెందింది. పునరుత్థానం గురించి ఇందు వివరాలున్నాయి. ఇందులో **96** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత ఆయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** * ఆ అనివార్య సంఘటన సంభవించినపుడు,[1]

إِذَا وَقَعَتِ الْوَاقِعَةُ ۝

**2.** అది సంభవించటంలో ఎలాంటి అసత్యం లేదు.

لَيْسَ لِوَقْعَتِهَا كَاذِبَةٌ ۝

**3.** అది కొందరిని హీనపరుస్తుంది, మరి కొందరిని పైకెత్తుతుంది.[2]

خَافِضَةٌ رَّافِعَةٌ ۝

**4.** భూమి తీవ్రకంపనంతో కంపించినపుడు;

إِذَا رُجَّتِ الْأَرْضُ رَجًّا ۝

**5.** మరియు పర్వతాలు పొడిగా మార్చబడినపుడు;

وَبُسَّتِ الْجِبَالُ بَسًّا ۝

**6.** అప్పుడు వాటి దుమ్ము నలువైపులా నిండిపోయినపుడు;

فَكَانَتْ هَبَاءً مُّنبَثًّا ۝

**7.** మరియు మీరు మూడు వర్గాలుగా విభజింపబడతారు.

وَكُنتُمْ أَزْوَاجًا ثَلَاثَةً ۝

**8.** ఇక కుడిపక్షం వారు, ఆ కుడిపక్షము

فَأَصْحَابُ الْمَيْمَنَةِ مَا أَصْحَابُ الْمَيْمَنَةِ ۝

---

1 అనివార్య సంఘటన అంటే, అంతిమ ఘడియ, పునరుత్థానదినం

2 అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను అనుసరించిన వారు పైకెత్తబడతారు. వాటిని తిరస్కరించినవారు హీనపరచబడతారు

వారు ఎంత (అదృష్టవంతులు)![1]

**9.** మరికొందరు వామపక్షం వారుంటారు.[2] ఆ వామపక్షపు వారు ఎంత (దౌర్భాగ్యులు)!

وَأَصْحَٰبُ ٱلْمَشْـَٔمَةِ مَآ أَصْحَٰبُ ٱلْمَشْـَٔمَةِ ﴿٩﴾

**10.** మరియు (ఇహలోకంలో విశ్వాసంలో) ముందున్న వారు (స్వర్గంలో కూడా) ముందుంటారు.

وَٱلسَّٰبِقُونَ ٱلسَّٰبِقُونَ ﴿١٠﴾

**11.** అలాంటి వారు (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందుతారు.

أُوْلَٰٓئِكَ ٱلْمُقَرَّبُونَ ﴿١١﴾

**12.** వారు సర్వసుఖాలు గల స్వర్గవనాలలో ఉంటారు.

فِى جَنَّٰتِ ٱلنَّعِيمِ ﴿١٢﴾

**13.** మొదటి తరాల వారిలో నుండి చాలా మంది;

ثُلَّةٌ مِّنَ ٱلْأَوَّلِينَ ﴿١٣﴾

**14.** మరియు తరువాత తరాలవారిలో నుండి కొంతమంది.

وَقَلِيلٌ مِّنَ ٱلْءَاخِرِينَ ﴿١٤﴾

**15.** (బంగారు) జలతారు అల్లిన ఆసనాల మీద;

عَلَىٰ سُرُرٍ مَّوْضُونَةٍ ﴿١٥﴾

**16.** ఒకరికొకరు ఎదురెదురుగా, వాటిమీద దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు.[3]

مُّتَّكِـِٔينَ عَلَيْهَا مُتَقَٰبِلِينَ ﴿١٦﴾

**17.** వారిచుట్టు ప్రక్కలలో నిత్య బాల్యంగల బాలురు (సేవకులు) తిరుగుతూ ఉంటారు.

يَطُوفُ عَلَيْهِمْ وِلْدَٰنٌ مُّخَلَّدُونَ ﴿١٧﴾

**18.** (మధువు) ప్రవహించే చెలమల నుండి నింపిన పాత్రలు, గిన్నెలు మరియు కప్పులతో!

بِأَكْوَابٍ وَأَبَارِيقَ وَكَأْسٍ مِّن مَّعِينٍ ﴿١٨﴾

**19.** దాని వలన వారికి తలనొప్పి గానీ లేక మత్తు గానీ కలుగదు.

لَّا يُصَدَّعُونَ عَنْهَا وَلَا يُنزِفُونَ ﴿١٩﴾

---

1 కుడి పక్షం వారంటే తమ కర్మపత్రాలు కుడి చేతిలో ఇవ్వబడేవారు అంటే స్వర్గానికి అర్హులైనవారు చూడండి, 74:39

2 వామ (ఎడమ) పక్షం వారు అంటే తమ కర్మపత్రాలు ఎడమచేతిలో ఇవ్వబడిన వారు అంటే నరకానికి అర్హులైనవారు. చూడండి, 90:19.

3. చూడండి, 15:47

**20.** మరియు వారు కోరే పండ్లూ, ఫలాలు ఉంటాయి.

وَفَاكِهَةٍ مِّمَّا يَتَخَيَّرُونَ ﴿٢٠﴾

**21.** మరియు వారు ఇష్టపడే పక్షుల మాంసం.[1]

وَلَحْمِ طَيْرٍ مِّمَّا يَشْتَهُونَ ﴿٢١﴾

**22.** మరియు అందమైన కన్నులు గల సుందరాంగులు ('హూరున్);

وَحُورٌ عِينٌ ﴿٢٢﴾

**23.** దాచబడిన ముత్యాలవలే!

كَأَمْثَالِ اللُّؤْلُؤِ الْمَكْنُونِ ﴿٢٣﴾

**24.** ఇదంతా వారు చేస్తూ ఉండిన (సత్కార్యాలకు) ప్రతిఫలంగా!

جَزَاءً بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿٢٤﴾

**25.** అందులో వారు వ్యర్థమైన మాటలు గానీ, పాప విషయాలు గానీ వినరు.[2]

لَا يَسْمَعُونَ فِيهَا لَغْوًا وَلَا تَأْثِيمًا ﴿٢٥﴾

**26.** "శాంతి (సలాం) శాంతి (సలాం)!" అనే మాటలు తప్ప![3]

إِلَّا قِيلًا سَلَامًا سَلَامًا ﴿٢٦﴾

**27.** మరియు కుడి పక్షం వారు, ఆ కుడి పక్షం వారు ఎంత (అదృష్టవంతులు)!

وَأَصْحَابُ الْيَمِينِ مَا أَصْحَابُ الْيَمِينِ ﴿٢٧﴾

**28.** వారు ముళ్ళు లేని సిద్ర వృక్షాల మధ్య![4]

فِي سِدْرٍ مَّخْضُودٍ ﴿٢٨﴾

**29.** మరియు పండ్లగెలలతో నిండిన అరటి చెట్లు,

وَطَلْحٍ مَّنضُودٍ ﴿٢٩﴾

**30.** మరియు వ్యాపించి ఉన్న నీడలు,[5]

وَظِلٍّ مَّمْدُودٍ ﴿٣٠﴾

**31.** మరియు ఎల్లప్పుడు ప్రవహించే నీరు,

وَمَاءٍ مَّسْكُوبٍ ﴿٣١﴾

---

1 'నేను నా సద్వర్తనులైన దాసుల కొరకు సిద్ధపరచి ఉంచినదాన్ని ఇంతవరకూ ఏ కన్నూ చూడలేదు. ఏ చెవీ వినలేదు మరియు ఏ మానవ హృదయం (మనస్సు) కూడా ఊహించలేదు.' (బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ' అబూహురైరహ్ కథనం. ఇంకా చూడండి, 32:17)

2. ప్రాపంచిక జీవితంలో పోట్లాటలు, ఎవగింపులు, అసహ్యాలు స్వంత అన్నదమ్ముల మధ్య కూడా తప్పవు. కాని స్వర్గవాసుల మధ్య ఇటువంటి వ్యర్థపు మాటలు ఎన్నడూ జరుగవు

3. చూడండి, 19:62.

4. చూడండి, 53:14.

5. చూడండి, 4:57

وَفَاكِهَةٍ كَثِيرَةٍ ﴿٣٢﴾

**32.** మరియు సమృద్ధిగా ఉన్న పండ్లు ఫలాలు,

لَّا مَقْطُوعَةٍ وَلَا مَمْنُوعَةٍ ﴿٣٣﴾

**33.** ఎడతెగ కుండా మరియు అంతం కాకుండా (ఉండే వనాలలో);

وَفُرُشٍ مَّرْفُوعَةٍ ﴿٣٤﴾

**34.** మరియు ఎత్తైన ఆసనాల మీద (కూర్చొని) ఉంటారు.[1]

إِنَّا أَنشَأْنَاهُنَّ إِنشَاءً ﴿٣٥﴾

**35.** నిశ్చయంగా, మేము వారిని ప్రత్యేక సృష్టిగా సృష్టించాము;

فَجَعَلْنَاهُنَّ أَبْكَارًا ﴿٣٦﴾

**36.** మరియు వారిని (నిర్మలమైన) కన్యలుగా చేశాము;[2]

عُرُبًا أَتْرَابًا ﴿٣٧﴾

**37.** వారు ప్రేమించే వారుగానూ, సమ వయస్సుగల వారుగానూ (ఉంటారు);[3]

لِّأَصْحَابِ الْيَمِينِ ﴿٣٨﴾

**38.** కుడి పక్షం వారి కొరకు.

ثُلَّةٌ مِّنَ الْأَوَّلِينَ ﴿٣٩﴾

**39.** అందులో చాలా మంది మొదటి తరాలకు చెందిన వారుంటారు;

وَثُلَّةٌ مِّنَ الْآخِرِينَ ﴿٤٠﴾

**40.** మరియు తరువాత తరాల వారిలో నుండి కూడా చాలా మంది ఉంటారు.

وَأَصْحَابُ الشِّمَالِ مَا أَصْحَابُ الشِّمَالِ ﴿٤١﴾

**41.** ఇక వామ (ఎడమ) పక్షం వారు; ఆ వామ పక్షం వారు ఎంత (దౌర్భాగ్యులు)?

فِي سَمُومٍ وَحَمِيمٍ ﴿٤٢﴾

**42.** వారు దహించే నరకాగ్నిలో మరియు సలసల కాగే నీటిలో;

وَظِلٍّ مِّن يَحْمُومٍ ﴿٤٣﴾

**43.** మరియు నల్లటి పొగ ఛాయలో (ఉంటారు).

---

1 కొందరు వ్యాఖ్యాతలు: 'ఫురుషిన్' శబ్దానికి. భార్యలు అని అర్థమిచ్చారు మరియు 'మర్ఫూ'అతిన్' అంటే మంచి, పెద్ద స్థానాలు గలవారు అని

2 సద్వర్తనులైన స్త్రీలు చనిపోయినప్పుడు ఎంత వృద్ధులుగా ఉన్నా, పునరుత్థాన దినమున యవ్వన కన్యలుగా లేపబడతారు. వారు నిత్యం యవ్వన స్థితిలోనే ఉంటారు

3. చూడండి, 38.52 మరియు 78:33.

**44.** అది చల్లగానూ ఉండదు మరియు ఓదార్చేది గానూ ఉండదు;

لَّا بَارِدٍ وَلَا كَرِيمٍ ﴿٤٤﴾

**45.** నిశ్చయంగా, వారు ఇంతకు ముందు చాలా భోగభాగ్యాలలో పడి ఉండిరి;

إِنَّهُمْ كَانُوا قَبْلَ ذَٰلِكَ مُتْرَفِينَ ﴿٤٥﴾

**46.** మరియు వారు మూర్ఖపు పట్టుతో ఘోరమైన పాపాలలో పడి ఉండిరి;

وَكَانُوا يُصِرُّونَ عَلَى الْحِنثِ الْعَظِيمِ ﴿٤٦﴾

**47.** మరియు వారు ఇలా అనేవారు: 'ఏమీ? మేము మరణించి, మట్టిగా మరియు ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా మరల బ్రతికించి లేపబడతామా?

وَكَانُوا يَقُولُونَ أَئِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا وَعِظَامًا أَإِنَّا لَمَبْعُوثُونَ ﴿٤٧﴾

**48.** "మరియు పూర్వీకులైన మా తాత ముత్తాతలు కూడానా?"

أَوَآبَاؤُنَا الْأَوَّلُونَ ﴿٤٨﴾

**49.** వారితో ఇలా అను: "నిశ్చయంగా, పూర్వీకులు మరియు తరువాత వారు కూడాను!

قُلْ إِنَّ الْأَوَّلِينَ وَالْآخِرِينَ ﴿٤٩﴾

**50.** "వారందరూ ఆ నిర్ణీత రోజు, ఆ సమయమున సమావేశపరచబడతారు.

لَمَجْمُوعُونَ إِلَىٰ مِيقَاتِ يَوْمٍ مَّعْلُومٍ ﴿٥٠﴾

**51.** "అయితే నిశ్చయంగా మార్గభ్రష్టులైన ఓ అసత్యవాదులారా!

ثُمَّ إِنَّكُمْ أَيُّهَا الضَّالُّونَ الْمُكَذِّبُونَ ﴿٥١﴾

**52.** "మీరు జఖ్ఖూమ్ చెట్టును (ఫలాలను) తింటారు.[1]

لَآكِلُونَ مِن شَجَرٍ مِّن زَقُّومٍ ﴿٥٢﴾

**53.** "దానితో కడుపులు నింపుకుంటారు.

فَمَالِئُونَ مِنْهَا الْبُطُونَ ﴿٥٣﴾

**54.** "తరువాత, దాని మీద సలసల కాగే నీరు త్రాగుతారు.

فَشَارِبُونَ عَلَيْهِ مِنَ الْحَمِيمِ ﴿٥٤﴾

**55.** "వాస్తవానికి మీరు దానిని దప్పిక గొన్న ఒంటెలవలే త్రాగుతారు."

فَشَارِبُونَ شُرْبَ الْهِيمِ ﴿٥٥﴾

**56.** తీర్పుదినం నాడు (ఈ వామ పక్షం వారికి లభించే) ఆతిథ్యం ఇదే!

هَٰذَا نُزُلُهُمْ يَوْمَ الدِّينِ ﴿٥٦﴾

---

**1.** చూడండి, 38:52 మరియు 78:33

**57.** మిమ్మల్ని మేమే సృష్టించాము; అయితే మీరెందుకు ఇది సత్యమని నమ్మరు?

نَحْنُ خَلَقْنَٰكُمْ فَلَوْلَا تُصَدِّقُونَ ٥٧

**58.** ఏమీ? మీరెప్పుడైనా, మీరు విసర్జించే వీర్యబిందువును గమనించారా?

أَفَرَءَيْتُم مَّا تُمْنُونَ ٥٨

**59.** ఏమీ? మీరా, దానిని సృష్టించేవారు? లేక మేమా దాని సృష్టికర్తలము?

ءَأَنتُمْ تَخْلُقُونَهُۥٓ أَمْ نَحْنُ ٱلْخَٰلِقُونَ ٥٩

**60.** మేమే మీ కొరకు మరణం నిర్ణయించాం మరియు మమ్మల్ని అధిగమించేది ఏదీ లేదు;

نَحْنُ قَدَّرْنَا بَيْنَكُمُ ٱلْمَوْتَ وَمَا نَحْنُ بِمَسْبُوقِينَ ٦٠

**61.** మీ రూపాలను మార్చివేసి మీరు ఎరుగని (ఇతర రూపంలో) మిమ్మల్ని సృష్టించటం నుండి.

عَلَىٰٓ أَن نُّبَدِّلَ أَمْثَٰلَكُمْ وَنُنشِئَكُمْ
فِى مَا لَا تَعْلَمُونَ ٦١

**62.** మరియు వాస్తవానికి మీ మొదటి సృష్టిని గురించి మీరు తెలుసుకున్నారు, అయితే మీరెందుకు గుణపాఠం నేర్చుకోరు?

وَلَقَدْ عَلِمْتُمُ ٱلنَّشْأَةَ ٱلْأُولَىٰ فَلَوْلَا تَذَكَّرُونَ ٦٢

**63.** మీరు నాటే, విత్తనాలను గురించి, మీరెప్పుడైనా ఆలోచించారా?

أَفَرَءَيْتُم مَّا تَحْرُثُونَ ٦٣

**64.** మీరా వాటిని పండించేది? లేక మేమా వాటిని పండించేవారం?

ءَأَنتُمْ تَزْرَعُونَهُۥٓ أَمْ نَحْنُ ٱلزَّٰرِعُونَ ٦٤

**65.** మేము తలచుకుంటే, దానిని పొట్టుగా మార్చివేయగలం, అప్పుడు మీరు ఆశ్చర్యంలో పడిపోతారు.

لَوْ نَشَآءُ لَجَعَلْنَٰهُ حُطَٰمًا فَظَلْتُمْ تَفَكَّهُونَ ٦٥

**66.** (మీరు అనేవారు): "నిశ్చయంగా, మేము పాడైపోయాము!

إِنَّا لَمُغْرَمُونَ ٦٦

**67.** "కాదుకాదు, మేము దరిద్రులమయ్యాము!" అని.

بَلْ نَحْنُ مَحْرُومُونَ ٦٧

**68.** ఏమీ? మీరు ఎప్పుడైనా మీరు త్రాగే నీటిని గురించి ఆలోచించారా?

أَفَرَءَيْتُمُ ٱلْمَآءَ ٱلَّذِى تَشْرَبُونَ ٦٨

**69.** మీరా దానిని మేఘాల నుండి కురిపించే

ءَأَنتُمْ أَنزَلْتُمُوهُ مِنَ ٱلْمُزْنِ أَمْ نَحْنُ

الْمُنزِلُونَ ۝٦٩

వారు? లేక మేమా దానిని కురిపించేవారము?

لَوْ نَشَاءُ جَعَلْنَاهُ أُجَاجًا فَلَوْلَا تَشْكُرُونَ ۝٧٠

**70.** మేము తలచుకుంటే దానిని ఎంతో ఉప్పుగా ఉండేలా చేసేవారము! అయినా మీరెందుకు కృతజ్ఞత చూపరు?

أَفَرَأَيْتُمُ النَّارَ الَّتِي تُورُونَ ۝٧١

**71.** మీరు రాజేసే అగ్నిని గమనించారా?

أَأَنتُمْ أَنشَأْتُمْ شَجَرَتَهَا أَمْ نَحْنُ الْمُنشِئُونَ ۝٧٢

**72.** దాని వృక్షాన్ని పుట్టించినవారు మీరా? లేక దానిని ఉత్పత్తి చేసినది మేమా?[1]

نَحْنُ جَعَلْنَاهَا تَذْكِرَةً وَمَتَاعًا لِّلْمُقْوِينَ ۝٧٣

**73.** మేము దానిని (నరకాగ్నిని), గుర్తు చేసేదిగా మరియు ప్రయాణీకులకు (అవసరం గలవారికి) ప్రయోజనకారిగా చేశాము.[2]

فَسَبِّحْ بِاسْمِ رَبِّكَ الْعَظِيمِ ۝٧٤

**74.** కావున సర్వోత్తముడైన నీ ప్రభువు నామాన్ని స్తుతించు. (3/4)

فَلَا أُقْسِمُ بِمَوَاقِعِ النُّجُومِ ۝٧٥

**75.** * ఇక నేను నక్షత్రాల స్థానాల (కక్ష్యల) సాక్షిగా చెబుతున్నాను.

وَإِنَّهُ لَقَسَمٌ لَّوْ تَعْلَمُونَ عَظِيمٌ ۝٧٦

**76.** మరియు నిశ్చయంగా, మీరు గమనించ గలిగితే, ఈ శపథం ఎంతో గొప్పది!

إِنَّهُ لَقُرْآنٌ كَرِيمٌ ۝٧٧

**77.** నిశ్చయంగా ఈ ఖుర్ఆన్ దివ్యమైనది.

فِي كِتَابٍ مَّكْنُونٍ ۝٧٨

**78.** సురక్షితమైన[3] గ్రంథంలో ఉన్నది

لَّا يَمَسُّهُ إِلَّا الْمُطَهَّرُونَ ۝٧٩

**79.** దానిని[4] పరిశుద్ధులు తప్ప మరెవ్వరూ తాకలేరు.

تَنزِيلٌ مِّن رَّبِّ الْعَالَمِينَ ۝٨٠

**80.** ఇది సర్వలోకాల ప్రభువు తరఫు

---

1 అంటే అన్ని రకాల ఇంధనం, బొగ్గు, పెట్రోలు, మొదలైనవి చెట్ల నుంచే వస్తాయని

2 'హదీస్'లో మూడు వస్తువుల నుండి ఎవ్వరినీ ఆపకూడదని ఉంది. అవి నీరు, ఆహారం మరియు అగ్ని (అబూ దావూద్, సునన్ ఇబ్నె మాజా ఇబ్నె కసీ'ర్ వ్యాఖ్యానం)

3 అంటే లౌ'హె-మ'హ్ఫూ'జ్

4 దానిని అంటే లౌ'హె-మ'హ్ఫూ'జ్ మరియు పరిశుద్ధులు అంటే దైవదూతలు, అని కొందరి అభిప్రాయం మరికొందరు దానిని అంటే ఖుర్ఆన్, అని అన్నారు దానిని ఆకాశంనుండి అవతరింపజేస్తున్నవారు కేవలం దైవదూతలే, సత్యతిరస్కారులు అపోహలు లేపినట్లు, షైతానులు కాదు. ఎందుకంటే వారు దానిని తాకలేరు. చూడండి, 85:21-22.

నుండి అవతరింపజేయబడింది

81. ఏమీ? మీరు ఈ సందేశాన్ని[1] తేలికగా తీసుకుంటున్నారా?

أَفَبِهَٰذَا الْحَدِيثِ أَنتُم مُّدْهِنُونَ ﴿٨١﴾

82. మరియు (అల్లాహ్) మీకు ప్రసాదిస్తున్న జీవనోపాధికి (కృతజ్ఞత) చూపక, వాస్తవానికి ఆయనను మీరు తిరస్కరిస్తున్నారా?[2]

وَتَجْعَلُونَ رِزْقَكُمْ أَنَّكُمْ تُكَذِّبُونَ ﴿٨٢﴾

83. అయితే (చనిపోయే వాడి) ప్రాణం గొంతులోనికి వచ్చినపుడు, మీరెందుకు (ఆపలేరు)?

فَلَوْلَا إِذَا بَلَغَتِ الْحُلْقُومَ ﴿٨٣﴾

84. మరియు అప్పుడు మీరు (ఏమీ చేయలేక) చూస్తూ ఉండిపోతారు.

وَأَنتُمْ حِينَئِذٍ تَنظُرُونَ ﴿٨٤﴾

85. మరియు అప్పుడు, మేము అతనికి మీ కంటే చాలా దగ్గరలో ఉంటాము, కాని మీరు చూడలేకపోతారు.[3]

وَنَحْنُ أَقْرَبُ إِلَيْهِ مِنكُمْ وَلَٰكِن لَّا تُبْصِرُونَ ﴿٨٥﴾

86. ఒకవేళ మీరు ఎవరి అదుపాజ్ఞలో లేరనుకుంటే,

فَلَوْلَا إِن كُنتُمْ غَيْرَ مَدِينِينَ ﴿٨٦﴾

87. మీరు సత్యవంతులే అయితే దానిని (ఆ ప్రాణాన్ని) ఎందుకు తిరిగి రప్పించుకోలేరు?

تَرْجِعُونَهَا إِن كُنتُمْ صَادِقِينَ ﴿٨٧﴾

88. కాని అతడు (మరణించేవాడు), (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందినవాడైతే![4]

فَأَمَّا إِن كَانَ مِنَ الْمُقَرَّبِينَ ﴿٨٨﴾

89. అతని కొరకు సుఖసంతోషాలు మరియు తృప్తి మరియు పరమానంద కరమైన స్వర్గవనం ఉంటాయి.

فَرَوْحٌ وَرَيْحَانٌ وَجَنَّتُ نَعِيمٍ ﴿٨٩﴾

---

1 సందేశమంటే ఇక్కడ ఖుర్ఆన్ అని హదీస్‌లో పేర్కొనబడింది

2 పైది ఇబ్నె కసీ'ర్ తాత్పర్యం. ము'హమ్మద్ జూనాగఢీ గారి తాత్పర్యం ఈ విధంగా ఉంది. 'మరియు మీరు తిరస్కరిస్తూ ఉండటమే మీ జీవనోపాధిగా చేసుకుంటున్నారా?'

3 ఇక్కడ కొందరు అల్లాహ్ (సు.తా.) తన జ్ఞానంతో మీ దగ్గరలో ఉన్నాడనీ, మరికొందరు ఇక్కడ దీని భావం ప్రాణం తీసే దైవదూతలనీ వ్యాఖ్యానించారు

4 సూరహ్ మొదట్లో పేర్కొన్న మూడు రకాల వారిలో వీరు మొదటి రకానికి చెందినవారు

وَأَمَّآ إِن كَانَ مِنْ أَصْحَٰبِ ٱلْيَمِينِ ﴿٩٠﴾

**90.** మరియు ఎవడైతే కుడిపక్షం వారికి చెందిన వాడైతే![1]

فَسَلَٰمٌ لَّكَ مِنْ أَصْحَٰبِ ٱلْيَمِينِ ﴿٩١﴾

**91.** అతనితో: "నీకు శాంతి కలుగుగాక (సలాం)! నీవు కుడిపక్షంవారిలో చేరావు." (అని అనబడుతుంది).

وَأَمَّآ إِن كَانَ مِنَ ٱلْمُكَذِّبِينَ ٱلضَّآلِّينَ ﴿٩٢﴾

**92.** మరియు ఎవడైతే, అసత్యవాదులు, మార్గభ్రష్టులైన వారిలో చేరుతాడో![2]

فَنُزُلٌ مِّنْ حَمِيمٍ ﴿٩٣﴾

**93.** అతని అతిథ్యానికి సలసల కాగే నీరు ఉంటుంది.

وَتَصْلِيَةُ جَحِيمٍ ﴿٩٤﴾

**94.** మరియు భగభగమండే నరకాగ్ని ఉంటుంది.

إِنَّ هَٰذَا لَهُوَ حَقُّ ٱلْيَقِينِ ﴿٩٥﴾

**95.** నిశ్చయంగా, ఇది రూఢి అయిన నమ్మదగిన సత్యం!

فَسَبِّحْ بِٱسْمِ رَبِّكَ ٱلْعَظِيمِ ﴿٩٦﴾

**96.** కావున సర్వోత్తముడైన నీ ప్రభువు పేరును స్తుతించు.[3]

---

**1.** వీరు రెండవ రకానికి చెందిన వారు.

**2** వీరు మూడవరకానికి చెందినవారు. వీరు అస్ హాబ్ అల్ మష్ అమ అని, ఈ సూరహ్ మొదట్లో పేర్కొనబడ్డారు.

**3** 'హదీస్'లో వచ్చింది: రెండు పదాలు అల్లాహ్(సు.తా.)కు ఎంతో ప్రియమైనవి ఉచ్చరించటానికి సులభమైనవి మరియు ప్రతిఫలం రీత్యా బరువైనవి "సుబ్హా' నల్లాహి వ బిహమ్'దిహీ, సుబ్'హా'నల్లాహిల్ 'అ''జీమ్." ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం)

## 57. సూరహ్ అల్-'హదీద్

سورة الحديد

ఈ సూరాహ్ 8వ హిజ్రీ ప్రాంతంలో మదీనాలో అవతరింపజేయబడింది. ఇందులో 29 ఆయతులు ఉన్నాయి. అల్ 'హదీదు: ఇనుము. దీని పేరు 25వ ఆయత్ నుండి తీసుకోబడింది. ఇంతవరకు దాదాపు 9/10 వంతులు ఖుర్ఆన్ పూర్తి అయ్యింది. మిగిలిన 1/10 భాగాన్ని 2భాగాలలో విభజించవచ్చు. మొదటి దానిలో 10 సూరాహ్‌లు ఉన్నాయి, 57-66 వరకు ఇవన్నీ మదీనాలో అవతరింపజేయబడ్డాయి. ప్రతి ఒక్కటి సాంఘిక జీవితపు ఒక విషయాన్ని వివరిస్తోంది. రెండవ భాగంలో 48 సూరాహ్‌లు, 67-114 వరకు ఉన్నాయి. ఇవి చిన్నచిన్న మక్కా సూరాహ్‌లు. కొన్ని తప్ప, ప్రతి ఒక్కటి ధర్మ విషయాలను బోధిస్తోంది. ఈ సూరహ్ వినయవిధేయతలను బోధిస్తోంది. అహంకారాన్ని ఖండిస్తోంది.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بسم الله الرحمن الرحيم

1. ఆకాశాలలోను మరియు భూమిలోనూ ఉన్న సమస్తం అల్లాహ్ పవిత్రతను కొనియాడుతుంటాయి[1] మరియు ఆయనే సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

سبح لله ما في السموت والارض وهو العزيز الحكيم ۝

2. ఆకాశాలపై మరియు భూమిపై సామ్రాజ్యాధిపత్యం ఆయనదే. ఆయనే జీవనమిచ్చేవాడు మరియు మరణమిచ్చే వాడు. మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

له ملك السموت والارض يحي ويميت وهو على كل شيء قدير ۝

3. ఆయనే ప్రథమం మరియు ఆయనే అంతం[2] మరియు ఆయనే ప్రత్యక్షుడు మరియు ఆయనే పరోక్షుడు.[3] మరియు ఆయనే ప్రతిదాని

هو الاول والاخر والظاهر والباطن وهو بكل شيء عليم ۝

1. చూడండి, 17:44, 21:79
2. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం. 'కాలం, అనేది మానవుని జ్ఞానపరిధికి మించినది, కాని దానిని అల్లాహ్ (సు.తా.) సృష్టించాడు.'
3. ప్రతి వస్తువు చివరకు అల్లాహ్ (సు.తా.) వద్దకే చేరుతుంది. ఎందుకంటే ఆయన (సు.తా.) ప్రతిదానికి మూలం. ఆయన ప్రతిదానికి మరే ఇతర దానికంటే తన జ్ఞానపరంగా సమీపంలో ఉన్నాడు.
   **అల్ అవ్వలు:** The First, ప్రథముడు, మొట్ట మొదటి వాడు, ఆద్యుడు, సర్వసృష్టిరాసుల సృష్టికి పూర్వమే ఉన్నవాడు.

గురించి జ్ఞానం గలవాడు.

4. ఆయనే ఆకాశాలను మరియు భూమిని ఆరు దినములలో (అయ్యామ్) సృష్టించిన వాడు. తరువాత ఆయన సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్టించాడు.[1] భూమిలోకి పోయేది మరియు దానినుండి బయటికి వచ్చేది మరియు ఆకాశంనుండి దిగేది మరియు దానిలోకి ఎక్కేది అంతా ఆయనకు తెలుసు.[2] మరియు మీరెక్కడున్నా ఆయన మీతో పాటు ఉంటాడు మరియు అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

هُوَ الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ فِيْ سِتَّةِ اَيَّامٍ ثُمَّ اسْتَوٰى عَلَى الْعَرْشِ يَعْلَمُ مَا يَلِجُ فِي الْاَرْضِ وَمَا يَخْرُجُ مِنْهَا وَمَا يَنْزِلُ مِنَ السَّمَآءِ وَمَا يَعْرُجُ فِيْهَا وَهُوَ مَعَكُمْ اَيْنَ مَا كُنْتُمْ وَاللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ۝

5. ఆకాశాలపై మరియు భూమిపై సామ్రాజ్యాధిపత్యం ఆయనదే మరియు అన్ని వ్యవహారాలు (నిర్ణయానికై) అల్లాహ్ వైపునకే తీసుకుపోబడతాయి.

لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ وَاِلَى اللّٰهِ تُرْجَعُ الْاُمُوْرُ ۝

6. ఆయనే రాత్రిని పగటిలోకి ప్రవేశింపజేస్తాడు మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేస్తాడు.[3] మరియు ఆయనకు హృదయాలలో ఉన్న విషయాలన్నీ బాగా తెలుసు.

يُوْلِجُ الَّيْلَ فِي النَّهَارِ وَيُوْلِجُ النَّهَارَ فِي الَّيْلِ وَهُوَ عَلِيْمٌ بِذَاتِ الصُّدُوْرِ ۝

7. అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను

اٰمِنُوْا بِاللّٰهِ وَرَسُوْلِهٖ وَاَنْفِقُوْا مِمَّا جَعَلَكُمْ

**అల్-ఆఖరు**: The Last, The End **అంతం**, అంతిమ, కడపటి, చివరికి మిగిలే వాడు, సర్వసృష్టిరాసుల వినాశం తరువాతకూడా ఉండేవాడు
**అజ్ 'జాహిరు**: The Ascendant or Predominant, over all things, The Outward. ప్రత్యక్షుడు, గోచరుడు, బాహ్యం
**అల్ బాతిను**: He who knows the secret and hidden things He who is veiled from the eyes and imaginations of created beings. పరోక్షుడు, అగోచరుడు, దృష్టికిగోచరించని, గోప్యమైన, మరుగైనవాడు ఇవి అల్లాహ్(సు.తా.) అత్యుత్తమ పేర్లు

1 చూడండి, 7:54; 10:3, 32:4 మొదలైన వాటిలో ఈ వాక్యం ఉంది

2 చూడండి, 34:2

3 అంటే కొన్ని దినాలు రాత్రి పెద్దది పగలు చిన్నదిగా ఉంటాయి, మరికొన్ని దినాలు పగలు పెద్దది మరియు రాత్రి చిన్నదిగా ఉంటాయి.

مُّسْتَخْلَفِينَ فِيهِ ۖ فَالَّذِينَ آمَنُوا مِنكُمْ وَأَنفَقُوا لَهُمْ أَجْرٌ كَبِيرٌ ۝

విశ్వసించండి, ఆయన మిమ్మల్ని ఉత్తరాధికారులుగా జేసిన వాటినుండి (దానంగా) ఖర్చు పెట్టండి[1] మీలో ఎవరైతే విశ్వసించి తమ ధనాన్ని (దానముగా) ఖర్చుచేస్తారో, వారికి గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

وَمَا لَكُمْ لَا تُؤْمِنُونَ بِاللَّهِ ۙ وَالرَّسُولُ يَدْعُوكُمْ لِتُؤْمِنُوا بِرَبِّكُمْ وَقَدْ أَخَذَ مِيثَاقَكُمْ إِن كُنتُم مُّؤْمِنِينَ ۝

8 మరియు మీకేమయింది? మీరు (వాస్తవానికి) విశ్వాసులే అయితే? మీ రెందుకు అల్లాహ్‌ను విశ్వసించరు? మరియు ప్రవక్త, మిమ్మల్ని మీ ప్రభువును విశ్వసించండని పిలుస్తున్నాడు మరియు వాస్తవానికి మీచేత ప్రమాణం కూడా చేయించుకున్నాడు.[2]

هُوَ الَّذِي يُنَزِّلُ عَلَىٰ عَبْدِهِ آيَاتٍ بَيِّنَاتٍ لِّيُخْرِجَكُم مِّنَ الظُّلُمَاتِ إِلَى النُّورِ ۚ وَإِنَّ اللَّهَ بِكُمْ لَرَءُوفٌ رَّحِيمٌ ۝

9. తన దాసుని (ము'హమ్మద్)పై స్పష్టమైన సూచనలు (ఆయాత్) అవతరింపజేసేవాడు ఆయనే! అతను వాటి ద్వారా మిమ్మల్ని అంధకారం నుండి వెలుతురులోకి తీసుకురావటానికి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ మిమ్మల్ని ఎంతో కనికరించేవాడు, అపార కరుణాప్రదాత.

وَمَا لَكُمْ أَلَّا تُنفِقُوا فِي سَبِيلِ اللَّهِ وَلِلَّهِ مِيرَاثُ السَّمَاوَاتِ وَالْأَرْضِ ۚ لَا يَسْتَوِي مِنكُم مَّنْ أَنفَقَ مِن قَبْلِ الْفَتْحِ وَقَاتَلَ ۚ أُولَٰئِكَ أَعْظَمُ دَرَجَةً مِّنَ الَّذِينَ أَنفَقُوا مِن بَعْدُ وَقَاتَلُوا ۚ وَكُلًّا وَعَدَ اللَّهُ الْحُسْنَىٰ ۚ وَاللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ۝

10. మరియు మీకేమయింది? మీరెందుకు అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టడం లేదు? ఆకాశాలు మరియు భూమి యొక్క వారసత్వం అల్లాహ్‌కే చెందుతుంది[3] (మక్కా) విజయానికి ముందు (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టిన వారితో మరియు పోరాడిన వారితో, (మక్కా విజయం తరువాత పోరాడిన వారు మరియు ఖర్చు పెట్టిన వారు) సమానులు కాజాలరు! అలాంటి వారి స్థానం (విజయం తరువాత

1. మానవుడు 'నా సొమ్ము, నా సొమ్ము' అంటాడు. వాస్తవానికి. 1) నీవు తిని త్రాగి ఖర్చు చేసింది, 2) నీవు తొడిగి చించింది మరియు 3) నీవు అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చు చేసింది మాత్రమే నీ సొమ్ము. మిగిలినది విడిచి మిగతాదంతా ఇతరులదే ('స'హీ'హ్ ముస్లిం, ముస్నద్ అ'హ్మద్, 4/24).
2. చూడండి, 7:172 అల్లాహ్ (సు.తా.) తన దాసుల చేత ఈ ప్రమాణం చేయించాడు
3. చూడండి, 15:23

అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టిన మరియు పోరాడిన వారికంటే గొప్పది. కాని వారందరికీ అల్లాహ్ ఉత్తమమైన (ప్రతిఫల) వాగ్దానం చేశాడు.[1] మరియు మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును.

11. అల్లాహ్‌కు ఉత్తమమైన అప్పు ఇచ్చే వాడు ఎవడు? ఆయన దానిని ఎన్నోరెట్లు హెచ్చించి తిరిగి అతనికి ఇస్తాడు[2] మరియు అతనికి శ్రేష్ఠమైన ప్రతిఫలం (స్వర్గం) ఉంటుంది.

مَن ذَا الَّذِي يُقْرِضُ اللَّهَ قَرْضًا حَسَنًا فَيُضَٰعِفَهُۥ لَهُۥ وَلَهُۥٓ أَجْرٌ كَرِيمٌ ⑪

12. ఆ దినమున నీవు విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను చూస్తే, వారి వెలుగు, వారి ముందునుండి మరియు వారి కుడివైపు నుండి పరిగెత్తుతూ ఉంటుంది.[3] (వారితో ఇలా అనబడుతుంది): "ఈ రోజు మీకు క్రింద సెలయేర్లు ప్రవహించే స్వర్గవనాల శుభవార్త ఇవ్వబడుతోంది, మీరందులో శాశ్వతంగా ఉంటారు! ఇదే ఆ గొప్ప విజయం."[4]

يَوْمَ تَرَى الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَٰتِ يَسْعَىٰ نُورُهُم بَيْنَ أَيْدِيهِمْ وَبِأَيْمَٰنِهِم بُشْرَىٰكُمُ الْيَوْمَ جَنَّٰتٌ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ۚ ذَٰلِكَ هُوَ الْفَوْزُ الْعَظِيمُ ⑫

1 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం "మీరు నా అనుచరు (ర'ది'అన్హుమ్)లను ఎవ్వరినీ నిందించకండి. ఎవరిచేతిలో నా ప్రాణముందో ఆయన (సు.తా.) ప్రమాణం మీలో ఎవరైనా ఉ'హుద్ పర్వతమంత బంగారాన్ని అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేసినా, అది నా అనుచరుడు ('స'హాబి) ఖర్చుచేసిన ఒక్క 'ముద్' లేక సగం 'ముద్'తో సమానం కాజాలదు." ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం)

2 ఇటువంటి వాక్యం కోసం చూడండి, 2:245 అల్లాహ్ (సు.తా.)కు మంచి అప్పు ఇవ్వడం అంటే అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేయటం లేక దానం చేయటం. మానవుడు అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేసేది, అతనికి అల్లాహ్ (సు.తా.) అనుగ్రహించి ప్రసాదించినవే! అయినా అల్లాహ్ (సు.తా.) దానిని అప్పుగా పేర్కొనటం కేవలం ఆయన (సు.తా.) అనుగ్రహం మరియు కనికరం. ఆయన (సు.తా.) దానికి అదే విధంగా ప్రతిఫలం ఒసంగుతాడు, ఏవిధంగానైతే అప్పుతీర్చటం విధిగా చేయబడిందో!

3 ఈ విషయం పుల్‌సరాత్‌పై జరుగుతుంది. ఈ జ్యోతి వారి సత్కార్యాల ఫలితం. దానివల్ల వారు సులభంగా స్వర్గపు త్రోవను ముగించుకుంటారు. ఇబ్నె కసీ'ర్‌లో మరియు ఇబ్నె జరీర్‌లో 'వ బి అయ్‌మానిహిమ్,'ను ఇలాబోధించారు: 'వారి కుడిచేతులలో వారికర్మ పత్రాలుంటాయి.'

4 ఈ పలుకులు వారి స్వాగతంకొరకు వేచిఉండే దైవదూతలు ('అలైహిమ్ స.) పలుకుతారు.

**13.** ఆ రోజు కపట విశ్వాసులైన పురుషులు మరియు కపట విశ్వాసులైన స్త్రీలు విశ్వాసులతో ఇలా అంటారు:[1] "మీరు మా కొరకు కొంచెం వేచి ఉండండి. మేము మీ వెలుగునుండి కొంచెంతీసుకుంటాము."[2] వారితో ఇలా అనబడుతుంది: "మీరు వెనుకకు మరలిపొండి, తరువాత వెలుగు కొరకు వెదకండి!" అప్పుడు వారి మధ్య ఒకగోడ నిలబెట్టబడుతుంది దానికి ఒక ద్వారముంటుంది, దాని లోపలివైపు కారుణ్యముంటుంది[3] మరియు దాని బయట వైపు శిక్ష ఉంటుంది.[4]

يَوْمَ يَقُولُ الْمُنٰفِقُونَ وَالْمُنٰفِقٰتُ لِلَّذِينَ اٰمَنُوا
انْظُرُونَا نَقْتَبِسْ مِنْ نُّوْرِكُمْ قِيلَ ارْجِعُوا وَرَآءَكُمْ
فَالْتَمِسُوا نُوْرًا فَضُرِبَ بَيْنَهُمْ بِسُوْرٍ لَّهٗ بَابٌ
بَاطِنُهٗ فِيهِ الرَّحْمَةُ وَظَاهِرُهٗ مِنْ قِبَلِهِ الْعَذَابُ ۝

**14.** (బయట నున్న కపటవిశ్వాసులు) ఇలా అరుస్తారు: "ఏమీ? మేము మీతో పాటు ఉండేవాళ్ళం కాదా?" (విశ్వాసులు) ఇలా జవాబిస్తారు: "ఎందుకు ఉండలేదు? కానీ వాస్తవానికి మిమ్మల్ని మీరు స్వయంగా పరీక్షకు గురిచేసుకున్నారు. మీరు మా (నాశనం కోసం) వేచి ఉన్నారు. మరియు మీరు (పునరుత్థానాన్ని) సందేహిస్తూ ఉన్నారు మరియు మీ తుచ్ఛమైన కోరికలు మిమ్మల్ని మోసపుచ్చాయి చివరకు అల్లాహ్ నిర్ణయం వచ్చింది. మరియు ఆ మోసగాడు (షై'తాన్) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోస పుచ్చాడు.[5]

يُنَادُونَهُمْ أَلَمْ نَكُنْ مَّعَكُمْ قَالُوا بَلٰى وَلٰكِنَّكُمْ فَتَنْتُمْ
أَنْفُسَكُمْ وَتَرَبَّصْتُمْ وَارْتَبْتُمْ وَغَرَّتْكُمُ الْأَمَانِيُّ
حَتّٰى جَآءَ أَمْرُ اللّٰهِ وَغَرَّكُمْ بِاللّٰهِ الْغَرُورُ ۝

**15.** కావున ఈ రోజు మీ నుండి ఏ విధమైన పరిహారం తీసుకోబడదు మరియు సత్యతిరస్కారుల నుండి కూడా తీసుకోబడదు

فَالْيَوْمَ لَا يُؤْخَذُ مِنْكُمْ فِدْيَةٌ وَّلَا مِنَ الَّذِينَ كَفَرُوا
مَأْوٰىكُمُ النَّارُ هِيَ مَوْلٰىكُمْ وَبِئْسَ الْمَصِيرُ ۝

---

1 చూడండి, 29:11.

2 కపటవిశ్వాసులైన స్త్రీ పురుషులు కొంతదూరం విశ్వాసుల వెలుగులో నడిచిన తరువాత, అల్లాహ్ (సు.తా.) వారిపై చీకటిని విధిస్తాడు. అప్పుడు వారు అలా పలుకుతారు

3 అంటే స్వర్గం.

4 అంటే నరకం

5 చూడండి, 31:33

మీ నివాసం నరకమే, అదే మీ ఆశ్రయం.[1] ఎంతచెడ్డ గమ్యస్థానం!" (7/8)

16. * ఏమీ? విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో కృంగిపోయి, ఆయన అవతరింపజేసిన సత్యానికి విధేయులయ్యే సమయం ఇంకా రాలేదా? పూర్వగ్రంథ ప్రజల్లాగా వారుకూడా మారిపోకూడదు. ఎందుకంటే చాలాకాలం గడిచిపోయినందుకు వారి హృదయాలు కఠినమైపోయాయి. మరియు వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.[2]

أَلَمْ يَأْنِ لِلَّذِينَ آمَنُوا أَنْ تَخْشَعَ قُلُوبُهُمْ لِذِكْرِ
اللَّهِ وَمَا نَزَلَ مِنَ الْحَقِّ وَلَا يَكُونُوا كَالَّذِينَ أُوتُوا
الْكِتَابَ مِنْ قَبْلُ فَطَالَ عَلَيْهِمُ الْأَمَدُ فَقَسَتْ
قُلُوبُهُمْ وَكَثِيرٌ مِنْهُمْ فَاسِقُونَ ﴿١٦﴾

17. బాగా తెలుసుకోండి! నిశ్చయంగా అల్లాహ్, భూమి చనిపోయిన తరువాత, దానికి మళ్ళీ జీవం పోస్తాడు వాస్తవానికి మేము ఈ సూచనలను మీకు స్పష్టంగా తెలుపుతున్నాము. బహుశా మీరు అర్థం చేసుకుంటారని

اعْلَمُوا أَنَّ اللَّهَ يُحْيِي الْأَرْضَ بَعْدَ مَوْتِهَا قَدْ بَيَّنَّا
لَكُمُ الْآيَاتِ لَعَلَّكُمْ تَعْقِلُونَ ﴿١٧﴾

18. నిశ్చయంగా, విధిదానం ('జకాత్) చేసే పురుషులు మరియు విధిదానం చేసే స్త్రీలు మరియు అల్లాహ్‌కు మంచి అప్పు ఇచ్చేవారికి, ఆయన దానిని ఎన్నోరెట్లు పెంచి (తిరిగి) ఇస్తాడు.[3] మరియు వారికి గొప్ప ప్రతిఫలం ఉంటుంది

إِنَّ الْمُصَّدِّقِينَ وَالْمُصَّدِّقَاتِ وَأَقْرَضُوا اللَّهَ قَرْضًا
حَسَنًا يُضَاعَفُ لَهُمْ وَلَهُمْ أَجْرٌ كَرِيمٌ ﴿١٨﴾

19. మరియు ఎవరైతే అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తలను విశ్వసిస్తారో, అలాంటి వారే

وَالَّذِينَ آمَنُوا بِاللَّهِ وَرُسُلِهِ أُولَٰئِكَ هُمُ

---

1 మౌలా: కార్యకర్త, యజమాని, సంరక్షకుడు, కర్తవ్యాన్ని నిర్వహించేవాడు స్నేహితుడు, సహచరుడు, ఎల్లప్పుడు తోడుగా ఉండువాడు. ఇక్కడ నరకపు కర్తవ్యం శిక్ష విధించటమే కదా!

2 చూడండి, 5:13

3. ఒకదానికి పదిరెట్లు, ఏడువందలరెట్లు లేక అంతకంటే అధికంగా కూడా ఇస్తాడు ఈ ఎక్కువ రెట్ల పుణ్యం వారి మాలిన్యరహితం, ఆవశ్యకత మరియు ఖర్చుచేసిన చోటు మరియు కాలాన్ని బట్టి ఉంటాయి ఏ విధంగానైతే ఇంతకు ముందు పేర్కొనబడిందో ఫత్'హ్ మక్కాకు మొదట ఖర్చు చేసిన వారికి, దాని తరువాత ఖర్చుచేసిన వారికంటే ఎక్కువ పుణ్యముందని

الصِّدِّيقُونَ ۖ وَالشُّهَدَاءُ عِندَ رَبِّهِمْ لَهُمْ أَجْرُهُمْ وَنُورُهُمْ ۖ وَالَّذِينَ كَفَرُوا وَكَذَّبُوا بِآيَاتِنَا أُولَٰئِكَ أَصْحَابُ الْجَحِيمِ ﴿١٩﴾

సత్యసంధులైన (విశ్వాసులు). మరియు వారే తమ ప్రభువువద్ద అమర వీరులు. వారికి వారి ప్రతిఫలం మరియు జ్యోతి లభిస్తాయి. కాని ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో మరియు మా ఆయతులను అబద్ధాలని అంటారో, అలాంటి వారు తప్పక భగభగమండే నరకాగ్ని వాసులవుతారు.

اعْلَمُوا أَنَّمَا الْحَيَاةُ الدُّنْيَا لَعِبٌ وَلَهْوٌ وَزِينَةٌ وَتَفَاخُرٌ بَيْنَكُمْ وَتَكَاثُرٌ فِي الْأَمْوَالِ وَالْأَوْلَادِ ۖ كَمَثَلِ غَيْثٍ أَعْجَبَ الْكُفَّارَ نَبَاتُهُ ثُمَّ يَهِيجُ فَتَرَاهُ مُصْفَرًّا ثُمَّ يَكُونُ حُطَامًا ۖ وَفِي الْآخِرَةِ عَذَابٌ شَدِيدٌ وَمَغْفِرَةٌ مِّنَ اللَّهِ وَرِضْوَانٌ ۚ وَمَا الْحَيَاةُ الدُّنْيَا إِلَّا مَتَاعُ الْغُرُورِ ﴿٢٠﴾

**20.** బాగా తెలుసుకోండి! నిశ్చయంగా, ఇహలోక జీవితం, ఒక ఆట మరియు ఒక వినోదం మరియు ఒక శృంగారం మరియు మీరు పరస్పరం గొప్పలు చెప్పుకోవడం మరియు సంపద మరియు సంతానం విషయంలో ఆధిక్యత పొందటానికి ప్రయత్నించడం మాత్రమే.[1] దాని దృష్టాంతం ఆ వర్షంవలే ఉంది: దాని (వర్షం) వల్ల పెరిగే పైరు రైతులకు ఆనందం కలిగిస్తుంది.[2] ఆ పిదప అది ఎండిపోయి పసుపుపచ్చగా మారిపోతుంది. ఆ పిదప అది పొట్టుగా మారిపోతుంది. కాని పరలోక జీవితంలో మాత్రం (దుష్టులకు) బాధాకరమైన శిక్ష మరియు (సత్పురుషులకు) అల్లాహ్ నుండి క్షమాపణ మరియు ఆయన ప్రసన్నత ఉంటాయి. కావున ఇహలోక జీవితం కేవలం మోసగించే భోగభాగ్యాలు మాత్రమే.

سَابِقُوا إِلَىٰ مَغْفِرَةٍ مِّن رَّبِّكُمْ وَجَنَّةٍ عَرْضُهَا كَعَرْضِ السَّمَاءِ وَالْأَرْضِ أُعِدَّتْ لِلَّذِينَ آمَنُوا بِاللَّهِ وَرُسُلِهِ ۚ ذَٰلِكَ فَضْلُ اللَّهِ يُؤْتِيهِ مَن يَشَاءُ ۚ وَاللَّهُ ذُو الْفَضْلِ الْعَظِيمِ ﴿٢١﴾

**21.** మీ ప్రభువు క్షమాపణ వైపునకు మరియు ఆకాశం మరియు భూమి యొక్క వైశాల్యమంతటి విశాలమైన స్వర్గం వైపునకు పరుగెత్తండి. అది అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించే వారి కొరకు సిద్ధపరచబడి

1. చూడండి, 38:27 మరియు 23:115.
2. అల్ కుప్ఫారు: అంటే ఇక్కడ రైతు అనే అర్థంలో వాడబడింది. అంటే దాచేవాడు, రైతు భూమిలో విత్తనాలను దాచుతాడు. అదేవిధంగా సత్యతిరస్కారుల హృదయాలలో అల్లాహ్ (సు.తా.) మరియు అంతిమదినపు తిరస్కారం దాగి ఉంటుంది.

ఉంది. ఇది అల్లాహ్ అనుగ్రహం, ఆయన తానుకోరిన వారికి దానిని ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ అనుగ్రహశాలి, సర్వోత్తముడు.

مَآ أَصَابَ مِن مُّصِيبَةٍ فِى ٱلْأَرْضِ وَلَا فِىٓ أَنفُسِكُمْ إِلَّا فِى كِتَٰبٍ مِّن قَبْلِ أَن نَّبْرَأَهَآ ۚ إِنَّ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٌ

**22.** భూమి మీద గానీ లేదా స్వయంగా మీ మీద గానీ విరుచుకుపడే ఏ ఆపద అయినా సరే! మేము దానిని సంభవింపజేయక ముందే గ్రంథంలో వ్రాయబడకుండా లేదు నిశ్చయంగా, ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం.[1]

لِّكَيْلَا تَأْسَوْا۟ عَلَىٰ مَا فَاتَكُمْ وَلَا تَفْرَحُوا۟ بِمَآ ءَاتَىٰكُمْ ۗ وَٱللَّهُ لَا يُحِبُّ كُلَّ مُخْتَالٍ فَخُورٍ

**23.** ఇదంతా మీరు పోయినదానికి నిరాశ చెందకూడదని మరియు మీకు ఇచ్చినదానికి సంతోషంతో ఉప్పొంగిపోరాదని[2] మరియు అల్లాహ్ బడాయీలు చెప్పుకునే వారూ, గర్వించే వారూ అంటే ఇష్టపడడు.

ٱلَّذِينَ يَبْخَلُونَ وَيَأْمُرُونَ ٱلنَّاسَ بِٱلْبُخْلِ ۗ وَمَن يَتَوَلَّ فَإِنَّ ٱللَّهَ هُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ

**24.** ఎవరైతే స్వయంగా లోభత్వం చూపుతూ[3] ఇతరులను కూడా లోభత్వానికి పురికొలుపుతారో మరియు ఎవడైతే (సత్యం నుండి) వెనుదిరుగుతాడో వాడు (తెలుసుకోవాలి), నిశ్చయంగా అల్లాహ్ స్వయం సమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడని!

لَقَدْ أَرْسَلْنَا رُسُلَنَا بِٱلْبَيِّنَٰتِ وَأَنزَلْنَا مَعَهُمُ ٱلْكِتَٰبَ وَٱلْمِيزَانَ لِيَقُومَ ٱلنَّاسُ بِٱلْقِسْطِ ۖ وَأَنزَلْنَا ٱلْحَدِيدَ فِيهِ بَأْسٌ شَدِيدٌ وَمَنَٰفِعُ لِلنَّاسِ وَلِيَعْلَمَ ٱللَّهُ مَن يَنصُرُهُۥ وَرُسُلَهُۥ

**25.** వాస్తవానికి, మేము మా సందేశహరులను స్పష్టమైన సూచనలనిచ్చి పంపాము మరియు వారితో బాటు గ్రంథాన్ని అవతరింపజేశాము. మరియు మానవులు న్యాయశీలురుగా మెలగటానికి త్రాసును

---

1 అల్లాహ్(సు.తా.)కు జరిగిందీ, జరగబోయేది అన్నివిషయాల జ్ఞానముంది కాబట్టి ఆయన (సు.తా.) సృష్టిని ఆరంభించకముందే అంతా ఒకగ్రంథంలో వ్రాసి పెట్టాడు ఆదే ఖద్ తఖ్దీర్, (స.ముస్లిం).

2 మూమిన్ బాధ కలిగినప్పుడు సహనం వహిస్తాడు మరియు సంతోషం కలిగినప్పుడు అల్లాహ్ (సు.తా.)కు కృతజ్ఞుడవుతాడు ఎందుకంటే అతను అది తన శ్రమ కాదు అల్లాహ్ (సు.తా.) యొక్క అనుగ్రహమని నమ్ముతాడు.

3 అంటే అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేయటంలో లోభత్వం. చూడండి, 4:36-37

بِالْغَيْبِ ۚ إِنَّ اللَّهَ قَوِيٌّ عَزِيزٌ ﴿٢٥﴾

కూడా పంపాము[1] మరియు ఇనుమును కూడా ప్రసాదించాము. అందులో గొప్పశక్తి ఉంది, మరియు మానవులకు ఎన్నో ప్రయోజనాలున్నాయి.[2] మరియు (ఇదంతా) అల్లాహ్ అగోచరుడైన తనకు మరియు తన ప్రవక్తలకు ఎవడు సహాయకుడవుతాడో తెలుసుకోవటానికి చేశాడు. నిశ్చయంగా, అల్లాహ్ మహా బలశాలి, సర్వ శక్తిమంతుడు.

وَلَقَدْ أَرْسَلْنَا نُوحًا وَإِبْرَاهِيمَ وَجَعَلْنَا فِي ذُرِّيَّتِهِمَا
النُّبُوَّةَ وَالْكِتَابَ ۖ فَمِنْهُم مُّهْتَدٍ ۖ وَكَثِيرٌ مِّنْهُمْ
فَاسِقُونَ ﴿٢٦﴾

**26.** మరియు వాస్తవంగా మేము నూ'హ్‌ను మరియు ఇబ్రాహీమ్‌ను పంపాము. మరియు వారిద్దరి సంతానంలో ప్రవక్తపదవినీ మరియు గ్రంథాన్ని ఉంచాము. కాని వారి సంతతిలో కొందరు మార్గదర్శకత్వం మీద ఉన్నారు, కాని వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.

ثُمَّ قَفَّيْنَا عَلَىٰ آثَارِهِم بِرُسُلِنَا وَقَفَّيْنَا بِعِيسَى ابْنِ
مَرْيَمَ وَآتَيْنَاهُ الْإِنجِيلَ وَجَعَلْنَا فِي قُلُوبِ الَّذِينَ
اتَّبَعُوهُ رَأْفَةً وَرَحْمَةً وَرَهْبَانِيَّةً ابْتَدَعُوهَا
مَا كَتَبْنَاهَا عَلَيْهِمْ إِلَّا ابْتِغَاءَ رِضْوَانِ اللَّهِ فَمَا
رَعَوْهَا حَقَّ رِعَايَتِهَا ۖ فَآتَيْنَا الَّذِينَ آمَنُوا مِنْهُمْ
أَجْرَهُمْ ۖ وَكَثِيرٌ مِّنْهُمْ فَاسِقُونَ ﴿٢٧﴾

**27.** ఆ తరువాత చాలామంది ప్రవక్తలను మేము వారి తరువాత పంపాము మరియు మర్యమ్ కుమారుడు ఈసాను కూడా పంపాము మరియు అతనికి ఇంజీల్‌ను ప్రసాదించాము మరియు అతనిని అనుసరించే వారి హృదయాలలో మేము జాలిని, కరుణను కలిగించాము. కాని సన్యాసాన్ని[3] వారే స్వయంగా కల్పించుకున్నారు. మేము

1. మీ'జాన్: అంటే త్రాసు - ఇక్కడ న్యాయం అని అర్థం.
2 ఇనుమువల్ల ఎన్నో ఉపయోగాలు ఉన్నాయి ఇది భూమిలో విస్తారంగా దొరుకుతుంది
3 కఠోరమైన సన్యాసాన్ని వారే (క్రైస్తవులే) తమపైతాము విధించుకున్నారు వారుప్రాపంచిక జీవితానికి విలువఇవ్వలేదు దీనిని ఖుర్ఆన్ ఖండిస్తుంది చూడండి, 2:143.రఆఫతన్ - అంటే జాలి కనికరం, దయ. రుహ్బానియ్యహ్ అంటే త్యాగం, విడిచిపెట్టడం అంటే ప్రాపంచిక విషయాలను త్యజించటం అంటే సన్యాసత్వం స్వీకరించటం ఇది వారే స్వయంగాకల్పించు కున్నారు అల్లాహ్ (సు.తా.) దీనిని విధించలేదు వారు అల్లాహ్ (సు.తా.)ను సంతోషపరచాలని దీనిని అవలంబించారు కాని అల్లాహ్ (సు.తా.) తాను చూపిన మార్గంపై నడిచే వారితోనే సంతోషపడతాడు దానిలో క్రొత్తవిషయాలను పుట్టించి వాటిని అవలంబించే వారితో కాదు

దానిని వారిపై విధించలేదు, కాని అల్లాహ్ ప్రసన్నతను పొందగోరి వారే దానిని విధించుకున్నారు, కాని వారు దానిని పాటించ వలసిన విధంగా నిజాయితీతో పాటించలేదు. కావున వారిలో విశ్వసించిన వారికి వారి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. కాని వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا ٱتَّقُوا ٱللَّهَ وَءَامِنُوا بِرَسُولِهِۦ
يُؤْتِكُمْ كِفْلَيْنِ مِن رَّحْمَتِهِۦ وَيَجْعَل لَّكُمْ نُورًا
تَمْشُونَ بِهِۦ وَيَغْفِرْ لَكُمْ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٨﴾

**28.** ఓ విశ్వాసులారా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. మరియు ఆయన సందేశహరుణ్ణి విశ్వసించండి. ఆయన (అల్లాహ్) మీకు రెట్టింపు కరుణను ప్రసాదిస్తాడు మరియు వెలుగును ప్రసాదిస్తాడు, మీరు అందులో నడుస్తారు మరియు ఆయన మిమ్మల్ని క్షమిస్తాడు. మరియు అల్లాహ్ ఎంతో క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

لِّئَلَّا يَعْلَمَ أَهْلُ ٱلْكِتَٰبِ أَلَّا يَقْدِرُونَ عَلَىٰ شَىْءٍ
مِّن فَضْلِ ٱللَّهِ وَأَنَّ ٱلْفَضْلَ بِيَدِ ٱللَّهِ يُؤْتِيهِ مَن
يَشَآءُ وَٱللَّهُ ذُو ٱلْفَضْلِ ٱلْعَظِيمِ ﴿٢٩﴾

**29.** అల్లాహ్ అనుగ్రహం మీద తమకు ఎలాంటి అధికారం లేదని మరియు నిశ్చయంగా, అనుగ్రహం కేవలం అల్లాహ్ చేతిలో ఉందని మరియు ఆయన తాను కోరిన వారికి దానిని ప్రసాదిస్తాడని, పూర్వ గ్రంథప్రజలు తెలుసుకోవాలి. మరియు అల్లాహ్ అనుగ్రహశాలి, సర్వోత్తముడు.



## 58. సూరహ్ అల్ ముజాదిలహ్

## سورة المجادلة

అల్-ముజా(ది)దలహ్: వాదించటం. ఈ 10 మదీనా సూరాహ్‌ల సమూహంలో ఇది 2వది. ఇందులో 22 ఆయతులు ఉన్నాయి. ఇస్లాంకు ముందు 'అరబ్బులలో స్త్రీలపై జరిగే అన్యాయాన్ని గురించి మరియు దానిని నిషేధించటం గురించి ఇందులో వివరించబడింది. ఇది దాదాపు 4-5 హిజ్రీలలో అవతరింపజేయబడింది. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది బహుశా సూరహ్ అల్-అహ్‌జాబ్ (33) కంటే ముందు అవతరింపజేయబడింది.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

قَدۡ سَمِعَ ٱللَّهُ قَوۡلَ ٱلَّتِي تُجَٰدِلُكَ فِي زَوۡجِهَا وَتَشۡتَكِيٓ إِلَى ٱللَّهِ وَٱللَّهُ يَسۡمَعُ تَحَاوُرَكُمَآۚ إِنَّ ٱللَّهَ سَمِيعُۢ بَصِيرٌ ١

**1.** (*) వాస్తవానికి, తన భర్తను గురించి నీతో వాదిస్తున్న మరియు అల్లాహ్‌తో మొర పెట్టుకుంటున్న ఆ స్త్రీ మాటలు అల్లాహ్ విన్నాడు.[1] అల్లాహ్ మీ ఇద్దరి సంభాషణ వింటున్నాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సమస్తం చూసేవాడు.

ٱلَّذِينَ يُظَٰهِرُونَ مِنكُم مِّن نِّسَآئِهِم مَّا هُنَّ أُمَّهَٰتِهِمۡۖ إِنۡ أُمَّهَٰتُهُمۡ إِلَّا ٱلَّٰٓـِٔي وَلَدۡنَهُمۡۚ وَإِنَّهُمۡ لَيَقُولُونَ مُنكَرٗا مِّنَ ٱلۡقَوۡلِ وَزُورٗاۚ وَإِنَّ ٱللَّهَ لَعَفُوٌّ غَفُورٞ ٢

**2.** మీలో ఎవరైతే తమ భార్యలను 'జిహార్ ద్వారా దూరంగా ఉంచుతారో! అలాంటి వారికి వారి భార్యలు తల్లులు కాలేరు. వారిని కన్న వారు మాత్రమే వారి తల్లులు.[2] మరియు నిశ్చయంగా, వారు అనుచితమైన మరియు అబద్ధమైన మాట పలుకుతున్నారు. మరియు నిశ్చయంగా, అల్లాహ్ మన్నించేవాడు, క్షమాశీలుడు.

---

1. ఇక్కడ 'ఖౌలహ్ బిన్త్ మాలిక్ బిన్ స'అలబహ్ (ర. 'అన్హా)ను ఆమె భర్త ఔస్ బిన్ 'సామిత్ (ర'ది. 'అ.) 'జిహార్ చేసినందుకు ఆమె మొర పెట్టుకుంటుంది. దానికి అల్లాహ్ (సు.తా.) ఆదేశం వచ్చిన తరువాత, అది నిర్మూలించబడిన విషయం ఈ సూరహ్ యొక్క 1-4వ ఆయతులలో పేర్కొనబడింది. 'జిహార్ అంటే: "నీ వీపు నాకు నా తల్లి వీపు వంటిది." అని తన భార్యను తాకకుండా దూరముండటం మరియు ఆమెకు విడాకులు కూడా ఇవ్వకుండా ఉండటం. ఆమె దైవప్రవక్త (స'అస) దగ్గరకు వచ్చి ఈ ఆచారాన్ని గురించి వాదులాడింది. అప్పుడు ఈ ఆయతులు అవతరింపజేయబడ్డాయి. (అబూ దావూద్) ఇంకా చూడండి, 33:4. స్త్రీ తన భర్తనుంచి విడాకులు తీసుకోగోరితే దానికి సంబంధించిన ఆదేశానికి చూడండి, 2:229. దానిని ఖుల్'అ అంటారు.
2. మీరు 'జిహార్ అన్నంత మాత్రాన్నే మీ భార్యలు మీ తల్లులు కారు, మిమ్మల్ని కన్నవారే మీ తల్లులు

أَمْ لَكُمْ كِتَٰبٌ فِيهِ تَدْرُسُونَ ﴿٣٧﴾

37. మీ వద్ద ఏదయినా (దివ్య) గ్రంథముందా? దానినుండి మీరు నేర్చుకోవటానికి!

إِنَّ لَكُمْ فِيهِ لَمَا تَخَيَّرُونَ ﴿٣٨﴾

38. నిశ్చయంగా, అందులో మీకు మీరు కోరేదంతా ఉందని?

أَمْ لَكُمْ أَيْمَٰنٌ عَلَيْنَا بَٰلِغَةٌ إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ ۙ إِنَّ لَكُمْ لَمَا تَحْكُمُونَ ﴿٣٩﴾

39. లేక, పునరుత్థానదినం వరకు, మీరు నిర్ణయించుకున్నదే మీకు తప్పక లభిస్తుందని, మేము మీతో చేసిన గట్టిప్రమాణం ఏదైనా ఉందా?

سَلْهُمْ أَيُّهُم بِذَٰلِكَ زَعِيمٌ ﴿٤٠﴾

40. వారిలో దీనికి ఎవడు హామీగా ఉన్నాడో అడుగు.

أَمْ لَهُمْ شُرَكَآءُ فَلْيَأْتُوا۟ بِشُرَكَآئِهِمْ إِن كَانُوا۟ صَٰدِقِينَ ﴿٤١﴾

41. లేక, వారికి ఎవరైనా (వారు అల్లాహ్‌కు కల్పించిన) భాగస్వాములు ఉన్నారా? ఒకవేళ వారు సత్యవంతులే అయితే తమ ఆ భాగస్వాములను తీసుకురమ్మను.

يَوْمَ يُكْشَفُ عَن سَاقٍ وَيُدْعَوْنَ إِلَى ٱلسُّجُودِ فَلَا يَسْتَطِيعُونَ ﴿٤٢﴾

42. (జ్ఞాపకముంచుకోండి) ఏ రోజయితే పిక్కఎముక తెరిచివేయబడుతుందో! మరియు వారు సాష్టాంగం (సజ్దా) చేయటానికి పిలువబడతారో, అప్పుడు వారు (కపటవిశ్వాసులు), అలా (సజ్దా) చేయలేరు!

خَٰشِعَةً أَبْصَٰرُهُمْ تَرْهَقُهُمْ ذِلَّةٌ ۖ وَقَدْ كَانُوا۟ يُدْعَوْنَ إِلَى ٱلسُّجُودِ وَهُمْ سَٰلِمُونَ ﴿٤٣﴾

43. వారి చూపులు క్రిందికి వాలిపోయి ఉంటాయి, అవమానం వారిని ఆవరించి ఉంటుంది. మరియు వాస్తవానికి వారు నిక్షేమంగా ఉన్నప్పుడు సాష్టాంగం (సజ్దా) చేయటానికి ఆహ్వానించబడితే (తిరస్కరించే వారు)!

فَذَرْنِى وَمَن يُكَذِّبُ بِهَٰذَا ٱلْحَدِيثِ ۖ سَنَسْتَدْرِجُهُم مِّنْ حَيْثُ لَا يَعْلَمُونَ ﴿٤٤﴾

44. కావున నన్ను మరియు ఈ సందేశాన్ని అబద్ధమని నిరాకరించే వారిని వదలండి. వారు గ్రహించని విధంగా మేము వారిని క్రమక్రమంగా (వినాశం వైపునకు) తీసుకొని పోతాము.[1]

1. చూడండి, 7:182-183.

**45.** మరియు నేను వారికి కొంత వ్యవధినిస్తున్నాను. నిశ్చయంగా నా పన్నాగం చాలా దృఢమైనది.[1]

وَأُمْلِي لَهُمْ ۚ إِنَّ كَيْدِي مَتِينٌ ۝٤٥

**46.** లేక, (ఓ ప్రవక్తా!) నీవు వారిని ఏదైనా ప్రతిఫలం ఇవ్వమని అడుగుతున్నావా? వారికి దాని రుణం భారమవటానికి?

أَمْ تَسْأَلُهُمْ أَجْرًا فَهُمْ مِنْ مَغْرَمٍ مُثْقَلُونَ ۝٤٦

**47** లేక, వారివద్ద ఏదైనా అగోచరజ్ఞానం ఉందా?[2] వారు దానిని వ్రాసి పెట్టడానికి?

أَمْ عِنْدَهُمُ الْغَيْبُ فَهُمْ يَكْتُبُونَ ۝٤٧

**48.** కావున నీవు నీ ప్రభువు ఆజ్ఞ కొరకు వేచిఉండు. మరియు నీవు, చేపవాని (యూనుస్)వలే వ్యవహరించకు.[3] (గుర్తుకు తెచ్చుకో) అతను దుఃఖంలో ఉన్నప్పుడు (తన ప్రభువును) మొరపెట్టుకున్నాడు.

فَاصْبِرْ لِحُكْمِ رَبِّكَ وَلَا تَكُنْ كَصَاحِبِ الْحُوتِ إِذْ نَادَىٰ وَهُوَ مَكْظُومٌ ۝٤٨

**49.** అతని ప్రభువు అనుగ్రహమే గనక అతనికి అందకపోయి ఉంటే, అతడు అవమానకరమైన స్థితిలో (చేపకడుపులో పడిఉండే వాడు కాని మేము అతనిని క్షమించాము). కావున అతడు చౌట (బంజరు) మైదానంలో విసరివేయబడ్డాడు.[4]

لَوْلَا أَنْ تَدَارَكَهُ نِعْمَةٌ مِنْ رَبِّهِ لَنُبِذَ بِالْعَرَاءِ وَهُوَ مَذْمُومٌ ۝٤٩

**50** చివరకు అతని ప్రభువు అతనిని

فَاجْتَبَاهُ رَبُّهُ فَجَعَلَهُ مِنَ الصَّالِحِينَ ۝٥٠

---

1 కైదున్ పన్నుగడ, పన్నాగం. పథకం, యోజన. వ్యూహం ఇంకా చూడండి, 10:5

2 'గైబున్ అగోచరం ఈ పదం ఖుర్ఆన్ అవతరణాక్రమంలో ఇక్కడ మొట్టమొదటి సారి వచ్చింది. ఇంకా చూడండి, 96:6.

3. యూనుస్ (అ.స) యొక్క వివరాల కోసం చూడండి, 21:87 మరియు 37:140

4. దీని మరొక తాత్పర్యం ఇలా ఉంది: "ఒకవేళ అతనిపై అతని ప్రభువు (సు.తా.) అనుగ్రహమే గనక లేకుంటే! నిశ్చయంగా, అతను అవమానకరమైన స్థితిలో బంజరు మైదానంలో విసరివేయబడేవాడు" మరొక వ్యాఖ్యానం. "అల్లాహ్ (సు.తా.) అతనికి పశ్చాత్తాపపడే సద్బుద్ధి గనక ఇవ్వకుండా ఉంటే మరియు అతని ప్రార్థన అంగీకరించబడకుండా ఉంటే అతను సముద్రపు అంచున వేయబడకుండా ఉంటే ఎక్కడైతే అతనికి ఆహారం ఇచ్చాడో మరియు తీగ పెంచాడో బంజరు భూమిలో విసరివేయబడిఉండే వాడు మరియు అల్లాహ్ (సు.తా.) వద్ద అతని పరిస్థితి అవమానకరమైనదై ఉండేది కాని అతని ప్రార్థన అంగీకరించబడిన తరువాత అతను అనుగ్రహించబడ్డాడు." ఇంకా చూడండి, 37:143

ఎన్నుకొని సత్పురుషులలో చేర్చాడు.

وَإِن يَكَادُ ٱلَّذِينَ كَفَرُوا۟ لَيُزْلِقُونَكَ بِأَبْصَٰرِهِمْ لَمَّا سَمِعُوا۟ ٱلذِّكْرَ وَيَقُولُونَ إِنَّهُۥ لَمَجْنُونٌ ۝٥١

**51.** మరియు ఈ సత్యతిరస్కారులు, ఈ సందేశాన్ని (ఖుర్ఆన్‌ను) విన్నప్పుడు, తమ చూపులతో నీ కాళ్లు ఊడగొడతారా అన్నట్లు (నిన్ను జారించి పడవేసేటట్లు) నిన్ను చూస్తున్నారు.[1] మరియు వారు నిన్ను (ఓ ముహమ్మద్!): "నిశ్చయంగా ఇతడు పిచ్చివాడు!" అని అంటున్నారు

وَمَا هُوَ إِلَّا ذِكْرٌ لِّلْعَٰلَمِينَ ۝٥٢

**52.** కాని సర్వలోకాల (వారికి) ఇదొక హితోపదేశం మాత్రమే! (1/4)

1 ఒకవేళ నీకు అల్లాహ్ (సు.తా.) రక్షణయే గనక లేకుంటే! వారిదిష్టి నీకు తగిలేది (ఇబ్నె కసీ'ర్) ఇబ్నె కసీ'ర్ ఇంకా ఇలా వ్రాశారు. దిష్టి తగలటం మరియు అల్లాహ్ (సు.తా.) అనుమతితో దానివల్ల నష్టం కలగటం నిజమే కావున 'హదీస్'లలో దీని నుండి విముక్తి పొందటానికి దు'ఆలు ఇవ్వబడ్డాయి మరియు ఈ సలహాలు కూడా ఇవ్వబడ్డాయి ఏదైనా మంచి వస్తువును చూస్తే దిష్టి తగులకుండా ఉండటానికి. 'మాషాఅల్లాహ్' లేక 'బారకల్లాహ్' అనాలి ఒకవేళ దిష్టి తగిలితే: దిష్టి పెట్టిన వాడు ఒకపాత్రలో స్నానంచేసి ఆ నీటిని దిష్టి తగిలినవాడిమీద పోయాలి. (ఇబ్నె-కసీ'ర్).

## 69. సూరహ్ అల్-'హాఖ్ఖహ్

## سورة الحاقة

అల్ 'హాఖ్ఖహ్ The Reality, The Inevitable, పరమయథార్థం, నిజం, సత్యం, అనివార్య సంఘటన. (ఇది పునరుత్థాన దినానికి గల మరొక పేరు) ఈ సూరహ్ మక్కాలో, సూరహ్ అల్ -ముల్క్ (67), తరువాత అవతరింపజేయబడింది దాదాపు హిజ్రత్‌కు 3-4 సంవత్సరాలకు ముందు దీని పేరు మొదటి మూడు ఆయత్‌లలో పేర్కొనబడింది ఇందులో **52 ఆయతులు** ఉన్నాయి ఇంకా చూడండి. 37-19. 39 68 చివరి భాగం మరియు 50.21-22

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** * ఆ అనివార్య సంఘటన (పునరుత్థానం)!

الْحَاقَّةُ ۝١

**2.** ఏమిటా అనివార్యసంఘటన?

مَا الْحَاقَّةُ ۝٢

**3.** మరియు ఆ అనివార్య సంఘటన, అంటే ఏమిటో నీకేమితెలుసు?

وَمَا أَدْرَاكَ مَا الْحَاقَّةُ ۝٣

**4.** స'మూద్ మరియు 'ఆద్ జాతి వారు అకస్మాత్తుగా విరుచుకుపడే ఆ ఉపద్రవాన్ని అసత్యమని తిరస్కరించారు.[1]

كَذَّبَتْ ثَمُودُ وَعَادٌ بِالْقَارِعَةِ ۝٤

**5.** కావున స'మూద్ జాతివారైతే ఒక భయంకరమైన గర్జనద్వారా నాశనం చేయబడ్డారు

فَأَمَّا ثَمُودُ فَأُهْلِكُوا بِالطَّاغِيَةِ ۝٥

**6.** మరియు ఆద్ జాతివారేమో అతి తీవ్రమైన తుఫాను గాలి ద్వారా నాశనం చేయబడ్డారు.

وَأَمَّا عَادٌ فَأُهْلِكُوا بِرِيحٍ صَرْصَرٍ عَاتِيَةٍ ۝٦

**7.** ఆయన (అల్లాహ్), దానిని వారి మీద ఏడు రాత్రులు మరియు ఎనిమిది పగళ్ళ వరకు ఎడతెగకుండా ఆవరింపజేశాడు.[2] దానివలన వారు వేళ్ళతో పెళ్ళగించబడిన ఖర్జూరపు బోదెలవలే పాడై పోవటం, నీవు చూస్తావు!

سَخَّرَهَا عَلَيْهِمْ سَبْعَ لَيَالٍ وَثَمَانِيَةَ أَيَّامٍ حُسُومًا فَتَرَى الْقَوْمَ فِيهَا صَرْعَىٰ كَأَنَّهُمْ أَعْجَازُ نَخْلٍ خَاوِيَةٍ ۝٧

---

1. 'ఆద్ మరియు స'మూద్ జాతుల సమాచారం కొరకు చూడండి, 7 65 79

2. చూడండి, 7:78.

فَهَلْ تَرَىٰ لَهُم مِّن بَاقِيَةٍ ⑧

8. అయితే ఇప్పుడు వారిలో ఎవరైనా మిగిలి ఉన్నట్లు నీవు చూస్తున్నావా?

وَجَاءَ فِرْعَوْنُ وَمَن قَبْلَهُ وَالْمُؤْتَفِكَاتُ بِالْخَاطِئَةِ ⑨

9. ఫిర్'ఔన్ మరియు అతనికి పూర్వం గతించిన వారూ మరియు తల్లక్రిందులు చేయబడిన నగరాలవారూ,[1] అందరూ గొప్ప నేరాలకు పాల్పడిన వారే

فَعَصَوْا رَسُولَ رَبِّهِمْ فَأَخَذَهُمْ أَخْذَةً رَّابِيَةً ⑩

10. మరియు వారు తమ ప్రభువు పంపిన ప్రవక్తలకు అవిధేయత కనబరచారు, కావున ఆయన వారిని కఠినమైనపట్టుతో పట్టుకున్నాడు.

إِنَّا لَمَّا طَغَى الْمَاءُ حَمَلْنَاكُمْ فِي الْجَارِيَةِ ⑪

11. నిశ్చయంగా, ఎప్పుడైతే (నూహ్ తుఫాన్) నీరు హద్దులు లేకుండా ఉప్పొంగి పోయిందో! అప్పుడు మేము, మిమ్మల్ని[2] పయనించే (నావలో) ఎక్కించాము.

لِنَجْعَلَهَا لَكُمْ تَذْكِرَةً وَتَعِيَهَا أُذُنٌ وَاعِيَةٌ ⑫

12. దానిని, మీకొక హితబోధగానూ మరియు జ్ఞాపకముంచుకోగల చెవి, దానిని జ్ఞాపకం ఉంచుకోవటానికి అనువైనదిగా చేశాము.

فَإِذَا نُفِخَ فِي الصُّورِ نَفْخَةٌ وَاحِدَةٌ ⑬

13. ఇక ఎప్పుడైతే ఒకపెద్ద ధ్వనితో బాకా ఊదబడుతుందో![3]

وَحُمِلَتِ الْأَرْضُ وَالْجِبَالُ فَدُكَّتَا دَكَّةً وَاحِدَةً ⑭

14. మరియు భూమి మరియు పర్వతాలు పైకి ఎత్తబడి ఒక పెద్ద దెబ్బతో తుత్తునియలుగా చేయబడతాయో!

فَيَوْمَئِذٍ وَقَعَتِ الْوَاقِعَةُ ⑮

15. అప్పుడు, ఆ రోజున సంభవించ వలసిన, ఆ అనివార్య సంఘటన సంభవిస్తుంది.

وَانشَقَّتِ السَّمَاءُ فَهِيَ يَوْمَئِذٍ وَاهِيَةٌ ⑯

16. మరియు ఆ రోజున ఆకాశం బద్దలై పోతుంది మరియు దాని వ్యవస్థ

1 అంటే లూ'త్ ('అ.స.) ప్రజలు. సోదోమ్, గొమొర్రాహ్ వాసులు చూడండి, 11:69-83.

2. మిమ్మల్ని అంటే మీ పూర్వీకులను.

3 అల్-'హాఖ్ఖహ్ ఏ విధంగా సంభవిస్తుందో ఇక్కడ వివరించబడుతోంది. ఇస్రాఫీల్ ('అ.స.) పెద్ద ధ్వనితో బాకా ఊదగానే అది సంభవిస్తుంది

సడలిపోతుంది.[1]

وَالْمَلَكُ عَلَىٰ أَرْجَائِهَا ۚ وَيَحْمِلُ عَرْشَ رَبِّكَ فَوْقَهُمْ يَوْمَئِذٍ ثَمَانِيَةٌ ﴿١٧﴾

**17.** మరియు దేవదూతలు దాని ('అర్ష్) ప్రక్కలలో ఉంటారు మరియు నీ ప్రభువు యొక్క సింహాసనాన్ని ('అర్ష్‌ను), ఆ రోజు ఎనిమిదిమంది (దేవదూతలు) ఎత్తుకొని ఉంటారు

يَوْمَئِذٍ تُعْرَضُونَ لَا تَخْفَىٰ مِنكُمْ خَافِيَةٌ ﴿١٨﴾

**18.** ఆ రోజు మీరు (తీర్పుకొరకు) హాజరు చేయబడతారు మీరు దాచిన ఏ రహస్యం కూడా (ఆ రోజు) దాగి ఉండదు.[2]

فَأَمَّا مَنْ أُوتِيَ كِتَابَهُ بِيَمِينِهِ فَيَقُولُ هَاؤُمُ اقْرَءُوا كِتَابِيَهْ ﴿١٩﴾

**19.** ఇక ఎవనికైతే తన కర్మపత్రము కుడిచేతిలో ఇవ్వబడుతుందో, అతడు ఇలా అంటాడు: "ఇదిగో నాకర్మపత్రాన్ని తీసుకొని చదవండి.

إِنِّي ظَنَنتُ أَنِّي مُلَاقٍ حِسَابِيَهْ ﴿٢٠﴾

**20.** "నిశ్చయంగా, నా లెక్క నాకు తప్పకుండా లభిస్తుందని నేను భావించే వాడిని!"

فَهُوَ فِي عِيشَةٍ رَّاضِيَةٍ ﴿٢١﴾

**21.** కావున, అతడు సంతోషకరమైన జీవితం గడుపుతాడు.

فِي جَنَّةٍ عَالِيَةٍ ﴿٢٢﴾

**22.** అత్యున్నతమైన స్వర్గవనంలో;[3]

قُطُوفُهَا دَانِيَةٌ ﴿٢٣﴾

**23.** దాని పండ్లగుత్తులు, సమీపంలో వ్రేలాడుతూ ఉంటాయి.

كُلُوا وَاشْرَبُوا هَنِيئًا بِمَا أَسْلَفْتُمْ فِي الْأَيَّامِ الْخَالِيَةِ ﴿٢٤﴾

**24.** (వారితో ఇలా అనబడుతుంది) "గడిచిపోయిన దినాలలో మీరు చేసిపంపిన కర్మలకు ప్రతిఫలంగా, ఇప్పుడు మీరు హాయిగా తినండి మరియు త్రాగండి!"

---

1 అంటే దీని అర్థం ఇలా కావచ్చు: ఆకాశంలోని గ్రహాల వ్యవస్థ సడలిపోతుంది. అవి బ్రద్దలైపోయి వాటి మధ్య నున్న గురుత్వాకర్షణ శక్తి నశించిపోతుంది.

2 అంటే 'హాజరుచేయబడి, ప్రతివాని కర్మపత్రాలు అతని చేతికిచ్చి వాటి ఆధారంగా అతని తీర్పు జరుగుతుంది. ఆ తీర్పు ప్రకారం అతడు తన గమ్యస్థానానికి (స్వర్గం లేక నరకానికి) పంపబడతాడు.

3 స్వర్గాలలో ఎన్నో దరజాలు ఉన్నాయి. నూరు దరజాలున్నాయని హదీస్'లో చెప్పబడింది. దరజా అంటే వర్గం, క్రమం, శ్రేణి, కక్ష్య, లేక తరగతి.

وَأَمَّا مَنْ أُوتِيَ كِتَٰبَهُۥ بِشِمَالِهِۦ فَيَقُولُ يَٰلَيْتَنِى لَمْ أُوتَ كِتَٰبِيَهْ ۝

**25.** ఇక ఎవడికైతే, తన కర్మపత్రం ఎడమచేతికి ఇవ్వబడుతుందో, అతడు ఇలా వాపోతాడు: "అయ్యో నా పాడుగాను! నా కర్మపత్రం అసలు నాకు ఇవ్వబడకుండా ఉంటే ఎంత బాగుండేది!

وَلَمْ أَدْرِ مَا حِسَابِيَهْ ۝

**26.** "మరియు నా లెక్క ఏమిటో నాకు తెలియకుంటే ఎంత బాగుండేది!

يَٰلَيْتَهَا كَانَتِ ٱلْقَاضِيَةَ ۝

**27.** "అయ్యో, నా పాడుగాను! అది (ఆ మరణమే) నాకు అంతిమ మరణమై ఉంటే ఎంతబాగుండేది!

مَآ أَغْنَىٰ عَنِّى مَالِيَهْ ۝

**28.** "నా సంపద నాకేమీ పనికిరాలేదు:

هَلَكَ عَنِّى سُلْطَٰنِيَهْ ۝

**29.** "నా అధికారమంతా అంతమైపోయింది!"

خُذُوهُ فَغُلُّوهُ ۝

**30.** (అప్పుడు ఇలా అజ్ఞ ఇవ్వబడుతుంది): "అతన్ని పట్టుకోండి మరియు అతని మెడలో సంకెళ్ళువేయండి;[1]

ثُمَّ ٱلْجَحِيمَ صَلُّوهُ ۝

**31.** "తరువాత అతనిని భగభగమండే నరకాగ్నిలో వేయండి.

ثُمَّ فِى سِلْسِلَةٍ ذَرْعُهَا سَبْعُونَ ذِرَاعًا فَٱسْلُكُوهُ ۝

**32.** "ఆ తరువాత అతనిని డెబ్భైమూరల పొడువుగల గొలుసుతో బంధించండి!"[2]

إِنَّهُۥ كَانَ لَا يُؤْمِنُ بِٱللَّهِ ٱلْعَظِيمِ ۝

**33.** వాస్తవానికి అతడు సర్వోత్తముడైన అల్లాహ్‌ను విశ్వసించేవాడు కాదు.

وَلَا يَحُضُّ عَلَىٰ طَعَامِ ٱلْمِسْكِينِ ۝

**34.** మరియు నిరుపేదలకు ఆహారం పెట్టమని ప్రోత్సహించేవాడు కాదు.

فَلَيْسَ لَهُ ٱلْيَوْمَ هَٰهُنَا حَمِيمٌ ۝

**35.** కావున, ఈ నాడు అతనికి ఇక్కడ ఏ స్నేహితుడూ లేడు;

وَلَا طَعَامٌ إِلَّا مِنْ غِسْلِينٍ ۝

**36.** మరియు అసహ్యకరమైన గాయాల

---

1. 'గుల్లూహును' అతనికి సంకెళ్ళు వేయండి. చూడండి, 13:5, 34:33, 36:8, 40:71
2. చూడండి, 14:49

కడుగు తప్ప, మరొక ఆహారమూ లేదు!

لَّا يَأْكُلُهُۥٓ إِلَّا ٱلْخَٰطِـُٔونَ ﴿٣٧﴾

**37.** దానిని పాపులు తప్ప మరెవ్వరూ తినరు!

فَلَآ أُقْسِمُ بِمَا تُبْصِرُونَ ﴿٣٨﴾

**38.** కావున, నేను మీరు చూడగలిగే వాటి శపథం చేస్తున్నాను;

وَمَا لَا تُبْصِرُونَ ﴿٣٩﴾

**39.** మరియు మీరు చూడలేనట్టి వాటి (శపథం) కూడా!

إِنَّهُۥ لَقَوْلُ رَسُولٍ كَرِيمٍ ﴿٤٠﴾

**40.** నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) గౌరవనీయుడైన సందేశహరుని (పై అవతరింపజేయబడిన) వాక్కు.

وَمَا هُوَ بِقَوْلِ شَاعِرٍ ۚ قَلِيلًا مَّا تُؤْمِنُونَ ﴿٤١﴾

**41.** మరియు ఇది ఒక కవి యొక్కవాక్కు కాదు. మీరు విశ్వసించేది చాలా తక్కువ.

وَلَا بِقَوْلِ كَاهِنٍ ۚ قَلِيلًا مَّا تَذَكَّرُونَ ﴿٤٢﴾

**42.** మరియు ఇది ఏ జ్యోతిష్కుని వాక్కు కూడాకాదు! మీరు గ్రహించేది చాలాతక్కువ.

تَنزِيلٌ مِّن رَّبِّ ٱلْعَٰلَمِينَ ﴿٤٣﴾

**43.** ఇది సర్వలోకాల ప్రభువు తరఫు నుండి అవతరించింది.

وَلَوْ تَقَوَّلَ عَلَيْنَا بَعْضَ ٱلْأَقَاوِيلِ ﴿٤٤﴾

**44.** ఒక వేళ ఇతను (ఈ ప్రవక్త), మా (అల్లాహ్‌ను) గురించి ఏదైనా అబద్ధపుమాట కల్పించి ఉంటే!

لَأَخَذْنَا مِنْهُ بِٱلْيَمِينِ ﴿٤٥﴾

**45.** మేము అతని కుడిచేతిని పట్టుకునే వారం.

ثُمَّ لَقَطَعْنَا مِنْهُ ٱلْوَتِينَ ﴿٤٦﴾

**46.** తరువాత అతని (మెడ) రక్తనాళాన్ని కోసేవారం

فَمَا مِنكُم مِّنْ أَحَدٍ عَنْهُ حَٰجِزِينَ ﴿٤٧﴾

**47.** అప్పుడు మీలోనుండి ఏ ఒక్కడు కూడా అతనిని (మా శిక్షనుండి) కాపాడలేక పోయేవాడు.

وَإِنَّهُۥ لَتَذْكِرَةٌ لِّلْمُتَّقِينَ ﴿٤٨﴾

**48.** మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) దైవభీతి గలవారికొక హితోపదేశం.

وَإِنَّا لَنَعْلَمُ أَنَّ مِنكُم مُّكَذِّبِينَ ﴿٤٩﴾

**49.** మరియు నిశ్చయంగా మీలో కొందరు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) అసత్యమని అనేవారు ఉన్నారని మాకు బాగా తెలుసు.

وَإِنَّهُ لَحَسْرَةٌ عَلَى الْكَافِرِينَ ﴿٥٠﴾

**50.** మరియు నిశ్చయంగా, ఇది (ఈ తిరస్కారం) సత్యతిరస్కారులకు దుఃఖకారణ మవుతుంది.

وَإِنَّهُ لَحَقُّ الْيَقِينِ ﴿٥١﴾

**51.** మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) నమ్మదగిన సత్యం.

فَسَبِّحْ بِاسْمِ رَبِّكَ الْعَظِيمِ ﴿٥٢﴾

**52.** కావున నీవు సర్వోత్తముడైన నీ ప్రభువు పవిత్ర నామాన్ని స్తుతించు.



## 70. సూరహ్ అల్-మ'ఆరిజ్

## سورة المعارج

అల్ మ'ఆరిజ్: The Ways of Ascent, అధిరోహణ, ఊర్ధ్వగమన, ఆరోహణ, లేక పైకి వెళ్ళే మార్గాలు ఈ సూరహ్ పేరు **3**వ **ఆయత్** నుండి తీసుకోబడింది ఇది మధ్య మక్కా కాలపు సూరహ్ ఇందులో **44** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

**1.** ప్రశ్నించేవాడు,[1] ఆ అనివార్యమైన శిక్షను గురించి ప్రశ్నించాడు;

**2.** సత్యతిరస్కారులకు ఉన్న (విధించబడే) దాని గురించి: దానిని ఎవ్వడూ తొలగించలేడు.

**3.** అది ఆరోహణా మార్గాలకు యజమానుడైన అల్లాహ్ తరఫునుండి వస్తుంది.[2]

**4.** యాభైవేల సంవత్సరాలకు సమానమైన (ప్రమాణంగల) ఒకరోజులో,[3] దేవదూతలు మరియు ఆత్మ(జిబ్రీల్)[4] ఆయన వద్దకు అధిరోహిస్తారు.

**5.** కావున (ఓ ము'హమ్మద్!) నీవు సహనంవహించు, ఉత్తమమైన సహనంతో!

**6.** వాస్తవానికి, వారు (ప్రజలు) అది (ఆ దినం) దూరంగా ఉందని అనుకుంటున్నారు.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

سَأَلَ سَائِلٌ بِعَذَابٍ وَاقِعٍ ۝١

لِّلْكَافِرِينَ لَيْسَ لَهُ دَافِعٌ ۝٢

مِّنَ اللَّهِ ذِي الْمَعَارِجِ ۝٣

تَعْرُجُ الْمَلَائِكَةُ وَالرُّوحُ إِلَيْهِ فِي يَوْمٍ كَانَ مِقْدَارُهُ خَمْسِينَ أَلْفَ سَنَةٍ ۝٤

فَاصْبِرْ صَبْرًا جَمِيلًا ۝٥

إِنَّهُمْ يَرَوْنَهُ بَعِيدًا ۝٦

---

1 ఈ ప్రశ్నించే, సత్యతిరస్కారి న'దర్ బిన్ 'హారిస్' లేక అబూజహల్ కావచ్చని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు చూడండి, 8:32 అతడు బద్ర్ యుద్ధంలో చంపబడ్డాడు

2 చూడండి, 76 3

3 చూడండి, 22:47 అక్కడ నీ ప్రభువు దృష్టిలో ఒక దినము మీరు లెక్కించే వేయి సంవత్సరాలకు సమానము ఇంకా చూడండి, 32 5 అల్లాహ్ (సు.తా.) అనంతుడు, అపారుడు, అంతులేనివాడు, కాలపరిమితికి అతీతుడు పరలోక జీవితంలో మానవునికి కూడా కాలమనే దానికి ఎలాంటి అర్థం ఉండదు.

4 రూ'హ్ దీనిని ఇక్కడ కొందరు వ్యాఖ్యాతలు జిబ్రీల్ ('అ.స.) అన్నారు మరికొందరు మానవుల ఆత్మలన్నారు. చూడండి, 19:17 వ్యాఖ్యానం 3

وَّنَرٰىهُ قَرِيْبًا ۝

**7.** కాని మాకది అతిదగ్గరలో కనిపిస్తోంది.

يَوْمَ تَكُوْنُ السَّمَآءُ كَالْمُهْلِ ۝

**8.** ఆ రోజు ఆకాశం మరిగే సీసం (నూనె)వలే అయిపోతుంది.

وَتَكُوْنُ الْجِبَالُ كَالْعِهْنِ ۝

**9.** మరియు కొండలు ఏకిన ఉన్నివలె అయిపోతాయి.[1]

وَلَا يَسْـَٔلُ حَمِيْمٌ حَمِيْمًا ۝

**10.** మరియు ప్రాణస్నేహితుడు కూడా తన స్నేహితుని (క్షేమాన్ని) అడగడు.

يُّبَصَّرُوْنَهُمْ ۗ يَوَدُّ الْمُجْرِمُ لَوْ يَفْتَدِيْ مِنْ
عَذَابِ يَوْمِىٕذٍۭ بِبَنِيْهِ ۝

**11.** వారు ఒకరినొకరు చూసుకుంటూ ఉంటారు. ఆ రోజు అపరాధి తన సంతానాన్ని పరిహారంగా ఇచ్చి అయినా శిక్షనుండి తప్పించుకో గోరుతాడు;

وَصَاحِبَتِهٖ وَاَخِيْهِ ۝

**12.** మరియు తన సహవాసిని మరియు తన సోదరుణ్ణి;

وَفَصِيْلَتِهِ الَّتِيْ تُـْٔوِيْهِ ۝

**13.** మరియు తనకు ఆశ్రయమిచ్చిన దగ్గరి బంధువులను;

وَمَنْ فِي الْاَرْضِ جَمِيْعًا ۙ ثُمَّ يُنْجِيْهِ ۝

**14.** మరియు భూమిలో ఉన్న వారి నందరినీ కూడా ఇచ్చి అయినా, తాను విముక్తి పొందాలని కోరుతాడు.

كَلَّا ۗ اِنَّهَا لَظٰى ۝

**15.** కాని అలా కానేరదు! నిశ్చయంగా, ఆ మండే అగ్నిజ్వాల (అతని కొరకు వేచి ఉంటుంది)!

نَزَّاعَةً لِّلشَّوٰى ۝

**16.** అది అతని చర్మాన్ని పూర్తిగా వలచి కాల్చివేస్తుంది.

تَدْعُوْا مَنْ اَدْبَرَ وَتَوَلّٰى ۝

**17.** అది (సత్యం నుండి) వెనుదిరిగి మరియు వెన్నుచూపి, పోయేవారిని (అందరినీ) పిలుస్తుంది.

وَجَمَعَ فَاَوْعٰى ۝

**18.** మరియు (ధనాన్ని) కూడబెట్టి, దానిని

---

1. చూడండి, 101:5 ఇటువంటి ఆయత్‌కు

దాచే వారిని. (3/8)

**19.** * నిశ్చయంగా మానవుడు ఆత్రగాడుగా (తొందరపడే వాడిగా) సృష్టించబడ్డాడు;

إِنَّ الْإِنسَانَ خُلِقَ هَلُوعًا ﴿١٩﴾

**20.** తనకు కీడు కలిగినప్పుడు వాడు ఆందోళన చెందుతాడు;

إِذَا مَسَّهُ الشَّرُّ جَزُوعًا ﴿٢٠﴾

**21.** మరియు తనకు మేలు కలిగినపుడు స్వార్థపరుడిగా ప్రవర్తిస్తాడు.

وَإِذَا مَسَّهُ الْخَيْرُ مَنُوعًا ﴿٢١﴾

**22.** నమా'జ్‌ను ఖచ్చితంగా పాటించే వారు తప్ప!

إِلَّا الْمُصَلِّينَ ﴿٢٢﴾

**23.** ఎవరైతే తమ నమా'జ్‌ను సదా నియమంతో పాటిస్తారో;

الَّذِينَ هُمْ عَلَىٰ صَلَاتِهِمْ دَائِمُونَ ﴿٢٣﴾

**24.** మరియు అలాంటి వారు, ఎవరైతే తమ సంపదలలో (ఇతరులకు) ఉన్న హక్కును సమ్మతిస్తారో![1]

وَالَّذِينَ فِي أَمْوَالِهِمْ حَقٌّ مَّعْلُومٌ ﴿٢٤﴾

**25.** యాచకులకు మరియు లేమికి గురి అయిన వారికి;[2]

لِّلسَّائِلِ وَالْمَحْرُومِ ﴿٢٥﴾

**26.** మరియు అలాంటి వారికి, ఎవరైతే తీర్పుదినాన్ని సత్యమని నమ్ముతారో;

وَالَّذِينَ يُصَدِّقُونَ بِيَوْمِ الدِّينِ ﴿٢٦﴾

**27.** మరియు ఎవరైతే తమ ప్రభువు శిక్షకు భయపడుతారో!

وَالَّذِينَ هُم مِّنْ عَذَابِ رَبِّهِم مُّشْفِقُونَ ﴿٢٧﴾

**28.** నిశ్చయంగా, వారి ప్రభువు యొక్క ఆ శిక్ష; దాని పట్ల ఎవ్వరూ నిర్భయంగా ఉండలేరు!

إِنَّ عَذَابَ رَبِّهِمْ غَيْرُ مَأْمُونٍ ﴿٢٨﴾

**29.** మరియు ఎవరైతే, తమ మర్మాంగాలను కాపాడుకుంటారో!

وَالَّذِينَ هُمْ لِفُرُوجِهِمْ حَافِظُونَ ﴿٢٩﴾

**30.** తమ భార్యలు (అ'జ్వాజ్), లేదా

إِلَّا عَلَىٰ أَزْوَاجِهِمْ أَوْ مَا مَلَكَتْ أَيْمَانُهُمْ

---

**1.** అంటే, 'జకాత్ మరియు ఇతర దానధర్మాలు చేసేవారు.

**2.** ఇటువంటి ఆయత్‌కై చూడండి, 51:19

ధర్మసమ్మతంగా తమ అధీనంలో ఉన్న (బానిస) స్త్రీలతో తప్ప[1] అలాంటప్పుడు వారు నిందార్హులు కారు.

فَإِنَّهُمْ غَيْرُ مَلُومِينَ ٣٠

**31.** కాని ఎవరైతే వీటినిమించి పోగోరుతారో, అలాంటి వారే మితిమీరి పోయేవారు.

فَمَنِ ابْتَغَىٰ وَرَاءَ ذَٰلِكَ فَأُولَٰئِكَ هُمُ الْعَادُونَ ٣١

**32.** మరియు ఎవరైతే తమ అమానతులను మరియు తమ వాగ్దానాలను కాపాడుకుంటారో;

وَالَّذِينَ هُمْ لِأَمَانَاتِهِمْ وَعَهْدِهِمْ رَاعُونَ ٣٢

**33.** మరియు ఎవరైతే తమ సాక్ష్యాల మీద స్థిరంగా ఉంటారో;

وَالَّذِينَ هُم بِشَهَادَاتِهِمْ قَائِمُونَ ٣٣

**34.** మరియు ఎవరైతే తమ నమాజులను కాపాడుకుంటారో;

وَالَّذِينَ هُمْ عَلَىٰ صَلَاتِهِمْ يُحَافِظُونَ ٣٤

**35.** ఇలాంటి వారంతా సగౌరవంగా స్వర్గవనాలలో ఉంటారు.

أُولَٰئِكَ فِي جَنَّاتٍ مُّكْرَمُونَ ٣٥

**36.** ఈ సత్యతిరస్కారులకు ఏమయ్యింది? వీ రెందుకు హడావిడిగా, నీ ముందు ఇటూ అటూ తిరుగుతున్నారు?

فَمَالِ الَّذِينَ كَفَرُوا قِبَلَكَ مُهْطِعِينَ ٣٦

**37.** కుడి ప్రక్కనుండి మరియు ఎడమ ప్రక్కనుండి గుంపులుగా;[2]

عَنِ الْيَمِينِ وَعَنِ الشِّمَالِ عِزِينَ ٣٧

**38.** ఏమీ? వారిలో ప్రతిఒక్కడూ, తాను పరమ సుఖాలుగల స్వర్గవనంలో ప్రవేశింప జేయబడతానని ఆశిస్తున్నాడా?

أَيَطْمَعُ كُلُّ امْرِئٍ مِّنْهُمْ أَن يُدْخَلَ جَنَّةَ نَعِيمٍ ٣٨

**39.** అలా కానేరదు! నిశ్చయంగా, మేము వారిని దేనితో పుట్టించామో వారికి బాగా తెలుసు!

كَلَّا إِنَّا خَلَقْنَاهُم مِّمَّا يَعْلَمُونَ ٣٩

---

1 ధర్మయుద్ధం (జిహాద్)లో ఖైదీలుగా పట్టుబడ్డవారే బానిసలు. కనుక ఈ కాలంలో, ఇస్లాం నిర్దేశం ప్రకారం, బానిసలు అనబడేవారు అసలు లేరు ఇంకా చూడండి, 23:5 7, 4:3

2 దైవప్రవక్త ('స'అస) కాలంలో సత్యతిరస్కారులు అతని సమావేశాలలో వచ్చేవారు కాని అతని మాటలు విని, వాటిని ఆచరించక ఎగతాళి చేస్తూ గుంపులుగా వెళ్ళిపోయే వారు మీరు (విశ్వాసులు) కాదు మేమే స్వర్గంలోకి ప్రవేశిస్తాము, అని అనేవారు

**40.** కావున! నేను తూర్పుల మరియు పడమరల ప్రభువు శపథంచేసి చెబుతున్నాను.[1] నిశ్చయంగా, మేము అలా చేయగల సమర్థులము;

فَلَآ أُقْسِمُ بِرَبِّ ٱلْمَشَٰرِقِ وَٱلْمَغَٰرِبِ إِنَّا لَقَٰدِرُونَ ٤٠

**41.** వారికి బదులుగా వారికంటే ఉత్తమమైన వారిని వారి స్థానంలో తీసుకు రావటానికి; మరియు మమ్మల్ని మించిపోయే వారు ఎవ్వరూ లేరు.

عَلَىٰٓ أَن نُّبَدِّلَ خَيْرًا مِّنْهُمْ وَمَا نَحْنُ بِمَسْبُوقِينَ ٤١

**42.** కావున వారిని - వారితో వాగ్దానం చేయబడిన ఆ దినానికి చేరేవరకు వ్యర్థపు మాటలలో మరియు విలాస వినోదాల్లో విడిచిపెట్టు.

فَذَرْهُمْ يَخُوضُوا۟ وَيَلْعَبُوا۟ حَتَّىٰ يُلَٰقُوا۟ يَوْمَهُمُ ٱلَّذِى يُوعَدُونَ ٤٢

**43.** ఆ రోజు వారు తమ సమాధులనుండి లేచి, తమ గమ్యస్థానాలకు చేరుకోవటానికి తొందరపడుతూ వేగంగా బయటికి వస్తారు.

يَوْمَ يَخْرُجُونَ مِنَ ٱلْأَجْدَاثِ سِرَاعًا كَأَنَّهُمْ إِلَىٰ نُصُبٍ يُوفِضُونَ ٤٣

**44.** వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి, అవమానం వారిని క్రమ్ముకొని ఉంటుంది. అదే వారికి వాగ్దానం చేయబడిన దినం!

خَٰشِعَةً أَبْصَٰرُهُمْ تَرْهَقُهُمْ ذِلَّةٌ ۚ ذَٰلِكَ ٱلْيَوْمُ ٱلَّذِى كَانُوا۟ يُوعَدُونَ ٤٤

---

1 చూడండి, 37:5 మరియు 55:17 తూర్పులూ మరియు పడమరలూ అంటే ఒక సంవత్సరపు కాలంలో ప్రతి రోజు సూర్యుడు ఒక కొత్త స్థానం నుండి ఉదయిస్తాడు మరియు ఒక కొత్త స్థానంలో అస్తమిస్తాడు. మరొక వ్యాఖ్యాన మేమిటంటే భూగోళంలోని విభిన్న భాగాలలో సూర్యుడు వేర్వేరు సమయాలలో వరుసగా ఉదయిస్తూ, అస్తమిస్తూ ఉంటాడు

## 71 సూరహ్ నూ'హ్

## سُورَةُ نُوحٍ

ఖుర్ఆన్‌లో నూ'హ్ 'అ.స. (Noah) ప్రస్తావన ఎన్నో సార్లు వచ్చింది. ఈ సూరహ్ మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. చూడండి, 11:25. దీని పేరు మొదటి ఆయత్‌లో ఉంది. ఇందులో 28 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِنَّا أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِ أَنْ أَنذِرْ قَوْمَكَ مِن قَبْلِ أَن يَأْتِيَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿١﴾

**1.** నిశ్చయంగా, మేము నూ'హ్‌ను, అతని జాతివారి వద్దకు: "వారిపై బాధాకరమైన శిక్ష రాకముందే వారిని హెచ్చరించు!" అని (ఆజ్ఞాపించి) పంపాము.

قَالَ يَا قَوْمِ إِنِّي لَكُمْ نَذِيرٌ مُّبِينٌ ﴿٢﴾

**2.** అతను వారితో ఇలా అన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! నిశ్చయంగా, నేను మీకు స్పష్టంగా హెచ్చరిక చేయటానికి వచ్చిన వాడిని!

أَنِ اعْبُدُوا اللَّهَ وَاتَّقُوهُ وَأَطِيعُونِ ﴿٣﴾

**3.** "కావున మీరు అల్లాహ్‌నే ఆరాధించండి మరియు ఆయనయందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

يَغْفِرْ لَكُم مِّن ذُنُوبِكُمْ وَيُؤَخِّرْكُمْ إِلَىٰ أَجَلٍ مُّسَمًّى ۚ إِنَّ أَجَلَ اللَّهِ إِذَا جَاءَ لَا يُؤَخَّرُ ۖ لَوْ كُنتُمْ تَعْلَمُونَ ﴿٤﴾

**4.** "అలా చేస్తే ఆయన మీ పాపాలను క్షమిస్తాడు. మరియు ఒక నియమిత కాలం వరకు మిమ్మల్ని వదలిపెడ్తాడు. నిశ్చయంగా అల్లాహ్ నిర్ణయించిన కాలం వచ్చినపుడు, దానిని తప్పించటం సాధ్యంకాదు. ఇది మీరు తెలుసుకుంటే ఎంత బాగుండేది!"

قَالَ رَبِّ إِنِّي دَعَوْتُ قَوْمِي لَيْلًا وَنَهَارًا ﴿٥﴾

**5.** అతను ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నేను నాజాతి వారిని రేయింబవళ్ళు పిలిచాను;

فَلَمْ يَزِدْهُمْ دُعَائِي إِلَّا فِرَارًا ﴿٦﴾

**6** "కాని, నా పిలుపు, వారి పలాయనాన్ని మాత్రమే హెచ్చించింది.

وَإِنِّي كُلَّمَا دَعَوْتُهُمْ لِتَغْفِرَ لَهُمْ جَعَلُوا أَصَابِعَهُمْ

**7.** "మరియు వాస్తవానికి, నేను వారిని, నీ

فِيْٓ اٰذَانِهِمْ وَاسْتَغْشَوْا ثِيَابَهُمْ وَاَصَرُّوْا وَاسْتَكْبَرُوا اسْتِكْبَارًا ۚ

క్షమాభిక్ష వైపునకు పిలిచినప్పుడల్లా, వారు తమ చెవులలో వ్రేళ్ళు దూర్చుకునేవారు మరియు తమ వస్త్రాలను తమపై కప్పుకునేవారు మరియు వారు మొండి వైఖరి అవలంబిస్తూ దురహంకారంలో మునిగి ఉండేవారు.

ثُمَّ اِنِّيْ دَعَوْتُهُمْ جِهَارًا ۙ

8. "తరువాత వాస్తవానికి నేను వారిని ఎలుగెత్తి పిలిచాను.

ثُمَّ اِنِّيْٓ اَعْلَنْتُ لَهُمْ وَاَسْرَرْتُ لَهُمْ اِسْرَارًا ۙ

9. "ఆ తరువాత వాస్తవంగా, నేను వారికి బహిరంగంగా చాటి చెప్పాను మరియు ఏకాంతంలో, రహస్యంగా కూడా పిలిచాను.

فَقُلْتُ اسْتَغْفِرُوْا رَبَّكُمْ ۭ اِنَّهٗ كَانَ غَفَّارًا ۙ

10. "ఇంకా వారితో ఇలా అన్నాను: 'మీ ప్రభువును క్షమాపణకై వేడుకోండి, నిశ్చయంగా ఆయన ఎంతో క్షమాశీలుడు!

يُّرْسِلِ السَّمَاۗءَ عَلَيْكُمْ مِّدْرَارًا ۙ

11. 'ఆయన మీపై ఆకాశం నుండి ధారాళంగా వర్షాన్ని కురిపింపజేస్తాడు.[1]

وَّيُمْدِدْكُمْ بِاَمْوَالٍ وَّبَنِيْنَ وَيَجْعَلْ لَّكُمْ جَنّٰتٍ وَّيَجْعَلْ لَّكُمْ اَنْهٰرًا ۭ

12. 'మరియు మీకు ధన సంపదలలోను మరియు సంతానంలోను వృద్ధినొసంగుతాడు మరియు మీకొరకు తోటలను ఉత్పత్తిచేస్తాడు మరియు నదులను ప్రవహింపజేస్తాడు.' "

مَا لَكُمْ لَا تَرْجُوْنَ لِلّٰهِ وَقَارًا ۚ

13. మీకేమయింది? మీరు అల్లాహ్ మహత్త్వమును ఎందుకు ఆదరించరు?[2]

وَقَدْ خَلَقَكُمْ اَطْوَارًا

14. మరియు వాస్తవానికి ఆయనే, మిమ్మల్ని విభిన్న దశలలో సృష్టించాడు.[3]

اَلَمْ تَرَوْا كَيْفَ خَلَقَ اللّٰهُ سَبْعَ سَمٰوٰتٍ طِبَاقًا ۙ

15. ఏమీ? మీరు చూడటం లేదా? అల్లాహ్ ఏడు ఆకాశాలను ఏ విధంగా అంతస్తులలో

---

1 ఈ ఆయత్ ఆధారంగా కొందరు విద్వాంసులు ఈ సూరహ్‌ను వర్షం కొరకు చేసే నమా'జ్‌లో చదువటం ముస్త'హబ్ అని అంటారు. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 11:52

2. వఖారున్: అంటే మహత్త్వం, ప్రభావం, ప్రతాపం, ఘనత.
రజా: అంటే లక్ష్య పెట్టు, ఆదరించు భయపడు.

3. చూడండి, 22:5, 23:14 మొదలైనవి.

సృష్టించాడో![1]

16. మరియు వాటి మధ్య చంద్రుణ్ణి (ప్రతిబింబించే) కాంతిగాను మరియు సూర్యుణ్ణి (వెలిగే) దీపంగాను చేశాడు![2]

وَّجَعَلَ الْقَمَرَ فِيهِنَّ نُورًا وَّجَعَلَ الشَّمْسَ سِرَاجًا ۝

17. మరియు అల్లాహ్ యే మిమ్మల్ని భూమి(మట్టి)నుండి[3] ఉత్పత్తి చేశాడు!

وَاللَّهُ أَنْبَتَكُمْ مِّنَ الْأَرْضِ نَبَاتًا ۝

18. తరువాత ఆయన మిమ్మల్ని అందులోకే తీసుకొనిపోతాడు మరియు మిమ్మల్ని దానినుండి (బ్రతికించి) బయటికి తీస్తాడు!

ثُمَّ يُعِيدُكُمْ فِيهَا وَيُخْرِجُكُمْ إِخْرَاجًا ۝

19. మరియు అల్లాహ్ యే మీ కొరకు భూమిని విస్తరింపజేశాడు.

وَاللَّهُ جَعَلَ لَكُمُ الْأَرْضَ بِسَاطًا ۝

20. మీరు దానిపై నున్న విశాలమైన మార్గాలలో నడవటానికి.

لِّتَسْلُكُوا مِنْهَا سُبُلًا فِجَاجًا ۝

21. నూ'హ్ ఇంకా ఇలా విన్నవించుకున్నాడు: "ఓ నా ప్రభూ! వాస్తవానికి వారు నా మాటను ధిక్కరించారు. మరియు వాడిని అనుసరించారు, ఎవడి సంపద మరియు సంతానం వారికి కేవలం నష్టం తప్ప మరేమి అధికం చేయదో!

قَالَ نُوحٌ رَّبِّ إِنَّهُمْ عَصَوْنِي وَاتَّبَعُوا مَن لَّمْ يَزِدْهُ مَالُهُ وَوَلَدُهُ إِلَّا خَسَارًا ۝

22. "మరియు వారు పెద్దకుట్ర పన్నారు.[4]

وَمَكَرُوا مَكْرًا كُبَّارًا ۝

23. "మరియు వారు ఒకరితోనొకరు ఇలా అనుకున్నారు: 'మీరు మీ ఆరాధ్య దైవాలను విడిచిపెట్టకండి. వద్ద్ మరియు సువా'అ, య'గూస్', య'ఊఖ్ మరియు నస్రలను విడిచిపెట్టకండి!'

وَقَالُوا لَا تَذَرُنَّ آلِهَتَكُمْ وَلَا تَذَرُنَّ وَدًّا وَلَا سُوَاعًا وَلَا يَغُوثَ وَيَعُوقَ وَنَسْرًا ۝

24. "మరియు వాస్తవానికి, వారు చాలా

وَقَدْ أَضَلُّوا كَثِيرًا ۖ وَلَا تَزِدِ الظَّالِمِينَ

1. చూడండి, 67:3
2. చూడండి, 10:5
3. అంటే భూమిలో ఉన్న మూల పదార్థాలనుండి
4. నూ'హ్ ('అ.స.)ను చంపటానికి కుట్రపన్నారని కొందరి అభిప్రాయం

إِلَّا ضَلَٰلًا ۝٢٤

మందిని తప్పుదారిలో పడవేశారు. కావున (ఓ నా ప్రభూ!): "నీవు కూడా ఈ దుర్మార్గులకు కేవలం వారి మార్గభ్రష్టత్వాన్నే హెచ్చించు!"

مِّمَّا خَطِيٓـَٔـٰتِهِمْ أُغْرِقُوا۟ فَأُدْخِلُوا۟ نَارًا فَلَمْ يَجِدُوا۟ لَهُم مِّن دُونِ ٱللَّهِ أَنصَارًا ۝٢٥

**25.** వారు తమ పాపాల కారణంగా ముంచివేయబడ్డారు మరియు నరకాగ్నిలోకి త్రోయబడ్డారు, కావున వారు అల్లాహ్ తప్ప తమను కాపాడే వారినెవ్వరినీ పొందలేక పోయారు.

وَقَالَ نُوحٌ رَّبِّ لَا تَذَرْ عَلَى ٱلْأَرْضِ مِنَ ٱلْكَٰفِرِينَ دَيَّارًا ۝٢٦

**26.** మరియు నూ'హ్ ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ. సత్యతిరస్కారులలో ఒక్కరిని కూడా భూమి మీద వదలకు.

إِنَّكَ إِن تَذَرْهُمْ يُضِلُّوا۟ عِبَادَكَ وَلَا يَلِدُوٓا۟ إِلَّا فَاجِرًا كَفَّارًا ۝٢٧

**27.** "ఒకవేళ నీవు వారిని వదలిపెడితే, నిశ్చయంగా, వారు నీ దాసులను మార్గభ్రష్టత్వంలో పడవేస్తారు మరియు వారు పాపులను మరియు కృతఘ్నులను మాత్రమే పుట్టిస్తారు.

رَّبِّ ٱغْفِرْ لِى وَلِوَٰلِدَىَّ وَلِمَن دَخَلَ بَيْتِىَ مُؤْمِنًا وَلِلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ وَلَا تَزِدِ ٱلظَّٰلِمِينَ إِلَّا تَبَارًۢا ۝٢٨

**28.** "ఓ నా ప్రభూ! నన్నూ, నా తల్లిదండ్రులను మరియు విశ్వాసిగా నా ఇంటిలోనికి ప్రవేశించే వానిని మరియు విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను, అందరినీ క్షమించు. మరియు దుర్మార్గులకు వినాశం తప్ప మరేమీ అధికంచేయకు!" (1,2)

---

1. చూడండి, 11:36.

## 72. సూరహ్ అల్-జిన్న్

## سورة الجن

ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది చివరి మక్కా కాలంలో అవతరింపజేయబడింది దాదాపు ప్రస్థానం (హి'జ్రత్)కు రెండు సంవత్సరాలకు ముందు మక్కావారు తిరస్కరించినందుకు దైవప్రవక్త ('స'అస) ధర్మప్రచారం చేయటానికి 'తాయఫ్‌కు వెళ్ళారు కాని 'తాయఫ్ వాసులు అతనిని అవమానిస్తారు అప్పుడు దైవప్రవక్త ('స'అస) అల్లాహ్(సు.తా.)ను ప్రార్థిస్తారు దాదాపు రెండు నెలల తరువాత యస్'రిబ్ (మదీనా) నుండి కొందరు వచ్చి ఇస్లాం స్వీకరిస్తారు వారు దైవప్రవక్త ('స'అస)ను మదీనాకు రమ్మని ఆహ్వానిస్తారు ఇందులో **28 ఆయతులు** ఉన్నాయి

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ○

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قُلْ أُوحِيَ إِلَيَّ أَنَّهُ اسْتَمَعَ نَفَرٌ مِّنَ الْجِنِّ فَقَالُوا إِنَّا سَمِعْنَا قُرْآنًا عَجَبًا ①

**1.** * (ఓ ప్రవక్తా!) ఇలా అను: "నాకు ఈ విధంగా దివ్యసందేశం పంపబడింది; నిశ్చయంగా ఒక జిన్నాతుల సమూహం,[1] దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) విని, తమ జాతివారితో ఇలా అన్నారు: 'వాస్తవానికి మేము ఒక అద్భుతమైన వచనాన్ని (ఖుర్ఆన్‌ను) విన్నాము!

يَهْدِي إِلَى الرُّشْدِ فَآمَنَّا بِهِ ۖ وَلَن نُّشْرِكَ بِرَبِّنَا أَحَدًا ②

**2.** " 'అది సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తుంది. కావున మేము దానిని విశ్వసించాము.[2] మరియు మేము మా ప్రభువుకు ఎవ్వడిని కూడా భాగస్వామిగా సాటి కల్పించము.

وَأَنَّهُ تَعَالَىٰ جَدُّ رَبِّنَا مَا اتَّخَذَ صَاحِبَةً

**3.** " 'మరియు నిశ్చయంగా, మా ప్రభువు వైభవం ఎంతో ఉన్నతమైనది. ఆయన ఎవ్వడినీ

---

1 నఫరున్ అంటే 3నుండి 10 వరకు ఉండే సంఖ్యల సమూహం నఖ్‌లా లోయలో దైవప్రవక్త ('స'అస) తమ అనుచరు(ర'ది.'అన్హుమ్)లతో సహా ఫజ్ర్ నమా'జ్ చేస్తుండగా అక్కడి నుండి కొందరు జిన్నాతులు పోతూ వారి ఖుర్ఆన్ విని ప్రభావితులయి విశ్వసిస్తారు ఈ విషయం 46:29లో వచ్చింది జిన్నాతులు ఖుర్ఆన్ విన్నది దైవప్రవక్త ('స'అస)కు తెలియదు అది వ'హీ ద్వారా తెలుపబడిందని ఇక్కడ పేర్కొనబడింది.

2 ఖుర్ఆన్‌ను వినగానే జిన్నాతులు విశ్వసించారు. కాని మానవులు మాత్రం దానిని మళ్ళీమళ్ళీ వినికూడా విశ్వసించటం లేదు.

وَّلَا وَلَدًا ۝

భార్య(సాహిబతున్)గా గానీ, కుమారునిగా గానీ చేసుకోలేదు.

وَّاَنَّهٗ كَانَ يَقُوْلُ سَفِيْهُنَا عَلَى اللّٰهِ شَطَطًا ۝

4. " 'మరియు నిశ్చయంగా, మనలోని అవివేకులు, కొందరు అల్లాహ్ విషయంలో దారుణమైన మాటలు పలుకుతున్నారు

وَّاَنَّا ظَنَنَّآ اَنْ لَّنْ تَقُوْلَ الْاِنْسُ وَالْجِنُّ عَلَى اللّٰهِ كَذِبًا ۝

5. " 'మరియు వాస్తవానికి, మనం మానవులు గానీ, జిన్నాతులు గానీ అల్లాహ్‌ను గురించి అబద్ధం పలకరని భావించేవారము

وَّاَنَّهٗ كَانَ رِجَالٌ مِّنَ الْاِنْسِ يَعُوْذُوْنَ بِرِجَالٍ مِّنَ الْجِنِّ فَزَادُوْهُمْ رَهَقًا ۝

6. " 'మరియు వాస్తవానికి, మానవులలో నుండి కొందరు పురుషులు, జిన్నాతులలో నుండి కొందరు పురుషుల శరణువేడుతూ ఉండేవారు ఈ విధంగా వారు, వారి (జిన్నాతుల) తలబిరుసుతనం మరింత అధికమే చేసేవారు[1]

وَّاَنَّهُمْ ظَنُّوْا كَمَا ظَنَنْتُمْ اَنْ لَّنْ يَّبْعَثَ اللّٰهُ اَحَدًا ۝

7. " 'మరియు వాస్తవానికి, వారు (మానవులు) కూడా మీరు (జిన్నాతులు) భావించినట్లు, అల్లాహ్ ఎవ్వడినీ కూడా సందేశహరునిగా పంపడని భావించారు.

وَّاَنَّا لَمَسْنَا السَّمَآءَ فَوَجَدْنٰهَا مُلِئَتْ حَرَسًا شَدِيْدًا وَّشُهُبًا ۝

8. " 'మరియు నిశ్చయంగా, మేము ఆకాశాలలో (రహస్యాలను) తొంగి చూడటానికి ప్రయత్నించినపుడు, మేము దానిని కఠినమైన కావలివారితో మరియు అగ్నిజ్వాలలతో నిండి ఉండటాన్ని చూశాము.[2]

وَّاَنَّا كُنَّا نَقْعُدُ مِنْهَا مَقَاعِدَ لِلسَّمْعِ ۭ فَمَنْ

9. " 'మరియు వాస్తవానికి పూర్వం అక్కడి

---

1 చివరి వాక్యానికి కొందరు వ్యాఖ్యాతలు ఈ విధముగా తాత్పర్యం చెప్పారు: 'కాని వారు, వారి (మానవుల) పాపాన్ని అవిశ్వాసాన్ని మరింత అధికంచేశారు.' ఇస్లాంకు ముందు అరబ్బులు తమ ప్రయాణాలలో ఎక్కడైనా ఆగితే, అక్కడి జిన్నాతులతో శరణు కోరేవారు. ఇస్లాం దీనిని నిషేధించింది మరియు కేవలం ఒకే ఒక్క ప్రభువు, అల్లాహ్ (సు.తా.)తో శరణుకోరటాన్ని మాత్రమే విధిగా చేసింది.

2 చూడండి.15.17 18 ఆకాశాలలో దైవదూత (అలైహిమ్.స.)లు, ఇతరులు అక్కడి మాటలు వినకుండా కాపలా కాస్తూఉంటారు. మరియు ఈ అగ్ని కణాలు (షుహుబున్ షిహాబున్ యొక్క బ.వ.), ఆకాశాలలోని మాటలు వినటానికి పైకిపోయే జిన్నాతులపై పడతాయి

يَسْتَمِعِ الْآنَ يَجِدْ لَهُ شِهَابًا رَّصَدًا ٩

మాటలు వినటానికి మేము రహస్యంగా అక్కడ కూర్చునే వారం.[1] కాని ఇప్పుడు ఎవరైనా (రహస్యంగా) వినే ప్రయత్నం చేస్తే, అతడికొరకు అక్కడ ఒక అగ్ని జ్వాల పొంచిఉంటుంది.[2]

وَأَنَّا لَا نَدْرِي أَشَرٌّ أُرِيدَ بِمَن فِي الْأَرْضِ أَمْ أَرَادَ بِهِمْ رَبُّهُمْ رَشَدًا ١٠

10. " 'మరియు వాస్తవానికి, భూమిలో ఉన్న వారికి ఏదైనా కీడు ఉద్దేశింపబడిందా, లేక వారి ప్రభువు వారికి సరైనమార్గం చూప గోరుతున్నాడా, అనే విషయం మాకు అర్థం కావడం లేదు.

وَأَنَّا مِنَّا الصَّالِحُونَ وَمِنَّا دُونَ ذَٰلِكَ كُنَّا طَرَائِقَ قِدَدًا ١١

11. " 'మరియు వాస్తవానికి, మనలో కొందరు సద్వర్తనులున్నారు, మరికొందరు దానికి విరుద్ధంగా ఉన్నారు. వాస్తవానికి మనం విభిన్నమార్గాలను అనుసరిస్తూ వచ్చాము.[3]

وَأَنَّا ظَنَنَّا أَن لَّن نُّعْجِزَ اللَّهَ فِي الْأَرْضِ وَلَن نُّعْجِزَهُ هَرَبًا ١٢

12. " 'మరియు నిశ్చయంగా, మేము అల్లాహ్‌నుండి భూలోకంలో తప్పించు కోలేము అని అర్థంచేసుకున్నాము మరియు పారిపోయి కూడా ఆయన నుండి తప్పించుకోలేము.

وَأَنَّا لَمَّا سَمِعْنَا الْهُدَىٰ آمَنَّا بِهِ فَمَن يُؤْمِن بِرَبِّهِ فَلَا يَخَافُ بَخْسًا وَلَا رَهَقًا ١٣

13. " 'మరియు నిశ్చయంగా, మేము ఈ మార్గదర్శకత్వాన్ని(ఖుర్ఆన్‌ను) విన్నప్పుడు దానిని విశ్వసించాము. కావున ఎవడైతే తన ప్రభువును విశ్వసిస్తాడో అతడికి తన సత్కర్మల ఫలితంలో నష్టాన్ని గురించీ మరియు శిక్షలో హెచ్చింపును గురించీ భయపడే అవసరం ఉండదు

وَأَنَّا مِنَّا الْمُسْلِمُونَ وَمِنَّا الْقَاسِطُونَ فَمَنْ أَسْلَمَ

14. " 'మరియు నిశ్చయంగా, మనలో

---

1 మరియు ఆకాశాల మాటలు విని జ్యోతిష్యులకు చెప్పేవారము. వాటిలో వారు తమ వైపునుండి నూరు అబద్ధాలు కలిపి చెప్పేవారు.

2 కాని దైవప్రవక్త (స'అస) వచ్చిన తరువాత నుండి ఈ పని ఆగిపోయింది. ఇప్పుడు ఎవరైనా పైకి పోవటానికి ప్రయత్నిస్తే అగ్నికణం అతనిపై పడుతుంది

3 జిన్నాతులలో కూడా వేర్వేరు జాతులవారు, యూదులు, క్రైస్తవులు, ముస్లింలు మరియు సత్యతిరస్కారులు మొదలైనవారు ఉన్నారు

فَأُولَٰٓئِكَ تَحَرَّوْا۟ رَشَدًا ﴿١٤﴾

కొందరు అల్లాహ్‌కు విధేయులైన వారు (ముస్లింలు) ఉన్నారు. మరి కొందరు నిశ్చయంగా, అన్యాయపరులు[1] (సత్యానికి దూరమైనవారు) ఉన్నారు. కావున ఎవరైతే అల్లాహ్‌కు విధేయత (ఇస్లాం)ను అవలంబించారో, అలాంటి వారే సరైనమార్గాన్ని కనుగొన్న వారు!' "

وَأَمَّا ٱلْقَٰسِطُونَ فَكَانُوا۟ لِجَهَنَّمَ حَطَبًا ﴿١٥﴾

**15** మరియు అన్యాయపరులే (సత్యానికి దూరమైనవారు) నరకానికి ఇంధనమయ్యే వారు![2]

وَأَلَّوِ ٱسْتَقَٰمُوا۟ عَلَى ٱلطَّرِيقَةِ لَأَسْقَيْنَٰهُم مَّآءً غَدَقًا ﴿١٦﴾

**16.** ఒకవేళ వారు (సత్యతిరస్కారులు) ఋజుమార్గం మీద స్థిరంగా ఉన్నట్లైతే, మేము వారిపై పుష్కలంగా నీటిని కురిపించేవారము

لِّنَفْتِنَهُمْ فِيهِ ۚ وَمَن يُعْرِضْ عَن ذِكْرِ رَبِّهِۦ يَسْلُكْهُ عَذَابًا صَعَدًا ﴿١٧﴾

**17.** దానితో వారిని పరీక్షించటానికి! మరియు ఎవడైతే తన ప్రభువు ధ్యానం నుండి విముఖుడవుతాడో, ఆయన వానిని తీవ్రమైన శిక్షకు గురిచేస్తాడు.

وَأَنَّ ٱلْمَسَٰجِدَ لِلَّهِ فَلَا تَدْعُوا۟ مَعَ ٱللَّهِ أَحَدًا ﴿١٨﴾

**18.** మరియు నిశ్చయంగా, మస్జిదులు అల్లాహ్ కొరకే ప్రత్యేకించబడ్డాయి. కావున వాటిలో అల్లాహ్‌తో బాటు ఇతరులెవ్వరినీ ప్రార్థించకండి.

وَأَنَّهُۥ لَمَّا قَامَ عَبْدُ ٱللَّهِ يَدْعُوهُ كَادُوا۟ يَكُونُونَ عَلَيْهِ لِبَدًا ﴿١٩﴾

**19.** మరియు నిశ్చయంగా, అల్లాహ్ యొక్క దాసుడు (ము'హమ్మద్) ఆయన (అల్లాహ్)ను ప్రార్థించటానికి నిలబడినప్పుడు, వారు (జిన్నాతులు) అతనిచుట్టు దట్టంగా (అతని ఖుర్ఆన్ పఠనాన్ని వినటానికి) గుమిగూడుతారు[3]

---

1 ఖాసితూన్ ఈ పదానికి సందర్భాన్ని బట్టి న్యాయవర్తనులు, అన్యాయపరులు అనే రెండూ అర్థాలు వస్తాయి ఈ సందర్భంలో అన్యాయపరులు, లేక సన్మార్గంనుండి లేక సత్యం నుండి విముఖులైనవారు అనే అర్థంలో వాడబడింది.

2 అంటే జిన్నాతులలో కూడా నరకం మరియు స్వర్గంలోకి పోయేవారున్నారు సత్యతిరస్కారులు నరకంలోకి మరియు విశ్వాసులు స్వర్గంలోకి పోతారు.

3 దీని మరొక తాత్పర్యంలో "(మానవులు మరియు జిన్నాతులు) అల్లాహ్ (సు.తా.) దాసుడు

**20.** వారితో ఇలా అను: "నిశ్చయంగా నేను, నా ప్రభువును మాత్రమే ప్రార్థిస్తాను మరియు ఆయనకు ఎవ్వరినీ సాటి కల్పించను."[1]

قُلْ إِنَّمَآ أَدْعُوا۟ رَبِّى وَلَآ أُشْرِكُ بِهِۦٓ أَحَدًا ۝٢٠

**21** వారితో ఇలా అను: "నిశ్చయంగా, మీకు కీడుచేయటం గానీ, లేదా సరైన మార్గం చూపటం గానీ నా వశంలో లేదు."

قُلْ إِنِّى لَآ أَمْلِكُ لَكُمْ ضَرًّا وَلَا رَشَدًا ۝٢١

**22.** ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, నన్ను అల్లాహ్ నుండి ఎవ్వడునూ కాపాడలేడు మరియు నాకు ఆయనతప్ప మరొకరి ఆశ్రయం కూడా లేదు;

قُلْ إِنِّى لَن يُجِيرَنِى مِنَ ٱللَّهِ أَحَدٌ وَلَنْ أَجِدَ مِن دُونِهِۦ مُلْتَحَدًا ۝٢٢

**23.** "(నా పని) కేవలం అల్లాహ్ ఉపదేశాన్ని మరియు ఆయన సందేశాన్ని అందజేయటమే:" ఇక ఎవడైతే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ఆజ్ఞలను ఉల్లంఘిస్తాడో! అతడు నిశ్చయంగా, నరకాగ్నికి గురి అవుతాడు: అందులో శాశ్వతంగా కలకాలం ఉంటాడు

إِلَّا بَلَٰغًا مِّنَ ٱللَّهِ وَرِسَٰلَٰتِهِۦ ۚ وَمَن يَعْصِ ٱللَّهَ وَرَسُولَهُۥ فَإِنَّ لَهُۥ نَارَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآ أَبَدًا ۝٢٣

**24.** చివరకు వారికి వాగ్దానం చేయబడిన దానిని వారు చూసినప్పుడు, ఎవరి సహాయకులు బలహీనులో, మరెవరి వర్గం సంఖ్యాపరంగా తక్కువో వారికి తెలిసిపోతుంది.[2]

حَتَّىٰٓ إِذَا رَأَوْا۟ مَا يُوعَدُونَ فَسَيَعْلَمُونَ مَنْ أَضْعَفُ نَاصِرًا وَأَقَلُّ عَدَدًا ۝٢٤

**25.** ఇలా అను: "మీకు వాగ్దానం చేయబడిన (శిక్ష) సమీపంలోనే రానున్నదో, లేక దాని కొరకు నా ప్రభువు దీర్ఘకాలవ్యవధి

قُلْ إِنْ أَدْرِىٓ أَقَرِيبٌ مَّا تُوعَدُونَ أَمْ يَجْعَلُ لَهُۥ رَبِّىٓ أَمَدًا ۝٢٥

---

(ముహమ్మద్ 'స'అస అల్లాహుతా'ఆలాను) ప్రార్థించటానికి నిలబడినపుడు అతని చుట్టు దట్టంగా గుమిగూడి (అల్లాహ్ జ్యోతిని తమ నోట్లతో ఊది ఆర్పివేయగోరుతారు) " అని ఉంది ఈ తాత్పర్యం ఇబ్నె 'అబ్బాస్, ముజాహిద్, సయ్యీద్ బిన్ 'జుబైర్ మరియు ఇబ్నె 'జైద్ (ర'ది 'అన్హుమ్)లు ఇచ్చారు ఇబ్నె జరీర్ (ర హ్మ) దీనికి ప్రాధాన్యత నిచ్చారు ఇది ఇబ్నె-కసీ'ర్(ర'హ్మ)లో పేర్కొనబడింది

1 అలాంటప్పుడు వారితో ఇలా అను. 'నేను నా ప్రభువు (సు తా )ను మాత్రమే ప్రార్థిస్తాను మరియు ఆయన (సు.తా.)కు ఎవ్వరినీ సాటి కల్పించను.'

2. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 19:75

నియమించాడో నాకు తెలియదు.

26. ఆయనే అగోచర జ్ఞానం గలవాడు, కావున ఆయన అగోచర విషయాలు ఎవ్వడికీ తెలియజేయడు -

عٰلِمُ الْغَيْبِ فَلَا يُظْهِرُ عَلٰى غَيْبِهٖٓ اَحَدًا ۝

27. తాను కోరి ఎన్నుకొన్న ప్రవక్తకు తప్ప[1] ఎందుకంటే, ఆయన నిశ్చయంగా, అతని (ఆ ప్రవక్త) ముందు మరియు వెనుక రక్షకభటులను నియమిస్తాడు.

اِلَّا مَنِ ارْتَضٰى مِنْ رَّسُوْلٍ فَاِنَّهٗ يَسْلُكُ مِنْۢ بَيْنِ يَدَيْهِ وَمِنْ خَلْفِهٖ رَصَدًا ۝

28. వారు, అతను తన ప్రభువు యొక్క సందేశాన్ని యథాతథంగా అందజేస్తున్నాడని తెలుసుకోవటానికి మరియు ఆయన వారి అన్నివిషయాలను పరివేష్టించి ఉన్నాడు మరియు వారి ప్రతిఒక్క విషయాన్ని లెక్కపెట్టి ఉంచుతాడు.

لِّيَعْلَمَ اَنْ قَدْ اَبْلَغُوْا رِسٰلٰتِ رَبِّهِمْ وَاَحَاطَ بِمَا لَدَيْهِمْ وَاَحْصٰى كُلَّ شَيْءٍ عَدَدًا ۝

1. చూడండి, 3:179

## 73. సూరహ్ అల్-ముజ్జమ్మిల్

سُورَةُ المُزَّمِّل

అల్ ముజ్జమ్మిల్: The Enwrapped One దుప్పటి కప్పుకున్నవాడు. ఈ సూరహ్ అవతరణాక్రమంలో నాలుగవది. మొదటి మక్కా కాలానికి చెందినది. దీని పేరు మొదటి ఆయత్‌లో నుండి తీసుకోబడింది. ఇందులో 20 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

1. ఓ దుప్పటి కప్పుకున్నవాడా![1]

يٰۤاَيُّهَا الْمُزَّمِّلُ ۝

2. రాత్రంతా (నమా'జ్‌లో) నిలబడు, కొంత భాగాన్ని విడిచి;

قُمِ الَّيْلَ اِلَّا قَلِيْلًا ۝

3. దాని సగ భాగంలో, లేదా దానికంటే కొంత తక్కువ;

نِّصْفَهٗۤ اَوِ انْقُصْ مِنْهُ قَلِيْلًا ۝

4. లేదా దానికంటే కొంత ఎక్కువ; మరియు ఖుర్ఆన్‌ను ఆగి-ఆగి, నెమ్మదిగా, స్పష్టంగా పఠించు.

اَوْ زِدْ عَلَيْهِ وَرَتِّلِ الْقُرْاٰنَ تَرْتِيْلًا ۝

5. నిశ్చయంగా, మేము నీపై భారమైన సందేశాన్ని అవతరింపజేయబోతున్నాము.

اِنَّا سَنُلْقِيْ عَلَيْكَ قَوْلًا ثَقِيْلًا ۝

6. నిశ్చయంగా, రాత్రివేళ లేవటం (మనస్సును) అదుపులో ఉంచుకోవటానికి ఎంతో ఉపయుక్తమైనది మరియు (అల్లాహ్) ప్రవచనాలను (అర్థం చేసుకోవటానికి) కూడా ఎంతో అనుగుణమైనది.

اِنَّ نَاشِئَةَ الَّيْلِ هِيَ اَشَدُّ وَطْاً وَّاَقْوَمُ قِيْلًا ۝

7. వాస్తవానికి, పగటివేళ నీకు చాలా పనులుంటాయి.

اِنَّ لَكَ فِي النَّهَارِ سَبْحًا طَوِيْلًا ۝

8. మరియు నీవు నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు. మరియు అత్యంత శ్రద్ధతో

وَاذْكُرِ اسْمَ رَبِّكَ وَتَبَتَّلْ اِلَيْهِ تَبْتِيْلًا ۝

---

1 ఈ సూరహ్ అవతరింపజేయబడినప్పుడు దైవప్రవక్త (స'అస) దుప్పటి కప్పుకొని పడుకొని ఉంటారు. అతనికి లేచి తహజ్జుద్ నమా'జ్ చేయమని ఆజ్ఞ ఇవ్వబడింది. తహజ్జుద్ అతని కొరకు వాజిబ్ తప్పనిసరి చేయబడి ఉండెను. (ఇబ్నె కసీ'ర్)

ఆయనవైపుకు మరలుతూ ఉండు.

9. ఆయనే తూర్పు పడమరల స్వామి, ఆయన తప్ప మరొక ఆరాధ్యదైవం లేడు, కావున నీవు ఆయననే కార్యకర్తగా చేసుకో.

رَّبُّ الْمَشْرِقِ وَالْمَغْرِبِ لَا إِلَٰهَ إِلَّا هُوَ فَاتَّخِذْهُ وَكِيلًا ۝٩

10. మరియు వారు పలికే మాటలకు సహనంవహించు మరియు మంచితనంతో వారినుండి తొలగిపో.

وَاصْبِرْ عَلَىٰ مَا يَقُولُونَ وَاهْجُرْهُمْ هَجْرًا جَمِيلًا ۝١٠

11. మరియు అసత్యవాదులైన ఈ సంపన్నులను, నాకు వదలిపెట్టు.[1] మరియు వారికి కొంత వ్యవధి నివ్వు.

وَذَرْنِي وَالْمُكَذِّبِينَ أُولِي النَّعْمَةِ وَمَهِّلْهُمْ قَلِيلًا ۝١١

12. నిశ్చయంగా, మా వద్ద వారికొరకు సంకెళ్ళు మరియు భగభగమండే నరకాగ్ని ఉన్నాయి.

إِنَّ لَدَيْنَا أَنكَالًا وَجَحِيمًا ۝١٢

13. మరియు గొంతులో ఇరుక్కుపోయే ఆహారం మరియు బాధాకరమైన శిక్ష (ఉన్నాయి)

وَطَعَامًا ذَا غُصَّةٍ وَعَذَابًا أَلِيمًا ۝١٣

14. ఆ రోజు భూమి మరియు పర్వతాలు కంపించిపోతాయి. మరియు పర్వతాలు ప్రవహించే ఇసుక దిబ్బలుగా మారి పోతాయి.[2]

يَوْمَ تَرْجُفُ الْأَرْضُ وَالْجِبَالُ وَكَانَتِ الْجِبَالُ كَثِيبًا مَّهِيلًا ۝١٤

15. మేము ఫిర్ఔన్ వద్దకు సందేశహరుణ్ణి పంపినట్లు, నిశ్చయంగా మీ వద్దకు కూడా ఒక సందేశహరుణ్ణి, మీకు సాక్షిగా ఉండటానికి పంపాము.

إِنَّا أَرْسَلْنَا إِلَيْكُمْ رَسُولًا شَاهِدًا عَلَيْكُمْ كَمَا أَرْسَلْنَا إِلَىٰ فِرْعَوْنَ رَسُولًا ۝١٥

16. కాని ఫిర్'ఔన్ ఆ సందేశహరునికి అవిధేయత చూపాడు. కావున మేము అతనిని తీవ్రమైన శిక్షకు గురిచేశాము.

فَعَصَىٰ فِرْعَوْنُ الرَّسُولَ فَأَخَذْنَاهُ أَخْذًا وَبِيلًا ۝١٦

17. ఒకవేళ మీరు సత్యాన్ని తిరస్కరిస్తే, బాలురను ముసలివారిగా చేసేటటువంటి ఆ

فَكَيْفَ تَتَّقُونَ إِن كَفَرْتُمْ يَوْمًا يَجْعَلُ الْوِلْدَانَ شِيبًا ۝١٧

1. చూడండి, 74:11.
2. చూడండి, 14:48 మరియు 20:105-107

దినపు శిక్షనుండి ఎలా తప్పించుకోగలరు?[1]

**18.** అప్పుడు ఆకాశం బ్రద్దలైపోతుంది. ఆయన యొక్క వాగ్దానం తప్పక నెరవేరి తీరుతుంది

ٱلسَّمَآءُ مُنفَطِرٌۢ بِهِۦ ۚ كَانَ وَعْدُهُۥ مَفْعُولًا ﴿١٨﴾

**19** నిశ్చయంగా, ఇదొక ఉపదేశం కావున ఇష్టమైన వాడు తన ప్రభువు వద్దకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు! (5/8)

إِنَّ هَٰذِهِۦ تَذْكِرَةٌ ۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ
رَبِّهِۦ سَبِيلًا ﴿١٩﴾

**20.** * (ఓ ము'హమ్మద్!) నీవు, వాస్తవానికి దాదాపు మూడింట రెండువంతుల రాత్రి లేక సగం (రాత్రి) లేక మూడింట ఒక భాగం (నమా'జ్‌లో) నిలుస్తావనేది నీ ప్రభువుకు బాగా తెలుసు. మరియు నీతోపాటు ఉన్న వారిలో కొందరు కూడా! మరియు అల్లాహ్ రేయింబవళ్ళ పరిమాణాలను నిర్ణయిస్తాడు మీరు ఖచ్చితంగా పూర్తి రాత్రి (ప్రార్థించ) లేరని ఆయనకు తెలుసు. కావున ఆయన మీ వైపునకు (కనికరంతో) మరలాడు కావున ఖుర్ఆన్‌ను, మీరు సులభంగా పఠించగలిగినంతే పఠించండి. మీలో కొందరు వ్యాధిగ్రస్తులు కావచ్చు, మరికొందరు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషిస్తూ భూమిలో ప్రయాణంలో ఉండవచ్చు, మరికొందరు అల్లాహ్ మార్గంలో ధర్మయుద్ధం చేస్తూ ఉండవచ్చు, అని ఆయనకు బాగా తెలుసు. కావున మీకు దానిలో సులభమైనంత దానినే పఠించండి.[2] మరియు

إِنَّ رَبَّكَ يَعْلَمُ أَنَّكَ تَقُومُ أَدْنَىٰ مِن ثُلُثَيِ
ٱلَّيْلِ وَنِصْفَهُۥ وَثُلُثَهُۥ وَطَآئِفَةٌ مِّنَ ٱلَّذِينَ
مَعَكَ ۚ وَٱللَّهُ يُقَدِّرُ ٱلَّيْلَ وَٱلنَّهَارَ ۚ عَلِمَ أَن
لَّن تُحْصُوهُ فَتَابَ عَلَيْكُمْ ۖ فَٱقْرَءُوا۟
مَا تَيَسَّرَ مِنَ ٱلْقُرْءَانِ ۚ عَلِمَ أَن سَيَكُونُ
مِنكُم مَّرْضَىٰ ۙ وَءَاخَرُونَ يَضْرِبُونَ فِى ٱلْأَرْضِ
يَبْتَغُونَ مِن فَضْلِ ٱللَّهِ ۙ وَءَاخَرُونَ
يُقَٰتِلُونَ فِى سَبِيلِ ٱللَّهِ ۖ فَٱقْرَءُوا۟
مَا تَيَسَّرَ مِنْهُ ۚ وَأَقِيمُوا۟ ٱلصَّلَوٰةَ وَءَاتُوا۟ ٱلزَّكَوٰةَ
وَأَقْرِضُوا۟ ٱللَّهَ قَرْضًا حَسَنًا ۚ وَمَا تُقَدِّمُوا۟
لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ تَجِدُوهُ عِندَ ٱللَّهِ
هُوَ خَيْرًا وَأَعْظَمَ أَجْرًا ۚ وَٱسْتَغْفِرُوا۟ ٱللَّهَ ۖ
إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌۢ ﴿٢٠﴾

---

1 పునరుత్థాన దినమున ఆదమ్ ('అ.స.)తో ఇలా అనబడుతుంది: "నీ సంతానం నుండి నరకం వారిని ఎన్నుకో" అతను ప్రశ్నిస్తాడు "ఓ అల్లాహ్ (సు.తా.)! ఏ విధంగా?" అల్లాహ్ (సు.తా.) అంటాడు "ప్రతి వేయిమంది నుండి 999 మందిని. అప్పుడు గర్భవతులైన స్త్రీల పిండాలు పడిపోతాయి మరియు పిల్లలు వృద్ధులైపోతారు." ఈ విషయం విని అనుచరు(ర'ది'అన్హుమ్)లు చాలా చింతలో పడిపోయారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) అంటారు. "యఅ'జూజ్, మఅ'జూజ్‌ల జాతివారి నుండి 999 ఉంటారు. మరియు మీలో నుండి ఒకడు; అల్లాహ్ (సు.తా.) కరుణపై నాకు విశ్వాసముంది స్వర్గవాసులలోనుండి సగంమంది మీరుంటారు." ('స. బు'ఖారీ)

2. అల్లాహ్ (సు.తా.) మిమ్మల్ని కనికరించాడు కావున, తహజ్జుద్‌లో మీకు సులభమైనంతనే పఠించండి.

నమా'జ్‌ను స్థాపించండి.[1] విధిదానం ('జకాత్) ఇవ్వండి. మరియు అల్లాహ్‌కు మంచి అప్పును, అప్పుగా ఇస్తూ ఉండండి. మరియు మీరు, మీ కొరకు ముందుగా చేసి పంపుకున్న మంచి కార్యాలన్నింటినీ అల్లాహ్ దగ్గర పొందుతారు అదే చాలా ఉత్తమమైనది. మరియు దాని ప్రతిఫలం చాలా గొప్పది. మరియు మీరు అల్లాహ్‌ను క్షమాభిక్ష అర్థిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

---

రెండు రకాతులైనా సరే దైవప్రవక్త ('స'అస) చాలా మట్టుకు ఎనిమిది రకాతులు చేసేవారు అతనినే అనుసరించినా ఎంతో మేలు మీ తహజ్జుద్ నమా'జ్‌లో వీలైనంత ఖుర్ఆన్ పఠనంచేయండి. నెమ్మదిగా స్పష్టంగా పఠించండి.

1 అంటే ఐదు సార్లు చేసే ఫ'ర్ద్ నమా'జ్‌లు. చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ ఆయత్ మదీనాలో అవతరింపజేయబడింది.

## 74. సూరహ్ అల్-ముద్దస్సి'ర్

## سُوْرَةُ الْمُدَّثِّرِ

అల్ ముద్దస్సి'ర్: The Enfolded One, బట్టల (దుప్పటి)లో చుట్టుకున్నవాడు! మొదటి ఆయత్‌లోనే ఈ పదముంది. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై సూరహ్ అల్ ఇఖ్'రఅ' (96:1-5) మొదటి అయిదు ఆయతులు అవతరించిన తరువాత కొంతకాలం (6 నెలల నుండి 3 సంవత్సరాల) వరకు ఏ వ'హీ అవతరింపజేయబడలేదు. ఈ కాలాన్ని, ఫతరతుల్ వ'హీ అంటారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) ఎంతో కలవరపడ్డారు. అప్పుడు అతని భార్య 'ఖదీజహ్ (ర'అన్హా) అతనికి నైతిక ప్రోత్సాహాన్నిచ్చారు. ఆ తరువాత ఒకరోజు జిబ్రీల్ ('అ.స.) ఆకాశాలు మరియు భూమి మధ్య ప్రత్యక్షమయ్యారు. ఆ తరువాత ఈ సూరహ్ అవతరింపజేయబడింది. ఆ తరువాత వ'హీ త్వరత్వరగా రావడం ఆరంభమయ్యింది. ('స. బు'ఖారీ, ముస్లిం) దీని కొన్ని ఆయతులు తరువాత అవతరింపజేయబడ్డాయి. మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **56 ఆయతులు** ఉన్నాయి.

ఈ సూరహ్ ఇస్లాం విధులను, అల్లాహ్ ఏకత్వాన్ని పునరుత్థానాన్ని మరియు అంతిమ తీర్పును వివరిస్తోంది. మానవుడు బలహీనుడని, అల్లాహ్ (సు.తా.)పై అతడు ఆధారపడి ఉన్నాడని, ప్రతిమానవుడు తన కర్మలకు తానే బాధ్యుడని. అతడు వాటి ఫలితాన్ని అనుభవిస్తాడని మరియు అతని కర్మలను బట్టి స్వర్గనరకాలున్నాయని బోధిస్తోంది.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** ఓ దుప్పటిలో చుట్టుకున్నవాడా!

يَٰٓأَيُّهَا ٱلْمُدَّثِّرُ ①

**2.** లే! ఇక హెచ్చరించు!

قُمْ فَأَنذِرْ ②

**3.** మరియు నీ ప్రభువు గొప్పతనాన్ని (ఘనతను) కొనియాడు!

وَرَبَّكَ فَكَبِّرْ ③

**4.** మరియు నీ వస్త్రాలను పరిశుభ్రంగా ఉంచుకో!

وَثِيَابَكَ فَطَهِّرْ ④

**5.** మరియు మాలిన్యానికి దూరంగా ఉండు!

وَٱلرُّجْزَ فَٱهْجُرْ ⑤

**6.** మరియు ఎక్కువ పొందాలనే ఆశతో ఇవ్వకు (ఉపకారం చేయకు)!

وَلَا تَمْنُن تَسْتَكْثِرُ ⑥

**7.** మరియు నీ ప్రభువు కొరకు సహనం వహించు!

وَلِرَبِّكَ فَٱصْبِرْ ⑦

**8.** మరియు బాకా (నాఖూర్) ఊదబడి నప్పుడు;

فَإِذَا نُقِرَ فِي النَّاقُورِ ﴿٨﴾

**9.** ఆ దినం చాలా కఠినమైన దినమై ఉంటుంది:

فَذَٰلِكَ يَوْمَئِذٍ يَوْمٌ عَسِيرٌ ﴿٩﴾

**10.** సత్యతిరస్కారులకు అది సులభమైన (దినం) కాదు.[1]

عَلَى الْكَافِرِينَ غَيْرُ يَسِيرٍ ﴿١٠﴾

**11.** వదలండి! నన్నూ, మరియు నేను ఒంటరిగా పుట్టించిన వానినీ![2]

ذَرْنِي وَمَنْ خَلَقْتُ وَحِيدًا ﴿١١﴾

**12.** మరియు నేను అతనికి పుష్కలంగా సంపద నిచ్చాను.

وَجَعَلْتُ لَهُ مَالًا مَمْدُودًا ﴿١٢﴾

**13.** మరియు అతనికి తోడుగా ఉండే కుమారులను!

وَبَنِينَ شُهُودًا ﴿١٣﴾

**14.** మరియు అతని కొరకు అతని జీవన సౌకర్యాలను సులభం చేశాను.

وَمَهَّدْتُ لَهُ تَمْهِيدًا ﴿١٤﴾

**15.** అయినా నేను అతనికి ఇంకా ఇవ్వాలని అతడు ఆశిస్తూ ఉంటాడు.

ثُمَّ يَطْمَعُ أَنْ أَزِيدَ ﴿١٥﴾

**16.** అలాకాదు! వాస్తవానికి అతడు మా (అల్లాహ్) సూచన(ఆయాత్)ల పట్ల విరోధం కలిగివున్నాడు.

كَلَّا ۖ إِنَّهُ كَانَ لِآيَاتِنَا عَنِيدًا ﴿١٦﴾

**17.** నేను త్వరలోనే అతనిని దుర్గమమైన స్థానానికి (శిక్ష)కు నెట్టుతాను!

سَأُرْهِقُهُ صَعُودًا ﴿١٧﴾

**18.** వాస్తవానికి అతడు ఆలోచించాడు మరియు మనస్సులో ప్రణాళిక చేసుకున్నాడు.

إِنَّهُ فَكَّرَ وَقَدَّرَ ﴿١٨﴾

---

1 అల్ కాఫిరీన్ అంటే సత్యతిరస్కారులు ఈ పదం ఇక్కడ ఖుర్ఆన్ అవతరణాక్రమంలో మొదటిసారి వచ్చింది 57.20లో మాత్రం ఈ పదానికి భూమిని దున్నేవాడు అనే అర్థం ఉంది మిగతా అన్ని చోట్లలో ఈ పదం సత్యతిరస్కారులనే అర్థంలోనే వాడబడింది

2 చూడండి, 6:94, 19:80, 95 కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్ వలీద్ బిన్ ము'గైరాను ఉద్దేశిస్తోంది అని అభిప్రాయపడ్డారు అతడు సత్యతిరస్కారం మరియు దురహంకారంలో మితిమీరి పోయాడు. ఈ ఆయత్ ఇటువంటి ప్రతి సత్యతిరస్కారిని సూచిస్తుంది

**19.** కావున (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు నాశనానికి గురికానివ్వండి!

فَقُتِلَ كَيْفَ قَدَّرَ ﴿١٩﴾

**20.** అపును (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు, నాశనానికి గురికానివ్వండి!

ثُمَّ قُتِلَ كَيْفَ قَدَّرَ ﴿٢٠﴾

**21.** అప్పుడు అతడు ఆలోచించాడు.

ثُمَّ نَظَرَ ﴿٢١﴾

**22.** తరువాత అతడు నుదురు చిట్లించుకున్నాడు మరియు కోపంతో చూశాడు (ముఖం మాడ్చుకున్నాడు);

ثُمَّ عَبَسَ وَبَسَرَ ﴿٢٢﴾

**23.** తరువాత అతడు వెనుకకు మరలి దురహంకారం చూపాడు.[1]

ثُمَّ أَدْبَرَ وَاسْتَكْبَرَ ﴿٢٣﴾

**24.** అప్పుడు అతడు ఇలా అన్నాడు: "ఇది పూర్వం నుండి వస్తూవున్న ఒక మంత్రజాలం మాత్రమే!

فَقَالَ إِنْ هَٰذَا إِلَّا سِحْرٌ يُؤْثَرُ ﴿٢٤﴾

**25.** "ఇది కేవలం ఒక మానవ వాక్కు మాత్రమే!"

إِنْ هَٰذَا إِلَّا قَوْلُ الْبَشَرِ ﴿٢٥﴾

**26.** త్వరలోనే నేను అతనిని నరకాగ్నిలో కాల్చుతాను.

سَأُصْلِيهِ سَقَرَ ﴿٢٦﴾

**27.** మరియు ఆ నరకాగ్ని అంటే నీవు ఏమనుకుంటున్నావు?[2]

وَمَا أَدْرَاكَ مَا سَقَرُ ﴿٢٧﴾

**28.** అది (ఎవరినీ) మిగల్చదు మరియు వదలిపెట్టదు.[3]

لَا تُبْقِي وَلَا تَذَرُ ﴿٢٨﴾

---

1. చూడండి, 96:6-7

2. సఖరున్: నరకానికి ఏడు అంతస్తులు లేక శ్రేణులున్నాయి. 1) జహన్నమ్ (నరకం), 2) ల'జ్జా (ధ్వంసం చేసే అగ్ని), 3) 'హు'త'మ (అణగ/చితకగొట్టే శిక్ష), 4) స'ఈర్ (ప్రజ్వలించే అగ్ని), 5) సఖర్ (నరకాగ్ని), 6) జ'హీమ్ (మండే అగ్ని), 7) హావియహ్: ఇది అన్నిటి కంటే క్రింది అంతస్తు. ఇందులో మునాఫిఖులు (కపటవిశ్వాసులు) ఉంటారు. ఏడు ద్వారాలు అంటే ఏడు విధాలైన పాపుల దారులు. చూడండి, 15:44.

3. అంటే అది నరకవాసులను బ్రతుకనివ్వదూ మరియు చావనివ్వదూ, వారి శరీరపు ప్రతి భాగాన్ని కాల్చుతుంది.

**29.** అది మానవుని (చర్మాన్ని) దహించి వేస్తుంది.[1]

لواحة للبشر ﴿٢٩﴾

**30.** దాని పై పందొమ్మిది (దేవదూతలు నియమించబడి) ఉన్నారు.

عليها تسعة عشر ﴿٣٠﴾

**31.** మరియు మేము దేవదూతలను మాత్రమే నరకానికి రక్షకులుగా నియమించాము. మరియు మేము వారి సంఖ్యను (పందొమ్మిదిని), సత్యతిరస్కారులకు ఒక పరీక్షగా, గ్రంథప్రజలకు నమ్మకం కలగటానికి, విశ్వాసుల విశ్వాసాన్ని అధికం చేయటానికి మరియు గ్రంథప్రజలు మరియు విశ్వాసులు సందేహంలో పడకుండా ఉండ టానికి మరియు తమ హృదయాలలో రోగమున్న వారు మరియు సత్యతిరస్కారులు: "ఈ ఉపమానం ఇవ్వటంలో అల్లాహ్ ఉద్దేశమేమిటి?" అని పలుకటానికి! ఈ విధంగా అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టత్వంలో వదులుతాడు. మరియు తాను కోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు.[2] మరియు నీ ప్రభువు సైన్యాలను ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. మరియు ఇదంతా మానవునికి ఒక జ్ఞాపిక మాత్రమే.

وما جعلنا أصحب النار إلا ملئكة ۙ وما جعلنا عدتهم إلا فتنة للذين كفروا ليستيقن الذين أوتوا الكتب ويزداد الذين آمنوا إيمانا ۙ ولا يرتاب الذين أوتوا الكتب والمؤمنون ۙ وليقول الذين في قلوبهم مرض والكفرون ماذا أراد الله بهذا مثلا ۚ كذلك يضل الله من يشاء ويهدي من يشاء ۚ وما يعلم جنود ربك إلا هو ۚ وما هي إلا ذكرى للبشر ﴿٣١﴾

**32.** అలాకాదు! చంద్రుని సాక్షిగా!

كلا والقمر ﴿٣٢﴾

**33.** గడిచిపోయే రాత్రి సాక్షిగా!

واليل إذ أدبر ﴿٣٣﴾

**34.** ప్రకాశించే ఉదయం సాక్షిగా!

والصبح إذا أسفر ﴿٣٤﴾

**35.** నిశ్చయంగా, ఇది (ఈ నరకాగ్ని ప్రస్తావన) ఒక గొప్ప విషయం.

إنها لإحدى الكبر ﴿٣٥﴾

**36.** మానవునికి ఒక హెచ్చరిక;

نذيرا للبشر ﴿٣٦﴾

---

**1.** చూడండి, 87:12-13.

**2.** చూడండి, 2:26

لِمَنْ شَآءَ مِنْكُمْ اَنْ يَّتَقَدَّمَ اَوْ يَتَاَخَّرَ ۝

37. మీలో ముందుకు రావాలని కోరుకునే వానికి లేదా వెనుక ఉండిపోయే వానికి;

كُلُّ نَفْسٍۭ بِمَا كَسَبَتْ رَهِيْنَةٌ ۝

38. ప్రతి మానవుడు తానుచేసిన కర్మలకు తాకట్టుగా ఉంటాడు.

اِلَّآ اَصْحٰبَ الْيَمِيْنِ ۝

39. కుడి పక్షంవారు తప్ప!

فِيْ جَنّٰتٍ ۛ يَتَسَآءَلُوْنَ ۝

40. వారు స్వర్గాలలో ఉంటూ ఒకరికొకరు ఇలా ప్రశ్నించుకుంటారు!

عَنِ الْمُجْرِمِيْنَ ۝

41. అపరాధులను గురించి (మరియు వారితో అంటారు):

مَا سَلَكَكُمْ فِيْ سَقَرَ ۝

42. "మిమ్మల్ని ఏ విషయం నరకంలోకి ప్రవేశింపజేసింది?"

قَالُوْا لَمْ نَكُ مِنَ الْمُصَلِّيْنَ ۝

43. వారు (నరకవాసులు) ఇలా జవాబిస్తారు: "మేము నమా'జ్ చేసేవాళ్ళంకాము

وَلَمْ نَكُ نُطْعِمُ الْمِسْكِيْنَ ۝

44. "మరియు నిరుపేదకు ఆహారం పెట్టే వాళ్ళంకాము;

وَكُنَّا نَخُوْضُ مَعَ الْخَآئِضِيْنَ ۝

45. "మరియు వృథా కాలక్షేపం చేసే వారితో కలిసి వ్యర్థ ప్రలాపాలు (ప్రసంగాలు) చేస్తూ ఉండేవాళ్ళము;

وَكُنَّا نُكَذِّبُ بِيَوْمِ الدِّيْنِ ۝

46. "మరియు తీర్పుదినాన్ని అబద్ధమని నిరాకరిస్తూ ఉండేవాళ్ళము;

حَتّٰىٓ اَتٰىنَا الْيَقِيْنُ ۝

47. "చివరకు ఆ అనివార్యమైన (ఘడియ) మాపై వచ్చిపడింది."[1]

فَمَا تَنْفَعُهُمْ شَفَاعَةُ الشّٰفِعِيْنَ ۝

48. అప్పుడు సిఫారసుచేసే వారి సిఫారసు, వారికి ఏమాత్రం ఉపయోగపడదు.[2]

فَمَا لَهُمْ عَنِ التَّذْكِرَةِ مُعْرِضِيْنَ ۝

49. అయితే, వారికేమయింది? ఈ హితోపదేశం నుండి వారెందుకు ముఖం

1 చూడండి, 15:99

2. సిఫారస్ కొరకు చూడండి, 10:3

త్రిప్పుకుంటున్నారు.

**50.** వారిస్థితి బెదిరిన అడవి గాడిదల మాదిరిగా ఉంది;

كَأَنَّهُمْ حُمُرٌ مُّسْتَنفِرَةٌ ﴿٥٠﴾

**51.** సింహం నుండి పారిపోయే (గాడిదల మాదిరిగా)![1]

فَرَّتْ مِن قَسْوَرَةٍ ﴿٥١﴾

**52.** అలాకాదు! వారిలో ప్రతి ఒక్కవ్యక్తి తనకు విప్పబడిన గ్రంథాలు ఇవ్వబడాలని కోరుతున్నాడు.[2]

بَلْ يُرِيدُ كُلُّ امْرِئٍ مِّنْهُمْ أَن يُؤْتَىٰ صُحُفًا مُّنَشَّرَةً ﴿٥٢﴾

**53.** కాదుకాదు! అసలు వారు పరలోక జీవితం గురించి భయపడటంలేదు.

كَلَّا ۖ بَل لَّا يَخَافُونَ الْآخِرَةَ ﴿٥٣﴾

**54.** అలాకాదు! నిశ్చయంగా, ఇది ఒక హితోపదేశం.

كَلَّا إِنَّهُ تَذْكِرَةٌ ﴿٥٤﴾

**55.** కావున కోరినవాడు దీనినుండి హిత బోధ గ్రహించవచ్చు.

فَمَن شَاءَ ذَكَرَهُ ﴿٥٥﴾

**56.** కాని అల్లాహ్ కోరితే తప్ప![3] వీరు దీనినుండి హితబోధ గ్రహించలేరు. ఆయనే (అల్లాహ్‌యే) భయభక్తులకు అర్హుడు మరియు ఆయనే క్షమించే అర్హతగలవాడు. (3/4)

وَمَا يَذْكُرُونَ إِلَّا أَن يَشَاءَ اللَّهُ ۚ هُوَ أَهْلُ التَّقْوَىٰ وَأَهْلُ الْمَغْفِرَةِ ﴿٥٦﴾

---

1 దీనిని వ్యాఖ్యాతలు సింహం, పులి లేక వేటగాడి నుండి పారిపోవటం, అని అన్నారు

2 విప్పబడిన గ్రంథాలు అంటే: ము'హమ్మద్ ('స'అస) అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రవక్త అని వ్రాయబడిన గ్రంథం ప్రతి ఒక్కరికి ఇవ్వబడాలని లేక దైవగ్రంథం ప్రతిఒక్కరికి ఇవ్వబడాలని. చూడండి, 2:118 వారు ఇలా పలకడం వారి దురహంకారాన్ని సూచిస్తుంది

3. చూడండి, 81:28-29 మరియు 14:4.

## 75. సూరహ్ అల్ ఖియామహ్

سُوْرَةُ الْقِيٰمَةِ

అల్ ఖియామహ్: The Resurrection, పునరుత్థానం. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్‌లోనే ఉంది. ఇందులో పునరుత్థానదినం గురించి వివరాలున్నాయి. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో 40 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1.** * అలాకాదు! నేను పునరుత్థానదినపు శపథం చేస్తున్నాను.

لَآ اُقْسِمُ بِيَوْمِ الْقِيٰمَةِ ۝

**2.** అలాకాదు! నేను తనను తాను నిందించుకునే అంతరాత్మ శపథం చేస్తున్నాను.

وَلَآ اُقْسِمُ بِالنَّفْسِ اللَّوَّامَةِ ۝

**3.** ఏమిటి? మేము అతని ఎముకలను ప్రోగుచేయలేమని మానవుడు భావిస్తున్నాడా?

اَيَحْسَبُ الْاِنْسَانُ اَلَّنْ نَّجْمَعَ عِظَامَهٗ ۝

**4.** వాస్తవానికి! మేము అతని వ్రేళ్ళ కొనలను గూడా సరిగ్గా సవరించగల సమర్థులము.

بَلٰى قٰدِرِيْنَ عَلٰٓى اَنْ نُّسَوِّيَ بَنَانَهٗ ۝

**5.** అయినా, మానవుడు ఇక మీద కూడా దుష్కార్యాలు చేయగోరుతున్నాడు.

بَلْ يُرِيْدُ الْاِنْسَانُ لِيَفْجُرَ اَمَامَهٗ ۝

**6.** అతడు: "అయితే ఈ పునరుత్థానదినం ఎప్పుడు వస్తుంది?" అని అడుగుతున్నాడు.

يَسْـَٔلُ اَيَّانَ يَوْمُ الْقِيٰمَةِ ۝

**7.** కళ్ళు మిరుమిట్లు గొన్నప్పుడు;

فَاِذَا بَرِقَ الْبَصَرُ ۝

**8.** మరియు చంద్రునికి గ్రహణం పట్టి నప్పుడు;

وَخَسَفَ الْقَمَرُ ۝

**9.** మరియు సూర్యచంద్రులు కలిపి వేయబడినప్పుడు;

وَجُمِعَ الشَّمْسُ وَالْقَمَرُ ۝

**10.** మానవుడు ఆ రోజు: "ఎక్కడికి పారిపోవాలి?" అని అంటాడు.

يَقُوْلُ الْاِنْسَانُ يَوْمَىِٕذٍ اَيْنَ الْمَفَرُّ ۝

**11.** అది కాదు! (అతనికి) ఎక్కడా శరణం ఉండదు!

كَلَّا لَا وَزَرَ ۝

**12.** ఆ రోజు నీ ప్రభువువద్దనే ఆశ్రయం ఉంటుంది.

إِلَىٰ رَبِّكَ يَوْمَئِذٍ الْمُسْتَقَرُّ ﴿١٢﴾

**13.** ఆ రోజు మానవుడికి, తాను చేసిపంపింది మరియు వెనక వదలింది అంతా తెలుపబడుతుంది.[1]

يُنَبَّأُ الْإِنسَانُ يَوْمَئِذٍ بِمَا قَدَّمَ وَأَخَّرَ ﴿١٣﴾

**14.** అలాకాదు! మానవుడు తనకు విరుద్ధంగా, తానే సాక్షి అవుతాడు;

بَلِ الْإِنسَانُ عَلَىٰ نَفْسِهِ بَصِيرَةٌ ﴿١٤﴾

**15.** మరియు అతడు ఎన్ని సాకులు చెప్పినా సరే![2]

وَلَوْ أَلْقَىٰ مَعَاذِيرَهُ ﴿١٥﴾

**16.** నీవు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను గ్రహించటానికి) నీ నాలుకను త్వరత్వరగా కదిలించకు.[3]

لَا تُحَرِّكْ بِهِ لِسَانَكَ لِتَعْجَلَ بِهِ ﴿١٦﴾

**17.** నిశ్చయంగా, దీనిని సేకరించటం మరియు దీనిని చదివించటం మా బాధ్యతే!

إِنَّ عَلَيْنَا جَمْعَهُ وَقُرْآنَهُ ﴿١٧﴾

**18.** కావున మేము దీనిని పఠించినప్పుడు నీవు ఆ పారాయణాన్ని శ్రద్ధగా అనుసరించు.

فَإِذَا قَرَأْنَاهُ فَاتَّبِعْ قُرْآنَهُ ﴿١٨﴾

**19.** ఇక దాని భావాన్ని అర్థమయ్యేలా చేయటం మా బాధ్యతే![4]

ثُمَّ إِنَّ عَلَيْنَا بَيَانَهُ ﴿١٩﴾

**20.** అలాకాదు! వాస్తవానికి మీరు అనిశ్చితమైన (ఇహలోక జీవితం పట్ల) వ్యామోహం పెంచుకుంటున్నారు;

كَلَّا بَلْ تُحِبُّونَ الْعَاجِلَةَ ﴿٢٠﴾

**21.** మరియు పరలోక జీవితాన్ని

وَتَذَرُونَ الْآخِرَةَ ﴿٢١﴾

---

1. చూడండి, 18:49
2. చూడండి, 24:24, 36:25 లేక 41:20-22.
3. జిబ్రీల్ ('అ.స.) ఖుర్ఆన్ అవతరింపజేసేటప్పుడు, దైవప్రవక్త ('స'అస) ఏ పదాన్ని కూడా మరచిపోరాదని త్వరత్వరగా చదివేవారు. అల్లాహుతా'ఆలా త్వరత్వరగా చదువటం నుండి నివారించాడు (స. బు'ఖారీ) ఇటువంటి వాక్యానికై చూడండి, 20:114
4. దైవప్రవక్త ('స'అస) ఖుర్ఆన్‌ను ప్రజలకు అర్థమవటానికి వివరించి చెప్పింది కూడా అల్లాహ్ (సు.తా.) తరఫు నుండి, తనకు తెలుపబడిందే. ఈ వివరణలే హదీసులు!

వదలిపెడుతున్నారు![1]

22. ఆ రోజున కొన్ని ముఖాలు కళకళ లాడుతూ ఉంటాయి; وُجُوْهٌ يَّوْمَىِٕذٍ نَّاضِرَةٌ ۝

23 తమ ప్రభువు (అల్లాహ్) వైపునకు చూస్తూ ఉంటాయి;[2] اِلٰى رَبِّهَا نَاظِرَةٌ ۝

24. మరికొన్ని ముఖాలు ఆ రోజు, కాంతి హీనమై ఉంటాయి;[3] وَوُجُوْهٌ يَّوْمَىِٕذٍۭ بَاسِرَةٌ ۝

25. నడుమును విరిచే బాధ వారికి కలుగుతుందని భావించి.[4] تَظُنُّ اَنْ يُّفْعَلَ بِهَا فَاقِرَةٌ ۝

26. అలాకాదు! ప్రాణం గొంతులోకి వచ్చినపుడు;[5] كَلَّآ اِذَا بَلَغَتِ التَّرَاقِيَ ۝

27. మరియు: "ఎవడైనా ఉన్నాడా? అతనిని (మరణంనుండి) కాపాడటానికి?" అని అనబడుతుంది.[6] وَقِيْلَ مَنْ ۜ رَاقٍ ۝

28 మరియు అప్పుడు అతడు వాస్తవానికి తన ఎడబాటుకాలం వచ్చిందని గ్రహిస్తాడు; وَّظَنَّ اَنَّهُ الْفِرَاقُ ۝

29 మరియు ఒక పిక్క మరొక పిక్కతో కలిసిపోతుంది.[7] وَالْتَفَّتِ السَّاقُ بِالسَّاقِ ۝

30. ఆ రోజు నీ ప్రభువు వైపునకు ప్రయాణం ఉంటుంది! اِلٰى رَبِّكَ يَوْمَىِٕذِ ࣙالْمَسَاقُ ۝

31. కాని అతడు సత్యాన్ని నమ్మలేదు فَلَا صَدَّقَ وَلَا صَلّٰى ۝

---

1 అంటే పరలోక జీవితాన్ని నమ్మటంలేదు. మీరు మీ జీవితం కేవలం ఈ ఇహలోక జీవితం మాత్రమే అనే భ్రమలో పడిఉన్నారు మీరు పునరుత్థరింపబడతారని నమ్మటంలేదు

2. ఇవి విశ్వాసుల ముఖాలు.

3. ఇవి సత్య తిరస్కారుల ముఖాలు.

4. అంటే వారు నరకంలో వేయబడతారని తెలుసుకొని.

5. మరణం ఆసన్నమైనప్పుడు.

6. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 28:71 72.

7 అంటే అతడు, తాను కష్టాలపాలవుతున్నానని తెలుసుకుంటాడు

మరియు నమా'జ్ సలపనూ లేదు![1]

وَلَٰكِن كَذَّبَ وَتَوَلَّىٰ ﴿٣٢﴾

**32.** మరియు అతడు (ఈ సందేశాన్ని) అసత్యమన్నాడు మరియు దాని నుండి వెనుదిరిగాడు!

ثُمَّ ذَهَبَ إِلَىٰ أَهْلِهِ يَتَمَطَّىٰ ﴿٣٣﴾

**33.** ఆ తరువాత నిక్కుతూ నీల్గుతూ తన ఇంటివారి వద్దకు పోయాడు!

أَوْلَىٰ لَكَ فَأَوْلَىٰ ﴿٣٤﴾

**34.** (ఓ సత్యతిరస్కారుడా!) నీకు నాశనం మీద నాశనం రానున్నది!

ثُمَّ أَوْلَىٰ لَكَ فَأَوْلَىٰ ﴿٣٥﴾

**35.** అవును, నీకు నాశనం మీద నాశనం రానున్నది!

أَيَحْسَبُ الْإِنسَانُ أَن يُتْرَكَ سُدًى ﴿٣٦﴾

**36.** ఏమిటి? మానవుడు తనను విచ్చలవిడిగా వదలిపెట్టడం జరుగుతుందని భావిస్తున్నాడా?

أَلَمْ يَكُ نُطْفَةً مِّن مَّنِيٍّ يُمْنَىٰ ﴿٣٧﴾

**37.** ఏమీ? అతడు ప్రసరింపజేయబడిన ఒక వీర్యబిందువు కాడా?

ثُمَّ كَانَ عَلَقَةً فَخَلَقَ فَسَوَّىٰ ﴿٣٨﴾

**38.** తరువాత ఒక రక్తకండగా (జలగగా) ఉండేవాడు కాదా? తరువాత ఆయనే (అల్లాహ్‌యే) అతనిని సృష్టించి అతని రూపాన్ని తీర్చిదిద్దాడు.[2]

فَجَعَلَ مِنْهُ الزَّوْجَيْنِ الذَّكَرَ وَالْأُنثَىٰ ﴿٣٩﴾

**39.** ఆ తరువాత అతని నుండి స్త్రీ పురుషుల రెండు రకాలను (జాతులను) ఏర్పరచాడు.

أَلَيْسَ ذَٰلِكَ بِقَادِرٍ عَلَىٰ أَن يُحْيِيَ الْمَوْتَىٰ ﴿٤٠﴾

**40.** అలాంటప్పుడు ఆయనకు మరణించిన వారిని మళ్ళీ బ్రతికించే సామర్థ్యం లేదా?

---

1 చూడండి, 4:17 18

2. చూడండి, 87:2 మరియు 91:7.

## 76. సూరహ్ అద్-దహ్ర్

## سُورَةُ الدَّهْرِ

అల్-ఇన్సాను: The Man, మానవుడు. దీనికి సూరహ్ అద్-దహ్ర్, The Time, కాలచక్రం, సమయం అనే పేరుకూడా ఉంది. ఈ రెండు పదాలు మొదటి ఆయత్‌లోనే ఉన్నాయి. దైవప్రవక్త (స'అస) జుము'అహ్ రోజు ఫజ్ర్ నమాజులలో సూరహ్ అస్-సజ్దా (32) మరియు ఈ సూరహ్ (76) చదివేవారు (స'హీ'హ్ ముస్లిం). చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ సూరహ్ మదీనాలో అవతరింపజేయబడింది. (ఫ'త్హ్ అల్-ఖదీర్) ఇందులో 31 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

1. అనంత కాలచక్రంలో, మానవుడు తాను చెప్పుకోదగిన వస్తువు కాకుండా ఉన్న సమయం గడవలేదా?

هَلْ أَتَىٰ عَلَى الْإِنسَانِ حِينٌ مِّنَ الدَّهْرِ لَمْ يَكُن شَيْئًا مَّذْكُورًا ⓵

2. నిశ్చయంగా, మేము, మానవుణ్ణి ఒక మిశ్రమ వీర్య బిందువుతో సృష్టించాము.[1] అతనిని పరీక్షించటానికి, మేము అతనిని వినేవాడిగా, చూసేవాడిగా చేశాము.[2]

إِنَّا خَلَقْنَا الْإِنسَانَ مِن نُّطْفَةٍ أَمْشَاجٍ نَّبْتَلِيهِ فَجَعَلْنَاهُ سَمِيعًا بَصِيرًا ⓶

3. నిశ్చయంగా, మేము అతనికి మార్గం చూపాము. ఇక అతడు కృతజ్ఞుడు కావచ్చు, లేదా కృతఘ్నుడూ కావచ్చు![3]

إِنَّا هَدَيْنَاهُ السَّبِيلَ إِمَّا شَاكِرًا وَإِمَّا كَفُورًا ⓷

4. నిశ్చయంగా, మేము సత్యతిరస్కారుల కొరకు సంకెళ్ళను, మెడలో పట్టాలను మరియు భగభగమండే అగ్నిని సిద్ధపరచి ఉంచాము.[4]

إِنَّا أَعْتَدْنَا لِلْكَافِرِينَ سَلَاسِلَ وَأَغْلَالًا وَسَعِيرًا ⓸

---

1 అంటే స్త్రీ పురుషుల వీర్యబిందువుల మిశ్రమంతో! అంటే పురుషుని రేతస్సు, లేక వీర్యబిందువు, లేక శుక్లం (Sperm), మరియు స్త్రీ బీజకణం (Ovum) చూడండి, 86:6-7

2. పరీక్షించటం కోసం, చూడండి, 67:2.

3 ప్రతి మానవుడు తన ఆత్మను వ్యాపారంలో పెడ్తాడు. దానిని నష్టంలో పడవేస్తాడు లేక లాభంలో (స'హీ'హ్ ముస్లిం) నష్టం అంటే నరకం, లాభం అంటే స్వర్గం. ఇంకా చూడండి, 90:10

4 ఇది అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన స్వేచ్ఛను చెడు మార్గంలో వినియోగించటం వల్ల లభించే ప్రతిఫలం. ఇంకా చూడండి, 73:12-13.

**5.** నిశ్చయంగా, పుణ్యాత్ములు కాఫూర్ అనే ఒక చెలమ నుండి ఒక గిన్నెలో తెచ్చిన (పానీయాన్ని) త్రాగుతారు.[1]

إِنَّ ٱلْأَبْرَارَ يَشْرَبُونَ مِن كَأْسٍ كَانَ مِزَاجُهَا كَافُورًا ۝

**6.** ధారాళంగా పొంగి ప్రవహింపజేయబడే ఊటలనుండి, అల్లాహ్ దాసులు త్రాగుతూ ఉంటారు.[2]

عَيْنًا يَشْرَبُ بِهَا عِبَادُ ٱللَّهِ يُفَجِّرُونَهَا تَفْجِيرًا ۝

**7.** వారు తమ మొక్కుబడులను పూర్తి చేసుకున్నవారై ఉంటారు.[3] మరియు దాని హాని అన్ని వైపులా క్రమ్ముకొనే, ఆ దినమును గురించి భయపడుతూ ఉంటారు.

يُوفُونَ بِٱلنَّذْرِ وَيَخَافُونَ يَوْمًا كَانَ شَرُّهُۥ مُسْتَطِيرًا ۝

**8.** మరియు అది తమకు ప్రీతికరమైనప్పటికీ, వారు నిరుపేదలకు మరియు అనాథులకు మరియు ఖైదీలకు, ఆహారం పెట్టేవారై ఉంటారు.[4]

وَيُطْعِمُونَ ٱلطَّعَامَ عَلَىٰ حُبِّهِۦ مِسْكِينًا وَيَتِيمًا وَأَسِيرًا ۝

**9.** వారు (వారితో ఇలా అంటారు): "వాస్తవానికి మేము అల్లాహ్ ప్రసన్నత కొరకే మీకు ఆహారం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలం గానీ, లేదా కృతజ్ఞతలు గానీ ఆశించటం లేదు.

إِنَّمَا نُطْعِمُكُمْ لِوَجْهِ ٱللَّهِ لَا نُرِيدُ مِنكُمْ جَزَآءً وَلَا شُكُورًا ۝

**10.** "నిశ్చయంగా, మేము మా ప్రభువు నుండి వచ్చే ఉగ్రమైన, దుర్భరమైన, ఆ దినానికి భయపడుతున్నాము!"

إِنَّا نَخَافُ مِن رَّبِّنَا يَوْمًا عَبُوسًا قَمْطَرِيرًا ۝

---

1 చూడండి, 83:25-28.

2 అంటే అది ఎన్నటికీ తరిగిపోదు.

3 మొక్కుబడులు కేవలం అల్లాహ్ (సు.తా.)కే చేస్తారు మరియు వాటిని పూర్తిచేస్తారు. 'అల్లాహ్ (సు.తా.) పేరుతో మొక్కుబడిచేసుకుంటే దానిని పూర్తి చేసుకోవాలి.' ('స. బు'ఖారీ)

4 దైవప్రవక్త ('స'అస) ఆదేశానుసారం 'స'హాబీలు (ర'ది.'అన్హుమ్) బద్ర్‌యుద్ధ ఖైదీలకు ముందట అన్నం పెట్టి, తరువాత తాము తినేవారు, (ఇబ్నె కసీ'ర్). మన అధీనంలో ఉన్న సేవకులతో కూడా మంచిగా వ్యవహరించాలి. దైవప్రవక్త ('స'అస) చివరి ఉపదేశం, "నమా'జ్‌ను మరియు మీ సేవకులను ఆదరించండి." (ఇబ్నె మాజా) ఇంకా చూడండి, 2:177 మరియు 90:14-16.

| | |
|---|---|
| **11.** కావున అల్లాహ్ వారిని ఆ దినపు కీడు నుండి కాపాడాడు. మరియు వారికి ఉల్లాసాన్ని మరియు ఆనందాన్ని ప్రసాదించాడు. | فَوَقٰىهُمُ اللّٰهُ شَرَّ ذٰلِكَ الْيَوْمِ وَلَقّٰىهُمْ نَضْرَةً وَّسُرُوْرًا ۝١١ |
| **12.** మరియు వారి సహనానికి[1] ప్రతిఫలంగా వారికి స్వర్గాన్ని మరియు పట్టువస్త్రాలను ఇచ్చాడు.[2] | وَجَزٰىهُمْ بِمَا صَبَرُوْا جَنَّةً وَّحَرِيْرًا ۝١٢ |
| **13.** అందులో, వారు ఎత్తైన పీఠాలమీద దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు. అందులో వారు ఎండ (బాధ)గానీ, చలి తీవ్రతనుగానీ చూడరు! | مُّتَّكِـِٕيْنَ فِيْهَا عَلَى الْاَرَاۤىِٕكِ ۚ لَا يَرَوْنَ فِيْهَا شَمْسًا وَّلَا زَمْهَرِيْرًا ۝١٣ |
| **14.** మరియు అందులో వారిపై నీడలు పడుతుంటాయి.[3] దాని ఫలాల గుత్తులు వారికి అందుబాటులో ఉంటాయి. | وَدَانِيَةً عَلَيْهِمْ ظِلٰلُهَا وَذُلِّلَتْ قُطُوْفُهَا تَذْلِيْلًا ۝١٤ |
| **15.** మరియు వారి మధ్య వెండిపాత్రలు మరియు గాజుగ్లాసులు త్రిప్పబడుతూ ఉంటాయి. | وَيُطَافُ عَلَيْهِمْ بِاٰنِيَةٍ مِّنْ فِضَّةٍ وَّاَكْوَابٍ كَانَتْ قَوَارِيْرَا۠ ۝١٥ |
| **16.** ఆ గాజుగ్లాసులు స్ఫటికంవలే తెల్లనైన వెండితో చేయబడిఉంటాయి. అవి నియమబద్ధంగా నింపబడిఉంటాయి. | قَوَارِيْرَا۠ مِنْ فِضَّةٍ قَدَّرُوْهَا تَقْدِيْرًا ۝١٦ |
| **17.** మరియు వారికి సొంటి కలిపిన మధుపాత్రలు త్రాగటానికి ఇవ్వబడతాయి.[4] | وَيُسْقَوْنَ فِيْهَا كَأْسًا كَانَ مِزَاجُهَا زَنْجَبِيْلًا ۝١٧ |
| **18.** అది స్వర్గంలోని సల్‌సబీల్ అనే పేరు గల ఒక ఊట! (7/8) | عَيْنًا فِيْهَا تُسَمّٰى سَلْسَبِيْلًا ۝١٨ |
| **19.** * మరియు వారి మధ్య శాశ్వతంగా, యవ్వనులుగా ఉండే బాలురు తిరుగుతూ | وَيَطُوْفُ عَلَيْهِمْ وِلْدَانٌ مُّخَلَّدُوْنَ ۚ اِذَا رَاَيْتَهُمْ حَسِبْتَهُمْ لُؤْلُؤًا مَّنْثُوْرًا ۝١٩ |

1 'సబరున్ సహనం, అంటే ధర్మమార్గంలో వచ్చే కష్టాలను భరించటం. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞాపాలన కొరకు తమ సుఖసంతోషాలను మరియు ఆపేక్షలను త్యాగం చేయటం. అల్లాహ్ (సు.తా.) అవిధేయతనుండి దూరంగా ఉండటం.

2. చూడండి, 18:31.

3. చూడండి, 4:57.

4 చూడండి, 43:71

ఉంటారు. మరియు నీవు వారిని చూస్తే, వారిని వెదజల్లిన ముత్యాలుగా భావిస్తావు.[1]

وَإِذَا رَأَيْتَ ثَمَّ رَأَيْتَ نَعِيمًا وَمُلْكًا كَبِيرًا ﴿٢٠﴾

**20.** మరియు నీవు అక్కడ (స్వర్గంలో) చూస్తే, ఎక్కడ చూసినా ఆనందమే పొందుతావు. మరియు ఒక మహత్తర సామ్రాజ్య వైభవం కనిపిస్తుంది.

عَالِيَهُمْ ثِيَابُ سُندُسٍ خُضْرٌ وَإِسْتَبْرَقٌ ۖ وَحُلُّوا أَسَاوِرَ مِن فِضَّةٍ وَسَقَاهُمْ رَبُّهُمْ شَرَابًا طَهُورًا ﴿٢١﴾

**21.** వారి ఒంటి మీద సన్నని ఆకుపచ్చని శ్రేష్ఠమైన పట్టు వస్త్రాలు మరియు బంగారు జలతారు అల్లిన దుస్తులుంటాయి. మరియు వారికి వెండి కంకణాలు తొడిగించబడతాయి మరియు వారి ప్రభువు వారికి నిర్మలమైన పానీయాన్ని త్రాగటానికి ప్రసాదిస్తాడు.

إِنَّ هَٰذَا كَانَ لَكُمْ جَزَاءً وَكَانَ سَعْيُكُم مَّشْكُورًا ﴿٢٢﴾

**22.** (వారితో ఇలా అనబడుతుంది): "నిశ్చయంగా, ఇది మీకు ఇవ్వబడే ప్రతిఫలం ఎందుకంటే, మీ శ్రమ అంగీకరించబడింది."

إِنَّا نَحْنُ نَزَّلْنَا عَلَيْكَ الْقُرْآنَ تَنزِيلًا ﴿٢٣﴾

**23.** నిశ్చయంగా, మేమే, ఈ ఖుర్ఆన్‌ను, నీ పై (ఓ ము'హమ్మద్!) క్రమక్రమంగా అవతరింపజేశాము.

فَاصْبِرْ لِحُكْمِ رَبِّكَ وَلَا تُطِعْ مِنْهُمْ آثِمًا أَوْ كَفُورًا ﴿٢٤﴾

**24.** కావున నీవు నీ ప్రభువు యొక్క ఆజ్ఞ పై స్థిరంగా ఉండు మరియు వీరిలోని ఏ పాపి యొక్క లేదా సత్యతిరస్కారుని యొక్క మాట గాని వినకు.[2]

وَاذْكُرِ اسْمَ رَبِّكَ بُكْرَةً وَأَصِيلًا ﴿٢٥﴾

**25.** మరియు నీ ప్రభువు నామాన్ని ఉదయం మరియు సాయంత్రం స్మరిస్తూ ఉండు.[3]

---

1 వారు ఎల్లప్పుడూ బాలురుగానే ఉంటారు వారు వృద్ధులు కారు వారికి మరణం రాదు ఇంకా చూడండి. 56.17 18 మరియు 52:24

2 మక్కా సత్యతిరస్కారులు దైవప్రవక్త (స'అస)ను అతని ధర్మప్రచారాన్ని ఆపమనే వారు మరియు తమ దేవతలను ఆరాధించమనే వారు దానికి బదులుగా వారు అతనికి కోరినంత ధనం, అధికారం, ఇస్తాం అనేవారు మరియు అతనికి ఇష్టమైన స్త్రీతో వివాహం చేయిస్తాం అనేవారు. (ఫత్'హ్ అల్-ఖదీర్).

3 అంటే అన్ని వేళలలో ఉదయం ఫజ్ర్, సాయంత్రం 'జుహ్ర్ మరియు 'అస్ర్ నమా'జ్‌లు

26. మరియు రాత్రివేళ ఆయన సన్నిధిలో సాష్టాంగం (సజ్దా) చేస్తూఉండు [1] మరియు రాత్రి వేళ సుదీర్ఘకాలం, ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండు.

وَمِنَ الَّيْلِ فَاسْجُدْ لَهٗ وَسَبِّحْهُ لَيْلًا طَوِيْلًا ﴿٢٦﴾

27. నిశ్చయంగా, వీరు అనిశ్చితమైన ఈ ప్రాపంచిక జీవితంపట్ల మోహితులైవున్నారు. మరియు ముస్ముందు రానున్న భారమైన దినాన్ని విస్మరిస్తున్నారు. [2]

اِنَّ هٰٓؤُلَآءِ يُحِبُّوْنَ الْعَاجِلَةَ وَيَذَرُوْنَ
وَرَآءَهُمْ يَوْمًا ثَقِيْلًا ﴿٢٧﴾

28. మేమే వీరిని సృష్టించినవారము మరియు వీరి శరీరాన్ని దృఢపరిచినవారము మరియు మేము కోరినప్పుడు వీరికి బదులుగా వీరివంటి వారిని తేగలము

نَحْنُ خَلَقْنٰهُمْ وَشَدَدْنَآ اَسْرَهُمْ ۚ وَاِذَا شِئْنَا
بَدَّلْنَآ اَمْثَالَهُمْ تَبْدِيْلًا ﴿٢٨﴾

29. నిశ్చయంగా, ఇదొక హితోపదేశం కావున ఇష్టపడిన వాడు తన ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు!

اِنَّ هٰذِهٖ تَذْكِرَةٌ ۚ فَمَنْ شَآءَ اتَّخَذَ اِلٰى رَبِّهٖ
سَبِيْلًا ﴿٢٩﴾

30. మరియు, అల్లాహ్ కోరకపోతే, మీరు కోరేదీ (జరగదు)! నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَمَا تَشَآءُوْنَ اِلَّآ اَنْ يَّشَآءَ اللّٰهُ ۗ اِنَّ اللّٰهَ كَانَ
عَلِيْمًا حَكِيْمًا ﴿٣٠﴾

31. ఆయన, తాను కోరిన వారిని తన కారుణ్యంలోకి తీసుకుంటాడు. మరియు దుర్మార్గుల కొరకు, ఆయన బాధాకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు

يُّدْخِلُ مَنْ يَّشَآءُ فِيْ رَحْمَتِهٖ ۗ وَالظّٰلِمِيْنَ
اَعَدَّ لَهُمْ عَذَابًا اَلِيْمًا ﴿٣١﴾

---

1. రాత్రివేళలో మ'గ్రిబ్ మరియు 'ఇషా నమా'జ్‌లు మరియు తహజ్జుద్ నమా'జ్‌లు
2. భారమైన దినం అంటే పునరుత్థాన దినం.

## 77. సూరహ్ అల్-ముర్సలాత్

## سورة المرسلات

అల్-ముర్సలాతు: Those sent forth. పంపబడేవి. ఈ సూరహ్ ఆరంభ మక్కా కాలపు సూరాహ్‌లలో ఒకటి. ఈ సూరహ్ సత్యతిరస్కారులను రాబోయే జీవితపు శిక్ష గురించి హెచ్చరిస్తుంది. 'అబ్దుల్లాహ్ ఇబ్నె మస్'ఊద్ (ర'ది.'అ) కథనం: 'మేము మునాలోని ఒక గుహలో ఉండగా ఈ సూరహ్ అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) దీనిని చదువుతుండగా ఆకస్మాత్తుగా ఒక పాము వచ్చింది. దైవ ప్రవక్త ('స'అస) దానిని చంపమన్నారు. కాని అది త్వరగా వెళ్ళిపోయింది. అప్పుడు అతనన్నారు: 'నీవు దాని హానినుండి మరియు అది నీ హాని నుండి తప్పించుకున్నారు.' ('స'హీ'హ్ బు'ఖారీ మరియు 'స'హీ'హ్ ముస్లిం). దైవప్రవక్త ('స'అస) కొన్ని సార్లు మ'గ్‌రిబ్ నమా'జ్‌లో ఈ సూరహ్ చదివే వారు ('స'హీ'హ్ బు'ఖారీ). ఇందులో **50** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** ఒకదాని తరువాత ఒకటి, వరుసగా పంపబడే వాయువుల సాక్షిగా![1]

وَالْمُرْسَلَاتِ عُرْفًا ①

**2.** మరియు తీవ్రమైన వేగంతో వీచే వాయువుల సాక్షిగా![2]

فَالْعَاصِفَاتِ عَصْفًا ②

**3.** మరియు మేఘాలను దూరదూరంగా వ్యాపింపజేసే వాయువుల సాక్షిగా![3]

وَالنَّاشِرَاتِ نَشْرًا ③

**4.** మరియు మంచి చెడులను విశదపరచే (దైవదూతల) సాక్షిగా![4]

فَالْفَارِقَاتِ فَرْقًا ④

**5.** సందేశాలను ప్రవక్తల వద్దకు తెచ్చే (దైవదూత) సాక్షిగా![5]

فَالْمُلْقِيَاتِ ذِكْرًا ⑤

---

**1.** లేక దైవదూతల, లేక సందేశహరుల సాక్షిగా అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. 'ఉర్‌ఫన్ అంటే దివ్యజ్ఞానం (వ'హీ) లేక షరీయత్ ఆజ్ఞలని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం.

**2** లేక దైవదూతల సాక్షిగా! ఎవరైతే తీవ్రంగా వీచే గాలులతో సహా పంపబడతారో.

**3** లేక దైవదూతల సాక్షిగా! ఇబ్నె కసీ'ర్. 'తబరీ మరియు ఇతర చాలా మంది వ్యాఖ్యాతలు కూడా (రహ్మ.) ఈ మూడు ఆయతులలో గాలుల ప్రస్తావన ఉందనే అభిప్రాయపడ్డారు.

**4** లేక ఖుర్‌ఆన్ ఆయతుల లేక ప్రవక్తల సాక్షిగా.

**5** లేక అల్లాహ్ (సు.తా.) యొక్క వహీని ప్రజలకు అందజేసే ప్రవక్త ('అ.స.)ల సాక్షిగా. ఇమామ్ షౌకాని అభిప్రాయంలో: ముర్సలాత్, 'ఆసిఫాత్ మరియు నాషిరాత్ గాలులను సంబోధిస్తున్నాయి.

عُذْرًا أَوْ نُذْرًا ﴿٦﴾

**6.** సాకుగా లేక హెచ్చరికగా![1]

إِنَّمَا تُوعَدُونَ لَوَاقِعٌ ﴿٧﴾

**7.** నిశ్చయంగా, మీకు వాగ్దానం చేయబడినది, జరగవలసి ఉంది

فَإِذَا النُّجُومُ طُمِسَتْ ﴿٨﴾

**8.** అప్పుడు ఎప్పుడైతే నక్షత్రాలు కాంతిహీనమై పోతాయో!

وَإِذَا السَّمَاءُ فُرِجَتْ ﴿٩﴾

**9.** మరియు ఆకాశం చీలిపోతుందో!

وَإِذَا الْجِبَالُ نُسِفَتْ ﴿١٠﴾

**10.** మరియు పర్వతాలు పొడిగా మారి, చెల్లాచెదురుగా చేయబడతాయో!

وَإِذَا الرُّسُلُ أُقِّتَتْ ﴿١١﴾

**11.** మరియు ప్రవక్తలు తమ నిర్ణీత సమయంలో సమావేశపరచబడతారో![2]

لِأَيِّ يَوْمٍ أُجِّلَتْ ﴿١٢﴾

**12.** ఏ దినానికి గాను, (ఇవన్నీ) వాయిదా వేయబడ్డాయి?

لِيَوْمِ الْفَصْلِ ﴿١٣﴾

**13.** ఆ తీర్పు దినం కొరకా![3]

وَمَا أَدْرَاكَ مَا يَوْمُ الْفَصْلِ ﴿١٤﴾

**14.** మరియు ఆ తీర్పుదినం అంటే ఏమిటో నీకెలా అర్థంకాగలదు?

وَيْلٌ يَوْمَئِذٍ لِلْمُكَذِّبِينَ ﴿١٥﴾

**15** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

أَلَمْ نُهْلِكِ الْأَوَّلِينَ ﴿١٦﴾

**16.** ఏమీ? మేము పూర్వీకులను నాశనం చేయలేదా?

ثُمَّ نُتْبِعُهُمُ الْآخِرِينَ ﴿١٧﴾

**17.** తరువాత రాబోయే వారిని కూడా, మేము వారి వెనక పంపుతాము.

---

మరియు ఫారిఖాత్ ముల్ఖియాత్ దైవదూతలను. ఈ వ్యాఖ్యానంతో కూడా చాలామంది వ్యాఖ్యాతలు ఏకీభవిస్తున్నారు.

1 దీని మరొక తాత్పర్యం "(మానవులకు) తెలియజేసే ఉద్దేశంతో గానీ, లేక హెచ్చరిక చేయటానికి గానీ."

2 చూడండి, 4:41 42, 5:109, 7:6 లేక 39:69

3 యౌమల్ ఫస్ల్: పునరుత్థానదినం. ఖుర్ఆన్ అవతరణాక్రమంలో ఇక్కడ మొదటి సారి పేర్కొనబడింది. ఇంకా చూడండి, 37:21, 44:40 78:17 మరియు 77:38

كَذَٰلِكَ نَفْعَلُ بِالْمُجْرِمِينَ ﴿١٨﴾

**18.** ఈ విధంగా మేము నేరస్థుల పట్ల వ్యవహరిస్తాము.

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿١٩﴾

**19.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

أَلَمْ نَخْلُقكُّم مِّن مَّاءٍ مَّهِينٍ ﴿٢٠﴾

**20.** ఏమీ? మేము మిమ్మల్ని తుచ్ఛమైన నీటితో (వీర్యబిందువుతో) సృష్టించలేదా?

فَجَعَلْنَاهُ فِي قَرَارٍ مَّكِينٍ ﴿٢١﴾

**21.** తరువాత మేము దానిని ఒక భద్రమైన స్థానంలో ఉంచాము.

إِلَىٰ قَدَرٍ مَّعْلُومٍ ﴿٢٢﴾

**22.** ఒక నిర్ణీతకాలం వరకు.

فَقَدَرْنَا فَنِعْمَ الْقَادِرُونَ ﴿٢٣﴾

**23.** ఈ విధంగా మేము నిర్ణయించాము. ఎందుకంటే మేమే ఉత్తమమైన నిర్ణయాలు తీసుకునేవారము.[1]

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٢٤﴾

**24.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

أَلَمْ نَجْعَلِ الْأَرْضَ كِفَاتًا ﴿٢٥﴾

**25.** ఏమీ? మేము భూమిని ఒక సమీకరించే స్థానంగా చేయలేదా?

أَحْيَاءً وَأَمْوَاتًا ﴿٢٦﴾

**26.** జీవులకూ మరియు మృతులకూను?

وَجَعَلْنَا فِيهَا رَوَاسِيَ شَامِخَاتٍ وَأَسْقَيْنَاكُم مَّاءً فُرَاتًا ﴿٢٧﴾

**27.** మరియు దానిలో ఎత్తైన పర్వతాలను స్థిరంగా నిలుపలేదా? మరియు మీకు త్రాగటానికి మంచినీటిని ప్రసాదించలేదా?

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٢٨﴾

**28.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

انطَلِقُوا إِلَىٰ مَا كُنتُم بِهِ تُكَذِّبُونَ ﴿٢٩﴾

**29.** (సత్యతిరస్కారులతో ఇలా అనబడుతుంది): "మీరు తిరస్కరిస్తూ వచ్చిన దాని వైపునకు పొండి!"

انطَلِقُوا إِلَىٰ ظِلٍّ ذِي ثَلَاثِ شُعَبٍ ﴿٣٠﴾

**30.** (దాని పొగ) మూడు శాఖలుగా చీలిపోయే నీడ వైపునకు పొండి;

---

**1.** చూడండి, 23:12-14.

لَّا ظَلِيلٍ وَلَا يُغْنِي مِنَ اللَّهَبِ ٣١

**31.** కాని అది ఏ విధమైన (చల్లని)నీడనూ ఇవ్వదూ మరియు (నరక) జ్వాలల నుండి కూడా కాపాడదు!

إِنَّهَا تَرْمِي بِشَرَرٍ كَالْقَصْرِ ٣٢

**32.** వాస్తవానికి, అది పెద్ద పెద్ద మొద్దుల వంటి అగ్నికణాలను విసురుతుంది.

كَأَنَّهُ جِمَالَتٌ صُفْرٌ ٣٣

**33.** వాస్తవానికి ఆ అగ్నికణాలు పసుపు పచ్చని ఒంటెలవలే కనిపిస్తాయి.

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ٣٤

**34.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

هَٰذَا يَوْمُ لَا يَنطِقُونَ ٣٥

**35.** ఆ దినాన వారు మాట్లాడలేరు.

وَلَا يُؤْذَنُ لَهُمْ فَيَعْتَذِرُونَ ٣٦

**36.** మరియు వారికి సాకులు చెప్పుకునే అవకాశం కూడా ఇవ్వబడదు.

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ٣٧

**37.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

هَٰذَا يَوْمُ الْفَصْلِ ۖ جَمَعْنَاكُمْ وَالْأَوَّلِينَ ٣٨

**38.** అది తీర్పుదినమై ఉంటుంది! మేము మిమ్మల్ని మరియు మీ పూర్వీకులను సమావేశపరచి ఉంటాము!

فَإِن كَانَ لَكُمْ كَيْدٌ فَكِيدُونِ ٣٩

**39.** కావున మీవద్ద ఏదైనా పన్నాగముంటే దానిని పన్నండి.[1]

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ٤٠

**40.** ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

إِنَّ الْمُتَّقِينَ فِي ظِلَالٍ وَعُيُونٍ ٤١

**41.** నిశ్చయంగా భయభక్తులు గలవారు (ఆ రోజు చల్లని) నీడలలో చెలమల దగ్గర ఉంటారు.

وَفَوَاكِهَ مِمَّا يَشْتَهُونَ ٤٢

**42.** మరియు వారికి, వారు కోరే ఫలాలు లభిస్తాయి.

كُلُوا وَاشْرَبُوا هَنِيئًا بِمَا كُنتُمْ تَعْمَلُونَ ٤٣

**43.** (వారితో ఇలా అనబడుతుంది): "మీరు చేస్తూ ఉండిన కర్మలకు ఫలితంగా హాయిగా

1. ఇటువంటి సందేశం గల ఆయత్ కోసం చూడండి, 55:33

తినండి, త్రాగండి!"

44. నిశ్చయంగా, మేము సజ్జనులకు ఇలాంటి ప్రతిఫలమే ఇస్తాము.

إِنَّا كَذَٰلِكَ نَجْزِي الْمُحْسِنِينَ ﴿٤٤﴾

45. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٥﴾

46. (ఓ సత్యతిరస్కారులారా!) మీరు కొంతకాలం తినండి, సుఖాలు అనుభవించండి. నిశ్చయంగా, మీరు నేరస్థులు!

كُلُوا وَتَمَتَّعُوا قَلِيلًا إِنَّكُم مُّجْرِمُونَ ﴿٤٦﴾

47. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది!

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٧﴾

48. మరియు వారితో: "(అల్లాహ్ ముందు) వంగండి (రుకూ'ఉ చేయండి)." అని అన్నప్పుడు, వారు వంగలేదు.

وَإِذَا قِيلَ لَهُمُ ارْكَعُوا لَا يَرْكَعُونَ ﴿٤٨﴾

49. ఆ రోజు (పునరుత్థానాన్ని) తిరస్కరించే వారికి వినాశం ఉంది![1]

وَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ﴿٤٩﴾

50. దీని (ఈ ఖుర్ఆన్) తరువాత, ఇక వారు మరెలాంటి సందేశాన్ని విశ్వసిస్తారు?

فَبِأَيِّ حَدِيثٍ بَعْدَهُ يُؤْمِنُونَ ﴿٥٠﴾

1 ఈ ఆయత్ ఈ సూరహ్‌లో పదిసార్లు వచ్చింది. ఏ విధంగానైతే: "అయితే మీరిరువురు (మానవులు మరియు జిన్నాతులు) మీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను నిరాకరిస్తారు?" అనే ఆయతు సూరహ్ అర్ రహ్మాన్ (55)లో 31సార్లు, వచ్చిందో! అంటే, పునరుత్థానదినాన్ని తిరస్కరించే వారికి వినాశం తప్పదనే విషయాన్ని అల్లాహుతా'ఆలా మాటిమాటికి విశదీకరిస్తున్నాడు.

## 78. సూరహ్ అన్-నబా'

## سُورَةُ النَّبَإِ

అన్-నబా': The Great News, The Tiding, వార్త, సమాచారం. ఈ పేరు రెండవ ఆయత్‌లో నుండి తీసుకోబడింది. ఇది చివరి మక్కా కాలపు సూరహ్. ఇది పునరుత్థానం మరియు అంతిమ తీర్పులను గురించి తెలుపుతోంది. ఇందులో 40 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

عَمَّ يَتَسَآءَلُوْنَ ①

1. (*) ఏ విషయాన్ని గురించి వారు (ఒకరినొకరు) ప్రశ్నించుకుంటున్నారు?[1]

عَنِ النَّبَاِ الْعَظِيْمِ ②

2. ఆ మహా వార్తను గురించేనా?

الَّذِيْ هُمْ فِيْهِ مُخْتَلِفُوْنَ ③

3. దేనిని గురించైతే వారు భేదాభిప్రాయాలను కలిగిఉన్నారో!

كَلَّا سَيَعْلَمُوْنَ ④

4. అదికాదు! వారు త్వరలోనే దానిని తెలుసుకోగలరు.

ثُمَّ كَلَّا سَيَعْلَمُوْنَ ⑤

5. ఎంత మాత్రము కాదు! వారు త్వరలోనే దానిని తెలుసుకోగలరు.

اَلَمْ نَجْعَلِ الْاَرْضَ مِهٰدًا ⑥

6. ఏమీ? మేము భూమిని పరుపుగా చేయలేదా?

وَّالْجِبَالَ اَوْتَادًا ⑦

7. మరియు పర్వతాలను మేకులుగా?[2]

وَّخَلَقْنٰكُمْ اَزْوَاجًا ⑧

8. మరియు మేము మిమ్మల్ని (స్త్రీ-పురుషుల) జంటలుగా సృష్టించాము.[3]

---

1 దైవప్రవక్త(స'అస)పై అవతరింపజేయబడిన ఖుర్ఆన్‌ను మరియు అతనిని ప్రవక్తగా అల్లాహ్ (సు.తా.) ఎన్నుకున్న విషయాన్ని నమ్మలేక సత్యతిరస్కారులు ఒకరితో నొకరు ఈ విధంగా ప్రశ్నించుకున్నారు: "ఏమీ? పునరుత్థానం నిజమేనా? ఇతడు వాస్తవంగానే ప్రవక్తనా?" మొదలైనవి. దానికి అల్లాహ్ (సు.తా.) స్వయంగా జవాబిచ్చాడు.

2 చూడండి, 16:15.

3 మానవులలో, జంతువులలో మరియు ఇతర ప్రాణంలేని వస్తువులలో కూడా జంటలున్నాయి. ఉదా: రాత్రింబవళ్ళు, సూర్యచంద్రులు, ఆకాశం భూమి, నలుపు తెలుపు మొదలైనవి. ఇంకా చూడండి, 36:36.

وَّجَعَلْنَا نَوْمَكُمْ سُبَاتًا ۝٩

**9.** మరియు మేము నిద్రను, మీకు విశ్రాంతి నిచ్చేదిగా చేశాము.

وَّجَعَلْنَا الَّيْلَ لِبَاسًا ۝١٠

**10.** మరియు రాత్రిని ఆచ్ఛాదంగా చేశాము.

وَّجَعَلْنَا النَّهَارَ مَعَاشًا ۝١١

**11.** మరియు పగటిని జీవనోపాధి సమయంగా చేశాము.

وَبَنَيْنَا فَوْقَكُمْ سَبْعًا شِدَادًا ۝١٢

**12.** మరియు మేము మీపైన పటిష్ఠమైన ఏడు (ఆకాశాలను) నిర్మించాము.

وَّجَعَلْنَا سِرَاجًا وَّهَّاجًا ۝١٣

**13.** మరియు (అందులో) ప్రకాశించే దీపాన్ని (సూర్యుణ్ణి) ఉంచాము.

وَّاَنْزَلْنَا مِنَ الْمُعْصِرٰتِ مَآءً ثَجَّاجًا ۝١٤

**14.** మరియు మేఘాలనుండి ధారాపాతంగా వర్షాన్ని కురిపించాము.[1]

لِّنُخْرِجَ بِهٖ حَبًّا وَّنَبَاتًا ۝١٥

**15.** దానితో మేము ధాన్యం మరియు పచ్చికను (చెట్లుచేమలను) పెరిగించటానికి!

وَّجَنّٰتٍ اَلْفَافًا ۝١٦

**16.** మరియు దట్టమైన తోటలను.

اِنَّ يَوْمَ الْفَصْلِ كَانَ مِيْقَاتًا ۝١٧

**17.** నిశ్చయంగా, తీర్పుదినం ఒక నిర్ణీత సమయం.[2]

يَّوْمَ يُنْفَخُ فِى الصُّوْرِ فَتَاْتُوْنَ اَفْوَاجًا ۝١٨

**18.** ఆ రోజు బాకా ఊద బడినప్పుడు! అప్పుడు మీరంతా గుంపులు గుంపులుగా లేచివస్తారు.

وَّفُتِحَتِ السَّمَآءُ فَكَانَتْ اَبْوَابًا ۝١٩

**19.** మరియు ఆకాశం తెరువబడుతుంది, అందులో ద్వారాలు ఏర్పడుతాయి;

وَّسُيِّرَتِ الْجِبَالُ فَكَانَتْ سَرَابًا ۝٢٠

**20.** మరియు పర్వతాలు ఎండమావులుగా అదృశ్యమైపోతాయి.[3]

اِنَّ جَهَنَّمَ كَانَتْ مِرْصَادًا ۝٢١

**21.** నిశ్చయంగా, నరకం ఒక మాటు;

لِّلطّٰغِيْنَ مَاٰبًا ۝٢٢

**22.** ధిక్కారుల గమ్యస్థానం;

---

1. ము'అ'సిరాత్: నీటితో నిండి ఉండి ఇంకా కురవని మేఘాలు.

2. చూడండి, 77:13

3. చూడండి, 69:14, 14:48, 101:5, 70:9, 56:6, 20:105, మొదలైనవి

23. అందులో వారు యుగాలతరబడి ఉంటారు.[1]

لَّٰبِثِينَ فِيهَآ أَحْقَابًا ۝

24. అందులో వారు ఎలాంటి చల్లదనాన్ని గానీ మరియు (చల్లని) పానీయాన్ని గానీ చవిచూడరు.

لَّا يَذُوقُونَ فِيهَا بَرْدًا وَلَا شَرَابًا ۝

25 సలసల కాగే నీరు మరియు చీములాంటి మురికి (పానీయం) తప్ప![2]

إِلَّا حَمِيمًا وَغَسَّاقًا ۝

26 (వారి కర్మలకు) తగిన పూర్తి ప్రతిఫలంగా!

جَزَآءً وِفَاقًا ۝

27. వాస్తవానికి వారు లెక్క తీసుకోబడుతుందని ఆశించలేదు.

إِنَّهُمْ كَانُوا۟ لَا يَرْجُونَ حِسَابًا ۝

28. పైగా వారు మా సూచన(ఆయాత్)లను అసత్యాలని తిరస్కరించారు.

وَكَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا كِذَّابًا ۝

29. మరియు మేము (వారు చేసిన) ప్రతి దానిని ఒక పుస్తకంలో వ్రాసిపెట్టాము.[3]

وَكُلَّ شَىْءٍ أَحْصَيْنَٰهُ كِتَٰبًا ۝

30. కావున మీరు (మీ కర్మల ఫలితాన్ని) చవిచూడండి. ఎందుకంటే, మేము మీకు శిక్షతప్ప మరేమీ అధికం చేయము.[4]

فَذُوقُوا۟ فَلَن نَّزِيدَكُمْ إِلَّا عَذَابًا ۝

31. నిశ్చయంగా, దైవభీతి గలవారికి సాఫల్యం (స్వర్గం) ఉంది;

إِنَّ لِلْمُتَّقِينَ مَفَازًا ۝

32. ఉద్యానవనాలూ, ద్రాక్షతోటలూ!

حَدَآئِقَ وَأَعْنَٰبًا ۝

33. మరియు ఈడూజోడూగల (యవ్వన) సుందర కన్యలు;

وَكَوَاعِبَ أَتْرَابًا ۝

34 మరియు నిండిపొర్లే (మధు) పాత్ర.

وَكَأْسًا دِهَاقًا ۝

---

1 చూడండి, 6:128 మరియు 11:107

2. చూడండి, 38:57-58.

3. చూడండి, 36:12.

4. చూడండి, 4:56, 17:97

لَا يَسْمَعُونَ فِيهَا لَغْوًا وَلَا كِذَّابًا ۝٣٥

**35.** అందులో (స్వర్గంలో) వారు ఏలాంటి వ్యర్థపు మాటలు గానీ, అసత్యాలు గానీ వినరు.

جَزَآءً مِّن رَّبِّكَ عَطَآءً حِسَابًا ۝٣٦

**36.** (ఇదంతా) నీ ప్రభువు తరఫునుండి లభించే ప్రతిఫలం, చాలినంత బహుమానం.

رَّبِّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَا ٱلرَّحْمَٰنِ لَا يَمْلِكُونَ مِنْهُ خِطَابًا ۝٣٧

**37.** భూమ్యాకాశాలు మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికి ప్రభువైన అనంత కరుణామయుని (బహుమానం), ఆయన ముందు మాట్లాడే సాహసం ఎవ్వరికీ లేదు.

يَوْمَ يَقُومُ ٱلرُّوحُ وَٱلْمَلَٰٓئِكَةُ صَفًّا لَّا يَتَكَلَّمُونَ إِلَّا مَنْ أَذِنَ لَهُ ٱلرَّحْمَٰنُ وَقَالَ صَوَابًا ۝٣٨

**38.** ఏ రోజునయితే ఆత్మ (జిబ్రీల్)[1] మరియు దేవదూతలు వరుసలలో నిలిచి ఉంటారో! అప్పుడు ఆ అనంత కరుణామయుడు అనుమతించిన వాడు తప్ప, మరెవ్వరూ మాట్లాడలేరు; ఒకవేళ ఎవడైనా మాట్లాడినా అతడు సరైన మాటే మాట్లాడుతాడు.[2]

ذَٰلِكَ ٱلْيَوْمُ ٱلْحَقُّ ۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ رَبِّهِۦ مَـَٔابًا ۝٣٩

**39.** అదే అంతిమ సత్యదినం. కావున ఇష్టమున్నవాడు, తన ప్రభువు వైపునకు చేరే మార్గాన్ని అవలంబించాలి![3]

إِنَّآ أَنذَرْنَٰكُمْ عَذَابًا قَرِيبًا يَوْمَ يَنظُرُ ٱلْمَرْءُ مَا قَدَّمَتْ يَدَاهُ وَيَقُولُ ٱلْكَافِرُ يَٰلَيْتَنِى كُنتُ تُرَٰبًۢا ۝٤٠

**40.** నిశ్చయంగా, మేము అతి సమీపంలో ఉన్న శిక్షను గురించి మిమ్మల్ని హెచ్చరించాము. ఆ రోజు ప్రతి మనిషి తన చేజేతులా చేసుకొని ముందు పంపుకున్నదంతా ప్రత్యక్షంగా చూసుకుంటాడు.[4] మరియు సత్యతిరస్కారి: "అయ్యో, నా పాడుగాను! నేను మట్టినయి ఉంటే ఎంత బాగుండేది!"[5] అని వాపోతాడు.

---

1. చూడండి, 16:2 మరియు 97:4.
2. అల్లాహ్ (సు.తా.), దైవదూతలకు మరియు దైవప్రవక్తలకు (అలైహిమ్.స.) మాట్లాడే అనుమతి ఇస్తాడు. వారు కేవలం సత్యమే పలుకుతారు. చూడండి, 10:3.
3. చూడండి, 69:1.
4. చూడండి, 18:49 మరియు 75:13.
5. చూడండి, 69:27.

## 79. సూరహ్ అన్-నాజి'ఆత్

## سُورَةُ النَّازِعَاتِ

అన్ నాజి'ఆత్: Those Who Pull Out, బలవంతంగా లాగు లేక ఊడ్చువారు, లేక కఠినంగా తీయువారు. ఇది సూరహ్ అన్ నబా' (78) తరువాత అవతరింపజేయబడిన చివరి మక్కా కాలపు సూరహ్. ఇందులో 46 ఆయతులు ఉన్నాయి.

బిస్మిల్లాహిర్ రహ్మానిర్ రహీమ్

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَالنَّازِعَاتِ غَرْقًا ①

**1.** (అవిశ్వాసుల ప్రాణాలను) కఠినంగా లాగితీసే వారి (దేవదూతల) సాక్షిగా![1]

وَالنَّاشِطَاتِ نَشْطًا ②

**2.** (విశ్వాసుల ప్రాణాలను) నెమ్మదిగా తీసేవారి (దేవదూతల) సాక్షిగా![2]

وَالسَّابِحَاتِ سَبْحًا ③

**3.** (విశ్వంలో) తేలియాడుతూ పోయే వారి సాక్షిగా![3]

فَالسَّابِقَاتِ سَبْقًا ④

**4.** మరియు పందెంలో వలే (ఒకరితోనొకరు) పోటీపడే వారి సాక్షిగా!

فَالْمُدَبِّرَاتِ أَمْرًا ⑤

**5.** మరియు (తమ ప్రభువు) ఆజ్ఞానుసారం వ్యవహారాలు నిర్వహించే వారి (దేవదూతల) సాక్షిగా!

يَوْمَ تَرْجُفُ الرَّاجِفَةُ ⑥

**6.** ఆ రోజు (మొదటి) బాకా ధ్వని భూగోళాన్ని తీవ్రంగా కంపింపజేస్తుంది.[4]

تَتْبَعُهَا الرَّادِفَةُ ⑦

**7.** దాని తర్వాత రెండవసారి[5] బాకా ఊదబడుతుంది, (అప్పుడు అందరూ పునరుత్థరింపబడతారు).

---

1 నాజి'ఆత్: బలవంతంగా, కఠినంగా లాగి తీయటం. 'గర్ఖన్: మునిగి. ఈ సూరహ్‌లోని 1-5 ఆయతుల తాత్పర్యంలో వ్యాఖ్యాతల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

2 నష్'తన్: ముడివిప్పటం - అంటే నెమ్మదిగా తీయటం.

3. సబ్'హన్: ఈదుట, తేలుతూపోవుట.

4 ఇది మొదటి బాకా ధ్వని. దీనిని నఫ్ఖయె ఫనా అంటారు. అప్పుడు ప్రతిది నశిస్తుంది.

5. ఈ రెండవ బాకా ధ్వనితో అందరూ బ్రతికి తమ గోరీలనుండి బయటికి లేచి వస్తారు.

**8.** ఆ రోజు (కొన్ని) హృదయాలు (భయంతో) దడదడలాడుతూ ఉంటాయి.

قُلُوبٌ يَوْمَئِذٍ وَاجِفَةٌ ﴿٨﴾

**9.** వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి.

أَبْصَارُهَا خَاشِعَةٌ ﴿٩﴾

**10.** వారు ఇలా అంటున్నారు: "ఏమీ? మనం మన పూర్వస్థితిలోకి మళ్ళీ తీసుకు రాబడతామా?

يَقُولُونَ أَإِنَّا لَمَرْدُودُونَ فِي الْحَافِرَةِ ﴿١٠﴾

**11.** "మనం శిథిలమైన ఎముకలుగా మారిపోయిన తరువాత కూడానా?"

أَإِذَا كُنَّا عِظَامًا نَّخِرَةً ﴿١١﴾

**12.** వారు (ఇంకా ఇలా) అంటారు: "అయితే ఈ తిరిగి రావటమనేది చాల నష్టదాయకమైనదే!"

قَالُوا تِلْكَ إِذًا كَرَّةٌ خَاسِرَةٌ ﴿١٢﴾

**13.** కాని అది వాస్తవానికి, ఒకే ఒక (తీవ్రమైన) ధ్వని.

فَإِنَّمَا هِيَ زَجْرَةٌ وَاحِدَةٌ ﴿١٣﴾

**14.** అప్పుడు వారందరూ, ఒకేసారి లేచి మైదానంలోకి వచ్చి ఉంటారు.

فَإِذَا هُم بِالسَّاهِرَةِ ﴿١٤﴾

**15.** ఏమీ? నీకు మూసా వృత్తాంతం అందిందా?[1]

هَلْ أَتَاكَ حَدِيثُ مُوسَىٰ ﴿١٥﴾

**16.** అతని ప్రభువు పవిత్ర 'తువా లోయలో అతనిని పిలిచినప్పుడు,[2]

إِذْ نَادَاهُ رَبُّهُ بِالْوَادِ الْمُقَدَّسِ طُوًى ﴿١٦﴾

**17.** (ఇలా అన్నాడు): "ఫిర్'ఔన్ వద్దకు వెళ్ళు, నిశ్చయంగా, అతడు ధిక్కారు డయ్యాడు.

اذْهَبْ إِلَىٰ فِرْعَوْنَ إِنَّهُ طَغَىٰ ﴿١٧﴾

**18.** "ఇక (అతనితో) ఇట్లను: 'ఏమీ? నీవు పాపరహితుడవటానికి ఇష్టపడతావా?

فَقُلْ هَل لَّكَ إِلَىٰ أَن تَزَكَّىٰ ﴿١٨﴾

**19.** 'మరియు నేను నీకు నీ ప్రభువు వైపునకు మార్గదర్శకత్వం చేస్తాను, మరి నీవు

وَأَهْدِيَكَ إِلَىٰ رَبِّكَ فَتَخْشَىٰ ﴿١٩﴾

---

1. మూసా ('అ.స.) వృత్తాంతానికి చూడండి. 20:9-98
2. అల్లాహ్ (సు.తా.) మూసా('అ.స.)తో మాట్లాడాడు. అతనిని సందేశహరునిగా ఎన్నుకున్నాడు.

ఆయన పట్ల భీతికలిగి ఉంటావా?' "

فَأَرَىٰهُ ٱلْءَايَةَ ٱلْكُبْرَىٰ ﴿٢٠﴾

**20.** తరువాత అతను (మూసా) అతడికి (ఫిర్'ఔన్‌కు) గొప్ప అద్భుత నిదర్శనాన్ని చూపాడు

فَكَذَّبَ وَعَصَىٰ ﴿٢١﴾

**21.** కాని అతడు (ఫిర్'ఔన్) దానిని అబద్ధమని తిరస్కరించాడు మరియు (అతని మాటను) ఉల్లంఘించాడు.

ثُمَّ أَدْبَرَ يَسْعَىٰ ﴿٢٢﴾

**22.** ఆ తర్వాత అతడు (ఫిర్'ఔన్) వెనక్కి మరలిపోయి, (కుట్రలు) పన్నసాగాడు.

فَحَشَرَ فَنَادَىٰ ﴿٢٣﴾

**23.** పిదప (ప్రజలను) సమావేశపరచి, ఎలుగెత్తి చాటుతూ:

فَقَالَ أَنَا۠ رَبُّكُمُ ٱلْأَعْلَىٰ ﴿٢٤﴾

**24.** ఇలా అన్నాడు: "నేనే మీ యొక్క మహోన్నత ప్రభువును!"[1]

فَأَخَذَهُ ٱللَّهُ نَكَالَ ٱلْءَاخِرَةِ وَٱلْأُولَىٰٓ ﴿٢٥﴾

**25.** కావున అల్లాహ్ అతనిని ఇహపర లోకాల శిక్షకు గురిచేశాడు.[2]

إِنَّ فِى ذَٰلِكَ لَعِبْرَةً لِّمَن يَخْشَىٰٓ ﴿٢٦﴾

**26.** నిశ్చయంగా, ఇందులో(అల్లాహ్‌కు) భయపడే ప్రతివ్యక్తికొరకు గుణపాఠముంది

ءَأَنتُمْ أَشَدُّ خَلْقًا أَمِ ٱلسَّمَآءُ ۚ بَنَىٰهَا ﴿٢٧﴾

**27.** ఏమీ? మిమ్మల్ని సృష్టించడం కఠినమయిన పనా? లేక ఆకాశాన్నా? ఆయనే కదా దానిని నిర్మించింది![3]

رَفَعَ سَمْكَهَا فَسَوَّىٰهَا ﴿٢٨﴾

**28.** ఆయన దాని కప్పును (ఎత్తును) చాలా పైకి లేపాడు. తరువాత దానిని క్రమపరిచాడు;

وَأَغْطَشَ لَيْلَهَا وَأَخْرَجَ ضُحَىٰهَا ﴿٢٩﴾

**29.** మరియు ఆయన దాని రాత్రిని చీకటిగా చేశాడు మరియు దాని పగటిని (వెలుగును) బహిర్గతం చేశాడు.

---

1 చూడండి, 28:38 ఫిర్'ఔన్ తనను తాను దేవుడని చెప్పుకున్నాడు మరియు హద్దులు మీరి సత్యాన్ని తిరస్కరించాడు.

2. చూడండి, 7:137 అతని ఇహలోక శిక్షకు.

3. చూడండి, 2:29 మరియు 40:57

وَالْأَرْضَ بَعْدَ ذَٰلِكَ دَحَاهَا ۝٣٠

30. మరియు ఆ పిదప భూమిని పరచినట్లు చేశాడు.[1]

أَخْرَجَ مِنْهَا مَاءَهَا وَمَرْعَاهَا ۝٣١

31 దాని నుండి దాని నీళ్ళను మరియు దాని పచ్చికను బయటికి తీశాడు;

وَالْجِبَالَ أَرْسَاهَا ۝٣٢

32 మరియు పర్వతాలను (దానిలో) స్థిరంగా నాటాడు;

مَتَاعًا لَّكُمْ وَلِأَنْعَامِكُمْ ۝٣٣

33. మీకు మరియు మీ పశువులకు జీవన సామగ్రిగా![2]

فَإِذَا جَاءَتِ الطَّامَّةُ الْكُبْرَىٰ ۝٣٤

34. ఇక ఆ గొప్ప దుర్ఘటన (పునరుత్థాన దినం) వచ్చినప్పుడు;

يَوْمَ يَتَذَكَّرُ الْإِنسَانُ مَا سَعَىٰ ۝٣٥

35. ఆ రోజు మానవుడు తాను చేసిందంతా జ్ఞాపకం చేసుకుంటాడు;

وَبُرِّزَتِ الْجَحِيمُ لِمَن يَرَىٰ ۝٣٦

36. మరియు చూసేవారి యెదుటకు, నరకాగ్ని స్పష్టంగా కనబడేటట్లు తేబడుతుంది.[3]

فَأَمَّا مَن طَغَىٰ ۝٣٧

37 ఇక ధిక్కారంతో హద్దులు మీరి ప్రవర్తించిన వాడికి;

وَآثَرَ الْحَيَاةَ الدُّنْيَا ۝٣٨

38. మరియు ఐహిక జీవితానికి ప్రాధాన్యత నిచ్చిన వాడికి;

فَإِنَّ الْجَحِيمَ هِيَ الْمَأْوَىٰ ۝٣٩

39. నిశ్చయంగా, నరకాగ్నియే, వాని నివాసస్థాన మవుతుంది!

وَأَمَّا مَنْ خَافَ مَقَامَ رَبِّهِ وَنَهَى النَّفْسَ عَنِ الْهَوَىٰ ۝٤٠

40. మరియు తన ప్రభువు ముందు నిలబడ వలసి వుంటుందన్న భయంతో తన మనస్సును దుష్టవాంఛలకు దూరంగా ఉంచిన వ్యక్తికి;

فَإِنَّ الْجَنَّةَ هِيَ الْمَأْوَىٰ ۝٤١

41 నిశ్చయంగా, స్వర్గమే, అతని నివాసస్థాన మవుతుంది!

---

1 దహాహున్ అంటే నిప్పుకోడి గ్రుడ్డు ఆకారం అని కొందరు వ్యాఖ్యానించారు ఈ రోజు సైంటిస్టులు భూమి ఆకారం నిప్పుకోడి గ్రుడ్డు ఆకారంలో ఉందని నిరూపించారు

2. చూడండి, 80 24 32.

3. చూడండి, 26:91

يَسْـَٔلُونَكَ عَنِ ٱلسَّاعَةِ أَيَّانَ مُرْسَىٰهَا ﴿٤٢﴾

42. (ఓ ము'హమ్మద్!) వీరు నిన్ను ఆ ఘడియను గురించి: "అసలు అది ఎప్పుడొస్తుంది?" అని అడుగుతున్నారు.

فِيمَ أَنتَ مِن ذِكْرَىٰهَآ ﴿٤٣﴾

43. దాని గురించి చెప్పడానికి దాంతో నీకేమి సంబంధం?

إِلَىٰ رَبِّكَ مُنتَهَىٰهَآ ﴿٤٤﴾

44. దాని వాస్తవజ్ఞానం నీ ప్రభువుకే ఉంది!

إِنَّمَآ أَنتَ مُنذِرُ مَن يَخْشَىٰهَا ﴿٤٥﴾

45. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, నీవు, దానికి భయపడే వారిని హెచ్చరించే వాడవు మాత్రమే!

كَأَنَّهُمْ يَوْمَ يَرَوْنَهَا لَمْ يَلْبَثُوٓا۟ إِلَّا عَشِيَّةً أَوْ ضُحَىٰهَا ﴿٤٦﴾

46. వారు దానిని చూసిన రోజు (తాము ప్రపంచంలో) కేవలం ఒక సాయంత్రమో లేక ఒక ఉదయమో గడిపినట్లు భావిస్తారు.[1] (1/8)

## 80. సూరహ్ 'అబస

## سُورَةُ عَبَسَ

'అబస: He Frowned, కనుబొమలు ముడివేసుకున్నాడు, ముఖం చిట్లించుకున్నాడు, కోపముఖం చూపాడు. ఈ పదం మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. ఒకసారి దైవప్రవక్త ('స'అస) పెద్ద (అష్రాఫ్) ఖురైషులతో మాట్లాడుతూ ఉంటారు. అప్పుడు 'అబ్దుల్లాహ్ బిన్-ఉమ్మె మక్తూమ్ (ర'ది'అ) వచ్చి కొన్ని ధర్మవిషయాలను గురించి ప్రశ్నిస్తారు. అతడు అంధుడు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) అయిష్టతతో ముఖం చిట్లించుకుంటారు. అప్పుడు ఈ ఆయత్లు అవతరింపజేయబడతాయి. (తిర్మిజీ', అల్బానీ ప్రమాణీకం). ఇందులో 42 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

عَبَسَ وَتَوَلَّىٰٓ ﴿١﴾

1. * అతను (ప్రవక్త) భృకుటి ముడివేసుకున్నాడు మరియు ముఖం త్రిప్పుకున్నాడు;

أَن جَآءَهُ ٱلْأَعْمَىٰ ﴿٢﴾

2. ఆ గ్రుడ్డి వాడు తన వద్దకు వచ్చాడని!

---

1 మానవుడు చేసే భూమికి చెందిన కాల పరిమాణం పరలోకంలో ఉండదు. ఇంకా చూడండి. 2:259, 17:52, 18:19, 20:103-104, 23:112-113, 30:55. 'అషియ్యతున్ అంటే జుహ్ర్ నుండి సూర్యాస్తమయం వరకు మరియు 'దుహా అంటే సూర్యోదయం నుండి మధ్యాహ్నం వరకు.

3 కాని నీకేం తెలుసు? బహుశా అతడు తనను తాను సంస్కరించుకోవచ్చు!

وَمَا يُدْرِيكَ لَعَلَّهُۥ يَزَّكَّىٰٓ ۝٣

4. లేదా అతడు హితబోధ పొందవచ్చు మరియు ఆ హితబోధ అతనికి ప్రయోజనకరం కావచ్చు!

أَوْ يَذَّكَّرُ فَتَنفَعَهُ ٱلذِّكْرَىٰٓ ۝٤

5. కాని అతడు, ఎవడైతే తనను తాను స్వయంసమృద్ధుడు, అనుకుంటున్నాడో!

أَمَّا مَنِ ٱسْتَغْنَىٰ ۝٥

6 అతని పట్ల నీవు ఆసక్తి చూపుతున్నావు.[1]

فَأَنتَ لَهُۥ تَصَدَّىٰ ۝٦

7. ఒకవేళ అతడు సంస్కరించుకోకపోతే నీపై బాధ్యత ఏముంది?[2]

وَمَا عَلَيْكَ أَلَّا يَزَّكَّىٰ ۝٧

8. కాని, ఎవడైతే తనంతట తాను, నీ వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాడో!

وَأَمَّا مَن جَآءَكَ يَسْعَىٰ ۝٨

9. మరియు (అల్లాహ్ యెడల) భీతిపరుడై ఉన్నాడో!

وَهُوَ يَخْشَىٰ ۝٩

10. అతనిని నీవు నిర్లక్ష్యం చేస్తున్నావు.

فَأَنتَ عَنْهُ تَلَهَّىٰ ۝١٠

11. అలాకాదు! నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) ఒక హితోపదేశం.[3]

كَلَّآ إِنَّهَا تَذْكِرَةٌ ۝١١

12. కావున ఇష్టమున్న వారు దీనిని స్వీకరించవచ్చు!

فَمَن شَآءَ ذَكَرَهُۥ ۝١٢

13. ఇది ప్రతిష్ఠాత్మకమైన పుటలలో (వ్రాయబడి) ఉన్నది;

فِى صُحُفٍ مُّكَرَّمَةٍ ۝١٣

14. మహోన్నతమైనది, పవిత్రమైనది;

مَّرْفُوعَةٍ مُّطَهَّرَةٍۭ ۝١٤

15. లేఖకుల(దేవదూతల)చేతులలోఉన్నది;

بِأَيْدِى سَفَرَةٍ ۝١٥

16. వారు గౌరవనీయులైన సత్పురుషులు

كِرَامٍۭ بَرَرَةٍ ۝١٦

---

1 ఇక్కడ సూచించబడుతున్నది ఏమిటంటే విధేయులను ఉపేక్షించి, విముఖులయ్యే వారికి బోధన చేయటానికి, ఆసక్తి చూపనవసరం లేదు!

2 నీ బాధ్యత కేవలం సందేశాన్ని అందజేయటం మాత్రమే నీవు వారి వెంటపడి బ్రతిమాలనవసరం లేదు

3 చూడండి, 7:172.

(అజ్ఞానువర్తనులు).

17. మానవుడు నాశనం గాను! అతడు ఎంత కృతఘ్నుడు![1]

قُتِلَ الْإِنسَانُ مَا أَكْفَرَهُ ۝١٧

18. ఆయన(అల్లాహ్) (దేనితో) అతనిని సృష్టించాడు?

مِنْ أَيِّ شَيْءٍ خَلَقَهُ ۝١٨

19. అతనిని, వీర్యబిందువుతో సృష్టించాడు తరువాత అతనిని తగిన విధంగా తీర్చిదిద్దాడు

مِن نُّطْفَةٍ خَلَقَهُ فَقَدَّرَهُ ۝١٩

20. ఆ తరువాత, అతని మార్గాన్ని అతనికి సులభతరం చేశాడు;[2]

ثُمَّ السَّبِيلَ يَسَّرَهُ ۝٢٠

21. ఆ పైన అతనిని మరణింపజేసి గోరీలోకి చేర్చాడు;

ثُمَّ أَمَاتَهُ فَأَقْبَرَهُ ۝٢١

22. మళ్ళీ ఆయన (అల్లాహ్) కోరినపుడు అతనిని తిరిగి బ్రతికించి లేపాడు.

ثُمَّ إِذَا شَاءَ أَنشَرَهُ ۝٢٢

23. అలాకాదు, ఆయన (అల్లాహ్) ఆదేశించిన దానిని (మానవుడు) నెరవేర్చలేదు.

كَلَّا لَمَّا يَقْضِ مَا أَمَرَهُ ۝٢٣

24. ఇక, మానవుడు తన ఆహారాన్ని గమనించాలి!

فَلْيَنظُرِ الْإِنسَانُ إِلَىٰ طَعَامِهِ ۝٢٤

25. నిశ్చయంగా, మేము నీటిని (వర్షాన్ని) ఎంత పుష్కలంగా కురిపించాము.

أَنَّا صَبَبْنَا الْمَاءَ صَبًّا ۝٢٥

26. ఆ తరువాత భూమిని (మొలిచే మొక్కలతో) చీల్చాము, ఒక అద్భుతమైన చీల్పుతో!

ثُمَّ شَقَقْنَا الْأَرْضَ شَقًّا ۝٢٦

27. తరువాత దానిలో ధాన్యాన్ని పెంచాము;

فَأَنبَتْنَا فِيهَا حَبًّا ۝٢٧

28. మరియు ద్రాక్షలను మరియు కూరగాయలను;

وَعِنَبًا وَقَضْبًا ۝٢٨

29. మరియు ఆలివ్ (జైతూన్) మరియు ఖర్జూరపు చెట్లను;

وَزَيْتُونًا وَنَخْلًا ۝٢٩

---

1 ఎట్టి ప్రమాణం లేకుండానే పునరుత్థానాన్ని తిరస్కరించే మానవుడికి ఈ శాపం!

2 అంటే అతనికి మంచీ చెడుల మార్గాలు స్పష్టంగా తెలుపబడ్డాయి.

وَحَدَآئِقَ غُلْبًا ﴿٣٠﴾

**30.** మరియు దట్టమైన తోటలను;

وَفَٰكِهَةً وَأَبًّا ﴿٣١﴾

**31.** మరియు (రకరకాల) పండ్లను మరియు పచ్చికలను;

مَّتَٰعًا لَّكُمْ وَلِأَنْعَٰمِكُمْ ﴿٣٢﴾

**32.** మీకు మరియు మీ పశువులకు జీవన సామగ్రిగా.

فَإِذَا جَآءَتِ ٱلصَّآخَّةُ ﴿٣٣﴾

**33.** ఎప్పుడైతే, చెవులను చెవిటిగా చేసే ఆ గొప్ప ధ్వని వస్తుందో!

يَوْمَ يَفِرُّ ٱلْمَرْءُ مِنْ أَخِيهِ ﴿٣٤﴾

**34.** ఆ రోజు, మానవుడు తన సోదరుని నుండి దూరంగా పారిపోతాడు;

وَأُمِّهِۦ وَأَبِيهِ ﴿٣٥﴾

**35.** మరియు తన తల్లి నుండి మరియు తండ్రి నుండి;

وَصَٰحِبَتِهِۦ وَبَنِيهِ ﴿٣٦﴾

**36.** మరియు తన భార్య (సాహిబతి) నుండి మరియు తన సంతానం నుండి.

لِكُلِّ ٱمْرِئٍ مِّنْهُمْ يَوْمَئِذٍ شَأْنٌ يُغْنِيهِ ﴿٣٧﴾

**37.** ఆ రోజు వారిలో ప్రతి మానవునికి తనను గురించి మాత్రమే చాలినంత చింత ఉంటుంది.[1]

وُجُوهٌ يَوْمَئِذٍ مُّسْفِرَةٌ ﴿٣٨﴾

**38.** ఆ రోజు కొన్నిముఖాలు ఆనందంతో ప్రకాశిస్తూ ఉంటాయి;

ضَاحِكَةٌ مُّسْتَبْشِرَةٌ ﴿٣٩﴾

**39.** అవి చిరునవ్వులతో ఆనందోత్సాహా లతో కళకళలాడుతుంటాయి.

وَوُجُوهٌ يَوْمَئِذٍ عَلَيْهَا غَبَرَةٌ ﴿٤٠﴾

**40.** మరికొన్ని ముఖాలు ఆ రోజు దుమ్ము కొట్టుకొని (ఎంతో వ్యాకులంతో) నిండి ఉంటాయి.

تَرْهَقُهَا قَتَرَةٌ ﴿٤١﴾

**41.** అవి నల్లగా మాడిపోయి ఉంటాయి;

أُو۟لَٰٓئِكَ هُمُ ٱلْكَفَرَةُ ٱلْفَجَرَةُ ﴿٤٢﴾

**42.** అలాంటి వారు, వారే! సత్యతిరస్కారులైన దుష్టులు.

---

1 అంటే ప్రతి మానవుడు తన వారిని నిర్లక్ష్యం చేస్తాడు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "పునరుత్థాన దినమున మానవులందరూ నగ్నశరీరులై ఉంటారు మరియు వారి కాళ్ళలో మేజోళ్ళు ఉండవు మరియు వారు ఖత్నా చేయబడకుండా ఉంటారు." అప్పుడు 'ఆయి'షహ్ (ర'అన్హా): "ఏమీ ఈ విధంగా మర్మాంగాల మీద దృష్టిపడదా?" అని అడుగుతారు. దైవప్రవక్త ('స'అస) దానికి సమాధానంగా ఈ ఆయత్ చదువుతారు. (తిర్మిజీ', నసాయీ').

## 81. సూరహ్ అత్-తక్వీర్

سورة التكوير

అత్ తక్వీర్ Shrouding in Darkness, (అంధకారంలో) చుట్టివేయబడటం, మాయబడటం, కాంతిని కోల్పోవటం. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్ (బహుశా అవతరణలో ఏడవది). ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్‌నుండి తీసుకోబడింది. ఇది అంతిమ ఘడియను సూచిస్తోంది. 8-9 ఆయత్‌లలో అజ్ఞానకాలపు ముష్రిక్ అరబ్బులు తమ ఆడ శిశువులను పుట్టిన వెంటనే సజీవంగా మట్టిలో పూడ్చివేసే దారుణమైన సామాజిక దురాచారం పేర్కొనబడింది. ఇందులో 29 ఆయతులు ఉన్నాయి. ఈ సూరహ్‌లో పునరుత్థానదినపు దృశ్యం చూపబడింది. అందుకే దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఎవనికైతే పునరుత్థాన దినపు దృశ్యాన్ని చూడాలనిఉందో అతడు సూరహ్ అత్ తక్వీర్ (81), సూరహ్ అల్-ఇన్ఫితార్ (82) మరియు సూరహ్ అల్-ఇన్షిఖాఖ్ (84)లు ధ్యానంతో చదవాలి." (తిర్మిజీ', ముస్నద్ అ'హ్మద్; అల్బానీ 'స'హీ'హ్ అని ప్రమాణీకరించారు)

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

1. సూర్యుడు (అంధకారంలో) చుట్టివేయబడి, కాంతిహీనుడైనప్పుడు![1]

إِذَا الشَّمْسُ كُوِّرَتْ ۝١

2. మరియు నక్షత్రాలు (కాంతిని కోల్పోయి) రాలిపోయినప్పుడు!

وَإِذَا النُّجُومُ انكَدَرَتْ ۝٢

3. మరియు పర్వతాలు కదిలించబడి నప్పుడు![2]

وَإِذَا الْجِبَالُ سُيِّرَتْ ۝٣

4. మరియు నిండు సూడి ఒంటెలు, నిరపేక్షంగా వదిలివేయబడినప్పుడు!

وَإِذَا الْعِشَارُ عُطِّلَتْ ۝٤

5. మరియు క్రూరమృగాలన్నీ ఒకచోట సమకూర్చబడినప్పుడు![3]

وَإِذَا الْوُحُوشُ حُشِرَتْ ۝٥

6. మరియు సముద్రాలు ఉప్పొంగి పోయి నప్పుడు![4]

وَإِذَا الْبِحَارُ سُجِّرَتْ ۝٦

---

1 పునరుత్థానదినమున సూర్యచంద్రులు చుట్టివేయబడతారు. ('స'హీ'హ్ బు'ఖారీ)

2 పర్వతాలు భూమి నుండి ఊడబెరికి ఏకిన దూదివలే గాలిలో ఎగురవేయబడతాయి. చూడండి, 20:105-107 మరియు 14:48

3 చూడండి, 6:38

4 ఈ ఆయత్‌కు ఈ విధంగా కూడా తాత్పర్యమివ్వబడింది: "లేక సముద్రాలలో అగ్ని జ్వాలలు

وَإِذَا النُّفُوسُ زُوِّجَتْ ۝٧

7. మరియు ఆత్మలు (శరీరాలతో) తిరిగి కలుపబడినప్పుడు![1]

وَإِذَا الْمَوْءُودَةُ سُئِلَتْ ۝٨

8. మరియు సజీవంగా పాతి పెట్టబడిన బాలిక ప్రశ్నించబడినప్పుడు:

بِأَيِّ ذَنبٍ قُتِلَتْ ۝٩

9. ఏ అపరాధానికి తాను హత్యచేయ బడిందని?

وَإِذَا الصُّحُفُ نُشِرَتْ ۝١٠

10. మరియు కర్మపత్రాలు తెరువబడి నప్పుడు![2]

وَإِذَا السَّمَاءُ كُشِطَتْ ۝١١

11. మరియు ఆకాశం ఒలిచివేయబడి నప్పుడు!

وَإِذَا الْجَحِيمُ سُعِّرَتْ ۝١٢

12. మరియు నరకాగ్ని మండించబడి నప్పుడు!

وَإِذَا الْجَنَّةُ أُزْلِفَتْ ۝١٣

13. మరియు స్వర్గం దగ్గరకు తీసుకు రాబడి నప్పుడు!

عَلِمَتْ نَفْسٌ مَّا أَحْضَرَتْ ۝١٤

14. ప్రతి ఆత్మ తాను చేసి తెచ్చిన కర్మలను తెలుసుకుంటుంది.

فَلَا أُقْسِمُ بِالْخُنَّسِ ۝١٥

15. అలాకాదు! నేను తొలగిపోయే నక్షత్రాల సాక్షిగా చెబుతున్నాను,

الْجَوَارِ الْكُنَّسِ ۝١٦

16. (ఏవైతే) వేగంగా తిరుగుతూ కనుమరు గవుతున్నాయో![3]

وَاللَّيْلِ إِذَا عَسْعَسَ ۝١٧

17. మరియు గడచిపోయే రాత్రి సాక్షిగా!

وَالصُّبْحِ إِذَا تَنَفَّسَ ۝١٨

18. మరియు ప్రకాశించే ఉదయం సాక్షిగా!

---

చెలరేగినప్పుడు''

1 దీనిని ఎన్నోవిధాలుగా వ్యాఖ్యానించారు. ఎక్కువగా సమ్మతమైనది 'ఒకే ధర్మంవారు ఒక చోట జమచేయబడతారు యూదులందరు ఒక చోట, క్రైస్తవులు ఒకచోట మరియు ముస్లింలు ఒకచోట'

2 కర్మపత్రాలు మరణించిన రోజు మూయబడి పునరుత్థాన దినమున మరల తెరువబడతాయి. అప్పుడు కర్మపత్రాలు పుణ్యాత్ములకు కుడిచేతులలో మరియు పాపాత్ములకు ఎడమ చేతులలో ఇవ్వబడతాయి

3 అల్ జవారి: నడిచేది, తిరిగేది. అల్ కున్నస్: దాక్కునేది, కనుమరుగయ్యేది.

إِنَّهُۥ لَقَوْلُ رَسُولٍ كَرِيمٍ ﴿١٩﴾

19 నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) గౌరవనీయుడైన సందేశహరుడు (తెచ్చిన) వాక్కు.[1]

ذِى قُوَّةٍ عِندَ ذِى ٱلْعَرْشِ مَكِينٍ ﴿٢٠﴾

20. అతను (జిబ్రీల్) మహా బలశాలి, సింహాసన ('అర్ష్)[2] అధిపతి సన్నిధిలో ఉన్నత స్థానం గలవాడు!

مُّطَاعٍ ثَمَّ أَمِينٍ ﴿٢١﴾

21. అతని ఆజ్ఞలు పాటించబడతాయి మరియు (అతను) విశ్వసనీయుడు!

وَمَا صَاحِبُكُم بِمَجْنُونٍ ﴿٢٢﴾

22. మరియు (ఓ ప్రజలారా!) మీ సహచరుడు పిచ్చివాడు కాదు![3]

وَلَقَدْ رَءَاهُ بِٱلْأُفُقِ ٱلْمُبِينِ ﴿٢٣﴾

23. మరియు వాస్తవంగా, అతను ఆ సందేశహరుణ్ణి (జిబ్రీల్‌ను) ప్రకాశవంతమైన దిఙ్మండలంలో చూశాడు.[4]

وَمَا هُوَ عَلَى ٱلْغَيْبِ بِضَنِينٍ ﴿٢٤﴾

24. మరియు అతను (ము'హమ్మద్) అగోచరజ్ఞానాన్ని ప్రజలనుండి దాచేవాడు కాదు.

وَمَا هُوَ بِقَوْلِ شَيْطَٰنٍ رَّجِيمٍ ﴿٢٥﴾

25. మరియు ఇది (ఈ ఖుర్ఆన్) శపించ (బహిష్కరించ)బడిన షై'తాన్ వాక్కు కాదు.

فَأَيْنَ تَذْهَبُونَ ﴿٢٦﴾

26. మరి మీరు ఎటు పోతున్నారు?

إِنْ هُوَ إِلَّا ذِكْرٌ لِّلْعَٰلَمِينَ ﴿٢٧﴾

27. ఇది (ఈ ఖుర్ఆన్) సర్వలోకాలకు ఒక హితోపదేశం.

لِمَن شَآءَ مِنكُمْ أَن يَسْتَقِيمَ ﴿٢٨﴾

28. మీలో, ఋజుమార్గంలో నడువదలచుకున్న ప్రతివాని కొరకు.

---

1. అంటే జిబ్రీల్ ('అ.స.) తెచ్చిన వాక్కు.

2 అల్ 'అర్షు: సింహాసనం లేక విశ్వాధికారపీఠం. ఈ పదం అవతరణలో ఇక్కడ మొదటిసారి వచ్చింది. వివరాలకు చూడండి, 7:54.

3 చూడండి, 7:184. ఈ వాక్యం మక్కా వాసులతో చెప్పబడింది. ఇంకా విశదమయ్యే విషయం ఏమిటంటే దైవప్రవక్త ('స'అస) ఒక మానవుడు మరియు అల్లాహ్ (సు.తా.) ఎన్నుకొన్న ప్రవక్త.

4 చూడండి, 53:5 దైవప్రవక్త ('స'అస) జిబ్రీల్ ('అ.స.)ను రెండుసార్లు అతని నిజరూపంలో చూశారు. మొదటిసారి ఇక్కడ, రెండవసారి మేరాజ్ రాత్రిలో.

وَمَا تَشَآءُونَ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ رَبُّ ٱلْعَٰلَمِينَ ۝

**29** మరియు సర్వలోకాల ప్రభువైన అల్లాహ్ తలచనంత వరకు, మీరు తలచినంత మాత్రాన ఏమీ కాదు.[1] (1/4)

## 82. సూరహ్ అల్-ఇన్ఫిఫ్'తార్

سُورَةُ الانفطار

అల్ ఇన్ఫిఫ్'తార్: The Cleaving, చీలిపోవుట, బీటలువారుట, బద్దలగుట, పెళ్ళుమనుట, ప్రేలుట, పగులుట ఈ సూరహ్ పేరు మొదటి **ఆయత్** నుండి తీసుకోబడింది. కొందరు దీనిని మొదటి మక్కా కాలపు సూరహ్ అని అంటారు. మరి కొందరు చివరి కాలపు సూరహ్ అంటారు ఇందులో **19 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ ۝

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِذَا ٱلسَّمَآءُ ٱنفَطَرَتْ ۝

**1.** * ఆకాశం చీల్చబడినప్పుడు![2]

وَإِذَا ٱلْكَوَاكِبُ ٱنتَثَرَتْ ۝

**2.** మరియు నక్షత్రాలు చెదిరిపోయినప్పుడు!

وَإِذَا ٱلْبِحَارُ فُجِّرَتْ ۝

**3.** మరియు సముద్రాలు పొంగి పొరలిపోయినప్పుడు!

وَإِذَا ٱلْقُبُورُ بُعْثِرَتْ ۝

**4.** మరియు సమాధులు పెళ్ళగింప (తెరువ) బడినప్పుడు!

عَلِمَتْ نَفْسٌ مَّا قَدَّمَتْ وَأَخَّرَتْ ۝

**5.** ప్రతి వ్యక్తికి తాను చేసి పంపుకున్నది మరియు వెనుక వదలిపెట్టింది అంతా తెలిసిపోతుంది.

يَٰٓأَيُّهَا ٱلْإِنسَٰنُ مَا غَرَّكَ بِرَبِّكَ ٱلْكَرِيمِ ۝

**6.** ఓ మానవుడా! పరమదాత అయిన నీ ప్రభువును గురించి, ఏ విషయం నిన్ను ఏమరుపాటుకు గురిచేసింది?

ٱلَّذِى خَلَقَكَ فَسَوَّىٰكَ فَعَدَلَكَ ۝

**7.** ఆయనే నిన్ను సృష్టించాడు, తరువాత ఎలాంటి లోపం లేకుండా నిన్ను తీర్చిదిద్దాడు మరియు నిన్ను తగిన ప్రమాణంలో రూపొందించాడు.

---

1 ఇటువంటి మరో ఆయత్ కోసం చూడండి, 76:29-30

2. ఇది పునరుత్థానదినపు సూచన.

**8**. తాను తలచిన ఆకారంలో నిన్ను మలిచాడు

فِيٓ أَيِّ صُورَةٍ مَّا شَآءَ رَكَّبَكَ ۝

**9**. అలాకాదు! వాస్తవానికి మీరు (పరలోక) తీర్పును అబద్ధమని తిరస్కరిస్తున్నారు!

كَلَّا بَلْ تُكَذِّبُونَ بِالدِّينِ ۝

**10**. మరియు, నిశ్చయంగా! మిమ్మల్ని కనిపెట్టుకొని ఉండే వారు (దేవదూతలు) ఉన్నారు[1]

وَإِنَّ عَلَيْكُمْ لَحَافِظِينَ ۝

**11**. వారు, గౌరవనీయులైన లేఖకులు;

كِرَامًا كَاتِبِينَ ۝

**12**. మీరు చేసేదంతా తెలుసుకునేవారు!

يَعْلَمُونَ مَا تَفْعَلُونَ ۝

**13**. నిశ్చయంగా పుణ్యాత్ములు[2] సుఖ సంతోషాలలో తేలియాడుతూ ఉంటారు.

إِنَّ الْأَبْرَارَ لَفِي نَعِيمٍ ۝

**14**. మరియు నిశ్చయంగా, దుష్టులు భగభగ మండే నరకాగ్నిలో ఉంటారు.[3]

وَإِنَّ الْفُجَّارَ لَفِي جَحِيمٍ ۝

**15**. తీర్పు దినమున వారు అందులో ప్రవేశిస్తారు.

يَصْلَوْنَهَا يَوْمَ الدِّينِ ۝

**16**. మరియు వారు దానినుండి ఎంత మాత్రం తప్పించుకోలేరు.

وَمَا هُمْ عَنْهَا بِغَائِبِينَ ۝

**17**. మరియు ఆ తీర్పుదినం అంటే ఏమిటో నీకెలా తెలుస్తుంది?

وَمَا أَدْرَاكَ مَا يَوْمُ الدِّينِ ۝

**18**. అపును మరి! ఆ తీర్పు దినం అంటే ఏమిటో నీకెలా తెలుస్తుంది?

ثُمَّ مَا أَدْرَاكَ مَا يَوْمُ الدِّينِ ۝

**19** ఆ దినమున ఏ మానవునికి కూడా ఇతరునికి ఎలాంటి సహాయం చేసే అధికారం ఉండదు మరియు ఆ రోజు నిర్ణయాధికారం కేవలం అల్లాహ్‌కే ఉంటుంది.[4]

يَوْمَ لَا تَمْلِكُ نَفْسٌ لِّنَفْسٍ شَيْئًا ۖ وَالْأَمْرُ يَوْمَئِذٍ لِّلَّهِ ۝

---

1 చూడండి, 50:17-18.

2 అబ్‌రార్: Pious, ధర్మనిష్ఠాపరులు, దైవభక్తిపరులు, Righteous, ఋజువర్తనులు, ధర్మశీలురు, న్యాయనిష్ఠ గలవారు.

3. చూడండి, 42.7.

4 చూడండి, 40:16.

## 83. సూరహ్ అల్-ముతఫ్ఫిఫీన్

## سورة المطففين

అల్ ముతఫ్ఫిఫీన్ Those Who Deal in Fraud, తగ్గించి ఇచ్చేవారు, లోభత్వం చూపేవారు, కొలతలలో తూనికలలో మోసంచేసే వారు దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. కొందరు దీనిని మక్కా చివరి కాలపు సూరహ్ అని అంటారు మరికొందరు దైవప్రవక్త (స'అస) మదీనా వచ్చినప్పుడు అక్కడి వారు కొలతలలో మరియు తూనికలలో తగ్గించే వారు. ఆ సందర్భంలో ఈ సూరహ్ అవతరింపజేయబడిందంటారు (ఇబ్నె-మాజా) సూరహ్ అల్'అంకబూత్ (29) కూడా ఇదే విధంగా రెండు చోట్లలో అవతరింపజేయబడినట్లు భావింపబడుతోంది. ఇందులో **36** ఆయతులు ఉన్నాయి

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

وَيْلٌ لِّلْمُطَفِّفِيْنَ ۝١

**1.** కొలతలలో, తూనికలలో తగ్గించి ఇచ్చేవారికి వినాశముంది

الَّذِيْنَ إِذَا اكْتَالُوْا عَلَى النَّاسِ يَسْتَوْفُوْنَ ۝٢

**2.** వారు ప్రజలనుండి తీసుకునేటప్పుడు పూర్తిగా తీసుకుంటారు.

وَإِذَا كَالُوْهُمْ أَوْ وَّزَنُوْهُمْ يُخْسِرُوْنَ ۝٣

**3.** మరియు తాము ప్రజలకు కొలిచి గానీ లేక తూచి గానీ ఇచ్చేటప్పుడు మాత్రం తగ్గించి ఇస్తారు.[1]

أَلَا يَظُنُّ أُولٰٓئِكَ أَنَّهُمْ مَّبْعُوْثُوْنَ ۝٤

**4.** ఏమీ? ఇలాంటి వారు తిరిగి బ్రతికించి లేపబడరని భావిస్తున్నారా?

لِيَوْمٍ عَظِيْمٍ ۝٥

**5.** ఒక గొప్ప దినమున!

يَّوْمَ يَقُوْمُ النَّاسُ لِرَبِّ الْعٰلَمِيْنَ ۝٦

**6.** సర్వ లోకాల ప్రభువు సమక్షంలో ప్రజలు అందరూ నిలబడే రోజు.[2]

كَلَّآ إِنَّ كِتٰبَ الْفُجَّارِ لَفِيْ سِجِّيْنٍ ۝٧

**7.** అలాకాదు! నిశ్చయంగా, దుష్టుల కర్మపత్రం సిజ్జీనులో ఉంది.

---

1 ఒక 'హదీస్'లో ఇలా ఉంది. "ఏ సమాజంవారైతే కొలతలలో మరియు తూనికలలో తగ్గిస్తారో, వారిపై కరువు మరియు పరిపాలకుల అగడాలు విరుచుకుపడతాయి." (ఇబ్నె మాజా అల్బానీ దీనిని 'స'హీ'హ్'గా ప్రమాణీకరించారు) ఈ మూడు ఆయతులు అన్ని రకాల మోసాలను ఖండిస్తున్నాయి

2 ఇది వారే చేస్తారు. ఎవరైతే, పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.తా.) ముందు నిలబడ వలసి ఉందని నమ్మరో! వారికి అల్లాహ్ (సు.తా.) భయంలేదు. (స'హీహ్ బు'ఖారీ)

وَمَآ أَدۡرَىٰكَ مَا سِجِّينٞ ﴿٨﴾

**8.** ఆ సిజ్జీన్ అంటే నీవు ఏమనుకుంటున్నావు?

كِتَٰبٞ مَّرۡقُومٞ ﴿٩﴾

**9.** వ్రాసి పెట్టబడిన (చెరగని) గ్రంథం[1]

وَيۡلٞ يَوۡمَئِذٖ لِّلۡمُكَذِّبِينَ ﴿١٠﴾

**10** సత్యాన్ని తిరస్కరించేవారికి ఆరోజు వినాశం ఉంది.

ٱلَّذِينَ يُكَذِّبُونَ بِيَوۡمِ ٱلدِّينِ ﴿١١﴾

**11.** వారికే! ఎవరైతే తీర్పుదినాన్ని తిరస్కరిస్తారో!

وَمَا يُكَذِّبُ بِهِۦٓ إِلَّا كُلُّ مُعۡتَدٍ أَثِيمٍ ﴿١٢﴾

**12** మరియు మితిమీరి ప్రవర్తించే పాపిష్ఠుడు తప్ప మరెవ్వడూ దానిని (తీర్పుదినాన్ని) తిరస్కరించడు.

إِذَا تُتۡلَىٰ عَلَيۡهِ ءَايَٰتُنَا قَالَ أَسَٰطِيرُ ٱلۡأَوَّلِينَ ﴿١٣﴾

**13.** మా సూచనలు (ఆయతులు) అతడికి వినిపించబడినప్పుడు అతడు: "ఇవి పూర్వకాలపు కట్టుకథలే!" అని అంటాడు.

كَلَّاۖ بَلۡۜ رَانَ عَلَىٰ قُلُوبِهِم مَّا كَانُواْ يَكۡسِبُونَ ﴿١٤﴾

**14.** అలా కాదు! వాస్తవానికి వారి హృదయాలకు వారి (దుష్ట) కార్యాల త్రుప్పు పట్టింది.[2]

كَلَّآ إِنَّهُمۡ عَن رَّبِّهِمۡ يَوۡمَئِذٖ لَّمَحۡجُوبُونَ ﴿١٥﴾

**15.** అంతే కాదు, ఆ రోజు నిశ్చయంగా, వారు తమ ప్రభువు కారుణ్యం నుండి నిరోధించబడతారు.

ثُمَّ إِنَّهُمۡ لَصَالُواْ ٱلۡجَحِيمِ ﴿١٦﴾

**16.** తరువాత వారు నిశ్చయంగా, భగభగ మండే నరకాగ్నిలోకి పోతారు.

ثُمَّ يُقَالُ هَٰذَا ٱلَّذِي كُنتُم بِهِۦ تُكَذِّبُونَ ﴿١٧﴾

**17.** అప్పుడు వారితో: "దేనినైతే మీరు అసత్యమని తిరస్కరిస్తూ వచ్చారో, అది ఇదే!" అని చెప్పబడుతుంది.

كَلَّآ إِنَّ كِتَٰبَ ٱلۡأَبۡرَارِ لَفِي عِلِّيِّينَ ﴿١٨﴾

**18.** అలా కాదు! నిశ్చయంగా, ధర్మ నిష్ఠాపరుల (పుణ్యాత్ముల) కర్మపత్రం మహోన్నత గ్రంథం

1 సిజ్జీన్: అంటే కారాగారం. ఇక్కడ చెరిగిపోకుండా నష్టంకాకుండా వ్రాసి పెట్టబడిన గ్రంథమని అర్థం

2 రానా: అంటే పాపాల వల్ల హృదయం మీద ఏర్పడే ఒక నల్లని మచ్చ. 'హదీస్'లో ఇలా ఉంది "మానవుడు పాపం చేసినపుడు అతని హృదయం మీద ఒక నల్లనిమచ్చ ఏర్పడుతుంది. ఒకవేళ అతడు పశ్చాత్తాపపడి ఆ పాపం మరల చేయకుంటే అది దూరమైపోతుంది ఒకవేళ అతడు పాపం మీద పాపం చేస్తూఉంటే ఆ నల్లమచ్చ పెరుగుతుంది. చివరకు అది అతని హృదయం మీద పూర్తిగా క్రమ్ముకొంటుంది. అదే 'రానా' అని పేర్కొనబడినది." (తిర్మిజీ', ఇబ్నె మాజా, ముస్నద్ అ'హ్మద్)

('ఇల్లియ్యీన్)లో ఉంది.[1]

19 మరి ఆ 'ఇల్లియ్యీన్ అంటే నీవు ఏమనుకుంటున్నావు?

وَمَآ أَدْرَىٰكَ مَا عِلِّيُّونَ

20 అది వ్రాసి పెట్టబడిన ఒక గ్రంథం.

كِتَٰبٌ مَّرْقُومٌ

21. దానికి, (అల్లాహ్‌కు) సన్నిహితులైన వారు (దేవదూతలు) సాక్ష్యంగా ఉంటారు.[2]

يَشْهَدُهُ ٱلْمُقَرَّبُونَ

22. నిశ్చయంగా, పుణ్యాత్ములు సుఖసంతోషాలలో ఉంటారు.

إِنَّ ٱلْأَبْرَارَ لَفِى نَعِيمٍ

23. ఎత్తైన ఆసనాలపై కూర్చొని (స్వర్గ దృశ్యాలను) తిలకిస్తూ.[3]

عَلَى ٱلْأَرَآئِكِ يَنظُرُونَ

24. వారి ముఖాలు సుఖసంతోషా లతో కళకళ లాడుతూ ఉండటం నీవు చూస్తావు.

تَعْرِفُ فِى وُجُوهِهِمْ نَضْرَةَ ٱلنَّعِيمِ

25. సీలు చేయబడిన నాణ్యమైన మధువు వారికి త్రాగటానికి ఇవ్వబడుతుంది.[4]

يُسْقَوْنَ مِن رَّحِيقٍ مَّخْتُومٍ

26. దాని చివరి చుక్కలోనూ కస్తూరి సువాసన ఉంటుంది. కాబట్టి దానిని పొంద టానికి అపేక్షించే వారంతా ప్రయాసపడాలి

خِتَٰمُهُۥ مِسْكٌ ۚ وَفِى ذَٰلِكَ فَلْيَتَنَافَسِ ٱلْمُتَنَٰفِسُونَ

27. మరియు దానిలో (ఆ మధువులో) తస్నీమ్

وَمِزَاجُهُۥ مِن تَسْنِيمٍ

---

1 'ఇల్లియ్యీను, 'ఉలువ్వున్: ఎత్తైన స్థలం. ఇది సిజ్జీన్‌కు విరుద్ధపదం. ఇది ఆకాశాలలో, స్వర్గంలో సిద్‌రతుల్ మున్‌తహా, లేక 'అర్ష్ దగ్గర ఉన్నచోటు. అక్కడ పుణ్యాత్ముల కర్మపత్రాలు భద్రపరచబడి ఉంటాయి

2 యష్‌హదు అంటే ఇక్కడ పర్యవేక్షిస్తుంటారు, అనే అర్థం కూడా వస్తుంది

3. చూడండి, 75:23.

4 ర'హీఖున్: స్వచ్ఛమైన, తేటైన, ఉత్తమమైన, మధురమైనపానీయం, అందులో ఎట్టి కల్తీ ఉండదు మ'ఖ్తూమున్: సీలుచేయబడినది. దాని స్వచ్ఛతకు హామీగా కొందరు 'ఖితామున్ అంటే సువాసన అంటారు దాని సువాసన కస్తూరివలే ఉంటుంది. (ఇబ్నె కసీ'ర్) 'హదీస్ లో ఉంది. "ఏ విశ్వాసుడైతే, దప్పికగొన్న విశ్వాసునికి నీరు త్రాపుతాడో పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.తా.) అతనికి ర'హీఖ్ అల్ మ'ఖ్తూమ్ త్రాపుతాడు. మరియు అన్నం పెట్టిన వాడికి స్వర్గపు ఫలాలు తినిపిస్తాడు. మరియు వస్త్రాలు లేని వానికి వస్త్రాలు ఇచ్చేవానికి స్వర్గపు వస్త్రాలు ప్రసాదిస్తాడు" (ముస్నద్ అ'హ్మద్, 3/13-14)

కలుపబడి ఉంటుంది.[1]

عَيْنًا يَشْرَبُ بِهَا الْمُقَرَّبُونَ ﴿٢٨﴾

28. అదొక చెలమ, (అల్లాహ్) సాన్నిధ్యం పొందినవారే దానినుండి త్రాగుతారు.[2]

إِنَّ الَّذِينَ أَجْرَمُوا كَانُوا مِنَ الَّذِينَ آمَنُوا يَضْحَكُونَ ﴿٢٩﴾

29. వాస్తవానికి (ప్రపంచంలో) అపరాధులు విశ్వసించిన వారిని హేళన చేసేవారు.

وَإِذَا مَرُّوا بِهِمْ يَتَغَامَزُونَ ﴿٣٠﴾

30. మరియు వీరు (విశ్వాసులు), వారి (అవిశ్వాసుల) యెదుట నుండి పోయినప్పుడు, వారు (అవిశ్వాసులు) పరస్పరం కనుసైగలు చేసుకునే వారు.

وَإِذَا انْقَلَبُوا إِلَىٰ أَهْلِهِمُ انْقَلَبُوا فَكِهِينَ ﴿٣١﴾

31. మరియు (అవిశ్వాసులు) తమ ఇంటివారి దగ్గరికి పోయినప్పుడు (విశ్వాసులను గురించి) పరిహాసిస్తూ మరలేవారు.

وَإِذَا رَأَوْهُمْ قَالُوا إِنَّ هَٰؤُلَاءِ لَضَالُّونَ ﴿٣٢﴾

32. మరియు (విశ్వాసులను) చూసినప్పుడల్లా: "నిశ్చయంగా, వీరు దారితప్పిన వారు!" అని అనేవారు

وَمَا أُرْسِلُوا عَلَيْهِمْ حَافِظِينَ ﴿٣٣﴾

33. మరియు వారు (అవిశ్వాసులు) వీరి (విశ్వాసుల) మీద కాపలాదారులుగా పంపబడ లేదు!

فَالْيَوْمَ الَّذِينَ آمَنُوا مِنَ الْكُفَّارِ يَضْحَكُونَ ﴿٣٤﴾

34. కాని ఈ రోజు (పునరుత్థానదినం నాడు) విశ్వసించిన వారు, సత్యతిరస్కారులను చూసి నవ్వుతారు.

عَلَى الْأَرَائِكِ يَنْظُرُونَ ﴿٣٥﴾

35. ఎత్తైన ఆసనాలపై కూర్చొని (స్వర్గ దృశ్యాలను) తిలకిస్తూ (ఇలా అంటారు):

هَلْ ثُوِّبَ الْكُفَّارُ مَا كَانُوا يَفْعَلُونَ ﴿٣٦﴾

36. "ఇక! ఈ సత్యతిరస్కారులకు, వారి చేష్టలకు తగిన ప్రతిఫలం తప్ప మరేమైనా దొరుకునా?" (3/8)

---

1 తస్నీమున్: ఎత్తైన స్థలం. ఆ పానీయం స్వర్గపు ఎత్తైన ప్రదేశం నుండి చెలమల ద్వారా వస్తుంది

2. చూడండి, 76:5-6.

## 84. సూరహ్ అల్-ఇన్‌షిఖాఖ్

سُورَةُ الانشِقَاقِ

అల్ ఇన్‌షిఖాఖ్: The Splitting asunder, బ్రద్దలవటం, ప్రేలిపోవటం, పగిలిపోవటం, ఖండన. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది సూరహ్ అల్ ఇన్‌ఫి'తార్ (82) తరువాత అవతరింపజేయబడింది. ఇది చివరి మక్కా సూరాహ్‌లలో ఒకటి. ఇందులో 25 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِذَا السَّمَاءُ انشَقَّتْ ۝١

1. * ఆకాశం బ్రద్దలయిపోయినప్పుడు![1]

وَأَذِنَتْ لِرَبِّهَا وَحُقَّتْ ۝٢

2. మరియు అది తన ప్రభువు ఆదేశపాలన చేసింది మరియు అదే దాని విధ్యుక్త ధర్మం.[2]

وَإِذَا الْأَرْضُ مُدَّتْ ۝٣

3. మరియు భూమి విస్తరింపజేయబడి (చదునుగా చేయబడి) నప్పుడు;

وَأَلْقَتْ مَا فِيهَا وَتَخَلَّتْ ۝٤

4. మరియు అది తన లోపల ఉన్నదంతా బయటికి విసరివేసి, ఖాళీ అయినప్పుడు;

وَأَذِنَتْ لِرَبِّهَا وَحُقَّتْ ۝٥

5. అది తన ప్రభువు ఆదేశపాలన చేసింది మరియు అదే దాని విధ్యుక్త ధర్మం.

يَا أَيُّهَا الْإِنسَانُ إِنَّكَ كَادِحٌ إِلَىٰ رَبِّكَ كَدْحًا فَمُلَاقِيهِ ۝٦

6. ఓ మానవుడా! నిశ్చయంగా, నీవు నీ ప్రభువు వైపునకు, నీ (మంచి-చెడు) కర్మలను తీసుకొని మరలుతున్నావు, ఒక నిశ్చిత మరలుప. అప్పుడు నీవు నీ (కర్మల ఫలితాన్ని) పొందుతావు.

فَأَمَّا مَنْ أُوتِيَ كِتَابَهُ بِيَمِينِهِ ۝٧

7. అప్పుడు తన కర్మపత్రం కుడి చేతిలో ఇవ్వబడిన వాడి నుండి;[3]

فَسَوْفَ يُحَاسَبُ حِسَابًا يَسِيرًا ۝٨

8. అతని లెక్క అతి తేలికగా తీసుకోబడ గలదు.

---

1. అంటే పునరుత్థాన దినము.
2. చూడండి, 20: 105-107.
3. చూడండి, 69:19

وَيَنقَلِبُ إِلَىٰٓ أَهۡلِهِۦ مَسۡرُورٗا ٩

**9.** మరియు అతడు సంతోషంగా తనవారి దగ్గరకు మరలిపోతాడు!

وَأَمَّا مَنۡ أُوتِيَ كِتَٰبَهُۥ وَرَآءَ ظَهۡرِهِۦ ١٠

**10.** ఇక తన కర్మపత్రం వీపు వెనుక నుండి ఇవ్వబడిన వాడు;[1]

فَسَوۡفَ يَدۡعُواْ ثُبُورٗا ١١

**11.** అప్పుడు తన నాశనాన్నే కోరు కుంటాడు;

وَيَصۡلَىٰ سَعِيرًا ١٢

**12.** మరియు అతడు మండుతున్న నరకాగ్నిలో పడిపోతాడు.

إِنَّهُۥ كَانَ فِيٓ أَهۡلِهِۦ مَسۡرُورًا ١٣

**13.** వాస్తవానికి, అతడు (ప్రపంచంలో) తనవారి మధ్య సుఖసంతోషాలలో మునిగి ఉండేవాడు.[2]

إِنَّهُۥ ظَنَّ أَن لَّن يَحُورَ ١٤

**14.** వాస్తవానికి, అతడు (మా వైపుకు) మరలిరాడని భావించేవాడు.

بَلَىٰٓۚ إِنَّ رَبَّهُۥ كَانَ بِهِۦ بَصِيرٗا ١٥

**15.** అలా కాదు! వాస్తవానికి, అతని ప్రభువు అతనిని గమనిస్తూ ఉండేవాడు.

فَلَآ أُقۡسِمُ بِٱلشَّفَقِ ١٦

**16.** కనుక, నేను సంధ్య కాలపు ఎరుపు సాక్షిగా చెబుతున్నాను![3]

وَٱلَّيۡلِ وَمَا وَسَقَ ١٧

**17.** రాత్రి సాక్షిగా, అది ప్రోగుచేసే వాటి సాక్షిగా!

وَٱلۡقَمَرِ إِذَا ٱتَّسَقَ ١٨

**18.** పూర్ణ చంద్రుని సాక్షిగా![4]

لَتَرۡكَبُنَّ طَبَقًا عَن طَبَقٖ ١٩

**19.** మీరందరూ తప్పనిసరిగా ఒక స్థితి నుండి మరొక స్థితికి క్రమక్రమంగా మారుతూ పోవలసి ఉంటుంది.[5]

---

1. చూడండి, 69:25 26.
2. చూడండి, 75:33
3. అష్ షఫఖు: సూర్యాస్తమయం తరువాత ఆకాశంలో కనబడే ఎరుపు, సంధ్యారుణిమ. అది 'ఇషా సమయం మొదలయ్యే వరకు ఉంటుంది.
4. అత్తసఖ: అంటే పౌర్ణమినాటి చంద్రుడు.
5. 'తబఖున్' కఠినత. ఇక్కడ కఠినాలు అంటే ఒక స్థితి నుండి మరొక స్థితికి మారటం

فَمَا لَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٢٠﴾

20. అయితే వీరికేమయింది? వీరు ఎందుకు విశ్వసించరు?

وَإِذَا قُرِئَ عَلَيْهِمُ الْقُرْآنُ لَا يَسْجُدُونَ ۩ ﴿٢١﴾

21. మరియు ఖుర్ఆన్ వీరి ముందు పఠింపబడినప్పుడు వీరెందుకు సాష్టాంగం (సజ్దా) చేయరు?[1] ۩

بَلِ الَّذِينَ كَفَرُوا يُكَذِّبُونَ ﴿٢٢﴾

22. అలా కాదు! ఈ సత్యతిరస్కారులు దీనిని అసత్యమంటున్నారు.

وَاللَّهُ أَعْلَمُ بِمَا يُوعُونَ ﴿٢٣﴾

23 మరియు వారు కూడబెట్టేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

فَبَشِّرْهُم بِعَذَابٍ أَلِيمٍ ﴿٢٤﴾

24. కాబట్టి వారికి (పరలోకంలో) లభించే వ్యథా భరితమైన శిక్ష యొక్క వార్తనివ్వు!

إِلَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ لَهُمْ أَجْرٌ غَيْرُ مَمْنُونٍ ﴿٢٥﴾

25. కాని విశ్వసించి సత్కార్యాలు చేసే వారికి తప్ప! వారికి ఎన్నటికీ అంతం గాని ప్రతిఫలం ఉంటుంది.

## 85. సూరహ్ అల్-బురూజ్

## سُورَةُ البُرُوجِ

అల్ బురూజ్: బురుజులు, The Big Stars, The Great Constellations, తారాగణం, నక్షత్రరాశులు, నక్షత్ర సముదాయం. ఇది సూరహ్ అష్-షమ్స్ (91) తరువాత అవతరింపజేయబడిన మక్కా సూరహ్ దీనిపేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇందులో 22 ఆయతులు ఉన్నాయి దైవప్రవక్త ('స'అస) "జుహ్ర్ మరియు 'అస్ర్ నమాజులలో సూరహ్ అల్ బురూజ్ (85) మరియు సూరహ్ అత్-'తారిఖ్ (86) చదివేవారు (తిర్మిజీ') 4-7వ ఆయత్‌లలో, ప్రాచీన కాలంలో స'ఊదీ 'అరేబియాలో ఉన్న నజ్రాన్ యొక్క సత్యతిరస్కారులు విశ్వాసులను అగ్నికందకంలో త్రోసిచంపిన దారుణసంఘటన పేర్కొనబడింది ఈ విధమైన దౌర్జన్యాలు ఇతర చోట్లలో కూడా జరిగినట్లు పేర్కొనబడ్డాయి వివరాలకు చూడండి ఇబ్నె కసీ'ర్.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَالسَّمَاءِ ذَاتِ الْبُرُوجِ ﴿١﴾

1. విస్తారమైన తారాగణం గల ఆకాశం సాక్షిగా![2]

---

1 'హదీస్'ల ద్వారా దైవప్రవక్త ('స'అస) మరియు 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లు, ఇక్కడ సజ్దా చేశారని తెలుస్తుంది.

2. చూడండి, 25:61

2. వాగ్దానం చేయబడిన (పునరుత్థాన) దినం సాక్షిగా!

وَالْيَوْمِ الْمَوْعُودِ ٢

3. చూచే దినం మరియు చూడబడే దినం సాక్షిగా![1]

وَشَاهِدٍ وَمَشْهُودٍ ٣

4. అగ్ని కందకం (ఉ'ఖ్దూద్) వారు నాశనం చేయబడ్డారు.[2]

قُتِلَ أَصْحَابُ الْأُخْدُودِ ٤

5. ఇంధనంతో తీవ్రంగా మండే అగ్నిని రాజేసేవారు

النَّارِ ذَاتِ الْوَقُودِ ٥

6. వారు దాని (ఆ కందకం) అంచుపై కూర్చొని ఉన్నప్పుడు![3]

إِذْ هُمْ عَلَيْهَا قُعُودٌ ٦

7. మరియు తాము విశ్వాసులపట్ల చేసే ఘోర కార్యాలను (సజీవ దహనాలను) తిలకించే వారు

وَهُمْ عَلَىٰ مَا يَفْعَلُونَ بِالْمُؤْمِنِينَ شُهُودٌ ٧

8. మరియు వారు విశ్వాసులపట్ల కసి పెంచుకోవడానికి కారణం - వారు (విశ్వాసులు) సర్వశక్తిమంతుడు సర్వస్తోత్రాలకు అర్హుడైన - అల్లాహ్‌ను విశ్వసించడం మాత్రమే!

وَمَا نَقَمُوا مِنْهُمْ إِلَّا أَنْ يُؤْمِنُوا بِاللَّهِ الْعَزِيزِ الْحَمِيدِ ٨

9. ఆయనే! ఎవనికైతే భూమ్యాకాశాల ఆధిపత్యం ఉందో! మరియు అల్లాహ్‌యే ప్రతి దానికి సాక్షి

الَّذِي لَهُ مُلْكُ السَّمَاوَاتِ وَالْأَرْضِ ۚ وَاللَّهُ عَلَىٰ كُلِّ شَيْءٍ شَهِيدٌ ٩

10. ఎవరైతే విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను హింసిస్తారో, ఆ తరువాత పశ్చాత్తాపంతో క్షమాపణ కోరరో!

إِنَّ الَّذِينَ فَتَنُوا الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ ثُمَّ لَمْ يَتُوبُوا فَلَهُمْ عَذَابُ جَهَنَّمَ وَلَهُمْ عَذَابُ

---

1 ఈ ఆయత్ వ్యాఖ్యానంలో భేదాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షౌకాని ఒక 'హదీస్' ఆధారంగా అన్నారు షాహిదున్. అంటే జుము'అహ్ దినం ఆ రోజు విశ్వాసి చేసిన పని. పునరుత్థాన దినమున దానికి సాక్ష్యమిస్తుంది. మష్‌హూదున్. అంటే 9వ జు'ల్ 'హజ్జ్, 'అరఫాత్ దినం ఏ రోజైతే ముస్లింలు 'హజ్జ్ కొరకు సమావేశమవుతారో! మరొక తాత్పర్యం. "అంతా చూసే ఆయన, అల్లాహుతా'ఆలా సాక్షిగా మరియు ఆయన సాక్షిగా నిలిపేవాని సాక్షిగా!"

2 పైన పేర్కొన్నట్లు నజ్‌రాన్‌లోని సత్యతిరస్కారులు, ఆ కాలపు విశ్వాసులను ఒక అగ్ని కందకంలో త్రోసి చంపేవారు

3 విశ్వాసులను అగ్నిలో వేసి వారు (సత్యతిరస్కారులు) చూసి ఆనందించే వారు

الْحَرِيقِ ﴿١٠﴾

నిశ్చయంగా, అలాంటి వారికి నరకశిక్ష ఉంటుంది. మరియు వారికి మండే అగ్ని శిక్ష విధించబడుతుంది.

إِنَّ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ لَهُمْ جَنَّاتٌ
تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ ۚ ذَٰلِكَ الْفَوْزُ
الْكَبِيرُ ﴿١١﴾

**11.** నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసే వారి కొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలు ఉంటాయి.[1] అదే గొప్ప విజయం.

إِنَّ بَطْشَ رَبِّكَ لَشَدِيدٌ ﴿١٢﴾

**12.** నిశ్చయంగా, నీ ప్రభువు యొక్క పట్టు (శిక్ష) చాలా కఠినమైనది.[2]

إِنَّهُ هُوَ يُبْدِئُ وَيُعِيدُ ﴿١٣﴾

**13.** నిశ్చయంగా, ఆయనే (సృష్టిని) ఆరంభించే వాడు మరియు ఆయనే (దానిని) మరల ఉనికిలోకి తెచ్చేవాడు.

وَهُوَ الْغَفُورُ الْوَدُودُ ﴿١٤﴾

**14.** మరియు ఆయన క్షమాశీలుడు, అమిత వాత్సల్యుడు.

ذُو الْعَرْشِ الْمَجِيدُ ﴿١٥﴾

**15.** సింహాసనాన్ని ('అర్షను) అధిష్ఠించిన వాడు,[3] మహత్వపూర్ణుడు.[4]

فَعَّالٌ لِّمَا يُرِيدُ ﴿١٦﴾

**16.** తాను తలచింది చేయగలవాడు.

هَلْ أَتَاكَ حَدِيثُ الْجُنُودِ ﴿١٧﴾

**17.** ఏమీ? సైన్యాల వారి సమాచారం నీకు అందిందా?

فِرْعَوْنَ وَثَمُودَ ﴿١٨﴾

**18.** ఫిర్'ఔన్ మరియు స'మూద్ వారి (సైన్యాల).

بَلِ الَّذِينَ كَفَرُوا فِي تَكْذِيبٍ ﴿١٩﴾

**19.** అలాకాదు, సత్యతిరస్కారులు (సత్యాన్ని) తిరస్కరించుటలో నిమగ్నులై వున్నారు

وَاللَّهُ مِن وَرَائِهِم مُّحِيطٌ ﴿٢٠﴾

**20.** మరియు అల్లాహ్ వారిని వెనుక (ప్రతి దిక్కు) నుండి చుట్టుముట్టి ఉన్నాడు.

---

1 ఖుర్ఆన్ అవతరణా క్రమంలో స్వర్గవనాలను గురించి ఇక్కడ మొదటిసారి వచ్చింది

2 ఆయన మొదట వ్యవధినిస్తాడు ఇక శిక్షించటానికి పట్టుకొన్నప్పుడు, ఆయన పట్టునుండి ఎవ్వరూ తప్పించుకోలేరు మరియు ఎవ్వరూ తప్పించజాలరు కూడాను!

3 సింహాసనాధీశుడు, చూడండి, 7:54.

4 చూడండి, అల్లాహ్ తా'ఆలాను సంబోధించిన సందర్భానికి, 11:73 అల్ మజీదు వైభవం గలవాడు, ప్రభావం, ప్రతాపం విశిష్టత, దివ్యుడు, మహిమాన్వితుడు, మహత్త్వపూర్ణుడు.

بَلْ هُوَ قُرْآنٌ مَّجِيدٌ ﴿٢١﴾

21 వాస్తవానికి, ఇది ఒక దివ్యమైన ఖుర్ఆన్;[1]

فِي لَوْحٍ مَّحْفُوظٍ ﴿٢٢﴾

22. సురక్షితమైన ఫలకం (లౌ'హె మ'హ్ఫూ''జ్)లో[2] (వ్రాయబడి) ఉంది.

## 86. సూరహ్ అ'త్-'తారిఖ్

سُورَةُ الطَّارِقِ

అ'త్ 'తారిఖ్: రాత్రివేళ వచ్చేది, The Night-Comer, కాంతివంతమైన నక్షత్రం. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది ఆరంభ మక్కా కాలంలో అవతరింపజేయబడింది బహుశా 4వ సంవత్సరంలో. ఇందులో 17 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَالسَّمَاءِ وَالطَّارِقِ ﴿١﴾

1. ఆకాశం మరియు రాత్రివేళ వచ్చే నక్షత్రం (అ'త్-'తారిఖ్) సాక్షిగా!

وَمَا أَدْرَاكَ مَا الطَّارِقُ ﴿٢﴾

2. రాత్రి వేళ వచ్చేది (అ'త్-'తారిఖ్) అంటే ఏమిటో నీకు ఎలా తెలుస్తుంది?

النَّجْمُ الثَّاقِبُ ﴿٣﴾

3. అదొక అత్యంత ప్రకాశవంతమైన నక్షత్రం.

إِن كُلُّ نَفْسٍ لَّمَّا عَلَيْهَا حَافِظٌ ﴿٤﴾

4. కనిపెట్టుకొని ఉండేవాడు (దేవదూత) లేకుండా ఏ వ్యక్తి కూడా లేడు.[3]

فَلْيَنظُرِ الْإِنسَانُ مِمَّ خُلِقَ ﴿٥﴾

5. కావున మానవుడు తాను దేనితో సృష్టించబడ్డాడో గమనించాలి!

خُلِقَ مِن مَّاءٍ دَافِقٍ ﴿٦﴾

6. అతడు విసర్జించబడే (చిమ్ముకుంటూ వెలువడే) ద్రవపదార్థంతో సృష్టించబడ్డాడు

يَخْرُجُ مِن بَيْنِ الصُّلْبِ وَالتَّرَائِبِ ﴿٧﴾

7. అది వెన్ను మరియు రొమ్ము ఎముకల

1. చూడండి, ఖుర్ఆన్‌ను సంబోధించిన సందర్భానికి, 50:1.

2 చూడండి, 13:39 మరియు 43:4 ఉమ్ముల్ కితాబ్, అంటే లౌ'హె మ'హ్ఫూ''జ్ సురక్షితమైన ఫలకం, మూల గ్రంథం అంటే యథాస్థితిలో, భద్రంగా ఉంచబడిన గ్రంథం

3 చూడండి, 13:11 మరియు 82:10-12

మధ్య భాగం నుండి బయటికి వస్తుంది.

إِنَّهُۥ عَلَىٰ رَجْعِهِۦ لَقَادِرٌ ۝٨
8. నిశ్చయంగా, ఆయన (సృష్టికర్త), అతనిని మరల బ్రతికించి తేగల సామర్థ్యం గలవాడు.

يَوْمَ تُبْلَى ٱلسَّرَآئِرُ ۝٩
9. ఏ రోజయితే రహస్యవిషయాల విచారణ జరుగుతుందో!

فَمَا لَهُۥ مِن قُوَّةٍ وَلَا نَاصِرٍ ۝١٠
10. అప్పుడు అతనికి (మానవునికి) ఎలాంటి శక్తి ఉండదు మరియు ఏ సహాయకుడునూ ఉండడు.[1]

وَٱلسَّمَآءِ ذَاتِ ٱلرَّجْعِ ۝١١
11. వర్షం కురిపించే ఆకాశం సాక్షిగా![2]

وَٱلْأَرْضِ ذَاتِ ٱلصَّدْعِ ۝١٢
12. (చెట్లు మొలకెత్తేటప్పుడు) చీలిపోయే భూమి సాక్షిగా!

إِنَّهُۥ لَقَوْلٌ فَصْلٌ ۝١٣
13. నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్, సత్యా సత్యాలను) వేరుపరచే వాక్కు (గీటురాయి).

وَمَا هُوَ بِٱلْهَزْلِ ۝١٤
14. మరియు ఇది వృథా కాలక్షేపానికి వచ్చినది కాదు.

إِنَّهُمْ يَكِيدُونَ كَيْدًا ۝١٥
15. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా వారు (నీకు విరుద్ధంగా) కుట్రలు పన్నుతున్నారు.[3]

وَأَكِيدُ كَيْدًا ۝١٦
16. మరియు నేను కూడ పన్నాగం పన్ను తున్నాను.

فَمَهِّلِ ٱلْكَٰفِرِينَ أَمْهِلْهُمْ رُوَيْدًۢا ۝١٧
17. కనుక నీవు సత్యతిరస్కారులకు కొంత వ్యవధినివ్వు![4] వారి పట్ల మృదువుగా వ్యవహరించు.(1/2)

1 అల్లాహ్ (సు. తా.) శిక్షనుండి తప్పించుకోవటానికి.
2 అర్-రజ్'ఉ: తిరిగి రావటం. వర్షం కూడా మళ్ళీ మళ్ళీ వస్తుంది కాబట్టి ఈ పేరుతో పిలువబడుతుంది.
3. చూడండి, 34:33.
4. చూడండి, 7:182-183.

## 87. సూరహ్ అల్-అ'అలా

سُورَةُ الْأَعْلَىٰ

అల్ అ'అలా: The Most High, మహోన్నతుడు. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ప్రారంభ మక్కా కాలపు, బహుశా సూరహ్ అల్-అన్ఫాల్ (8) లేక సూరహ్ అత్-తక్వీర్ (81) తరువాత అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) పండుగ ('ఈద్)ల నమా'జ్‌లలో మరియు జుము'అహ్ నమా'జ్‌లలో ఈ సూరహ్ (87)ను మరియు సూరహ్ అల్-'గాషియహ్(88)ను పఠించేవారు. వి'త్ర్ నమా'జ్ మొదటి రకాత్‌లో ఈ సూరహ్(87)ను, రెండవ రకాత్‌లో సూరహ్ అల్-కాఫిరూన్(109)ను మరియు మూడవ రకాత్‌లో సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్(112)ను పఠించేవారు. ఇందులో 19 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

1. * మహోన్నతుడైన నీ ప్రభువు నామాన్ని స్తుతించు!

سَبِّحِ اسْمَ رَبِّكَ الْأَعْلَى ۝١

2. ఆయనే (ప్రతి దానిని) సృష్టించాడు మరియు తగిన ప్రమాణంలో రూపొందించాడు.[1]

الَّذِي خَلَقَ فَسَوَّىٰ ۝٢

3. మరియు ఆయనే దాని ప్రకృతి లక్షణాలను నిర్ణయించాడు,[2] మరియు మార్గం చూపాడు!

وَالَّذِي قَدَّرَ فَهَدَىٰ ۝٣

4. మరియు ఆయనే పచ్చికను మొలిపింపజేశాడు!

وَالَّذِي أَخْرَجَ الْمَرْعَىٰ ۝٤

5. మరల దానిని నల్లని చెత్తాచెదారంగా చేశాడు.[3]

فَجَعَلَهُ غُثَاءً أَحْوَىٰ ۝٥

6. మేము నీ చేత (ఖుర్ఆన్‌ను) చదివింప జేస్తాము, తరువాత నీవు (దానిని) మరచిపోవు

سَنُقْرِئُكَ فَلَا تَنسَىٰ ۝٦

7. అల్లాహ్ కోరింది తప్ప![4] నిశ్చయంగా,

إِلَّا مَا شَاءَ اللَّهُ ۚ إِنَّهُ يَعْلَمُ الْجَهْرَ وَمَا يَخْفَىٰ ۝٧

---

1. చూడండి, 82:7
2. చూడండి, 25:2 మరియు 20:50.
3. 'గుసా'అన్: ఎండిపగడ్డి. అ'హ్వా: నల్లని. అంటే పచ్చి గడ్డిని ఎండింపజేసి నల్లని చెత్తాచెదారంగా చేస్తాడు.
4. అంటే అల్లాహ్ (సు.తా.) రద్దుచేయదలచిన దానిని మరపింపజేస్తాడు.

బహిరంగంగా ఉన్నదీ మరియు గోప్యంగా ఉన్నదీ అన్నీ ఆయనకు బాగా తెలుసు.

وَنُيَسِّرُكَ لِلْيُسْرَىٰ ۝٨

**8.** మరియు మేము నీ మార్గాన్ని సులభం చేయడానికి నీకు సౌలభ్యాన్ని కలుగజేస్తాము.[1]

فَذَكِّرْ إِن نَّفَعَتِ الذِّكْرَىٰ ۝٩

**9.** కావున నీవు హితోపదేశం చేస్తూ ఉండు; వారికి హితోపదేశం లాభదాయకం కావచ్చు![2]

سَيَذَّكَّرُ مَن يَخْشَىٰ ۝١٠

**10.** (అల్లాహ్‌కు) భయపడే వాడు హితోపదేశాన్ని స్వీకరిస్తాడు.

وَيَتَجَنَّبُهَا الْأَشْقَى ۝١١

**11.** మరియు దౌర్భాగ్యుడు దానికి దూరమైపోతాడు.

الَّذِي يَصْلَى النَّارَ الْكُبْرَىٰ ۝١٢

**12** అలాంటి వాడే ఘోరమైన అగ్నిలో పడి కాలుతాడు

ثُمَّ لَا يَمُوتُ فِيهَا وَلَا يَحْيَىٰ ۝١٣

**13.** అప్పుడు, అతడు అందులో చావనూ లేడు, బ్రతకనూ లేడు.[3]

قَدْ أَفْلَحَ مَن تَزَكَّىٰ ۝١٤

**14.** సుశీలతను(పవిత్రతను)పాటించే వాడు తప్పక సాఫల్యం పొందుతాడు.

وَذَكَرَ اسْمَ رَبِّهِ فَصَلَّىٰ ۝١٥

**15.** మరియు తన ప్రభువు నామాన్ని స్మరిస్తూ, నమా'జ్ చేస్తూ ఉండేవాడు.

بَلْ تُؤْثِرُونَ الْحَيَاةَ الدُّنْيَا ۝١٦

**16** అలాకాదు! మీరు ఐహిక జీవితానికి ప్రాధాన్యత నిస్తున్నారు;

وَالْآخِرَةُ خَيْرٌ وَأَبْقَىٰ ۝١٧

**17** కాని పరలోక జీవితమే మేలైనది మరియు చిరకాలముండేది.

إِنَّ هَٰذَا لَفِي الصُّحُفِ الْأُولَىٰ ۝١٨

**18.** నిశ్చయంగా, ఈ విషయం పూర్వ గ్రంథాలలో ఉంది;

---

1 వ'హీని జ్ఞాపకముంచుకోవటం మరియు దానిపై నడవటం మేము (అల్లాహుతా'ఆలా), నీకు సులభం చేస్తాము.

2 నీ (ము'హమ్మద్ 'స 'అ స ) పని హితోపదేశం చేయటం మాత్రమే! నీ హితోపదేశం వారికి లాభదాయకం కావచ్చు! వారు దానితో లాభం పొందకున్నా నీ పని కేవలం హితోపదేశం చేయుటమే

3 చూడండి, 74:28-29

صُحُفِ إِبْرَٰهِيمَ وَمُوسَىٰ ١٩

19 ఇబ్రాహీమ్ మరియు మూసాలపై (అవతరింపజేయబడిన) గ్రంథాలలో.

## 88. సూరహ్ అల్-'గాషియహ్

سُورَةُ الغَاشِيَةِ

అల్ 'గాషియహ్: The Overwhelming, క్రమ్ముకొనేది, హఠాత్తుగా ఆసన్నమయ్యేది. పునరుత్థానదినం, దాని విపత్తు సర్వసృష్టిని క్రమ్ముకొంటుంది. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది ఆరంభ మక్కా కాలపు సూరహ్. దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ నమాజులలో సూరహ్ అల్-జుము'అహ్ (62) తరువాత దీనిని (88) పఠించేవారు (ముస్'త్రఅ' ఇమామ్ మాలిక్). ఇందులో 26 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

هَلْ أَتَىٰكَ حَدِيثُ ٱلْغَٰشِيَةِ ١

1. హఠాత్తుగా ఆసన్నమయ్యే ఆ విపత్తు (పునరుత్థానదినపు) సమాచారం నీకు అందిందా?

وُجُوهٌ يَوْمَئِذٍ خَٰشِعَةٌ ٢

2. కొన్ని ముఖాలు ఆ రోజు వాలి (క్రుంగి) పోయి ఉంటాయి.

عَامِلَةٌ نَّاصِبَةٌ ٣

3. (ప్రపంచంలోని వ్యర్థా) శ్రమకు, (పరలోకంలో జరిగే) అవమానానికి,[1]

تَصْلَىٰ نَارًا حَامِيَةً ٤

4. వారు దహించే అగ్నిలో పడి కాలుతారు.

تُسْقَىٰ مِنْ عَيْنٍ ءَانِيَةٍ ٥

5. వారికి సలసల కాగే చెలమ నీరు త్రాగటానికి ఇవ్వబడుతుంది.

لَّيْسَ لَهُمْ طَعَامٌ إِلَّا مِن ضَرِيعٍ ٦

6. వారికి చేదు ముళ్ళగడ్డ (జరీ') తప్ప మరొక ఆహారం ఉండదు.

لَّا يُسْمِنُ وَلَا يُغْنِى مِن جُوعٍ ٧

7. అది వారికి బలమూ నియ్యదు మరియు ఆకలీ తీర్చదు!

وُجُوهٌ يَوْمَئِذٍ نَّاعِمَةٌ ٨

8. ఆరోజున, మరికొన్ని ముఖాలు కళకళలాడుతూ ఉంటాయి;

لِّسَعْيِهَا رَاضِيَةٌ ٩

9. తాము చేసుకున్న సత్కార్యాలకు

1. నాసిబతున్: శ్రమకు అలసిపోవటం

(ఫలితానికి) వారు సంతోషపడుతూ ఉంటారు.

فِي جَنَّةٍ عَالِيَةٍ ﴿١٠﴾

**10.** అత్యున్నతమైన స్వర్గవనంలో.

لَّا تَسْمَعُ فِيهَا لَاغِيَةً ﴿١١﴾

**11.** అందులో వారు ఎలాంటి వృథామాటలు వినరు.

فِيهَا عَيْنٌ جَارِيَةٌ ﴿١٢﴾

**12.** అందులో ప్రవహించే సెలయేళ్ళు ఉంటాయి;

فِيهَا سُرُرٌ مَّرْفُوعَةٌ ﴿١٣﴾

**13.** అందులో ఎత్తైన ఆసనాలు ఉంటాయి;[1]

وَأَكْوَابٌ مَّوْضُوعَةٌ ﴿١٤﴾

**14.** మరియు పేర్చబడిన (మధు) పాత్రలు;

وَنَمَارِقُ مَصْفُوفَةٌ ﴿١٥﴾

**15.** మరియు వరుసలుగా వేయబడిన, దిండ్లు;

وَزَرَابِيُّ مَبْثُوثَةٌ ﴿١٦﴾

**16.** మరియు పరచబడిన నాణ్యమైన తివాచీలు.

أَفَلَا يَنظُرُونَ إِلَى الْإِبِلِ كَيْفَ خُلِقَتْ ﴿١٧﴾

**17.** ఏమిటీ? వారు ఒంటెల వైపు చూడరా? అవి ఎలా సృష్టించబడ్డాయో?

وَإِلَى السَّمَاءِ كَيْفَ رُفِعَتْ ﴿١٨﴾

**18.** మరియు ఆకాశంవైపుకు (చూడరా)? అది ఎలా పైకి ఎత్తబడి ఉందో?

وَإِلَى الْجِبَالِ كَيْفَ نُصِبَتْ ﴿١٩﴾

**19.** మరియు కొండలవైపుకు చూడరా? అవి ఎలా గట్టిగా నాటబడి ఉన్నాయో?

وَإِلَى الْأَرْضِ كَيْفَ سُطِحَتْ ﴿٢٠﴾

**20.** మరియు భూమివైపుకు (చూడరా)? అది ఎలా విశాలంగా పరచబడిఉందో?

فَذَكِّرْ إِنَّمَا أَنتَ مُذَكِّرٌ ﴿٢١﴾

**21.** కావున (ఓ ము'హమ్మద్!) నీవు హితోపదేశం చేస్తూవుండు, వాస్తవానికి నీవు కేవలం హితోపదేశం చేసేవాడవు మాత్రమే!

لَّسْتَ عَلَيْهِم بِمُصَيْطِرٍ ﴿٢٢﴾

**22.** నీవు వారిని (విశ్వసించమని) బలవంతం చేసేవాడవు కావు.

إِلَّا مَن تَوَلَّىٰ وَكَفَرَ ﴿٢٣﴾

**23.** ఇక, ఎవడైతే, వెనుదిరుగుతాడో మరియు సత్యాన్ని తిరస్కరిస్తాడో!

---

1. చూడండి, 15:47

**24** అప్పుడు అతనికి అల్లాహ్ ఘోరశిక్ష విధిస్తాడు.

فَيُعَذِّبُهُ اللَّهُ الْعَذَابَ الْأَكْبَرَ ﴿٢٤﴾

**25.** నిశ్చయంగా, మా వైపునకే వారి మరలింపు ఉంది,

إِنَّ إِلَيْنَا إِيَابَهُمْ ﴿٢٥﴾

**26** ఆ తర్వాత నిశ్చయంగా, వారి లెక్కతీసుకునేదీ మేమే!

ثُمَّ إِنَّ عَلَيْنَا حِسَابَهُم ﴿٢٦﴾

## 89. సూరహ్ అల్-ఫజ్ర్

## سُورَةُ الفَجْرِ

అల్-ఫజ్ర్: The Dawn, The Day Break, ప్రాతఃకాలం, వేకువజాము అవతరణా క్రమంలో ఇది 10వది మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **30** ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** ప్రాతఃకాలం సాక్షిగా![1]

وَالْفَجْرِ ﴿١﴾

**2.** పది రాత్రుల సాక్షిగా![2]

وَلَيَالٍ عَشْرٍ ﴿٢﴾

**3.** సరి బేసిల సాక్షిగా!

وَالشَّفْعِ وَالْوَتْرِ ﴿٣﴾

**4** గడచిపోయే రాత్రి సాక్షిగా!

وَاللَّيْلِ إِذَا يَسْرِ ﴿٤﴾

**5.** వీటిలో బుద్ధిగల వాని కొరకు ఏ ప్రమాణమూ లేదా ఏమిటి?[3]

هَلْ فِي ذَٰلِكَ قَسَمٌ لِّذِي حِجْرٍ ﴿٥﴾

**6.** నీ ప్రభువు 'ఆద్ (జాతి) వారిపట్ల ఎలా వ్యవహరించాడో నీకు తెలియదా?[4]

أَلَمْ تَرَ كَيْفَ فَعَلَ رَبُّكَ بِعَادٍ ﴿٦﴾

---

1. అంటే ప్రతి ఉదయం. ఒక ప్రత్యేక ఉదయం కాదు.

2 అంటే జు'ల్ 'హిజ్జ్ యొక్క మొదటి పదిరాత్రులని చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయం వీటి ఘనత 'హదీసు'లలో ఉంది. దైవప్రవక్త (స'అస) ప్రవచనం. ''జు'ల్ 'హజ్జ్ మొదటి పది రోజులలో చేసే సత్కార్యాలు అల్లాహ్(సు.తా.)కు ఎంతో ఇష్టమైనవి జిహాద్ కంటే కూడా మానవుడు అమరగతి నొందిన జిహాద్ తప్ప. ('స'హీ'హ్ బు'ఖారీ)

3 అంటే వీటన్నిటి ప్రమాణం చేయటం, అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించటానికి చాలదా! 'హిజ్ర్‌ను: ఆపటం, కాదనటం, బుద్ధికూడా మానవుడిని చెడు కర్మలనుండి ఆపుతుంది

4 వారి ప్రవక్త హూద్ ('అ.స.) చూడండి, 69:7 10 మరియు 7:65 72

7. ఎత్తైన స్తంభాల (భవనాలు గల) ఇరమ ప్రజల పట్ల?[1]

إِرَمَ ذَاتِ الْعِمَادِ ۝

8. వారిలాంటి జాతి భూమిలో ఎన్నడూ సృష్టించబడలేదు.[2]

الَّتِي لَمْ يُخْلَقْ مِثْلُهَا فِي الْبِلَادِ ۝

9. మరియు లోయలలోని కొండ రాళ్ళలో (భవనాలను) తొలిచిన సమూద్ జాతి పట్ల?[3]

وَثَمُودَ الَّذِينَ جَابُوا الصَّخْرَ بِالْوَادِ ۝

10. మరియు మేకులవాడైన ఫిర్ఔన్ పట్ల?[4]

وَفِرْعَوْنَ ذِي الْأَوْتَادِ ۝

11. వారంతా అయా దేశాలలో తలబిరుసు తనంతో ప్రవర్తించారు;

الَّذِينَ طَغَوْا فِي الْبِلَادِ ۝

12. మరియు వాటిలో దౌర్జన్యాన్ని రేకెత్తించారు.

فَأَكْثَرُوا فِيهَا الْفَسَادَ ۝

13. కాబట్టి నీ ప్రభువు వారిపైకి అనేక రకాల బాధాకరమైన శిక్షలను పంపాడు.

فَصَبَّ عَلَيْهِمْ رَبُّكَ سَوْطَ عَذَابٍ ۝

14. వాస్తవానికి, నీ ప్రభువు మాటువేసి ఉన్నాడు (అంతా కనిపెడ్తూ ఉంటాడు)!

إِنَّ رَبَّكَ لَبِالْمِرْصَادِ ۝

15. అయితే మానవుడు ఎలాంటి వాడంటే: అతని ప్రభువు అతన్ని పరీక్షించటానికి, అతనికి గౌరవప్రతిష్ఠలనిచ్చి అనుగ్రహించినప్పుడు: "నా ప్రభువు నన్ను గౌరవించాడు." అని అంటాడు;[5]

فَأَمَّا الْإِنسَانُ إِذَا مَا ابْتَلَاهُ رَبُّهُ فَأَكْرَمَهُ وَنَعَّمَهُ فَيَقُولُ رَبِّي أَكْرَمَنِ ۝

16. కాని, అతన్ని పరీక్షించటానికి, అతని ఉపాధిని తగ్గించినప్పుడు: "నా ప్రభువు నన్ను అవమానించాడు." అని అంటాడు.[6]

وَأَمَّا إِذَا مَا ابْتَلَاهُ فَقَدَرَ عَلَيْهِ رِزْقَهُ فَيَقُولُ رَبِّي أَهَانَنِ ۝

---

1 ఇరమ: ఒక తెగ పేరు. దాని పూర్వోత్తరాలు ఇలా ఉన్నాయి: 'ఆద్ బిన్ 'ఔస్ బిన్ ఇరమ బిన్ సామ్ బిన్ నూ'హ్ (ఫ'త్హ్ అల్ ఖదీర్) వీరిని 'ఆద్ ఊలా, అని కూడా అంటారు. వీరిని ఎత్తైన స్తంభాల (భవనాల) వారని కూడా అంటారు.

2 'ఆద్ జాతివారికి తమ బలసామర్థ్యాల మీద ఎంతో గర్వం ఉండేది. చూడండి, 41:15

3. వీరి ప్రవక్త 'సాలి'హ్ ('అ.స.). చూడండి, 26:149

4 అంటే పెద్ద సైన్యం గలవాడు, లేక ప్రజలను మేకులతో నాటి శిక్షించేవాడు. (ఫ'త్హ్ అల్ ఖదీర్)

5 అల్లాహ్ (సు.తా.) ధనధాన్యాలు, సౌభాగ్యాలు ఇచ్చినా, పరీక్షించటానికే! మరియు పేదరికానికి గురిచేసినా, అదీ పరీక్షించటానికే!

6 అల్లాహ్ (సు.తా.) తన సద్వర్తనులైన దాసులకు భోగభాగ్యాలు, ధనధాన్యాలు ప్రసాదించవచ్చు!

كَلَّا بَل لَّا تُكْرِمُونَ الْيَتِيمَ ﴿١٧﴾

**17.** అలా కాదు, వాస్తవానికి మీరు అనాథులను ఆదరించరు;[1]

وَلَا تَحَاضُّونَ عَلَىٰ طَعَامِ الْمِسْكِينِ ﴿١٨﴾

**18.** మరియు మీరు పేదలకు అన్నం పెట్టే విషయంలో ఒకరినొకరు ప్రోత్సహించుకోరు;[2]

وَتَأْكُلُونَ التُّرَاثَ أَكْلًا لَّمًّا ﴿١٩﴾

**19.** మరియు వారసత్వపు ఆస్తిని పేరాశతో అంతా మీరే తినేస్తారు.

وَتُحِبُّونَ الْمَالَ حُبًّا جَمًّا ﴿٢٠﴾

**20.** మరియు మీరు ధన వ్యామోహంలో దారుణంగా చిక్కుకు పోయారు![3]

كَلَّا إِذَا دُكَّتِ الْأَرْضُ دَكًّا دَكًّا ﴿٢١﴾

**21.** అలా కాదు, భూమి, దంచి పిండి పిండిగా చేయబడినపుడు;

وَجَاءَ رَبُّكَ وَالْمَلَكُ صَفًّا صَفًّا ﴿٢٢﴾

**22.** మరియు నీ ప్రభువు (స్వయంగా) వస్తాడు మరియు దేవదూతలు వరుసలలో వస్తారు[4]

وَجِيءَ يَوْمَئِذٍ بِجَهَنَّمَ ۚ يَوْمَئِذٍ يَتَذَكَّرُ الْإِنسَانُ وَأَنَّىٰ لَهُ الذِّكْرَىٰ ﴿٢٣﴾

**23.** ఆ రోజు నరకం (ముందుకు) తీసుకు రాబడుతుంది. ఆ రోజు మానవుడు (తన కర్మలన్నీ) జ్ఞప్తికి తెచ్చుకుంటాడు; కాని ఆ రోజు జ్ఞప్తికితెచ్చుకోవడం వల్ల అతనికి కలిగే ప్రయోజనమేమిటీ?

يَقُولُ يَا لَيْتَنِي قَدَّمْتُ لِحَيَاتِي ﴿٢٤﴾

**24.** అతడు: "అయ్యో! నా పాడుగాను! నా ఈ జీవితం కొరకు నేను (సత్కార్యాలు) చేసి పంపుకొని ఉంటే ఎంతబాగుండేది!" అని వాపోతాడు.

---

లేక పేదరికానికీ గురిచేసి పరీక్షించవచ్చు. అదే విధంగా సత్యతిరస్కారులకు కూడా ఐశ్వర్యా లివ్వ వచ్చు లేక పేదరికంతో పరీక్షించవచ్చు! సద్వర్తనులైన విశ్వాసులు ఐశ్వర్యవంతులుగా ఉంటే అల్లాహ్ (సు.తా.)కు కృతజ్ఞులుగా ఉంటారు. పేదరికానికి గురిఅయితే సహనం వహిస్తారు.

1 దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అనాథులతో మంచిగా వ్యవహరించేవారు స్వర్గంలో నాతోపాటు రెండు వ్రేళ్ళు తోడుగా ఉన్నట్లు ఉంటారు." (అబూ దావూద్) కావున అనాథులను పోషించడం, వారితో మంచిగా వ్యవహరించటం ఎంతో పుణ్యకార్యం.

2 చూడండి, 107:3.

3. జమ్మన్: కసీ'రన్, చాలా.

4. ఏడు ఆకాశాల దైవదూతలు ఏడు వరుసలలో నిలబడతారు.

فَيَوْمَئِذٍ لَّا يُعَذِّبُ عَذَابَهُ أَحَدٌ ۝

25. అయితే ఆ రోజు, ఆయన (అల్లాహ్) శిక్షించినట్లు, మరెవ్వడూ శిక్షించలేడు!

وَلَا يُوثِقُ وَثَاقَهُ أَحَدٌ ۝

26. మరియు ఆయన (అల్లాహ్) బంధించినట్లు, మరెవ్వడూ బంధించలేడు.[1]

يَا أَيَّتُهَا النَّفْسُ الْمُطْمَئِنَّةُ ۝

27. (సన్మార్గునితో ఇలా అనబడుతుంది). "ఓ తృప్తిపొందిన ఆత్మా!

ارْجِعِي إِلَىٰ رَبِّكِ رَاضِيَةً مَّرْضِيَّةً ۝

28. "నీ ప్రభువు సన్నిధికి మరలి రా! (నీకు లభించే సత్ఫలితానికి) ఆనందిస్తూ మరియు (నీ ప్రభువునకు) ప్రియమైన దానివై!

فَادْخُلِي فِي عِبَادِي ۝

29. "నీవు (పుణ్యాత్ములైన) నా దాసులలో చేరిపో!

وَادْخُلِي جَنَّتِي ۝

30. "మరియు నీవు నా స్వర్గంలో ప్రవేశించు!"(5/8)

## سُورَةُ الْبَلَدِ

## 90. సూరహ్ అల్-బలద్

అల్-బలద్: నగరం, పురం, పట్నం. The City, The Land. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో 20 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

لَا أُقْسِمُ بِهَٰذَا الْبَلَدِ ۝

1. * కాదు, నేను ఈ నగరం (మక్కా) సాక్షిగా (అంటున్నాను)!

وَأَنتَ حِلٌّ بِهَٰذَا الْبَلَدِ ۝

2. మరియు నీకు ఈ నగరం (మక్కా)లో స్వేచ్ఛ ఉంది.

وَوَالِدٍ وَمَا وَلَدَ ۝

3. మరియు తండ్రి (మూల పురుషుడు) మరియు అతని సంతానం సాక్షిగా![2]

---

1. చూడండి, 73:12-13.
2. కొందరు: తండ్రి (మూల పురుషుడు) అంటే ఆదమ్ ('అ.స.) మరియు అతని సంతానం అంటే మానవజాతి.' అన్నారు.

4. వాస్తవానికి, మేము మానవుణ్ణి శ్రమజీవిగా పుట్టించాము.

لَقَدْ خَلَقْنَا الْإِنسَانَ فِي كَبَدٍ ﴿٤﴾

5. ఏమిటి? తనను ఎవ్వడూ వశపరచు కోలేడని అతడు భావిస్తున్నాడా?

أَيَحْسَبُ أَن لَّن يَقْدِرَ عَلَيْهِ أَحَدٌ ﴿٥﴾

6. అతడు: "నేను విపరీత ధనాన్ని ఖర్చు పెట్టాను!" అని అంటాడు.[1]

يَقُولُ أَهْلَكْتُ مَالًا لُّبَدًا ﴿٦﴾

7. ఏమిటి? తనను ఎవ్వడూ చూడటం లేదని అతడు భావిస్తున్నాడా?[2]

أَيَحْسَبُ أَن لَّمْ يَرَهُ أَحَدٌ ﴿٧﴾

8. ఏమిటి? మేము అతనికి రెండు కళ్ళు ఇవ్వలేదా?

أَلَمْ نَجْعَل لَّهُ عَيْنَيْنِ ﴿٨﴾

9. మరియు నాలుకను మరియు రెండు పెదవులను.

وَلِسَانًا وَشَفَتَيْنِ ﴿٩﴾

10. మరియు అతనికి (మంచీ-చెడూ) అనే స్పష్టమైన రెండు మార్గాలను చూపాము.[3]

وَهَدَيْنَاهُ النَّجْدَيْنِ ﴿١٠﴾

11. కాని అతడు కష్టతరమైన ఊర్ధ్వ గమనానికి సాహసించలేదు![4]

فَلَا اقْتَحَمَ الْعَقَبَةَ ﴿١١﴾

12. మరియు ఆ ఊర్ధ్వ గమనం అంటే ఏమిటో నీకు తెలుసా?

وَمَا أَدْرَاكَ مَا الْعَقَبَةُ ﴿١٢﴾

13. అది ఒకని మెడను (బానిసత్వం నుండి) విడిపించడం.[5]

فَكُّ رَقَبَةٍ ﴿١٣﴾

14. లేదా! (స్వయంగా) ఆకలిగొని[6] ఉన్న

أَوْ إِطْعَامٌ فِي يَوْمٍ ذِي مَسْغَبَةٍ ﴿١٤﴾

---

1. లుబదన్: కసీ'రన్, చాలా.
2. అంటే అతడు చేసే వృథా ఖర్చును ఎవ్వరూ చూడటం లేదని భావిస్తున్నాడా? అల్లాహ్ (సు.తా.) అంతా చూస్తున్నాడు.
3. చూడండి, 76:3 అన్-నజ్దు: అంటే ఎత్తైన స్థలం. అన్-నజ్దైన్: అంటే రెండు మార్గాలు
4. అల్ 'అఖబహ్: కొండ శిఖరం (పైకి ఎక్కడం) కొందరు దీనికి కనుమ అనే అర్థం ఇచ్చారు అంటే రెండు కొండల నడిమి తోవ, సందు. కఠినమైన కనుమ అంటే ఒక బానిసను బంధం నుండి విముక్తి చేయించడం, లేక తాను ఆకలితో ఉండి కూడా ఒక అనాథునికి అన్నం పెట్టడం
5. చూడండి. 2:177.
6. మస్'గబతున్: ఆకలి

రోజు కూడా (ఇతరులకు) అన్నం పెట్టడం.

15. సమీప అనాథునికి గానీ;

يَتِيمًا ذَا مَقْرَبَةٍ ۝

16. లేక, దిక్కులేని నిరుపేదకు గానీ![1]

أَوْ مِسْكِينًا ذَا مَتْرَبَةٍ ۝

17. మరియు విశ్వసించి, సహనాన్ని బోధించే వారిలో![2] మరియు కరుణను ఒకరి కొకరు బోధించుకునే వారిలో చేరిపోవడం.

ثُمَّ كَانَ مِنَ الَّذِينَ آمَنُوا وَتَوَاصَوْا بِالصَّبْرِ وَتَوَاصَوْا بِالْمَرْحَمَةِ ۝

18. ఇలాంటి వారే కుడిపక్షం వారు.[3]

أُولَٰئِكَ أَصْحَابُ الْمَيْمَنَةِ ۝

19. ఇక మా సందేశాలను తిరస్కరించిన వారు, ఎడమ పక్షానికి చెందిన వారు.

وَالَّذِينَ كَفَرُوا بِآيَاتِنَا هُمْ أَصْحَابُ الْمَشْأَمَةِ ۝

20. వారిని నరకాగ్ని చుట్టుకుంటుంది.[4]

عَلَيْهِمْ نَارٌ مُؤْصَدَةٌ ۝

## 91. సూరహ్ అష్-షమ్స్

## سُورَةُ الشَّمْسِ

అష్ షమ్స్: The Sun, సూర్యుడు ఈ పదం మొదటి ఆయత్‌లో ఉంది ఇది సూరహ్ అల్-ఖద్ర్ (97) తరువాత అవతరింపజేయబడింది. మొదటి మక్కా కాలపు సూరహ్. పరలోక జీవితానికి భయపడనివారికి భయంకరమైన పర్యవసానం ఉంటుందని ఈ సూరహ్ తెలుపుతుంది. ఇందులో 15 ఆయతులు ఉన్నాయి

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

1. సూర్యుని మరియు దాని ఎండ సాక్షిగా![5]

وَالشَّمْسِ وَضُحَاهَا ۝

2. దాని వెనుక వచ్చే చంద్రుని సాక్షిగా!

وَالْقَمَرِ إِذَا تَلَاهَا ۝

3 ప్రకాశించే పగటి సాక్షిగా!

وَالنَّهَارِ إِذَا جَلَّاهَا ۝

4. దానిని క్రమ్ముకొనే, రాత్రి సాక్షిగా!

وَاللَّيْلِ إِذَا يَغْشَاهَا ۝

---

1 జా' మత్‌రబతున్: మట్టిపై పడిఉండే పేదవాడు. ఎవడికైతే ఇల్లుఉండదో!

2 అతడు విశ్వాసి అయిఉంటేనే, చేసిన పుణ్యాల ఫలితం దొరుకుతుంది లేకపోతే పరలోకంలో అవి వృథా అయిపోతాయి.

3. చూడండి, 74.39 మరియు 56:8. 9, 27, 41.

4 ము'సదతున్ ము'గ్లఖతున్, అంటే చుట్టుకుంటుంది చూడండి, 104:6 8.

5 'దు'హా'హా: సూర్యుని ప్రకాశవంతమైన వెలుగు.

5 ఆకాశం మరియు దానిని నిర్మించిన ఆయన (అల్లాహ్) సాక్షిగా!

وَالسَّمَاءِ وَمَا بَنَاهَا ۝

6. భూమి మరియు దానిని విస్తరింపజేసిన ఆయన సాక్షిగా!

وَالْأَرْضِ وَمَا طَحَاهَا ۝

7 మానవ ఆత్మ మరియు దానిని తీర్చిదిద్దిన ఆయన సాక్షిగా![1]

وَنَفْسٍ وَمَا سَوَّاهَا ۝

8. ఆ తరువాత ఆయనే దానికి దుష్టతనాన్ని మరియు దైవభీతిని తెలియజేశాడు.[2]

فَأَلْهَمَهَا فُجُورَهَا وَتَقْوَاهَا ۝

9. వాస్తవానికి తన ఆత్మను శుద్ధపరచుకున్న వాడే సఫలుడవుతాడు.

قَدْ أَفْلَحَ مَن زَكَّاهَا ۝

10. మరియు వాస్తవానికి దానిని అణగ ద్రొక్కిన వాడే విఫలుడవుతాడు.[3]

وَقَدْ خَابَ مَن دَسَّاهَا ۝

11. స'మూద్ జాతి తలబిరుసుతనంతో (ప్రవక్తను) అసత్యవాదుడని తిరస్కరించింది;[4]

كَذَّبَتْ ثَمُودُ بِطَغْوَاهَا ۝

12. తమలోని పరమదుష్టుడు (ఆ దుష్కార్యం చేయటానికి) లేచినప్పుడు.

إِذِ انبَعَثَ أَشْقَاهَا ۝

13. అల్లాహ్ సందేశహరుడు ('సాలి'హ్) వారితో: "ఈ ఆడఒంటె అల్లాహ్‌కు చెందింది. కాబట్టి దీనిని (నీళ్ళు)త్రాగనివ్వండి!" అని అన్నారు.

فَقَالَ لَهُمْ رَسُولُ اللَّهِ نَاقَةَ اللَّهِ وَسُقْيَاهَا ۝

14. అయినా వారు అతని ('సాలి'హ్) మాటను అబద్ధమని తిరస్కరించారు. మరియు దాని (ఆ ఒంటె) వెనకమోకాలిపరాన్నికోసి, కుంటిదాన్నిచేసి చంపారు.[5] కాబట్టి వారి ప్రభువు వారి పాపానికి

فَكَذَّبُوهُ فَعَقَرُوهَا فَدَمْدَمَ عَلَيْهِمْ رَبُّهُم بِذَنبِهِمْ فَسَوَّاهَا ۝

1. చూడండి, 87.2

2 ఫుజూరహా వ తఖ్వాహా అంటే మంచిచెడులు. అనే అర్థం కూడా వస్తుంది. చూడండి, ఇబ్నె కసీ'ర్

3 దస్సా దాచి పెట్టటం, అణగద్రొక్కటం ఎవడైతే తన ఆత్మను అణగద్రొక్కాడో.

4. 'తు'గ్‌యానన్: తలబిరుసుతనం. తలబిరుసుతనంలో వారు తమ ప్రవక్త అబద్ధీకుడని తిరస్కరించారు స'మూద్ జాతి వారి గాథ కోసం చూడండి, 7:73-79

5 దీని తాత్పర్యం ఏమిటంటే ఒక సమాజంలో ఏ ఒక్కడు గానీ, లేక కొందరు గానీ దుష్టపనులు చేస్తున్నప్పుడు ఇతరులు వారిని ఆపకుండా, దానిని సమ్మతిస్తే, ఆ సమాజం వారంతా దోషులే

పర్యవసానంగా వారి మీద మహా విపత్తును పంపి వారందరినీ నాశనంచేశాడు.

وَلَا يَخَافُ عُقْبٰهَا ۝

15. మరియు ఆయన (అల్లాహ్)కు దాని పర్యవసానాన్ని గురించి భయం లేదు![1]

## 92. సూరహ్ అల్-లైల్

## سُوْرَةُ اللَّيْلِ

అల్-లైల్: The Night, రాత్రి, దీనిపేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది అవతరణాక్రమంలో బహుశా ఇది తొమ్మిదవ మక్కా సూరహ్ ఇందులో 21 ఆయతులు ఉన్నాయి

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَالَّيْلِ اِذَا يَغْشٰى ۝

1. క్రమ్ముకొనే రాత్రి సాక్షిగా!

وَالنَّهَارِ اِذَا تَجَلّٰى ۝

2. ప్రకాశించే పగటి సాక్షిగా!

وَمَا خَلَقَ الذَّكَرَ وَالْاُنْثٰٓى ۝

3. మరియు మగ మరియు ఆడ (జాతులను) సృష్టించిన ఆయన (అల్లాహ్) సాక్షిగా!

اِنَّ سَعْيَكُمْ لَشَتّٰى ۝

4. వాస్తవానికి, మీ ప్రయత్నాలు నానా విధాలుగా ఉన్నాయి;[2]

فَاَمَّا مَنْ اَعْطٰى وَاتَّقٰى ۝

5. కాని ఎవడైతే (దాన ధర్మాలు) చేస్తూ దైవభీతి కలిగిఉంటాడో!

وَصَدَّقَ بِالْحُسْنٰى ۝

6. మరియు మంచిని నమ్ముతాడో![3]

فَسَنُيَسِّرُهٗ لِلْيُسْرٰى ۝

7. అతనికి మేము మేలుకొరకు దారిని సులభం చేస్తాము.[4]

---

వారందరూ శిక్షార్హులే! కాబట్టి వారందరూ నాశనం చేయబడ్డారు

1 ఏదైన ఇతర గొప్ప శక్తి ప్రతీకారం తీసుకుంటుందేమోనన్న భయం అల్లాహ్ (సు.తా.)కు లేదు. ఆయన (సు.తా.)కు సరిసమానమైన, లేక ఆయన (సు.తా.) కంటే పెద్దశక్తి అనేది ఏదీ లేదు. ఆయన (సు.తా.) మీద ఎవ్వరూ ప్రతీకారం తీర్చుకోలేరు.

2 చూడండి, 91.8

3 వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ ఆయత్ అబూబక్ర్ 'సిద్దీఖ్ (ర'ది.'అ.)ను గురించి అవతరింపజేయబడింది. అతను ఆరుమంది బానిసలకు స్వాతంత్ర్యం ఇప్పించారు. వారు తమ ముష్రిక్ నాయకుల విపరీత బాధలకు గురిఅయి ఉండిరి. (ఫ'త్హ్ అల్-ఖదీర్)

4 చూడండి, 87.8

وَأَمَّا مَنۢ بَخِلَ وَٱسۡتَغۡنَىٰ ۝٨

**8** కాని ఎవడైతే పిసినారితనం చేస్తూ, నిర్లక్ష్యవైఖరి అవలంబిస్తాడో![1]

وَكَذَّبَ بِٱلۡحُسۡنَىٰ ۝٩

**9** మరియు మంచిని అబద్ధమని తిరస్కరిస్తాడో!

فَسَنُيَسِّرُهُۥ لِلۡعُسۡرَىٰ ۝١٠

**10.** అతనికి మేము చెడుకొరకు దారిని సులభం చేస్తాము.

وَمَا يُغۡنِي عَنۡهُ مَالُهُۥٓ إِذَا تَرَدَّىٰٓ ۝١١

**11.** మరియు అతడు నశించిపోయినప్పుడు, అతని ధనం అతనికి ఏవిధంగ ఉపయోగపడుతుంది?

إِنَّ عَلَيۡنَا لَلۡهُدَىٰ ۝١٢

**12.** నిశ్చయంగా, సన్మార్గం చూపడం మా పని!

وَإِنَّ لَنَا لَلۡأٓخِرَةَ وَٱلۡأُولَىٰ ۝١٣

**13.** మరియు నిశ్చయంగా, ఇహపరలోకాల (అధిపత్యం) మాకే చెందినది.

فَأَنذَرۡتُكُمۡ نَارٗا تَلَظَّىٰ ۝١٤

**14.** కాబట్టి నేను మిమ్మల్ని ప్రజ్వలించే అగ్నిని గురించి హెచ్చరించాను.

لَا يَصۡلَىٰهَآ إِلَّا ٱلۡأَشۡقَى ۝١٥

**15.** పరమ దౌర్భాగ్యుడు తప్ప, మరెవ్వడూ అందులో కాలడు!

ٱلَّذِي كَذَّبَ وَتَوَلَّىٰ ۝١٦

**16.** ఎవడైతే (సత్యాన్ని) తిరస్కరించి (దాని నుండి) విముఖుడవుతాడో!

وَسَيُجَنَّبُهَا ٱلۡأَتۡقَى ۝١٧

**17.** కాని దైవభీతి గలవాడు దాని నుండి (ఆ అగ్ని నుండి) దూరంగా ఉంచబడతాడు!

ٱلَّذِي يُؤۡتِي مَالَهُۥ يَتَزَكَّىٰ ۝١٨

**18.** అతడే! ఎవడైతే, పవిత్రుడవటానికి తన ధనం నుండి (ఇతరులకు) ఇస్తాడో!

وَمَا لِأَحَدٍ عِندَهُۥ مِن نِّعۡمَةٖ تُجۡزَىٰٓ ۝١٩

**19.** కాని అది, వారు అతనికి చేసిన ఏ ఉపకారానికి బదులుగా గాక;

إِلَّا ٱبۡتِغَآءَ وَجۡهِ رَبِّهِ ٱلۡأَعۡلَىٰ ۝٢٠

**20.** కేవలం మహోన్నతుడైన తన ప్రభువు ప్రసన్నతను పొందడానికి మాత్రమే అయితే!

وَلَسَوۡفَ يَرۡضَىٰ ۝٢١

**21.** మరియు అలాంటివాడే తప్పక సంతోషిస్తాడు.[2]

---

**1** చూడండి, 96:6-7

**2** మరొక తాత్పర్యం: "మరియు త్వరలోనే అల్లాహ్ (సు.తా.) కూడా (అతనితో) సంతుష్టుడౌతాడు."

# 93. సూరహ్ అ'ద్-'దు'హా

سُوْرَةُ الضُّحٰى

అ'ద్-'దు'హా: ఎండ, పగలు, పగటి కాంతి, పూర్వాహ్ణం, The Forenoon సూర్యోదయం తరువాత మధ్యాహ్నం వరకు ఉండే కాలం. సూరహ్ అల్-ఫ'జ్ర్ (89) తరువాత ఈ సూరహ్ అవతరింపజేయబడిందని వ్యాఖ్యాతలు అంటారు. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో 11 ఆయాతులు ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

1. ప్రకాశవంతమైన ప్రొద్దుటి పూట (పూర్వాహ్ణం) సాక్షిగా!

وَالضُّحٰىۙ

2. మరియు చీకటి పడ్డ రాత్రి సాక్షిగా![1]

وَالَّيْلِ اِذَا سَجٰىۙ

3. (ఓ ము'హమ్మద్!) నీ ప్రభువు, నిన్ను త్యజించనూ లేదు మరియు నిన్ను ఉపేక్షించనూ లేదు.

مَا وَدَّعَكَ رَبُّكَ وَمَا قَلٰىؕ

4. మరియు రాబోయే కాలం (జీవితం) నీ కొరకు మొదటి కాలం (జీవితం) కంటే ఎంతో మేలైనది.[2]

وَلَلْاٰخِرَةُ خَيْرٌ لَّكَ مِنَ الْاُوْلٰىؕ

5. మరియు త్వరలోనే నీ ప్రభువు నీకు (నీవు కోరేది) ప్రసాదిస్తాడు, దానితో నీవు సంతోష పడతావు.

وَلَسَوْفَ يُعْطِيْكَ رَبُّكَ فَتَرْضٰىؕ

6. (ఓ ము'హమ్మద్!) ఏమీ? నిన్ను అనాథునిగా[3] చూసి, ఆయన (అల్లాహ్) నీకు ఆశ్రయం కల్పించలేదా?

اَلَمْ يَجِدْكَ يَتِيْمًا فَاٰوٰىۙ

---

1 సజా: సకన, అంటే శాంతి నెలకొలిసప్పుడు, అంటే పూర్తిగా చీకటి పడినప్పుడు, అప్పుడు నిశ్శబ్దం మరియు నెమ్మది ఉంటుంది.

2 అంటే పరలోక జీవితం, ఇహలోక జీవితం కంటే ఉత్తమమైనది.

3 దైవప్రవక్త ('స 'అస) అనాథునిగా ఉంటే అల్లాహ్ (సు.తా.) అతనికి ఆశ్రయం కల్పించాడు. అతని తండ్రి అతని పుట్టుకకు కొన్ని మాసాల ముందు చనిపోయారు. తల్లి అతను 6 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు చనిపోయింది.

7. మరియు నీకు మార్గం తోచనప్పుడు, ఆయన నీకు మార్గదర్శకత్వం చేయలేదా?[1]

وَوَجَدَكَ ضَآلًّا فَهَدَىٰ ۝٧

8. మరియు ఆయన, పేదవానిగా చూసి, నిన్ను సంపన్నుడిగా చేయలేదా?

وَوَجَدَكَ عَآئِلًا فَأَغْنَىٰ ۝٨

9. కాబట్టి నీవు అనాథుల పట్ల కఠినంగా ప్రవర్తించకు;

فَأَمَّا ٱلْيَتِيمَ فَلَا تَقْهَرْ ۝٩

10. మరియు యాచకుణ్ణి కసరుకోకు;

وَأَمَّا ٱلسَّآئِلَ فَلَا تَنْهَرْ ۝١٠

11. మరియు నీ ప్రభువు అనుగ్రహాలను బహిరంగంగా ప్రకటిస్తూ ఉండు.[2] (3/4)

وَأَمَّا بِنِعْمَةِ رَبِّكَ فَحَدِّثْ ۝١١

## 94. సూరహ్ అలమ్ నష్‌'హ్

## سُورَةُ الشَّرْحِ

అష్ షర్'హ్: The Opening Forth. విప్పటం, తెరవటం. సూరహ్ అ'ద్ 'దు'హా (93) తరువాతనే ఇది కూడా అవతరింపజేయబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ అల్ ఇన్షిరా'హ్ మరియు సూరహ్ అలమ్ నష్‌'హ్. మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో 8 ఆయతులు ఉన్నాయి

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ ۝

1. * (ఓ ము'హమ్మద్!) ఏమీ? మేము నీ కొరకు నీ హృదయాన్ని తెరువలేదా?[3]

أَلَمْ نَشْرَحْ لَكَ صَدْرَكَ ۝١

---

1 ము'హమ్మద్ ('స'అస)ను ప్రవక్తగా ఎన్నుకొని అతనికి ఖుర్ఆన్ ప్రసాదించి, మార్గదర్శకత్వం చేశాడు

2 అంటే అల్లాహ్ (సు.తా.) చేసిన అనుగ్రహాలను, ఇతరులతో చెప్పుకో అది అల్లాహ్ (సు.తా.)కు ఇష్టమైనది - గర్వంతో కాక నమ్రతతో!

3 గడచిన సూరహ్‌లో 3 కానుకలు పేర్కొనబడ్డాయి. ఈ సూరహ్‌లో 3 అనుగ్రహాలు పేర్కొన బడ్డాయి ఎదను తెరవటం అంటే సత్యాన్ని గ్రహించటం, జ్ఞాన జ్యోతి పొందడం చూడండి, 6:125 అంటే మార్గదర్శకత్వాన్ని అర్థం చేసుకొని గ్రహించటం రెండు సార్లు దైవప్రవక్త ('స'అస) ఎద చీల్చబడిందని స. హదీసుల ద్వారా తెలుస్తుంది. ఒకసారి బాల్యంలో అప్పుడు అతని వయస్సు 4 సంవత్సరాలుంటుంది. అప్పుడు జిబ్రీల్ ('అ.స.) వచ్చి, అతని ఎదను చీల్చి అతని హృదయంలో నున్న షై'తానుకు చోటిచ్చే భాగాన్ని తీసి వేస్తారు, ('స ముస్లిం) రెండవసారి మేరాజ్‌కు ముందు జిబ్రీల్ ('అ.స.) అతని ఎదను చీల్చి హృదయాన్ని బయటికి తీసి, 'జమ్'జమ్‌తో దానిని కడిగి పెడ్తారు దానిని విశ్వాసం (ఈమాన్) మరియు వివేకంతో నింపుతారు ('స'హీ'హైన్)

وَوَضَعْنَا عَنْكَ وِزْرَكَ ۝

2. మరియు మేము నీ భారాన్ని నీ పై నుండి దించివేయలేదా?

الَّذِي أَنْقَضَ ظَهْرَكَ ۝

3. ఏదైతే నీ వెన్నును విరుస్తూ ఉండిందో?

وَرَفَعْنَا لَكَ ذِكْرَكَ ۝

4. మరియు నీ పేరు ప్రతిష్ఠలను ప్రకాశింపజేయలేదా?[1]

فَإِنَّ مَعَ الْعُسْرِ يُسْرًا ۝

5. నిశ్చయంగా, ఎల్లప్పుడు కష్టంతో పాటు సుఖం కూడా ఉంటుంది;

إِنَّ مَعَ الْعُسْرِ يُسْرًا ۝

6. నిశ్చయంగా కష్టంతో పాటు సుఖం కూడా ఉంటుంది.[2]

فَإِذَا فَرَغْتَ فَانْصَبْ ۝

7. కావున నీకు తీరిక లభించినప్పుడు ఆరాధనలో నిమగ్నుడవైపో!

وَإِلَىٰ رَبِّكَ فَارْغَبْ ۝

8. మరియు నీ ప్రభువునందే ధ్యానం నిలుపు.

## 95. సూరహ్ అత్-తీన్

## سُورَةُ التِّينِ

అత్-తీన్: The Fig, అత్తి, అంజూరం, ఇది సూరహ్ అల్-బురూజ్ (85) తరువాత అవతరింపజేయబడింది. మొదటి ఆయత్ నుండి దీని పేరు తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్, ఇది సూరహ్ అల్-'అస్ర్(103)ను పోలి ఉంది. అత్తి మరియు జైతూన్ చెట్లు ఫలస్తీన్ మరియు సీరియాలలో చాలా ఉన్నాయి. ఇందులో 8 ఆయతులు ఉన్నాయి

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَالتِّينِ وَالزَّيْتُونِ ۝

1. అంజూరం (అత్తి) మరియు జైతూన్ సాక్షిగా!

وَطُورِ سِينِينَ ۝

2. సీనాయ్ (తూర్) కొండ సాక్షిగా![3]

---

1 అంటే అల్లాహ్ (సు.తా.) పేరు వచ్చినప్పుడల్లా దైవప్రవక్త (స'అస) పేరు వస్తుంది. ఉదా: అజా'న్‌లో, నమా'జ్‌లో వగైరా.

2 కష్టాల తరువాత దైవప్రవక్త (స'అస) మరియు స'హాబీలు (ర'ది'అన్హుమ్)లకు సుఖసంతోషాలు ప్రాప్తమయ్యాయి

3 ఈ తూర్ పర్వతం మీదనే అల్లాహ్ (సు.తా.) మూసా (అ.స.)తో సంభాషించాడు

وَهَٰذَا الْبَلَدِ الْأَمِينِ ﴿٣﴾

3. ఈ శాంతి నగరం (మక్కా) సాక్షిగా![1]

لَقَدْ خَلَقْنَا الْإِنسَانَ فِي أَحْسَنِ تَقْوِيمٍ ﴿٤﴾

4. వాస్తవంగా! మేము మానవుడిని సర్వశ్రేష్ఠమైన ఆకారంలో సృష్టించాము.[2]

ثُمَّ رَدَدْنَاهُ أَسْفَلَ سَافِلِينَ ﴿٥﴾

5. తరువాత మేము అతన్ని దిగజార్చి అధమాతి అధమమైన స్థితికి మార్చాము.

إِلَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ فَلَهُمْ أَجْرٌ غَيْرُ مَمْنُونٍ ﴿٦﴾

6. కాని విశ్వసించి, సత్కార్యాలు చేసేవారు తప్ప. ఎందుకంటే అలాంటి వారికి అంతులేని ప్రతిఫలం ఉంది.

فَمَا يُكَذِّبُكَ بَعْدُ بِالدِّينِ ﴿٧﴾

7. అయితే, (ఓ మానవుడా!) దీని తరువాత గూడా నీవు ఎందుకు ప్రతిఫలదినాన్ని తిరస్కరిస్తున్నావు?

أَلَيْسَ اللَّهُ بِأَحْكَمِ الْحَاكِمِينَ ﴿٨﴾

8. ఏమీ? అల్లాహ్ న్యాయాధిపతులలో కెల్లా సర్వోత్తమ న్యాయాధిపతి కాడా?

## 96. సూరహ్ అల్-'అలఖ్

## سُورَةُ العَلَق

అల్ 'అలఖ్. The Germ Cell. The Clot. పిండం, జీవకణం, రక్తముద్ద, జలగ, దీని మరొక పేరు సూరహ్ అల్-ఇఖ్రఅ', చదువు, పఠించు, దీని మొదటి ఐదు ఆయత్ లతో దివ్యజ్ఞాన (ఖుర్ఆన్) అవతరణ ప్రారంభమయ్యింది. ఇవి రమ'దాన్ నెల చివరి పది రోజులలో ప్రస్థానానికి (హిజ్రత్‌కు) 13 సంవత్సరాలకు ముందు, (610వ క్రీస్తు శకం)లో దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) 40 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు, నూర్ పర్వతం మీద, 'హిరా గుహలో అవతరింపజేయబడ్డాయి. మిగతా ఆయత్ లు (6 19), ఈ మొదటి వ'హీ అవతరింపజేయబడిన కొంత కాలం (ఫత్రతుల్ వ'హీ) తరువాత అవతరింపజేయబడ్డాయి 19 ఆయతుల ఈ సూరహ్ మక్కాలో అవతరింపజేయబడింది

1. ఈ శాంతి నగరం అంటే మక్కా ముకర్రమా చూడండి, 2.126. ఇందులో యుద్ధం చేయుటం నిషేధించబడింది. ఇందులో ప్రవేశించిన వానికి శాంతి, భద్రతలు లభిస్తాయి కొందరి అభిప్రాయం ప్రకారం ఇది మూడు చోట్లను సూచిస్తుంది. (1) 'తూర్ పర్వతం- మూసా ('అ.స.)ను ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం, (2) బైతుల్ ముఖద్దస్-'ఈసా ('అ.స.) పుట్టి ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం, (3) మక్కా ముకర్రమా - ము'హమ్మద్ ('స'అస) పుట్టి ప్రవక్తగా ఎన్నుకోబడ్డ స్థలం. (ఇబ్నె కసీ'ర్). మక్కా ప్రస్తావనకు ఇంకా చూడండి, 48.24

2. చూడండి, 91:7, 87:2 మరియు 75:38.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**1.** చదువు! నీ ప్రభువు పేరుతో, ఆయనే (సర్వాన్ని) సృష్టించాడు![1]

اقْرَأْ بِاسْمِ رَبِّكَ الَّذِي خَلَقَ ۝١

**2.** ఆయనే మానవుణ్ణి రక్తముద్ద (జీవకణం)తో సృష్టించాడు.[2]

خَلَقَ الْإِنسَانَ مِنْ عَلَقٍ ۝٢

**3.** చదువు! మరియు నీ ప్రభువు పరమదాత

اقْرَأْ وَرَبُّكَ الْأَكْرَمُ ۝٣

**4.** ఆయన కలం ద్వారా నేర్పాడు[3]

الَّذِي عَلَّمَ بِالْقَلَمِ ۝٤

**5.** మానవుడు ఎరుగని జ్ఞానాన్ని అతనికి బోధించాడు.

عَلَّمَ الْإِنسَانَ مَا لَمْ يَعْلَمْ ۝٥

**6.** అలాకాదు! వాస్తవానికి, మానవుడు తలబిరుసుతనంతో ప్రవర్తిస్తాడు.

كَلَّا إِنَّ الْإِنسَانَ لَيَطْغَىٰ ۝٦

**7.** ఎందుకంటే, అతడు తనను తాను నిరపేక్షాపరుడిగా భావిస్తాడు.

أَن رَّآهُ اسْتَغْنَىٰ ۝٧

**8.** నిశ్చయంగా నీ ప్రభువు వైపునకే (అందరికీ) మరలి పోవలసి ఉంది.

إِنَّ إِلَىٰ رَبِّكَ الرُّجْعَىٰ ۝٨

**9.** నీవు నిరోధించే వ్యక్తిని చూశావా?[4]

أَرَأَيْتَ الَّذِي يَنْهَىٰ ۝٩

---

**1** దైవదూత జిబ్రీల్ ('అ.స.) దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) 'హిరా గుహలో దైవారాధనలో నిమగ్నులై ఉన్నప్పుడు వచ్చి అన్నారు: "చదువు!" అతను అన్నారు: "నాకు చదువురాదు." అప్పుడు జిబ్రీలు ('అ.స.) అతనిని పట్టుకుని గట్టిగా అదిమి అన్నారు, "చదువు!" దైవప్రవక్త ('స'అస) తిరిగి అదే జవాబిచ్చారు. ఈ విధంగా అతను దైవప్రవక్త ('స'అస)ను మూడుసార్లు అదిమారు. వివరాలకు చూడండి, బద'అల్ వ'హీ, 'స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ', నసాయి'. ఆ తరువాత ఈ మొదటి ఐదు ఆయతులు చదివి వినిపించారు.

**2** అల్ 'అలఖతు అంటే, The Clot of Blood, Leech like Substance, రక్తముద్ద, షిలగ, జలగ, పిండం, జీవకణం అనే అర్థాలున్నాయి.

**3** ఖలమున్, కలం అంటే చెక్కటం. మొదట కలమును చెక్కి తయారు చేసేవారు. మానవుని జ్ఞానంలో ఉన్నది - అతని వెంట వెళ్ళిపోతుంది. నోటితో పలికింది కూడా - దాచి పెట్టటానికి పనికి రాదు. కాని కలంతో వ్రాసి పెట్టింది చెడి పోకుండా భద్రంగా ఉంచితే చాలా కాలం వరకు ఉంటుంది. కలం వల్లనే ప్రాచీన జ్ఞానం భద్రపరచబడింది. కావున అల్లాహ్ (సు.తా.) మొట్టమొదట కలాన్ని సృష్టించి దానితో పునరుత్థానదినం వరకు సర్వసృష్టి యొక్క విధిని వ్రాయించాడు.

**4** ఈ నిరోధించే వ్యక్తి అబూ జహల్ అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం.

عَبْدًا إِذَا صَلَّىٰ ۝
10. నమా'జ్ చేసే (అల్లాహ్) దాసుణ్ణి?[1]

أَرَأَيْتَ إِن كَانَ عَلَى الْهُدَىٰ ۝
11. ఒకవేళ అతను (ము'హమ్మద్!) సన్మార్గంపై ఉంటే నీ అభిప్రాయమేమిటి?

أَوْ أَمَرَ بِالتَّقْوَىٰ ۝
12. ఇంకా, దైవభీతిని గురించి ఆదేశిస్తూ ఉంటే?[2]

أَرَأَيْتَ إِن كَذَّبَ وَتَوَلَّىٰ ۝
13. ఒకవేళ (ఆ నిరోధించే) వాడు[3] సత్యాన్ని తిరస్కరించేవాడు మరియు సన్మార్గం నుండి విముఖుడయ్యే వాడైతే?

أَلَمْ يَعْلَم بِأَنَّ اللَّهَ يَرَىٰ ۝
14. వాస్తవానికి, అల్లాహ్ అంతా చూస్తున్నాడని అతనికి తెలియదా?

كَلَّا لَئِن لَّمْ يَنتَهِ لَنَسْفَعًا بِالنَّاصِيَةِ ۝
15. అలా కాదు! ఒకవేళ అతడు మానుకోక పోతే, మేము అతడిని, నుదుటి జుట్టు వెంట్రుకలను పట్టి ఈడుస్తాము.[4]

نَاصِيَةٍ كَاذِبَةٍ خَاطِئَةٍ ۝
16. అది అబద్ధాలలో, అపరాధాలలో మునిగి వున్న నుదురు!

فَلْيَدْعُ نَادِيَهُ ۝
17. అయితే, అతన్ని తన అనుచరులను పిలుచుకోమను!

سَنَدْعُ الزَّبَانِيَةَ ۝
18. మేము కూడా నరక దూతలను పిలుస్తాము!

كَلَّا لَا تُطِعْهُ وَاسْجُدْ وَاقْتَرِب ۩ ۝
19. అలాకాదు! నీవు అతని మాట వినకు మరియు ఆయన (అల్లాహ్)కే సాష్టాంగం (సజ్దా) చెయ్యి మరియు ఆయన (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందటానికి ప్రయత్నించు!

1 దాసుడు - ఇక్కడ దైవప్రవక్త (స'అస).

2 తఖ్వా: దైవభీతి, భయభక్తి, ఖుర్ఆన్ అవతరణలో ఇక్కడ మొదటిసారి వచ్చింది. ఏక దైవత్వాన్ని దృఢంగా విశ్వసించటం. భక్తిని, ఆరాధనను కేవలం అల్లాహ్ (సు.తా.) కొరకే ప్రత్యేకించుకోవటం మరియు సత్కార్యాలు చేయటం.

3 ఈ నిరోధించే వ్యక్తి అబూ జహల్ అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం

4 చూడండి, 11:56.

## 97. సూరహ్ అల్-ఖద్ర్

## سورة القدر

అల్ ఖద్ర్ ఘనత, The Decree, Destiny, ఆదేశం, శాసనం, తీర్పు, భగవత్సంకల్పం, విధి, అదృష్టం, పర్యవసానం. ఈ సూరహ్ మొదటి మక్కా సూరహ్‌లలోనిది. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇందులో 5 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

1. నిశ్చయంగా, మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) ఘనతగల ఆ రాత్రి[1] (అల్ ఖద్ర్)లో అవతరింపజేశాము.[2]

إِنَّا أَنْزَلْنٰهُ فِيْ لَيْلَةِ الْقَدْرِ ﴿١﴾

2. మరియు ఆ ఘనతగల రాత్రి అంటే ఏమిటో నీకేం తెలుసు?

وَمَا أَدْرٰىكَ مَا لَيْلَةُ الْقَدْرِ ﴿٢﴾

3. ఆ ఘనతగల రాత్రి వేయినెలల కంటే శ్రేష్ఠమైనది.[3]

لَيْلَةُ الْقَدْرِ خَيْرٌ مِّنْ أَلْفِ شَهْرٍ ﴿٣﴾

4. ఆ రాత్రిలో దేవదూతలు మరియు ఆత్మ (జిబ్రీల్),[4] తమ ప్రభువు అనుమతితో, ప్రతి (వ్యవహారానికి సంబంధించిన) ఆజ్ఞలు తీసుకుని దిగివస్తారు.

تَنَزَّلُ الْمَلٰٓئِكَةُ وَالرُّوْحُ فِيْهَا بِإِذْنِ رَبِّهِمْ مِّنْ كُلِّ أَمْرٍ ﴿٤﴾

5. ఆ రాత్రిలో తెల్లవారే వరకు శాంతి వర్ధిల్లుతుంది.

سَلٰمٌ هِيَ حَتّٰى مَطْلَعِ الْفَجْرِ ﴿٥﴾

---

1 ఈ రాత్రి రమ'దాన్ నెలలోని చివరి 10 రోజుల బేసి రాత్రులలో ఒకటని, చాలా 'హదీస్'లు ఉన్నాయి. ఈ రాత్రిలో పూర్తి సంవత్సరపు తీర్మానాలు తీసుకోబడతాయి. ఈ రాత్రిలో చాలా మంది దైవదూత('అలైహిమ్ స.)లు దిగుతారు. చూడండి, 2:185.

2 ఏడవ ఆకాశంపైన ఉండే లౌ'హ మ'హ్‌ఫూ''జ్ నుండి మొదటి ఆకాశంలో ఉండే బైతుల్ 'ఇ'జ్జహ్‌లో దివ్యఖుర్ఆన్ ఈ ఖద్ర్ రాత్రిలో అవతరింపజేయబడింది. (ఇబ్నె కసీ'ర్)

3 ఈ రాత్రిలో చేసే ఆరాధన విలువ, వేయి నెలల ఆరాధన కంటే ఎక్కువ. అంటే 83 సంవత్సరాలు మరియు 4 నెలలు.

4 అర్-రూ'హు. ఖుర్ఆన్ అవతరణా క్రమంలో ఇక్కడ మొదటి సారి వచ్చింది. చూడండి, 19:17, మరియు 78:38. అర్-రూ'హు ఈ మూడు చోట్లలో జిబ్రీల్ ('అ.స.) కొరకు వాడబడింది. ఇంకా చూడండి, 19:17 వ్యాఖ్యానం 3.

## 98. సూరహ్ అల్-బయ్యినహ్

سُورَةُ البَيِّنَةِ

అల్ బయ్యినహ్: The Clear Evidence, స్పష్టమయిన సూచన, స్పష్టమైన ప్రమాణం, నిదర్శనం. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది బహుశా మొదటి హిజ్రీలో అవతరింపజేయబడింది. దీని మరొక పేరు సూరహ్ లమ్‌యకున్. మదీనాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో 8 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

1. ఎంతవరకైతే స్పష్టమైన నిదర్శనం రాదో, అంతవరకు సత్యతిరస్కారులైన పూర్వ గ్రంథ ప్రజలు మరియు బహుదైవారాధకులు (తమ సత్యతిరస్కారాన్ని) మానుకునే వారు కారు![1]

لَمْ يَكُنِ الَّذِينَ كَفَرُوا مِنْ أَهْلِ الْكِتَابِ وَالْمُشْرِكِينَ مُنفَكِّينَ حَتَّىٰ تَأْتِيَهُمُ الْبَيِّنَةُ ۝

2. అల్లాహ్ తరఫునుండి వచ్చిన సందేశహరుడు,[2] వారికి పవిత్ర గ్రంథ పుటలను వినిపిస్తున్నాడు.[3]

رَسُولٌ مِّنَ اللَّهِ يَتْلُو صُحُفًا مُّطَهَّرَةً ۝

3. అందులో సమంజసమైన వ్రాతలు (సత్యోపదేశాలు) ఉన్నాయి.[4]

فِيهَا كُتُبٌ قَيِّمَةٌ ۝

4. మరియు స్పష్టమైన సూచన వచ్చిన తర్వాతనే గ్రంథ ప్రజలు భేదాభిప్రాయాలలో పడ్డారు.[5]

وَمَا تَفَرَّقَ الَّذِينَ أُوتُوا الْكِتَابَ إِلَّا مِن بَعْدِ مَا جَاءَتْهُمُ الْبَيِّنَةُ ۝

5. మరియు వారికి ఇచ్చిన ఆదేశం: వారు అల్లాహ్‌నే ఆరాధించాలని, పూర్తి ఏకాగ్రచిత్తంతో[6]

وَمَا أُمِرُوا إِلَّا لِيَعْبُدُوا اللَّهَ مُخْلِصِينَ لَهُ

---

1 అంటే అల్లాహ్ (సు.తా.) తరఫు నుండి ఒక సందేశహరుడు వచ్చి సరయిన, సమంజసమైన విషయాలు వ్రాయబడిన పరిశుద్ధ పుటలు చదివి వినిపించనంతవరకు వారు మానుకోరు.

2. ముహమ్మద్ ('స'అస).

3. ఖుర్ఆన్.

4 ధర్మశాసనాలు.

5 దైవప్రవక్త ('స'అస) రానున్నాడని వారి గ్రంథాలలో వ్రాయబడి ఉంది. ఆ ప్రవక్త ('స'అస) అరబ్బులలో వచ్చాడని గ్రంథప్రజలు అసూయవల్ల అతనిని తిరస్కరించారు. చూడండి, 3:19.

6 'హనీఫన్: వాలు, వంగు, మొగ్గు, ఒక వైపునకు మొగ్గటం, ఏకాగ్రచిత్తం, ఏకదైవ సిద్ధాంతం. అంటే షిర్క్ నుండి తౌహీద్‌కు, బహుదైవారాధన నుండి ఏక దైవారాధన వైపునకు మరలటం. ఉదా: ఇబ్రాహీమ్ (అ.స.) చేసినట్లు, ఏకదైవారాధన మరియు సత్యధర్మాన్ని అనుసరించటం.

حُنَفَآءَ وَيُقِيمُوا الصَّلَوٰةَ وَيُؤْتُوا الزَّكَوٰةَ ۚ وَذَٰلِكَ دِينُ الْقَيِّمَةِ ۝

తమ ధర్మాన్ని (భక్తిని) కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని, నమా'జ్‌ను స్థాపించాలని మరియు 'జకాత్ ఇవ్వాలని ఇదే సరైన ధర్మము.

إِنَّ الَّذِينَ كَفَرُوا مِنْ أَهْلِ الْكِتَٰبِ وَالْمُشْرِكِينَ فِي نَارِ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآ ۚ أُولَٰٓئِكَ هُمْ شَرُّ الْبَرِيَّةِ ۝

6. నిశ్చయంగా, సత్యతిరస్కారులైన గ్రంథప్రజలు మరియు బహుదైవారాధకులు, నరకాగ్నిలోకి పోతారు. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇలాంటివారే, సృష్టిలో అత్యంత నికృష్ట జీవులు.[1]

إِنَّ الَّذِينَ ءَامَنُوا وَعَمِلُوا الصَّٰلِحَٰتِ أُولَٰٓئِكَ هُمْ خَيْرُ الْبَرِيَّةِ ۝

7. నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేసేవారు, వారే సృష్టిలో అందరికంటే ఉత్కృష్టజీవులు.

جَزَآؤُهُمْ عِندَ رَبِّهِمْ جَنَّٰتُ عَدْنٍ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَآ أَبَدًا ۖ رَّضِيَ اللَّهُ عَنْهُمْ وَرَضُوا عَنْهُ ۚ ذَٰلِكَ لِمَنْ خَشِيَ رَبَّهُۥ ۝

8. వారికి తమ ప్రభువు నుండి లభించే ప్రతిఫలం శాశ్వతమైన స్వర్గవనాలు వాటిలో క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. వారు, వాటిలో శాశ్వతంగా కలకాలముంటారు. అల్లాహ్ వారితో ప్రసన్నుడవుతాడు[2] మరియు వారు ఆయనతో సంతుష్టులవుతారు. ఇదే తన ప్రభువుకు భయపడే వ్యక్తికి లభించే ప్రతిఫలం

## 99. సూరహ్ అ'జ్-'జిల్‌జాల్

## سُورَةُ الزَّلْزَلَةِ

అ'జ్-'జల్‌జలహ్: The Earthquake, భూకంపం, ఇది సూరహ్ అ'జ్-'జిల్‌జాల్ అని కూడా అనబడుతుంది. ఇది మొదటి మదీనా కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో 8 ఆయతులున్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

إِذَا زُلْزِلَتِ الْأَرْضُ زِلْزَالَهَا ۝

1. భూమి తన అతి తీవ్రమైన (అంతిమ) భూకంపంతో కంపింపజేయబడినప్పుడు![3]

---

1 ఇది అల్లాహ్ (సు.తా.) ప్రవక్త ('అలైహిమ్ స.)లను మరియు ఆయన గ్రంథాలను తిరస్కరించే వారి గతి. వారు అతి అధమమైన జీవులుగా పేర్కొనబడ్డారు.

2 చూడండి 9:72

3. ఇది మొదటి సారి బాకా ఊదబడినప్పుడు సంభవిస్తుంది.

2. మరియు భూమి తన భారాన్నంతా తీసి బయట పడవేసినప్పుడు![1]

وَأَخْرَجَتِ الْأَرْضُ أَثْقَالَهَا ۝

3. మరియు మానవుడు: "దీనికి ఏమయింది?" అని అంటాడు

وَقَالَ الْإِنسَانُ مَا لَهَا ۝

4. ఆ రోజు అది తన సమాచారాలను వివరిస్తుంది.[2]

يَوْمَئِذٍ تُحَدِّثُ أَخْبَارَهَا ۝

5. ఎందుకంటే, నీ ప్రభువు దానిని ఆదేశించి ఉంటాడు

بِأَنَّ رَبَّكَ أَوْحَىٰ لَهَا ۝

6. ఆరోజు ప్రజలు తమతమ కర్మలు చూపించబడటానికి వేర్వేరు గుంపులలో వెళ్ళారు.

يَوْمَئِذٍ يَصْدُرُ النَّاسُ أَشْتَاتًا لِّيُرَوْا أَعْمَالَهُمْ ۝

7. అప్పుడు, ప్రతివాడు తాను రవ్వంత (పరమాణువంత) మంచిని చేసిఉన్నా దానిని చూసుకుంటాడు.[3]

فَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَرَهُ ۝

8. మరియు అలాగే, ప్రతివాడు తాను రవ్వంత (పరమాణువంత) చెడును చేసి ఉన్నా దానిని చూసుకుంటాడు

وَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ شَرًّا يَرَهُ ۝

## 100. సూరహ్ అల్-'ఆదియాత్

## سورة العاديات

అల్ 'ఆదియాత్: యుద్ధాశ్వాలు, The Chargers, Those That Run, వడిగా పరిగెత్తే గుర్రాలు. ఇది సూరహ్ అల్ 'అస్ర్ (103) తరువాత అవతరింపజేయబడింది, మొదటి మక్కా కాలంలో, ఇందులో 11 ఆయతులున్నాయి.

1 ఇది రెండవసారి బాకా ఊదబడినప్పుడు జరుగుతుంది. ఆ రోజు భూమి తనలో పాతబడిన వారినంతా బయటవేస్తుంది. వారంతా సజీవులై లేచి బయటికి వస్తారు

2 దాని సమాచారాలు ఇలా ఉంటాయి: దైవప్రవక్త (స'అస) అన్నారు: "(ప్రతివ్యక్తి భూమిపై చేసిన కర్మలన్నింటికీ, అది సాక్ష్యమిస్తుంది: 'ఈ ఈ వ్యక్తి ఈ ఈ కర్మలు, ఈ ఈ రోజులలో చేశాడని, తెలుపుతుంది.' " (తిర్మిజీ', ముస్నద్ అ'హ్మద్ 2/374).

3 జ'ర్రతున్: దీనికి వేర్వేరు వ్యాఖ్యానాలు ఇవ్వబడ్డాయి: 1) చీమకంటే చిన్న వస్తువు, పోకానీ 2) మానవుడు భూమిపై చెయ్యికొట్టి పైకి లేపిన తరువాత దానికి అంటుకునే దుమ్ము 3) ఒక రంధ్రం నుండి వచ్చే సూర్యకిరణాలలో తేలియాడుతూ కనిపించే ధూళి 4) పరమాణువు

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَالْعٰدِيٰتِ ضَبْحًا ۙ

1. వగర్చుతూ పరిగెత్తే గుర్రాల సాక్షిగా![1]

فَالْمُوْرِيٰتِ قَدْحًا ۙ

2. తమ ఖురాల తట్టులతో అగ్నికణాలు లేపేవాటి;[2]

فَالْمُغِيْرٰتِ صُبْحًا ۙ

3. తెల్లవారుఝామున దాడిచేసేవాటి;[3]

فَاَثَرْنَ بِهٖ نَقْعًا ۙ

4. (మేఘాలవంటి) దుమ్ము లేపుతూ,[4]

فَوَسَطْنَ بِهٖ جَمْعًا ۙ

5. (శత్రువుల) సమూహంలోకి దూరిపోయే వాటి!

اِنَّ الْاِنْسَانَ لِرَبِّهٖ لَكَنُوْدٌ ۚ

6. నిశ్చయంగా, మానవుడు తన ప్రభువు పట్ల ఎంతో కృతఘ్నుడు.[5]

وَاِنَّهٗ عَلٰى ذٰلِكَ لَشَهِيْدٌ ۚ

7. మరియు నిశ్చయంగా, దీనికి స్వయంగా అతడే సాక్షి

وَاِنَّهٗ لِحُبِّ الْخَيْرِ لَشَدِيْدٌ ؕ

8. మరియు నిశ్చయంగా, అతడు సిరిసంపదల వ్యామోహంలో పూర్తిగా మునిగి ఉన్నాడు. (7/8)

اَفَلَا يَعْلَمُ اِذَا بُعْثِرَ مَا فِى الْقُبُوْرِ ۙ

9. * ఏమిటి? అతనికి తెలియదా? గోరీలలో ఉన్నదంతా పెళ్ళగించి బయటికి తీయబడినప్పుడు;[6]

وَحُصِّلَ مَا فِى الصُّدُوْرِ ۙ

10. మరియు (మానవుల) హృదయాలలోని విషయాలన్నీ వెల్లడిచేయబడినప్పుడు;

اِنَّ رَبَّهُمْ بِهِمْ يَوْمَئِذٍ لَّخَبِيْرٌ ۠

11. నిశ్చయంగా, ఆ రోజున వారి ప్రభువు వారి గురించి అంతా ఎరిగి ఉంటాడని!

---

1. 'దబ్'హన్: వగర్చుతూ.
2. అల్-మూరియాతు: అగ్నికణాలు లేపే! ఖద్'హున్: ఖురాల తట్టులు.
3 అల్-ము'గీరాతు: దాడి చేసేవాటి
4 అసా'ర: లేపుట, నఖ్'అన్: దుమ్ము
5 కనూదున్: అంటే కఫూరున్, కృతఘ్నుడు.
6 అంటే గోరీలలో ఉన్న శవాలను సజీవులుగా చేసి లేపి సమావేశపరచబడినప్పుడు

## 101. సూరహ్ అల్-ఖారి'అహ్

## سورة القارعة

అల్-ఖారి'అహ్: ఉపద్రవం, The Sudden Calamity, The Striking Hour, దుర్ఘటన, విపత్తు, మొదటి మక్కా కాలపు ఈ సూరహ్. బహుశా సూరహ్ అత్-తీన్ (95) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో 11 ఆయతులు ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

1. ఆ! అదరగొట్టే మహా ఉపద్రవం![1]

اَلْقَارِعَةُ ۝١

2. ఏమిటా అదరగొట్టే మహా ఉపద్రవం?

مَا الْقَارِعَةُ ۝٢

3. మరియు ఆ అదరగొట్టే మహా ఉపద్రవం, అంటే ఏమిటో నీకేం తెలుసు?

وَمَآ اَدْرٰىكَ مَا الْقَارِعَةُ ۝٣

4. ఆ రోజు మానవులు చెల్లాచెదురైన చిమ్మెటలవలే అయిపోతారు.[2]

يَوْمَ يَكُوْنُ النَّاسُ كَالْفَرَاشِ الْمَبْثُوْثِ ۝٤

5. మరియు పర్వతాలు రంగురంగుల ఏకిన దూదివలే అయిపోతాయి.[3]

وَتَكُوْنُ الْجِبَالُ كَالْعِهْنِ الْمَنْفُوْشِ ۝٥

6. అప్పుడు ఎవడి త్రాసుపళ్ళాలు (సత్కార్యాలతో) బరువుగా ఉంటాయో![4]

فَاَمَّا مَنْ ثَقُلَتْ مَوَازِيْنُهٗ ۝٦

7. అతడు (స్వర్గంలో) సుఖవంతమైన జీవితం గడుపుతాడు.

فَهُوَ فِيْ عِيْشَةٍ رَّاضِيَةٍ ۝٧

8. మరియు ఎవడి (సత్కార్యాల) త్రాసుపళ్ళాలు తేలికగా ఉంటాయో![5]

وَاَمَّا مَنْ خَفَّتْ مَوَازِيْنُهٗ ۝٨

9. అతని నివాసం అధఃపాతాళమే.[6]

فَاُمُّهٗ هَاوِيَةٌ ۝٩

---

1. అల్ ఖారి'అతు: అంటే హృదయాలను అదరగొట్టేది, పునరుత్థాన దినపు పేర్లలో ఒకటి. చూడండి 14:48, 20:105-107. దాని ఇతర పేర్లు (1) అల్ 'హాఖ్ఖతు, (2) అత్తామ్మతు, (3) అస్సాఖ్ఖతు, (4) అల్ 'గాషియతు, (5) అస్సా'అతు, (6) అల్ వాఖి'అతు, (7) అల్ ఖారి'అతు.
2. అల్ ఫరాషు: Moth, *Lepidoptera*, రాత్రులలో తిరిగే చిన్న పురుగు, చిమ్మెట, దీపపు పురుగు.
3. అల్ 'ఇహ్నున్: రంగురంగుల. అల్ మన్ఫూష్: ఏకిన దూది.
4. చూడండి, 7:8, 18:105, 21:47 సత్కార్యాల త్రాసుపళ్ళెం బరువైనదిగా ఉంటుంది.
5. ఎవరి సత్కార్యాల పళ్ళెం తేలికగా మరియు పాపాల పళ్ళెం బరువుగా ఉంటుందో!
6. అల్ హావియహ్: నరకపు ఒక పేరు. ఉమ్మున్: తల్లి, శరణమిచ్చేది.

10. మరియు అది ఏమిటో నీకేం తెలుసు? وَمَآ اَدۡرٰىكَ مَا هِيَهۡ
11. అదొక భగభగమండే అగ్ని (గుండం).[1] نَارٌ حَامِيَةٌ

## 102 సూరహ్ అత్-తకాసు'ర్ سُوۡرَةُ التَّكَاثُرِ

అత్ తకాసు'ర్: పేరాస, Greed for more, The Piling up. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇది మానవుని ఎడతెగని పేరాసను ఖండిస్తోంది. ఇందులో 8 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

1. (ఇహలోక) పేరాస మిమ్మల్ని ఏమరుపాటులో పడవేసింది;[2] اَلۡهٰٮكُمُ التَّكَاثُرُ
2. మీరు గోరీలలోకి చేరేవరకు.[3] حَتّٰى زُرۡتُمُ الۡمَقَابِرَ
3. అలాకాదు! త్వరలోనే మీరు తెలుసుకుంటారు. كَلَّا سَوۡفَ تَعۡلَمُوۡنَ
4. మరొకసారి (వినండి)! వాస్తవంగా, మీరు అతిత్వరలోనే తెలుసుకుంటారు.[4] ثُمَّ كَلَّا سَوۡفَ تَعۡلَمُوۡنَ
5. ఎంతమాత్రము కాదు! ఒకవేళ మీరు నిశ్చితజ్ఞానంతో తెలుసుకొనిఉంటే (మీ వైఖరి ఇలా ఉండేది కాదు). كَلَّا لَوۡ تَعۡلَمُوۡنَ عِلۡمَ الۡيَقِيۡنِ
6. నిశ్చయంగా మీరు భగభగ మండే నరకాగ్నిని చూడగలరు! لَتَرَوُنَّ الۡجَحِيۡمَ
7. మళ్ళీ అంటున్నాను! మీరు తప్పక దానిని (నరకాగ్నిని) నిస్సంకోచమైన దృష్టితో చూడ గలరు! ثُمَّ لَتَرَوُنَّهَا عَيۡنَ الۡيَقِيۡنِ

---

1 'హామియతున్: నరకాగ్ని. మానవులు రగిల్చే అగ్నికంటే నరకాగ్ని డెబ్బై రెట్లు అధికంగా మండుతూ ఉంటుంది. ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

2 అల్హా (యుల్హీ): ఏమరుపాటులో వేసింది. తకాసు'రున్: ఎక్కువ పొందాలనే పేరాస అంటే ధనధాన్యాల కొరకు, పిల్లల కొరకు, బలం, ప్రభుత్వం, పేరు ప్రతిష్ఠల కొరకు చేసే పేరాస.

3 ఆ పేరాస కోసం ప్రయత్నిస్తూనే మీరు గోరీలలోకి చేరిపోతారు.

4 ఈ పేరాస మంచిది కాదని.

ثُمَّ لَتُسۡـَٔلُنَّ يَوۡمَئِذٍ عَنِ ٱلنَّعِيمِ ۝٨

8. అప్పుడు, ఆ రోజు మీరు, (ఈ జీవితంలో అనుభవించిన) సౌఖ్యాలను గురించి తప్పక ప్రశ్నించబడతారు![1]

## 103. సూరహ్ అల్-'అ'స్ర్

سُورَةُ العَصۡرِ

అల్-'అ'స్ర్: The Time, కాలం. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. చెడుకు పర్యవసానం చేదు. గడిచిపోయిన కాలం మళ్ళీ చేజిక్కదు. కావున విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ, సత్యాన్ని మరియు సహనాన్ని పాటిస్తూ ఒకరికొకరు బోధించుకునే వారే సాఫల్యం పొందుతారు. ఇది 3 ఆయతులు ఉన్న 3 సూరహ్‌లలో ఒకటి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

وَٱلۡعَصۡرِ ۝١

1. కాలం ('అ'స్ర్) సాక్షిగా![2]

إِنَّ ٱلۡإِنسَٰنَ لَفِي خُسۡرٍ ۝٢

2. నిశ్చయంగా మానవుడు నష్టంలో ఉన్నాడు![3]

إِلَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ وَتَوَاصَوۡاْ بِٱلۡحَقِّ وَتَوَاصَوۡاْ بِٱلصَّبۡرِ ۝٣

3. కాని విశ్వసించి, సత్కార్యాలు చేసేవారు మరియు ఒకరికొకరు సత్యాన్ని బోధించుకునే వారు మరియు ఒకరికొకరు సహనాన్ని (స్థైర్యాన్ని) బోధించుకునే వారు తప్ప![4]

---

1 అప్పుడు అల్లాహ్ (సు.తా.) అనుగ్రహాలను ధనసంపత్తులను మంచికొరకు ఉపయోగించిన వారు స్వర్గవాసులవుతారు. వాటిని దుష్ప్రయోజనాలకు వినియోగించిన వారు నరకాగ్ని పాలవుతారు.

2 అల్లాహ్ (సు.తా.) తాను కోరిన దాని సాక్ష్యము తీసుకుంటాడు. కాని మానవుడు అల్లాహ్ (సు.తా.) తప్ప మరెవ్వరి సాక్ష్యం తీసుకోరాదు.

3 ఆ మానవుడు, ఎవడైతే విశ్వసించడో మరియు సత్కార్యాలు చేయడో తన కాలాన్ని వృథా కాలక్షేపంలో, నిషేధించిన పనులు చేయటంలో పేరాసతో గడుపుతాడో! అలాంటి వాడు పరలోకంలో నరకాగ్నికి ఇంధనం అవుతాడు.

4. ఇలాంటి నష్టం నుండి తప్పించుకోగల వారు ఎవరంటే: ఒకే ఒక్క ఆరాధ్యుడైన అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించి సత్కార్యాలు చేసేవారు మరియు అల్లాహ్ (సు.తా.) ఆదేశాలను పాటించేవారు, అల్లాహ్ (సు.తా.) నిషేధించిన వాటినుండి దూరంగా ఉండేవారు. కష్టకాలంలో సహనం వహించి, సత్యధర్మ ప్రచారం చేస్తూ ఉండేవారు.

# 104. సూరహ్ అల్-హుమ'జహ్

# سُوْرَةُ الْهُمَزَةِ

అల్ హుమ'జహ్: అపనిందలు, అపవాదాలు మోపేవాడు, The Slanderer. ఇది దైవప్రవక్త ('స'అస) ప్రవక్తగా ఎన్నుకోబడిన దాదాపు మూడు సంవత్సరాల తరువాత, సూరహ్ అల్-ఖియామహ్ (75) తరువాత మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో 9 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

1. అపనిందలు మోపే, చాడీలు చెప్పే ప్రతి ఒక్కడికీ వినాశం తప్పదు.[1]

وَيْلٌ لِّكُلِّ هُمَزَةٍ لُّمَزَةٍ ۝١

2. ఎవడైతే ధనాన్ని కూడబెట్టి, మాటి మాటికీ దాన్ని లెక్కబెడుతూ ఉంటాడో![2]

الَّذِيْ جَمَعَ مَالًا وَّعَدَّدَهٗ ۝٢

3. తన ధనం, తనను శాశ్వతంగా ఉంచుతుందని అతడు భావిస్తున్నాడు![3]

يَحْسَبُ اَنَّ مَالَهٗٓ اَخْلَدَهٗ ۝٣

4. ఎంతమాత్రం కాదు! అతడు (రాబోయే జీవితంలో) తప్పకుండా అణగద్రొక్కబడే నరకాగ్నిలో వేయబడతాడు.[4]

كَلَّا لَيُنْۢبَذَنَّ فِي الْحُطَمَةِ ۝٤

5 ఆ (అణగద్రొక్కబడే) నరకాగ్ని అంటే ఏమిటో నీకు తెలుసా?[5]

وَمَآ اَدْرٰىكَ مَا الْحُطَمَةُ ۝٥

6. అల్లాహ్, తీవ్రంగా ప్రజ్వలింపజేసిన అగ్ని;

نَارُ اللّٰهِ الْمُوْقَدَةُ ۝٦

7 అది గుండెలదాకా చేరుకుంటుంది.

الَّتِيْ تَطَّلِعُ عَلَى الْاَفْـِٕدَةِ ۝٧

---

1 హుమ'జహ్ మరియు లుమ'జహ్ కొందరి అభిప్రాయంలో ఒకే అర్థం గలవి. మరి కొందరు వాటి మధ్య భేదం చూపుతారు. హుమ'జహ్ అంటే ముఖం మీద అపనిందలు చేసేవారు. లుమ'జహ్ అంటే వీపు వెనుక చాడీలు చెప్పేవారు. మరికొందరు హుమ'జహ్ అంటే కళ్ళ సైగలతో, చేతి సైగలతో దూషించటం మరియు లుమ'జహ్ అంటే నోటి మాటలతో దూషించటం, అని అంటారు.

2. అంటే 'జకాత్ మరియు 'సదఖాత్ ఇవ్వకుండా ఉంటాడో!

3 అ'ఖ్లదహ్: అంటే అది అతనిని మరణించకుండా చేస్తుందని భావిస్తాడు.

4. అల్ 'హు'తమతు: నరకాగ్ని పేర్లలో ఒకటి. చూడండి, 15:43-44. ముక్కలు ముక్కలుగా చేసేది.

5. ఆ అగ్ని ఎంతో భయంకరమైనది. దాని తీవ్రతను ఏ బుద్ధి అర్థంచేసుకోజాలదు.

إِنَّهَا عَلَيْهِم مُّؤْصَدَةٌ ۝٨

**8.** నిశ్చయంగా, అది వారి మీద క్రమ్ము[1] కొంటుంది;

فِي عَمَدٍ مُّمَدَّدَةٍ ۝٩

**9.** పొడుగాటి (అగ్ని) స్తంభాలవలె.

## 105. సూరహ్ అల్-ఫీల్

## سُورَةُ الفِيلِ

అల్ ఫీల్: The Elephant, ఏనుగు. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది యమన్ యొక్క అబిసీనియా రాజప్రతినిధి (Abyssinias' Viceroy of Yaman) అబ్రాహా (Abraha), క్రైస్తవమతస్థుడు. అతడు 570 క్రీస్తుశకంలో మక్కాలోని క'అబహ్‌ను పడగొట్టే ఉద్దేశ్యంతో పెద్ద సైన్యంతీసుకొని, ఒక ఏనుగుపై ఎక్కివస్తాడు. మక్కా కొంత దూరంలోఉండగా అతని ఏనుగు మక్కా వైపు పోకుండా ఆగి పోతుంది. ఆ తరువాత ఒక పక్షుల దండు వచ్చి, చిన్నచిన్న మట్టితో చేసి కాల్చిన కంకర రాళ్ళను వారిపై కురిపిస్తుంది. దానితో చాలా మంది సైనికులు మరణిస్తారు. సైన్యమంతా చెల్లాచెదరై పోతుంది. అబ్రాహా వెనుదిరిగి పోతూ మధ్య మార్గంలోనే మరణిస్తాడు. ఆ కాలంలో అబ్దుల్ ముత్తలిబ్ దైవప్రవక్త ('స'అస) తాత, మక్కా ఖురైషుల నాయకులుగా ఉంటారు. అదే సంవత్సరంలో దైవప్రవక్త ('స'అస) జన్మిస్తారు. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో **5 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

أَلَمْ تَرَ كَيْفَ فَعَلَ رَبُّكَ بِأَصْحَابِ الْفِيلِ ۝١

**1.** ఏమీ? ఏనుగు వారి (సైన్యంతో) నీ ప్రభువు ఎలా వ్యవహరించాడో నీకు తెలియదా?

أَلَمْ يَجْعَلْ كَيْدَهُمْ فِي تَضْلِيلٍ ۝٢

**2.** ఏమీ? ఆయన వారి కుట్రను భంగం చేయలేదా?[2]

وَأَرْسَلَ عَلَيْهِمْ طَيْرًا أَبَابِيلَ ۝٣

**3.** మరియు ఆయన వారిపైకి పక్షుల గుంపులను పంపాడు;

تَرْمِيهِم بِحِجَارَةٍ مِّن سِجِّيلٍ ۝٤

**4.** అవి (ఆ పక్షులు) వారి మీద మట్టితో చేసి కాల్చిన కంకర రాళ్ళను (సిజ్జీల్) విసిరాయి;[3]

---

1 ముఅ''సదతున్: క్రమ్ముకొను. ఆ నరకపు ద్వారాలు మూయబడి ఉంటాయి. ఎవ్వరూ దాని నుండి బయటపడలేరు.

2 అంటే క'అబహ్‌ను పడగొట్టాలనే వారి కుట్రను భంగం చేయలేదా? అని.

3 చూడండి, 11:82.

فَجَعَلَهُمْ كَعَصْفٍ مَّأْكُولٍ ٥

5. ఆ విధంగా ఆయన వారిని (పశువులు) తినివేసిన పొట్టుగా మార్చివేశాడు.

سُورَةُ قُرَيْشٍ

## 106. సూరహ్ ఖురైష్

ఖురైష్: మక్కాలోని ఒక పెద్ద తెగ పేరు. దైవప్రవక్త (స'అస) ఈ తెగకే చెందినవారు. ఈ సూరహ్ మరొక పేరు సూరహ్ అల్-ఈలాఫ్. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. దీని పేరు మొదటి ఆయత్‌నుండి తీసుకోబడింది. సూరహ్ అల్-ఫీల్ మరియు సూరహ్ ఖురైష్ ఒకే సూరహ్ అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. ఇందులో 4 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

لِإِيلَافِ قُرَيْشٍ ١

1. (అల్లాహ్ రక్షణ మరియు ఆయన కరుణతో) ఖురైషులు (ప్రయాణాలకు) అలవాటు పడ్డారు.

إِيلَافِهِمْ رِحْلَةَ الشِّتَاءِ وَالصَّيْفِ ٢

2. (అల్లాహ్ కరుణ మరియు ఆయన రక్షణతో) వారు శీతకాలపు మరియు వేసవికాలపు ప్రయాణాలు చేయగలుగుతున్నారు.[1]

فَلْيَعْبُدُوا رَبَّ هَٰذَا الْبَيْتِ ٣

3. కావున వారు ఈ ఆలయ (క'అబహ్) ప్రభువు (అల్లాహ్)ను మాత్రమే ఆరాధించాలి![2]

الَّذِي أَطْعَمَهُم مِّن جُوعٍ وَآمَنَهُم مِّنْ خَوْفٍ ٤

4. వారు ఆకలితో ఉన్నప్పుడు ఆయనే వారికి ఆహారం ఇచ్చాడు మరియు ఆయనే వారిని భయం (ప్రమాదం) నుండి కాపాడాడు.[3]

---

1 ఈలాఫున్: అలవాటుపడటం. ఖురైషుల ముఖ్య వృత్తి వ్యాపారం. వారు సీతాకాలంలో యమన్‌కు మరియు వేసవి కాలంలో సిరియాకు వ్యాపారానికి పోయేవారు. వారు క'అబహ్ నిర్వాహకులు కావటంవల్ల వారి వాణిజ్య బృందాలు ఎలాంటి ఆటంకం, అపాయం లేకుండా ప్రయాణం చేయగలిగేవి.

2 చూడండి, 2:125. అంటే ఒకే ఒక్క ఆరాధ్యుడు అయిన అల్లాహ్ (సు.తా.) వారిని సురక్షితంగా వ్యాపారం చేయనిచ్చినందుకు వారు ఆయన (సు.తా.) ను మాత్రమే ఆరాధించాలి. బహుదైవారాధనను త్యజించాలి.

3 వారిని ప్రమాదం నుండి కాపాడేవాడు మరియు వారిని పోషించేవాడు కేవలం అల్లాహ్ (సు.తా.) మాత్రమే కానీ, వారు పూజించే నిస్సహాయులైన విగ్రహాలు గానీ, ఇతర కల్పిత దైవాలు గానీ కావు. కనుక వారు వాటి ఆరాధనను మానుకోవాలి. ఇంకా చూడండి, 2:126.

## 107. సూరహ్ అల్ మాఊన్

سُورَةُ المَاعُون

అల్-మా'ఊన్ : ఉపకారం, సహాయం, తోడ్పాటు, Assistance, మొదటి మక్కా కాలపు ఈ సూరహ్ పేరు 7వ ఆయత్ నుండి తీసుకోబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ అద్ దీన్, అరఅ'య్‌త లేక అల్-యతీమ్ (ఫత్హ్ అల్ ఖదీర్). బహుశా ఇది సూరహ్ అత్ తకాసు'ర్(102) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో 7 ఆయతులున్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

أَرَءَيْتَ الَّذِي يُكَذِّبُ بِالدِّينِ ۝

1. తీర్పు దినాన్ని తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా?[1]

فَذَٰلِكَ الَّذِي يَدُعُّ الْيَتِيمَ ۝

2. అతడే అనాథులను కసరికొట్టే వాడు;[2]

وَلَا يَحُضُّ عَلَىٰ طَعَامِ الْمِسْكِينِ ۝

3. మరియు పేదవాళ్ళకు అన్నం పెట్టమని ప్రోత్సహించనివాడు.

فَوَيْلٌ لِّلْمُصَلِّينَ ۝

4. కావున, నమా'జ్ చేసినా, (ఇటువంటి) వారికి వినాశం తప్పదు![3]

الَّذِينَ هُمْ عَن صَلَاتِهِمْ سَاهُونَ ۝

5. ఎవరైతే తమ నమా'జ్‌లపట్ల అశ్రద్ధ వహిస్తారో![4]

الَّذِينَ هُمْ يُرَاءُونَ ۝

6. ఎవరైతే ప్రదర్శనాబుద్ధితో వ్యవహరిస్తారో (నమా'జ్ సలుపుతారో)![5]

1 ఈ ఆయత్ దైవప్రవక్త ('స'అస)ను సంబోధిస్తోంది. దీన్ - అంటే పునరుత్థాన (తీర్పు) దినం చూడండి, 109:6.

2 ఎందు కంటే అతడు పిసినారి. తీర్పుదినాన్ని విశ్వసించనివాడు మరియు ఇహలోకంలో చేసిన పుణ్యాలకు పరలోకంలో లభించే ప్రతి ఫలాన్ని విశ్వసించనివాడు.

3 అనాథులను కసరి కొట్టేవారికి, ఆకలిగొన్న పేదలకు అన్నం పెట్టనివారికి, నమా'జ్ చేయని వారికి 'వైల్' అనే నరకమే నివాసస్థలమవుతుంది. ఎందుకంటే వారు కపట విశ్వాసులు, హృదయపూర్వకంగా కాక ఇతరులకు చూపటానికే నమా'జ్ చేసేవారు.

4 ఇలాంటి వారు అసలు నమా'జ్ చేయరు. ఒకవేళ చేసినా అశ్రద్ధతో చేస్తారు, నిర్ణీత సమయంలో చేయరు. భయభక్తులతో నమా'జ్ చేయరు. చూడండి, 4:142

5 అంటే ఇతరులతో ఉన్నప్పుడు వారి మెప్పు పొందటానికి నమా'జ్ చేస్తారు. ఏకాంతంలో ఉంటే నమా'జ్‌ను వదలిపెడతారు.

وَيَمْنَعُونَ الْمَاعُونَ ۝

7 మరియు ఎవరైతే (ప్రజలకు) సామాన్య ఉపకారం చేయటానికి కూడా నిరాకరిస్తారో![1]

## سورة الكوثر

## 108 సూరహ్ అల్-కౌస'ర్

అల్ కౌస'ర్: అంటే అధికం. Good in Abundance, పుష్కలత్వం, సమృద్ధి. ఈ సూరహ్ మరొక పేరు సూరహ్ అన్-నహ్ర్. చాలామంది ఇది మొదటి మక్కా కాలపు సూరహ్ అని అంటారు. దీని పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇందులో 3 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ۝

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

إِنَّا أَعْطَيْنَاكَ الْكَوْثَرَ ۝

**1.** (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, మేము నీకు కౌస'ర్[2] ప్రసాదించాము.

فَصَلِّ لِرَبِّكَ وَانْحَرْ ۝

**2.** కనుక, నీవు నీ ప్రభువు కొరకే నమా'జ్ చెయ్యి మరియు బలి (ఖుర్బానీ) కూడా (ఆయన కొరకే) ఇవ్వు![3]

إِنَّ شَانِئَكَ هُوَ الْأَبْتَرُ ۝

**3.** నిశ్చయంగా నీ శత్రువు, వాడే! వేరు తెగినవాడిగా (వారసుడూ, పేరూ లేకుండా) అయిపోతాడు.[4]

---

1 మ'ఊనుస్: అంటే కొద్దిపాటి సామాన్య చిన్న చిన్న సహాయాలు. ఇంట్లో వాడే వస్తువులను ఒకరికొకరు ఇచ్చుకోవటం. చిన్న చిన్న సహాయాలు చేసుకోవటం.

2 కౌస'రున్: అంటే అధికం. ఇబ్నె-కసీ'ర్ ఇక్కత. 'ఖైరున్ కసీ'రున్ - అత్యధికమైన మేలు - అనే అర్థానికి ప్రాధాన్యత నిచ్చారు. 'స'హీ'హ్ 'హదీస్'లో కౌస'ర్ అనేది స్వర్గంలో దైవప్రవక్తకు ప్రసాదించబడే ఒక సెలయేరు, అని చెప్పబడింది. మరికొందరు అదొక సరోవరం అన్నారు. 'ఖైరున్ కసీ'రున్ అనేపదం వీటన్నిటినీ సూచిస్తుందని ఇబ్నె- కసీ'ర్ అంటారు.

3 నమా'జ్ మరియు బలి (ఖుర్బానీ) ఆ ఒకేఒక్క ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.) కొరకే చేయాలి. నహ్ర్ - అంటే ఒంటె మెడలో కత్తి పొడిచి దాని రక్తనాళం కోయటం. వేరే పశువులను భూమి మీద పడవేసి వాటి మెడ రక్తనాళాలను కోస్తారు. దీనిని జిబహ్ అంటారు. ఇక్కడ నహ్ర్, బలి (ఖుర్బానీ) అంటే 'హజ్ లేక 'ఈద్ అజ్హా సందర్భంగా లేక సదఖ దానం కొరకు చేసే జిబ్హ్‌లు కూడా.

4 అబ్తరు అంటే, వారసుడు లేకుండా మరియు పేరు ప్రతిష్ఠలు లేకుండా అయిపోవటం. అతని వెంటనే అతని వంశం అంతమవటం లేక అతని పేరు తీసుకొనేవాడు ఎవ్వడూ లేకపోవటం. దైవప్రవక్త ('స'అస)కు మగ సంతానం బ్రతికి లేనందుకు అతని ('స'అస) విరోధులు అతనిని ('స'అసను) అబ్తర్ అని ఎత్తి పొడిచేవారు. అప్పుడు అల్లాహ్ (సు.తా.) ఈ ఆయత్ అవతరింపజేశాడు. మరియు అది నిజమని నిరూపించాడు.

## 109. సూరహ్ అల్-కాఫిరూన్

سُوْرَةُ الْكٰفِرُوْنَ

అల్ కాఫిరూన్: సత్యతిరస్కారులు Deniers of the Truth The Disbelievers ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది, సూరహ్ అల్-మా'ఊన్ (107) తరువాత, మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. సత్యధర్మ విషయంలో సమాధానపడటం - రాజీపడటం విశ్వాసులకు తగనిపని. ధర్మ విషయంలో కొంతవరకు రాజీపడమని, మక్కా ముష్రికులు దైవప్రవక్త('స'అస)తో అన్నప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది. 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం క'అబహ్ 'తవాఫ్ తరువాత చేసే రెండు రక'అత్‌లలో, ఫజ్ర్ మరియు మ'గ్‌రిబ్ సున్నత్‌లలో దైవప్రవక్త ('స'అస) ఈ సూరహ్ (109), మరియు సూరహ్ అల్ ఇ'ఖ్‌లా'స్ (112) పఠించే వారు. అంతేకాదు అతను ('స'అస) తమ అనుచరులకు: "మీరు రాత్రి నిద్రపోయే ముందు ఈ సూరహ్ చదివితే షిర్క్ నుండి దూరమవుతారు." అని. కూడా ప్రబోధించారు. (ముస్నద్ అ'హ్మద్ 5/456, తిర్మిజీ' 3403, అబూ దావూద్ 5055 మొదలైనవి). ఇందులో 6 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

قُلْ يٰۤاَيُّهَا الْكٰفِرُوْنَ ۝١

1. ఇలా అను: "ఓ సత్యతిరస్కారులారా!

لَاۤ اَعْبُدُ مَا تَعْبُدُوْنَ ۝٢

2. "మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించను,

وَلَاۤ اَنْتُمْ عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ۝٣

3. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయన (అల్లాహ్)ను మీరు ఆరాధించే వారు కారు.

وَلَاۤ اَنَا عَابِدٌ مَّا عَبَدْتُّمْ ۝٤

4. "మరియు మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించేవాణ్ణి కాను,

وَلَاۤ اَنْتُمْ عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ۝٥

5. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయనను మీరు ఆరాధించే వారు కారు.

لَكُمْ دِيْنُكُمْ وَلِيَ دِيْنِ ۝٦

6. "మీ ధర్మం మీకూ మరియు నా ధర్మం నాకు!"[1]

---

1 మీరు మీ ధర్మాన్ని వదలటానికి సిద్ధంగా లేనప్పుడు! నేను నా సత్యధర్మాన్ని ఎందుకు వదలాలి? చూడండి, 28:55

## 110. సూరహ్ అన్-న'స్ర్

## سُورَةُ النَّصرِ

అన్ న'స్ర్: Help, Succour, సహాయం, విజయం, తోడ్పాటు ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది ఇది దైవప్రవక్త ('స'అస) నిర్యాణానికి కొన్ని వారాలముందు, చిట్టచివర అవతరింపజేయబడిన మదీనా సూరహ్ ఇది హజ్జతుల్-వదాలో అవతరింపజేయబడింది ('స'హీ'హ్ ముస్లిం) ఇందులో 3 ఆయతులు ఉన్నాయి

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ○

1. (ఓ ము'హమ్మద్!) ఎప్పుడైతే అల్లాహ్ సహాయం వస్తుందో మరియు విజయం (లభిస్తుందో)!

إِذَا جَاءَ نَصْرُ اللَّهِ وَالْفَتْحُ ۝١

2. మరియు నీవు ప్రజలను గుంపులు గుంపులుగా అల్లాహ్ ధర్మం (ఇస్లాం)లో ప్రవేశించటం చూస్తావో![1]

وَرَأَيْتَ النَّاسَ يَدْخُلُونَ فِي دِينِ اللَّهِ أَفْوَاجًا ۝٢

3. అప్పుడు నీవు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్రతను కొనియాడు మరియు ఆయన క్షమాభిక్షను అర్థించు. నిశ్చయంగా, ఆయనే పశ్చాత్తాపాన్ని అంగీకరించే వాడు.[2]

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ ۚ إِنَّهُ كَانَ تَوَّابًا ۝٣

## 111. సూరహ్ తబ్బత్

## سُورَةُ تَبَّتْ

అల్-మసద్: The Palm Fibre, ఖర్జూరపు నార, 5 ఆయతులు గల ఈ సూరహ్ మొదటి మక్కా కాలానికి చెందింది బహుశా అవతరణలో ఆరవది. దీని పేరు 5వ ఆయత్ నుండి తీసుకోబడింది దీని ఇతర పేర్లు సూరహ్ అల్ లహబ్ (అగ్ని జ్వాలలు) మరియు సూరహ్ తబ్బత్ (నాశనమగుట) దీని అవతరణ గురించి ఈ 'హదీస్' ఉంది: దైవప్రవక్త ('స'అస)కు తన దగ్గరి వారికి ఇస్లాం ధర్మప్రచారం చేయుటానికి ఆజ్ఞ దొరికిన తరువాత, ఆతను 'సఫా గుట్టపైకి ఎక్కి: "యా 'సబా'హా!" అంటారు ఆ కాలంలో ఏదైన ఆవద వస్తే

---

1 చూడండి, 3:19

2 అంటే నీ ధర్మ ప్రచారం ముగిసే సమయం వచ్చిందనుకో! కాబట్టి నీవు నీ ప్రభువు పవిత్రతను కొనియాడటంలో మరియు ఆయన స్తోత్రంచేయుటంలో మునిగి ఉండు. ప్రతివాడు తన జీవితపు ఆఖరి దినాలలో, వృద్ధాప్యంలో వీలైనంత వరకు ప్రభువు ధ్యానంలో మునిగి ఉండటం ఉత్తమమని, దీని సందేశము.

ఇలా అరిచేవారు. అప్పుడు అందరూ అక్కడ సమావేశమవుతారు. అప్పుడతను అంటారు: "ఓ మక్కా వాసులారా: 'ఈ గుట్ట వెనుక ఒక గుర్రాల సైన్యం మీపై దాడి చేయటానికి సిద్ధంగా ఉంది' అని, నేను అంటే మీరు నమ్ముతారా?" దానికి వారంటారు: "ఎందుకు నమ్మము. నీవు సదా సత్యమే పలికావు!" అతను అంటారు: "అయితే వినండి ఒకవేళ మీరు షిర్క్ మరియు కుఫ్ర్ విడువకుంటే మీపై ఘోరశిక్ష పడనున్నదని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను." అది విని అబూ లహబ్ అంటాడు: "నీవు నాశనమై పో (తబ్బన్‌లక)! దీనికేనా నీవు మమ్మల్ని ఇక్కడ జమచేసింది?" అప్పుడు ఈ సూరహ్ అవతరింప జేయబడుతుంది. (స'హీ'హ్ బు'ఖారీ) అబూ లహబ్ అసలు పేరు అబ్దుల్-'ఉ'జ్జా! తన ఎర్రని రంగురూపుల వల్ల అబూ లహబ్ అనే మారు పేరుతో పిలవబడ్డాడు ఇతడు దైవప్రవక్త ('స'అస) పిన్నాన్న. అతని భార్య పేరు ఉమ్మె-జమీల్ బిన్తె 'హర్బ్ వీరిద్దరు అతని ('స'అస) యొక్క క్రూరమైన విరోధులు.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ ○

تَبَّتْ يَدَا أَبِي لَهَبٍ وَتَبَّ ۝١

**1.** అబూ-లహబ్ రెండు చేతులూ నశించు గాక మరియు అతడు కూడా నశించిపోవుగాక![1]

مَا أَغْنَىٰ عَنْهُ مَالُهُ وَمَا كَسَبَ ۝٢

**2.** అతని ధనం మరియు అతని సంపాదన (సంతానం) అతనికి ఏ మాత్రం పనికిరావు!

سَيَصْلَىٰ نَارًا ذَاتَ لَهَبٍ ۝٣

**3.** అతడు ప్రజ్వలించే నరకాగ్నిలో కాల్చ బడతాడు!

وَامْرَأَتُهُ حَمَّالَةَ الْحَطَبِ ۝٤

**4** మరియు అతని భార్య కూడా! కట్టెలు మోసే (చాడీలు చెప్పి కలహాలు రేకెత్తించే) స్త్రీ![2]

فِي جِيدِهَا حَبْلٌ مِّن مَّسَدٍ ۝٥

**5.** ఆమె మెడలో బాగా పేనిన ఖర్జూరపు నార త్రాడు (మసద్) ఉంటుంది.[3]

---

**1** యదా: రెండు చేతులు అంటే అతడు స్వయంగా! దైవప్రవక్త ('స'అస)ను దూషించినందుకు. అతడు ఈ శాపానికి గురి అవుతాడు ఫలితంగా అతడు బద్ర్ యుద్ధం జరిగిన కొన్నాళ్ళకే భయంకరమైన వ్యాధికి గురిఅయ్యి చనిపోతాడు. అతని కుమారులు మూడు రోజుల తరువాత అతని శవాన్ని దూరం నుండియే మన్నుపోసి పాతుతారు

**2** ఆమె దైవప్రవక్త ('స'అస) బాటలో ముండ్లువేసేది అతనికి విరుద్ధంగా చాడీలు చెప్పేది

**3.** జీదున్: మెడ. మసదున్: బాగాపేనిన గట్టిత్రాడు.

## 112. సూరహ్ అల్- ఇ'ఖ్లా'స్

## سُورَةُ الإخلاص

అల్ ఇ'ఖ్లా'స్: The Purity, దృఢ విశ్వాసం. దీని మరో పేరు సూరహ్ **అత్-తౌ'హీద్** - Unity, ఏక దైవత్వం. దీనిపేరు దీని తాత్పర్యం నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ ఖుర్ఆన్ యుక్క సారం అనబడుతుంది. దైవప్రవక్త ('స'అస) దీనిని 1/3 ఖుర్ఆన్ అన్నారు. ఈ సూరహ్‌ను రాత్రిపూట చదవమని ప్రోత్సహించారు ('స'హీ'హ్ బు'ఖారీ). ముష్రికులు దైవప్రవక్త ('స'అస)ను నీ ప్రభువు **లక్షణాలు** చెప్పమని ప్రశ్నించినప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది (ముస్నద్ అ'హ్మద్ 5 133 134). ఈ సూరహ్ మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. కొందరు 'స'హాబీలు ప్రతి రక'అత్‌లో ఇతర సూరాహ్‌ల తరువాత ఈ సూరహ్‌ను చదివేవారు. దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఈ సూరహ్ పట్ల మీ ప్రేమ మిమ్మల్ని స్వర్గంలో ప్రవేశింప జేస్తుంది." (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **4 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

1. ఇలా అను: "ఆయనే అల్లాహ్! ఏకైకుడు.[1]

قُلْ هُوَ ٱللَّهُ أَحَدٌ ۝١

2. "అల్లాహ్! ఎవరి అక్కరా లేనివాడు.[2]

ٱللَّهُ ٱلصَّمَدُ ۝٢

3. "ఆయనకు సంతానంలేదు (బిడ్డలను కనడు) మరియు ఆయన కూడా ఎవరి సంతానమూ (ఎవరికీ జన్మించిన వాడునూ) కాడు.

لَمْ يَلِدْ وَلَمْ يُولَدْ ۝٣

4. "మరియు (సర్వ లోకాలలో) ఆయనతో పోల్చదగినది ఏదీ లేదు."[3]

وَلَمْ يَكُن لَّهُۥ كُفُوًا أَحَدٌۢ ۝٤

---

1. అ'హదున్: The One and Alone, ఏకైకుడు.
2. అ'స్సమదు: Absolute. Eternal. Besought of All, to Whom obedience is rendered. Without whom no affair is accomplished. సమస్త వ్యవహారాలు తన మీదనే ఆధారపడి ఉన్నవాడు, నిత్యుడు, శాశ్వితుడు, నిరంతరుడు. అందరూ ఆయనపై ఆధారపడి ఉన్నారు. ఆయనకు ఎవ్వరి అక్కర లేదు. ఆయన నిరపేక్షాపరుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
3. లైస క మిస్'లిహీ షయ్'ఉన్ 42:11. ఒక 'హదీస్'ఖుద్సీ: "మానవుడు నన్ను దూషిస్తాడు. అంటే నాకు సంతానాన్ని అంటగడతాడు. వాస్తవానికి నేను, ఒక్కడను, అద్వితీయుడను, ఎవరి అక్కరలేనివాడను, నేనెవ్వరినీ కనలేదు మరియు నేను కూడా ఎవ్వరికీ పుట్టలేదు. నాకు సరిసమానమైనవాడుగానీ నాతో పోల్చదగినవాడుగానీ ఎవ్వడూలేడు." ('స. బు'ఖారీ)

## 113. సూరహ్ అల్ ఫలఖ్ — سُوْرَةُ الفَلَق

అల్-ఫలఖ్: The Day Break, 'సుబ్'హున్, ఉదయం, ప్రభాతం, వేకువజాము, తెల్లవారుజాము అరుణోదయం. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఈ సూరహ్(113) మరియు దీని తరువాత సూరహ్ అన్ నాస్(114)ల యొక్క ఘనతలు ఎన్నో 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి. దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఈ రాత్రి నాపై కొన్ని ఆయతులు అవతరింపజేయబడ్డాయి. ఇటువంటి వాటిని నేను ఎన్నడూ చూడలేదు." ఆ తరువాత అతను ఈ రెండు సూరాహ్‌లు పఠించారు ('స ముస్లిం, తిర్మిజీ'). దైవప్రవక్త ('స'అస) మానవుల మరియు జిన్నాతుల దిష్టినుండి శరణుకోరేవారు. ఈ రెండు సూరాహ్‌లు అవతరింపజేయబడిన తరువాత అతను వీటిని నిత్యం చదివేవారు. (తిర్మిజీ', అల్బానీ ప్రమాణీకం సం.2150) 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం: అతనికి ఏదైనా కష్టం కలిగితే, ము'ఔజ'తేన్ (అల్-ఫలఖ్, అన్-నాస్) సూరాహ్‌లు చదివి తమ దేహంపై ఊదుకునే వారు. అతని కష్టం అధికమైతే నేను ఈ సూరాహ్‌లు చదివి నా చేతులను అతని శరీరం మీద పోనిచ్చే దానిని (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **5 ఆయతులు** ఉన్నాయి.

దైవప్రవక్త ('స'అస)కు చేతబడి చేసినప్పుడు జిబ్రీల్ ('అ.స.) వచ్చి అతనితో ఈ రెండు సూరాహ్‌లు చదవమన్నారు. దానితో, ఆ చేతబడి ప్రభావం దూరమయ్యింది ('స బు'ఖారీ, ముస్లిం). దైవప్రవక్త ('స'అస) ప్రతి రోజూ రాత్రి నిద్రపోక ముందు సూ. అల్ ఇ'ఖ్లా'స్ (112) మరియు ఈ రెండు సూరాహ్‌లు చదివి తమ అరచేతులపై ఊది, వాటితో పూర్తి శరీరం మీద పూసుకునేవారు. మొదట నెత్తి, తరువాత ముఖం, ఆ తరువాత శరీరమంతా ('స'హీ'హ్ బు'ఖారీ).

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

قُلْ أَعُوذُ بِرَبِّ الْفَلَقِ ﴿١﴾

**1.** ఇలా అను: "నేను ఉదయకాలపు ప్రభువు అయిన (అల్లాహ్) శరణు వేడుకుంటున్నాను.

مِن شَرِّ مَا خَلَقَ ﴿٢﴾

**2.** "ఆయన సృష్టించిన ప్రతిదాని కీడు నుండి;[1]

وَمِن شَرِّ غَاسِقٍ إِذَا وَقَبَ ﴿٣﴾

**3.** "మరియు చిమ్మచీకటి కీడునుండి, ఎప్పుడైతే అది క్రమ్ముకుంటుందో![2]

---

1 ఇక్కడ ప్రతి రకపు కీడునుండి శరణు కోరబడుతోంది. షైతానులనుండి, నరకం నుండి మరియు మానవునికి హాని కలిగించే ప్రతిదాని నుండి.

2 ఎందుకంటే చీకటిలోనే హానికరమైన జంతువులు, పాములు, తేళ్ళు బయటికి వస్తాయి. నేరస్థులు రాత్రిలోనే నేరాలు చేస్తారు. ఇక్కడ ఈ విధమైన అన్ని కీడులనుండి శరణు కోరబడుతోంది.

4. "మరియు ముడుల మీద మంత్రించి ఊదే వారి కీడు నుండి;[1] وَمِنْ شَرِّ النَّفّٰثٰتِ فِي الْعُقَدِ ۝

5. "మరియు అసూయపరుడి కీడునుండి, ఎప్పుడైతే అతడు అసూయపడతాడో!"[2] وَمِنْ شَرِّ حَاسِدٍ إِذَا حَسَدَ ۝

## 114. సూరహ్ అన్-నాస్

سُوْرَةُ النَّاسِ

అన్ నాస్: Mankind, మానవులు, జనులు. సూరహ్ అల్-ఫలఖ్ (113)తో పాటు, ఈ సూరహ్ మక్కాలో అవతరింపజేయబడింది. మానవుని హృదయంలో ఉండే కీడునుండి మరియు ఇతరుల హృదయాలలో ఉండే కీడునుండి శరణుకోరుకోమని ప్రబోధించబడింది. దీని ఘనత ఇంతకు ముందు సూరహ్‌లో పేర్కొనబడింది. ఒకసారి దైవప్రవక్త ('స'అస) నమా'జ్ చేస్తూ ఉండగా అతనికి తేలు కుట్టింది. నమా'జ్ పూర్తి చేసిన తరువాత అతను నీటిలో ఉప్పు కలిపి గాయం మీద పూస్తూ అల్-కాఫిరూన్ (109), అల్-ఇ'ఖ్లా'స్ (112) మరియు అన్-నాస్ (114) సూరాహ్‌లు చదివారు. (ముజమ్మ'అ అ'జ్జవాయి'ద్, 5/111). ఇందులో 6 ఆయతులు ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

1. ఇలా అను: "నేను మానవుల ప్రభువు (అల్లాహ్)ను శరణుకై వేడుకుంటున్నాను![3] قُلْ أَعُوْذُ بِرَبِّ النَّاسِ ۝

2. "మానవుల సార్వభౌముడు![4] مَلِكِ النَّاسِ ۝

3. "మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్ యొక్క శరణు)! إِلٰهِ النَّاسِ ۝

4. "కలతలు రేకెత్తించి తొలగిపోయేవాని కీడు నుండి; مِنْ شَرِّ الْوَسْوَاسِ الْخَنَّاسِ ۝

---

1 అన్-నఫ్ఫాసా'తి: అంటే ముడుల మీద మంత్రించి ఊదేవారి కీడు నుండి.

2 'హాసిదిన్: అసూయపడే వాడి కీడునుండి కూడా శరణుకోరబడుతోంది.

3 రబ్బున్: పర్వర్‌దిగార్ (ఉర్దూలో), పోషకుడు, చాలా మట్టుకు తెలుగు అనువాదాలలో ఈ పదానికి ప్రభువు అని అనువాదం చేశారు. మానవుడు తన తల్లి గర్భంలో ఉన్నప్పటి నుండి వానిని సరిదిద్ది పోషిస్తాడు. మరియు అతని అంతిమ ఘడియ వరకు పోషిస్తాడు. కేవలం మానవుడే కాక సమస్త సృష్టికి కూడా పోషకుడు ఆయనే!

4 ఇటువంటి పోషకుడే వారి సార్వభౌముడు.

الَّذِي يُوَسْوِسُ فِي صُدُورِ النَّاسِ ﴿٥﴾

5. "ఎవడైతే మానవుల హృదయాలలో కలతలు రేకెత్తిస్తాడో![1]

مِنَ الْجِنَّةِ وَالنَّاسِ ﴿٦﴾

6. "వాడు జిన్నాతులలోని వాడూ కావచ్చు లేదా మానవులలోని వాడూ కావచ్చు!"[2]

---

1 అల్-వస్‌వాసు: అంటే మెల్లని ధ్వనితో మాట్లాడటం, గుసగుసలాడటం. షైతాన్ కూడా మానవునికి తెలియకుండానే అతని హృదయంలో చెడ్డ ఆలోచనలు రేకెత్తిస్తాడు, ఇదే వస్‌వస.
అల్-'ఖన్నాస్: నమ్మదిగా జారుకునే వాడు, అంటే షై'తాన్.

2 ఈ వస్‌వస - చేసేవారు రెండు రకాల వారు. ఒకరు జిన్నాతులలోని షై'తానులు. అల్లాహ్ (సు.తా.) వాటికి మానవులను, మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షించే యుక్తిని ఇచ్చాడు. ప్రతి మానవుని వెంట ఒక షై'తాన్ ఉంటాడు. వాడు అతన్ని మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షిస్తూ ఉంటాడు. ఈ మాట విని ఒక 'స'హాబీ (ర'ది.'అ.) ఇలా అడిగారు: "ఓ ప్రవక్తా ('స'అస) ఏమీ? మీతో పాటు కూడా ఒక షై'తాన్ ఉన్నాడా?" అతను జవాబిచ్చారు: "అవును! ఉన్నాడు కాని, అల్లాహ్ (సు.తా.) నాకు వాడిపై ఆధిక్యతనిచ్చాడు. అందుకని వాడు నాకు విధేయుడిగా ఉంటాడు. వాడు, నాకు మేలు తప్ప మరొక విషయాన్ని ప్రోత్సహించడు." ('స'హీ'హ్ ముస్లిం)
రెండవ రకమైన షై'తాన్‌లు మానవులలో ఉన్నారు. వారు, తాము మంచి ఉపదేశం ఇస్తున్నామని చెబుతూ మానవులను మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటారు.
షైతాన్ మానవులనే కాక జిన్నాతులను కూడా మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటాడని మరి కొందరి అభిప్రాయం.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

# رِوَايَةُ هَذَا الْمُصْحَفِ

## అరబ్బీలో అవతరింపజేయబడిన ఈ ఖుర్ఆన్ విశేషాలు

ఈ ఖుర్ఆన్ లిపి 'హఫ్'స్ బిన్ సులైమాన్ ఇబ్నె అల్ ముగైరహ్ అల్-అసది అల్-కూఫీ రివాయత్ ప్రకారం - 'ఆ'సిమ్ బిన్ అబీ అన్-నజూద్ అల్-కూఫీ అత్-తాబ'ఈ గారు అనుసరించిన, అబీ అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ గారి పారాయణాధారంగా - అంటే అతడు (అబీ 'అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ) అనుసరించిన: 'ఉస్మాన్ బిన్ 'అఫ్ఫాన్, 'అలీ బిన్ అబీ 'తాలిబ్, 'జైద్ బిన్ సా'బిత్ మరియు ఉబై బిన్ క'అబ్ (ర'ది'అన్హుమ్)లు, దైవ ప్రవక్త ('స'అస) నుండి నేర్చుకున్న - పారాయణాన్ని బట్టి ఉంది.

ఈ ఖుర్ఆన్ అక్షరాల సముదాయం (హిజాఆ'హ్) 'ఖలీఫతుర్రాషిద్ 'ఉస్మాన్ బిన్ 'అఫ్ఫాన్ (ర'ది.'అ.) బ'సరహ్, కూఫా, షామ్ మరియు మక్కాలకు పంపిన, మదీనాలోఉంచిన మరియు తనదగ్గర ఉంచుకున్న ఖుర్ఆన్‌లలో ఉన్నట్లే ఉంది అంటే వాటిలోని ఒక ఖుర్ఆన్ నుండి అబూ 'అమ్రూ అద్దానీ మరియు అబూ-దావూద్ సులైమాన్ బిన్ నజా'హ్ కాపీ చేసిన ఖుర్ఆన్‌లను అనుసరించి ఉంది. వారిద్దరి కాపీల మధ్య భేదాలుంటే అబూ దావూద్ సులైమాన్ బిన్ నజా'హ్ గారి కాపీకే, ప్రాధాన్యత ఇవ్వబడింది.

ఈ విధంగా ఈ ఖుర్ఆన్‌లో ఉన్న అక్షరాలన్నీ 'ఉస్మానీయ 6 ఖుర్ఆన్‌లలో ఉన్నట్లే ఉన్నాయి.

ఈ ఖుర్ఆన్‌లోని వత్తుల ('తరీఖయే 'ద'బ్త్ అంటే 'జేర్, 'జబర్, పేష్ మొదలైన సంకేతాల) విధానం, 'ఉలమాయే 'ద'బ్త్, ఖరారుచేసిన సంకేతాలు, అంటే ఇమామ్ అత్తనసీ యొక్క అ'త్తరా'జ్ 'అలా 'ద'బ్త్ అల్ 'ఖరా'జ్‌లో వ్రాయబడిన విధానాన్ని అనుసరించి ఉంది. ఇందులోని సంకేతాలు ('అలామాత్), అల్ 'ఖలీల్ బిన్ అ'హ్మద్ మరియు అతనిని అనుసరించిన తూర్పుదిశ 'ఉలమాలు ఉపయోగించిన విధానాన్ని అనుసరించి ఉన్నాయి.

ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య కూఫీ 'ఉలమాలు అనుసరించిన

ఇమామ్ అష్షా'తబీ యొక్క నా''జిమతు'జ్జుహార్‌లో వ్రాసినట్లు ఉంది అంటే అబీ అబ్దుర్'రహ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ అనుసరించిన, 'అలీ బిన్ అబీ 'తాలిబ్, (ర'ది.'అ.) విధానము. దీని ప్రకారం ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య 6236

ఈ ఖుర్ఆన్‌లోని 30 భాగాలు (అజ్'జా'), 60 విభాగాలు (అ'హ్'జాబ్), మరియు ప్రతి విభాగపు నాలుగవ (1/4) భాగపు ఆయత్ ప్రారంభమయ్యేచోట్ల విభజన గ్రన్' అన్నఫ'అ లిల్'ఆలామతున్నఫాఖుసియ్యి మరియు ఇమామ్ అష్షా'తబీ యొక్క నా''జిమతు'జ్జుహార్ మరియు షే'ఖ్ ము'హమ్మద్ ముతవల్లీ యొక్క త'హ్ఖీఖ్ అల్-బయాన్ మరియు అబీ 'ఈద రి'ద్వాన్ అల్-ము'ఖల్లలాతీ యొక్క ఇర్షాద్ అల్ ఖురాఅ' వల్ కాతిబీన్‌లను అనుసరించి ఉన్నాయి.

అవతరణ కాలం ''మక్కీ'' లేక ''మదనీ'' అనే నిర్ణయం, అబీ అల్-ఖాసిమ్ 'ఉమర్ బిన్ ము'హమ్మద్ బిన్ 'అబ్దుల్ కాఫీ మరియు భిన్నాభిప్రాయాలు ఉన్నచోట్లలో, ఇతర ఖురాఆ'త్ వత్తఫ్సీర్ గ్రంథాల నుండి తీసుకోబడింది.

విరామ (వఖూఫ్) స్థలాలు మరియు వాటి చిహ్నాలను, 'ఉలమాఅ' అల్-ముఫస్సిరీన్ మరియు 'ఉలమాఅ' అల్ వఖ్ఫ్ వల్ ఇబ్తిదాఅ'ల ఒక ప్రత్యేక సభ (కమిటీ), నిర్ణయానుసారంగా ఇవ్వబడ్డాయి.

సజ్దా స్థలాల నిర్ధారణ ఫిఖ్హ్ మరియు 'హదీస్' గ్రంథాలను అనుసరించి చేయబడింది. ఐదు చోట్లలో భేదాభిప్రాయాలున్నాయి, అవి: 1) సూరహ్ అల్-'హజ్జ్ యొక్క రెండవ సజ్దా, 2) సూరహ్ 'సాద్, 3) సూరహ్ అన్నజ్మ్, 4) సూరహ్ అల్ ఇన్షిఖాఖ్ మరియు 5) సూరహ్ అల్ 'అలఖ్ యొక్క సజ్దాలు.

{*} ఈ విధమైన చిహ్నాలు. భాగ విభాగాలు మరియు వాటి 1/4 విభాగాల మొదటి ఆయత్ ప్రారంభంలో ఇవ్వబడ్డాయి.

{۩} ఈ విధమైన చిహ్నాలు, సజ్దా చేయవలసిన పదం వచ్చిన, వాక్యపు చివరలో ఇవ్వబడ్డాయి.

*****

# విరామ చిహ్నాలు عَلامَاتُ الوَقْفِ

(O) وقف تام ఈ చిహ్నం ప్రతి ఆయత్ చివరలో ఉంటుంది ఇక్కడ ఆగాలి

(ه) وقف عند غير الكوفيين ఈ చిహ్నం ఉన్నచోట కూఫీయేతరులవద్ద ఆయత్ పూర్తి అవుతుంది.

(م) وقف لازم ఈ చిహ్నం ఉన్నచోట తప్పనిసరిగా ఆగాలి ఆగకుంటే అర్థంలో భేదం రావచ్చు.

(ط) وقف مطلق ఈ చిహ్నం ఉన్నచోట ఆగాలి కాని మాట ఇంకా పూర్తికాదు.

(ج) وقف جائز ఈ చిహ్నం ఉన్నచోట ఆగటం ఉచితం కాని ఆగకుంటే ఫర్వాలేదు.

(ز) وقف مجوز . ఈ చిహ్నం ఉన్నచోట ఆగకుండా చదవటం ఉచితం

(ص) وقف مرخص : ఈ చిహ్నం ఉన్నచోట కలిపి చదవాలి. కాని అలిసిపోతే ఆగవచ్చు. కలిపి చదవటమే మేలు.

(صلے) الوصل اولیٰ ఈ చిహ్నం ఉన్నచోట కలిపి చదువుట ఉత్తమం.

(ق) قیل علیه الوقف : ఇలాంటి చిహ్నం ఉన్నచోట ఆగరాదు

(صل) قد یوصل : ఈ చిహ్నం ఉన్నచోట ఆగవచ్చు, కలిపి కూడా చదవవచ్చు. అవసరముంటే ఆగవచ్చు.

(قف) : ఈ చిహ్నం ఉన్నచోట తప్పక ఆగాలి అనుకోకుండా కలిపి చదువబడే చోట ఇలాంటి చిహ్నం ఉంటుంది.

(سکتہ) : ఈ చిహ్నం ఉన్నచోట కొంత ఆగాలి. కాని ఊపిరి తెగరాదు.

(وقفة) : ఇది దీర్ఘ సక్తహ్ (سکتہ)ను సూచిస్తుంది అంటే కొంత ఎక్కువ కాలం ఆగవచ్చు కాని ఊపిరి తెగరాదు.

(لا) : ఇలాంటి చిహ్నం ఆయత్ చివరలో ఉంటే ఆగవచ్చు, కాని ఆయత్ మధ్యలో ఉంటే ఆగరాదు.

(∴ ∴) : ఇలాంటి చిహ్నాలు ఉన్నచోట. రెండింటిలోనుండి ఒకదానిపై ఆగితే రెండవదానిపై ఆగరాదు.

*****

## TELUGU TRANSLITERATION OF ARABIC ALPHABETS

## అరబీ్బ అక్షరాల తెలుగు అక్షరాలలో ప్రతిలేఖనం

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 'ఖ | خ | 'హ | ح | జ | ج | స' | ث | త | ت | బ | ب | అ | ا |
| 'స | ص | ష | ش | స | س | 'జ | ز | ర | ر | జ | ذ | ద | د |
| ఖ | ق | ఫ | ف | 'గ | غ | 'అ | ع | 'జ | ظ | 'త | ط | 'ద | ض |
| య | ي | వ | و | హ | ه | న | ن | మ | م | ల | ل | క | ك |

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ద | د | 'ఖ | خ | 'హ | ح | జ | ج | స' | ث | త | ت | అ | ا |
| ద | ض | ఖ | ق | హ | ه | జ' | ذ | స | س | 'త | ط | 'అ | ع |
| | | | | హ | ة | 'జ | ز | 'స | ص | | | అ' | ء |
| | | | | | | ''జ | ظ | | | | | | |

## సూరహ్ సూచిక فِهرِسٌ بِأسْمَاءِ السُّوَرِ

إن وزارة الشؤون الإسلامية والأوقاف والدعوة والإرشاد

في المملكة العربية السعودية

المشرفة على مجمع الملك فهد

لطباعة المصحف الشريف في المدينة المنورة

إذ يسرها أن يصدر المجمع هذه الطبعة من القرآن الكريم

وترجمة معانيه إلى لغة التلغو

نسأل الله تعالى أن ينفع به الناس

وأن يجزي

خادم الحرمين الشريفين الملك عبدالله بن عبدالعزيز آل سعود

أحسن الجزاء على جهوده العظيمة في نشر كتاب الله الكريم

والله ولي التوفيق

మదీనా మునవ్వరాలోని "మహారాజు ఫహద్ దివ్యఖుర్ఆన్ ప్రచురణా కేంద్రంవు" పర్యవేక్షకులైన, స'ఊదీ 'అరేబియా రాజ్యపు, ఇస్లామీయ వ్యవహారాలు, అవ్ఖాఫ్, ద'అవహ్ మరియు మార్గదర్శకపు మంత్రి మండలానికి, దివ్యఖుర్ఆన్ భావాన్ని తెలుగులో, "దివ్యఖుర్ఆన్ సందేశం" పేరుతో ప్రచురించడం ఎంతో సంతోషకరమైన విషయం. అల్లాహుతా'ఆలా దీనిని మానవాళికి లాభదాయకమైనదిగా చేసి, 'ఖాదిముల్ 'హరమైన్ అష్షరీఫైన్, మహారాజు అబ్దుల్లాహ్ బిన్ అబ్దుల్ అజీజ్ ఆల స'ఊద్ గారి అల్లాహుతా'ఆలా గ్రంథాన్ని (దివ్యఖుర్ఆన్‌ను) వీలైనంతవరకు ప్రజలకు అందజేయటానికి చేస్తున్న ఎడతెగని కృషికి అత్యోత్తమ ప్రతిఫలం ప్రసాదించుగాక! లక్ష్యసిద్ధి పూర్తిచేయగలవాడు కేవలం అల్లాహుతా'ఆలా మాత్రమే.






---

ص.ب ٦٢٦٢ - المدينة المنورة
www.qurancomplex.org
kfcphq@qurancomplex.org







పోస్ట్ బాక్స్ 6262, మదీనహ్ మునవ్వరహ్
www.qurancomplex.org
kfcphq@qurancomplex.org

*فهرسة مكتبة الملك فهد الوطنية أثناء النشر*

مجمع الملك فهد لطباعة المصحف الشريف

القرآن الكريم وترجمة معانيه إلى لغة التلغو. / مجمع الملك فهد لطباعة المصحف الشريف - المدينة المنورة، ١٤٣٠هـ

١٣٠٤ ص ؛ ١٤×٢١ سم

ردمك: ٣-٦-٨٠١٠-٩٩٦٠-٩٧٨

١- القرآن - ترجمة - لغة التلغو أ. العنوان

ديوي ٢٢١,٤٩٩٢١ ١٤٣٠/٧٦٣٨

**رقم الإيداع: ١٤٣٠/٧٦٣٨**

**ردمك: ٣-٦-٨٠١٠-٩٩٦٠-٩٧٨**